# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (చ - ఞ)

## మూడో సంపుటం

ప్రధాన సంపాదకుడు

డా॥ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

డాక్టర్ అత్తలూరి నరసింహారావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ బాల అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ.
శ్రీ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, ఎమ్.ఏ.
శ్రీమతి తాడేపల్లి కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ.
కుమారి కందాళ వెంకటరమణ, ఎమ్.ఏ.
శ్రీమతి శ్రీపాద సీతామహాలక్ష్మి, ఎమ్.ఏ.
శ్రీ ముచ్చు సీతారామయ్య, ఎమ్.ఏ.




1981

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

# ముందుమాట

తెలుగు వ్యుత్పత్తి కోశం తరంగ పంక్తిలో ఇది మూడవ సంపుటం. అక్షర క్రమం దీని క్రమం కూడాను – 'అ' నుండి 'ఔ' వరకు పదజాలం తొలి సంపుటంలో ఇమిడి ఉండగా, 'క' నుండి 'ఘ' వరకు మలి సంపుటంలో పొందుపరచబడ్డవి. ఇందులో 'చ' నుండి 'ణ' వరకు ఉన్న పదకొండు వేల పదాలు సమీకరించబడ్డవి. నాలుగోదానినికూడా త్వరలో ప్రచురించగలం.

ఈ వ్యుత్పత్తి కోశాన్ని తెలుగువారికి అందించగలగడం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు గర్వ కారణం. తెలుగు భాషకు, సాహిత్యానికి ఇది ఒక విలువైన కానుకగా మేము భావిస్తున్నాం. ప్రతి పదం యొక్క అనుపానులు తెలియజేయడమేకాక, దాని వర్ణన, చరిత్రకూడా వివరించబడ్డవి. నిఘంటు నిర్మాణంలో ఇది ఒక ప్రయోగం. విలక్షణమైన ప్రయోజనం.

ఎనిమిది సంపుటాల స్వరూపంతో ఇది విస్తరించినా, దీని కృషి జాగు కాకూడదని నా సంకల్పం. ఈ సంకల్పానికి చేయూతనిచ్చినవారు మా సలహాసంఘ సభ్యులు. వారి అండదండలతోనే ఈ కార్యాన్ని, భారాన్ని త్వరితగతిని నడిపించగలుగుతున్నాం.

సంకల్పబలమైతే ఉందికాని, కార్యనిర్వహణ బాధ్యత మా డాక్టర్ లకంసాని చక్రధరరావుగారు మోస్తున్నారు. ఎంతశ్రమైనా, చిరునవ్వుతో కార్యక్రమాన్ని నడపగల శక్తిసామర్థ్యాలు అయనకున్నాయి.

అయన నాయకుడు కాగా, వారితోటి శ్రామికులు పండితులనుండి పనివారివరకు ఉన్నారు. ప్రతి పుటలోను, ప్రతి పదంలోను వారి శ్రమ ఫలితం కనిపిస్తూనే ఉంటుంది.

ముద్రణ ఆలస్యం కాకుండాను, ముచ్చటగా ఉండేటట్లుగాను జరిపించినవారు మా విశ్వకళా పరిషత్తు ముద్రణాలయం డిప్యూటీడైరెక్టర్ శ్రీ మదన్‌రాజ్, అసిస్టెంట్ డైరెక్టర్ శ్రీ నరసింహారావు, తదితర సిబ్బంది.

అన్ని విధాలా చేయూతనిచ్చినవారు మా రిజిస్ట్రారు గోపాలకృష్ణారెడ్డిగారు.

ఈ మహాశయుల కందరకు మనసార కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

కొద్దికాలంలోనే నాలుగవ సంపుటి మీముందు ఉంచగలమని మాట యిస్తూ,

సెలవు తీసుకొంటాను.

మీ

[signature]

వాల్తేరు
1–11–1981

ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# పీఠిక

ఆంధ్ర విశ్వకళాపరిషదాదేశానుసారం 1-6-1976 న డైరెక్టరు, ప్రధాన సంపాదకుడుగా తెలుగు వ్యుత్పత్తి కోశ నిర్మాణ బాధ్యతలను స్వీకరించిన నేను తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘాధ్యక్షుల, సభ్యుల విలువైన సలహాలవల్ల, ఈ పథకం సిబ్బంది నిర్విరామ కృషివల్ల 1984 మార్చి 31 నాటికి మొత్తం నిఘంటు నిర్మాణం పూర్తికాగలదని పేర్కొన్నాను. మొట్టమొదట మూడు సంపుటాలలో 35 వేల పదాలతో పూర్తికాగలదని భావించబడ్డ ఈ కోశం సుమారు లక్ష పదాలతో ఎనిమిది సంపుటాలుగా తీర్చిదిద్దబడటం పరిమాణాన్ని బట్టి గుణాన్ని బట్టి మంచిదని తలచబడింది.

తెలుగు వ్యుత్పత్తి కోశం మొదటి సంపుటం (అ-ఔ) ఆంధ్ర విశ్వకళాపరిషత్ స్వర్ణోత్సవ సందర్భంగా డా॥ పి.సి. చందర్ గారిచే 10-7-78 న ఆవిష్కరించబడింది. రెండో సంపుటం (క-ఘ) 16-3-81 నాటికి ముద్రణ పూర్తికావించబడి డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి శతజయంత్యుత్సవ సందర్భంగా వారి దివ్యస్మృతికి అంకితం కావించబడింది. 11,000 ఆరోపాలతోకూడిన ఈ మూడో సంపుటం (చ-ణ) ముద్రణ పూర్తికావించబడి ఆంధ్రావళికి అందిస్తున్నందుకు ఆనందిస్తున్నాను. ఈ సందర్భంగా 15,717 ఆరోపాలతోకూడిన నాలుగో సంపుటం (త-న) 1,140 పుటల వ్రాతప్రతిని ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులయిన శ్రీ ఆవుల సాంబశివరావుగారి సమ్ముఖానికి సమర్పించగలిగినందుకు సంతోషిస్తున్నాను. ప్రస్తుతం ఈ కోశపు ఐదు (ప-భ), ఆరు (మ-ళ) సంపుటాల పని చురుకుగా సాగుతోంది. ఈ రెండు సంపుటాలు 1982 లో పూర్తికాగలవు. ఏడో సంపుటం (వ-శ), ఎనిమిదో సంపుటం (ష-హ) 1983 లో పూర్తికావించబడి ముద్రణతోసహా మొత్తం కార్యక్రమం నిర్ణీత వ్యవధిలో పూర్తి కాగలదనటంలో ఎట్టి సందేహం లేదు. అంచెలు అంచెలుగా జరిగే ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ నిర్మాణంలో అన్ని సంపుటాల కొన్ని దశల కార్యక్రమం ఇప్పటికే పూర్తి ఐంది.

తెలుగులో ఙ, ఞ లు ప్రత్యేక వర్ణాలు కాని కారణంగా వాటి వివరణ ఈ కోశంలో ఇవ్వబడలేదు. వర్ణనాత్మక చరిత్రాత్మక లక్షణాలనుకూడా సంతరించుకొన్న ఈ తెలుగు వ్యుత్పత్తి కోశం ప్రపంచ నిఘంటు చరిత్ర పుటలలో నూతనాధ్యాయాన్ని ఆవిష్కరించగలదని నా అభిప్రాయం.

ఈ మూడో సంపుటం కృషిలో భాగస్వాములు : డా॥ లకంసాని చక్రధరరావు, డా॥ అత్తలూరి నరసింహారావు, డా॥ బాల అరుణకుమారి, శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, శ్రీ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, శ్రీమతి తాడేపల్లి కనకమహాలక్ష్మి, కుమారి కందాళ వెంకట రమణ, శ్రీమతి శ్రీపాద సీతామహాలక్ష్మి, శ్రీ ముచ్చు సీతారామయ్య, శ్రీ గోనెళ్ళ వెంకట

సీతారాం (ట్రైపిస్టు), శ్రీ బోర వెంకటరమణారెడ్డి (ప్యూన్). ప్రస్తుతం నిఘంటు నిర్మాణంలో కృషిచేస్తున్నవారు : డా॥ లకంసాని చక్రధరరావు, డా॥ బాల అరుణకుమారి, శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, శ్రీ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, శ్రీమతి తాడేపల్లి కనకమహాలక్ష్మి, కుమారి కందాళ వెంకటరమణ, శ్రీమతి శ్రీపాద సీతామహాలక్ష్మి, శ్రీమతి వెలువోలు నాగరాజ్యలక్ష్మి, శ్రీ సజ్జా మోహనరావు, శ్రీ గోనెళ్ళ వెంకటసీతారాం (ట్రైపిస్టు), శ్రీ బోర వెంకటరమణారెడ్డి (ప్యూన్).

తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృతజ్ఞతలు.

న్యాయవాదిగా, న్యాయమూర్తిగా, ప్రధాన న్యాయమూర్తిగా వివిధ విధులను శ్లాఘాపాత్రంగా నిర్వహించిన సరసులు సహృదయులు సద్గ్రంథ కర్తలు సాహితీ సద్విమర్శకులు గుణగ్రహణ పారీణులు తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘాధ్యక్షులు ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు అయిన శ్రీ ఆవుల సాంబశివరావుగారికి చేతలద్వారా మాటలద్వారా మనఃస్ఫూర్తిగా తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి సహాయాన్ని అందిస్తున్నందుకు హృదయపూర్వక కృతజ్ఞతా కుసుమాంజలులు.

తమ అమూల్యాలైన సలహాలద్వారా పథక విజయానికి కారకులయిన, అనుభవజ్ఞులైన తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘ సభ్యులు : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి. ఎన్. అనసూయాదేవి, ఆచార్య జి. ఎన్. రెడ్డి, డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఆచార్య చేకూరి రామారావు గార్లకు—

ఈ వ్యుత్పత్తి కోశ పథకాభివృద్ధికి సర్వదా, సర్వథా సహకారాన్నందిస్తున్న ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యనిర్వహణదక్షులు, సహృదయులు రిజిస్ట్రార్ శ్రీ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.యల్. గారికి—

ఈ కోశాన్ని సర్వాంగసుందరంగా ముద్రించడంలో పూర్తిగా సహకరించిన సన్ముద్రణ దీక్షాపరతంత్రులు ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయం డిప్యూటీ డైరెక్టరు శ్రీ జి. మదనరాజ్ గారికి, అసిస్టెంట్ డైరెక్టరు శ్రీ యమ్.ఆర్.బి. నరసింహారావుగారికి, ముద్రణాలయ సిబ్బందికి హార్దిక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషివల్ల కోశ సంపూర్తికి కారకులయిన మా వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి మనఃపూర్వకమైన అభినందనలు.

వాల్తేరు
12-10-1981

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకుడు
**తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం**

ఆంధ్రరాష్ట్ర అవతరణకు
అసువులను అర్పించిన



అమరజీవి
# శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తికోశ సలహా

అధ్యక్షులు:

శ్రీ ఆవుల సాంబశివరావు, బి

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాప

సభ్యులు:

డాక్టర్ బెజవాడ గోపాలరె

గౌరవాచార్యులు, రవీంద్ర సా

ఆంధ్రవిశ్వకళాపరిష

వాఙ్మయ మహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృ

కళా-ప్రపూర్ణ

హైదరాబాదు

శ్రీమతి టి. ఎన్. అనసూ

మదనపల్లి

డాక్టర్ వావిలాల గోపాలకృ

కళా-ప్రపూర్ణ

సత్తెనపల్లి

ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఎమ్.

తెలుగుశాఖ, శ్రీ వేంకటేశ్వర వి

డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూ

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వక

ఆచార్య చేకూరి రామారా

భాషా శాస్త్ర శాఖ, ఉస్మానియా

డాక్టర్ ఎల్. చక్రధరరావు

కార్యదర్శి

డైరెక్టర్, ప్రధాన సం

తెలుగువ్యుత్పత్తి కోశ

# తెలుగు వ్యుత్పత్తికోశ సలహాసంఘం

అధ్యక్షులు:

శ్రీ ఆవుల సాంబశివరావు, బి.ఏ., బి.యల్.

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు

సభ్యులు:

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, డి.లిట్.

గౌరవాచార్యులు, రవీంద్రసాహిత్యం

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు

వాఙ్మయ మహోధ్యక్ష

డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

హైదరాబాదు

శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి

మదనపల్లి

డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

సత్తెనపల్లి

ఆచార్య జి.ఎన్. రెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.

తెలుగుశాఖ, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం

డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎమ్.ఏ., పిఎచ్.డి., డి.లిట్.

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

ఆచార్య బేకూరి రామారావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

భాషా శాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం

డాక్టర్ ఎల్. చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

కార్యదర్శి

డైరెక్టర్, ప్రధాన సంపాదకుడు

తెలుగువ్యుత్పత్తికోశ పథకం

# చ

**చ** వి. ఇ, ఈ, ఎ, ఏలతో కూడినప్పుడు తాలవ్యస్పృష్టోష్మమైన అల్పప్రాణ శ్వాసంగానూ ఇతరాచ్చులతో కూడినప్పుడు దంత్యస్పృష్టోష్మమైన అల్పప్రాణ శ్వాసంగానూ ఉచ్చరించబడుతుంది. దంత్యతాలవ్యాలైన ఇట్టిచవర్ణాలు సవర్ణాలు.

క. చ-, స-; తు. స-; త. చ-; మ. చ-; కొడ. చ-; తొ. త-; కో. చ-; కొలా. నా. స-; పర్జి. చ-; గ. స-; గోం. స-, హ-, ०-; కొండ. స-; పెం. మండా. హ-; కుఇ. స-; కువి. హ-; కురు. మాల్తో. బ్రా. చ-.

తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, తుళు, తొద, కొడగు, కోత భాషల్లోని పదాది చకారం కొన్నిచోట్ల లోపిస్తుంది.

<మూ.ద్రా. చ-.

మూలద్రావిడ భాషలోని పదాది కకారం తర్వాత తాలవ్యాచ్చులు (ఇ, ఈ, ఎ, ఏ) పరంగా ఉంటే ఆంధ్ర తమిళ మలయాళాల్లో ఆ *కకారం చ- కారంగా మారుతుంది.

<మూ.ద్రా. *కి-*కీ-*కె-*కే-

ప్రాకృతంలోని థ-కారం త-కారంగామారి తెలుగులో కొన్నిచోట్ల చ-కారంగా మారింది.

<*త- <ప్రా*థ-.

**చకచక** రూ. చకచకా, చెకచెక. క్రి.విశ.ద్రు. వేగంగా (పరుగెత్తడం మొ. వాటిలో అయ్యే అనుకరణం.) భల్లా. 2.

క. చకచక.

**చకచకచేయు** స.క్రి. తొందరగా చేయు. **చకచకనడుచు** స.క్రి. తొందరగా నడచు. **చకచకలాడు** అ.క్రి. చురుకుగా ఉండు. <చకచక+-లు+ఆడు.

హిం. చకాచక్. బాగా, పూర్తిగా; ఉ. చకాచక్. బాగా, పూర్తిగా, వేగంగా; పార. చకాచక్. కత్తులధ్వని.

<ఉ. చకాచక్.

**చకచకా** రూ.చూ. చకచక; క్రి.విశ. వేగంగా. పద్మ. యు. 115.

**చకడా** వి. తెలివిగల వ్యక్తి.

హిం. ఛక్డా. బరువుమోసే ఎద్దు బండి.

<హిం. ఛక్డా (అర్థవిపరి.).

**చకణాలు** రూ. చక్కణాలు, చక్కండాలు. వి. బ. వ. పరిహాసాలు.

**చకలు** వి.బ.వ. పరిహాసాలు.

**చకాపికీ** అవ్య. చురుకుగా.

**చకారపుగుడులు** రూ. చకారపుగుళ్లు. వి.బ.వ. చీవాట్లు.

**చకారపుగుళ్లు** రూ.చూ. చకారపుగుడులు. వి.బ.వ. చీచీలు, చీవాట్లు.

**చకుముకి** రూ. చక్కుముక్కి, చెకముకి, చెకుముకి, చెకుముక్కి. వి. 1. ఫిరంగి. పద్మ.యు. 117; 2. నిప్పుచేయటానికి ఒక జాతి రాతితో తాకించే ఉక్కుముక్క. కువ.చ. 1.126. ఆం.భా. 1.172.

హిం. చక్మక్. నిప్పుకోసం ఉపయోగించే రాయి; ఉ. చక్మక్, చక్మాక్. నిప్పునిచ్చేరాయి; టర్కీ. చక్మక్. నిప్పుచేసే సాధన విశేషం.

మ. చక్మక్. నిప్పుకోసం ఉపయోగించే ఉక్కుతునక.

<ఉ. చక్మక్.

**చకోరపండ్లు** వి.బ.వ. పంపరపనస పళ్ళు.

**చక్క** విశ. 1. ఋజువైన, తిన్నని. భార.ఆది. 7.202; 2. సుందరమైన. శృం.నై. 5.114, 2.179; క్రి.విశ.ద్రు. 1. ఋజువుగా, తిన్నగా, సరిగా. భార.విరా. 5.208; 2. పూర్తిగా. హర. 2.119; 3. సుందరంగా, అందంగా. మను. 2.61; 4. సందర్భాన్ని బట్టి 'శీఘ్రంగా,' గట్టిగా, దయతో, బాగా అనే అర్థాల్నిస్తుంది.

సం. చంగ-; ప్రా. సక్కఅ. సంస్కారయుక్తం; జై. మహా. సక్కయ; శౌ. సక్కద. సంస్కారయుక్తం.

క. సక్కద. చంగ శబ్ద భవమని. వై.దీ. 47.

<ప్రా. సక్కఅ. సంస్కారయుక్తం.

**చక్కఁగఁజేయు** స.క్రి. 1. నిర్మూలం చేయు. భార. ఉద్యో. 2.11; 2. చంపు. ఆము. 5.150. <చక్క+-ను+అగు+-అ7+చేయు. **చక్కఁజూచు** స.క్రి. 1. సరిగా చూచు, బాగాచూచు. కు.సం. 9.44; 2. దయతో చూచు. భార. కర్ణ. 3.389; 3. బాగాచూచుకొను, ఆదరించు. శుక. 1.526. <చక్క+ను+చూచు. **చక్కఁజేయు** స.క్రి. 1. బాగుచేయు. భార.విరా. 3.91; 2. చక్కబరుచు, కుదురుపరుచు. భార.విరా. 4.174; 3. సమాప్తంచేయు, ముగించు. భార. భీష్మ. 2.153; 4. అణచు, పోగొట్టు. భాగ. 6 306; 5. సంస్కరించు. ఉ.రా. 1.199; 6. చంపు. < చక్క+-ను+చేయు. **చక్కఁజేర్చు** స.క్రి. సవరించు. శుక. 1.293. <చక్క+-ను+చేర్చు. **చక్కదము** చూ. చక్కఁదనము. వి. 1. విధం. కావ్యా. 2.63, 3.48; 2. చక్కదనం, అందం; విశ. యుక్తమైన, తగిన, మంచి. సిం.ద్వా. 9.32. **చక్కనికొమ్మ** వి. అందమైన స్త్రీ. హంస. 1.149. **చక్కనిది** విశ. సౌందర్యవతి. **చక్కనిమిన్న** వి. గగన మధ్యం.

భార. భీష్మ. 3.346. చక్కనియెదురు వి. ఎట్టఎదురు. చక్కబుగిడి వి. ఒకరకం బుగిడి. చక్క(బడు అ.క్రి. 1. తిన్నగాఅగు, మంచిదారికివచ్చు. భార. ఉద్యో. 1.27 ; 2. కుదురు, పొసగు. భార. ఉద్యో. 1.312 ; 3. తీరు, పరిష్కృతం అగు. భార. అరణ్య. 4.202 ; 4. తనియు, తృప్తిపడు. భాగ. 8.574 ; 5. నెరవేరు, సిద్ధించు. రామా. 7.27. <చక్క+-ను+పడు. చక్క(బఱచు స.క్రి. సవరించు. రుక్మా.చ. 4.82. చక్క(బెట్టు స.క్రి. 1. పరిపాలించు, ఏలు. పండి.చ. 1.72; భార.విరా. 1.282 ; 2. అణచు, పోగొట్టు, చంపు. భార. ఉద్యో. 2.280 ; 3. నిర్వహించు. భాగ. ఉ. 1286 ; 4. మానుచు. జైమినీ భా. 1.124 ; వరాహ. 2.115 ; 5. సవరించు, సరిచేయు. మను. 5.64 ; 6. బాగుచేయు. కువ.చ. 4.184. <చక్క+-ను+పెట్టు. చక్క(బోవు స.క్రి. సరిగా వెడలిపోవు. హంస. 3.156. చక్కనగము వి. సరిగ్గా సగం. ఉ.హరి. 5.56. చక్కసమము వి. సరిగ్గా సగం. దశా. 2.343. చక్కొను అ.క్రి. సరియగు. <చక్క+కొను. చక్కొలుపు స.క్రి. సరిచేయు, నిలుపు.

చక్కం వి. సవ్యం.

చక్కటి[1] వి. 1. ప్రదేశం, చోటు. భార. విరా. 1.156 ; 2. ఎదురు. భార. భీష్మ. 3.190 ; 3. దగ్గర, సమీపం. రాజవా. 2.81, వేమన. 1.167 ; 4. దిక్కు, వైపు. పరమ. వి. 2.125 ; విణ. అభిముఖమైన, ఎదురుగాఉన్న. భార. భీష్మ. 1.234.

చక్కటి[2] వి. 1. వీలు, అనుకూల్యం. పండి.చ. 5.350 ; 2. ఆర్జవం, తిన్నదనం. భార. ఉద్యో. 2.317 ; 3. న్యాయం, ధర్మం. భార. శల్య. 2.321; 4. విధానం ; ఏర్పాటు. భాస్క.రా. యు. 808 ; 5. తగవు, జగడం. వైజ. 3.69.

చక్కటికిదిద్దు స.క్రి. సమర్థించుకొను. శుక. 1.55. చక్కటికి(దెచ్చు స.క్రి. సమర్థించుకొను. హంస. 1.102. చక్కటితల వి. నిలువ కొమ్ములున్న తల. చక్కటిమాటలు వి.బ.వ. నీతివాక్యాలు. భాస్క.రా. యు. 157. చక్కటియని వి. ధర్మ యుద్ధం. భార. శల్య. 2.331. <చక్కటి[2]+అని ; చక్కటిసుడి వి. మూపురం దిగువ భాగంలో ఉండే సుడి ; చక్కటులుదిద్దు స.క్రి. చక్కదిద్దు. చక్కట్లుదిద్దు రూ. చక్కటులుదిద్దు. స.క్రి. 1. సవరించు. విజయ. 2.16 ; 2. చెడ్డదానిని మంచిదని సమర్థించు. సారంగ. 3.55.

చక్కటులుదిద్దు చూ. చక్కటి[2].

చక్కట్లుదిద్దు చూ. చక్కటి[2].

చక్కడ(గు చూ. చక్కు[2].

చక్కడ(చు చూ. చక్కు[2].

చక్కడుచు రూ. చక్కు[2].

చక్కణాలు రూ.చూ. చకణ్ణాలు. వి.బ.వ. పొంకం మాటలు.

చక్కండాలు రూ.చూ. చకణ్ణాలు. వి.బ.వ. ఎకసక్కాలు.

చక్కన చూ. చక్క. విణ. 1. సన్నద్ధమైన, సిద్ధమైన. భార. ఆది. 6.203 ; 2. సుందరమైన, మనోజ్ఞమైన. కు.సం. 7.7 ; 3. యుక్తమైన, మంచి. భార. ఉద్యో. 3.102 : 4. తిన్ననైన, వంకరలేని. హరి. ఉ. 5.174 ; 5. స్పష్టమైన. సీతారా. 3.55 ; 6. అందం, చక్కదనం ; వి. ఎదురు.

చక్కనగు అ.క్రి. 1. తీరు, సమాప్తం అగు. భార. ఆది. 6.205 ; 2. సిద్ధమగు, సన్నద్ధమగు. భాస్క.రా.యు. 1028 ; 3. పోవు, నశించు. కేయూర. 4.159 ; 4. తగు, యుక్తమగు, అర్హమగు, న్యాయమగు. ఇందు. 3.27 ; 5. చక్కబడు, నెరవేరు. వసు. 3.116. <చక్కన+అగు. చక్కనయ్య వి. 1. అందగాడు. గంగ. 23 ; 2. మన్మథుడు. దశా. 2.304, ఆం.భా. 1.85. చక్క(దనము (చక్కన+తనము). వి. 1. ఋజుభావం, తిన్నదనం. విక్ర. 4.17 ; 2. సౌందర్యం. నరస. 3.10.

చక్క(దనము చూ. చక్కన.

చక్కరవతి వి. సార్వభౌముడు. వేంక. ఆం.

సం. చక్రవర్తిన్. సార్వభౌముడు ; ప్రా. చక్కవఇ. చక్కవట్టి, చక్కవత్తి ; శౌ. చక్కవటి : అమా. చక్కవత్తి. చక్క. చక్రవర్తి ; జై.మహా. చక్కవట్టి.

<సం. చక్రవర్తిన్.

చక్కరాయి వి. సున్నం మట్టురాయి (Callerous sedimentary rock).

చక్కాట చూ. చక్కు[2].

చక్కాడు చూ. చక్కు[2].

చక్కి[1] రూ.చూ. చక్కియ. వి. 1. ప్రదేశం, చోటు. శృం.నై. 5.16, పాండు. 2.189 ; 2. పార్శ్వం, పక్క, వైపు. విక్ర. 8.19 ; 3. విధం, పద్ధతి, రీతి. విక్ర. 7.14, ఆము. 2.78 ; 4. విషయం, పట్టు. ఆము. 4.204 ; 5. సమీపం. పారి. 3.51, ఆం.భా. 3.21 ; 6. మార్గం, తోవ. నీలా. 1.32. ఇది 'చక్కిన్' అనే రూపంలో 'విషయంలో', లోపల ఉండి అనే అర్థాల్నిస్తుంది.

చక్కి[2] వి. వాద్య విశేషం. కాశీ. 1.56.

చక్కి[3] వి. బొడ్డబ్బాసిరుమాలు, నేతలో నల్చదరంగా వచ్చిన డిజైను.

చక్కియ రూ. చక్కి[1]. వి. పార్శ్వం. భార. అరణ్య. 1.300, హర. 2.20.

సం. చక్రికా. మోకాలు; ప్రా. చక్కియా. సీమ, గుంపు, సమూహం ; అప. చకక. గుండ్రనిది, విస్తరించినది.

<ప్రా. చక్కియా-.

చక్కిలము వి. పిండిమెలిపెట్టి చేసే గుండ్రని భక్ష్యవిశేషం. భీమ. 6.57, కాశీ. 7.84.

సం. శకుకలి-, శష్కులి, శస్కులి ; ప్రా. సక్కులి. ఒక మధుర పదార్థం ; అ.మా. సకుక్కలి, సంకులి ; పా. సక్ఖలి ;

క. చక్కలి, చుకుక్కలి, చకుక్కళి. చక్లి ; తు. చకుక్కలి ; త. అకుక్కలి, అంకులి, చంకులి, చకుక్కలి.

<ప్రా. సక్కులి-.

చక్కిలమువలెనగు అ.క్రి. మిక్కిలి చిక్కిపోవు.

చక్కిలి రూ.చూ. చంక. వి. కక్షం, బాహుమూలం.

చక్కిలిగింత వి. చంకలు మొ. చోట్ల ఇతరుల చేతి స్పర్శవల్ల కలిగే చలనం, స్పందనం, అదురు. కళా. 3.45, పారి. 240, రాధా. 4.71. చక్కిలిగింతలుగొను (-కొను) అ.క్రి. చక్కిలిగింతలు కలదగు. పి.శకు. 2.140, విజయ. 2.33. చక్కిలిగింతలువోవు (-పోవు) అ.క్రి. చక్కిలిగింతలు కలదగు. కళా. 1.27. చక్కిలిగింతవెట్టు (-పెట్టు) స.క్రి. చక్కిలిగింత కల దానినిగా చేయు, చక్కిలిగింతగొలుపు. ద్వి.పరమ. 4.316. పు. 5. చక్కిలిగిలి రూ.చూ. చక్కిలిగిలిగిలి. వి. చక్కిలిగింత. చక్కిలిగిలిగిలి రూ. చక్కిలిగిలి. వి. గిలిగింత. పండి.చ. ప్రథ. 1.457 పు. చక్కిలింతలుపుచ్చు స.క్రి. గిలిగింతలు పెట్టు. పండి.చ. ప్రథ. 1 పు. 457.

చక్కి[1] రూ. సక్కి. వి. **1.** పల్లకీ మొ. వాటిలో వేయడానికి వీలయ్యేట్టు పేము పట్టెడ మొ. వాటితో నేసే చట్టం; **2.** ఇరుసు మోపే చోట రాట్నం నిలువుకు బిగించిన ఇనప కట్టు.

చక్కిమంచము వి. చక్కికలిగిన మంచం.

చక్కి[2] వి. ఒకానొక పంచదార.

చక్కిపంచదార వి. గడ్డకట్టిన తెల్ల చక్కెర, శుద్ధి చేసిన చక్కెర.

చక్కు[1] వి. ఆరు. అచ్చ.రా.బాల. 127.

సం. షట్క-. ఆరు; ప్రా. ఛక్క-ఛగ్గ-. ఆరు; అ.మా. చక్క-. ఆరు; దుచక్క. ఈరారు, పన్నెండు.

క.త. చట్టె. ఆరు; కుఇ. సోట; కువి. సో. చెంబు;

<ప్రా. ఛక్క-.

చక్కుపగడ వి. సప్తసంఖ్య, ఆరున్నొకటి, ఏడు. సాంబ. మాన. 27.

చక్కు[2] వి. ఖండం, శకలం. వరాహ. 4.136.

క. చక్కె, చెక్కె, సక్కె, సెస్కె. కొయ్యముక్క, రాతిముక్క; త. చక్కై.

సం. శల్క-. ముక్క.

చక్కడఁగు అ.క్రి. చచ్చు. ఆం. భా. 2.225. <చక్కు[2]+అడఁగు. చక్కడఁచు రూ. చక్కడుచు. స.క్రి. **1.** ముక్కలు చేయు, ఖండించు. భార. భీష్మ. 2.71, భీమ. 6.99; **2.** చంపు. భార. భీష్మ. 3.99, ప్రభా. 1.108. <చక్కు[2]+అడఁచు. చక్కడుచు రూ.చూ. చక్కడఁచు. స.క్రి. **1.** చంపు. భార. భీష్మ. 3.307; **2.** ఖండించు, నరకు. భార. ద్రోణ. 3.132. <చక్కు[2]+అడుచు. చక్కాట వి. చంపటం. <చక్కు[2]+ఆట. చక్కాడు స.క్రి. **1.** ఖండించు, నరకు. భాస్క.రా.బాల. 576, కాశీ. 6.245; **2.** చంపు. భాస్క.రా.అయోధ్య. 201, నీలా. 2.41. <చక్కు[2]+ఆడు; చక్కుగాఁజేయు స.క్రి. చక్కుసేయు. ద్వి. భాగ. 175. చక్కుగావించు (-కావించు) స.క్రి. **1.** నరుకు. పారి. 3.34. **2.** ముక్కలు చేయు; చక్కుచేయు స.క్రి. **1.** ముక్కలుచేయు. భాస్క.రా.యు. 42; **2.** అణచు. ఉ.హరి. 6.131; **3.** ఖండించు, నరకు. వాల్మీ. 1.106; చక్కువడు (-పడు) అ.క్రి. ముక్కలు ముక్కలగు. జైమినీభా. 5.20. చక్కుసేసివచ్చుడిగలుపు స.క్రి. తుత్తునియలుచేయు భార.విరా. 5.186.

చక్కు[3] వి. ఆడటంలో అయ్యేధ్వనికి అనుకరణం. కు.సం. 11. 155.

చక్కున క్రి.విశే. ఒక్క ఉదుటున, గబాల్న.

చక్కుముక్కి రూ.చూ. చకుముకి. వి. నిప్పు చేయడానికి ఒక జాతిరాతితో తాకించే ఉక్కుతునక.

చక్కుముక్కుచేయు చూ. చక్కుముక్కి. స.క్రి. చిందరవందర చేయు. తాళ్ల. సం. 6.105.

చక్కులాకు వి. ఒకరకం ఆకెరువు మొక్క.

చక్కెర వి. పంచదార. సుద. 2.125, నీలా. 2.36.

సం. శర్కరా; ప్రా. సక్కర, సక్కరా. పంచదార; అమా. సక్కరా; పా. సక్ఖరా. కంకరరాయి, పటిక బెల్లం.

క.తు. సక్కెర; త. చక్కెర, అక్కారం; మ. చక్కర; పర్జి. చక్కర్, చిరియాన్, సక్కర్. తీపి.

<ప్రా. సక్కర-.

చక్కెరకేళి రూ. చక్రకేళి, సెక్కరకేళి. వి. ఎక్కువ తియ్యగాఉండే అరటిభేదం. చక్కెరగుండ్లు వి.బ.వ. భక్ష్య విశేషం. చక్కెరతిండి వి. చిలుక. ఉ.రా. 4.171. చక్కెరతిండిపులుగు వి. చిలుక. వేంక.ఆం.తిర్య. 101. చక్కెరతిన్న నోరవేపాకువేసినవిధం వి. మంచిపని చేసిన తర్వాత చెడుపని చేయరాదన్నప్పుడుపయోగించే సామెత. ద్వి. హరిశ్చ. 1281. చక్కెరనుము వి. తెల్లగింజరకం అనుము. <చక్కెర+అనుము. చక్కెరపెట్టు స.క్రి. తీపి తిను బండారం పెట్టు. పారి. 1.106. చక్కెరబుగడ వి. భక్ష్య విశేషం. హంస. 1.105. చక్కెరబెట్టిలాలించు (-పెట్టిలాలించు) స.క్రి. ప్రేమతో పెంచు. ఉషా. 2.47. చక్కెరబొమ్మ వి. **1.** చక్కెరబొమ్మలా ఇష్టమైంది, భార్య. భోజను. 5.28; **2.** మనోజ్ఞురాలు. పె.శకుం. 2.141. చక్కెరముద్దుగుమ్మ వి. మనోజ్ఞురాలు. వేంక.పంచ. 3.288. చక్కెరలప్పలు వి.బ.వ. చక్కెరరాసులు. కాళ. 1.43. చక్కెరలొల్కు అ.క్రి. మిక్కిలి మధురమగు. ఉషా. 3.3. <చక్కెర+-లు+ఒల్కు. చక్కెరవంటి విశే. మధురమైన. శుక. 3.376. చక్కెరవింటివాఁడు వి. మన్మథుడు. ఆం.నా.సం.దేవ. 14. చక్కెరవిలుకాఁడు రూ. చక్కెరవిల్కాఁడు. వి. మన్మథుడు. ఆం.భా. 1.45. చక్కెరవిల్కాడు రూ.చూ. చక్కెర విలుకాఁడు. వి. మన్మథుడు. మృత్యు. 2.78. చక్కెరవిల్తుఁడు వి. మన్మథుడు. చంద్రికా. 2.79.

చక్కొను చూ. చక్క.

చక్కొలుపు చూ. చక్క.

చక్రం వి. **1.** మట్టిపాత్రలు చేయడానికి కుమ్మరి ఉపయోగించే చక్రం; **2.** మోటబావిగిలక; **3.** బండికుండలో బిగించిన ఆకుల్ని పట్టి ఉండే గుండ్రటి కొయ్య చట్రం.

చక్రంసూల గుండ్రంగా ఉండే సున్నంబట్టీ. చక్రంకాళ్ళు వి.బ.వ. సారె చక్రంలోని ఆకులు. చక్రంమెత్తు వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలుకట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. చక్రంమొళె వి. సారెతిరగడానికి ఆధారంగా సారె పలక కింది భాగంలో బిగించిన ఇనపమేకు.

చక్రకేళి రూ.చూ. చక్కెరకేళి. వి. కదళీభేదం, ఒకరకం

అరటి.

**చక్రపుఱాలు** వి.బ.వ. చక్రలాంఛనం రాళ్ళు. ద.హిం.శా. 1290. క్రీ.శ. 1230
సం. చక్ర-. చక్రం.

**చక్రబిరుసు** వి. ఒకరకం బాణసంచా. హంస. 3.28.
సం. చక్ర-. చక్రం.

**చక్రమేయు** అ.క్రి. సారెను గుబ్బమీదేసి మొదట చేత్తోతిప్పు.

**చక్రలాంఛనపుఱాలు** వి.బ.వ. చక్ర చిహ్నితమైన సరిహద్దు రాళ్ళు. ద.హిం.శా. 1203, క్రీ.శ. 1226 సం.
సం. చక్రలాంఛన-. చక్రం గుర్తు.

**చక్రవరహ** వి. విజయనగర సామ్రాజ్యాధీశులు వెలయించిన బంగారు నాణెం (గుండ్రమైన వరహా నాణెం). ఉదయగిరి. శాసనం. క్రీ.శ. 1552 సం.
సం. చక్ర-. చక్రం ; వరాహ-. కిటి, పంది.
<సం. చక్రవరాహ-.

**చక్రశిలలు** వి.బ.వ. చక్రలాంఛనం సరిహద్దురాళ్ళు. ద.హిం.శా. సం.శా.స. 6. 1200, క్రీ.శ. 1177 సం.

**చక్రాలత్రిప్పుడు** వి. బాలక్రీడా విశేషం. హంస. 3.147.

**చగ** రూ. చగడు, చగుడు, చవడు, చవుడు. వి. చవిటినేల.

**చగడు** రూ.చూ. చగ. వి. చవుడు.

**చగుడు** రూ.చూ. చగ. వి. చవుడు.

**చంక** రూ. చక్కిలి, చంకిలి. వి. 1. బాహుమూలం, కక్షం. భార.ఆరణ్య. 3.182 ; 2. కళాస్థానం ; 3. అర్చికి పక్కన ఉన్న రాతిపేర్పు ; 4. పక్కగది ముందున్న అరుగు ; 5. పణతకూ ఆరుకూ మధ్యనున్న వంపు లోపలివైపు ; 6. మొక్కజొన్నదంటు కణుపు.
క. *అకళ్*. చక్కిలిగింతకు వాడే పదం ; *చకళ్, సకళ్* ; త. *అక్కుళ్, చరికయ*. కక్ష ; *అక్కుళు* (-ళ్-ళ్-). చక్కిలిగిలిపెట్టు ; మ. *కక్కుళ్మ్*. చంక, చక్కిలిగిలి ; *ఇక్కిళి, కిక్కిళి*. చక్కిలగిల ; *కిక్కిళిక్క*. చక్కిలిగిలిపెట్టు ; కొలా. *సంకా* ; నా. *సక్క*. చంక ; కురు. *కంగ్గావ్*. దురదపెట్టు, చక్కిలిగిలిపెట్టే చోటు ; *కంగ్గటానా*. చక్కిలిగిలిపెట్టు, చక్కిలిగిలి ; మాల్తో. *కెక్ల్-కుండె*. చక్కిలిగిలిపెట్టు.
పో.చూ. సం. కక్ష-. చంక.

**చంకకఱ్ఱలు** వి.బ.వ. కుంటివాడు నడవటానికి చంకల కింద ఉంచుకొనే కర్రలు. **చంకకాళ్ళు** వి.బ.వ. చంక కర్రలు, కుంటివాడు నడవటానికి చంకల కింద ఉంచుకొనే కర్రలు. **చంకకెక్కికూర్చుండు** అ.క్రి. ఎక్కువ చనువు తీసుకొను. <చంక + -కు + ఎక్కికూర్చుండు. **చంకకెక్కు** అ.క్రి. ఎక్కువ చనువుతీసుకొను. <చంక + -కు + ఎక్కు. **చంకకొయ్య** వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె. **చంకగోడ** వి. 1. ఇంటి పక్కగోడ ; 2. బట్టీకి నాలుగు వైపులా కట్టేగోడ. **చంకచెక్క** వి. ఒద్దె బండి చక్రాని కిరువైపుల అమర్చిన కొయ్య పలక. **చంకచేతులుకట్టుకొను** అ.క్రి. వినయంతో ఉండు. **చంకచేతులుపెట్టుకొను** అ.క్రి. వినయంతో ఉండు. **చంకచేయు** అ.క్రి. ఈనబోయే పశువు పొడుగు చేయు. **చంకటివాఁడు** విణ. చంటివాడు, చంకలోని బిడ్డ. ద్వి.హరిశ్చ. 1055. **చంకతాడు** వి. 1. పట్టుదారం వడికే పెద్ద రాట్నం ఇరుసును, డొలకను కలిపికట్టే దారం ; 2. కుచ్చు తాళ్ళలో, డైమను తాడుకు ఒక వైపు కట్టిన దారం. **చంకతాళి** వి. చంకకు తగిలించుకొనే మూట. ఇందు. 2.115. **చంకదుడ్డుశరణార్థి** వి. చంకలో దుడ్డుకర్ర పెట్టుకొని శరణు అనేవాడు, మనసులో ధూర్తత్వం, మాటల్లో వినయం కలవాడు. హర. 7.17. **చంకనాకిపోవు** అ.క్రి. చెడిపోవు. **చంకనాటు** వి. ఏడి కోలను పణతలో దూర్చే చోట అవసరాన్ని బట్టి ఎలువు సలువులకు కొట్టేపేడు. **చంకపట్టె** వి. 1. తొట్టి అల్లకానికి ఆధారంగా చట్రం నుంచి తొట్టి పీట వరకు రెండువైపులా నిలిపిన పొడుగాటి కర్ర ; 2. బండి పరం నుండి నీగమాను మీదకి బిగించిన పట్టె. **చంకపంటె** వి. చంకనపెట్టుకొని నిలబడి నూలు చుట్టే పంటె. **చంకపాప** వి. ఎత్తుకో తగ్గ చిన్నపాప. **చంకపాపపొట్టు** వి. మొక్కజొన్నదంటు కణుపు దగ్గర పెట్టే పొట్ట. **చంకపిల్ల** వి. చంకపాప. **చంకపీచు** వి. చంకపాప. **చంకబాటు** (-పాటు) వి. బిడ్డా పాప కలగటం. **చంకబిడ్డలూడిపడినట్లుమాటలాడు** స.క్రి. చమత్కారంగా, హాస్యంగా, గడుసరిగా మాట్లాడు. విప్రె. 3.34. **చంకబింది** రూ. సంకబింది. వి. అడుగు బిర్రపాటుగా మూతి దగ్గర పొడుగ్గా పైబాగంలో మూడు ఉండే బిందె లాంటి మట్టికడవ. **చంకమడత** వి. పశువులకు మోకాళ్ళకు పైన ఉండే సుడి. **చంకలబంటిగాతిను** స.క్రి. ఎక్కువగా తిను. **చంకలబంటిగామెసవు** స.క్రి. ఎక్కువగా తిను. క్రీడా. 56. **చంకలుఎగురవేయు** అ.క్రి. సంతోషించు, సంబరపడు. **చంకలుకొట్టుకొను** అ.క్రి. మిక్కిలి సంతోషించు, సంబరపడు. **చంకలుగుద్దుకొను** అ.క్రి. చంకలు కొట్టుకొను. **చంకలుగొట్టుకొను** (-కొట్టుకొను) అ.క్రి. సంతోషించు. నలచ. 3.230. **చంకలుతట్టుకొను** అ.క్రి. సంబరపడు. **చంకలుతాటించు** అ.క్రి. మిక్కిలి సంతోషపడు, సంబరపడు, సంతోషించు. పాండు. 3.67. **చంకలోపెట్టుకొనిపోవు** స.క్రి. సంగ్రహించుకొనిపోవు. **చంకవైచుకొను** అ.క్రి. చంకలు కొట్టుకొను. ప్రభా. 3.134. **చంకసన్నము** వి. 1. బక్క ప్రాణి ; 2. పేదవ్యక్తి. **చంకసుడి** వి. జబ్బమడతలో ఉండే సుడి.

**చంకనం** వి. పొగమొక్క తల చెండు గిల్లిన తరవాత పుట్టే చిగురు.

**చంకిలి** రూ.చూ. చంక. వి. బాహుమూలం, కక్షం. నిర్వ. 7.83.

**చంగలించు** చూ. చంగు.

**చంగు** వి. వేగంగా దాటడం, నడవడం. మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. రాజ.చ. 2.149.
**చంగలించు** అ.క్రి. చలించు, తొలగు. మైరా. 1.160, అటుమటించు.

**చంగోబిళ్ళ** వి. చెప్పకుండా పరిగెత్తిపోవటం.

**చచ్చదరము** వి. 1. సరైన చదరం. కాళిందీ. 2.164 ; 2. నాలుగు భుజాలూ సమానంగా పరిమాణంలో ఉన్న చతురస్రం.

**చచ్చన** రూ. తచ్చన. వి. పరిహాసం. ద్వి. పరమ. 4.311.

**చచ్చవుకము** రూ. చచ్చౌకము, చత్తౌకం. వి. సరైన చౌకం.

కాశీయా. 304.

క.తు. చవ్వొక- ; త. సచ్చపుక్కం.

< చొ + చవుకము.

చచ్చికడుపునపుట్టు చూ. చచ్చు.
చచ్చిచావనివాడు చూ. చచ్చు.
చచ్చిచెడిచేయంగలవిన్నపములు చూ. చచ్చు.
చచ్చిచెడిసున్నమగు చూ. చచ్చు.
చచ్చిచెడు చూ. చచ్చు.
చచ్చినచావగు చూ. చచ్చు.
చచ్చినచావుగా చూ. చచ్చు.
చచ్చినట్లుచేయు చూ. చచ్చు.
చచ్చినపాముగాచంపు చూ. చచ్చు.
చచ్చినపామునుచంపు చూ. చచ్చు.
చచ్చినవానికన్నులుచారెఁడేసి చూ. చచ్చు.
చచ్చినవానినిచదువవేయు చూ. చచ్చు.
చచ్చినవానిపెండ్లికివచ్చినదేకట్నము చూ. చచ్చు.
చచ్చిపుట్టనేర్చు చూ. చచ్చు.
చచ్చిపోవు చూ. చచ్చు.
చచ్చిబ్రతుకు చూ. చచ్చు.
చచ్చిసగమగు చూ. చచ్చు.
చచ్చిసాధించు చూ. చచ్చు.
చచ్చిసున్నమగు చూ. చచ్చు.

చచ్చు అ.క్రి. **1**. మృతినొందు. భార.ఆది. 8.308 ; **2.** సారహీనమగు ; వి. **1**. రాతిలోని మెత్తగా తిరిగేభాగం ; **2.** ఏవస్తువులోనైనా నిస్సారమైన భాగం.

క. సాయు (సత్-). చచ్చు ; సావు. చావు, శవం ; కొడ. చల్-(చవ్-, చట్-), చవు. శవం ; తు. సయిపిని. చచ్చు, ఆహారంలేక చచ్చు ; సైలె. దయ్యం ; సావు. చావు, ఉదయపు విందు ; త. చా- (చెట్ట్-). చచ్చు, పాడగు, లేదా నాశనమగు (శవంలాగ), ఏమీ లేకుండాఅగు ; చావు. చావు, దెయ్యం, చెట్టల్. చావటం ; చెకు (-ప్ట్-, -ట్ట్-). నాశనంచేయు, చంపు ; మ. చాక (చట్ట్-). చచ్చు ; చాక్కు. చావు, మర్త్యత్వం ; చావు. చావు, దినంభోజనం ; చట్టు. చచ్చిన ; సైయ్‌నా (సాస్-). (స్త్రీ). సాయనా, హానా, ఇట్, హావ. చచ్చిన ; కో. క.ట్ ; క.వ్. శవంకూడా కనపడకుండా ఎక్కడో చచ్చి పోయినవ్యక్తి. (క.ఖ్.) తొ. సొయ్-, (సొత్-). చచ్చు; సొ.ప్. బడగవారి అంత్యక్రియలు ; సొ. చచ్చు ; గోం. సైయానా (సాన్-). చచ్చిన ; కొండ. సా. చచ్చు ; కుయి. సావ (సాత్-). చచ్చు, అనారోగ్యమగు, బాధపడు, చావు, అనారోగ్యం, బాధ ; కువి. హైయలి (హత్-). ఏ.వ. హానై. చచ్చు ; గ. ఒల్లా. సయ్-(సద్-, సన్-). (ఏ.వ.) చయ్. చచ్చు; కుఁడు. ఖేఎనా (కెచ్చన్). చచ్చు, పనికిరాకుండాపోవు ; మాల్తో. కెయః మొర్ తల్, క్షెత్తె. చదవడానికివిడిచిపెట్టు, మరణించారనుకొను ; కంగ్లె. చచ్చు. బ్రా. కహింగ్. చచ్చు, చచ్చిన (మంటలతో).

చూ. సం. శవ-. శవం.

చచ్చి కడుపునపుట్టు అ.క్రి. పునర్జన్మించు, కృతజ్ఞత తెలియచేసే సందర్భంలో ఉపగియోంచే పలుకుబడి. **చచ్చిచావనివాడు** వి. అటుఇటుకానివాడు, ఎందుకూపనికిరానివాడు. చచ్చిచెడి చేయంగల విన్నపములు వి.బ.వ. **అతికష్టం** మీద చేసేపనులు. చచ్చిచెడిసున్నమగు అ.క్రి. నానాశ్రమపడు. చచ్చిచెడు అ.క్రి. నానాశ్రమపడు. చచ్చినచావగు అ.క్రి. 1. మిక్కిలి బాధకులోనగు ; **2.** మిక్కిలి అవమానకరమగు. చచ్చినచావుగా క్రి.విశ. నానాబాధగా. నల.ద్వి. 5.61. చచ్చినట్లుచేయు స.క్రి. ఎదురుచెప్పక తప్పకచేయు. చచ్చిన పాముగాచంపు స.క్రి. అసలేదెబ్బతిన్నదానిని బాధించు. చచ్చినపామునుచంపు స.క్రి. మొదలే దెబ్బతిన్నవాణ్ణి ఇంకా బాధించు. చచ్చినవానికన్నులు చేరెఁడేసి అవ్య. గతించింది చాలాగొప్పగా కనబడటం సహజంఅన్నప్పుడు వినవచ్చే పలుకుబడి. చచ్చినవానినిచదువవేయు స.క్రి. శక్తిహీనునికి బరువైన పనిని అప్పగించు. చచ్చినవానిపెండ్లికివచ్చినదే కట్నము వి. ఎంతవరకూదక్కితే (లభిస్తే) అంతేచాలు అని చెప్పేటప్పటి పలుకుబడి. చచ్చిపుట్టనేర్చు అ.క్రి. ప్రావీణ్యం సంపాదించు. పండి.చ. 2.36 పు. చచ్చిపోవు అ.క్రి. 1. మరణించు ; **2.** రుచిలేక మెత్తబడు. చచ్చిబ్రతుకు అ.క్రి. **1.** చావవలసినంత ప్రమాదానికి గురై ఎలాగోబ్రతికి బయటపడు. శృం.నై. 2.138 ; **2.** కష్టాలనుండి బయటపడు. చచ్చిసగమగు అ.క్రి. నానాబాధపడు. చచ్చిసాధించు స.క్రి. చనిపోయికూడా అనుకున్నది సాధించు. చచ్చిసున్నమగు అ.క్రి. విపరీతంగా శ్రమించు. చచ్చుకంకి వి. కళ్ళంలో గింజలు రాలినకంకి. చచ్చుకట్టె వి. కళ్ళంలో మెదిగిన గడ్డి చచ్చుకాల్వు వి. ఆములో సరిగా కాలనిస్థితి. చచ్చుగడ్డి వి. కళ్ళంలో మెదిగినగడ్డి, గింజలురాలిన గడ్డి. చచ్చుగుడ్లు వి.బ.వ. తేలవేసినకళ్ళు. చచ్చుగూడ వి. ఒకరకం పక్షవాతం. చచ్చుడు విశ. చచ్చిన. చచ్చుడుబాకి వి. వసూలుకానిబాకి. చచ్చుదద్దమ్మ వి. ఎందుకూపనికిరానివాడు. చచ్చుదవడ వి. దవడలకు వచ్చేవాతరోగం. చచ్చుదాడు వి. కట్టుబడికి పనికివచ్చే రాళ్ళుసమృద్ధిగాదొరికే మందపాటి రాతిపొరల సమూహం. చచ్చునాగమ్మ వి. ఎందుకూ పనికిరానివాడు. చచ్చునూలు వి. మెత్తటినూలు. చచ్చుపడుగు వి. ఒకబంతి ఎడ్లతో గింజలురాల్చిన తర్వాత రెండోసారి తొక్కించేపడుగు. చచ్చుపీనుగు వి. **1**. వెధవ, ఒక తిట్టు ; **2**. ఏమీచేతకానివాడు. చచ్చుపుచ్చు వి. పనికిరానిది. చచ్చుపెద్దమ్మ వి. ఎందుకూపనికిరానివాడు. చచ్చుబాకి వి. రానిబాకి, వసూలుకానిరుణం. చచ్చులేకుండా మాట్లాడు స.క్రి. కచ్చితంగామాట్లాడు. చచ్చుల్లిపాయ వి. చెడిపోయిన ఉల్లిపాయ. చచ్చువాయువు వి. పక్షవాయువు, తిమురువాయువు. చచ్చేడివానికిసముద్రముమోఁకాలిబంటి వి. చావటానికి సిద్ధపడ్డవాడు సముద్రాన్ని మోకాలులోతుగా చూస్తాడు. అంటే చచ్చేవాడు దేనికైనా సిద్ధపడతాడు అనే టప్పుడు ఉపయోగించే సామెత.

చచ్చుడి చూ. చచ్చు. వి. చండాలజాతిభేదం.

చచ్చుడివాండ్లు వి.బ.వ. చచ్చరజాతిలో ఒకశాఖ.

చచ్చేడివానికి సముద్రము మోఁకాలిబంటి చూ. చచ్చు.

**చచ్చోకము** రూ.చూ. చచ్చవుకము. వి. నాల్గువైపులా చదరంగా ఉండేది. పల్నా.వు. 33.

**చంచకరువు** రూ.చూ. సంచకరువు. వి. బజాన, సంచకరువు.

**చంచకారము** చూ. సంచకరువు. వి. బజాన.

**చంచదము** రూ.చూ. చెంచదము. వి. ఒకజాతిడేగ, శ్యేన భేదం. ప్రబంధ. 191.

**చటకారి** వి. 1. ఈదేశంలోపుట్టిన ఆంగ్లేయసంతతివాడు ; 2. సంకరజాతి ఆంగ్లేయుడు.

సం. చటక-. ఆడజాతిపిచ్చుక.

**చటచట** వి. 1. మంటలో కపాలాదులు పగలడంలో ధ్వనికి అనుకరణం. మార్క. 2.33 ; 2. మంటలు మండటంలో ధ్వన్యనుకరణం. ప్రభు. 3.86. పు 18 పం.

**చటచటలు** వి.బ.వ. వస్తువులు మండి పగలటంలోని ధ్వన్యనుకరణం.

**చటాకు** వి. సేరులో పదహారోవంతు.

హిం. ఛటాంక్. సేరులో పదహారోవంతు తూకం.

**చటాయింపు** వి. 1. కినుక, రోత, విసుగు ; 2. లేచిపోవటం.

**చటాలు** రూ. చటిల్లు, చటీలు. వి. కొట్టడం మొ. వాటిలో ధ్వనికి అనుకరణం. వరాహ. 2.134.

క. చటల్.

**చటిల్లు** రూ.చూ. చటాలు. వి. చరచడంలో అయ్యేధ్వనికి అనుకరణం. ఉ. హరి. 6.85.

**చటీలు** రూ.చూ. చటాలు. వి. కొట్టడంలో అయ్యేధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 3.56.

**చటుక్కున** అవ్య.ద్రు. వేగంతో కూడిన కదలికను తెలిపేపదం, వేగంగా.

**చటుదు** వి. మండలాధికారి. శా. శ. కో. పు. 104.

**చటులుపడు** అ.క్రి. మొక్కపోవు, కుంటుపడు. కాశీ. 2.105.

సం. చటుల-. చంచలం, మనోహరమైన.

<సం. చటుల- + పడు.

**చట్కారి.** వి. మోసగాడు, టుంటరి.

హిం. చట్‌కారా. చంచలమైన, వేగమైన.

**చట్టు**[1] వి. 1. చర్మం, తోలు. శ్రీరం. మా. 4.80, ప్రబంధ. 153 ; 2. ధాన్యంపోసే చిన్నగోనె.

**చట్టు**[2] వి. 1. భుజం. దశకు. 4.48 ; 2. తొడ వెలుపలి భాగం. రం. రా. యు. 4.77 పు. 5పం ; 3. చేతితో చరచబడినసున్నం మొ. వాటిరేఖ. హరి. పూ. 9.144, పారి. 2.38 ; 4. గదవాపు.

క. చట్టె. భొక్కా.

**చట్టలుచీరు** రూ. చట్టల్చీరు. స. క్రి. చట్టలుచీల్చు, వధించు, చంపు. రామా. 7.265 ; సారంగ. 1.90. **చట్టలుదూయు** స.క్రి. వధించు, చంపు, చట్టలు చీల్చు. వరాహ. 6.22. **చట్టలుద్రుంచు** స.క్రి. చట్టకుచీరు, వధించు, చంపు. మొల్ల. 5.36. **చట్టలుపట్టుకొను** స.క్రి. ఒకరి చేతులొకరు పరస్పరం పట్టుకొను. భీమ. 2.197. **చట్టలువడిపోవు** అ.క్రి. పిరుదుకు కిందభాగం పడిపోవు. **చట్టలువావు** స.క్రి. 1. నాశనం చేయు. ఉ. హరి. 4.87 ; 2. వధించు. **చట్టల్చీరు** రూ.చూ. చట్టలుచీరు. స.క్రి. చట్టలుచీల్చు, వధించు, చంపు. రామా. 3.54.

**చట్టు**[3] విణ. వ్యర్థమైన. ప్రభు. 4.117.

**చట్టు**[4] చూ. చట్టున. క్రి.విణ.ద్రు. శీఘ్రంగా, తొందరగా. భార. ఆది. 8.118.

**చట్టు**[5] వి. 1. చిన్నకోటు. ప్రబంధ. 153, ఆం. భా. 2.131 ; 2. కవచం.

క. చట్టె. పాశ్చాత్యుల నాగరికతా ప్రభావం వల్ల అలవాటు చేసుకొన్న ఉడుపు ; తు. చట్టెగార. పాశ్చాత్య పద్ధతి ఉడుపుల్ని ధరించిన దేశీయుడు ; త. చట్టై, చొక్కా, కోటు, గౌను, పాముకుబుసం ; మ. చట్ట. చొక్కా. జాకెట్టు, కవచం ;

సం. శాట-. శాటిక ; ప్రా. సాడ, సాడగ, సాడిఅ ; అమా. సాడ, సాడగ, సాడఅ. ఉత్తరీయం ; పా. సాటు. గుడ్డ ; సాటుక. మీదుగుడ్డ ; అప. చట్టు. చాప ; మరా. చాటీ. కావిరంగు గుడ్డ.

<త. చట్టై.

**చట్టం** రూ.చూ. చట్టము[4]. వి. 1. అడ్డగుమ్మి అమర్చేకొయ్య చట్రం ; 2. మర మగ్గంలో పన్నెపలక మొ. బిగించిన నాలుగు పట్టెల చట్రం ; 3. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య ; 4. పోతపోయవలసిన సిమెంటు మొ. వాటికి ఆకారమిచ్చే విడిభాగాల కలయిక ; 5. బండి ఇరుసుమీద నిలిచేనిలువు అడ్డపట్టెలు ; 6. కిటికీల తలుపుల రెక్కల్ని బిగించడానికి వీలుగాతయారు చేసిన కొయ్యల కూర్పు ; 7. పునాదిగా తవ్విన గుంటఅడుగు భాగం ; 8. ఇటుక తారసరాళ్ళను, వాటి మందంమీద పడుకోబెట్టడం.

**చట్టంగాడి** వి. మరమగ్గం పలకకు పన్నె బిగించటానికి చేసినసందు. **చట్టంపట్టె** వి. బండి చట్రానికి బిగించిన చెక్కపట్టె. **చట్టంమేకు** వి. మగ్గం కుచ్చుతాడు కట్టడానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల.

**చట్టతెవులు** వి. కాయపైర్ల తెగులు.

**చట్టన** క్రి.విణ.ద్రు. శీఘ్రంగా, తొందరగా. భార. అరణ్య. 3.284.

క. చటక్కనె. అకస్మాత్తుగా, లేవడానికి గాని, తుమ్మడానికి గాని ఉపయోగించే పదం ; చట్టనె. హఠాత్తుగా, వేగంగా, తుమ్మడానికి కూడా ; కొడ. దడ్నె ; తు. చట్టనె. హఠాత్తుగా ; త. చటక్క-. ఎనల్. వేగాన్ని వ్యక్తం చేసేది. చట్టెనల్. త్వరితాన్ని వ్యక్తంచేసేది.

**చట్టందాక** వి. కూరవండుకోడానికి వాడే మట్టిపాత్ర.

**చట్టపుకొయ్య** చూ. చట్టము[4].

**చట్టపుదబ్బ** చూ. చట్టము[4].

**చట్టపుబద్ద** చూ. చట్టము[4].

**చట్టపుమెకము** చూ. చట్టము[1].

**చట్టపువాసం** చూ. చట్టము[4].

**చట్టబోవు** అ.క్రి. అనుము, కంది, పెసర మొ. పైర్లుకాపుకు వచ్చినప్పుడు మబ్బులు పడితే కాయల్లో గింజపట్టక పోవు. వి. ఒకరకం గొంగలి పురుగు.

**చట్టబ్బద్ద** చూ. చట్టము[4].

**చట్టము**[1] రూ.చూ. తట్టము[2]. వి. పునుగుపిల్లి శరీరంలో పునుగు ఉండేతిత్తి. హంస. 1.81, శుక. 1.157.

చట్టపుమెకము వి. పునుగుపిల్లి. సాంబ. తిర్య. 82.

చట్టము[2] వి. న్యాయశాస్త్రం, శాసనం.

సం. శాస్త్ర-.

చట్టము[3] వి. తగడు, రేకు. నెల్లూరుశాసనాలు. కావలి. క్రీ. శ. 1188.

చట్టము[4] రూ. చట్టం, చట్రం, చట్రము. వి. **1.** పట్టెలతో అమర్చిన మంచం మొ. వాటిభాగం. వసు. 1.144 ; **2.** చట్రం.

క. చట్టు. బండిచట్రం (మంచం, కుర్చీ లేదా బొమ్మ క్రిందిభాగం లేదా బండిచట్రం), పీనుగు బండి. పద్ధతి, క్రమం, నియమం, పరిశుభ్రత, నాజూకు; చట్టు. బండియొక్క చట్రం లేదా కిందిభాగం ; తు. చట్టు. డోలి, పల్ల, ఒకరకం పల్లకి, పీనుగు బండి, కిటికీచట్రం ; త. చట్టమ్. కర్ర చట్రం, చట్టం, నమూనా, పద్ధతి, క్రమం, కచ్చితమైనది, సన్నితం ; మ. చట్టమ్. కిటికీ, ద్వారం, మంచం మొ. వానిచట్టం, ఆకారం, నమూన, పద్ధతి, శాస్త్రం ; కో. చట్. రకరకాల సామానులుంచుకొనే కొయ్యచట్రం, ఇంటిపైన పెంకులు మొ. వేయటానికి నిలువుగా వేయబడిన వాసాలు. చళామ్. కొండజాతివారి ఆచారం.

చట్టపుకొయ్య వి. దూలాలకు అడ్డంగా ఇంటిచట్రంలో భాగంగా వేసేవాసం. చట్టపుదబ్బ వి. ఆకుకప్పు మీది మిట్ట పల్లాలు సరిచూసే చెక్కసాధనం. చట్టపుబద్ద వి. దూలాలకు అడ్డంగా ఇంటిచట్రంలో భాగంగా వేసేవాసం. చట్టపువాసం వి. కొమ్ముల మీద నిలిపిన చట్టం, పిల్లదూలం మొ. వాటిని మోసేదూలం. చట్టబ్బద్ద వి. ఇంటికప్పు వేయడంలో వాడే పలవని మొక్క.

చట్టి వి. నోరు వెడల్పుగా ఉండే చిన్నమట్టి పాత్ర, అటిక, చిన్నకుండ. ఆము. 1.82.

క. చట్టి, చట్టి. మట్టికుండ లేదా పెనం. చటిగె, చట్టిగె. నోరువెడల్పుగా ఉన్న చిన్న మట్టికుండ ; తు. చట్టి. వెడల్పుగా ఉన్న చిన్న మట్టికుండ ; త. చట్టి. మట్టిపాత్ర, పెనం ; మ. చట్టి. కుండ, పెనం.

చట్టితోఁజట్టిపనులఁగొట్టు స.క్రి. ఇంటిలో కుండలు పగలగొట్టు. శుక. 3.275. చట్టిపిడత వి. చిన్న మట్టిపాత్ర. చట్టిముంత వి. పొలాలకు సద్ది తీసుకుపోవడానికి ఉపయోగించే చట్టిలాంటి మట్టి ముంత.

చట్టిగము చూ. చట్టి. వి. కొంచెం ధాన్యం పోసిన చిన్నగిన్నె. ద.హిం.శా. సంపు. 10, శా.సం. 66. క్రీ.శ. 1111.

చట్టు[1] వి. **1.** రాయి. భోజ.రా. 2.47 ; **2.** శైలం, కొండ. వసు. 1.36, నిరంకు. 3.30 ; **3.** భూమిగ్నశిల. ఆం.భా. 2.29 ; **4.** గట్టిగా ఉండే నేల ; **5.** జొన్నరాసి తూర్పార పట్టగా వచ్చిన సన్నని పొట్టు.

పర్జి. చట్. (బ.వ. చట్టుల్). రాయి.

చట్టుతనము వి. మితిమీరిన మూర్ఖత్వం. చట్టు (నేల) వి. రాతినేల, గట్టినేల. చట్టుపడు రూ. చట్టువడు. అ.క్రి. నశించు, అణగు. భాగ. 6.135. చట్టుపైఁబోఁకలగు అ.క్రి. చట్రాతిపై పోకలగు, చెల్లాచెదరగు. పారి. 5.37. చట్టుబండలగు అ.క్రి. పాడగు. చట్టుబావి వి. పైన కనిపించే చట్టునుండే చుట్టుగోడలు కట్టిన బావి. చట్టుమోపు (చట్టు[1] + మోపు) స.క్రి. దండనంగా రాయి మోసేట్లు చేయు. దశా. 2.197. చట్టువడు (-పడు) రూ.చూ. చట్టుపడు. అ.క్రి. నశించు, అణగు. వరాహ. 7.52. చట్రాతిపైఁగ్రుంకఁగలుగు అ.క్రి. **1.** రాతిలో మునగ గలుగు. కు.సం. 8.135 ; **2.** నెరజాణ అగు. చట్రాతిపైఁగ్రుంకనేర్చు స.క్రి. అసాధ్యపనులు చేయ కలుగు. పండి.చ. పురా. పు. 359. చట్రాతిపైఁబోఁగలుగు అ.క్రి. చెల్లా చెదరగు. ఉ.హరి. 3.30. చట్రాయి వి. చాపరాయి. నిర్వ.రా. 3.63. < చట్టు[1] + రాయి. చట్రాళ్ళు వి.బ.వ. కటికవారు, కఠినులు. శుక. 3.184 (అర్థవిపరి.). చట్రోలు వి. రాతిరోలు. పారి. 3.38. < చట్టు[1] + ఱోలు. చట్లరుగు వి. పొయ్యికి పక్కన ఎత్తు తక్కువగా కట్టిన చిన్న అరుగు.

చట్టు[2] వి. శిష్యుడు. కాశీ. 6.74, యయా. 7.180.

సం. ఛాత్ర-. విద్యార్థి, పండితుడు ; ప్రా. ఛత్త-. విద్యార్థి, అభ్యాసి ; దే.ప్రా. చట్ట-. విద్యార్థి ; చట్టశాలా. పాఠశాల, బడి ; పా. ఛత్త. విద్యార్థి ; అప. చట్ట. శిష్యుడు.

< ప్రా. ఛత్త-.

చట్టుప రూ.చూ. చెట్టుప. వి. రెక్క, పక్షం. పాండు. 5.249.

చట్టువ రూ.చూ చట్టువము. వి. కలపడానికి ఉపయోగించే కర్రగరిటె. ఆం.భా. 2.244.

చట్టువము రూ. చట్టువ, చట్వము. వి. గరిటె, తెడ్డు. భార. విరా. 1.211.

క. సట్టుగ. గరిటె. తెడ్డు ; చట్టిగె ; కొడ. చట్టువ. కొయ్యగరిట ; తు. సట్టె, సట్టుగ ; త. చట్టుకం, చట్టువం, చట్టి ; మ. చట్టుకం.

సం. చటుక-. కొయ్యపాత్ర ; దే.ప్రా. చటుఅ, చట్టు, చట్టుఅ, చట్టుల. గరిటె ; అప. చట్టుయ.

చట్రం రూ.చూ. చట్టము[4]. వి. చుట్టూ ఉన్న ఇనుం మొ. వాటి కట్టు.

చట్రంతలుపు వి. మధ్యభాగం ఉబ్బెత్తుగాచేసి చట్రంలో బిగించిన చెక్కల తలుపు. చట్రంతాడు వి. మరమగ్గం నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. చట్రంవట్టె వి. దూలాలకు అడ్డంగా ఇంటిచట్రంలో భాగంగా వేసే వాసం.

చట్రపుపేడు చూ. చట్రము.

చట్రము రూ.చూ. చట్టము[4]. వి. చట్రం.

చట్రపుపేడు వి. అలమరను అరలుగా విభజించే చెక్క.

చట్రాతిపైఁగుంకఁగలుగు చూ. చట్టు[1].

చట్రాతిపైఁగ్రుంకనేర్చు చూ. చట్టు[1].

చట్రాతిపైఁబోఁగలుగు చూ. చట్టు[1].

చట్రాయి చూ. చట్టు[1].

చట్రాళ్ళు చూ. చట్టు[1].

చట్రోలు చూ. చట్టు[1].

చట్లరుగు చూ. చట్టు[1].

చట్వము రూ.చూ. చట్టువము. వి. చట్టువం గరిటె, కర్పూరం వెలిగించడానికుపయోగపడే గరిటె. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 125. క్రీ.శ. 1296.

**చరాలు** వి. పేల్చే ఆయుధ విశేషం యొక్క ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788. ధ్వన్యను.

**చడావు** వి. **1.** ఎగుగడ్డ, మిాట ; **2.** ఎక్కుడు.
హిం. చఢావ్. ఎక్కటం.
<హిం. చఢావ్.

**చడి** వి. అలజడి, సడి. ధ్వన్యను.
**చడిజాడలు** వి.బ.వ. దారితెన్నులు. **చడిసను (-చను)** అ.క్రి. పేరందు, ఖ్యాతివహించు. బసవ. 1.5. **చడిసప్పు లేకుండ (-చప్పులేకుండ)** అవ్య.ద్రు. ఎవరికీ తెలియకుండా, గప్పుచిప్పు మనకుండా. కాశీ. 5.289. **చడీచప్పుడూ** వి. సవ్వడి.

**చడికి** రూ.చూ. చలికి. వి. మల్లబంధ విశేషం.

**చడీచప్పుడూ** చూ. చడి.

**చడ్డీ** వి. నిక్కరు, లాగు.

**చంటితనము** చూ. చన్ను.

**చంటిది** చూ. చన్ను.

**చంటిపాప** చూ. చన్ను.

**చంటిపాపఁడు** చూ. చన్ను.

**చంటిపిల్ల** చూ. చన్ను.

**చంటిబిడ్డ** చూ. చన్ను.

**చంటివాఁడు** చూ. చన్ను.

**చంటోడు** చూ. చన్ను.

**చండరబండ** వి. ఎంచామించా.

**చండవాళము** వి. చేసిన అపరాధాలకు అపరాధంగా ఇచ్చేడబ్బు.

**చండాలం** వి. చాల చెడ్డది.
సం. చండాల-. మాలలు.

**చండాలము** వి. అపరాధంగా యిచ్చేడబ్బు.
సం. చండాల-. క్రూరకర్మ.
<సం. చండాల - (అర్థవిపరి.).

**చండాలవాటిలో బ్రాహ్మణగృహము వెదకు** అ. క్రి. వ్యర్థ ప్రయత్నంచేయు. ప్రభా. 4.160.

**చండి**[1] వి. పార్వతి. ఆం.భా. 1.40. దంత్యచకారాది పదంగా ఇది తద్భవం.
సం. ప్రా. చండీ. పార్వతి ;
క.త. చండీ.
<ప్రా. చండీ.

**చండి**[2] విశే. **1.** మొండితనంగల. భార. శల్య. 1.31 ; **2.** మూలుగుబోతు, సోమరి. ఆం.భా. 3.6 ; **3.** లోభత్వం కల, సిగ్గుమాలిన ; **4.** మూర్ఖుడు.
**చండించు** అ.క్రి. **1.** చలపట్టు, మచ్చరించు. రం.రా. బాల. 5 ; **2.** మందగించు, అలనమగు. విజయ. 2.36. **చండితనము** వి. **1.** మూర్ఖపుపట్టు, మొండితనం. భార. విరా. 5.186 ; **2.** క్రూరత్వం. **చండిపోతు** రూ. చెండిపోతు. వి. **1.** మూర్ఖం పట్టుదల గలవాడు. ద్వి.హరిశ్చ. ఉ. 1500 పం.; **2.** కూళ, కుజనుడు. ఆం.నా.సం. మాన. 11 ; **3.** సోమరి. **చండిపడు (-పడు)** అ.క్రి. మొండికెత్తు, మొండితనం వహించు. పారి. 5.13. **చండిసేయు (-చేయు)** అ.క్రి. మొండికెత్తు.

**చంద్ర** వి. ముళ్ళున్న ఒకానొక ఎడారి చెట్టు, ఖదిరం. హంస. 4.9. (Acacia tree, Acacia sundra).
**చంద్రనిప్పులు** వి.బ.వ. ఖదిరం కాల్చిన నిప్పులు. ద్వి. హరిశ్చ. 3.91. **చంద్రమల్లెలు** వి.బ.వ. చంద్రనిప్పులు. ఎర్రని నిప్పులు. క్రీడా. 48. **చంద్రమాను** వి. వృక్ష విశేషం. శా.శ.కో.వు. 103. క్రీ.శ. 1102 (Mimosa catechu). **చంద్రలాటలు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

**చంద్రము** వి. ఒకరకం చెట్టు (Cinnamomum camphora).

**చతికిలఁబడు** చూ. చతికిలు.

**చతికిలు** రూ.చూ. చదికిలు. అ.క్రి. పిర్రలు నేలమీద అను.
**చతికిలఁబడు** రూ.చూ. చదికిలఁబడు. అ.క్రి. కూలబడు. హర. 7.13.

**చతుకు** స.క్రి. సరిచేసేటప్పుడు, పడుగుమీద అంబలిపోసి చేత్తో చరచు.

**చతుకుపడు** అ.క్రి. చతికిలపడు, పిర్రలు నేలమీద అనేట్లుగా కూర్చొను.

**చతురంగొయ్యి** వి. శంకుకర్రకు పాతడానికి తవ్విన నల్చదరపు గుంట.
సం. చతుర-. గుండ్రటి దిండు.
<సం. చతుర + గొయ్యి.

**చతుర్దశిపిండివంట** వి. నరకచతుర్దశి దినాన చేసే పిండి వంట. ద.హిం.శా. సంపు. 10, శా.సం. 560. క్రీ.శ. 1342.
సం. చతుర్దశీ-. ఒకతిథి.
<సం. చతుర్దశీ- + పిండివంట.

**చతుర్భవంతి** వి. మధ్యనున్న ఖాళీస్థలానికి నాలుగువైపులా గదులున్న ఇల్లు.
సం. చతుర్. నాలుగు.
<సం. చతుర్ + భవంతి.

**చతుర్ముఖకోహళి** వి చతుర్ముఖాకారంకల శిరోభూషణం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 474. క్రీ.శ. 1292.
సం. చతుర్ముఖ-. నాలుగుముఖాలు.
<సం. చతుర్ముఖ- + కోహళి.

**చతుర్వేదిమంగలము** వి. బ్రాహ్మణాగ్రహారం.
సం. చతుర్వేదిన్. నాలుగువేదాలు తెలిసినవారు. మంగల-. శుభం.
సం. చతుర్వేదిమంగల- (అర్థవిపరి.).

**చత్త**[1] రూ.చూ. చెత్త. వి. చెత్తాచెదారం.

**చత్త**[2] రూ. చత్తరి. వి. నాలుగువేళ్ళకొలత.

**చత్తరి** రూ.చూ. చత్త[2]. వి. తర్జని మొ. నాలుగు వేళ్ళకొలత.

**చత్తోకం** రూ.చూ. చచ్చవుకము. వి. సరైన చౌకం.

**చత్రశాల** వి. చతుశ్శాల.
సం. చతుశ్శాల-. నాలుగిళ్ళభవంతి.
<సం. చతుశ్శాల-.

**చత్రిఆవేదనలు** వి.బ.వ. ముప్పైఆరు విధాలైన పన్నులు.

**చత్రికడ్డి** వి. వాటల్ని కోయడానికి వాడే గొడుగుకమ్మి.

**చత్రిపుల్ల** వి. వాటల్ని కోయడానికి వాడే సన్నని గొడుగుకమ్మి.

**చత్వారము** వి. నలభైఏళ్ళ వయస్సులో వచ్చేదృష్టిదోషం,

మాంద్యం. చంద్రరే. 2.21.

సం. చత్వారింశత్-. నలభైలో ఉండే అంకె.

<సం. చత్వారింశత్- (అర్థవిపరి.).

చత్వారంవచ్చు చూ. చత్వారము. అ.క్రి. నలభైయేళ్ళుపైబడ్డ తర్వాత కళ్ళచూపుతగ్గు.

చదనం రూ.చూ. చదరం$^{2}$. వి. కొయ్యవాసం.

చదమి వి. తెలుపు, పసుపుపూలు పూసే ఒకరకం పెద్దచెట్టు (Eriodendrouan fractuosum).

చదర చూ. చదును. యూ.చూ. చదరము. వి. 1. సమ చతురస్రంగా ఉండి కూర్చోడానికి ఉపయోగించే చిన్న చాప ; 2. చిన్నవిస్తరాకు ; 3. సమ ప్రదేశం, మట్టం.

చదరం$^{1}$ యూ.చూ. చదరము. వి. 1. ఎగుడు దిగుళ్ళులేకుండా ఉన్నది ; 2. చతురస్రం.

చదరపడు అ.క్రి. ఎత్తుపల్లాలు లేకుండా చదునుగాఉండు. చదరంపెంకు వి. పాలాస్త్రీ పెంకు, అచ్చుమీదసాపుగాపల్చగా నల్చదరంగా తీసికాల్చిన పెంకు. చదరంపెల్ల వి. పాలాస్త్రి, నల్చదరంగా పలచగా ఉండేపెంకు. చదరంమెట్టు వి. నలు పలకలుగా, వంపూ, వాలూలేకుండా కట్టినమెట్టు.

చదరం$^{2}$ రూ. చదనం. వి. 1. కొయ్యవాసం ; 2. అడ్డబెలుగు, అడ్డంగా పరిచే వాసం.

చదరంపట్టి వి. గుజ్జుల మీాదబిగించే అడ్డకర్ర.

చదరంగపుఁబలక చూ. చదరంగము.

చదరంగము వి. చతురంగం. ఒకవిధమైన ఆట. చంద్రరే. 2.61.

సం. చతురంగ-. నాలుగు అవయవాలు (రథగజ తురగపదాతులు) కల ఒకరకపు ఆట.

క. చదరంగ.

<సం. చతురంగ-.

చదరంగపుఁబలక (-పలక) వి. అష్టాపదం, నెత్తపుపలక. ఆం.భా. 2.305.

చదరపడు చూ. చదరం$^{1}$.

చదరపిటిక చూ. చదరము.

చదరపిల్లు చూ. చదరము.

చదరపుగూడు చూ. చదరము.

చదరపుపెంకు చూ. చదరము.

చదరపుపెండి చూ. చదరము.

చదరపుబట్టీ చూ. చదరం$^{2}$. వి. గుజ్జుల మీాద బిగించే అడ్డ కర్ర.

చదరపుబావి చూ. చదరము.

చదరపురాయి చూ. చదరము.

చదరము రూ. చదర, చదరం$^{1}$, చదిరె. విఴ. 1. సమాన మైన. ఉ.హరి. 3.128 ; 2. సులువైన, సుకరమైన, సులభ మైన. పాండు. 5.214 ; 3. నిమ్నోన్నతంకాని, చదునైన. పంరిశ్చ. 3.15 ; 4. చతురస్రమైన, చౌకగాఉన్న.

క. చదర. చతురస్రంగా ఉన్న.

సం. చతుర(శ్ర-. నాలుగు మూలలు కలది.

చదరపిటిక వి. చిన్నసైజు ఇటుక. చదరపిల్లు వి. హొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిద్రాటాడిల్లు. చదర పుగూడు వి. నలుపలకలుగా ఉండేగూడు. చదరపుపెంకు వి. నల్చదరంగా పలచగాఉండే పెంకు. చదరపుపెండి వి. వెదురు బద్దలతో చదరంగా కట్టిన పూతపెండె. చదరపు బావి వి. నల్చదరంగా ఉండే చుట్టుగోడ ఉన్నబావి. చదరపురాయి వి. చదరంగా నాలుగు పలకలుగా ఉన్న రాయి.

చదరములు వి.బ.వ. ఇంటికుదుజుల మీాదిపట్టెలు.

చదరలు వి.బ.వ. పూర్వోత్తరా భాద్ర నక్షత్రాలు, మొత్తం నాలుగు చుక్కలు.

చదరు$^{1}$ వి. కొలువుకూటం, సభ.

చదరు$^{2}$ వి. ప్రచ్ఛాదనం.

హిం. చాదర్ ; మరా. చాదర్. వస్త్రవిశేషం ; ఉ. చాదల్. ప్రచ్ఛాదనం, వస్త్రవిశేషం, శాలువ ; పార. చాదర్. గుడారం, బల్లలు మొ. వాటిమీాద వేసే గుడ్డ.

<ఉ. చాదర్.

చదలము వి. 1. సైన్యం, కాల్బలం. జైమినీ భా. 2.106, ఆం. భా. 2.194.

చదలయేనుఁగు చూ. చదలు$^{1}$.

చదలు$^{1}$ వి. ఔ. 1. ఆకాశం, మిన్ను. భార. ఆది. 8.10 ; 2. స్వర్గం.

చదలయేనుఁగు వి. ఇంద్రుని ఏనుగు, ఐరావతం. చదలు కానుపుఁదిండి వి. పవనాశనం, పాము. అచ్చ. రా. బాల. 150. చదలుకాఁపు వి. దివౌకనుడు, వేల్పు. చదలుకుఱ్ఱఁడు వి. నభస్వంతుడు, వాయువు. అచ్చ. రా. యు. 496. చదలుకెంపు వి. సూర్యుడు, ద్యుమణి. రాజవా. 3.49. చదలుకోడి వి. పక్షి విశేషం. హంస. 3.13. చదలుచూలి వి. నభస్వంతుడు, వాయువు. అచ్చ. రా. కిష్కిం. 100. <చదలు + చూలు +- ఇ. చదలుతొడుకు వి. స్వర్గంలో ఉండేఆవు, కామధేనువు. సాంబ. దేవ. 19. చదలుమాని కము వి. సూర్యుడు, ద్యుమణి. నీలా. 3.45. చదలు మోయు అ.క్రి. మిన్నంటు. వర. రా. కిష్కిం. పు. 465పం. 17. చదలుమ్రాను వి. స్వర్గద్రుమం, వేల్పుమ్రాను. చంద్ర భా. 1.41. చదలువాఁక వి. ఆకాశంలో ప్రవహించేనది, గంగానది. అచ్చ. రా. కిష్కిం. 62. చదలేటిపట్టి వి. గంగా సుతుడు, భీష్ముడు. యయా. 1.85. చదలేఱు వి. స్వర్ణది, మందాకిని. శృం.నై. 2.49.

చదలు$^{2}$ వి. అశ్రద్ధ.

చదలేటిపట్టి చూ. చదలు$^{1}$.

చదలేఱు చూ. చదలు$^{1}$.

చదాటు విఴ. మెత్తన, నున్నన, ఎగుడు దిగుళ్ళు లేకుండా ఉన్న.

చదికిలఁద్రెళ్లు చూ. చదికిలు.

చదికిలబడు చూ. చదికిలు.

చదికిలఁబడు చూ. చదికిలు.

చదికిలు రూ. చతికిలు. అ.క్రి. పిర్రలు నేలమీాద ఆనేట్లుగా కూర్చుండు.

చదికిలఁద్రెళ్లు అ.క్రి. చదికిలబడు. ఉ. హరి. 3.53. చదికిలబడు రూ.చూ. చదికిలఁబడు. అ.క్రి. 1. కూలబడు ; 2. డీలా పడిపోవు. చదికిలఁబడు రూ. చతికిలఁబడు. చదికిల

బడు. అ. క్రి. 1. పిర్రలు నేలమీద ఆనేట్లు కూలబడు. భార. భీష్మ. 2.110 ; 2. నిర్వ్యాపారంగా ఉండు, కదలకుండాఉండు. భీమ. 5.15.

చదియ చూ. చదియు.

చదియఁగొట్టు చూ. చదియు.

చదియఁబడు చూ. చదియు.

చదియించు చూ. చదియు.

చదియు అ. క్రి. 1. నలుగు. భార. ఆది. 6.160. కు. సం. 4.79 ; 2. చచ్చు, నశించు. భార. ద్రోణ. 4.150.

క. సదె. నలగగొట్టు, అణగదొక్కు, కొట్టు, పంటచేయు ; తు. సదెవుని. చినిగిపోవు ; సది. కొట్టటం ; చపె. జీవితం నాశనం చేయటం ; త. చతై. అణగదొక్కు, నలగగొట్టు, చతి. నాశనంచేయు ; మ. చతయుక్. నలగగొట్టు ; చత. నలగగొట్టు ; కో. చచ్. దెబ్బలుకొట్టు ; పర్జి. చచిప్- (చచిత్). తొక్కు, తొక్కివేయు ; చతిప్-. (చచిత్). తొక్కు, తొక్కివేయు.

మూ. ద. ద్రా. *చత్/-*తత్-.

< మూ. ద్రా. *చచ్/-*చత్.

చదియ వి. నలుగుడు. ద్వి.హరిశ్చ.పూ. 1976. చదియఁగొట్టు. స.క్రి. ఉతుకు. రుక్మాం. 5.82. చదియఁబడు అ.క్రి. నలుగు. పారి. 2.72. చదియించు స.క్రి. నశింపచేయు. నార. పంచ. 1.25.

చదరిక వి. కటాసనం, చదర. ఆం. భా. 2.165.

చదిరించు స.క్రి. ఎత్తుపల్లాలు సరిచేయు, చదునుచేయు.

చదిరె రూ.చూ. చదరము. వి. చదర.

చదివించు చూ. చదువు.

చదివింపు చూ. చదువు.

చదుకము వి. నాలుగు మార్గాలు కలిసేచోటు, చతుష్పథం. భార. సభా. 1.146.

సం. చతుష్క-. శృంగాటకం ; ప్రా. చయుక్క-.

త. చతుక్క.

< ప్రా. చదుక్క-.

చదుకు వి. 1. పంకం, బంక. ఆం. భా. 1.155 ; 2. జారడం.

త. చతవల్. బురద, చతుక్కల్.

చదుకుపడు అ. క్రి. ఊడిపోవు. వరాహ. 9.78 ; 2. చతికిలపడు. ఆం.భా. 3.78. చదుకెక్కు. అ.క్రి. 1. ఊడిపోవు, రాలు. పాండు. 4.14 ; 2. చదికిలపడు.

చదుకెక్కు చూ. చదుకు.

చదును చూ. చదరము. విణ. సమమైన, మిట్టపల్లాలులేని. రం. రా. ఉ. 7.70పు. 12పం. వి. 1. సమమైన ప్రదేశం, సమప్రదేశం. అని. 4.40. ; 2. చదరం.

చదునుపట్టె వి. దున్నిన పొలం చదునుచెయ్యటానికి ఉపయోగించే అడ్డపట్టె.

చదుపు చూ. చదియు. స.క్రి. 1. చదియచేయు, నలగగొట్టు. భార. ద్రోణ. 1.328 ; 2. కొట్టు. భాస్క. రా. అరణ్య. 1.128 ; 3. భగ్నంచేయు, విరగగొట్టు. ఉ. హరి. 4.246 ; 4. చంపు, నశింప జేయు. ప్రబోధ. 4.27.

చదుము[1] చూ. చదియు. స.క్రి. 1. నలగగొట్టు. రం. రా. అరణ్య. 159పు. 19పం ; 2. చంపు, కొట్టు ; 3. గుద్దు. వి. సమప్రదేశం. వరాహ. 10.50.

చదుము[2] వి. పలచగా మెత్తగాఉన్న అడుగు.

చదుము[3] వి. దోనెమలుపు తర్వాత ఉన్నభాగం, దోనెసన్నగిల్లే భాగం.

చదుర విణ. చాతుర్యంకల. కళా. 1.77.

సం. చతురా-. నేర్పరి జనస్త్రీ.

< సం. చతురా.

చదురాలు వి. చాతుర్యంకల స్త్రీ. కు.సం. 9.88.

చదురడుచు చూ. చదురు[3].

చదురాలు చూ. చదుర.

చదురు[1] వి. 1. సభ, గద్దె, సింహాసనం. విక్ర. 2.44. రసిక. 1.68 ; 2. కొలువు, ఆస్థానం ; 3. వివాహాది ఉత్సవాల్లో జరిపించే ఆటకచేరి.

సం. సదస్-. కొలువు.

చదురు[2] చూ. చదరము. వి. చదరం.

చదురు[3] వి. 1. చాతుర్యం, నేర్పు. నిర్వ.రా. 1.7 ; భార. ఉద్యో. 1.306 ; 2. చతురోక్తి. భాగ. 10 పూ. 1072 ; 3. విధం, రీతి. అష్ట. మ. క. 3.144. పు. 4పం. విణ. నిపుణమైన, చతురమైన, సరసమైన. భార. అను. 3.178 ; దశకు. 5.14. అ.క్రి. హాస్యమాడు.

సం. చతుర-. నేర్పరి, నిపుణమైన.

క. చదుర, చెదురు, తెలివి ; తు. చదుపు. నేర్పు ; మోసం ; త. చతుర. నేర్పు, ఉపాయం, చతిర్. నేర్పు, గొప్పతనం మొ. అందం ; మ. చతురమ్. తెలివి. సొంపు.

< సం. చతుర-.

చదురడుచు అ. క్రి. హాస్యమాడు. భార. ఉద్యో. 1.312. చదురుచేయు స.క్రి. చదురడుచు. చదురుఁడు వి. చతురుడు, నేర్పరి. పండి. చ. 2.113. చదురుఁదనము వి. చతురత్వం. దశకు. 6.81. చదురుమీఱు అ.క్రి. చతురత మీరు. రాజగో. 1.32. చదురుమొన వి. పన్నెండు మొనల్లో ఒకటి, మల్లబంధ విశేషం. ప్రబంధ. 78. చదురుంబదురులు వి.బ.వ. సల్లాపాలు. తాళ్ళ. సం. 3.582. చదురువాఁడు వి. నేర్పరి. భోజ సుతా. 25.

చదువఁబెట్టు చూ. చదువు.

చదువయ్య చూ. చదువు.

చదువరి చూ. చదువు.

చదువు రూ. చద్వు. స.క్రి. 1. పఠించు, పలుకు. భార. ఆది. 4.23. కు. సం. 7.3. ; 2. శుభకార్యాల్లో పురోహితుడు కానుకలను ఇచ్చేవారి పేరుతోనూ, పుచ్చుకొనే వారిపేరుతోనూ ప్రకటించు. వేంక. పంచ. 4.370 ; 3. పోగొట్టు. కళా. 6.96. వి. 1. బ్రహ్మయజ్ఞం, వేదపాఠం, వేదం. భాస్క. రా. యు. 6.15 ; 2. విద్య. ఉ. హరి. 4.55.

చదివించు స.క్రి. 1. కట్నాలు కానుకలు పురోహితుడి చేత శుభకార్యాల్లో చెప్పించు. వేంక. పంచ. 4.370 ; 2. చదువచేయు, చదివేట్లుచేయు. భాగ. 7.130 ; 3. పలికించు. పారి. 1.108. చదివింపు వి. 1. కట్నాలు పురోహితుల చేత చదివించడం ; 2. కట్నం. కానుక. చదువఁబెట్టు

స.క్రి. **1**. చదివించు. బసవ. 4పు. 339పం ; **2**. పోగొట్టు. నిరంకు. 2.116 ; కళా. 6.66 ; **చదువయ్య** వి. పండితుడు, విద్వాంసుడు. వేమన. 3.197. **చదువరి** వి. **1**. విద్యావంతుడు, పండితుడు. హరి. ఉ. 10.244 ; **2**. బట్టువాడు, వంది. సాంబ. మాన. 6. **చదువుఅంటు** అ.క్రి. చదువు వచ్చు. **చదువుకొను** స. క్రి. విద్యనేర్చుకొను. **చదువుచట్టుబండలు** వి.బ.వ. చదువు సంధ్యలు. **చదువుచెప్పు** స.క్రి. బోధించు. **చదువుతొయ్యలి** వి. సరస్వతి. చిత్ర భా. 5.10. **చదువుపిట్ట** వి. చిలక, వేంక. తిర్య. 105. **చదువులజవరాలు** వి. సరస్వతి. ఉ. రా. 2.202. **చదువులదేవర** వి. బ్రహ్మదేవుడు. అచ్చ.రా. బాల. 182. **చదువులపడతి** వి. వాణి, సరస్వతి. **చదువులపులుఁగు** వి. కీరం, చిలక. అం. నా. సం. తిర్య. 14. **చదువులముదుకఁడు** వి. నలువ, బ్రహ్మ. అచ్చ. రా. బాల. 67. **చదువులమ్మ** వి. సరస్వతి. కాశ. 2.71. **చదువులయ్య** వి. ఉపాధ్యాయుడు. **చదువులవెలఁది** వి. సరస్వతి. **చదువులవేలుపు** రూ. చూ. చదువులవేల్పు. వి. బ్రహ్మ. నీలా. 1.111. **చదువులొజ్జల కొప్పగించు** అ.క్రి. చదువుమరచిపోవు. మను. 3.129. **చదువుసంత** వి.బ.వ. చదువు సంధ్యలు. పాండు. 3.28. **చదువుసంధ్యలు** వి.బ.వ. జ్ఞానమూ, విహిత, కార్యాచరణమూ. పాండు. 2.55. **చదువుసాములు** వి.బ.వ. చదువు సంతలు.

**చద్దలించు** చూ. అద్దలించు. స.క్రి. **1**. తట్టు ; **2**. కొట్టు ; **3**. లాగు ; **4**. సర్దు.

**చద్ది** రూ.చూ. చలిది. వి. శీతగ్రాసం, చద్దిఅన్నం. విణ. చల్లని.

**చద్దిఅన్నము** వి. చద్దిబువ్వ. **చద్దికివేడికివచ్చు** అ.క్రి. పొద్దున్నా మధ్యాన్నమూ వచ్చు. తాళ్ళ. సం. 11.3. **చద్దిబువ్వ** వి. శీతగ్రాసం, పర్యుషితాన్నం. చెన్న. 3.143. **చద్దిమూటయగు** అ.క్రి. అనుభవింపక తప్పనిదగు, అవసరానికి పనికివచ్చు. తాళ్ళ. సం. 8.216. **చద్దివడు (-పడు)** అ.క్రి.ఆలస్యమై మూలపడు. **చద్దివలపుబేరము** వి. వేడితగ్గిపోయిన ప్రేమ. తాళ్ళ. సం. 12.145.

**చద్వించు** చూ. చద్వు.

**చద్వు** రూ.చూ. చదువు. స. క్రి. పఠించు, పలుకు. పండి. చ. 5.350 పు.

**చద్వించు** స.క్రి. కట్నాలు కానుకలు మొదలైనవి సమర్పించేటప్పుడు వాటిపేర్లను ఇచ్చిపుచ్చుకొనేవారి పేర్లను చెప్పి ప్రకటించు. ద. హిం. శా. సంపు. 4. శా.సం. 975. క్రీ. శ. 1353.

**చన** రూ.చూ. జన. వి. **1**. చేపలగుడ్లు ఒకటిగా కలసిఉండే కోవు ; **2**. కంటి గుడ్డులోని పదార్థం ; **3**. కోడి గుడ్డులోని పాగు.

**చనవరి** చూ. చనవు.

**చనవిచ్చు** చూ. చనవు.

**చనవు** రూ. చనువు. వి. **1**. అర్హత, ఉచితత్వం. కు. సం. 10. 183 ; **2**. అవకాశం. హరి. పూ. 9.124 ; **3**. అధికారం, పెత్తనం, ధార్ష్ట్యం. హర. 4.67 ; **4**. పరిచయం. శృం. నై. 2.55 ; **5**. కోరిక, ప్రార్థన. జైమినీ. భా. 4.117 ; **6**. అనురాగం, ప్రేమ. మను. 3.28.

**చనవరి** వి. చనువుగలవాడు, ఆప్తుడు. దశా. 2.219. **చనవిచ్చు** స.క్రి. **1**. ప్రేమతోకూడిన స్వేచ్ఛనిచ్చు. పారి. 1.97; **2**. అలుసిచ్చు. **చనవుచెల్లించు** స.క్రి. ప్రియమొనర్చు. వర.రా. బాల. 161పు. 9పం. **చనవుచెల్లు** అ.క్రి. ప్రేమతో కూడిన స్వాతంత్ర్యంసాగు. ఉ. హరి. 1.69. **చనవుతీరు** అ.క్రి. కోరికతీరు. జైమినీ భా. 6.117. **చనవురాలు** వి. చనువుగల స్త్రీ, ఇష్టురాలు. రం. రా. అయోధ్య. 99పు. 5పం. **చనవులిచ్చు** స.క్రి. ప్రేమతో కూడిన స్వాతంత్ర్యమిచ్చు. పారి. 1.150. **చనవెఱుఁగు** అ.క్రి. సమయం తెలిసికొను. కు. సం. 10.182. < చనవు + ఎఱుఁగు.

**చనవెఱుఁగు** చూ. చనవు.

**చని** వి. ముళ్ళుఎక్కువగా ఉండే ఒకరకం చెట్టు (Prosopis Spicigera).

**చనిక** వి. మట్టితో చేసిన లోతైనపాత్ర.

**చనిపోవు** చూ. చను[2].

**చను[1]** రూ. చన్ను. వి. స్తనం, వక్షోజం. భార. సభా. 1.145. సం. స్తన-; ప్రా. *థణ-* ; శౌ. *థణ* ; పా. *థన-*. <ప్రా. థణ-.

**చనుకట్టు** రూ.చూ. చన్కట్టు. వి. **1**. స్తనప్రదేశం. క్రీడా. 239, విజయ. 2.178 ; **2**. కంచుకం, రవిక. ఉ.రా. 4.175. **చనుగుబ్బ** వి. గుబ్బ వంటి చన్ను. దశా. 3.75. **చనుగొయ్య (-కొయ్య)** వి. వసికర్ర, బండి చట్టానికి రెండు పక్కలా నాటే కొయ్యల్లో ఒకటి. కు. సం. 4.83. **చనుంగవ** రూ. చన్గవ, చన్నుఁగవ. వి. కుచద్వయం, చనుదోయి. హర. 4.28, విజయ 1.150. **చనుఁగప్పు** రూ. చనుఁగప్పు, చన్గప్పు. వి. పయ్యెద, పైట. మను. 3.31. **చనుదోయి** రూ. చన్దోయి. వి. కుచద్వయం, స్తనయుగ్మం. విక్ర. 1.119. **చనుమఱ** రూ. చన్మఱ. వి. **1**. ఉరస్సు, వక్షస్స్థలం. భార. ద్రోణ. **4**.115 ; **2**. చనుమొన చుట్టూ ఉండే నల్లని భాగం. ఉ.హరి. **4**.250. **చనుమఱువు** రూ.చూ. చన్మఱువు. వి. రవిక. **చనుముక్కు** రూ. చన్ముక్కు. వి. చూచుకం. పి.శకు. 3.57. **చనుమొన** రూ. చన్మొన. వి. చనుముక్కు, చూచుకం. మను. 3.119. **చనుమోము** వి. చూచుకం. **చనుమోర** వి. చనుమోము, చనుముక్కు. **చనుఁబాల** వి. ఓషధీ విశేషం. **చనుఁబాలు** రూ.చూ. చన్నుఁబాలు. వి. స్త్రీ స్తన్యం. సారంగ. 1.44. **చన్కట్టు** రూ. చనుకట్టు. వి. **1**. స్తనప్రదేశం. కు.సం. 8.12 ; **2**. కంచుకం, రవిక. **చన్గప్పు** రూ.చూ. చనుఁగప్పు. వి. పయ్యెద, పైట. **చన్గవ** రూ.చూ. చనుంగవ. వి. కుచద్వయం, చనుదోయి, రొమ్ములజంట. ఉ.రా. 2.105. **చన్దోయి** రూ.చూ. చనుదోయి. వి. స్తనయుగ్మం, కుచద్వయం. ఆము. 1.56. **చన్మఱ** రూ.చూ. చనుమఱ. వి. **1**. ఉరస్సు, వక్షస్స్థలం. రం.రా.బాల. 27 పు. 22 పం ; **2**. చనుమొనచుట్టూ ఉండే నల్లటి భాగం. **చన్మఱువు** రూ. చనుమఱువు. వి. రవిక. వేంక. పంచ. 1.111. **చన్ముక్కు** రూ.చూ. చనుముక్కు. వి. చూచుకం. సుద. 2.93. **చన్మొన** రూ.చూ. చనుమొన. వి. చూచుకం. ఉ.రా. 1.181.

**చను[2]** అ.క్రి. **1**. పోవు, వెళ్ళు, దాడివెడలు. భార. ఆది.

1.94; **2.** ఇది తరచుగా నుఙ్యంత క్రియలకు అను ప్రయుక్తమై 'వచ్చు' మొదలైన అర్థాలిస్తుంది. భార.ఆది. 3.178; **3.** తగు, అర్హమగు. భార.ఆది. 8.208; **4.** ఒప్పు. భార.సభా. 2.14; **5.** లేకపోవు. భార.ఉద్యో. 2.83; **6** చచ్చు. భార. భీష్మ. 1.195; **7.** తీరు, నిండు, పర్యాప్తమగు. భార.ద్రోణ. 1.179; **8.** చెల్లు, సాగు. భార.ద్రోణ. 5.109; **9.** గతించు, కడచు. భార. శాంతి. 1.89; **10.** ప్రవర్తించు. విజ్ఞా. వ్యవ. 5; **11.** జరుగు, సాగు, సంఘటిల్లు, ఒనగూడు. హరి.పూ. 1.102; **12.** ప్రసిద్ధమగు. ఆము. 2.6; **13.** నశించు. ఆము. 3.70; **14.** నడచు. పారి. 5.47; **15.** నిష్ఫలమగు. శుక. 1.78; **16.** పాడగు, భ్రష్టమగు, చెడిపోవు. శుక. 2.554. స.క్రి. పొందు. భార. ఆది. 2.39.

క. *సల, సల్లు.* చేరు, ప్రవేశించు, మరణించు; తు. *సల్లుని.* తగి ఉండు, విలువ కలిగి ఉండు; *సందుని.* (కాలం) గడుపు, గతించు; త. *చెల, చెల్లు (చెన్-ఙ్-).* వెళ్ళు, తగివుండు, గతించు, గడుపు, తగ్గు, బాకీ ఉండు, వ్యాపించు, అప్పుచెల్లించు, విలువు. వెళ్ళటం; గోం. *హాండ్-(ప్-హన్-జి).* వెళ్ళు; కుయి. *సల్ప*; కువి. *హన్-, హజ్జ్.*; పర్జి. *చెన్-(చెంద్-)*; గ. *చెన్-(చెయ్-)*; కురు. *చ(ల.* దూరంగా వెళ్ళు, చెలామణీలో ఉండు; పో.చూ. ముండా. *సెన్.* వెళ్ళు, బయలుదేరు.

మూ.ద.ద్రా.*చల్.

<మూ.ద్రా.*చన్.

**చనిపోవు** అ.క్రి. చచ్చు, మరణించు. వేమన. 3.141. **చనుదెంచు** రూ. చన్దెంచు. అ.క్రి. **1.** వచ్చు. భార.ఆది. 1.94; **2.** పోవు. శృం.నై. 3.4. **చనుప** రూ. చన్ప. వి. **1.** సార్థం, సాతు, వణిక్సమూహం, వర్తకుల గుంపు. భార. అరణ్య. 2.101; **2.** మార్గం, తోవ. ఆం.భా. 2.8. **చనుమానము** వి. **1.** స్నేహం, దయ, వేంక.పంచ. 4.130; **2.** అధికారం, పెత్తనం. నిరంకు. 2.55. **చనువా(డు** విణ. చెల్లుబడిగలవాడు. భార.సభా. 1.31. **చన్దెంచు** రూ.చూ. చనుదెంచు. అ.క్రి. వచ్చు. భార.అశ్వ. 4.85. **చన్నమన్నవారు** వి.బ.వ. అందరూ, చనినవారూ, మనినవారూ. తాళ్ళ. సం. 8.205. **చన్నవారు** వి.బ.వ. గతించినవారు. గౌ.హరి. 1.115 పం. **చన్ప** రూ.చూ. చనుప. వి. తోవ, దారి, మార్గం.

**చనుపకము** రూ. చన్పకము, సంపంగి, సంపెంగ. వి. సంపెంగ చెట్టు, సంపెంగపూవు. కు.సం. 4.49.

సం. *చంపక-.* సంపెంగ; ప్రా. *చంపగ, చంపయ-.* అమా. *చంపగ-*; మరా. *చాంపా.*

క. *చంపక, సంపగె, సంపిగె, సంపెగె*; కొడ. *సంపిగె*; తు. *సంపగె, సంపిగె, సంపయి*; త. *చణ్బకమ్, చెణ్బకమ్*; మ. *చంపకమ్.*

<సం. చంపక-.

**చనువు** రూ.చూ. చనవు. వి. **1.** అధికారం, పెత్తనం, ధార్ష్ట్యం. భార. ఉద్యో. 3.328; **2.** కోరిక, ప్రార్థన. భార. భీష్మ. 3.171; **3.** పరిచయం. ఆము. 4.265; **4.** ఘనత, గొప్పతనం. యయా. 3.153.

**చన్కట్టు** చూ. చను[1].

**చన్గప్పు** చూ. చను[1].

**చన్గవ** చూ. చను[1].

**చందనకావులు** వి.బ.వ. ఒక విధమైన బట్టలు.

**చందనపుతెగులు** వి. చందనపు కట్టెలాగ కాడ ఎర్రబడే ఒకరకం తెగులు.

**చందనలాగి** వి. దేవుడి విగ్రహాలకు పూసే గంధం. ద.హిం. శా. సంపు. 6, శా.సం. 751. క్రీ.శ. 1376.

**చందమామ** వి. **1.** చంద్రుడు. ఉ.రా. 4.248; **2.** శ్రేష్ఠ వాచకం. (ఈ అర్థంలో సమాసోత్తరపదంగా ఉంటుంది). శుక. 1.226; **3.** తెగలోపల ఉండే కాడ; **4.** గుడ్డులో ఉండే పసుపుపచ్చని సొన; **5.** (తల్లి అన్న లేక తమ్ముడు) మామ.

సం. *చంద్రమస్-.* చంద్రుడు; ప్రా. అ.మా.పా.అవ. *చందిమా*;

క. *చందమామ.*

<సం. చంద్రమస్.

**చందమామకొండనాలుక** వి. మిక్కిలి తెల్లనిది. లలితమైనది, మృదువైనది, సన్ననిది. **చందమామకొమ్ము** వి. గుండ్రంగా లోపలికి వంపు తిరిగిన కొమ్ము. **చందమామ గుటకలు** వి.బ.వ. 'చందమామ రావె జాబిల్లిరావె' అనే పాట పాడుతూ తల్లి మొ. వారు పాలు మొ. వాటిని పిల్లల నోటిలో ఉంచుతున్నట్లు నటిస్తే పిల్లలు మింగుతున్నట్లు వేసే గుటకలు. విష్ణుపు. 2.51. **చందమామ గ్రుక్కిళ్లు** వి.బ.వ. **1.** చందమామగుటకలు. 'చందమామ రావె' అని పాటపాడుతూ తల్లి మొ. వారు పిల్లలనోటిలో పాలు వెన్న మొ. పెడుతున్నట్లు నటిస్తే పిల్లలు మింగుతున్నట్లు వేసే గుటకలు. శశా. 5.137; **2.** అందరాని ఫలం. **చందమామ ఘుటిక** వి. చందమామ గుటక. భీమ. 2.135. **చందమామచెక్క** వి. బండిలో నొగమీద మనిషి కూర్చోడానికి అమర్చిన చెక్క. **చందమామదేవేరి** వి. చుక్క, నక్షత్రం. రామా. 7.144. **చందమామపక్కి** వి. మత్స్య విశేషం. **చందమామపురుగు** వి. ఇంద్రగోపం, ఆరుద్రపురుగు. **చందమామపులు(గు** వి. చకోరం. నరస. 2.86. **చందమామయల్లు(డు (-అల్లు(డు)** రూ.చూ. చందమామల్లు(డు. వి. చంద్రుని అల్లుడు, మన్మథుడు. ఆం.నా.సం. దేవ. 14. **చందమామలం** వి. జొన్న మొ. పైర్లలో మొలిచి తీగగా పాకే చిన్న ఆకులు గల కలుపు మొక్క. <చందమామ+అలం. **చందమామల్లు(డు** రూ. చందమామయల్లు(డు. వి. చంద్రుని అల్లుడు, మన్మథుడు. సారంగ. 3.182.

**చందము[1]** వి. **1.** విధం, రీతి, ప్రకారం. భార.విరా. 1.42; **2.** ఆకారం, రూపం. భార.శాంతి. 4.487; **3.** మర్యాద, న్యాయం. రామా. 6.25.

సం. *ఛంద-.* మనోహరం, మూర్తి, రూపు, సంతోషం, అభిలాష; ప్రా. *ఛంద-.* అభిప్రాయం, అభిలాష, అధీనత;

క. చంద. మనోహరం, యుక్తం, అందం, రూపం, ఆకృతి, రీతి ; తు. చంద. హాయిగొల్పే ; త. చంతమ్. అందం, ఆకృతి, ప్రవర్తన ; చతతం. అందం, ఆనందం, రూపం ; మ. చంతమ్. అందమైన, రమ్యమైన.

<ప్రా. చంద-.

**చందము**[2] వి. **1**. ఛందస్సు. కళా. పీఠి. 8 ; **2**. స్థితి.

సం. ఛందస్ ; ప్రా. ఛంద- ; అ.మా. ఛంద-.

క. చంద.

<ప్రా. ఛంద-.

**చందలం** వి. చందనం, మంచిగంధం.

సం.పా. చందన-. మంచిగంధపుచెట్టు ; ప్రా. చందణ-.

<సం. చందన-.

**చందవ** వి. పాలవెల్లి.

**చందా**[1] వి. ప్రతిఫలాపేక్షతోగాని, ప్రతిఫలాపేక్ష లేకుండా గాని ఇచ్చే ద్రవ్యం.

పార. చంద. ఇతరులకు దానంగా ఇచ్చే కొంచెంకొంచెం సొమ్ము ; హిం. చందా.

<హిం. చందా.

**చందాదారు** రూ. చందాదారుడు. వి. చందా ఇచ్చే వాడు. హిం. - చందా ; పార. -దార్. మతుప్ ప్రత్యయం. <హిం. చందా + పార. - దార్. **చందాదారు(డు** రూ.చూ. చందాదారు. వి. చందాఇచ్చేవాడు. **చందావేయు** స.క్రి. చందాగా డబ్బు మొ. వాటిని ఇచ్చు.

**చందా**[2] వి. దేశ విశేషం.

**చందాకెంపు** వి. ఒక జాతి కెంపు, చందా దేశానికి సంబంధించిన కెంపు. సమీర. 2.67. ఉ.రా. 4.252.

**చందినీ** వి. అత్తరు. వి. చందన తైలం, మంచి గంధపు నూనె.

**చందిరిక** వి. వెన్నెల. వై.దీ. 47.

సం. చంద్రికా. వెన్నెల ; ప్రా. చందిఆ ;

క. చందిరిక.

<సం. చంద్రికా.

**చందు**[1] వి. **1**. చంద్రుడు, నెల. ఉ.రా. 6.77 ; **2**. నెల, మాసం. సాంబ. దేవ. 13 ; **3**. అందం. శశా. 2.46.

సం. చంద్ర-. చంద్రుడు ; ప్రా. చంద- ; పా. చంద- ; హిం. చాఁద్ ;

క. చందు.

<ప్రా. చంద-.

**చందుకొమ్ము** వి. చందమామ కొమ్ము. **చందుచట్టు** వి. చంద్రకాంతమణి. ఉ.రా. 6.126. **చందునయ** రూ.చూ. చందునయ్య. వి. చంద్రుని తండ్రి, సముద్రుడు. సాంబ. దేవ. 17. **చందునయ్య** రూ. చందునయ. వి. చంద్రుని తండ్రి, సముద్రుడు. వేంక. ఆం. దేవ 18. **చందురా** రూ. చందుణా. వి. చంద్రకాంతమణి. ఉ.రా. 4.172. **చందుణా** రూ.చూ. చందురా. వి. చంద్రకాంత మణి. ఉ.రా. 6.173.

**చందు**[2] చూ. చందము[1]. విశే. **1**. హితమైన, పథ్యమైన, నిర్వ.రా. 4.65 ; **2**. అందమైన. వి. అందం, ఒప్పు. శశా. 1.46.

సం. సౌందర్య-. అందం ; ప్రా. సుందేర-.

**చందుకాపెట్టె** రూ.చూ. చందుగుపెట్టె. వి. మందసం.

**చందుగా** రూ.చూ. చందుగు[2]. వి. చిన్న పెట్టె.

**చందుగు**[1] వి. వృక్ష విశేషం. యయా. 5.48.

**చందుగు**[2] రూ. చందుగా, చిందువ[2]. వి. చిన్న పెట్టె, అల్ప మంజూష. నీలా. 3.86.

హిం.ఉ. సందూక్. పెట్టె ; మరా. సందూక్.

**చందుగుపెట్టె** రూ. చందుకాపెట్టె. వి. మందసం.

**చందురకావి** చూ. చందురము.

**చందురకావిపుట్టము** చూ. చందురము.

**చందురజోతి** చూ. చందురము.

**చందురపూవు** చందురము.

**చందురమామ** చూ. చందురు(డు.

**చందురము** రూ.చూ. చెందిరము. వి. సింధూరం.

**చందురకావి** రూ. చందురుకావి. వి. **1**. చంద్రకావి, సింధూర వర్ణం. మను. 6.5 ; **2**. ఎర్రబట్ట. ప్రబంధ. 272. <చందురము + కావి. **చందురకావిపుట్టము** రూ. చందురుకావి పుట్టము. వి. అరుణ వస్త్రం. **చందురజోతి** రూ. చందురుజోతి. వి. పగలువత్తి, ఒక విధమైన బాణాసంచా. <చందురము + సం. జ్యోతి-. **చందురపూవు** వి. కుసుంబ పుష్పం. <చందురము + పూవు.

**చందురుకావి** రూ.చూ. చందురకావి. వి. సింధూర వర్ణం.

**చందురుకావిపుట్టము** రూ.చూ. చందురకావి పుట్టము. వి. అరుణ వస్త్రం.

**చందురుకూనలు** చూ. చందురు(డు.

**చందురుజోతి** రూ.చూ. చందురజోతి. వి. ఒక విధమైన బాణా సంచా.

**చందురు(డు** వి. చంద్రుడు, చంద్ర గ్రహం. కు.సం. 5.147.

సం. చంద్ర-, చందిర-. చంద్రుడు. అ.మా. పా. చంద్ర-, అప. చంద్రు ; బెం. చందర- ; ఒరి. చందో ; హిం. చాంద్ ; మరా. చంద్ర, చాంద.

క. చందిర. కొడ. చణ్ణురో.

<సం. చంద్ర-.

**చందురమామ** వి. చంద్రుడు. నరస. 2.121. సం. చంద్రమా. చంద్రుడు, చంద్ర-. <సం. చంద్ర-+ మామ. **చందురుకూనలు** వి.బ.వ. నక్షత్రాలు. ఆం.భా. 2.180. **చందురురాయి** వి. చంద్రకాంతమణి, ఇందుమణి. విజయ. 3.189. **చందురువంకలు** వి.బ.వ. నక్షత్రాలు, సందిట నక్షత్రాలు.

**చందురురాయి** చూ. చందురు(డు.

**చందురువంకలు** చూ. చందురు(డు.

**చందువ** రూ.చూ. చందువా. వి. **1**. ఆస్తరణ విశేషం, తివాసీ, కంబళి మొ॥ హంస. 5.356 ; **2**. మేలుకట్టు, వితానం. శశా. 3.104.

**చందువా** రూ. చందువ, చంద్వా. వి. మేలుకట్టు, వితానం. అని. 1.57.

సం. చంద్రాతప- ; ప్రా. చందఅ ; నే. చందువా ; మరా. చాందవా.

<ప్రా. చందఅ.

చందువాయి వి. పొట్టిగా తెల్లగా ఉండే ఒక చేప.

చందూక చూ. చందుగు². వి. చిన్న పెట్టె.

హిం. సందూక్ ; మరా. సంజూక్, సందూక్. పెట్టె ; ఉ. సందూక్. పెట్టె ; అర. సందూక్. చిన్న పెట్టె.

<ఉ. సందూక్.

చన్దెంచు చూ. చను².

చందెబల్లింద వి. దుర్మార్గుడు. చెన్న బసవ. 33.

చన్దోయి చూ. చను¹.

చంద్రకాంతలు వి.బ.వ. భక్ష్య విశేషం.

చంద్రకావి చూ. చంద్రము.

చంద్రపారవ వి. ఇంటి కొలతల్లో ఉత్తర దక్షిణ భాగాల్లో వచ్చే హెచ్చు తక్కువలనే దోషం.

చంద్రపాద వి. ఒకానొక లతా విశేషం (Hrgyrica speciosa).

సం. చన్ద్ర-. చంద్రుడు.

<సం. చంద్ర- + పాద.

చంద్రము రూ. చెందిరము. వి. సిందూరం. ఉ.హరి. 3.86.

సం. సిందూర-. రాగద్రవ్య విశేషం.

<సం. సిందూర-.

చంద్రకావి వి. 1. చందురకావి, సిందూర వర్ణం. రామా. 1.169 ; 2. వస్త్ర విశేషం. రాజవా. 2.164.

<చంద్రము + కావి.

చంద్రరోగం వి. ఒక రకం పేను తెగులు.

చంద్రవంక వి. చంద్ర కళల్లాగా వంకరగా ఉండే ఆభరణ విశేషం.

సం. చన్ద్ర-. చంద్రుడు.

<సం. చంద్ర- + వంక (మిశ్రన.).

చంద్రవంకలు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.

చంద్రహారము వి. ఆభరణ విశేషం.

<సం. చంద్రహార- (అర్థవిపరి.).

చంద్వా రూ.చూ. చందువా. వి. మేలుకట్టు, వితానం. ద.హిం.శా. నం. 975. క్రీ.శ. 1353 నం.

చన్నంగి రూ.చూ. చెన్నంగి. వి. పొట్టి కొబ్బరి చెట్టు.

చన్నమనోహరాలు వి.బ.వ. ఒక విధమైన పిండి వంట. ద.హిం.శా. సంపు. 6 శా. నం. 695 క్రీ.శ. 1519 నం.

చన్నమన్నవారు చూ. చను².

చన్నవారు చూ. చను².

చన్నవియు చూ. చన్ను¹.

చన్నవిసిపాలుపిదుకు చూ. చన్ను¹.

చన్నిచ్చు చూ. చన్ను¹.

చన్నిడు చూ. చన్ను¹.

చన్నీళ్ళు వి.బ.వ. చల్లని నీళ్ళు, శీతోదకం.

క. తు. తణ్ణీర్. చల్లని నీరు ; త.మ. తణ్ణీర్, తణ్ణీ.

<చల్ల + నీళ్ళు.

చన్ను¹ రూ.చూ. చను¹. వి.బౌ. 1. స్తనం. భార. ఆది. 3.27 ; 2. స్తన్యం. రం.రా. అయోధ్య. 115 పు. 18 పం. ; 3. మొగలి ఊడ. కవిక. 4.113 ; 4. మేక మెడ నుంచి వేలాడే చర్మ విశేషం, అజాగళ స్తనం. అడిదం సూరన చాటువు. 110 పు ; 5. తాటి ముండు, తాటి చన్ను ; 6. సారెపలక మధ్యభాగంలో ఉబ్బెత్తుగా ఉండే కుండకట్టు.

చంటితనము వి. శైశవం. చంటిది వి. చనుపాలు తాగే పిల్ల. చంటిపాప రూ.చూ. చంటిపాపఁడు. వి. చనుపాలు తాగే పిల్లవాడు. వేంక. పంచ. 4.450, ఆం. భా. 2.118. చంటిపాపఁడు రూ. చంటిపాప. వి. పాలు తాగే శిశువు. వేంక. పంచ. 4.444. చంటిపిల్ల వి. శిశువు. చంటిబిడ్డ వి. పాలు తాగుతున్న పసిబిడ్డ. చంటివాఁడు రూ. చంటోడు. వి. పాలుతాగే శిశువు. ఆం.భా. 2.118. చంటోడు రూ.చూ. చంటివాఁడు. వి. 1. స్తనాలున్న పురుషుడు (ఎగతాళికన్న మాట) ; 2. పసిబిడ్డ. చన్నవియు అ.క్రి. ఆవులు మొ॥ వాని చన్నులు చేపు. <చన్ను¹ + అవియు. పి. శకు. 1.13. చన్నవిసిపాలుపిదుకు అ.క్రి. పుష్కలంగా పాలిచ్చు. విష్ణుపు. 2.146. చన్నిచ్చు అ.క్రి. తల్లిపాలిచ్చు. హరి.పూ. 5.156. చన్నిడు అ.క్రి. తల్లిపాలిచ్చు. హంస. 4.150. చన్నుఁగప్పు (-కప్పు) రూ.చూ. చనుఁగప్పు. వి. పయ్యెద, పైట. యయా. 4.19. చన్నుఁగవ రూ.చూ. చనుఁగవ. వి. కుచద్వయం, రొమ్ముల జంట. కు. సం. 4.115. చన్నుబుజ్జగ వి. పిల్లలకు పాలు పట్టించడానికి వాడే చిన్న మట్టి బుడ్డి. చన్నుబుడ్డి వి. పిల్లలకు పాలు తాగించడానికి వాడే చిన్న మట్టి బుడ్డి. చన్నుఁబాలు రూ. చనుఁబాలు. వి. స్తన్యం. హరి. ఉ. 4.233.

చన్ప చూ. చను².

చన్పకము రూ.చూ. చనుపకము. వి. సంపెంగ. కాళిందీ. 1.80.

చన్మఱ చూ. చను¹.

చన్మఱువు చూ. చను¹.

చన్ముక్కు చూ. చను¹.

చన్మొన చూ. చను¹.

చపచపగా క్రి.విశే. వ్యర్థంగా. నవనాథ. 1.68 పు. 2 పం.

చపచపచేయు స.క్రి. సపాచేయు, చంపు. రం.రా. యు. 3 పు. 2 పం.

చపచపన విశే. వ్యర్థమైన. నవనాథ. 2.83 పు. 20 పం.

చపచపనగు అ.క్రి. వ్యర్థమగు. కకుత్స్థ. 5.162.

<చపచపన + అగు.

చపట రూ.చూ. చప్పటం. వి. ఇటిక తారస రాళ్ళను వాటి మందంమీద పడుకోబెట్టటం.

చపరం రూ.చూ. చపారం. వి. తడక కప్పుగల మంచె.

చపా విశే. పక్క. అని. 3.19.

ఉ. చప్. ఎడమపక్క ; పార. చపా.

<ఉ. చప్.

చపాయించు స.క్రి. దొంగిలించు.
చపారం రూ. చపరం, చప్పర. వి. తడిక కప్పుగల మంచె.
చపురాసి రూ.చూ. చప్రాసి. వి. నౌకరు.
చప్టా రూ.చూ. చప్పటం. వి. ఇటిక తారన రాళ్ళను వాటి మందంమీద పడుకోబెట్టటం.

చప్టాగోలు వి. పట్టెల మూలల్లో చదునుగా తీసే గాడి. చప్టాబల్ల వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

చప్డు రూ.చూ. చప్పుడు. వి. ధ్వని, సద్దు. కాశీ. 5.189.
చప్పు[1] వి. ముద్ర. ఆం.భా. 2.226.

క. చప్పె. ముద్ర; త. చప్పై.

హిం. ఛాపా.

చప్పు[2] రూ. చప్పం. వి. 1. రథాన్ని సరైన తోవకు తిప్పటానికి చక్రాలకింద పెట్టే ఆరోకగా చెక్కిన మాను ముక్క; 2. రాళ్ళు తవ్వడానికి వాడే పలుగువంటి ఉక్కు మేకు, రథచక్రాల కింద పెట్టే మాను ముక్క; 3. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో దూర్చే కొయ్య ముక్క.

చప్పుగొర్రు వి. 1. మాగాణిలో విత్తక ముందు చదును చేయటానికి, విత్తిన తర్వాత కలుపుగడ్డి పోవటానికి తోలే పరికరం; 2. ఏడికోలను పణతలో దూర్చేచోట దుంప సందులో అవసరాన్ని బట్టి ఎలువు సలువులకు కొట్టే పేడు.

చప్పు[3] రూ. చవ్వ. క్రి.విణ.ద్రు. రసహీనంగా. దశా. 4.119. విణ. చప్పని, రుచిలేని, నిస్సారమైన.

క. చప్పెగె, సప్పగె, సప్పనె. చప్పదనం; కొడ. చప్, చపిళి. చప్పని; తు. చప్పఉ. చప్పని; త. చప్పై. రుచిలేని. పర్జీ.గ.నా. ఒల్గా. చ్యపె. చప్పని;

పో.చూ. సం. చపలు-. రసహీనమైన.

చప్పుకాల్వు వి. ఆములో పాత్ర బాగా కాలని స్థితి. చప్పన విణ. 1. చప్పని, ఉప్పు, కారం మొ. నవి లేని. ఆం.భా. 1.105; 2. రసహీనమైన, నిస్సారమైన. వి. చప్పదనం. చప్పని విణ. నిస్సారమైన. సు.శ. 103. చప్పిడి[1] విణ. 1. రసహీనమైన, నిస్సారమైన. హరి.పూ. 9.77; 2. ఉప్పు పులుసూ కారం లేని. ఆం.భా. 1.105. వి. ఉప్పూకారం మొ. నవి లేని పదార్థం. శుక. 2.444.

చప్పు[4] వి. చట్ట. నవనాథ. 1.38. పు. 7 పం.
చప్పం రూ.చూ. చప్పు[2]. వి. రాళ్ళు తవ్వడానికి వాడే పలుగు వంటి ఇనప మేకు.
చప్పట[1] వి. చపేటం, వేళ్ళుచాచిన అరచేయి. భీమ. 4.152.

క. చప్పళె, చప్పళి. చప్పట్లు; త. చప్పాణి. చప్పట్లుకొట్టడం; కోలా. చపత్. చప్పట.

సం. చర్పటు-, చపేట-.

చప్పటలిడు అ.క్రి. చప్పటలు కొట్టు. పండి.చ. 5.440 ప. <చప్పట+-లు+ఇడు. చప్పటలు రూ.చూ. చప్పట్లు. వి.బ.వ. వేళ్ళుచాచిన అరచేతులు ఒకదానితో ఒకటి కలిసేటట్లు కొట్టే దెబ్బలు. చప్పటలుగొట్టు (-కొట్టు) అ.క్రి. వేళ్ళుచాచిన అరచేతులను ఒకదానితో ఒకటి కొట్టు. ఆము. 3.22. చప్పటలుచరచు అ.క్రి. చప్పట్లు కొట్టు. అచ్చ.రా.యు. 90. చప్పటలువెట్టు (-పెట్టు) రూ. చప్పట్లు పెట్టు. అ.క్రి. చప్పట్లుకొట్టు. హరి.పూ. 4.155. చప్పటలు వేయు అ.క్రి. చప్పట్లుకొట్టు. చెన్న బసవ. 5.192. చప్పటించు స.క్రి. చరుచు, కొట్టు. కాశీ. 6.278. చప్పట్లు రూ. చప్పటలు, తప్పటలు, తప్పట్లు. వి.బ.వ. వేళ్ళు చాచిన అరచేతులు ఒకదానితో ఒకటి కలిసేటట్లు కొట్టే దెబ్బలు. ఆము. 4.163. చప్పట్లువెట్టు రూ.చూ. చప్పటులు పెట్టు. అ.క్రి. చప్పటులుకొట్టు.

చప్పట[2] విణ. అణిగిన. ఆము. 2.56. వి. 1. వాసాలమీద రాళ్ళు పరచి సున్నంతో అతికి వేసిన కప్పు; 2. చదునుగా ఉన్న స్థితి.

సం. సపట్ట-. సమతలం; హిం. సపాట్.

<హిం. సపాట్.

చప్పటలగు అ.క్రి. 1. అణగు, అదుముడు పడు. ఆము. 5.21; 2. సన్నగిల్లు. చప్పట్రాయి రూ.చూ. సప్పటరాయి. వి. అడుగురాయి, ఇంటి నేలమీద పరిచే పలచని రాయి.

చప్పట[3] వి. నాలుగు భుజాలు గలది, చతురస్రం.
చప్పటం రూ. చపట, చప్టా. వి. ఇటిక తారన రాళ్ళను వాటి మందం మీద పడుకో బెట్టడం.

హిం. చిప్టా. చప్టా.

<హిం. చిప్టా.

చప్పటించు చూ. చప్పట[1].
చప్పట్రాయి చూ. చప్పట[2].
చప్పట్లు చూ. చప్పట[1].
చప్పట్లువెట్టు చూ. చప్పట[1].
చప్పతల వి. పంగ కొమ్ముల తల.
చప్పన్న రూ.చూ. ఛప్పన్న. వి. యాభైయారు.

చప్పన్నదేశాలు రూ. చెప్పన్న దేశాలు. వి.బ.వ. యాభైఆరు దేశాలు.

చప్పర రూ.చూ. చపారం. వి. తడిక కప్పుగల మంచె.

చప్పరకోళ్లమంచము వి. పందిరిమంచం. దశా. 1.269. చప్పరకోళ్లసకినెలమంచము వి. సకినెలుగల పందిరిమంచం. దశా. 4.103. చప్పరమంచము వి. పందిరి మంచం. వసు. 4.78.

చప్పరం వి. పందిరి, శిబిరం.
చప్పరము రూ. చప్రము. వి. 1. కాయమాన విశేషం. కు.సం. 6.97; 2. గుడారం, పటగృహం. భార.సౌప్తి. 1.147; 3. నృత్యాది వినోదాలకోసం ఎత్తుగా కట్టిన మంచె. హర. 5.6; 4. మండపం. చంద్ర భా. 4.67; 5. దేవతా విగ్రహాల్ని ఉంచి ఊరేగించటానికేర్పరచిన కప్పుగల కట్టడం; 6. పందిరి, తీగలకు అల్లుగా పెట్టిన కప్పు, మంచెపైన వర్షం పడకుండా వేసిన కప్పు.

సం. ఛత్త్వర-. కప్పు; ప్రా. ఛప్పర-; నే. ఛాప్రో. బెం. ఛాపర్; మరా. ఛప్పర్;

క. చప్పర; తు. చప్పర; త. చప్పరం; మ. చప్పరం, చ్ప్రప; తొ. సొపార్క్.

<ప్రా. చప్పర-.

చప్పరముపాకిటిఅంగరక్ష వి. గృహాంగణద్వారాన్ని కాపలా కాసేవాడు. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 705. క్రీ.శ. 1269 సం.

చప్పరించు రూ. చప్పలించు. స.క్రి. 1. నిమురు. కు.సం. 8.101; 2. నిర్లక్ష్యంచేయు. బసవ. 4 పు. 724 పం; 3. ఒప్పించు, సమ్మతింపజేయు. పండి.చ. 1.52 పు.; 4. నాలికమీద వేసికొని భక్ష్యాదుల రసం కొంచెం కొంచెంగా పీల్చు, నాకు, నములు. భాస్క. రా. యు. 2.555.

క. చప్పరిసు. చప్పరించు; తు. చప్పరిపుని. పెదాలు తాటించడం, చట, చప్పరించు; త. చప్పు, చప్పి. నములు, తింటూ గొణుగు, పీల్చు, చవట్టు, చవట్టి. నములు, మింగు, చప్పై(-ప్పి-,త్-). నములు, తల్లిదగ్గర పాలు తాగు; మ. చప్పుక, చవచ్చల్. నమలడం; మాల్తో. చప్, చప్పై, చొప్యె. నమలడం.

చప్పరించుమెకము వి. పంది, సూకరం.

చప్పరింత చూ. చప్పరించు. వి. 1. చప్పరించటం, నాకటం. పాంచాలీ. 4.59; 2. వరాహం, పంది. సాం.బ. తిర్య. 75.

చప్పలించు రూ.చూ. చప్పరించు. స.క్రి. 1. లొట్టలువేయు. కు.సం. 11. 129; 2. కొరుకు. మైరా. 1.51.

చప్పల్స్ వి.బ.వ. పాదరక్షలు.

ఇం. *Chappals*. పాదరక్షలు.

<ఇం. Chappals.

చప్పాతిపురుగు వి. లక్కపురుగు, ఆరుద్రపురుగు.

చప్పావని రూ. చొప్పావని. వి. అర్ధకంపని.

చప్పి[1] రూ. సప్పి. వి. దురదతో కూడిన నీటిపొక్కుల రోగం.

చప్పి[2] విశ. రుచిలేని, నిస్సారమైన.

చప్పికొమ్ము రూ.చూ. చప్పిడికొమ్ము. వి. వెనుకకు బాగా వాలిన కొమ్ము.

చప్పిడి[1] చూ. చప్పు[3].

చప్పిడి[2] చూ. చప్పు[3]. వి. 1. పొలంలో పడినవాన నీళ్ళకు మట్టికొట్టుకు పోకుండా పల్లంగా ఉన్నవైపు గట్టు చివర కట్టిన రాతి కట్టడం; 2. మొగరం మీది దూలం పొర్ల కుండా దోజెమీద వేసిన చెక్క. విశ. లోపలికి అణగి పోయిన.

చప్పిడికొమ్ము రూ. చప్పికొమ్ము. వి. వెనుకకు బాగా వాలిన కొమ్ము. చప్పిడిజాడ్యం వి. రాగితెగులు, గింజలు లేని ఎన్ను లేర్పడే తెగులు. సం. జాడ్య-. జడత్వం. <చప్పిడి + సం. జాడ్య-. చప్పిడిముక్కు రూ.చూ. చప్పిముక్కు. వి. లోపలకు ఉన్న ముక్కు. చప్పిడిరాయి వి. చేదుడు బావి కట్టగా వేసిన రాయి. చప్పిముక్కు రూ. చప్పిడిముక్కు. వి. లోపలికి ఉన్న ముక్కు. హరిశ్చ. 4.168. చప్పిరాతబండ రూ.చూ. చప్పిరిపాతబండ. వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోడానికి తడిగుడ్డను పెట్టుకొనే రాయి. చప్పిరిపాత బండ రూ. చప్పిరాత బండ. వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోడానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

చప్పిముక్కు చూ. చప్పిడి[2].

చప్పిరాతబండ చూ. చప్పిడి[2].

చప్పిరిపాతబండ చూ. చప్పిడి[2].

చప్పు స.క్రి. నములు, చప్పరించు. కాశ. 4.137.

క. జప్పిసు. తాగు, పీల్చు; తు. చప్పరిపుని. ముద్దుపెట్టుకొను, సబిపుని. రుచిచూచు; త. చప్పు, చప్పళించు. నములు, పటపట నములు. చవట్టు, (చవట్టి-), చప్పై (-ప్పి-, త్-); మ. చప్పుక, చవక్క. నములు; కో. చప్. అధికంగా నములు

చప్పుడించు చూ. చప్పుడు.

చప్పుడు రూ. చప్పు. వి. ధ్వని. భార. ఆరణ్య. 3.295.

క. సప్పళ్, సప్పళ్, సొప్పళ్. సద్దు. చప్పుడు, శబ్దం.

చప్పుడించు అ.క్రి. చప్పుడుచేయు, ధ్వనిచేయు. భాగ. 10. పూ. 1140. చప్పుడుచేయు స.క్రి. మెత్తగా చితకకొట్టు.

చప్పున రూ. జప్పున, తప్పున. క్రి. విశ. ద్రు. శీఘ్రంగా.

చప్పెట వి. చప్పరం, కప్పుగల కట్టడం.

చప్రము రూ.చూ. చప్పరము. వి. 1. పందిరి. ఉ.హరిశ్చ. 4.64; 2 దేవతా విగ్రహాల్ని వుంచి ఊరేగించటాని కేర్పరచిన కప్పుగల కట్టడం, మండపం.

చప్రాసి రూ. చపురాసి. వి. నౌకరు.

<హిం. చప్‌రాసీ. నౌకరు.

చబుకు రూ. చవుకు, చౌకు. వి. కొరడా, చేరుకోల. పల్నా.పు. 119.

హిం. మరా. ఉ. పార. చాబుక్. కొరడా; క. చబుక్.

<ఉ. చాబుక్.

చబుకుసేయు (-చేయు) స.క్రి. చబుకుతో కొట్టు, తరటు చేయు. జైమినీభా. 6.53.

చబుత్తర రూ.చూ. చబూత్రా. వి. అరుగు. ఇంటిముందు బల్లపరుపుగా కట్టి పక్కలు మూయబడి ఎత్తుగా ఉండే నిర్మాణం.

చబూత్రా రూ. చబుత్తర. వి. బావికి, చుట్టూ కట్టిన అరుగు.

హిం. చబూత్రా. సమతలంగా ఉన్న ఎత్తైన ప్రదేశం.

<హిం. చబూత్రా.

చమకు వి. ఒకరకం కలుపు మొక్క (Easuarianaceae).

చమక్కు వి. తమాషా.

హిం. చమక్. కాంతి.

<హిం. చమక్ (అర్థవిపరి.).

చమట రూ.చూ. చెమట. వి. స్వేదం. నవనాథ. పు. 145.

చమడా రూ.చూ. చమ్డా. వి. తోలు.

చమడాలూడగొట్టు స.క్రి. చర్మం ఒలిచివేయు. <చమడా +-లు + ఊడు +- అ[7] + కొట్టు. చమడాలెక్కగొట్టు స.క్రి. చమడాలూడ గొట్టు <చమడా +- లు + ఎక్కు + -అ[7] + కొట్టు.

చమన్‌బుద్ధి వి. పెద్దగురిగె లాగఉండే మందుబుద్ధి.

హిం. ఉ. పార. చమన్. చిన్నతోట.

చమర రూ.చూ. చెమట. వి. స్వేదం.

చమరు[1] రూ.చూ. చమురు. వి. నేయి. ద. హిం. శా. సంపు. 10శా. సం. 427. క్రీ. శ. 1270.

చమరు[2] రూ. చరుము. స.క్రి. 1. నలుచు, రాచు. భార. ఆది. 5.177 ; 2. కొట్టు, చరచు. భార. ఆది. 6.204 ; 3. చంపు. భార. అరణ్య. 6.26.

క. చప్పరిసు, చప్పలిసు. చరచు ; తు. చప్పలిపుని ; త. చప్పణి. చప్పట్లు చరచడం ; చప్పు. నలుచు, అణగగొట్టు, సమంగాఅగు ; కో. చ్మల్స్. గుబురుగా ఉన్న చెట్లను నరుకు.

సం. చపేట-. అరచేతిదెబ్బ.

చమరు(గాకి రూ. చెమరు(గాకి. వి. ద్రోణకాకం, ఒకజాతికాకి.

చమరుచు రూ.చూ. చెమర్చు. అ.క్రి. 1. చెమటగలదగు ; 2. చెమ్మగిలు.

చమిటెద్దు వి. ఆరుబయట పడుగుచాపటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు.

చమురగు చూ. చమురు.

చమురు. రూ. చమరు1. స.క్రి. పూయు, రాచు. విజ్ఞా. ఆచా. 39. వి. 1. నూనె మొ. స్నేహద్రవ్యం. దశకు. 10.105 ; 2. నెయ్యి. సాంబ. మాన. 47.

క. సవరు. పూయు, రాయు ; త. తిమిర్. పూయు ; మ. అప్పి, అప్పు. పాంశాస్త్రి.

చమురగు అ.క్రి. చమురు అంటుకొను. ఆము. 6.6. చమురు కాళ్ళపెద్దమ్మ వి. 1. దురదృష్టవంతుడు ; 2. చేతకానివాడు, సోమరి. చమురుకొమ్ము వి. నూనెపోసుకొనే దుప్పికొమ్ము. చమురుగురిగి వి. నూనెపోసుకొనే చిన్నపాత్ర, పిడత. చమురుచిప్ప వి. నూనె పోసుకొనే చిప్ప. చమురుచెంబు వి. నూనె పోసిన పాత్ర. చమురుదీసినదివ్వె. వి. ఆరిపోయిన దీపం. తాళ్ళ.సం. 11.3. చమురుపెనం వి. నూనెవంచుకోడానికి ఏనుగు తొండంలాగ పెట్టి చేసిన మట్టిపాత్ర. చమురువత్తి వి. చమురున్న వత్తి.

చమ్డా రూ. చమడా. వి. 1. డేగకాలి గోళ్ళు గుచ్చుకోకుండా చేతికి కట్టుకొనే చర్మం ; 2. చర్మం, తోలు.

హిం. చమ్‌డా. చర్మం, తోలు ; మరా. చామ్‌డే, చామ్, చాంబడే. తోలు, చర్మం ; ఉ. చమ్డా. తోలు.

<ఉ. చమ్డా.

చంపించు చూ. చంపు.

చంపిపుట్టు చూ. చంపు.

చంపు చూ. చచ్చు. స.క్రి. 1. చచ్చేటట్లు చేయు. భార.సభా. 1.198 ; 2. పీడించు, బాధపెట్టు. ఆము. 3.32.

చంపించు స.క్రి. 1. చంపుకు ప్రేరణార్థకం, చంపేటట్లు చేయు ; 2. మలుచు, రాతినిచెక్కు. చంపిపుట్టు అ.క్రి. దుష్టత్వంలో ఒకరికంటె మించినవాడగు. చంపుకతిను స.క్రి. వేధించు, బాధించు. చంపుడు వి. చంపటం, మారణం, హింస. ఆం. భా. 2.224 ; చంపుడుగట్ట (-కట్ట) వి. వధ్యస్థానం. కాశీ. 5.169. చంపుడుగట్టు వి. వధ్యస్థానం.

చమ్మ[1] రూ. తంబ, తమ్మ. వి. శింబి. వృక్షవిశేషం. ఆం. భా. 2.72.

చమ్మ[2] విశే. సుఖకరమైన.

చమ్మ(దనము వి. సుఖం.

చమ్మ[3] వి. మినువులు, కందులు మొ. వాటిపొట్టు.

చమ్మెట(వేయు స.క్రి. సమ్మెటతోకొట్టు. ఉ. హరి. 4.206.

చయ్యన క్రి. విశే. ద్రు. శీఘ్రంగా. భార.అరణ్య. 3.284.

చరచర వి. 1. శీఘ్రం. ప్రబంధ. 778 ; 2. బాణగమనాదుల వేగజన్య ధ్వనికి అనుకరణం.

క. చరచర ; త. సరసరప్పు.

చరచి వి. పెద్దఆకులు కల్గిన చెట్టు (Grewiatiliaefolia).

చరచు రూ.చూ. చఱచు. స.క్రి. 1. అరచేతితో కొట్టు, కొట్టు ; 2. మల్లచరచు.

చరచురాయి వి. మట్టిని మెత్తగా నలగ్గొట్టడానికీ, మట్టిపాత్రలను దట్టించడానికీ కుమ్మర్లు వాడేరాయి.

చరలాట చూ. చరలు.

చరలాటము చూ. చరలు.

చరలాడు చూ. చరలు.

చరలు రూ.చూ. చెరలు. అ.క్రి. క్రీడించు, ఆడు. కాశీ. 2.43.

చరలాట రూ.చూ. చర్లాటము. వి. క్రీడ. కళా. 3.10. చరలాటము రూ.చూ. చర్లాటము. వి. క్రీడ. చరలాడు రూ. చూ. చెరలాడు. అ.క్రి. ఆడు, క్రీడించు. శివరా. 3.96.

చరవ వి. చరికుండ.

చరాలున రూ. చూ. చరాల్న. క్రి.విశే.ద్రు. శీఘ్రంగా.

చరాల్న రూ. చరాలున. క్రి.విశే.ద్రు. శీఘ్రంగా. రంగా. చ. 1.62.

చరి వి. గంజి.

చరికుండ వి. చేనేతపనిలో ఉపయోగించే గంజికుండ. హంస. 2.11. చరిపూయు స.క్రి. గంజిపూయు.

చరిగిన్చు రూ.చూ. జరిగించు, స.క్రి. జరిగేటట్లుచేయు.

చరిగెలు వి.బ.వ. ఒకవిధమైన పొల్లుధాన్యం.

చరిజ వి. గీతిభేదం. పండి. చ. 5.342పు.

చరిది వి. కక్కురోగం. ద్వి. పరమ. 7.510పు.

సం. ఛర్ది-, ఛర్దిస్. కక్కురోగం.

<సం. ఛర్ది-.

చరియ రూ.చూ. చఱి. వి. పర్వత నితంబభూమి, కొండవాలు.

చరుక వి. పశురోగ విశేషం. ఆం. భా. 2.125.

చరుగుడు వి. ఎడ్లను కట్టి చొప్ప మొ. తీసుకొనిపోయే శాధన విశేషం, ఈడిక.

చరుచు రూ.చూ. చఱచు. స.క్రి. అరచేతితోకొట్టు.

చరుపుడుచెక్క వి. మట్టిని మెత్తగా నలగగొట్టడానికీ, మట్టిపాత్రలను దట్టించడానికీ కుమ్మర్లు వాడేసాధనం.

చరుపుడుపలక వి. ఆకుకప్పు మీద మిట్టపల్లాలు సరిచేసే చెక్కసాధనం.

చరుపుడురాయి వి. సలవతో పెంకును కొట్టేటప్పుడు ఆధారంగా ఉండేరాయి.

చరుము రూ.చూ. చమరు[2]. స.క్రి. 1. మెల్లగారాయు. భాస్క. రా. అరణ్య. 81 ; 2. వాద్యాన్ని చరుచు. ప్రబంధ. 21 ; 3. నిమురు ; 4. గడ్డికప్పుమీద కర్రతో కొట్టు. 5. గంజిరుద్దు, గంజిపాము. 'చమురు[2]' యొక్క వర్ణవ్యత్యయరూపం.

చరువు రూ.చూ. చెఱువు. వి. చుట్టూ గట్టుగల జలాశయం,

కొలను.

**చర్చి** వి. క్రైస్తవ దేవాలయం, క్రైస్తవ సంఘం.

ఇం. *Church.* క్రైస్తవ దేవాలయం.

< ఇం. Church.

**చర్పర్** వి. తొమ్మిదేసి, పదకొండేసి, పన్నెండేసి పావులతో ఇద్దరాడే ఆట.

**చర్మం** వి. కమిడిలో కూర్చునేటప్పుడు కుమ్మరి కింద పరుచుకొనే గొర్రెతోలు.

సం. చర్మన్-. తోలు.

< సం. చర్మన్- (అర్థవిపరి).

**చర్మంతీసి చెప్పులు కుట్టించు** స.క్రి. మిక్కిలి కృతజ్ఞత చూపు.

**చర్మశము** వి. కటాసనం, చదర. అం. భా. 2.165.

**చర్రన** రూ.చూ. చర్రున. క్రి.విశే.ధ్వ. శీఘ్రంగా, జారడం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. శీఘ్రంగా, వేగంగా.

**చర్రున** రూ. చర్రన. క్రి. విశే.ధ్వ. శీఘ్రంగా, వేగంగా. ధ్వన్యను.

**చర్లాట** రూ.చూ. చర్లాటము. వి. క్రీడ.

**చర్లాటమాడు** చూ. చర్లాటము.

**చర్లాటము** రూ. చరలాట, చరలాటము, చర్లాట, చెరలాట, చెరలాటము, చెర్లాట, చెర్లాము. వి. క్రీడ. భార. శాంతి. 12.139.

**చర్లాటమాడు** రూ. చెర్లాటమాడు. అ. క్రి. క్రీడించు. ఆడుకొను. భార. శాంతి. 3.245.

**చర్లాడు** రూ.చూ. చెరలాడు. అ.క్రి. ఆడు, క్రీడించు.

**చఱచు** రూ. చరచు, చరుచు. స.క్రి. **1.** అరచేతితో కొట్టు. కొట్టు. భార. ఆది. 2.15 ; **2.** వాయించు. భార. ఉద్యో. 4.115 ; **3.** పందెంఒడ్డు. వేయు. భార.అను. 1.190 ; **4.** తుడుచు. విజ్ఞా. ఆచా. 6.7 ; **5.** ఆక్రమించు. భీమ. 2.46 ; **6.** ఆస్ఫాలనం చేయు. మను. 4.115 ; **7.** సాగగొట్టు. రాజవా. 3.15. అ.క్రి. **1.** కొన్ని పదాలకు అనుప్రయుక్తమై 'కలదగు' అనే అర్థాన్నిస్తుంది. ఉదా. వెఱచఱచు. భయంకలదగు. భార. సభా. 1.211 ; **2.** మించు, అతిశయించు. హరి. పూ. 6.34.

త. అఱై. చరుచు, కొట్టు, వాయించు, సోకు ; మ. అఱయుక. ఢంకాలాగ వాయించు ; కురు. తర్- (తర్చ్). కొరడాతో కొట్టు, గుద్దు ; మాల్తో. తర్చ్. చరుచు.

మూ.ద.ద్రా. *చఱ్-. < మూ.ద్రా. *చఱ్-.

**చఱపించు** స.క్రి. చరిచేటట్లుచేయు, మోగించు. సాంబ. 2.145. **చఱపు** వి. **1.** అడ్డపాటు. కళా. 7.59 ; **2.** రేకు.కళా. 7.60 ; **3.** అరచేతి దెబ్బ ; **4.** వ్యవధానం.

**చఱపుపిడక** రూ.చూ. చఱపుఁబిడక. వి. గోడకుతట్టిన పిడక.

**చఱపుఁబిడక** రూ. చఱపుపిడక. వి. గోడ మొ. వాటిమీద చరిచిన పిడక.

**చఱపించు** చూ. చఱపు.

**చఱపు** చూ. చఱచు.

**చఱి** రూ. చరియ, చఱియ, చొరియ. వి. **1.** ప్రపాతం, భృగువు. భార. ఉద్యో. 2.114 ; **2.** కొండపక్క భాగం. భార.శాంతి. 6.73.

క. సఱి. కొండ చరియ ; త. చరివు ; మ. చరివు ; ఏటవాలు.

**చఱియ** రూ.చూ. చఱి. వి. కొండ పక్కభాగం. మను. 4.51

**చఱు** రూ.చూ. చెఱువు. వి. తటాకం, కొలను.

**చఱుకుడుముక** వి. చరువుకుడుక, హోమార్థం వండిన అన్నం పెట్టుకొనే పాత్ర.

**చలకము** వి. వంశం, తీరు.

**చలకోల** వి. కొరడా, చబుక, చెరుకోల.

**చలచల** రూ. సలసల. వి. ద్రవపదార్థాల పలచదనాన్ని తెలపడంలో అనుకరణం, మరగడానికి అనుకరణం. ధ్వన్యను. కృ.శకుం. 2.144, ద్వి. పరమ. 2.114.

తు. చలచల ; త. చలచల, చల-చల్-ఎనల్ ; మ. చలచల. గంటలు గణగణ ధ్వని.

**చలచలకారు** అ.క్రి. బాగాకారు. చలచలన విశే. ద్రవరూపంకల. భాగ. 8.493. చలచలనగు అ.క్రి. ద్రవరూపమగు భార. 7.493.

**చలచల్లయగు** అ.క్రి. అంతట ప్రచురమగు.

**చలప** వి. పైరు పట్టిక కయ్యలో ఏర్పడిన తెర్ర.

**చలపగు** అ.క్రి. పంట చెడి సందు లేర్పడు. < చలప + అగు.

**చలపకారము** చూ. చలము. వి. **1.** పట్టుదల, అభినివేశం. కాశీ. 7.37 ; **2.** మాత్సర్యం.

**చలపకారి** వి. **1.** పట్టుపట్టేవాడు, అభినివేశం గలవాడు, పట్టుదలమనిషి. రం.రా. బాల. 6 ఫు. 3 పం. కళా. 3.246 ; **2.** మాత్సర్య వంతుడు. దశా. 10 54, బిల్హ. 2.65. < చలపకార + -ఇ.

**చలపకారి** చూ. చలపకారము

**చలపట్టు** చూ. చలము.

**చలపాదము** వి. గర్వం. శాశ్వ. సం. 7.21.

**చలపాది** చూ. చలము.

**చలపాదితనము** చూ. చలము.

**చలపొడుచు** చూ. చలము.

**చలపోరు** చూ. చలము.

**చలమ** రూ.చూ. చెలమ. వి. చెలమ, ఎండిపోయిన ఏరులు మొ. వాటిలో నీళ్ళ కోసం తవ్వే పల్లం.

**చలమంచము** వి. ఉయ్యెల మంచం.

సం. చలత్. కదులుతున్న.

< సం. చలత్ + మంచము.

**చలమరి** చూ. చలము.

**చలము** వి. **1.** అభినివేశం, పట్టుదల. భార.ఆది. 8.282 ; **2.** మాత్సర్యం, అసూయ. సారంగ. 3.66.

సం. ఛల-. మోసం, యుక్తి, అసత్యం, వ్యాజం, శాఠ్యం ; ప్రా. ఛల-. కపటం, వ్యాజం, అసత్యం ; అ.మా. ఛల-. కపటం, వ్యాజం, అసత్యం ; పా. ఛల-.

క. చల. పట్టుదల, ఆత్మవిశ్వాసం ; చలగార. పట్టుదల గలవాడు.

< ప్రా. ఛల-.

**చలపట్టు** అ.క్రి. 1. పట్టుదల గలదగు. రం.రా.బాల. 6 పు. 3 పం; 2. పగపూను. గౌ.హరి.ప్రథ.పం. 294, వర.రా.అయో.పు. 532, పం. 24; పండి.చ. 517; 3. మాత్సర్యం కలవాడగు. దశా. 10.54. **చలపాది** విశ. చలం కల. వి. 1. పట్టుదలగలవాడు. భాగ. 10. ఉ. 22, ఆం.భా. 3.26; 2. మాత్సర్యశీలుడు. శుక. 3.466, ఉ.రా. 4.284. క. చలవాది. **చలపాదితనము** వి. 1. పట్టుదల, అభినివేశం. శశా. 4.32, రంగా.చ. 2.229; 2. ఓర్వలేని తనం. **చలపొడుచు** అ.క్రి. చలంగొను. దుష్టమగు. నీలా. 2.56. **చలపోరు** అ.క్రి. 1. పట్టుదలతో పోరాడు. లక్ష్మీ వి. 1.114, ద్వి.నల. 2.690; 2. చలపట్టు. తాళ్ల. 3.36, రాధికా. 1.113. **చలమరి** విశ. 1. మాత్సర్య స్వభావం కల. వసు. 3.112; 2. పట్టుదల గల. **చలముకొను** రూ. చలముగొను. అ.క్రి. 1. చలపట్టు, పట్టుపట్టు. భార.భీష్మ. 1.102; 2. పట్టుదలకలిగిఉండు. భార.మహా. 54. **చలముగొను(-కొను)** రూ.చూ. చలముకొను అ.క్రి. పగపూను. కాశీ. 6.172.

**చలంపారు** వి. చిందర వందర, గజిబిజి.

**చలవ** వి. 1. శైత్యం, చల్లదనం; 2. ప్రమిద కింద ఉంచే పేడ ముద్ద.

**చలవకూజా** వి. ఉప్పుకూజా, సూరేకారం, ఉప్పు బురదలో కలిపి పూతపూసి చేసిన కూజా. **చలవచేయు** స.క్రి. చౌడు, సున్నం కలిపిన నీళ్ళలో నూలు ఉడికించి తెలుపు చేయు. **చలవనూలు** వి. చౌడు, సున్నం కలిపిన నీళ్ళలో ఉడికించి తెలుపు చేసిన నూలు. **చలవరంగు** వి. చలవెల్ల, అచ్చమైనతెలుపు. **చలవెల్ల** వి. చలవరంగు, అచ్చమైన తెలుపు.

**చలవాది** వి. చావునమాచారం చెప్పేవాడు.

**చలవెల్ల** చూ. చలవ.

**చలాకీ** విశ. 1. చురుకైన; 2. హుషారైన.

హిం. చాలాక్. నేర్పరి;ఐన; ఉ. చాలాకీ. చాతుర్యం, వ్యవహారకుశలత.

< ఉ. చాలాకీ.

**చలాకు** స.క్రి. బంగారాన్ని కల్తీ చేయు.

హిం.ఉ. చాలాక్. నేర్పరి;ఐన.

< ఉ. చాలాక్ (అర్థవిపరి.).

**చలాచలి** వి. 1. అతిత్వర, మిక్కిలి వేగం, కలత. వరాహ. 5.111; 2. మిక్కిలి కదలిక. వరాహ. 11.60; 3. సంచలనం.

హిం. చలాచలీ. వెళ్ళేటపుడు కలిగే సంభ్రమం. ప్రయాణ సంబంధమైన హడావుడి; ఉ. చలాచలీ. ప్రయాణం హడావుడి, సంభ్రమం, అనేకుల ప్రయాణం.

< ఉ. చలాచలీ.

**చలాడము** రూ.చూ. చల్లడము. వి. సగం తొడవరకు తొడుగు కొనే లాగు. చంద్రాంగ. 2.38.

**చలానా** రూ. చలాను. వి. డబ్బు కట్టటానికి దాఖలు చేసే చీటీ.

హిం. చలానా. ధనాన్ని కట్టినప్పుడు ఇచ్చేరశీదు.

< హిం. చలానా.

**చలాను** రూ.చూ. చలానా. వి. డబ్బు కట్టడానికి దాఖలు చేసే చీటీ.

**చలామణి** రూ.చూ. చెలావణి. వి. 1. చెల్లుబడి, వ్యాప్తి; 2. సాగుబడి.

**చలాయించు** రూ.చూ. చెలాయించు. స.క్రి. 1. సాగించు; 2. పారిపోవు; 3. చెల్లించు; 4. అభ్యసించు; 5. సాధన చేయు.

**చలావణి** రూ.చూ. చెలావణి. వి. 1. చెల్లుబడి, వ్యాప్తి; 2. సాగుబడి.

**చలి** వి. 1. శీతబాధ. శృం.నై. 7.123; 2. భయం. వేంక. పంచ. 4.464; 3. శీతాకాలం. పాండు. 2.88; 4. శైత్యం, చల్లదనం. ఆం.భా. 1.80; విశ. చల్లనైన, శైత్యమైన. ఆం.భా. 1.80.

క. చళి, చలి, సళి. చల్లదనం; తు. చళి, చలి, సలి, చవ్రళి, చవ్రలి; త. చళి, అళి, తళి; పర్జి. తల్ల.

< మూ.ద్రా. *తల్-.

**చలికప్పడము** వి. శీతల బాధను పోగొట్టే వస్త్రం, దుప్పటి. ప్రబంధ. 605. **చలికాపు** వి. కప్పు. సాంబ. తిర్య. 83. **చలికారు** వి. శిశిరర్తువు. ఆం.భా. 1.86. **చలికాలఁదన్ను** స.క్రి. రక్షించు, కాపాడు. కళా. 6.138. **చలికాలఁద్రోచివిడుచు** స.క్రి. 1. చల్లనికాలితో తోసివదలు. విజయ. 3.50; 2. చూచీ చూడనట్లు పోనిచ్చు. **చలికాలఁద్రోయు** స.క్రి. రక్షించు. విజయ. 3.50. **చలికురమ** వి. పశువులకు వణుకుతో వచ్చే జబ్బు. **చలికూడు** వి. 1. చలిది, పర్యుషితాన్నం. ష.చ. 2.53; ద్వి.సార.చ. 1 27 పు. 12 పం; 2. చద్దన్నం. కుక్కు. 16. **చలికొండ** రూ. చలిగొండ. వి. హిమవత్పర్వతం. చిత్ర భా. 5.10. **చలికొండకూఁతురు** వి. హిమవంతుని కూతురు, పార్వతి. పీర. 2.65. **చలికొండకొడుకు** వి. హిమవంతుని కొడుకు, మైనాకుడు. ఇందు. 5.39. **చలిగంజి** వి. పులవ బెట్టిన గంజి. **చలిగట్టు** వి. హిమాలయ పర్వతం. ఉ.రా. 5.1. **చలిగరువు** వి. 1. లోపల ఇనక గులకరాళ్ళుగల నల్లమట్టినేల; 2. పైన ఇనకగలరాతి పారునేల. **చలిగాడ్పు** వి. శీతలవాయువు, మలయమారుతం. కు.సం. 6.100. **చలిగాలి** వి. శీత వాయువు. కు.సం. 8.157. **చలిగుటికాఁడు** వి. శీతకిరణుడు. చంద్రుడు. హర. 6.79. **చలిగొట్టు (-కొట్టు)** అ.క్రి. చల్లనిఈదురుగాలి వీచు. హంస. 4.41. **చలిగొండ** రూ.చూ. చలికొండ. వి. హిమవత్పర్వతం. **చలిచీమ** వి. చెమ్మనేలలో ఉండే చీమ, ఒకవిధమైననల్లచీమ. పాండు. 2.6, నరస. 2.5, సు.శ. 87. కొలా. నల్లినీమ. తెల్లచీమ. **చలిచెడుమ** వి. ఒకరకం నరాలజబ్బు. పోతూపోతూ గిర్రునతిరిగి పడి పోవటం, వెర్రిచూపు. **చలితటి** వి. శిశిరర్తువు. **చలితుంగ** రూ. నలితుంగ. వి. సీటివారల బాగా ఎదిగే తుంగ. **చలితుపనేల** రూ.చూ. చలితుప్పనేల. వి. చెమ్మతోకూడిన తుప్పనేల. **చలితుప్పనేల** రూ. చలితుపనేల, చలితూనేల, చలితూవనేల, చలిదుబ్బనేల, చల్వదుబ్బనేల. వి. చెమ్మతో కూడిన తుప్పనేల. **చలితూనేల** రూ. చూ.

చలితువ్వనేల. వి. చెమ్మతోకూడిన తువ్వనేల. **చలితూవనేల** రూ. చూ. చలితువ్వనేల. వి. చెమ్మతో కూడిన తువ్వనేల. **చలిదాయ** వి. సూర్యుడు. సాంబ.దేవ. 9. వ్యు. చలినిదొలగించువు. **చలిది** రూ. చద్ది, చల్ది. వి.చద్దన్నం, పర్యుషితాన్నం. భార.శాంతి. 3.233, శుక. 3.248. **చలిదికట్టించితిప్పు** స.క్రి. ఒకచోటనిలువనీయకతిప్పు. కువ.చ. 4.132. **చలిదిమూట** వి. 1. చద్దన్నంమూట ; 2. చిట్టాముడం ; 3. ఎప్పుడుపడితే అప్పుడు ఉపయోగింప వీలయినది. **చలిదీఱు** (-తీఱు) అ.క్రి. 1. భయంతగ్గు. శుక. 3.350 ; 2. సంకోచం తొలగిపోవు. **చలిదుబ్బ** రూ.చూ. చలితువ్వనేల. వి. చెమ్మతోకూడినతువ్వనేల. **చలిదొమ్మ** రూ. చల్దొమ్మ. వి. చలువతో వచ్చేదొమ్మ, ఊపిరితిత్తుల జబ్బు. **చలిదొర** వి. పంటినొప్పి. **చలినట్టు** వి. చలిఇక్క, వాయువు, గాలి. అచ్చ.రా. బాల. 215. **చలినట్టుపట్టి** వి. 1. వాయుపుత్రుడు, హనుమంతుడు. అచ్చ.రా.యు. 239 ; 2. భీముడు. **చలినెల** వి. శిశిరఋతువులో ఒకనెల, మాఘం లేక ఫాల్గుణం. కళా. 7.151. **చలిం(దంమాన్యం** వి. వేసవి కాలంలో బాటసారులకు చలివేం(దం పెట్టినవారికి ఇచ్చిన మాన్యం. **చలిపట్టు** అ.క్రి. చలివేయు. రాధికా. 2.7. **చలిపండ్లు** వి.బ.వ. బిగిసిపోయినపండ్లు. **చలిపండ్లుపండు** అ.క్రి. అతిశీతస్పర్శచే పళ్లు కిఱ్ఱుమనిలాగు, పళ్ళుపులియు. ఆము. 4.116. **చలిపని** వి. శైత్యోపచారం. యయా. 5. 76,77. **చలిపందిరి** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి నీళ్లుపోసే చోటుగల పందిరి. భార.శాంతి. 1.383. **చలిపందిలి** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి మంచినీళ్ళుపోసేచోటున్న పందిరి. సాంబ.స్తా. 68. **చలిపిడుగు** వి. 1. మంచుతేనిపిడుగు, కొన్నిదేశాల్లో కాలవిశేషంలో ఆకాశం నుండి పడే తెల్లనిరవ్వ మంచుగడ్డ. రం.రా.యు. 398 వ. 19పం ; 2. వజ్రాయుధం ; 3. చాలాగట్టివాడు. వ్యు. చలిపిడుగువంటివాడు. **చలిపిండి** వి. 1. వృక్షవిశేషం. హంస. 4.10 ; 2. బెల్లం కలిపిన పచ్చిబియ్యపుపిండిముద్ద. **చలిపులకనేల** వి. నెమ్ము ఆలస్యంగా ఆరేపొలం, ఒగ్గనేల. **చలిపొద్దు** వి. మంచువేళ. **చలిబోనం** చూ. చల్దిబోనం. వి. చలువోదనం, పెరుగుకలిపిన అన్నం. **చలిమంట** వి. చలికాచుకోడానికిపుల్లలతో వేసేమంట. **చలిమందు** వి. శైత్యోపచారం, చలిపని. కావ్యా. 2.79. **చలిమల** వి. చలికొండ, హిమవత్పర్వతం. మను. 2.10. **చలిమలచూలి** వి. పార్వతి. రాముడ్యు. 2.58. <చలిమలచూలు + -ఇ. **చలిమలపట్టి** వి. పార్వతి. వేంక. పంచ. 1.113. **చలిమిడి**[1] రూ. చల్మిడి[1]. వి. ఒకజాతి కూరాకుమొక్క. 1. **చలిమిడి**[2] రూ. చలివిడి, చల్మిడి[2]. వి. 1. చలివిడి, బెల్లం, బియ్యంపిండి, నీరు కలిపిచేసేభక్ష్య విశేషం. ఆం.బా. 2.254 ; 2. చలిబిండి. <చలి + పిండి. **చలిమిరి** రూ. చల్మిరి. వి. 1. చలువ, శైత్యం. ఉ. సం. 5.121 ; 2. ఈమిరి, చల్లగాలి. ఈదుగాలి. హరి. ఉ. 7.173 ; **చలిమిరిమల** వి. హిమవత్పర్వతం, చలికొండ. ఆం.నా.సం.స్థా. 1, **చలిమొరపనేల** వి. తేమఆరనిమెదుంనేల. **చలియిక్క** వి. వాయువు, గాలి. <చలి + ఇక్క. **చలియిక్కదిండి** (-తిండి) వి. పవనాశనం, పాము. అచ్చ.రా. అయోధ్య. 93. **చలియిసుక** వి. హిమవాలుక, కర్పూరం. వసు. 2.21. <చలి + ఇసుక **చలివందిరి** రూ. చలిపందిరి, చలిపందిలి, చలివం(ది, చలివిందల, చలివిం(ద, చలివెందర, చలివెం(ద, చలివేందల చలివేం(ద. వి. చలిపందిరి, తాగటానికి నీళ్ళుపోసేపందిరి ద.హిం.గా.సంపు. 6. శా.సం. 586. (క్రీ.శ. 1074. <చలి + పందిరి. **చలివం(ది** రూ.చూ. చలివందిరి. వి. చలిపందిరి, తాగడానికినీళ్ళుపోసేపందిరి. **చలివాపు** (-పాపు) అ.క్రి. 1. బుజ్జగించు. తాళ్ల.సం. 3.620 ; 2. సిగ్గుసంకోచాల్ని తొలగించు. **చలివాలు** (-పాలు) వి. ఆనవాలు, ఇగిరేట్టు కాచినపాలు. శృం. నై. 6.134. **చలివిడి** రూ.చూ. చలిమిడి[2]. వి. బియ్యంపిండి, బెల్లం, నీరు కలిపిచేసేభక్ష్య విశేషం. ఆం.బా. 2.254. **చలివిడుచు** అ.క్రి. బెంకుతీరు. నిరంకు. 2.17. **చలివిందల** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి నీళ్ళుపోసేపందిరి. ఉ.రా. 8.15. **చలివిం(ద** రూ.చూ. చలిపందిరి. వి. చలివేం(ద. **చలివెందర** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి నీళ్ళుపోసే పందిరి. కాశీ. 4.66. **చలివెం(ద** రూ.చూ. చలివందిరి. తాగడానికినీళ్ళు పోసే పందిరి. ద్వి. హరిశ్చ. ఉ. 1774. హంస. 2.158. **చలివెలుంగు** రూ. చలివెలుఁగు, చలివెల్గు. వి. 1. శీతాంశుడు, చంద్రుడు. నీలా. 1.52 ; 2. (శేష్ఠవాచకం (ఉత్తర పదంగా). **చలివెలుఁగు** రూ.చూ. చలివెలుంగు. వి. (శేష్ఠ వాచకం (ఉత్తరపదంగా). అచ్చ.రా.బాల. 1.82. **చలివెల్గు** రూ.చూ. చలివెలుఁగు. వి. 1. చంద్రుడు, శీతాంశుడు. ఆం.బా. 1.77 ; 2. (శేష్ఠుడు. **చలివెల్గురా** వి. చంద్రకాంత మణి. పి.శకు. 1.193. **చలివేందల** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి నీళ్లుపోసే పందిరి. **చలివేందిరి** రూ.చూ. చలివందిరి. వి. చలివేం(ద. **చలివేం(ద** రూ.చూ. చలివందిరి. వి. తాగడానికి నీళ్ళుపోసేపందిరి.

**చలికి** రూ. చడికి. వి. 1. మల్లబంధ విశేషం. భార. విరా. 2.15 ; 2. జెల్లకపట్టు.

సం. ఛడికీ, ఛర్దికా. వమనం, కక్కుకోవటం; ఛడికా ; (పా. ఛడ్డ. తోము ; సడ. తోయు ; ఛడ్డే. ఛడ్డియ. వెలికక్కటం ; జై.మహా. ఛడ్డిజజ, శౌ. ఛడ్డిద, ఛడ్డే. వాంతి ; అ.మా. ఛడ్డ - ఛడ్డసి ; పా. ఛడ్డితి. తోయు ; అప. ఛడ్డ.

<సం. ఛడికీ (అర్థవిపరి.).

**చలికిపార** వి. దోకుడుపార.

**చలికూఁకుడు** చూ. చలి. వి. అడవికుంకుడుచెట్టు.

**చలివిసంపదలు** రూ. చలువుసంపదలు. వి.బ.వ. చలుపుసంపదలు. సుఖసంపదలు, ద.హిం.గా. 5.1188. క్రీ.శ. 1280.

**చలువ** వి. 1. చాపరాయి, రాతిపలక. కళా. 1.5 ; 2. రాయి. చంద్రాంగ. 5.46 ; 3. బండిచెక్క.

**చలుపారం** వి. చలిబోనం.

**చలుపు** రూ. చల్పు, సలుపు. స.క్రి. 1. (పసరింపజేయు. భార. ఆది. 3.38 ; 2. కావించు, చేయు. భార. ఆది. 8.115 ; 3. చనజేయు, వెళ్ళేట్లుచేయు. భార.ఆది. 8.232 ; 4. అనుసరించు. భార. సభా. 1.25 ; 5. బొనుపు, గుచ్చు.

క్రీడా. 142 ; **6.** ఓడ మొ. నడుపు. ఆము. 1.85 ; **7.** చలిపి (తట్టుపంటివ్యాధి) కలిగించేబాధవంటి బాధను కలిగించు.

క. సల్-. ప్రవేశించు, ఒడంబడిక చేసుకొను, అంగీకరించు, అధికమగు, లేచు, పోవు; సల, సలవు, సలహు. ఆత్రుతగా ముందుకుపోవు, పెంచు, కాచు, కాపాడు, భద్రపరచు, రక్షించు ; తు. సల్లుని. తగిన ; సంధుని. ఈ ప్రపంచం నుండి వెళ్లిపోవు, మరణించు ; సందావుని. చెల్లించు, చేయు, నెరవేర్చు; సలాయిసుని. బాకీచెల్లించు ; త. చెల్ ; మరణించు, వెళ్ళు, నశించు, గతించు; మ. చెల్క. కావాల్సిన, గతించిన, వెల ; చెలవు. ఖర్చు ; కో. చళ్. తగిన, అంగీకరించదగిన, సరైన; తొ. సల్-. ఒకరికిచెందిన; సల్ఫ్ ; ఖర్చులు, అవసరాలు ; గోం. హందానా. వెళ్ళు ; కొం. సొల్. వెళ్ళు ; కుయి. సల్ప. వెళ్ళు, విడిచిపోవు ; కువి. హజ్జలి. వెళ్ళు ; ప. చెన్. వెళ్ళు ; కొలా. సెల్. గతించిన, నశించిన ; నా. చ-. వెళ్ళు ; గద ఒల్లా. సెన్, చెన్. వెళ్ళు; కురు. చ్రలానా. ఎడతెగని, విడువని.

**చలువ** రూ. చల్వ. వి. **1.** శైత్యం, చల్లదనం, సౌఖ్యం. హర. **4.**78, కళా. 2.33 ; **2.** జాడ్యంవల్ల శైత్యం. రామలిం. శ. 20 ; **3.** శైత్యోపచారం. ముకుం. 2.130 ; **4.** చలువ చేసిన వస్త్రం. ఆం.భా. 2.153. విణ. **1.** చల్లని. ఆము. 2.69 ; **2.** దయ, అభిమానం. వాసి.

క. చళి, చలి, సళి, చల్లదనం ; తు. చళి, చలి, సలి, చవ్రళి, చవ్రలి ; త. చళి, తాళి, చలవై ; పర్జి. తల్ల.

**చలువగట్టు** వి. హిమవత్పర్వతం. యయా. 2.36. **చలువగుబ్బము** వి. గాడిద. సాంబ. తిర్య. 76. **చలువచేయు** స.క్రి. చవటి నీళ్ళలో ఉడికించి ఉదుకు. **చలువజోడు** వి. కళ్ళకు చల్లదనం కలిగించే సులోచనాల జోడు, చలవద్దాల కళ్ళజోడు. **చలువజోతి** రూ. చలువజ్యోతి. వి. చంద్రుడు. **చలువజ్యోతి** రూ. చూ. చలువజోతి. వి. చంద్రుడు. **చలువడాల్దొర** వి. శీతాంశుడు. **చలువడి** వి. శైత్యం. < చలువ + వడి. **చలువతెమ్మెర** వి. చల్లగాలి, మలయమారుతం. ఉ. రా. **4.**167. **చలువదీర్చు** (-తీర్చు) స.క్రి. చలువచేయు. నిరంకు. **2.**74. **చలువపట్టు** స.క్రి. చలువజేయు, ఉతుకు. నిరంకు. 2.20. వి. చల్లనితావు. పండి.చ. 5.290. **చలువపందిలి** వి. తిరునాళ్ళ ఉత్సవంలో బయలుదేరిన దేవుడు వచ్చి దిగటానికి, పెద్దవారి ఇళ్ళ తలవాకిట, వీధిలో వేసే ఎత్తుపందిరి. **చలువబట్ట** వి. ఉతికిన వస్త్రం, చలువచేసిన వస్త్రం. **చలువమజ్జిగ** వి. నిమ్మకాయ రసం మొ. చేర్చిన మజ్జిగ. ప్రబంధ. 112. **చలువమందు** వి. చలిమందు, శైత్యోపచారం పి.శకు. 3.44. **చలువమిన్న** వి. చలువరేడు, చంద్రుడు. చంద్రికా. 2.78. **చలువమిరియము** వి. ఒకరకం తీగ, తోకమిరియం (Peper cubeba). **చలువరాయి** రూ.చూ. చలువఱా. వి. చంద్రకాంతమణి. **చలువఱా** రూ. చలువరాయి, చలువఱాయి. వి. చంద్రకాంతమణి. దశా. 4.103. **చలువఱాయి** రూ.చూ. చలువఱా. వి. చంద్రకాంత మణి. **చలువఱేడు** వి. చంద్రుడు. **చలువలబచ్చు** వి. చంద్రుడు. వరాహ. 9.88. **చలువలమల** వి. హిమాలయపర్వతం. వేంక.అం. స్థా. 79. **చలువలఱేడు** వి. చంద్రుడు. నీలా. 3.20. **చలువలుచేయు** అ.క్రి. శీతలోపచారాలు చేయు. హేమా. పు. 40. **చలువల్జోతి** చూ. చలువజోతి. వి. శీతకిరణుడు. చంద్రుడు. చంపూ.రా. 2.27.

**చలువవాదివాడు** విణ. చలవాది, చావు సమాచారాన్ని తెలిపే వాడు.

**చలువసంపదలు** రూ.చూ. చలివిసంపదలు. వి.బ.వ. సుఖసంపదలు.

**చలోచలో** వి. బండితోలేటప్పుడు చేసేధ్వని.

హిం. చలో చలో. నడునడు

< హిం. చలోచలో.

**చల్ది** రూ.చూ. చలిది. వి. పర్యుషితాన్నం, రాత్రి మిగిల్చి ఉదయాన తినే అన్నం, చద్దన్నం. భాగ. 10పూ. 496.

**చల్దిబోనం** చూ. చలిబోనం. వి. చలుపారం, పెరుగు కలిపిన అన్నం.

**చల్దొమ్మ** రూ.చూ. చలిదొమ్మ. వి. వణుకుతో వచ్చే దొమ్మ ఊపిరి తిత్తులజబ్బు.

**చల్నేత** వి. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్టు నేసిన నేత.

**చల్పు** రూ.చూ. చలుపు. స.క్రి. **1.** ఓడ మొ. నడుపు. భార. ఆది. 4.172 ; **2.** కావించు, చేయు. భార. ఆరణ్య. 4.98 ; **3.** చనజేయు, కడపు, పుచ్చు; **4.** ప్రసరింపజేయు ; **5.** అనుసరించు ; **6.** దొనువు, గుచ్చు.

**చల్మిడి**[1] రూ.చూ. చలిమిడి[1]. వి. ఒకజాతి కూరాకు మొక్క. హంస. 4.132.

**చల్మిడి**[2] రూ.చూ. చలిమిడి[2]. వి. చలివిడి, బియ్యంపిండి బెల్లం నీరు కలిపి చేసే భక్ష్య విశేషం. ప్రభు. 4.150. పు. 22పం.

**చల్మిరి** రూ. చూ. చలిమిరి. వి. చలువ, శైత్యం. నృసిం. 3.68.

**చల్ల**[1] వి. దండాహతం, మజ్జిగ. విక్ర. 6.38.

క. అళె ; తు. అలె, అళె ; త. అళై, అళ్ళ. మజ్జిగ ; పర్జి. చల్ల ; కొలా. సల్ల ; నా సళ.

**చల్లకడి** వి. మెంతిమజ్జిగ. **చల్లకంబాలు** వి.బ.వ. కృష్ణాష్టమికి రోడ్లమీద వేసే స్తంభాలు. వీటిపైన ఉట్టెలుకట్టి కిందను యువకులూ కుర్రాళ్ళూ ఎగురుతూ ఆ ఉట్టెలు పట్టుకోడానికి యత్నిస్తూ ఉంటే పక్కనున్న వాళ్ళు పిచ్చికారీ గొట్టాలతో నీళ్ళు కొడతారు. **చల్లకవ్వము**[1] వి. మజ్జిగ చిలికే కవ్వం. **చల్లకుండ** రూ. సల్లకుండ. వి. మజ్జిక్కుండ, మజ్జిగ చిలకడానికి వాడే మట్టిపాత్ర. **చల్లకుదురు** రూ. సల్లకుదురు. చీమలతొట్టి, మజ్జిగ కుండలోనికి చీమలు పోకుండా నీళ్ళు పోసి పెట్టే మట్టి కుదురు. **చల్లగటం** రూ. సల్లగటం. వి. సలిగటం కుండ. సల్లకడవ, మజ్జిగ పోసి ఊళ్ళో ఇంటింటికి తిరుగుతూ తీసుకొని పోయేకుండ. **చల్లగారె** వి. భక్ష్య విశేషం. **చల్లగుదులు** వి.బ.వ. చల్ల తిప్పే తాళ్ళు, ఆకతాళ్ళు. **చల్లత్రాళ్ళు** వి.బ.వ. చల్లగుదులు, చల్లచేయడానికి వాడేతాళ్ళు. **చల్లపులుసు** వి. పొగచిన మెంతిమజ్జిగ, తిమ్మనం. **చల్లమిరప** వి. ఉప్పుగలిపిన మజ్జిగలో ఊర

పెట్టిన మిరపకాయ, ఉప్పుమిరప. చల్లకసము వి. చల్లకడి, మెంతమజ్జిగ. చల్లకాయ వి. కుపదం, తరికంబం. చల్ల పడియము వి. 1. వంటక విశేషం. ధర్మా 3ఖా.; 2. ఒకరకమైన పడియం. చల్లసేయు[1](-చేయు) అ.క్రి. మజ్జిగ చేయు. చల్లాసూడు (-కూడు) వి. గ్రామదేవత కొలుపులకు ముందురోజు గ్రామమంతట అడిగితెచ్చే మజ్జిగన్నం.

చల్ల[2] విశే. శీతలమైన, చల్లని. భార. ఆది. 6.19.

క. చళి, చలి, సళి, చల్లని; తు. చళి, చలి, సలి, చప్పళి, చప్పలి; త. చళి, అళి, తళి; పర్జి. తల్ల. చల్లకంకితెగులు. చూ. చల్లతెగులు. వి. వరితెగులు.

చల్లకాలం రూ. సల్లకాలం. వి. చలికాలం. చల్లగడ్డ వి. భూమిలోపల పెరిగే ఒకరకం మొక్క. పిల్ల పీచరమొక్క; శతమూలి. హంస. 4.10 (Aspargus racemosus). చల్లగాయుండు అ.క్రి. సుఖసౌభాగ్యాలతో వర్ధిల్లు. శుక. 2.71. చల్లగాలి వి. చల్లనిగాలి, శీతలవాయువు. చల్లగుంజ వి. గృహప్రవేశసమయంలో వాస్తుపూజకోసం పాతేకర్ర. చల్లగుత్తులు వి.బ.వ. ఒకరకం భక్ష్యం. చల్లగుబ్బలి వి. హిమవంతుడు. శివ ద. 3.85. చల్లంగ రూ. చల్లఁగ. క్రి. విశే.క్రి. 1. చల్లగా వర్ధిల్లేటట్టుగా. కాశీ. 3.166; 2. నెమ్మదిగా. చల్లఁగ రూ.చూ. చల్లంగ. క్రి.విశే.క్రి 1. చల్లగా వర్ధిల్లేటట్టుగా; 2. నెమ్మదిగా. చల్లఁగాఁగను స.క్రి. కన్నులు చల్లపడగా చూచు. శుక. 2.34. చల్లచప్పుడు వి. 1. వట్టిమాటలు తప్ప చేతలు లేనివాడు. ద్వి.హరిశ్చ. ఉ. 1497, 98; 2. జడుడు. ద్వి. హరిశ్చ. ఉ. 1499పం. చల్లచీమ వి. చలిచీమ. చల్లఁజంపు వి. 1. భయంకరుడు. హరి. ఉ. 1089; 2. చల్లగాగొంతు కోసేవాడు. హర. 2.52. చల్లఁజేయు స.క్రి. 1. చల్లార్చు. దశా. 4.131. కవిరా. 2.3; 2. మనసుకు ఊరట కల్పించు. మల్హ. 2.75. చల్లతెగడ చూ. చల్లతెమడ. వి. వరి. మొ. వాటి తెగులు. చల్లతెగులు వి. మజ్జిగతెగులు, వరి, జొన్న, మిరప, సజ్జ మొ. పైర్ల బూజుతెగులు. చల్లతెమడ చల్ల తెమడి, వి. వరి మొ. వాటితెగులు. చల్లతెమడి రూ.చూ. చల్లతెమడ. వి. వరి. మొ. వాటితెగులు. చల్లన విశే. శీతలమైన, చల్లని. భార.శాంతి. 6.216. వి. శైత్యం, చల్లదనం. ఆం.భా. 1.80. చల్లనగు అ.క్రి. ఇవతళించు, చల్లబడు. < చల్లన + అగు. చల్లనయ్య వి. చంద్రుడు. < చల్లన + అయ్య. చల్లనారు అ.క్రి. ఉపశమిల్లు, తగ్గిపోవు, చల్లబడు. < చల్లన్ + -ఆరు. చల్లని విశే. శీతలమైన. భార. ఆది. 4.23. చల్లనికడుపు వి. సంతానవతి. శుక. 1.5. చల్లనితల్లి వి. ఎక్కువఘాత చేయని స్ఫోటక వ్యాధి. చల్లనిది. చల్లని తెలిదిబ్బ వి. మంచుకొండ, హిమాలయ పర్వతం. చల్ల నీరుకటికి వి. మత్స్య విశేషం. చల్లఁదనము వి. శైత్యం. విక్ర. 1.138. చల్లపడు అ.క్రి. 1. సాయంకాలం అగు. చంద్రాంగ. 5.39; 2. చల్లదనం కలుగు; 3. ఎండతీవ్రత తగ్గు. చల్లపడువేళ వి. సాయంకాలం. వరాహ. 4.87. చల్లపందిరి చూ. చలిపందిరి. రూ. చల్ల పందిలి. వి. చలివేంద్ర. సాంబ. స్థా. 68. చల్లపందిలి రూ.చూ. చల్లపందిరి. వి. దాగడానికి నీళ్ళుపోసే పందిరి, చలివేంద్ర. చల్లపిట్ట వి. పక్షివిశేషం. ఆం. భా. 2.98. చల్లపిల్లి వి. వృక్షవిశేషం, చిత్రమూలం. హంస. 4.10. చల్లపెట్టు స.క్రి. నిరాదరంచేయు. పాండు. 2.11. చల్ల బొమ్మిడి వి. పొగాకు తెగులు. చల్లమంచులదొర వి. చంద్రుడు. చంద్రికా. 6.51. చల్లఁబడు (-పడు) అ.క్రి. శీతమగు, చల్లనగు, ఎండతీవ్రత తగ్గు. వరాహ. 10.33, చల్లరించు చూ. చల్లార్చు. స.క్రి. చల్లబరుచు. చల్లసేయు[2] (-చేయు) అ.క్రి. 1. చల్లార్చు. సిం. ద్వా. 5.145, రం. రా. కిష్కిం. 556; 2. శుభాలిచ్చు. రాధికా. 1.55; 3. పండుగచేయు, ఆనందమిచ్చు. శగాం. 2.33. చల్లాకు వి. మినుము, పెసర మొ. వాటి తెగులు. చల్లారు చూ. చల్లనారు. అ.క్రి. ఉపశమిల్లు, తగ్గిపోవు, చల్లబడు. దశా. 8.102. < చల్ల[2] + -ఆరు. చల్లార్చు చూ. చల్లరించు. స.క్రి. చల్లబరచు.

చల్లకము చూ. చల్లు.

చల్లడంగుడ్డ చూ. చల్లడము. వి. పొట్టిలాగు మాదిరిగా, మోకాళ్ళవరకూ తొడుక్కునే చల్లడంకోసం నేసిన బట్ట.

చల్లడము రూ. చలాడము, చల్లాడము. వి. సగం తొడవరకు ఉండే లాగు, అర్ధోరుకం. కు.సం. 11.204.

సం. చలనీ, చలనక-. లంగా; చండాతక-; ప్రా. చల్లణగ-. జఘనాంశుకం, కటివస్త్రం; చండాతకం. లంగా.

క. చలణ, చల్లణ, చల్ల, చాల్లణ, చొల్ల, చణ్ణ; త. చల్లటమ్, కల్లటమ్; తు. చల్లణ, చల్లన, చల్లాన; మ. కల్లటమ్.

< ప్రా. చల్లణగ-.

చల్లాకు చూ. చల్ల.

చల్లాగూడు చూ చల్ల[1].

చల్లాడము రూ.చూ. చల్లడము. వి. 1. లాగు, వస్త్రం. ఆం.భా. 2.158; 2. పొడవులాగు, ప్యాంటు; 3. నిక్కరు, చల్లడం.

చల్లాణము రూ.చూ. చిల్లాడము. వి. మొలవంటకి భేదం.

చల్లారు చూ. చల్ల[2].

చల్లార్చు చూ. చల్ల[2].

చల్లు స.క్రి. 1. (నీళ్ళు మొదలైనవి) చిలకరించు, చిలుకు, ఇసుక మొ. చల్లు. భార.సభా. 2.302; 2. ఎక్కువగా ఇచ్చు. భార.శాంతి. 2.399; 3. వాసన, గాలి, కాంతి మొ. ప్రసరింపజేయు. నృసింహ. 1.54, ఉ.హరి. 1.154; 4. పోయు, నలువైపుల విక్షేపించు, పారబోయు, శుక 2.25, నీలా. 2.112; 5. వెల్లడించు, వ్యక్తపరచు. కవిరా. 5.31; 6. అధికంగాచెప్పు. చంద్రరే. 2.29; 7. విత్తనాలు చల్లు. అ.క్రి. వ్యాపించు. విప్ర. 3.77, ఇందు 5.105. వి. చల్లటం.

క. చల్లు, చెల్, చెల్లు, చలంకు, చెలంకు, చల్లిసు, చెల్లిసు, చళె, చళెయ, చళక, చళయ, చళియ, సెళకు; కొడ. చెల్; తు. చల్లుని, చెల్లుని, చెల్లాకు; త. చల్లు. నీళ్ళుచల్లు; కువి. జలినై, జల్;

పర్జి. చల్ ; గ. జల్.

చల్లకము వి. చల్లటం. చల్లుకొను స.క్రి. విక్షేపించు. చల్లుకొలుపు స.క్రి. చల్లుకొనేట్లుచేయు. రాధికా. 3.130. చల్లుగొట్టు (-కొట్టు) అ.క్రి. వానజల్లు నీరు పక్కవాటుగా లోన ప్రవేశించు, చఱుగొట్టు, జల్లుగొట్టు. చల్లుడు వి. మత్స్యగ్రహణ సాధనం. హంస. **4.184**. చల్లుపోరాట వి. జలక్రీడ. మృత్యు. 3.50. చల్లుపోరాడు అ.క్రి. **1**. ఒకరిపై ఒకరు నీరు చల్లు. భార.ఆది. 5.10; **2**. వెదజల్లు. భాస్క.రా. యు. 14.82 ; **3**. జలక్రీడలాడు. రామాభ్యు, 1.206. చల్లుపోరు వి. జలక్రీడ. చల్లులాడు అ.క్రి. జలక్రీడచేయు. భాగ. 10పూ. **430**. స.క్రి. నీళ్ళు మొ. చల్లుకొను. మను. **5.44**. < చల్లు + -లు + ఆడు. చల్లువలపుబేరము వి. మాటలతో మాత్రమే ఆగిపోయే ప్రేమ. తాళ్ల. సం. 12.145. చల్లువెద వి. విత్తనాల్ని మడిలో పిడికిలితో ఎత్తి చల్లే చల్లకం. చల్లువెదఁజల్లు స.క్రి. విత్తనాలు చల్లు. ఆము. 5.114. చల్లువెదలాడు స.క్రి. వెదజల్లు, విత్తు. తాళ్ల.సం. 11.2. భా. 69.

చల్వ రూ.చూ. చలువ. వి. **1**. శైత్యం, చల్లదనం. పారి. పీఠిక ; **2**. జాడ్యంవల్ల శైత్యం ; **3**. శైత్యోపచారం ; విణ. **1**. చలువచేసిన (వస్త్రం). దశా. 1.98 ; **2**. చల్లని.

చల్వగని వి. చంద్రుడు. పారి. 4.47. చల్వడాల్దొర వి. చంద్రుడు. అచ్చ.రా.బాల. 1. చల్వదుబ్బనేల రూ.చూ. చలితువ్వనేల. వి. చెమ్మతోకూడిన తువ్వనేల.

చవ వి. గుజ్జు.

చవక రూ.చూ. చౌక[1]. విణ. ఉప్పనైన, చవకైన.

చవకచెట్టు వి. సరుకుచెట్టు, క్యాషురీన, సర్వి, సరుగుడు.

చవకము రూ.చూ. చవికె. వి. మండపం.

చవచవ క్రి.విణ.ద్రు. కొంచెం నీలవర్ణంగా.

చవట వి. వాజమ్మ, దద్దమ్మ, తెలివితక్కువవాడు.

చవటతెర వి. తెరలు తెరలుగా చవుడున్న నేల. చవట పెద్దమ్మ వి. దద్దమ్మ.

చవటినేల రూ.చూ. చవుటినేల. వి. నిస్సారమైనభూమి, చవుడు భూమి.

చవట్రాగిడి రూ. చూ. చవుటరేగడి. వి. చవుడు కలిసిన రేగడి.

చవడోలి రూ.చూ. చౌడోలి. వి. అంబారి.

చవణము వి. కంసాలివారి ఒకరకపు పనిముట్టు, శ్రావణం.

చవరాలు వి. బ.వ. సవరాలు.

చవల వి. బిడ్డతల్లి చూలాలై ఉండటంవల్ల బిడ్డకు కలిగే కృశత్వం.

చవలపోవు అ.క్రి. తల్లి చూలాలై ఉండటంవల్ల బిడ్డ కృశించు. చవలవాఁడు వి. గర్భిణీ హస్తసంగత బాలుడు. ఆం.భా. 2.120.

చవలము రూ. చవెల. వి. వరహాలో ఎనిమిదో భాగం, మాడ, మూడు రూపాయల ఎత్తులో సగం.

క.తు. చవల ; త. చవలమ్. పగోడాలో ఎనిమిదవ వంతు.

చవి[1] వి. **1**. అనుభవం, ఆస్వాదం. భార.ఉద్యో. 3.362 ; **2**. రుచి. భార.అరణ్య. 6.123 ; **3**. సౌఖ్యం. ఉ.హరి. 5.210 ; **4**. ఆశ, తీపి. హరి.ఉ. 7.200 ; **5**. ప్రేమ, అనురాగం, వలపు. వసు. 3.53 ; **6**. అమృతం. విణ. **1**. ఇంపైన, ప్రియమైన. భార.ఉద్యో. 3.325 ; **2**. రుచికల. శృం.నై. 1.17.

క. సవి, సంవి. రుచికల, నోటికింపైన ; సవి, సనె, రుచియైన ; సవిగాఱ. మధురమైన అనుభూతులు కలిగించే వాడు, హాస్యగాడు ; హవిసు. రుచికరమైన ; సవిహ. రుచి ; కొడ. చయి ; తు. సబి, సవి-. రుచి, వాసన, మధురమైన, తీపి ; సబిపుని. రుచిగా ; సవిపుని. రుచిగా వుండు, నోటికింపైన, తీపి; తబి. వాసన, రుచి, నోటికింపైన; తబిపుని. శాంతిచేయు, అణుచు ; త. చువై. రుచి, తిను, నములు, ముద్దు, అనుభవం, ఆనందం, మధురంగాఉండు, ఒప్పుకొనే మధురమైన ; మ. చువ. రుచి, వాసన, మధురంగానిరుచి ; చువెక్క. రుచి కలగచేయు ; కొలా. సవ్సి. తీపి ; నా. సవ్ఁ.

చవిగొను (-కొను) స.క్రి. **1**. అనుభవించు. భార. ఉద్యో. 3.35 ; **2**. పానంచేయు. ఉ.హరి. 2.128 ; విక్ర. 3.48 ; **3**. తిను. విష్ణు.పు. 4.211 ; **4**. రుచిచూచు. కళా. 6.214. చవిచదువులు వి.బ.వ. వలపు గొలిపే విద్యలు, శృంగార విద్యలు. కావ్యా. 1.106. చవిచూచు స.క్రి. **1**. రుచిచూచు. బసవ. 3.694 పం ; **2**. పానంచేయు. శృం.నై. 7.176. చవిదేల్చు (-తేల్చు) స.క్రి. ఆనంద మగ్నుల్ని చేయు. నిరంకు. 4.74. చవిమరగు స.క్రి. రుచి మరగు. హంస. 2.110. చవియగు అ.క్రి. **1**. తగు. తాళ్ల.సం. 3.156 ; **2**. రుచియగు. పారి. 1.126. < చవి[1] + అగు. చవిసూపు (-చూపు) స.క్రి. రుచిచూపు. విప్ర. 3.19. చవులిచ్చు స.క్రి. ఇష్టం కలిగించు. తాళ్ల. సం. 3.658. చవులుగను(-కను) స.క్రి. రుచితెలిసికొను. ఉ.హరి. 1.404.

చవి[2] వి. **1**. ముత్యం. వసు. 2.104 ; **2**. ముత్యాలతూనిక. విజయ. 1.16.

క. చవ్రు.

చవి[3] వి. వాజినీగర్భం, గుర్రంచూలు. ఆం.భా. 3.63.

చవిక రూ.చూ. చపికె. వి. **1**. చతుష్కోణ మండపం. చంద్రభా. 5.120 ; **2**. గ్రామదేవతాలయం ; **3**. పెండ్లి చవిక ; **4**. కొలుపుచవిక ; **5**. పెంకుకప్పిన సాల ; **6**. కప్పుగల రచ్చటరుగు.

చవికె రూ. చవకము, చవిక. వి. చతుష్కం, మండపం. హర. 4.78.

సం. చతుష్క-. అంగణం, చౌక ; ప్రా. చఉక్కియా- ; శా. చదుక్కఅ.

< ప్రా. చఉక్కియా.

చవిటికర రూ. చవిటిక్రరు. వి. ఒక అంచున చవుడున్న నేల.

చవిటిక్రరి రూ.చూ. చవుటక్రరి. వి. లేతనలుపు, కపిలవన్నె.

చవిటిక్రరు రూ.చూ. చవిటికర. వి. ఒక అంచున చవుడున్న నేల.

చవిటిక్రరె రూ.చూ. చవుటక్రరి. వి. కపిలవన్నె.

**చవిటినేల** రూ.చూ. చవుటినేల. వి. నిస్సారమైన భూమి, చవుడుభూమి.

**చవిటిపుల్లగడ్డి** వి. సౌట పుల్లగడ్డి, ఉప్పుగడ్డిలో ఒకరకం.

**చవిటెక్రరె** రూ.చూ. చవుటక్రి. వి. తెతసలుపు, కపిలవన్నె.

**చవిట్రేగడి** రూ.చూ. చవుటరేగడి. వి. చవుడు కలిసిన రేగడి.

**చవిటేకునేల** వి. చవుడు కలిసిన నేల.

**చవిటొరననేల** వి. చవుడు పొరలు పొరలుగాఉన్న నేల, ఒక వరస చవుడున్న నేల.

**చవితి** రూ.చూ. చవుతి. వి. పక్షంలో నాలుగో తిథి.

**చవితిచందురుఁడు** రూ.చూ. చవుతి చందురుఁడు. వి. చూడకూడనిది, చూడకూడనివాడు. **చవితితల్లి** వి. మారెటి తల్లి, సవతితల్లి. **చవితిపండుగ** రూ. సైతిపండగ, సౌతి పండగ, సౌతిపండుగు. వి. వినాయకచవితి, భాద్రపద శుద్ధ చవితి.

**చవిర-** రూ. చవిరె. వి. చవికె, చతుష్కం, మండపం. అం. భా. 2.14.

సం. చతురికా. చవిరె; ప్రా. చఉరయ. రచ్చ, చావిడి, చఉరియా, చఉరీ. వివాహమండపం.

<ప్రా. చఉరయ.

**చవిరె** రూ.చూ. చవిర. వి. చతుష్కం, మండపం.

**చవిలివాడు** రూ.చూ. చవిలెవాఁడు. వి. గర్భిణీ హస్తగత శిశువు.

**చవిలె**[1] వి. 1. అయిదు అద్దుగలు. పావులూరి మల్లన గణితం ; 2. నాలుగు డబ్బులు. విజ్ఞా.ప్రా. 96.

**చవిలె**[2] విఀ. సన్నమైన, బక్కపలుచని.

త. చవలై. బాధ, కలవరం, సన్నదనం ; చవంకు ; మ. చవల, చావి, చాబి, చాటు ; కుయి. సడు.

**చవిలెపోవు** అ.క్రి. సన్నగిల్లు, కృశించు.

**చవిలెవాఁడు** రూ. చవిలివాడు. వి. గర్భిణీ హస్తగత శిశువు.

**చవు** రూ. చౌ. వి. నాలుగు. విఀ. 1. చతురస్రం ; 2. నాలుగు.

సం. చతుస్. నాల్గు ; ప్రా. చఉ- ; అ.మా. చఉ.

<ప్రా. చఉ.

**చవుకటులు** రూ.చూ. చవుకట్టులు. వి.బ.వ. ముత్యాలు మొ. నాలుగేసి కట్టిన పోగులు, కర్ణాభరణవిశేషం. **చవుకట్టులు** రూ. చవుకటులు, చవుకట్లు, చౌకటులు, చౌకట్టులు, చౌకట్లు. వి.బ.వ. ముత్యాలు మొదలైనవి నాలుగేసి కట్టిన పోగులు, కర్ణాభరణ విశేషం. రాజ.వి. 2.39. క. చవుకళి; త. చవుక్కడి. చెవిరింగుకు వేలాడేది ; మ. చవుక్కళి. **చవుకట్లు** రూ.చూ. చవుకట్టులు. వి.బ.వ. కర్ణాభరణ విశేషం. వైజ. 2.47. **చవుకాఁడిగుదియ** రూ.చూ. చౌకాఁడిగుదియ. వి. నాలుగు పక్కల ఉండే ఇనపదండం. **చవుకాలిపీట** రూ.చూ. చౌకాలిపీట. వి. నాలుగు కాళ్ళుగల ఎత్తుపీట. **చవుగంటి** రూ.చూ. చౌగంటి. వి. 1. నాలుగు కళ్ళుగలవాడు, ద్విశీర్షుడు, అగ్నిదేవుడు ; 2. శరభమృగం. **చవుడోలి** రూ.చూ. చౌడోలి. వి. ఏనుగు వీపు మీద కూర్చోడానికి అమర్చిన తొట్టి, అంబారీ. **చవుడోలీ** రూ.చూ. చౌడోలి. వి. అంబారి. **చవుడోలు** రూ.చూ చౌడోలి. వి. అంబారి. **చవుదంతి** రూ. చౌదంతి. వి. ఐరావతం. ఆము. 4.154, సారంగ. 3.27. సం. చతుర్దంత-. ఐరావతం ; ప్రా. చఉద్దంతి. **చవుదంతియెకిమీఁడు** వి. ఇంద్రుడు. **చవుపదము** రూ.చూ. చౌపదము. వి.బ.వ. 1. నాలుగు మూలలు; 2. గీతి విశేషం. **చవుపుటము** రూ.చూ. చౌపుటము. వి. నాలుగు కాళ్ళూ పైకెత్తి దాటే దాటు. **చవువంచ** రూ.చూ. చౌవంచి. వి. అయిదు. అచ్చ. రా.యు. 184. **చవువీథి** రూ. చౌవీథి. వి. శృంగాటకం, చతుష్పథం. చంద్ర భా. 1.64. **చవుషష్టి** రూ.చూ. చౌషష్టి. వి. అరవైనాలుగు. **చవుసట్టి** రూ.చూ. చౌషష్టి. వి. అరవైనాలుగు. **చవుసాల** రూ. చౌసాల. వి. చుట్టు కొల్లారు, నడుమ, బయట, నాలుగు పక్కలా కట్టడాలు గల ఇల్లు. **చవుసీతి** రూ. చౌసీతి. వి. ఎనభైనాలుగు. సారంగ. 2.74. సం. చతురశీతి. ఎనభైనాల్గు.

**చవుక** రూ.చూ. చౌక[1]. వి. 1. తక్కువైనది, అనాదరం. ఆము. 5.7 ; 2. లోకువ, ఎల్లిదం, తిరస్కారం.

**చవుకనేల** రూ. చౌకనేల. వి. ఇసక, ఎర్రమట్టి కలిసిన నేల. **చవుకపడు** రూ.చూ. చౌకపడు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు. **చవుకపఱుచు** రూ.చూ. చౌకపఱుచు. స.క్రి. తక్కువజేయు, న్యూనపరచు, కించపరచు. పరమ. వి. 2.31. **చవుకమట్టి** రూ.చూ. చౌకమట్టి. వి. ఎర్రమట్టికలిసినమట్టి. **చవుకమన్ను** వి. సవటమన్ను, కొంచెం ఎరుపుగా ఇసుక కలిసి ఉన్న మట్టి. **చవుకరేగడి** వి. పిప్పిరేగడి, నిస్సారమైన రేగడి. **చవుకసేయు(-చేయు)** రూ.చూ. చౌకచేయు. స.క్రి. తక్కువచేయు, న్యూనపరచు.

**చవుకము** రూ. చౌకము. వి. 1. నలుచదరపు మండపం. బసవ. 3.630 పం. 2. తువ్వాలు, తుండుగుడ్డ. విఀ. సమమైన, నాలుగుమూలలుకల, చతురస్రంగా ఉన్న. వైజ. 1.87.

సం. చతుష్క-. నలుచదరపు మండపం ; ప్రా. చఉక్క-, చఉగ-; శౌ. చదుక్కం ; అ.మా. జైమహా. చఉక్క ; పా. చతుక్క ; అప. చఉక్కం ;

క. చవుక, చౌక ; త. చవుక్కం, చతుక్కం.

<పా. చఉక్క-.

**చవుకళి** చూ. చవు. రూ.చూ. చౌకళి. వి. ముత్యాలు మొ. నాలుగేసిగుచ్చిన కర్ణాభరణ విశేషం.

**చవుకళించు** రూ.చూ. చౌకళించు. అ.క్రి. 1. నటించు, ఆడు. మను. 1.59 ; 2. లంఘించు, ఎగురు. పరమ. వి. 2.196. **చవుకళింత** రూ.చూ. చౌకళింత. వి. 1. చౌకళించడం, ఎగరడం ; 2. అశ్వగతి విశేషం. వల్గితం. **చవుకళింపు** రూ.చూ. చౌకళింపు. వి. అశ్వగతి విశేషం, వల్గితం.

**చవుకారము** రూ. చౌకారము. చూ. చవుడు. వి. సబ్బు, వస్త్రధావన పదార్థం. శుక. 3.103.

**చవుకి** రూ.చూ. చౌకి[1]. వి. కంచం.

**చవుకి**[1] రూ.చూ. చౌకి[1]. వి. సుంకర మెట్టు, పన్ను పుచ్చుకొనే చోటు.

**చవుకి**[2] రూ.చూ. చౌకి[2]. వి. దండ, మాల.

**చవుకు** రూ.చూ. చబుకు. వి. 1. చేరుకోల, కశ. సౌనంద.

2.24 ; **2.** నీట తడిసి మెత్తగిలి పోవటం.

**చవుకుచెట్టు** రూ. చౌకు చెట్టు. వి. నిటారుగా, పొడవుగా ఉండే ఒకరకం చెట్టు. వంట చెరకుగా ఉపయోగిస్తారు (Casuarina equisetifolia).

**చవుకులు** వి బ.వ. **1.** చప్పటి పీళ్ళు, జవ్వలు ; **2.** నీళ్ళలో నానిన తోలుమెత్తబడటం.

**చవుట** రూ.చూ. చౌట. వి. పెంపుడు చిలక మొదలైనవి ఉండే పంజరం.

**చవుటకట్టు** చూ. చవుడు. వి.పూర్తిగా చవుడున్న నేల, కొన్నిచోట్ల చవుడు, రేగడి కలిసినది.

**చవుటకర్రి** రూ. చవిటికర్రి, చవిటికర్రె, చవిటెకర్రె, చౌటకరి, చౌటకరె, చౌటకర్రె. వి. లేతనలుపు, కపిలవన్నె.

**చవుటకొమ్మ** రూ. చౌటకొమ్మ. వి. విశ్వశృంగం, వృక్ష విశేషం.

**చవుటగుల్ల** వి. గిట్టల సందు పుండు.

**చవుటపుల్ల** వి. తెలుపెక్కువ కలిసిన పుల్లరంగు.

**చవుటపొక్కిలి** చూ. చవుడు.

**చవుటరేగడి** చూ. చవుడు.

**చవుటరోగం** చూ. చవుడు.

**చవుటవరి** చూ. చవుడు.

**చవుటసన్నం** చూ. చవుడు.

**చవుటినేల** చూ. చవుడు.

**చవుటు** వి. చవు, చవుకము, నాల్గవభాగం.

**చవుటుప్పు** చూ. చవుడు.

**చవుటెర్ర** వి. ఇంకోరంగుకలవని ఎరుపు.

**చవుత్రేగడి** చూ. చవుడు.

**చవుడు** రూ.చూ. చౌడు[1]. వి. **1.** ఊసరక్షేత్రం, చౌటినేల. భార. ఉద్యో. 3 .76 ; **2.** ఊసర మృత్తిక, ఉప్పుమట్టి. ఆం.భా. 2.5.

క. చవుళు ; త. సవుడు.

**చవుట పొక్కిలి** వి. అక్కడక్కడ చవుడుమరకలుగలనేల. **చవుటరేగడి** రూ. చవత్రాగిడి, చవిత్రేగడి, చవుత్రేగడి. వి. చవుడు కలిసిన రేగడి. **చవుటరోగం** రూ. సౌటరోగం. వి. వరి తెగులు. **చవుటవరి** రూ. చౌటవరి. వి. ఒక జాతి వరిపైరు, ఒక రకంవడ్లు. **చవుటసన్నం** రూ. సౌటసన్నం. వి. చవిటి నేలల్లో వేసే సన్నరకం. **చవుటినేల** రూ. చవటి నేల, చవిటినేల. వి. నిస్సారమైన భూమి, ఉప్పుభూమి. **చవుటుప్పు** రూ.చూ. చౌటుప్పు. వి. రౌమకం, లవణభేదం. <చవుడు + ఉప్పు. **చవుత్రేగడి** రూ.చూ. చవుటరేగడి. వి. చవుడు కలిసినరేగడి. **చవుడుపర** రూ.చూ. చవుడుపర్ర. వి. పైన చవుడు కింద మన్నుగల నేల. **చవుడుపర్ర** రూ. చవుడుపర. వి. పైన చవుడు కింద మన్నుగలనేల.

**చవుతా** రూ. చౌతా. వి. డోలి, చిన్నపల్లకి.

**చవుతి** రూ. చవితి, చౌతి. వి. పక్షంలో నాల్గోతిథి. హరి. పూ. 2.134.

నం. చతుర్థీ. నాల్గోతిథి ; ప్రా. చఉత్థ, చఉత్థి-, చఉత్థీ, చొత్థీ, చతుర్థి ; జై. మహా. చవుత్థీ, చొత్థీ; శౌ.మా. చదుత్థీ ; అ.మా. చఉత్థీ ; పా. చతుత్థీ ; అప. చొత్థీ.

క. చవ్రతి, చౌతి ; తు. చౌతి ; త. చవ్రత్తి.

<ప్రా. చఉత్థి-.

**చవుతిచందురుఁడు** రూ. చవితి చందురుఁడు. వి. నాల్గవ తిథి నాటి చంద్రుఁడు. పాండు. 3.11.

**చవుతు**[1] రూ.చూ. చౌతు. వి. ఒక విధమైన కుళ్ళాయ.

**చవుతు**[2] రూ. సవతు, సవుతు. వి. పన్ను.

ఒ. చౌథ్, చౌథా ; గు. చౌథ్. నాల్గవవంతు ; మరా. చౌథ్. నాల్గవవంతు.

<మరా. చౌథ్.

**చవుదరి** రూ.చూ. చౌదరి. వి. **1.** పరగణాకుగాని, గ్రామానికి గాని పెత్తనకాడుగా ఉండే కాపు ; **2.** అధికారి.

**చవుదరితనము** రూ.చూ. చౌదరితనము. వి. గొప్ప అధికారం, గొప్పతనం.

**చవుదాయి** రూ.చూ. చౌతాయీ. వి. నాలుగోవంతు పన్ను.

**చవురు** రూ. చౌరు. వి. రసం, రుచి. ఆం.భా. 1.105.

**చవులము** రూ.చూ. చౌలము. వి. నాలుగు బేడలు, అర్థ రూపాయి.

**చవులిచ్చు** చూ. చవి[1].

**చవులు** రూ. చౌలు. వి.బ.వ. ముత్యం కాంతి.

నం. ఛవి-. కాంతి.

<నం. ఛవి- + -లు.

**చవులుగను** చూ. చవి[1].

**చవుళికాయలు** వి.బ.వ గోరుచిక్కుడుకాయలు, చెవళకాయలు.

**చవెల** రూ.చూ. చవలము. వి. వరహాలో ఎనిమిదవ భాగం ; నాలుగు చవలె లొక టంకం, నాలుగు డబ్బులు.

**చవ్వ** రూ.చూ. చప్ప[3]. వి. రసహీనం, చులకన. విష్ణు.ఉ. 4ఆ.

**చవ్వంచ** రూ.చూ. చౌవంచి. వి. అయిదు.

**చవ్వాకులు**[1] వి.బ.వ. చెవియాకులు, చెవియాకు నగలు, చెవిలో పెట్టుకొనే రంగు బూసిన తాటిఆకు చుట్ట. <చెవి + ఆకు + -లు.

**చవ్వాకులు**[2] వి.బ.వ. **1.** తీపి ఉప్పు కలిపిన నీళ్ళు ; **2.** నిష్ప్రయోజనమైన వస్తువులు. <చవి[1] + ఆకు + -లు.

**చవ్వు** రూ.చూ. చావు. వి. చావు.

**చాకకండాలు** రూ. శాకండాలు. వి.బ.వ. హెచ్చుతగ్గులు.

**చాకట్టు** వి. ధనం.

**చాకరకుండ** వి. చాకలిబాన, చాకళ్ళు ఉప్పులో బట్టలు ఉడక బెట్టటానికి వాడే పెద్దమట్టిపాత్ర.

**చాకరు** వి. నౌకరు, బంట్రోతు.

హిం.ఉ.పార. చాకర్. నౌకరు, భృత్యుడు.

<ఉ. చాకర్.

**చాకల** రూ.చూ. చాకి. వి. బట్టలు ఉతికి జీవించే జాతి.

**చాకలత** రూ.చూ. చాకిత. వి. **1.** రజకి ; **2.** దూతిక లలో ఒకతె. **చాకలది** వి. చాకలిస్త్రీ. <చాకల + అది. **చాకలపిట్ట** రూ.చూ. చాకలిపిట్ట. వి. భారద్వాజం, ఏట్రింత పిట్ట. **చాకలవాఁడు** రూ.చూ. చాకలివాఁడు. వి. చాకివాడు, రజకుడు.

**చాకలి** హి. మ. చా[illegible]. వి. బట్టలు ఉతికి జీవించే జాతి.

**చాకలిగూన** రూ. సాకలిగూన. వి. ఉడుకుగూన, [illegible], [illegible], చాకలి బట్టలు ఉడకబెట్ట టానికి వాడే పెద్దపాత్ర. **చాకలిచుక్క** వి. కుందేటిచుక్క, [illegible] నక్షత్రం. **చాకలిపిట్ట** రూ. చాకలపిట్ట. వి. [illegible]. **చాకలిపూలు** వి. ఒకరకం తలపాగ. **చాకలివాడు** రూ. చాకలవాడు. వి. రజకుడు.

**చాకి** హి. చా[illegible]. చాకలి, చాకె. వి. చాకలవాడు, చాకలి. [illegible] 1.11

[illegible] *కల్. దాయు. చాకలి [illegible] కలవాడు అని వ్యు. బట్టలు [illegible] కలవాడు అని భావం.

**చాకిగోనె** వి. చాకలిగూన, చాకలి బట్టలో పెట్టటాని కి వాడే పెద్దపాత్ర. **చాకిత** రూ. చాకలత. చాకెత. వి. రజకి [illegible] 2.434. **చాకిదాన** వి. 1. బాలక్రీడావిశేషం. [illegible] 3.11; **2.** చాకిదాని దాన; **3.** పక్షివిశేషం. **చాకిమనిషి** [illegible]. స్త్రీత్వం లేనిది. [illegible]. 11.[illegible] **చాకిమూట** వి. **1.** బాలక్రీడావిశేషం. హంస. [illegible]; **2.** చాకలి ఉతకటానికి తీసుకువెళ్ళే బట్టలమూట. **చాకిరేవు** వి. గ్రామంలో చాకలివాళ్ళు బట్టలు ఉతికే ప్రదేశం. [illegible] 2.46. **చాకిరేవుపెట్టు** స.క్రి. **1.** ఒకరి లోపాలను ఎత్తిచూపు, ఒకరి గుట్టుమట్టులు కడిగివేయు; **2.** బట్టలు ఉతుకు; **3.** బాగాకొట్టు. **చాకివాడు** వి. రజకుడు, చాకలివాడు. వేమన. [illegible].72.

**చాకిరి** వి. **1.** పరిచారకము. సానంద. 2.33; **2.** ఊడిగం, పరిచర్య. ఆం.బా. 2.235. **3.** సేవమైన కొలువు.

హిం. చాకరీ; మరా. చాకరీ; ఉ. చాకరీ; పార. చాకరీ, పరిచర్య.

<పా. చాకీ.

**చాకిరిమాన్యం** వి. గ్రామంలోని బారాబతీ (పన్నెండు) వృత్తులవారికి ఇచ్చిన భూమి.

**చాకీనామా** రూ. చాకిరి. వి. ఊరి[illegible]కర్లకు ఇచ్చిన బహుమతి.

**చాకీచేయు** స.క్రి. [illegible]చేయు.

ఉ. [illegible](కా). [illegible]చేయు, బద్దలుచేయు.

<ఉ. చాక్+చేయు.

**చాకు** వి. [illegible], [illegible], ఆం.బా. 2.244.

**చాకు** వి. కత్తి, కటారి, చురియ.

హిం.ఉ. చాకూ. కత్తి.

<ఉ. చాకూ.

**చాకె** రూ.చూ. చాకి. వి. రజకస్త్రీ.

**చాకెత** వి. రూ.చూ. చాకిత. వి. రజకస్త్రీ.

**చాకెకు** వి. [illegible] తమలపాకు.

**చాక్లెట్టు** వి. ఒక రకపు తీపిమిఠాయి. రూ.చూ. చేకిలేటు.

**చాకప్పులు** వి.బ.వ. టీ తాగటానికి వాడే మట్టితో చేసిన కప్పులు.

హిం.ఉ. చాయ్. టీ;

ఇం. *cups*. కప్పులు, పాత్ర విశేషాలు.

<హిం. చాయ్+ఇం. cups.

**చాగ** వి. చేవ, చేవకట్టె.

**చాగకా(డు** చూ. చాగము.

**చాగకానిమూల** చూ. చాగము.

**చాగర** వి. ఊరి ఉమ్మడి పొలం.

**చాగనార** వి. కలబందలో ఒకరకం కంచెమొక్క (Sansviera roxburghiana).

**చాగపట్ట** రూ. చాగమట్ట. వి. పెద్దకలబందలో ఒకరకం మొక్క (Sanrveria Leylanica).

**చాగపు(జెట్టు** చూ. చాగము.

**చాగపునవదో(ట** చూ. చాగము.

**చాగపుమ్రాను** చూ. చాగము.

**చాగపురాయ(డు** చూ. చాగము.

**చాగబారు** రూ.చూ. సాగ(బారు. అ.క్రి. నత్తువకల్గి నిగనిగ లాడు.

**చాగమట్ట** రూ.చూ. చాగపట్ట. వి. చాగనార, కలబందలో ఒకరకం కంచె మొక్క.

**చాగము** వి. **1.** ఈవి, దానం; భార. విరా. 1.67; **2.** త్యాగం.

సం. త్యాగ-. విడవటం, విసర్జించటం; ప్రా. చాగ-. త్యాగం, దానం; అ.మా. చాఅ, చాగ, చాయ, చిఅఅ; పా. చాగ. ఈవి, దానం. అప. చాఅ;

క. చాగ.

<ప్రా. చాగ-.

**చాగకా(డు** వి. **1.** కుబేరుడు, ధనదుడు. అచ్చ.రా.యు. 496; **2.** వదాన్యుడు, త్యాగశీలుడు. <చాగము+ -కా(డు. **చాగకానిమూల** వి. ఉత్తరదిశ. అచ్చ.రా.సుందర. **4.** **చాగపు(జెట్టు** వి. ఈవిమాను, దేవతరువు, కల్పవృక్షం. అచ్చ.రా.సుందర. 11. <చాగము+చెట్టు. **చాగపునన దో(ట** వి. నందనవనం. ప్రబంధ. 217. <చాగము+ నన+తో(ట. **చాగపుమ్రాను** వి. దేవతరువు. కల్పవృక్షం. వసు. 5.97, ప్రబంధ. 216. <చాగము+మ్రాను. **చాగపురాయ(డు** వి. కుబేరుడు. అచ్చ. రా. కిష్కిం. 151. <చాగము+రాయ(డు. **చాగరతనము** వి. చింతామణి. సం. త్యాగరత్న-. <చాగము+రతనము.

**చాగ(బడు** అ.క్రి. సాగిలబడు, సాష్టాంగపడు. పండి.చ. 1.302.

**చాగరతనము** చూ. చాగము.

**చాగరాడి** వి. పిండీతకం, గాడిదగడపర. ఆం.బా. 2.65.

**చాగరాడివెలికి** వి. పిండీతకం, గాడిదగడపర.

**చాగఅగొను** స.క్రి. చంపు. ఉ.హరి. 6.68. <చావు+ కఅగొను.

**చాగి** వి. చాగకాడు, వదాన్యుడు, త్యాగశీలుడు. కు.సం. 2.90, భాస్క.రా.కిష్కిం. 192, సిం.ద్వా. 1.72.

సం. త్యాగి-. వదాన్యుడు, దాత; ప్రా. చాగి; అ.మా. చాగి-; పా. చాగిన్. విసర్జించటం, దాన మివ్వటం;

క. చాగి. దాత.

<ప్రా. చాగి.

**చాగించు** చూ. చాగు.

చాగినవాఁడు చూ. చాగు.
చాగి(మొక్కు చూ. చాగు.
చాగిలఁబడు చూ. చాగు.
చాగిలి(మొక్కు చూ. చాగు.
**చాగు** రూ. చాఁగు[1], సాగు. అ.క్రి. **1.** వెడలు, పోవు, బయలు దేరు. శృం.నై. 4.129, ఆము. 4.25; **2.** ప్రవహించు, పారు. శివరా. 4.40, ఆము. 6.8; **3.** తిరుగు, సంచరించు. రుక్మా.చ. 3.3; **4.** జరుగు, ప్రవర్తిల్లు. జైమిని భా. 1.105, పి.శకు. 4.164; **5.** కూడావచ్చు, వెంటవచ్చు. కళా. 5.50; **6.** ఆరంభించు, మొదలిడు. ద.హిం.కా. 1.176, పరమ. వి. 5.159.
క. సాగు. వెడలు, ముందుకు కదలు; తు. సాగుని. పోవువెళ్ళు, అభివృద్ధిపొందు; చూచిని, పంగటం; త. చాయ్. గుంపుగా కదలు, పరుగెత్తి పోవు; కో. చాగ్. వెళ్ళటం, పోవటం, అనుకూలంగా ఉండు, జయించు; చాగ్బ్. జీవించు.
**చాగించు** స.క్రి. **1.** సాగేటట్లు చేయు, పోనిచ్చు. భాగ. 7.103; **2.** జరిగించు. జైమిని భా. 5.134. **చాగినవాఁడు** రూ. సాగినవాఁడు. వి. శ్రీమంతుడు, మాట చలామణి అయ్యేవాడు. **చాగి(మొక్కు** స.క్రి. సాష్టాంగ నమస్కారం చేయు. పండి.చ. 1.455. **చాగిలఁబడు** అ.క్రి. దండాకారంగా నేలకువాలు, సాష్టాంగపడు. అచ్చ.రా.యు. 47. **చాగిలి(మొక్కు** అ.క్రి. సాష్టాంగ నమస్కారం చేయు. జైమిని భా. 4.81, కళా. 5.76. **చాగుబడిక** వి. పూజ. హంస. 4.213.
**చాంగణ** రూ. చాంగిణ, చాంగిణము, చాంగిణి. వి. మల్లబంధ విశేషం. మల్లుపు. 3.69, ప్రబంధ. 7.90.
**చాంగిణ** రూ.చూ. చాంగణ. వి. మల్లబంధ విశేషం.
**చాంగిణము** రూ.చూ. చాంగణ. వి. మల్లబంధ విశేషం.
**చాంగిణి** రూ.చూ. చాంగణ. వి. మల్లబంధ విశేషం.
**చాంగు[1]** రూ.చూ. చాఁగు[2], అవ్య. వేత్రధారులు హెచ్చరికను తెలిపేటప్పుడు ఉపయోగించే పదం. పండి.చ. 4.295.
క. చాంగు.
**చాంగు[2]** రూ.చూ. చాఁగు[3]. అవ్య. ప్రశంసార్థకం.
**చాంగుబళా** అవ్య. భళిరే, సెబాసు. పండి.చ. 1.191. **చాంగుబళి** అవ్య. ప్రశంసార్థకం. **చాంగురె** రూ.చూ. చాంగురే. అవ్య. ప్రశంసార్థకం. పండి.చ. 1.83 వ. **చాంగురే** రూ. చాంగురె, చాఁగురె, చాఁగురే. అవ్య. ప్రశంసార్థకం. పండి.చ. 1.246.
**చాఁకిలి** చూ. చంక. వి. చంక, బాహుమూలం, కక్షం. బసవ. 3.1122, పండి.చ. 4.278.
**చాఁగ** వి. **1.** మూర్వ, మోరట. కళా. 3.15; **2.** జీడి మామిడిచెట్టు.
సం. (సవా. చాగచెట్టు.
<సం. (సవా.
**చాఁగఁబడు** చూ. చాఁగు[1].
**చాఁగటి** వి. నాశం.
**చాఁగటిగొట్టు (-కొట్టు)** స.క్రి. **1.** కొట్టు, మొత్తు. **2.** ఖండించు. **చాఁగటిగొను (-కొను)** స.క్రి. చావగొట్టు, అధికంగా కొట్టు, ఖండించు. ఉ.హరి. 6.68, 4.48. **చాఁగటిలాట** వి. హింస. <చాఁగటి + - లు + ఆట. **చాఁగటిలాడు** స.క్రి. వధించు. ఆం. భా. 3.123. <చాఁగటి + - లు + ఆడు.
**చాఁగిలి** చూ. చాఁగిలు. వి. నమస్కారం. భార. కర్ణ. 1.288, సాంబ. మాన 25.
**చాఁగిలింత** వి. నమస్కారం. హంస. 4 213.
**చాఁగిలు** చూ. చాఁగు[1].
**చాఁగిల్లు** చూ. చాఁగు[1].
**చాఁగు[1]** రూ.చూ. చాగు. అ.క్రి. **1.** దండాకారంగా నేలకు వాలు. నిర్వ.రా. 3.68; **2.** దీర్ఘమగు, పొడవగు, పెరుగు. భార.విరా. 1.162; **3.** సాష్టాంగ నమస్కారం చేయు. వరాహ. 7.97.
**చాఁగఁబడు** అ.క్రి. దండాకారంగా నేలకువాలు. బసవ. 4.150. <చాఁగు + -అ[7] + పడు. **చాఁగిలు** రూ. చాఁగిల్లు, సాఁగిలు. అ.క్రి. సాష్టాంగ నమస్కారం చేయు, మొక్కు. వరాహ. 1.132, ఆం.భా. 3.128. **చాఁగిల్లు** రూ.చూ. చాఁగిలు. అ.క్రి. మొక్కు, సాష్టాంగ నమస్కారం చేయు. **చాఁగుబడికెలు** వి.బ.వ. సాష్టాంగ వందనాలు. హంస. 4.214.
**చాఁగు[2]** రూ. చాంగు[1], సాంగు[1]. అవ్య. వేత్రధారులు హెచ్చరిక చేసేటప్పుడు ఉపయోగించే పదం. మను. 5.42, విజయ 2.72.
**చాఁగు[3]** రూ.చూ. చాంగు[2], సాంగు[2]. అవ్య. ప్రశంసార్థకం. పాండు. 1.113.
**చాఁగురె** రూ.చూ. చాంగురే. అవ్య. ప్రశంసార్థకం. విష్ణుపు. 3 ఆ.శుక. 1.268. **చాఁగురే** రూ.చూ. చాంగురే. అవ్య. ప్రశంసార్థకం.
**చాచా** వి. చిన్ననాయన, పినతండ్రి.
హిం. చాచా. పినతండ్రి.
<హిం. చాచా.
**చాచి** వి. స్తనం. ఆం.భా. 2.137. వేంక.ఆం.మాన. 39.
క. చాచి, తాచి. స్త్రీ స్తనానికి పిల్లలు ఉపయోగించే మాట; త. చాచి. తల్లి పాలు.
**చాచికొట్టు** చూ. చాఁచు. చేతికొలది చెంపపెట్టు పెట్టు.
**చాచిప్పలు** వి.బ.వ. టీ తాగడానికి వాడే చిన్న మట్టి పళ్ళెలు.
**చాంచు** చూ. చాఁచు. స.క్రి. పారదీయు, సరిపెట్టు. ఆరుబయట పడుగు పరచు.
**చాఁచు** స.క్రి. **1.** చావు, చాగజేయు. భార.ఆది. 8.261; **2.** ఏయు, ప్రయోగించు. భార. ద్రోణ. 2.249; **3.** ముందుకు పోనిచ్చు. హర. 5.16; **4.** ప్రసరింపజేయు. మను. 6.21; **5.** గడియవేయు. దశా. 4.46.
క. చాచు. పరచు, సాగదీయు, పొడుగు; చాపె. చాప; తు. చాచుని. చాచు, సాగదీయు; త. చాటు. చేతులు, కాళ్ళుచాచు; చాప్పై. చాప; మ. చాంపు. పొడవు, చాచు; గోం. సాహ్-అత్. పొడవు, చాచు; కుఇ. సాహ్ప. పరచు, పొడుగుచేయు; సాస్ప. పరచు.

[illegible]; [illegible]. చాచు; [illegible]. బయటికి [illegible]. చాచు; [illegible]. కుడు. [illegible]. చాపు; [illegible] పడంగా చాచు.

<[illegible].

చా[illegible] వి. ఒక [illegible] ఇంకో కయ్యకు నీరు [illegible] చిన్న గండిమండి నీరు మెల్లగా [illegible] వేసిన గట్టు.

చా[illegible].

చా[illegible] చూ. చాటు².

చా[illegible] వి. అసంతృప్తిమైన [illegible]. 7.65.

చా[illegible] చూ. చాటు¹.

చా[illegible] [illegible], [illegible] గదులుండి 'U' [illegible].

చా[illegible] [illegible], [illegible] చావగాను, చివర [illegible].

చా[illegible] చూ. చాటు¹.

చా[illegible] చూ. చాటు¹.

చా[illegible] చూ. చాటు¹.

చాటు [illegible] 1. [illegible], స్పష్టపరచు, వెల్లడించు. [illegible]. [illegible]4 ; 2. [illegible] మొ. వాటిని వాయించి [illegible] (విషయాన్ని) అందరకు తెలియజేయు. భార. [illegible]. [illegible]42.

[illegible]. కేకలువేస్తూ ప్రకటించు, గట్టిగా అరచు; [illegible]. [illegible] వార్తలు చెప్పు ; తు. సాఠియుని. [illegible] ప్రకటించు, గట్టిగా అరచు ; త. చాత్తు. [illegible], [illegible] చెప్పు ; [illegible]. పండుగ, పూజ ; [illegible]. గట్టిగా మాట్లాడు.

<[illegible].

చాటు[illegible] స.క్రి. చాటింపు వేయించు. నిర్వ.రా. 2.97. [illegible] 2.106. చాటించు స.క్రి. 1. డప్పు మొ. [illegible] (విషయాన్ని) ప్రకటించేటట్లు చేయు, చాట [illegible]. 223 ; 2. డప్పు మొ. వాయించి [illegible] (విషయాన్ని అందరకు) తెలియజేయు. చాటింపు వి. డప్పు మొదలైన వాటిని వాయించి చేసే [illegible]. చాటువు వి. 1. ప్రఖ్యాతి, ప్రసిద్ధి. నవనాథ. 1.6. [illegible] 3.104 : 2. దృష్టాంతం, ఉదాహరణం. ఆం. [illegible]. 1.113.

చాటు² [illegible]. వి. చాటు, మరుగు. హర. 4.11. విశ. [illegible], మరుగైన. వేంక. పంచ. 1.18.

[illegible], [illegible], మరుగుచేయు.

చాటు[illegible] వి. మల్లబంధ విశేషం, పన్నెండు మొనల్లో [illegible]. 75, హంస. 1.206. చాటిడు స.క్రి. [illegible]. పంచ. 3.16. చాటుకట్టు వి. చాటుపెట్టు. [illegible] గాలి ఎక్కువగా ఉండే పొయ్యి దగ్గర [illegible] అడ్డంగా పెట్టటం. చాటుగుడ్డ రూ. సాటు గుడ్డ. వి. [illegible], సాటు బట్ట. పాత్రల్ని వాడేటప్పుడు బట్టలపైన [illegible], [illegible] కుమ్మరి చుట్టుకొనే పాతబట్ట.

చాటుచేయు స.క్రి. మరుగు పరచు. క్రీడా. 95.

చాటు(దనము (-తనము) వి. గుప్తధనం, మరుగు. వేంక. పంచ. 1.18. చాటువడు రూ. చూ. చాటువడు. అ.క్రి. మరుగుపడు, దాగు. కవిక. 4.147. చాటుపాత వి. కుండల్ని సర్దేటప్పుడు సలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. చాటుబండ వి. అడ్డబండ, సన్షేడుగా వేసిన బండ. చాటుబల్ల వి. 1. సలప, ఆరుదలకు వచ్చిన చాటల్ని సర్దేసుత్తిలాంటి కొయ్య పరికరం ; 2. దిమ్మిస, కొయ్య లేక ఇనుముతో చేయబడి నేలనుగట్టి పరచటానికి వాడే పరికరం. చాటుబిటలు వి.బ.వ. పాత్రల్లో కనపడీ కనపడని నెర్రెలు. చాటుబోటులబావ వి. చంద్రుడు, హిమాంశువు. చాటుమాట వి. జనాంతికం, రహస్యం. చాటు వడు(-పడు) రూ. చాటువడు. అ.క్రి. మరుగుపడు. జైమిని భా. 2.9. చాటువెట్టు (-పెట్టు) స.క్రి. మరుగు పెట్టు. చాట్లుపెట్టు రూ. సాట్లుపెట్టు. వి. చాటుకట్టు, ఆము కాలేటప్పుడు గాలి ఎక్కువగా ఉండే పొయ్యిదగ్గర ఏదైన అడ్డుపెట్టటం.

చాట్లుపెట్టు చూ. చాటు.

చాడ రూ. చూ. చేడ వి. చేనుకు మొదటితడవ. నీరుపెట్టటం.

చాడగొట్టు రూ.చూ. చేడకొట్టు. అ.క్రి. పెట్లిపోవు.

చాడలెగురు రూ.చూ. చాడాలెగురు. అ.క్రి. పెట్లిపోవు, మట్టి పాకంలోపం వల్లగాని, కాల్పులోపం వల్లగాని ఆము, కాల్పు లో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

చాడాల వి. ఎర్రని పూలుపూసే పెద్దపొద (Helieteres isora).

చాడాలెగురు రూ. చాడలెగురు, సేడెలెగురు. అ.క్రి. పెట్లిపోవు, మట్టి పాకంలోపం వల్లగాని, కాల్పు లోపం వల్లగాని ఆము కాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

చాడి రూ. చాడీ. చాళి². వి. కొండెం, చెప్పుడుమాట. వేంక. పంచ. 1.532 ; శుక. 2.337.

క. చాడి. నింద ; త. సాడి ;

హిం. చారీ. కొండెం ; మరా. చాడీ. నింద.

<మరా. చాడీ.

చాడికత్తె వి. కొండేలు చెప్పే స్త్రీ. కలు. ४. 55. చాడి కా(డు వి. కొండేలు చెప్పేవాడు. నీతి. 46. చాడిచెప్పు స.క్రి. ఒకరిపై కొండేలు చెప్పు. రాజగో. 3.17.

చాడీ రూ. చూ. చాడి. వి. కొండెం, చెప్పుడుమాట.

చాడీకొట్టు రూ. చాడీగొట్టు. వి. చాడీకోరు, పిశునుడు. చాడీకోరు వి. చాడీలు చెప్పేవాడు. హిం. చారీఖోర్. చాడీలు చెప్పేవాడు. <హిం. చారీఖోర్. చాడీగొట్టు (-కొట్టు) రూ.చూ. చాడీకొట్టు. వి. చాడీకోరు, చాడీలు చెప్పేవాడు.

చాదుపు రూ.చూ. చాద్పు. వి. విధం, రీతి.

చాద్పు రూ. చాదుపు. వి. విధం, రీతి. భార. ఆది. 3.38.

చాణక్యుడు వి. రాజనీతి తంత్రజ్ఞుడు, యుక్తులు బాగాతెలిసిన వాడు.

సం. చాణక్య-. చంద్రగుప్తుని మంత్రి.

<సం. చాణక్య- (అర్థవిపరి.).

**చాణి** వి. పరియాచకం, ఎగతాళి.

**చాండు** రూ. సాండు. వి. విత్తనపుకోడె.

**చాతని** రూ.చూ. చాతాని. వి. వైష్ణవమతావలంబి అయిన ఒక జాతి శూద్రుడు, బోడిదాసరి.

**చాతబడి** రూ. చేతబడి. వి. క్షుద్రదేవతల మంత్రాలను వైరుల పై ప్రయోగించి బాధించటం.

**చాతాని** రూ. చాతని, సాతాని. వి. వైష్ణవ మతావలంబి అయిన ఒకజాతి శూద్రుడు, బోడిదాసరి.

క. చాతాణి. వైష్ణవ మతస్థుడు ; త. చాత్తాణి.

<త. చాత్తాణి.

**చాతానివాఁడు** వి. వైష్ణవుడైన శూద్రుడు. **చాతానిది** వి. వైష్ణవ శూద్ర స్త్రీ. <చాతాని + అది.

**చాతించు** స.క్రి. ఇచ్చు.

**చాతు** స.క్రి. 1. (శిఖాయజ్ఞోపవీతాల్ని) ధరించు. బసవ. 1. 538; 2. సమర్పించు. రామాభ్యు. 6.180.

త. చాత్తు. ధరించు, అలంకరించు ; పో.చూ. మ. చార్తుక.

**చాతుపడి** వి. చందనం.

**చాద** రూ.చూ. చేద. వి. 1. బావినీళ్ళు చేదుకొనే తాడు ; 2. బావినుండి నీరు చేదుకొనే చిన్న బిందె వంటి పాత్ర.

**చాదర** రూ. చాదరు, చెద్దర్, ఛెద్దర్. వి. వస్త్ర విశేషం. ప్రబంధ. 605.

హిం. చాదర్. వస్త్ర విశేషం ; మరా. చాదర్. వస్త్రవిశేషం; ఉ. చాదర్. ప్రచ్ఛాదనం; పార. చాదర్. వస్త్రవిశేషం.

<ఉ. చాదర్.

**చాదరాసి** రూ.చూ. చేఁతరాసి. వి. ఒకకూరాకుచెట్టు.

**చాదరు** రూ.చూ. చాదర. వి. వస్త్ర విశేషం.

**చాదవ**[1] వి. చాకిరి, హీనసేవ.

**చాదవ**[2] చూ. చాదానము. వి. (వ్యంగ్యంగా) చేసినపని.

**చాదస్తము** రూ. చేదస్తము. వి. 1. వెర్రితనం, 2. ఛాందసం.

సం. ఛాందసత్వ-. వేదవిద్భావం.

<సం. ఛాందసత్వ- (అర్థవిపరి.).

**చాదస్తుఁడు** రూ. చేదస్తుడు వెర్రివాడు.

సం. ఛాందస-. వేదవిత్తు.

<సం. ఛాందస- (అర్థవిపరి.).

**చాదానము** చూ. చాదవ[2]. వి. (వ్యంగ్యంగా) చేసినపని.

**చాదీవెండి** వి. ఊదు వెండి, మేలిరకం వెండి.

హిం. ఉ. చాందీ. వెండి.

<హిం. చాందీ + వెండి.

**చాదుడుకర్ణి** వి. గచ్చునేలను నునుపు చేయటానికి వాడేకరణి.

**చాన**[1] వి. ఆడది, ఇంతి. భార. స్త్రీ. 1.119.

సం. శ్యామా. యౌవన మధ్యస్థఐన స్త్రీ.

**చాన**[2] క్రి. విశే. ఎక్కువ.

**చానపి** వి. కలయంపి. ఆం. భా. 2.23. సహదేవ. 1.12.

**చానపిపట్లల్కు** స.క్రి. పట్టెలు తీర్చి పేడనీళ్ళతో అలుకు. బసవ. 7.204.

**చానరి** వి. నాట్య విశేషం.

**చాంత్రాడు** రూ. చేంత్రాడు. వి. నీళ్ళుతోడేతాడు.

<*చేంటు + త్రాడు.

**చాందవ** రూ.చూ. చందవ. వి. చందువ అనేసముద్రం చేప.

**చాందిని** వి. 1. మేలుకట్టు, వితానం. వేఙు. శ. 13 ; 2. పళ్ళెం, బావికి చుట్టూ కట్టిన అరుగు.

హిం. చాంద్‌నీ. చంద్రిక, వెన్నెల.

<హిం. చాంద్‌నీ.

**చాందీ** విశే. మెరుగులేని.

**చాఁదు** స.క్రి. 1. అరగదీయు, రాయు. కు. సం. 7.9. 44; 2. బొట్టు పెట్టుకొను. వైజ. 4.93. విష్ణుపు. 2.28 ; 3. రుద్దు, నీళ్ళుచల్లి నున్నపరచు. వి. 1. నల్లని సుగంధ ద్రవ్య విశేషం. హర. 5.37 ; 2. గృహాదుల అలంకారానికి ఉపయోగించే వస్తువు. మను. 5.71 ; 3. కర్రకాలేటప్పుడు స్రవించే ద్రవం ; 4. కంటికాటుక, కాటుక.

క. తే. తేయ్, తేయు. నూరు ; చచ్చు, చెచ్చు. పొడి చేయు, నూరు, నలగకొట్టు ; తు. తేపుని. రుద్దటం, నునుపు ; త. తేయ్. రుద్దటం ; మ. తేయుక. రుద్దబడు.

మూ. ద. ద్రా. *చాయ్ ; *తేయ్ (< *చేయ్-.) ; <మూ.ద్రా. *చాయ్-/*చేయ్.

**చాఁదుచేయు** స.క్రి. పలచన చేయు. హర. 2.121.

**చాఁదుబొట్టు** వి. చాదుతోపెట్టుకొన్నబొట్టు. హంస. 4.40.

**చాన్సిలరు** వి. ప్రభుత్వంలోకాని, న్యాయశాఖలోకాని పలు తరగతులకి చెందిన ఉద్యోగి.

ఇం. *Chancellor*. ప్రభుత్వంలో పలుతరగతులకి చెందిన ఉద్యోగి.

<ఇం. Chancellor.

**చాప** రూ.చూ. చాఁప. వి. 1. వెదురు బద్దలు మొ. వాటితో నేయబడే కూర్చుండటానికి ఉపయోగపడేది, కటం; 2. తెరచాప ; 3. చేపల్ని పట్టటానికి ఉపయోగించే సాధన విశేషం.

**చాపకిందినీరు** వి. తెలియకనే ఆపద తెచ్చేది. తాళ్ల. 8.105. **చాపచదరగు** అ.క్రి. నానాటికి దిగజారు. **చాపనేత** వి. ఒకరకం నేత. **చాపసింప** వి. మట్టిపైన కప్పటానికి వాడే చింకిచాప.

**చాపను** రూ. తాపెన. వి. బట్టీచుట్టూ పేర్చిన ఇటుక.

**చాపరుపు** చూ. చావు.

**చాపా** చూ. చప్పు[1]. వి. ముద్ర.

**చాపిపుచ్చు** చూ. చాపు.

**చాపిపుచ్చుకొను** చూ. చాపు.

**చాపు** రూ.చూ. చాఁపు. వి. 1. దూలంమీద అడ్డంగా కాని, దూలానికి బదులుగా కాని, గోడల మీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కిన వాసం ; 2. మిద్దెగోడల మీదవేసే అడ్డుకడ్డీ ; 3. వెన్నుగాడి, ఇంటి నడి కొప్పును మోసే కర్ర ; 4. పూరింటి చుట్టూ గోడకు బదులుగా పాతే చిన్న కొయ్య స్తంభం ; 5. తొక్కుడుపెట్టె, రాట్నం అడ్డపట్టె ; 6. సరిబయలులోగాని, నేతబయలులో గాని పారదీసిన పడుగు నూలు ; 7. పానుపుపట్టె. స. క్రి. పారదీయు, సరిపట్టు.

చాపిపుచ్చు స.క్రి. చాచికొట్టు, చెంపపై చాపికొట్టు. పండి. చ. ద్వితీ. 4.126. చాపిపుచ్చుకొను స.క్రి. చాచి లెంపకాయ కొట్టు. చాపుకట్టె వి. అనుపేటలు బిగించిన పొడుగుపట్టె. చాపుకలియు అ.క్రి. రెండుఉరువుల నేత పూర్తిఅగు. చాపుడుమగ్గం వి. పడుగు పూర్తిగా చాపి నేసే మగ్గం. చాపులపడుసు వి. పంచెల చాపుల నేతకు వాడే పడుగునూలు.

చాప్లెయిన్ వి. మత గురువు.

ఇం. *chaplain*. మత గురువు.

<ఇం. chaplain.

చాప్స్[1] వి.బ.వ. 1. (ఎంత వల్ల భూమి, గాలివల్ల చర్మం మొ.) బీటలు ; 2. పగుళ్ళు (ముఖ్యంగా చర్మంలో).

<ఇం. *chaps*. బీటలు.

చాప్స్[2] వి.బ.వ. (ముఖ్యంగా జంతువుల) దౌడలు.

<ఇం. *chaps*. దౌడలు.

చాప్స్[3] వి.బ.వ. పురుషులు, బాలురు, వ్యక్తులు.

<ఇం. *chaps*. పురుషులు.

చాబాషు రూ. చూ. శాబాసు. వి. ప్రశంసా సూచక శబ్దం.

చాబాసు రూ. చూ. శాబాసు. వి. ప్రశంసా సూచక శబ్దం. కృష్ణ. 4. 64.

చాబిడ్డ చూ. చావు.

చాబిరాతు వి. కుయ్యంరాయి, రాతితో కట్టిన అర్చి మధ్యభాగంలో బలంకోసం బిగించినపెద్దరాయి.

చామ[1] వి. 1. యౌవనంగల స్త్రీ, యువతి. భార. మౌసల. 1.185 ; 2. స్త్రీ, భార్య, ఆడది.

సం. శ్యామా. యౌవన మధ్యస్థజనస్త్రీ, యువతి, స్త్రీ, సుందరి ; ప్రా. సామా. స్త్రీ, సుందరి, తరుణి ; అ.మా. సామ. నల్లని దేహచ్ఛాయ గల ఆడది ; పా. సామా. అందమైనది.

క. చామ ; త. చామి.

<ప్రా. సామా.

చామ[2] రూ. శామ, సామ, సావ, సోను, సోవ. వి. ఆవాలు మాదిరి గాఉండే ఒకరకం ఆహార ధాన్యం. జైమిని భా. 4.95. (Panicam frumentaceum roxf). ఆం.భా. 2.235, హంస. 4.127.

సం. శ్యామాక-. ఆవాలు ; ప్రా. సామఓ, సామయ, సామగ-, సామాయ. ధాన్యవిశేషం; అ.మా. సామగం, సామా, సామాయ. చామగడ్డి; పా. సామాక; నే. సామా. వరిపైరులోని ఒకకలుపు మొక్క ; బెం. సామా ; మరా. సావ.

క. సామె, సావె ; తు. సామె, సావె ; త. ఐయాకమ్, చామై ; మ. చామ, పర్జి. చామ.

<ప్రా. సామయ.

చామగడ్డి వి. పశువుల మేతకు ప్రశస్తమైన ఒక కలుపుమొక్క (Panicam crus-galli linn). చామపువ్వులు వి.బ.వ. ధాన్యవిశేషం.

చామ[3] వి. ఒక విరమైన పడవ.

చామ[4] వి. పొదవుగా పెరిగే ఒకరకం మొక్క (Echinochola calona linn).

చామగడ్డ వి. చామదుంప, ఒక జాతిదుంప.

చామకాడనార వి. సముద్ర తీర ప్రాంతాల్లో పెరిగే ఒకరకం పొద లేక తీగ (Sansevieria Roxbughiana).

చామన రూ. చామనము. విశ. 1. నల్లని, కృష్ణం. రామాభ్యు. 3.51 ; 2. ఆకుపచ్చని ; వి. 1. నలుపు, నీలవర్ణం ; 2. పసరు ఛాయ, ఆకుపచ్చ.

సం. శ్యామల-. కృష్ణవర్ణం ; ప్రా. సామల-, సామలయ. నల్లని రంగు కలది ; సామలిఅ. నల్ల బడటం. అమా. సామల-. నలుపు ; పా. సామ ; అప. సామల ; నే. సాపుల్, సావలో ; మరా. సాంవళా, సావళా;

క. చామ, సామ, సామె, సావె, నలుపు, నల్లనిది, ముదురు నలుపు, ఆకుపచ్చ, ముదరాకుపచ్చ.

<ప్రా. సామల-.

చామనచాయ వి. 1. కృష్ణవర్ణం, నలుపు. మను. 6.102 ; 2. శ్యామవర్ణం, ఆకుపచ్చ. ఆం. భా. 1. 108.

చామనము రూ. చూ. చామన. వి. 1. పసరు ఛాయ, ఆకుపచ్చ. సాంబ. స్థా. 60 ; 2. నలుపు, నీలవర్ణం ; విశ. 1. నల్లని, 2. ఆకుపచ్చని.

చామంతి రూ. చూ. చేమంతి. వి. పసుప్పచ్చని, తెల్లని పూలు పూసే ఒకరకం చెట్టు 4.154 (Helicteres Isora) రాధా.

చామంతిపువ్వు రూ.చూ. చేమంతిపువ్వు. వి. 1. ఒకరకం పువ్వు ; 2. స్త్రీలుజడలోపెట్టు శానేనగ.

చామరకొలుపు వి. చామర సేవ.

సం. చామర –. చామరం.

<సం. చామర - + - కొలుపు (మిశ్ర స).

చామరలిడు స.క్రి. వింజామరలతో వీచు. భార. శాంతి. 1.149.

సం. చామర–.

<సం. చామర – + లు + ఇడు.

చామెరమాడలు వి. బ.వ. మాడ విశేషం.

చామెరలుపెట్టు ( - పెట్టు) స. క్రి. వింజామరలతో వీచు. కు.సం. 9.21.

సం. చామర –. చామరం.

చా(ప రూ. చాప. వి. 1. తెరచాప, గాలిపోసుకొని ఓడను పడిగా నడపటానికి ఓడకంబానికి కట్టే ముతకగుడ్డ. భార. ఉద్యో. 4. 116. దశకు. 10.63 ; 2. చేపలను పట్టటానికి ఉపయోగించే సాధనం. జైమిని భా. 2.97 ; 3. కటం, తుంగ, మొ. వాటితో చేయబడి పరచుకొనే సాధన విశేషం. ఆం. భా. 2.164.

క. చాప, చాపె, సాపె. చాప ; త. చాప్పై, కటం, తుంగ మొ॥ వాటితో తయారు చేయబడి పరచు కొనే సాధనం ; మ. చాప్ప. గుడిసె, పాక ; తొ. సా.పి. పడుకొనేచాప ; కువి. జాపె ; పర్జి. చాప్.

<మూ.ద్రా.* చాప్.

చా(పకట్టు వి. చదును, నేలచదును, నేలమట్టం, చాప పరుపు వంటి పరువు. భార. విరా. 4.173. క్రి. విశ. నేలమట్టంగా, నేల చదునుగా. భార. విరా. 3,156.

చా(పకట్టుగా(గూలు అ.క్రి. కుప్పగూలు. కాశీ. 6.227. చా(పకట్టువడ(గొట్టు స.క్రి. కుప్పగా కూలేటట్లు కొట్టు. జైమిని భా. 2.31. చా(పకట్టువడు (-పడు) అ.క్రి. చాప పరచి నట్లగు. భార. విరా. 3.156. చా(పకొయ్య వి. తెర చాప కట్టే కఱ్ర. చా(పగద్ద వి. కుందేళ్ళను పట్టే ఒక జాతి డేగ. చా(పచుట్ట(గ(జుట్టు స.క్రి. చాపను చుట్టి నట్లు చుట్టు. కళా. 6.20. చా(పచుట్టు వి. చాప చుట్ట వంటి చుట్టు. ఉ.రా. 2.13. చా(పచుట్టువడు (-పడు) అ.క్రి. గుదిగొను. చా(పటి వి. బెల్లంకలిపిన లావుదోసె. చా(పట్టు వి. పలచని. పెద్దఅట్టు. శృం. నై. 6.120 < చా(ప + అట్టు. చా(పన్నలు వి.బ.వ. చవటలు. బసవ. 6.163. < చా(ప + అన్నలు. చా(పబండి వి. చాపతో గూడుకట్టిన బండి, గూటిబండి. ద్వి.భాగ. 2.32 పు. చా(పలాయి వి. చాపలాగ పలచగాను, చదునుగాను ఉండే నల్లబిరాయి. ఆం.భా. 2.29. చా(పలల్లువా(డు వి. కటకారుడు, మేదరి. < చా(ప + లు + అల్లువా(డు. చా(పలు వి. బ.వ. చిక్కులు (అర్థవిపరి.).

చా(పు చూ. చా(చు. రూ. చాపు, సాపు. స.క్రి. చాచేట్లు చేయు, సాగచేయు, దీర్ఘంచేయు. హరి. పూ. 6.177. శృం. నై. 1.77 ; వి. 1. దీర్ఘత్వం, పొడుగు. ప్రసారం, ఆము. 6.78 ; 2. దీర్ఘాక్షరం. అప్ప. 2.10 ; 3. కలిపి నేసిన బట్టలజత; విణ. దీర్ఘమైన, పొడవైన. ప్రబంధ. 186.

చా(పుఊట వి. బావిలోపలి భాగం అంతటిలో ధారాళంగా ఊరే నీటిఊట.

చాయ వి. 1. వర్ణం, రంగు. భార. ఆది. 7.98 ; 2. కాంతి. కు.సం. 6.146 ; 3. నీడ, అనాతపం, ప్రతిబింబం. భాస్క. రా. యు. 1378 ; 4. తోవ, మార్గం. కాశీ. 3.121, శృం. నై. 7.37 ; 5. సూర్యునిభార్య ఛాయాదేవి. పారి. పీఠి. 24 ; 6. అన్యాపదేశం. పారి. 1.88 ; 7. పోలిక. వసు. 3.113, కువ.చ. 4.155 ; 8. చూచాయ, జాడ. విష్ణుపు. 3.19 ; 9. స్థలం, చోటు. ఉ.రా. 4.166, విష్ణుపు. 7.104 ; 10. దిక్కు, వైపు. దశా. 2.239 ; 11. సమీపం, దరి. దశా. 3.8 ; 12. రుజు భావం, సూటి. బిల్హ. 1.33 ; 13. ఒకానొక స్త్రీ రాగం. ప్రబంధ. 95 ; 14. వన్నె. విధం, రీతి. కృష్ణ. 3.43, చంపూ. రా. 2.57 ; 15. చక్కన, ఎదురు ; 16. కాంతి కిరణాల వల్ల కంటిలోపలి తెర ఆధారంగా కలిగేవర్ణ జ్ఞానం.

సం. ఛాయా. నీడ, ప్రతిబింబం ; ప్రా. ఛాయ, చాహా చాహియా, ఛాహీ. నీడ, ప్రతిబింబం, కాంతి. శౌ. చాఅ ; అమా. ఛాయా ;

క. చాయ. రంగు. నీడ ; తు. చాయ, చాయె. నీడ, వర్ణం, రంగు ; త. చాయ, చాయమ్ ; మ. చాయమ్, రంగు.

< ప్రా. ఛాయా.

చాయఅద్దు అ.క్రి. నేసినబట్టకు రంగు వెయ్యటం. చాయకువచ్చు అ.క్రి. దారికి వచ్చు, మాటవిను. వర.రా. బాల.పు. 76 18. చాయకొడుకు వి. శనిగ్రహం, ఛాయాపుత్రుడు. చాయకొమెర వి. పాకలో మరో కొమరతో ఒకే వాలున ఉండి వెన్నుమోసే కొమర. చాయగోసు వి. చిరుతపులి. హంర. 7. 38. చాయచాలు రూ. సాయిసాలు. వి. చక్కగావేసే చాలు. చాయచెక్కచెట్టు వి. రంగు వేయటానికి ఉపయుక్తమైన చెక్కగల చెట్టు. చాయజొన్నల చుక్క వి. కుందేటిచుక్క, శుక్రుడనే నక్షత్రం. చాయతొగరు రూ. సాయి తొగరు. వి. నిండు ఎరుపురంగు. చాయనలుపు వి. కొంచెంనలుపు, చామన చాయ. చాయపప్పు వి. దంచిన మినప, పెసలు మొ॥ వాటి పప్పు. చాయపసుపు వి. కాంతిగల పసుపు, ఒక రకం పసుపు దుంప. చాయపెనిమిటి వి. ఛాయాదేవి భర్త, సూర్యుడు. ఆం.భా. 1.81. చాయమగ(డు వి. ఛాయాదేవి భర్త, సూర్యుడు. అచ్చ. రా.ఆరణ్య. 48. చాయమడవ వి. ఒకమడవకు నేరుగాఉండే మరోమడవ. చాయమేకు వి. ఇరుసు సీలకు బిగించేమేకు. చాయల(బల్కు స.క్రి. సైగలుచేయు. పారి. 4.16. < చాయ + -లు + -అ[7] + పల్కు. చాయవాటులు వి.బ.వ. అన్యాపదేశంగా పలికే మాటలు. కాళ. 4.30. చాయవాఱు (-పాఱు) అ.క్రి. 1. పొడనూపు, కనపడు. శివరా. 3.71 ; 2. సరిపడు. శృం.నై. 3.42. చాయవెట్టు(-పెట్టు) స.క్రి. రంగువేయు. చాయవెన్నెల వి. పండువెన్నెల. పాండు. 1.15. చాయవేయు అ.క్రి. రంగువేయు, నూలుకు రంగు పట్టించు. చాయాకు రూ. సాయాకు. వి. నల్లటి ఆకుల కలుపు మొక్క. < చాయ + ఆకు.

చాయాకు చూ. చాయ.

చాయలాపాయలా వి. టక్కరి. క్రి.విణ. బులబులాగ్గా, చులాగ్గా.

చాయికఱ్ర వి. వాసం.

చాయించు చూ. చాయు.

చాయు స.క్రి. పారదీయు, సరిపెట్టు, ఆరుబయట పడుగు పరచు.

చాయించు వి. పారదీయు, సరిపెట్టు, ఆరుబయట పడుగు పరవటం.

చార[1] రూ.చూ. చాఱ[1]. వి. 1. రేఖ, నిలువుగీత ; 2. వ్యాఘ్రవర్ణం.

చారగొర్రె వి. రంగు చారలు గల గొర్రె. చారపొట్ల రూ. సారపొట్ల. వి. ఒకరకం పొట్లకాయ. చారపోగు వి. సరిచేసిన పడుగులో, తడీ పొడిగా ఉన్న పోగు ; కొంత భాగం ఎండి, కొంత భాగం ఎండని పడుగు. చారబుడమ వి. గింజమీద చారలు ఉండే రకం బుడమ. చారలకమ్మి వి. జొన్నఊచ మండంలో తెల్లగీరలు పడేట్టు రంగు నూలుతో నేసిన కమ్మి. చారలచీర వి. రంగులో గీరలు గీరలుగా నేసిన చీర. చారలంచు వి. కడ్డీల మాదిరిగా వరసగా నేసిన అంచు. చారలబట్టీ వి. అయిదారు గుండ్రటి వరసలుగా పెంకుల్ని ఒక వరసపై మరొకటిగా పేర్చి కాల్చే బట్టీ.

చార[2] రూ.చూ. చేఱ. వి. చేరెడు.

చారెడు వి. చేరనిండా, కొంచెం బియ్యం.

చారపప్పు వి. 1. ఒక అడవి తీగచెట్టుకు కాసిన గట్టి చిన్న కాయలలో గల మెత్తటి పప్పు ; 2. చాయన పప్పు.

చారాచారెడు విణ. విశాలమైన.

చారిక వి. ఒకరకం బొట్టు, పత్తిరి బొట్టు.

**చారియట్** వి. రథం, తేరు, విమానం.

ఇం. *Chariot*. రథం.

<ఇం. Chariot.

**చారు**[1] రూ. చేరు[2]. వి. **1**. మిరియాలు మొ. దినుసులు చేర్చి కాచిన చింతపండు రసం. హర. 2.31, రాజవా. 2.105 ; **2**. సున్నం కలిపిన కల్లు.

సం.ప్రా. అ.మా. పా. సార-. రసం, సారం ;

క. చారు. సారు ; తు.మ. చారు. చే ; త. చారు, చేఱు.

<ప్రా. సార-.

**చారుదాక** వి. మూతి ఇరుగ్గా కొంచెం లోతుగా ఉండే మట్టిపాత్ర.

**చారు**[2] స.క్రి. చీపురుకట్ట మదమతో మూర్చిన కళ్ళాన్ని ఊడ్చు.

త. చారు, సారు.

**చారుగోమి** వి. ఒకరకం నేతచీర, జిలిజిలి చీర.

**చారుచీర** వి. ఒకరకం నేతచీర, జిలిజిలి చీర.

**చారె** రూ.చూ. చేఅ. వి. హస్తం.

**చార్‌కోరి** వి. ఒంచులో నేసిన నాలుగు గీరలు.

హిం. చార్. నాలుగు.

**చార్‌జమా** వి. నాలుగువైపులా నాలుగు రంగు పట్టెలు, నాలుగు పూలు, మధ్య మరొక పువ్వు పడేట్టు నేసిన జంపఖానా.

హిం.ఉ. చార్. నాలుగు ; జమా. ఒక చోట పోగు పడటం.

**చార్జి** వి. బరువువేయటం.

ఇం. *Charge*. బరువువేయు.

<ఇం. Charge.

**చార్‌మినార్** వి. నేతలో, చార్మినార్ ఆకారంలో నేసిన డిజైను.

హిం.ఉ. చార్. నాలుగు ; మినార్. స్తంభాలు ; చార్ మినార్. హైదరాబాద్‌లోని ప్రసిద్ధ కట్టడం.

<ఉ. చార్‌మినార్ (అర్థవిపరి.).

**చార్వాకముచేయు** స.క్రి. పిడివాదం చేయు.

సం. చార్వాక-. ప్రసిద్ధ నాస్తికముని అయిన చార్వాకునికి సంబంధించినది.

<సం. చార్వాక- + -ము + చేయు.

**చాలు**[1] రూ. చార[1]. వి. **1**. రేఖ. ప్రబంధ. 9 ; **2**. వ్యాఘ్ర వస్త్రం. ఆం.భా. 2.82.

క. చాళు. రేఖ, గీత ; త. చాళై. రేఖ, గీత.

**చాలుకంద** వి. పిండాలువు, ఒకరకం కంద. **చాలుమామిడి** వి. చారకంద. **చాలుమీను** వి. ఒక జాతి చేప. హంస. 4.187. **చాలులమెకము** వి. వ్యాఘ్రం, పెద్దపులి. వ్యు. చారలున్న మృగం. వరాహ. 5.118. **చాలిక** వి. **1**. చార, రేఖ. కాశ. 3.95, శుక. 2.76 ; **2**. వ్యాఘ్రవస్త్రం. ఆం.భా. 2.82 ; **3**. తిలకవిశేషం. ఆం.భా. 2.160.

<చాలు[1] + -ఇక.

**చాలు**[2] వి. ప్రియాలం, జొన్న. హంస. 4.11.

**చాలుపప్పు** వి. ప్రియాల పప్పు. మను. 4.14. **చాలు బియ్యము** వి. వెదురు ఇత్యాదులలోని బియ్యం. భోజరా. 6.258.

**చాలు**[3] రూ.చూ. చేఅ. వి. చేరెడు.

**చాలుగలాడు** స.క్రి. చంపు, సంహరించు.

**చాలిక** చూ. చాలు[1].

**చాల** చూ. చాలు[1].

**చాలగు** చూ. చాలు[1].

**చాలమి** చూ. చాలు[1].

**చాలయిపోవు** చూ. చాలు[1].

**చాలా** రూ.చూ. చాల. విశే. మిక్కిలి.

**చాలాకీ** చురుకైన, చలాకీ.

హిం.ఉ. చాలాకీ. చాతుర్యం.

<ఉ. చాలాకీ.

**చాలాకోల** రూ. చాలాకోలి. వి. కొరడా, జాటి, చబుకు.

హిం.ఉ. చర్‌నా. పశువుల్ని అదలించేది.

<ఉ. చర్‌నా + కోల.

**చాలాకోలి** రూ.చూ. చాలాకోల. వి. కొరడా, జాటీ, చబుకు.

**చాలాబాదు** రూ.చూ. సాలాబాదు. వి. గ్రామ దేవాలయం యొక్క మరమ్మత్తు ఖర్చులు.

**చాలిక** చూ. చాలు[1].

**చాలిచ్చు** స.క్రి. జాడించు.

**చాలించు** చూ. చాలు[1].

**చాలినవాఁడు** చూ. చాలు[1].

**చాలియా** వి.బ.వ. తెల్లవక్కలు.

**చాలియుండు** చూ. చాలు[1].

**చాలీ** వి. ఒకరకమైన ధోరణి, చపలు.

హిం. చాలీ. ధూర్తుడు, కపటి.

<హిం. చాలీ.

**చాలు**[1] అ.క్రి. **1**. తగు, అర్హమగు. భార.ఆది. 1.51 ; **2**. పర్యాప్తమగు, సరిపోవు. భార.విరా. 1.219 ; **3**. అనుకూలమగు. భార.ఉద్యో. 4.298 ; **4**. సరిపడు, సమానమగు, దీటగు. భార. కర్ణ. 3.3 ; **5**. అంగీకరించు, ఇష్టపడు. భార.శాంతి. 1.22 ; **6**. పర్యాప్తి, సమృద్ధి. భోజ. 2.8 ; **7**. సమాప్తమగు, ముగియు. కవిక. 6.91 ; **8**. సమర్థమగు.

క. సాల్, సాలు. తగిన, సమృద్ధిగా ; తు. సాకు. చాలు ; త. చాలు, సాలు. సమృద్ధిగా, విస్తారమైన, తగిన ; మ. చాల. సమృద్ధిగా, నిండుగా ; పో.చూ. కుఇ. సార. అధికంగా ; కువి. హాల్. సమృద్ధిగా ; పో.చూ. కువి. హార్. ఉండటం, నిలవటం ; పో.చూ. మాల్తో. సారి. పూర్తిచేయు ; పో.చూ. బ్రా. సార్. సంతృప్తి చెందు.

మూ.ద.ద్రా *చాల్.

మూ.ఉ.ద్రా. *చార్.

చాల రూ. చాలా. అవ్య.ద్రు. మిక్కిలి. భాగ. ఆరణ్య. 3.61. **చాలగు** అ.క్రి. విసుగుదల కలుగు. హరి.ఉ. 8.199. <చాలు + అగు. **చాలమి**. వి. **1**. అసహ్యత. భార.విరా. 1.318 ; **2**. అశక్తి, అసమర్థత. నిర్వ.రా.

7.94, భార.ఉద్యో. 2.40. **చాలయిపోవు** అ.క్రి. విసుగుదల కలుగు. **చాలిక** వి. సామర్థ్యం. హరి.ఉ. 1.116. <చాలు+-ఇక. **చాలించు** 1. పర్యాప్తం చేయు, సరిపోయేటట్లుచేయు. భార.భీష్మ. 1.298; 2. ముగించు, సమాప్తం చేయు. భార.భీష్మ. 2.340; 3. సమర్థుడని తలచి నిలుపు, నియోగించు. భార. కర్ణ. 1.252, ఉ. హరి. 4.285; 4. త్యజించు, విడుచు, మాను. ఉ.రా. 1.198. <చాలు+-ఇంచు[3]. **చాలినవాఁడు** వి. సమర్థుడు. **చాలియుండు** అ.క్రి. సమర్థమగు. **చాలుబడి** వి. చాలిక, సామర్థ్యం. **చాలుమానిసి** రూ. చాల్మానిసి. వి. 1. సమర్థుడైన పురుషుడు, శూరుడు. భార.విరా. 4.221; 2. ప్రధానోద్యోగి. దశా. 7.225. **చాలుమాసి** చూ. చాలుమానిసి. రూ. చాల్మాసి. వి. ఒకరికి లోబడినవాడు, పరాధీనుడు. ఆం.భా. 3.5. **చాలువాఁడు** రూ. చాల్వాడు. విణ. సమర్థుడు, శక్తుడు. భార.ఉద్యో. 4.143. **చాలువాఱు**[1] (-పాఱు) రూ. చాల్వాఱు[1]. అ.క్రి. చాళ్ళుకట్టు, సమృద్ధిచెందు. భాగ. 10. పూ. 755. **చాలెడువాఁడు** వి. సమర్థుడు. హరి.పూ. 9.157. **చాల్మానిసి** రూ.చూ. చాలుమానిసి. వి. 1. శూరుడు, సమర్థుడైన పురుషుడు; 2. ప్రధానోద్యోగి. **చాల్మాసి** రూ.చూ. చాలుమాసి. వి. పరాధీనుడు. **చాల్వాఁడు** రూ.చూ. చాలువాఁడు. విణ. సమర్థుడు, శక్తుడు. భార.ఆది. 6.210. **చాల్వాఱు**[1] రూ.చూ. చాలువాఱు[1]. అ.క్రి. సమృద్ధిచెందు.

**చాలు**[2] వి. 1. చాలుపు, శ్రేణి, వరస, సమూహం, రాశి, పోగు. ఆం.భా. 2.34, ప్రభా. 2.76; 2. సీత, నాగటి రేఖ. ఆం.భా. 2.233; 3. పెంకుపేర్పులోని వరస; 4. గుంజలు మొదలైనవి పాతటానికి గడ్డపలుగుతో తవ్విన లోతైనగుంట; 5. చెక్కలమీద ఉలితో తీసిన కాలవ.

క. సాల్, సాలు. హద్దులోఉండు, మితంగాఉండు; సాల. ఋణం, అప్పు; సాలిగ. అప్పు పుచ్చుకొనినవాడు; కొడ. స.ల. అప్పు, బదులు; తు. సాల, అప్పు, బదులు; త. చాల్. నాగటిచాలు; మ. చాల్. నాగటిచాలు, వరుస, శ్రేణి; కో. చ.ల్. నాగటిచాలు; తొ. సొ.ల్.

**చాలుకట్టు** అ.క్రి. వరుసగా ఏర్పడు. **చాలుకుండ** వి. చాలుతొట్టి, నేతనేసేటప్పుడు గొంగడి ముందుభాగం తడపటానికి నీళ్ళుపోసినకుండ. **చాలుకొను** అ.క్రి. వరసకట్టు, వరసగా ఏర్పడు. ముకుంద. 2.132. **చాలుకోంౘ్ర** రూ. చాలుకోర్న. వి. కోంౘ్రవేయకుండా పక్కపక్కగా వచ్చేట్టు దున్నినసేల. **చాలుకోర్న** రూ.చూ. చాలుకోంౘ్ర. వి. కోంౘ్రవేయకుండా పక్కపక్కగా వచ్చేట్టు దున్నిననేల. **చాలుగట్టు** వి. నాగలిలోతుగా తెగతుండా ఉండటానికి మోకు బిగించి కట్టటం. **చాలుగడ్డ** వి. నాగలితో దున్నిన రెండు చాళ్ళమధ్య కలపనిభాగం. **చాలుతడుపు** వి. గొంగడి నేసేటప్పుడు, నేసినముందుభాగం నీళ్ళతో గాని, అంబలితో గాని తడపటం. **చాలుతొట్టి** వి. చాలుకుండ, నేతనేసేటప్పుడు గొంగడికి అడ్డంలో ముందుభాగం తడపటానికి నీళ్ళుపోసినకుండ. **చాలుదుక్కి** వి. మెట్టలో మొదటిసారి దున్నటం. **చాలుపట్టు** రూ. చాలువట్టు, చాల్వట్టు. స.క్రి. దున్ను. పాండు. 2.59. **చాలుపట్టె** వి. ఒకేదూలంమీద గుజ్జులను కలిపే వాసం. **చాలుపడు** రూ.చూ. చాల్పడు. స.క్రి. దున్ను. **చాలుపెంకు** రూ. జాలుపెంకు. వి. కప్పు పెంకు, ఇల్లుకప్పడానికి వాడే మామూలు పెంకు. **చాలుపేరిటిప్రోయాలు** వి. సీతాదేవి. అచ్చ.రా.యు. 79. **చాలుపేరింటినడఁబోఁడి** రూ. చాల్పేరింటినడబోడి. వి. సీతాదేవి. వ్యు. సీతా (సం.) శబ్దానికి నాగేటిచాలు అని అర్థం. **చాలుపేరింటిపూఁబోఁడి** రూ. చాల్పేరింటిపూఁబోఁడి. వి. సీతాదేవి. యయా. 3.37. వ్యు. సీతా (సం.) శబ్దానికి నాగేటిచాలు అని అర్థం. **చాలుపేరింటిపూఁబోఁడితండ్రి** వి. జనకుడు. వ్యు. సీతాదేవి తండ్రి. **చాలుపేరింటిమగువ** రూ.చూ. చాల్పేరింటిమగువ. వి. సీతాదేవి. **చాలుపేరియెలనాఁగ** వి. సీతాదేవి. వ్యు. సీతా (సం.) శబ్దానికి నాగేటిచాలు అని అర్థం. **చాలుముంత** వి. ఒకపైరు విత్తినచాళ్ళమధ్య ఆముదాలు, పత్తి మొ. వాటి విత్తనాలు వేసే కొయ్యపరికరం. **చాలుమూల** రూ. చాల్మూల. వి. 1. క్రమవిధానం, పద్ధతి; 2. దారిడొంక. **చాలువట్టు** (-పట్టు) రూ.చూ. చాలుపట్టు. స.క్రి. చాలెత్తు, దున్ను. పాండు. 2.95. **చాలువడు** రూ.చూ. చాల్పడు. అ.క్రి. వరుసఅగు. స.క్రి. చుట్టుకొను. **చాలువాఱు**[2] రూ. చాల్వాఱు[2]. అ. క్రి. 1. వరసతీరు; 2. నిండారు. **చాలువిడుచు** స.క్రి. నాగలిలోతుగా తెగటానికి మోకువదులుచేయు. **చాలెత్తు** స.క్రి. దున్ను, చాలువట్టు. రామ. 281. <చాలు[2]+ఎత్తు. **చాలేటిపాలి** వి. దున్నటంమొదలుపెట్టినప్పుడు తెగిన మొదటి చాలుకు పూజచేసి ఏటబలి ఇవ్వటం. **చాల్పట్టు** రూ.చూ. చాలుపట్టు. స.క్రి. దున్ను. **చాల్పడు** రూ. చాలుపడు, చాల్వడు. అ.క్రి. పంక్తిఅగు, పోగుపడు. భార. ఆది. 2.92. **చాల్పేరింటినడఁబోఁడి** రూ.చూ. చాలుపేరింటినడఁబోఁడి. వి. సీతాదేవి. **చాల్పేరింటిపూఁబోఁడి** రూ.చూ. చాలుపేరింటిపూఁబోఁడి. వి. సీతాదేవి. **చాల్పేరింటిమగువ** రూ. చాలుపేరింటిమగువ. వి. సీతాదేవి. యయా. 1.95, 3.13. వ్యు. సీతా (సం.) శబ్దానికి నాగేటిచాలు అని అర్థం. **చాల్మూల** రూ. చూ. చాలుమూల. వి. 1. వరుసవావి; 2. దారిడొంక. **చాల్వట్టు** రూ.చూ. చాలుపట్టు. స.క్రి. దున్ను. **చాల్వడు** రూ.చూ. చాల్పడు. అ.క్రి. వరుసఅగు. స.క్రి. చుట్టుకొను. భార. ఆది. 6.210. **చాల్వాఱు**[2] రూ.చూ. చాలువాఱు[2]. అ.క్రి. 1. వరుసతీరు; 2. నిండారు. **చాళ్ళగుంటక** రూ.చూ. చాళ్ళగుంటవ. వి. అచ్చుగుంటక, మిరపతోటల్లో నాట్లు వేయటానికి తోలేగుంటక. **చాళ్ళగుంటవ** రూ. చాళ్ళగుంటక, చాళ్ళగూటవ. వి. అచ్చుగుంటక, మిరపతోటల్లోనాట్లు వేయటానికి తోలేగుంటక. **చాళ్ళగూటవ** రూ.చూ. చాళ్ళగుంటవ. వి. అచ్చుగుంటక, మిరపతోటల్లో నాట్లు వేయటానికి తోలేగుంటక. **చాళ్ళసేద్యం** వి. పైరుసేద్యం, కలుపు పోవటానికి నేల గుల్లబారటానికి పైరులో చేసే సాగు.

**చాలు**[3] రూ.చూ. సాలు. వి. 1. సంవత్సరాంతం. ఆం.భా. 3.63; 2. సంవత్సరం.

**చాలుపు** రూ.చూ. చాల్పు. వి. 1. వరస, పంక్తి. నీలా.

1.88 ; **2.** సమూహం. అచ్చ.రా. అరణ్య. 55 ; **3.** వైశాల్యం. ఉ.రా. 8.313.
**చాలెడువా(డు** చూ. చాలు[1].
**చాలెత్తు** చూ. చాలు[2].
**చాలేటిపొలి** చూ. చాలు[2].
**చాల్తి** రూ. కాల్తి. వి. **1.** వేళాకోళం ; **2.** ఒకస్వరూపం ; **3.** వరుస, బంతి ; **4.** రివాజు.
**చాల్పట్టు** చూ. చాలు[2].
**చాల్పడు** చూ. చాలు[2].
**చాల్పు** రూ. చాలుపు. వి. **1.** వైశాల్యం. భాగ. 8.447 ; **2.** సమూహం. రసిక. 2.14 ; **3.** శ్రేణి, వరుస.నీలా .2.76.
**చాల్పుకుత్తుకలవా(డు** వి. రావణుడు, పంక్తికంఠుడు. **చాల్పుకుత్తుకవా(డు** వి. రావణుడు, పంక్తికంఠుడు. **చాల్పుతేర్లదొర** వి. దశరథుడు. అచ్చ.రా. అయోధ్య. 1.47.
**చాల్పేరింటినన(బో(డి** చూ. చాలు[2].
**చాల్పేరింటిపూ(బో(డి** చూ. చాలు[2].
**చాల్పేరింటిమగువ** చూ. చాలు[2].
**చాల్మానిసి** చూ. చాలు[1].
**చాల్మాని** చూ. చాలు[1].
**చాల్మూల** చూ. చాలు[2].
**చాల్వట్టు** చూ. చాలు[2].
**చాల్వడు** చూ. చాలు[2].
**చాల్వా(డు** చూ. చాలు[1].
**చాల్వాఱు[1]** చూ. చాలు[1].
**చాల్వాఱు[2]** చూ. చాలు[2].
**చాళి[1]** వి. **1.** విధం. పండి.చ. 4.241 ; **2.** నాట్యవిశేషం. పండి. చ. 5.378.
**చాళి[2]** రూ.చూ. చాడి. వి. కొండెం, చెప్పుడుమాట. వరాహ. 3.92.
**చాళియ** రూ.చూ. చాళె. వి. **1.** గతివిశేషం ; **2.** మల్లబంధవిశేషం.
**చాళియము** రూ. చాళెము. వి. **1.** వందనాద్యుపాచారం. పండి.చ. 4.179 వ. ; **2.** నాట్యపద్ధతుల్లోఒకటి.
**చాళె** రూ. చాళియ. వి. **1.** మల్లబంధవిశేషం. ఉ.హరి. 4.256 ; **2.** గతిలాఘవం.
క. చాళి, చాళియ. శరీరాలుపెనవేసుకొనే విధం.
**చాళెము** రూ.చూ. చాళియము. వి. నాట్యపద్ధతుల్లో ఒకటి. పండి.చ. 5.435.
**చాళెముల్త్రిప్పు** చూ. చాళె. స.క్రి. గిరగిరత్రిప్పు. మను. 4.95.
**చాళ్ళగుంటక** చూ. చాలు[2].
**చాళ్ళగుంటవ** చూ. చాలు[2].
**చాళ్ళగూటవ** చూ. చాలు[2].
**చాళ్ళసేద్యం** చూ. చాలు[2].
**చావ(గొట్టు** చూ. చచ్చు. స.క్రి. చితకగొట్టు. మైరా.పు. 19.
**చావడి** రూ. చావిడి, చావిడీ, చావుడి, సావడా, సావిడి. వి. **1.** నడవ, వీథిగుమ్మానికి లోపలగుమ్మానికి మధ్యప్రదేశం. కాశీ. 4.158 ; **2.** కొలువుకూటం, ఆస్థానం. రామాభ్యు. 2.6. పరమ. వి. 3.60 ; **3.** చవికె, మండపం. రామలిం. శ. 3.

హిం. చావ్‌డీ. బాటసారులు దిగటానికి అనువైనచోటు; గు.మరా. చావడీ. రక్షకభటకార్యాలయం, రచ్చబండ.

< మరా. చావడీ.

**చావడిమాటలు** వి.బ.వ. జారుమాటలు.

**చావనివారు** చూ. చచ్చు. వి.బ.వ. దేవతలు.
**చావనుజావ(డు చా(వయునీయు** చూ. చచ్చు. స.క్రి. చావకుండా బతకకుండాఉన్న వాణ్ణిగూర్చి చెప్పేసామెత. పని జరిగేదీ లేనిదీ తెలియకుండా ఉన్నప్పటి పలుకుబడి.
**చావమోదు** చూ. చచ్చు. స.క్రి. ఎక్కువగా దెబ్బలు కొట్టు.
**చావి** అవ్య. ద్రు. ఒప్పేటట్లు. పండి. చ. 1.92.
**చావిడి** రూ.చూ. చావడి. వి. పాక, మూడువైపులా మూసిన దూలాలు లేని పొడుగాటి ఇల్లు.
**చావిడీ** రూ.చూ. చావడి. వి. కచేరి, సర్కారు కార్యాలయం.
**చావు** రూ. చవ్వు, సావు. వి. **1.** మృతి, మరణం. భార.ఆది. 1.51. **2.** దురవస్థ.

క. సాయ్. మరణించుట, చావు, సావ్ర. చావు, శవం ; కొడ. చల్. మరణించుట, వాడిపోవు, మాయమగు, చావు. చావు, చంపు. చంపు, చంపుడు. చంపటం ; తు. సావు. చంపటం ; త. చా. చచ్చుట, వ్యయంచేయటం, చావ్ర. చావు, దయ్యం, చెత్తల్. చస్తున్న, చెకు. నాశనం చేయటం, చంపు ; మ. చాక. చచ్చు, చాక్కు. చావు, చావ్ర. చావు, మరణసంబంధమైన, చత్త. చచ్చిన ; కో. క.జ్‌చ. చచ్చినమనిషి శరీరం కనిపించకపోవటం ; తొ. సాయ్. చచ్చు ; గోం. సైఆనా, సయానా, హానా. హావ. చచ్చిన ; కొండ. సా. చచ్చు ; కుఇ. సావ, చచ్చు ; కువి. హైఅలి, హానై. చచ్చు ; పర్జి. చయ్. చచ్చు, చాఁన్. శవం ; గ. సయ్, చయ్. చచ్చు. కురు. ఖెఎనా. చచ్చు, పనికిరాకుండాపోవటం ; మాల్తో. కెయె. చచ్చు, కెయ్పె. చచ్చిన, కెయు. చచ్చెడు, కెయ్త్రె. చచ్చు, కగ్‌లె. చచ్చు ; బ్రా కహింగ్. చచ్చు.

పో.చూ. సం. శవ-. శవం.

< మూ.ద్రా. *చా. చచ్చు.

**చావరువు** వి. చావుపరుగు. మను. 4.54. < చావ + పరువు[1]. **చావిడ్డ** వి. కడుపులోనే చచ్చి పుట్టిన బిడ్డ. బసవ. 7.311. < చావ + బిడ్డ. **చావుకుండ** రూ. సావుకుండ. వి. తలగోరుకుండ, శవదహనానికి ముందు నీళ్ళునింపి చుట్టూ మూడు సార్లు తిరిగి తలదగ్గర పగలగొట్టే మట్టికుండ. **చావుగుఱుతు** వి. అఖఛం. **చావుతల** వి. అవసానసమయం. భోజరా. 5.315. **చావుతెలివి** వి. మరణకాలంలో కలిగే పరిజ్ఞానం. **చావుదెబ్బ** వి. చావును కలిగించే దెబ్బ. **చావుపిట్ట** వి. తీతువుపక్షి, సీతవ. **చావుబిడ్డ** వి. కడుపులోనే చచ్చిపుట్టిన బిడ్డ. **చావుబొజ్జ** వి. గావుకేక, బలికాలపు కేక. **చావుమయిల** రూ. చావుమైల. వి. అస్పృష్టి, మృతాశౌచం. **చావుమునక** వి. అవస్నానం. **చావుమైల** రూ.చూ. చావుమయిల. వి. అస్పృష్టి, మృతాశౌచం. **చావులేకపోవు** అ.క్రి.

2. చిర్రెలి కోపంగలవాడు. చిట్టుకొలవి వి. 1. తాపకారి, బాధకుడు. కలు. శ. 55 ; 2. చిటపటలాడే కొలివి. చిట్లుచు రూ.చూ. చిటులుచు. స.క్రి. 1. చెవగొట్టు ; 2. పోగొట్టు ; 3. చిట్లజేయు. చిట్లుజిట్ట వి. ఒకరకం పిట్ట (Dicaeum concolor).

చిక్లెం రూ.చూ. చిట్లం. వి. కంకిటికె, క్రిరాయి, పొగచూరిటిక.

చిటా రూ.చూ. చిట్టా. వి. చినసరికెక్కు, పట్టిక.

చిడత రూ.చూ. చిరత. వి. 1. పంటిఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద ; 2. అనికొయ్య, అనుపోసేటప్పుడు పడుగులో అనులు పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల ; 3. కోతిపుల్ల, నేతనేసేటప్పుడుఅచ్చు కర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల ; 4. ఉడత, మరమగ్గం నాడెను ఒక సొరుగు లోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ ; 5. జడ్డిగపు పిడత కదలకుండ కట్టేతాడు, తీపుతాడు, పలుపు ; 6. అడ్డకర్ర, నిచ్చెన నిలువు కర్రలను కలుపుతూ, మెట్లులాగా ఉపకరించే చిన్నకొయ్య ; 7. చెందు, వడంబం గుండును మోసేదారాన్ని పట్టుకొని ఉండేరేకుబిళ్ళ ; 8. దొంగ గొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసన కట్టే పంగల కర్ర ; 9. పలుపు.

చిడతకట్టె రూ.చూ. చిరతకట్టె. వి. వెలుగు, పంచదించటానికి గుర్రపు కొయ్యల మీద వేసిన అడ్డవాసం. చిడతకర్ర వి. వెలుగు, పంచదించటానికి గుర్రపుకొయ్యల మీద వేసినఅడ్డవాసం. చిడతతాడు రూ.చూ. చిరతతాడు. వి. ఉడతతాడు ; మగ్గంఉడతకు పైనకట్టిన దారం. చిడతతోలు రూ. చూ. చిరతతోలు. వి. ఉడతతోలు, మరమగ్గంలో ఉడతకు కిందవేలాడే తోలుముట్టు. చిడతపుల్ల వి. అనికొయ్య, అనుపోసేటప్పుడు పడుగులో అనులు పడటానికి కచ్చిపేటకు బిగించినపుల్ల.

చిడి రూ. సిడి. వి. 1. గోరుముట్లు, పూజలు, సారెమీద వాటికి రకుదతోగాని గోటితోగాని అలంకారంగా పెట్టే బొట్టు ; 2. నిచ్చెన, ఎత్తుగాఉన్న వస్తువుల్ని, తావులను అందుకోటానికి పనికివచ్చే పరికరం.

చిడిదబ్బ రూ. సిడిదబ్బ. వి. చిట్లుకట్టె, బొట్లుదబ్బ, పంచి కుండలకు చిట్లుపెట్టటానికి ఉపయోగించే ఇనపరేకు లేక వెదురుదబ్బ.

చిడిగిరింత వి. 1. అయిష్టం ; 2. విసుగు ; 3. తొందర ; 4. ఉపద్రవం.

చిడిగొట్టు (-కొట్టు) వి. కొద్దివాడు, అల్పుడు.

చిడిగోలు రూ. చెడేగోలు. వి. గడ్డలుండేటట్లు తీసిన గోలు.

చిడిపి రూ. చిపిలి, చిలిపి. విశ. 1. అల్పమైన, క్షుద్రమైన. భార. ఆది. 7.101 ; 2. చపలమైన. శృం.నై. 3.140.

చిడిపిరాయి వి. చిన్నకరుకురాయి.

చిడిపోతు వి. మగమేక, పింపోతు.

చిడిముడి వి. 1. కోపం. భార. ఆది. 7.144 ; 2. ఈర్ష్య. ప్రబోధ. 2.69 ; 3. సంభ్రమం, తొందర. ద్వి.శ.సా. 1.24 ప. 4 పం. ; 4. వ్యాకులత. ద్వి. పార. చ. 3.100 పు. 1 పం.

చిడిముడిపడు రూ. చిడిముడివడు. అ.క్రి. 1. కలతనొందు. కళవళపడు, భయపీడితుడగు. భార.విరా. 2.306 : 2. వేగిరపడు, సంభ్రమించు, త్వరపడు, తొట్రుపడు. మార్క. 4.122 ; 3. కోపపడు. సమీర. 7.127. చిడిముడిపాటు వి. 1. కలత, కంగారు. భార. విరా. 2.295 ; 2. తొట్రుపాటు, సంభ్రమం. ఉ.హరి. 6.143 ; 3. చిరాకు, కోపం. మను. 2.61. చిడిముడివడు (-పడు) రూ.చూ. చిడిముడిపడు. అ.క్రి. 1. త్వరపడు, వేగిరపడు. భార. భీష్మ. 1.151 ; 2. కలతనొందు, కళవళపడు. భార. భీష్మ. 3.59 ; 3. కోపపడు. చిడిముళ్ళు వి.బ.వ. అడ్డంకులు, ఇడిముళ్ళు.

చిడియు అ.క్రి. కందు, చిరాకుపడు.

చిడీ వి. అడ్డకర్ర, నిచ్చెన నిలువు కర్రలను కలుపుతూ మెట్లులాగా ఉపకరించే చిన్నకొయ్య.

హిం. సీఢీ. మెట్టు.

< హిం. సీడీ.

చిడీరాయి వి. తంతెబండ, మెట్లుబండ, మెట్లుకట్టటానికి వాడినరాయి.

చిడుగు విశ. అల్పమైన. చంద్రాంగ. 3.35.

చిడుగుడు రూ. చెడుగుడు. వి. బాలక్రీడా విశేషం. కాశ. 3.33.

చిడుగుడుపరువులు వి.బ.వ. బాలక్రీడావిశేషం. ఇందు. 2.18.

చిడుచుకొనిపోవు అ.క్రి. తన అంత వాడులేడని గర్వించు.

చిడుప వి. మర్మస్థలం. దశ. కు. 6.157.

చిడుము వి. గజ్జి, ఖర్జువు. ద్వి. హరిశ్చ. ఉ. 1253పం.

కొలా. పెబ్. చర్మరోగ విశేషం.

చిడ్త రూ.చూ. చిరత. వి. 1. పంటెఆకుల బిగింపువేసే అడ్డబద్ద ; 2. అనికొయ్య, అనుపోసేటప్పుడు పడుగులో అనులుపడటానికి కచ్చి పీటకు బిగించిన పుల్ల ; 3. కోతిపుల్ల, నేతనేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల ; 4. చిడత, మరమగ్గంలో ఒకసొరుగు లోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలుఉంగరం బిగించిన కొయ్య బిళ్ళ ; 5. జడ్డిగపు పిడత కదలకుండ కట్టేతాడు, తీపుతాడు, పలుపు : 6. అడ్డకర్ర, నిచ్చెన నిలువుకర్రలను కలుపుతూ మెట్లులాగా ఉపకరించే చిన్న కొయ్య ; 7. చెందు, వడంబంగుండును మోసేదారాన్ని పట్టుకొనిఉండే రేకుబిళ్ళ ; 8. దొంగగొడ్డు పరుగెత్తకుండా ముందుకాలు కొసన కట్టేపంగలకర్ర ; 9. పలుపు.

చిడ్తతాడు రూ.చూ. చిరతతాడు. వి. ఉడతతాడు, మగ్గం ఉడతకు పైన కట్టిన దారం.

చింటా రూ.చూ. చిమట[3]. వి. తంటసం.

చిండ రూ. సింద. వి. 1. అడుగురి ; 2. (పరిహాసంగా) చీర.

చిండారాబొగ్గు వి. ఒకసారి కాలినబొగ్గు.

ఇం. *Cinder*. చిన్న బొగ్గు.

< ఇం. Cinder + బొగ్గు.

**చితక** వి. చిన్నది.

**చితకకొట్టు** చూ. చితుకు.

**చితకఁగొట్టు** చూ. చితుకు.

**చితకలు** వి.బ.వ. దుమ్ములు కలిసిన మాంసం కూర.

**చితచిత** రూ.చూ. చిదచిద. వి. చెమ్మనేలపైనడిచేటప్పుడు అయ్యే చప్పుడుకి అనుకరణం.

**చితచితలాడు** అ.క్రి. తడిసి బురద అగు.

**చితనాపి** వి. చిలిపి చేష్టలు చేసేవాడు.

**చితారు** రూ.చూ. సితారు. వి. వాద్యవిశేషం.

**చితికిపోవు** చూ. చితుకు.

**చితుకఁగొట్టు** చూ. చితుకు.

**చితుకు** రూ. చూ. చిదుకు[1]. అ.క్రి. **1**. నలుగు, పగులు ; **2**. కురుపు మొ. పగులు ; వి. తొక్కుడు, కొట్టంలో గొడ్లకాళ్ళ కిందనలిగినగడ్డి.

**చితకకొట్టు** రూ.చూ. చితుకఁగొట్టు. స.క్రి. బాగామర్దించు. **చితకఁగొట్టు** రూ.చూ. చితుకఁగొట్టు. స.క్రి. చితకకొట్టు, బాగామర్దించు. **చితికిపోవు** అ.క్రి. పగిలిపోవు. **చితుకఁగొట్టు** రూ. చితకకొట్టు, చితకఁగొట్టు. స.క్రి. బాగామర్దించు.

**చిత్త** రూ. సిత. వి. **1**. చిత్రానక్షత్రం ; **2**. చిత్తకార్తె, ఆశ్వయుజమాసం (అక్టోబరు నెలమొదటి భాగం) లోవచ్చే కార్తె; **3**. నుంకు, కంకి మీద నూగునూగుగా పట్టిన పూత, వరి జొన్న పెసర మొ. వాటి తెగులు.

సం. చిత్రా. ఒకనక్షత్రం ; ప్రా. చిత్తా ; అ.మా. చిత్త ; పా. చిత్త ; అప. చిత్తా ;

క. చిత్తిరై ; త. చితిరె ; మ. చిత్తిర.

< ప్రా. చిత్తా.

**చిత్తఎండ** రూ. చిత్తెండ. వి. చిత్తకార్తెలో వానవెలిసిపోయిన వెంటనే చుర్రుమనేట్లు కాసే ఎండ. **చిత్తకార్తెకుక్క** వి. **1**. కుక్కలకు చిత్తకార్తెకట్టుడు అదను. వ్యభిచారి (అర్థవిపరి.). **చిత్తజల్లు** వి. చిత్రకార్తెలో కురిసే దబ్బాటువాన. **చిత్తజల్లుగ** క్రి.విణ. ద్రు. **1**. అధికంగా. జైమిని భా. 7.39 ; **2**. చిత్తకార్తెలోని వానవలె. కళా. 5.8. **చిత్తజల్లుగతిగాన్** క్రి.వి.ణ. ద్రు. దట్టంగా, సాంద్రంగా. భాస్క.రా. యు. 1052. **చిత్తజొన్న** వి. చిత్తకార్తెలో వేసే పచ్చజొన్న. **చిత్తడి** రూ.చూ. చిత్తటి. వి. **1**. కొంచెం తడి. రం.రా.ఉ. 92పు. 27పం, కాశీ. 1.90 ; **2**. చిత్తకార్తెవాన. అహల్యా. 3.105. **చిత్తడినెల** రూ. చిత్తడ్నెల. వి. వానాకాలం. **చిత్తడ్నెల** రూ.చూ. చిత్తడినెల వి. వానాకాలం. **చిత్తపచ్చజొన్న** వి. చిత్తకార్తెలోవేసే పచ్చజొన్న. **చిత్తపట్టు** వి. పైరులకు తగిలే ఒక వ్యాధి. **చిత్తపురుగు** వి. వరిదంటు తొలిచే పురుగు. **చిత్తపొలి** వి. పండిన పొలానికి చిత్తకార్తెలో ఇచ్చే బలి. **చిత్తబలి** వి. పండిన పొలానికి చిత్తకార్తెలో ఇచ్చే బలి. **చిత్తమోదు** వి. చిత్తకార్తెలో ఆగుతూ కురుస్తూ ఉండే వానజల్లు. **చిత్తటి** రూ. **చిత్తడి**. వి. వర్షాకాలం. ఆం.భా. 1.86. < చిత్త[1] + తటి. **చిత్తవాన** వి. చిత్తజల్లు. విప్ర. 4·19. **చిత్తాట** వి. ఒకరకం ఆట. < చిత్త + ఆట. **చిత్తెండ** రూ.చూ. చిత్తఎండ. వి. చిత్తకార్తెలో వాన వెలిసిపోయిన వెంటనే చుర్రుమనేట్లు కాసే ఎండ. < చిత్త[1] + ఎండ.

**చిత్తం** అవ్య. ఎవరైనా పెద్దవారు, గౌరవనీయులు చెప్తున్నప్పుడు వినటంలో అనే ఉపస్కారక పదం.

సం. చిత్త-. మనస్సు, అంతఃకరణం.

< సం. చిత్త- (అర్థవిపరి.).

**చిత్తగించు** చూ. చిత్తము.

**చిత్తగు** చూ. చిత్తు.

**చిత్తమిడు** చూ. చిత్తము.

**చిత్తము** వి. **1**. దయ. దశా. 2 340 ; **2**. అంగీకారం ; **3**. వినయాన్ని సూచించే పదం.

సం. చిత్త-. అంతఃకరణం, మనస్సు, అంతఃకరణవృత్తివిశేషం.

< సం. చిత్త- (అర్థవిపరి.).

**చిత్తగించు** స.క్రి. **1**. స్మరించు, తలచు. భార. విరా. 1.181 ; **2**. ఆలోచించు. కృష్ణ. 2.139 ; **3**. దయతోగాని, అవధానంతోగాని విను, చూచు మొ. భాగ. 10. ఉ. 830 ; అ.క్రి. మనసు ఉంచు, అవధరించు. భాగ. 5.216. క. చిత్తయిను. **చిత్తమిడు** స.క్రి. సంకల్పించు, తలచు. < చిత్తము + ఇడు. **చిత్తముచీకటిగొల్పు (-కొల్పు)** స.క్రి. కలతపరుచు. శివరా. 3.44. **చిత్తమునకువచ్చు** స.క్రి. ఇష్టపడు, మనసుపడు, నచ్చు. భార. కర్ణ. 1.285. **చిత్తమునకెక్కు** అ.క్రి. మనసునకు నచ్చు. భార. విరా. 1.74. **చిత్తమునీరగు** అ.క్రి. గుండె నీరగు, భయభ్రాంతి జనించు. ఉ.హరి. 2.132. **చిత్తమువచ్చినట్లు** క్రి.విణ. స్వేచ్ఛగా, యథేచ్ఛగా. **చిత్తమువచ్చు** అ.క్రి. ఇష్టపడు. కాశీ. 3.72. **చిత్తమువిడుచు** అ.క్రి. మనసు ఒప్పుకుండు. **చిత్తానఁబెట్టు** స.క్రి. మనసులో పెట్టుకొను.

**చిత్తయిపోవు** చూ. చిత్తు.

**చిత్తర[1]** చూ. చిత్త. వి. ఆశ్వయుజ మాసం (అక్టోబరు మొదటి భాగం)లో వచ్చే కార్తె, తెల్లజొన్న పైరు వేసే అదను.

సం. చిత్రా. ఒక నక్షత్రం.

< సం. చిత్రా.

**చిత్తర[2]** వి. మత్స్య విశేషం. హంస. 4.187.

సం. చిత్ర-. విచిత్రమైన, అద్భుతమైన.

< సం. చిత్ర- (అర్థవిపరి.).

**చిత్తరము** రూ. చిత్తరువు[2]. విణ. ఆశ్చర్యకరం, అద్భుతకరం. ఇందు. 5 20. వి. ఆశ్చర్యం, అద్భుతం.

సం. చిత్ర-. ఆశ్చర్యకరమైనది ; అ.మా.పా. చిత్త-. విస్మయం.

క. చిత్తర. అద్భుతం, ఆశ్చర్యం ; తు. చిత్తిర, చిత్ర. కుతూహలం.

< సం. చిత్ర-.

**చిత్తరించు** చూ. చిత్తరు.

**చిత్తరు** రూ.చూ. చిత్తరువు[1]. వి. **1**. పటాదుల్లో రాసిన రూపం, చిత్రిత ప్రతిమ. చంద్రభా. 3.124 ; **2**. బొమ్మలు వేయటానికి ఉపయోగించే పటం మొ.

**చిత్తరించు** స.క్రి. చిత్రించు, చిత్తరువువేయు. పండి.చ. 1.60.

**చిత్తరువు**[1] రూ. చిత్తరు, చిత్తర్వు, చిత్తారు. వి. **1.** బొమ్మలు వేయటానికి ఉపయోగించే పటం. భాస్క.రా. ఆరణ్య. 2.33; **2.** పటాదుల్లో రాసిన రూపం, చిత్రిత ప్రతిమ. ఉ.హరి. 1.60.
సం. చిత్ర-. చిత్తరువు; ప్రా. చిత్త-. పటం; అ.మా. చిత్తం. చిత్రం, బొమ్మ; మరా. చితరణే, చితారణే. చిత్తరువులు గీయు.
<సం. చిత్ర-.
**చిత్తరువొత్తు** అ.క్రి. ముద్రితమగు.
<చిత్తరువు[1]+ఒత్తు.

**చిత్తరువు**[2] రూ.చూ. చిత్తరము. విణ. ఆశ్చర్యకరం, చిత్రమైన. సారంగ. 1.78.

**చిత్తరువొత్తు** చూ. చిత్తరువు[1].

**చిత్తర్వు** రూ.చూ. చిత్తరువు[1]. వి. **1.** బొమ్మలు వేయటానికి ఉపయోగించే పటాదికం; **2.** చిత్రిత ప్రతిమ.

**చిత్తాట** చూ. చిత్త.

**చిత్తాన(బెట్టు** చూ. చిత్తము.

**చిత్తారి** వి. రెండు కిటికీల జంట.
**చిత్తారిపని** వి. **1.** బచ్చెన పని, కర్రతో బొమ్మలు అచ్చేసి వాటికి రంగు వేసే పని; **2.** ఒకానొక దేవత. **చిత్తారి వాండ్రు** విణ.బ.వ. జీనిగిరి వాండ్రు.

**చిత్తారిబొట్లు** వి.బ.వ. ధాన్య విశేషం, ఒక రకం వడ్లు.

**చిత్తారు** రూ.చూ. చిత్తరువు[1]. వి. **1.** చిత్ర లేఖనం; **2.** చిత్తరువు.

**చిత్తి** రూ.చూ. తిత్తి. వి. **1.** ఉడత తోలు, మర మగ్గంలో ఉడతకు కింద వేలాడే చుట్టు; **2.** పంకా బట్టి దగ్గరి కొలిమిని పంకాకు కలిపే తోలుతో కుట్టిన సంచి.

**చిత్తికట్టు** రూ.చూ. చిత్తుకటె. వి. గోనెపట్ట, కుమ్మరి కూర్చోటానికి లేదా పాకం మన్ను ఆరిపోకుండా కప్పటానికి వాడే గోతాం.

**చిత్తిని** వి. చిత్రిణీ జాతి స్త్రీ. సిం.ద్వా. 1.216.
సం. చిత్రిణీ. స్త్రీ జాతుల్లో ఒకటి; ప్రా. చిత్తిణీ. క. చిత్తిని.
<ప్రా. చిత్తిణీ.

**చిత్తు** వి. **1.** చిడుకు, సమిధ. శ్రీరం. మా. 8.28; **2.** దిద్ది చక్కపరచని మొదట రాసిన రాత ప్రతి; **3.** మొదట గుణించుకొనే లెక్క.
**చిత్తగు** అ.క్రి. ఓడిపోవు, వమ్మగు. **చిత్తయిపోవు** అ.క్రి. బాగా దెబ్బతిను. **చిత్తుచట్టము** వి. శాసనంగా రూపొందని చట్టం బిల్లు. **చిత్తుచేయు** స.క్రి. ఓడించు, వమ్ముచేయు. **చిత్తుప్రతి** వి. సాపు రాయకముందు రాసుకున్న ప్రతి. **చిత్తుబొత్తు** వి. కాయా పండా అనటం.

**చిత్తుకటె** రూ. చిత్తికట్టు. వి. గోనెపట్ట, కుమ్మరి కూర్చోటానికి లేక పాకం మన్ను ఆరిపోకుండా కప్పటానికి వాడే గోతాం.

**చిత్తుళిపని** వి. చిత్తారి పని.

**చిత్తూరుమామిడి** వి. ఒక రకం మామిడి, ఆమ్రము విశేషం.

**చిత్తెండ** చూ. చిత్త.

**చిత్రబుగిడి** వి. సిద్దిపేటు, రెండు బుగిడుల వరసలో బొమ్మ పడేట్టు నేసిన డిజైను.

**చిత్రాన్నము** వి. భక్ష్య విశేషం, పులిహోర.
సం. చిత్ర+అన్న-, చిత్ర-. నానా వర్ణం.
<సం. చిత్రాన్న-.

**చిత్రాలుపోవు** అ.క్రి. వింతగా ప్రవర్తించు.
<సం. చిత్ర-. అద్భుతం.

**చిత్రి** వి. చైత్ర మాసం.
సం. చిత్రా. ఒకానొక నక్షత్రం.
<సం. చిత్రా.

**చిత్రిక** వి. వడ్రంగులు కర్రసామగ్రిని నునుపు చేయటానికి ఉపయోగించే సాధన విశేషం.
క. చిత్రికె.
**చిత్రికగుల్ల** వి. వడ్రంగులు కర్ర సామానును నునుపు చేయటానికి ఉపయోగించే సాధనం. **చిత్రికపల్లు** వి. వడ్రంగులు కర్ర సామానును నునుపు చేయటానికి ఉపయోగించే సాధనం. కకుత్స్థ. 2.23.

**చిత్రెకి** వి. చిన్న చిన్న పూలు పూసే ఒక రకం పెద్ద చెట్టు (Protium serratum).

**చిదక** రూ. చిదుక. విణ. చప్పి, లోపలకు అణగిన.
**చిదకముక్కు** విణ. చప్పిడి ముక్కు, అవటీట. బసవ. 3.1114. పం. **చిదకముక్కువాండు** రూ. చిదుకముక్కువాండు. విణ. చప్పిడి ముక్కువాడు.

**చిదగుదలు** వి.బ.వ. అలజడులు, విభేదాలు.

**చిదగొద** వి. **1.** వ్యత్యాసం, తారుమారు. వేంక. పంచ. 1.738; **2.** గృహ కలహం, కలహం.

**చిదచిద** రూ. చితచిత. వి. చెమ్మనేలమీద నడిచేటప్పుడు అయ్యే చప్పుడుకు అనుకరణం.
**చిదచిదలు** వి.బ.వ. ముక్క ముక్కలు.

**చిదమ** వి. ఒక రకం చేప.

**చిదమిద** చూ. సదమదము. విణ. సదమదమైన, నలిగిన. చిత్ర.భా. 6.68.

**చిదంబరరహస్యము** వి. అగోచరం, అనవగతం.
సం. చిదంబరరహస్య-. చిదంబరంలోని రహస్యం. చిదంబరంలో ఒక కోట తెర ఉంటుంది. తెరతీసి దేవుణ్ణి చూడమంటారు. చిదాకాశం. (ఏమీ లేకపోవటం, శూన్యం) కనిపిస్తుంది.
<సం. చిదంబరరహస్య- (అర్థవిపరి.).

**చిదర** వి. **1.** ముక్క, తునక; **2.** పలచన.

**చిదిమితీయు** చూ. చిదుము.

**చిదిమిదీపముపెట్టినట్లుండు** చూ. చిదుము.

**చిదిమిపెట్టినబంటు** చూ. చిదుము.

**చిదిమిపెట్టినబంటుతనము** చూ. చిదుము.

**చిదిమిపెట్టు** చూ. చిదుము.

**చిదిమివైచు** చూ. చిదుము.

**చిదియు** చూ. చితుకు. అ.క్రి. **1.** నలుగు. హరి. ఉ. 5.20, భాస్క.రా.యు. 1960; **2.** ఇరియు, ముక్కలగు.
త. చితై. నలుగు.

**చిదుం** వి. ఎండిన పుల్ల, సమిధ.

**చిదుక** రూ.చూ. చిదక. వి. ముక్క, తునుక. పల్నా. 109. విణ. చప్పి, లోపలకు అణగిన.

**చిదుకముక్కువాఁడు** రూ.చూ. చిదకముక్కువాఁడు. వి. చప్పిముక్కువాడు.

**చిదుకు**[1] రూ. చితుకు, చిదుగు. అ.క్రి. 1. నలుగు, చిప్పిలు. భార. అను. 5.28 ; 2. (ద్రవం) లోపల నుండి పైకి ఉబుకు, చిప్పిలు, ఉద్గతమగు. పాండు. 5.236 ; 3. చిందు.

క. కెదఱ్, కెదఱు, చదఱు, చెదఱు. చెదరగొట్టు, ఎగజల్లు ; తు. చదరుని. ఎగజల్లు ; చదరావుని, చదరిపుని. ఎగజల్లు, చెదరగొట్టు ; త. చితర్(-వ్,-న్త్). చెదరగొట్టు ; చితఱు. చెదరుగొట్టు ; మ. చితర్. దుమ్ము, మసి, చితఱుక. చెదరగొట్టు, వెదజల్లు ; చితఱిక్క. చిందపోయు ; కో. కిద్. చేతివేళ్ళకొనలతో చల్లటం ; తొ. కిద్. వెదజల్లు.

**చిదుకు**[2] వి. రొంపిలో అడుగు వేసినప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం.

**చిదుకుచిదుకు** వి. రొంపిలో అడుగులు వేసినప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం. ధ్వన్యను. భాగ. 10 పూ. 756.

**చిదుగ** వి. అల్లరి, చిలిపితనం, కొంటెతనం.

**చిదుగు** రూ.చూ. చిదుకు[1]. వి. ఎండినపుల్ల, సమిధ. ఉ.రా. 2.289.

సం. ఛిద్. నరుకు, కోయు.

**చిదుగొదలు** వి.బ.వ. అడ్డంకులు, ఆపదలు.

**చిదుప** చూ. చితుకు. వి. ముక్క.

**చిదుపు** చూ. చిదుకు[1]. స.క్రి. చిదియజేయు, నలగగొట్టు. శృం.నై. 8.148.

**చిదుము** చూ. చితుకు. స.క్రి. 1. (పుష్పాదులు) కోయు, తుంచు. కు.సం. 5.139 ; 2. నరుకు, ఖండించు. భార. సౌప్తి. 1.53 ; 3. తీయు. కాశీ. 5.53 ; 4. గిల్లు. మను. 2.61 ; 5. గుచ్చు, పొడుచు. శుక. 1.272 ; 6. వధించు, చంపు. అచ్చ.రా.బాల. 151; 7. సంగ్రహించు, సేకరించు; వి. 1. మొత్తం. ప్రబంధ. 7.88; 2. చిదుమబడేది, చిగురు, పల్లవం. చంద్రాంగ. 4.233.

క. కిత్తు. గిల్లు.

<మూ.ద్రా. *కిత్-/*కిచ్.

**చిదిమితీయు** స.క్రి. 1. సారం తీయు ; 2. రూపొందించు. **చిదిమిదీపముపెట్టినట్లుండు** అ.క్రి. అందంగా ఉండు. **చిదిమిపెట్టినబంటు** వి. 1. సేకరించి ఉంచిన శూరుడు. విజయ. 1.10 ; 2. అతిసమర్థుడు. పరమ. 5.12. **చిదిమిపెట్టినబంటుతనము** వి. మహాశూరత్వం. చిత్రభా. 8.11. **చిదిమిపెట్టు** స.క్రి. 1. పంచిపెట్టు. కు.సం. 11.180 ; 2. ఆరితేరు. వి. పరమ. 5.12, చిత్రభా. 7.11 ; 3. చక్కనిరూప మేర్పరచు. శుక. 1.527 ; **చిదిమివైచు** స.క్రి. 1. ఛిన్నాభిన్నం చేయు. వరరా.అరణ్య. 237 పు. 1 పం ; 2. చితకకొట్టు. **చిదుముట** వి. 1. హింస. ఆం.భా. 2.221 ; 2. గిల్లటం.

**చిదుర** చూ. చితుకు. విణ. అత్యల్పమైన. భార.అరణ్య. 6.90, భార.ఉద్యో. 2.161 ; వి. సూక్ష్మఖండం, సూక్ష్మభాగం. భార.శాంతి. 4.443.

**చిదురుప** చూ. చితుకు. రూ. చిదుర్పు, చిద్రుప. వి. చిన్నముక్క, సూక్ష్మఖండం. భార.ద్రోణ. 5.221 ; విణ. అత్యల్పమైన, మిక్కిలి చిన్నదైన. చంద్రాంగ. 6.85.

**చిదుర్పు** చూ. చితుకు. రూ.చూ. చిదురుప. వి. చిన్నముక్క, సూక్ష్మఖండం. భోజ. 5.22 ; విణ. అత్యల్పమైన, మిక్కిలి చిన్నదైన.

**చిద్రుప** చూ. చితుకు. రూ.చూ. చిదురుప. వి. సూక్ష్మఖండం, చిన్నముక్క. రం.రా.యు. 356 పు. 16 పం., ఉ.హరి. 4.109.

**చిన** రూ.చూ. చిన్న[1]. విణ. 1. అల్పమైన, చిన్నదైన. రాఘవ. పీఠి. 7 ; 2. కొద్ది.

**చినకరబద్ద** వి. ఒత్తుబద్ద, గొంగడినేత చివరికి వచ్చినప్పుడు, పడుగులో పేకపోగు దట్టించటానికి దూర్చే బద్ద. <చిన+కఱ్ఱబద్ద. **చినకాటము** వి. 1. చినుకులు ; 2. చిన్నవాన. **చినడబ్బు** వి. పాతమూడు దమ్మిడీలు, కానీ, పైసా. **చినతాడుకొయ్య** రూ. చింతాడుకొయ్య, సింతాడుకొయ్య. వి. మిడిగూటం, నేతబయలులో దివరపాతిన కొయ్య.

**చినంగి** వి. తెల్లటి చిన్నపూలు పూసే ఒకరకం పెద్ద చెట్టు (Largerstoremia parviflora).

**చినాగోరంట** వి. ఒకరకం పొద లేదా చెట్టు (Largerstoremia indica).

**చిని** రూ.చూ. చిన్ని[2]. విణ. 1. చిన్న ; 2. మనోజ్ఞమైన.

**చినుకు** రూ. చిన్కు. వి. వర్షబిందువు, చిన్న వాన. వేమన. 2.136, భార.ఆది. 8.269. స.క్రి. బొట్లుగారాల్చు, కురియజేయు, కార్చు. మను. 5.18 ; అ.క్రి. బిందువులుగాపడు, కురియు, కారు, స్రవించు. కాశీ. 3.149.

క. జిగినిసు. కరగించటం ; త. చిన్నుక్కు. కారు, చుక్కలుగాపడు, తుంపరలుగా వర్షించు ; చినుక్కు, చ్చినుక్క్కు, ఎనల్. తుంపరలుగా వర్షించటానికి అనుకరణం ; చినుక్కు. తుంపరలుగా వర్షించు ; మ. చినన్నుక. కొద్దిగా వర్షించు, తుంపరలుగా వర్షంపడు ; పర్జి. చింకిప్. కారటం.

**చినుకుదారి** రూ.చూ. చిన్కుదారి. వి. మబ్బు, జలధరం. **చినుకుపూస** రూ.చూ. చినుకుఁబూస. వి. ముత్యం. **చినుకుమేపుడుపుల్గు** వి. వర్షబిందువులను ఆకాశంలోనే తాగేపక్షి, వానకోయిల. **చినుకుఁబూస** రూ. చినుకుపూస. వి. ముత్యం. సాంబ. 61, అచ్చ.రా. యు. 592.

**చినుఁగు** రూ. చిన్గు, చిరుఁగు. అ.క్రి. 1. పగులు, బద్దలగు. రం.రా. 264 పు. 12 పం. 2. తూటుపడు, చిల్లుపడు. పద్మ. 3.23 ; 3. (వస్త్రాదులు) భిన్నమగు, ముక్కలగు. పద్మ. 10.240. వి. చిరుగు. పాండు. 5.140.

క. సిగి. బద్దలుచేయు, చీల్చు, పగలగొట్టు ; సిగసు, సిగిసు. పగిలిఉండు ; సిగులు. పగలగొట్టు, బద్దలు చేయు ; సిగుఱ్, సిగుఱు, సిబఱు, సివఱు. బద్దలు చేయు, ముక్కలయిపోవు ; సీబు. వెదురుబొంగు బద్దలు చేయు ; తు. తిగిపుని, తిగుపుని. బద్దలుచేయు, చీలిక, పగల

గొట్టు; పెగుపని, త్రుపని, తిగులుని, సిగురుని. బద్దలు చేయడం; పిసెత, తెగ్ర, తెగిత. బద్దలు చేయు, చీలిక, ముక్క; మ. సీంరుక. పగలగొట్టటం; చిత్తు. చీలిక; ఈడుక. కీల్చు, రంపంతోకోయు; తొ. సిక్చు. చిత్రముక్కను వాటిచేయు; గోం. సిండెర్. కర్ర బద్దలు చేయడం; దికానా. పగలగొట్టు; కుఇ. సీకి, సీకె, సికిడం. బద్దలు చేయు; కువి. సీప్ల. బద్దలు చేయు, పెక్కు; పర్జి. చీక్, చీకిప్. పగలగొట్టటం; పెంగొ. చినిగి పోవు; కుడు. చెర్బా. విభజించు; బ్రా. చీరింగ్. బద్దలు చేయు, ముక్కలుచేయు.

పో.చూ. సం. చీర-, చింపిసద్ద.

**చిప్పి** రూ.చూ. చినుకు. అ.క్రి. బిందువులుగాపడు, కురియు, కారు, స్రవించు. స.క్రి. బొట్లుగా రాల్చు, కురియజేయు. వి. స్రవించుట. చిన్నవాన.

**చిప్పిదారి** రూ. చినుకుదారి. వి. జలధరం, మేఘం. **చిప్పిదారివసు(సు(గూన** వి. మేఘాల దారి అయిన ఆకాశం యొక్క ప్రియ పుత్రుడు, వాయువు. అప్ప.రా. కిష్కిం. 11.

**చిప్పి** రూ.చూ. చినుఁగు. అ.క్రి. 1. (వస్త్రాదులు) చిన్నమగు, ముక్కలగు. ఉ.రా. 4.171; 2. పగులు, బద్దలగు; 3. పొటుపడు, చీల్చుపడు.

**చింత**[1] రూ. చింప, సింత. వి. తింత్రిణీవృక్షం. సిం.ద్వా. 3.157, కొమ్మలు వంటెగా, ఆకు పచ్చిపెడుపుగా ఉపయోగించే ఒక చెట్టు. అం.భా. 2.47 (Tamarindas indica Limn).

సం. చించా; ప్రా. చించా;

కొ. సింత. చింతచెట్టు; సిత్తమాక్. చింతచెట్టు; త. పుళిమ్, చెంతమ్. చింతచెట్టు; గోం. సిత్తమరా. చింతచెట్టు; నా. సిత్త. చింత.

<ప్రా. చించా.

**చింతఅంబలి** రూ. చింతంబలి. వి. చింతగింజలు ఉడక బెట్టి తీసిన పాకం. **చింతఉట్టి** వి. చింతపండును అంటుకొని ఉండే నరాలసమూహం. **చింతకాయ** రూ. సింతకాయ. వి. 1. కడెం, కుప్పె, గానుగ దూలానికి చివరబిగించే 'S' ఆకారపు ఇనపకొక్కెం; 2. కొండి, అప్పుగుడులు తగి లించే వంకర ఇనపహుక. **చింతకాయకజ్జము** వి. ఉపయో గించుకోటానికి వీలులేనిది. వాల్మ. సం. 7.34. **చింత కాయంచు** వి. బంగలకి చింతకాయ ఋపల ఆకారంతో పెట్టే అంచు. <చింతకాయ+అంచు. **చింతకాయంచుదాక** వి. బద్దలాగుండి అందం కోసం పైభాగంలో చింతకా యంచు పెట్టిన మట్టిపాత్ర. **చింతగింజలఅంబలి** వి. చింత గింజలు ఉడకబెట్టి తీసిన పాకం. **చింతగింజలచీర** వి. 1. చింతపిప్పల చీర; 2. ఒకరకం గళ్ళచీర. **చింతగుల్ల** వి. 1. పండు తీసివేసిన చింతకాయ పెరడు; 2. పెరడుతో ఉండే చింతపండు. **చింతచిగురు** వి. 1. చింతచెట్టుయొక్క లేతఆకు; 2. ఒకరకం ఆకుపచ్చరంగు. **చింతనాగు** వి. చింతపువ్వుల వంటి పొడలు వున్న ఒకజాతిపాము. **చింతనిప్పులురాలు** అ.క్రి. నిప్పులు ఎగ్రసను. రాజగో. 5.36. **చింతపండు** వి. పెరడు తీసిన చింతపళ్ళముద్ద. సిం. ద్వా. 3.156. **చింతపిక్కరంగు** వి. ఒకరకం ఎర్రరంగు. **చింతపిక్కలగంజి** వి. చింతనరి, పిక్కలగంజి, చింతగింజలు పిండిగొట్టి ఉడకబెట్టి తీసినగంజి. **చింతపిక్కలగడి** వి. తెల్లరంగులో నల్లపోగులు పెట్టిసేసిన గడి. **చింతపిప్పలచీర** రూ. చింతబిచ్చికలచీర. వి. 1. చింతగింజల చీర; 2. ఒకరకం గళ్ళచీర. **చింతపువుకార్తె** వి. ఆశ్వని, చైత్రమాసం (ఏప్రిల్) లో వచ్చేకార్తె. **చింత పువ్వులు** రూ. చింతపూలు. వి.బ.వ. 1. ఒకరకం ధాన్యం. హంస. 4.128; 2. బాలక్రీడా విశేషం. **చింతపూజాల** వి. చింతపువ్వుమాదిరి చార. **చింతపూర్రొతు** వి. చింతపూరు గ్రామప్రాంతం నుంచివచ్చే 'చలవరాయి.' **చింతపూలు** రూ. చూ. చింతపువ్వులు. వి.బ.వ. 1. బాలక్రీడా విశేషం. భోజ సుకా.2.9; 2.ఒకరకం పంట 'రత్నచుడీ' అనే మంచిరకం పంట; 3. చింతచెట్టు పువ్వులు. **చింతపొరక** వి. చింత పేడు, ఆముకాల్పులో వాడే చింతపేళ్ళు. **చింతంబలి** రూ. చూ. చింతఅంబలి. వి. చింత (గింజలు) పిక్కలతో చేసిన జావ. <చింత[1]+అంబలి. **చింతంబలిచెక్క** వి. చింతపేడు, ఆమురాల్పులో వాడే చింతకొమ్మ పేళ్ళు. **చింతబిచ్చికలచీర** రూ.చూ. చింతపిప్పలచీర. వి. 1. చింతగింజలచీర; 2. ఒకరకం గళ్ళచీర. **చింతసరి** వి. చింత పిక్కలగంజి. **చింతాకంత** వి. 1. అల్పం. కాశీ. 3. పాండు. 4.275; 2. కొంచెం, రవ్వంత, కాసంత. <చింతాకు + అంత. **చింతాకు** వి. 1. బాలక్రీడా విశేషం. హంస. 3.146. ప్రబంధ. 613; 2. స్త్రీ భూషా విశేషం. హంస. 4.138; 3. చింతచెట్టుయొక్క ఆకు. క. చింతాక; త. చింతాక్కు. <చింత[1] + ఆకు. **చింతాకుచుణుదు** వి. ఒక బాలక్రీడ. **చింతాకుముదు(గుతటి** వి. 1. చీకటివేళ. శుక. 1.444; 2. సాయంకాలం. **చింతెలుగు** వి. నిర్మాణ ద్రవ్యంగా పనికి వచ్చే కలపనిచ్చే చెట్టు (Fragrant sirisha, Albizzia odoratissima). **చింతొక్కు** వి. 1. పచ్చిచింత కాయలు ఉడకబెట్టి తొక్కి చేసే పచ్చడి; 2. చింతకాయ దంచిన ముద్ద.

**చింత**[2] వి. దుఃఖం, విచారం.

సం. చింతా. విచారం, ఆత్రం, తలపు.

<సం. చింతా (అర్థవిపరి.).

**చింతయిడు** స.క్రి. ఆలోచించు, తలపోయు. వర.రా.బా. పు. 141.16. సం. చింతా. విచారం, తలపు. <సం. చింతా +ఇడు. **చింతలవంతలచివుకు** అ.క్రి. చింతలో కుంగిపోవు. మను. 3.8.సం. చింతా. విచారం, దుఃఖం, ఆలోచన. **చింతవంతపడు** అ.క్రి. బాధపడు. శుక. 1.519; సం. చింతా. దుఃఖం.

**చింతించు** స.క్రి. ఆలోచించు, విచారించు.

సం. చింతా. విచారం, ఆత్రం, తలపు. <సం. చింతా + ఇంచు[2] (అర్థవిపరి.).

**చింతసక్కి** రూ. చింతొక్కు. వి. నారాయణ పక్షి.

**చింతాకంత** చూ. చింత[1].

**చింతాకు** చూ. చింత[1].

**చింతాకుచుణుదు** చూ. చింత[1].

**చింతాకుముదు(గుతటి** చూ. చింత[1].

**చింతాడుకొయ్య** రూ.చూ. చినతాడు కొయ్య. వి. మిడిగూటం, నేత బయలులో చివరపాతిన కొయ్య.

**చింతామణి** వి. లేతనీలం రంగు.

సం. చింతా.మణి-. కోర్కెలు తీర్చే ఒకమణి.

<సం. చింతామణి- (అర్థవిపరి.).

చింతామణిచీర వి. ఒకరకం లేతనీలం రంగుచీర.

**చింతాలు** స.క్రి. తూకంవేయు.

**చింతుచెట్టు** వి. ఒకరకం పొద (Celastrus emarginata).

**చింతెలుగు** చూ. చింత[1].

**చింతొక్క** రూ.చూ. చింతనక్క. వి. నారాయణపక్షి.

**చింతొక్కు** చూ. చింత[1].

**చింద** రూ. చీఁద. వి. పిన్నగద్ద, చీపరపిట్ట. యయా. 1.41.

చిందపిట్ట వి. చీపరపిట్ట.

**చిందగు** చూ. చిందు.

**చిందము** వి. శంఖం. భార. విరా. 4.149.

సం. చిహ్న. గుర్తు, సంకేతం ; ప్రా. చింధం-.

<ప్రా. చిందం.

**చిందయిపోవు** చూ. చిందు.

**చిందర** వి. పక్షివిశేషం. హంస. 3.12.

**చిందరవందర** రూ.చూ. చిందఱవందఱ. వి. **1.** తూటు, చిల్లి ; **2.** తుత్తునుక, చిన్నముక్క ; **3.** కలత ; విణ. **1.** చెల్లాచెదరైన, కలగుండు పడిన, కలతపడిన ; **2.** తారుమారైన, వ్యత్యస్తమైన. క్రి.విణ.ద్రు. ముక్కలు ముక్కలుగా.

**చిందరేఁగు** రూ.చూ. చిందఱరేఁగు. అ.క్రి. **1.** రెచ్చు, చెలరేగు. వేంక. పంచ. 4.262, పారి. 2.31 ; **2.** చీదరగొను.

**చిందర్లపోవు (-పోవు)** రూ.చూ. చిందఱలువోవు. అ.క్రి. తూట్లుపడు, చిల్లులుపడు. విప్ర. 4.19.

**చిందఱ[1]** రూ. చీఁదఱ[1]. వి. **1.** విజృంభణ. యయా. 2.9 ; **2.** కోపం. ఆం. భా. 1.135.

క. సితఱ్. కోపం.

చిందఱకొట్టు అ.క్రి. **1.** రెచ్చు, రేగు. అష్ట.మ.క. 2.113పు. 24 పం.; స.క్రి. విరజిమ్ము. **చిందఱగొను[1] (-కొను)** అ.క్రి. **1.** విజృంభించు, ఆవేశమెత్తు, సివమెత్తు, రెచ్చు, చెలరేగు. హరి. పూ. 6.123. **చిందఱరేఁగు** రూ. చిందరేఁగు, చీదఱరేఁగు. అ. క్రి. ఆవేశమెత్తు, సివమెత్తు, రెచ్చు, రేగు, కోపించు. భార. ఆది. 7.106.

**చిందఱ[2]** రూ. చీఁదఱ[2]. వి. **1.** ఖండం, ముక్క, చీలిక. సారంగ. 2.150 ; **2.** తూటు, చిల్లి.

సం. ఛిద్ర-. బెజ్జం, రంధ్రం.

చిందఱగొను[2] (-కొను) అ.క్రి. చిల్లులుపోవు, తూట్లుపడు. భాగ. 8.209. **చిందఱపోవు** రూ.చూ. చిందఱవోవు. అ.క్రి. **1.** తూట్లుపడు ; **2.** చెదరు. **చిందఱలాడు** స.క్రి. ఛేదించు, ఖండించు, నరుకు, ముక్కలుచేయు. వరాహ. 2.29. <చిందఱ[2] +-లు + ఆడు. **చిందఱలుపోవు** రూ.చూ. చిందఱలువోవు. అ.క్రి. చిల్లులుపడు. **చిందఱలువోవు** రూ. చిందర్లపోవు, చిందఱలుపోవు. అ.క్రి. తూట్లుపడు, చిల్లులుపడు. ద్వి. హరిశ్చ. పూ. 1845 పం. <చిందఱ[2] + -లు + పోవు. **చిందఱలుసేయు** స. క్రి. చెదరగొట్టు, విరియజేయు. సారంగ. 2.171. <చిందఱ[2] + -లు + చేయు. **చిందఱవందఱ** రూ. చిందర వందర. విణ. **1.** చెల్లాచెదరైన, కలగుండపడిన, కలతపడిన. ఉ. హరి. 5.227 ; **2.** తారుమారైన, వ్యత్యస్తమైన. కకుత్స్థ. 2.133 ; వి. **1.** తుత్తునుక, చిన్నముక్క. కళా. 8.123 ; **2.** కలత. సారంగ. 3.15 ; **3.** తూటు, చిల్లి. కవి.రాజ. 3.147 ; క్రి.విణ.ద్రు. ముక్కలు ముక్కలుగా. ఆం. భా. 3.67. **చిందఱవందఱచేయు** స.క్రి. **1.** ఖండించు, ముక్కలు ముక్కలుచేయు. భార. విరా. 5.56 ; **2.** చెదరగొట్టు. భార. ద్రోణ. 1.324 ; **3**. పీడించు, బాధించు. భోజ. 6.149 ; **4.** చిల్లులు పడేట్టు చేయు, తూట్లుపడజేయు. సారంగ. 2.154. **చిందఱవందఱలాడు** స.క్రి. ఖండించు, ముక్కలు ముక్కలు చేయు. భాస్క. రా. యు. 247. **చిందఱవందగు** అ.క్రి. శిథిలమగు, చెదరు. **చిందఱవందు** విణ. చిందఱ వందరైన. శృం.సా. 2.82. **చిందఱవోవు (-పోవు)** రూ. చిందఱపోవు. అ.క్రి. **1.** తూట్లుపడు, చిల్లులుపడు. కాశ. 7.20, కళా. 7.19 ; **2.** చెదరు. **చిందఱసేయు(-చేయు)** స.క్రి. విరియజేయు, చెదరగొట్టు. సారంగ. 1.93.

**చిందఱ[3]** వి. బాలక్రీడా విశేషం. ఇందు. 2.18.

**చిందాట** చూ. చిందు.

**చిందాడు** చూ. చిందు.

**చిందిబాయినీలు** వి.బ.వ. సిండిబాయిలనే వడ్లు.

**చిందియ** రూ. చిందె. వి. జెట్లు మొ॰ వారు పెట్టుకొనే ఒక విధమైన కుళ్ళాయి. పండి. చ. 4.279 పు. 26 పం.

సం. చిహ్నిత-.; ప్రా. చింధియ-. చిహ్నితం, చిహ్నయుక్తం ; చింధం-. లాంఛనం, ధ్వజం, పతాకం.

<ప్రా. చింధియ-.

**చిందిలి** చూ. చిందిలు.

**చిందిలిపడు** చూ. చిందిలు.

**చిందిలిపాటు** చూ. చిందిలు.

**చిందిలిమందిలి** చూ. చిందిలు.

**చిందిలిమందిలియగు** చూ. చిందిలు.

**చిందిలు** రూ. చిందిల్లు. అ.క్రి. చెదురు, కదలు. నార. పంచ. 1.192. విణ. చలించిన.

చిందిలి వి. సంభ్రమం, కలత, తొట్రుపాటు, కదలిక. విణ. చలించిన, కదలిన. **చిందిలిపడు** అ.క్రి. సంభ్రమించు, కలగు, తడబడు, కళవళపడు. కాశీ. 2.159. **చిందిలిపాటు** వి. సంభ్రమం, వేగిరపాటు. శృం.నై. 6.55. **చిందిలిమందిలి** విణ. చెదరిన, చెడిన. నృసింహ. 2.53. **చిందిలిమందిలియగు (-అగు)** అ.క్రి. **1.** చలించు, ఛిన్నాభిన్నమగు ; **2.** చెదరు, చెడు.

**చిందిల్లు** రూ.చూ. చిందిలు. అ.క్రి. చెదురు, కదలు. విణ. చలించిన.

**చిందు** వి. **1.** (సంగీత) వర్ణ విశేషం, ఒక విధమైన పాట. పండి.చ. 5.342 పు.; **2.** బిందువు. కువ.చ. 4.172 ; **3.** నాట్య విశేషం, మాతంగ నాట్యం. ఆం.భా. 1.131,

చూపు చూచు. చిన్నకమ్మి వి. కమ్మి నేతలో చిన్న పట్టె. చిన్నకలమంద వి. కలబందలో ఒక రకం (Aloe-litoralins.) చిన్నకలింగ వి. ఒక రకం మొక్క (Dillenia pentagyna). చిన్నకా(కర వి. క్షుద్రకార వేల్లిక, కంధఫల. చిన్నకారు యా.చూ. చిన్నకాలు. వి. బాల్యం, చిన్నతనం. చిన్నకాలు రూ. చిన్నకారు. వి. లేత వయసు, బాల్యం. చిన్నకాసర వి. కామాచి. వృక్ష విశేషం. చిన్నకుంచె వి. పడుగుదువ్వే ఒక రకం కుంచె. చిన్నకుంట వి. భూమి కొలత, $\frac{1}{3}$ ఎకరం. చిన్నకుమ్మరి వి. కుమ్మరి వాళ్ళలో ఒక తెగ. చిన్నకుసుమ రూ. సిన్నకుసం. వి. మామూలు కుసుమ కంటె తక్కువ కాలంలో పండే రకం. చిన్నకూ(తురు వి. కుమార్తెలలో చిన్నది. కళా. 4 68. చిన్నకొణామణి వి. ధాన్య విశేషం, ఒక రకం వడ్లు. చిన్నకొండపిండిచెట్టు వి. జతు పత్రిక, ఒక రకం చెట్టు. చిన్నకొమిరె రూ. చిన్నకొమ్రె. వి. పిల్లకొమర, పెనుగాడి కాక తక్కిన వాసాలను మోసే కొమర. చిన్నకొమ్రె రూ.చూ. చిన్నకొమిరె. వి. పిల్లకొమర, వెనుగాడి కాక తక్కిన వాసాలను మోసే కొమర. చిన్నఖయలుపేటు వి. ఒక రకం అంచు డిజైను. చిన్నగంటె వి. ఒక రకం గంటె, సస్యవిశేషం. చిన్నగది వి. **1.** తడికె బిళ్ళలో, ఇనప పుల్లల మధ్యగల చిన్న సందు; **2.** గదుల్లో చిన్నది. చిన్నగరికగడ్డి వి. పశువులు తినే ఒక రకం గడ్డి (Erag-rostisplumosa). చిన్నగుజ్జు వి. పిల్లగుజ్జు, వెనుగాడి కాక తక్కిన వాసాలను కాసే గుజ్జు. చిన్నగుడ్లగూబ వి. క్షుద్రోలూకం, విశాలాక్షం, పింగలం. చిన్నగుండవ్వ వి. చిన్నరాయి, చిన్న సైజు పాత్రల్ని సర్సడానికి వాడే రాయి. చిన్నగుదిపాయ వి. అంచగుదిపాయ, అచ్చుగుదిపాయల్లో చివరిది. చిన్నగుద్దలి వి గొప్పులు తవ్వే పనిముట్టు. చిన్నగుబ్బలు వి.బ.వ. మోటికలు, చిన్న పాత్రలు పొయ్యి లోపలికి జారిపోకుండా ఉంటానికి పొక్కళ్ళ దగ్గరే లోపలికి చిలక ముక్కుల్లా పెట్టిన మట్టి కొండేలు. చిన్న గురిగెలు వి బ.వ. లక్కపిడతలు. చిన్నగురుగింజ వి. గులాబి రంగు పూలతో, ఎరుపు నలుపు రంగు గింజలతో ఉండే ఒక రకం తీగ. ఈ గింజలను తూకంలో వాడు తారు (Abrusprecatorius Limn). చిన్నగొర్రు వి. తొలిగొర్రు, పొగ, మిరప, వేరుసెనగ మొ. చేలలో తోలే చిన్న సైజు గొర్రు. చిన్నగోరంచు వి. సన్నగా నేసిన గోరంచు. చిన్నఘంట వి. చిన్నగంట. చిన్న(గ(బోవు (-పోవు) అ.క్రి. **1.** ఖిన్నమగు. శివరా. 2.19; **2.** శోభా హీనమగు; **3.** చెడు, విఫలమగు. చిన్నచర్లగడ్డ వి. గైరి. చిన్నచిట్టి వి. ధాన్యపు కొలత, సేరులో పదహారో భాగం. చిన్నచిట్టె రూ. సిన్నసిట్ట, సిన్నసిట్టి. వి. **1.** బిర్రుచిట్టె, పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్దల్లో కిందది; **2.** చిన్నకమ్మి, కమ్మినేతలో చిన్నపట్టె. చిన్నచూపుచూచు స.క్రి. ఉపేక్షా దృష్టితో చూచు. చిన్నచెల్లెలు వి. చెల్లెళ్ళలో చిన్నది. చిన్నజటామాంసి వి. అభ్రమాంసి, నిరాలంబ. చిన్నజమ్మి వి. నేలజమ్మి, శమీరం. చిన్నజువ్వి వి. హ్రస్వ ప్లక్షం, సుశీతం. చిన్నటనా(డు రూ.చూ. చిన్ననా(డు.

వి.జా. చిన్నతనం, బాల్యం. వసు. 4.106. చిన్నటమోట వి. చిన్నరకం రాముములగ. చిన్నతనపు(జేష్టలు (-చేష్టలు) వి.బ.వ. బాల్య చేష్టలు, కొంటెపనులు. చిన్నతనమగు అ.క్రి. అవమానమగు. పల్నా. 62 పు. <చిన్నతనము + అగు. చిన్నతనము వి. **1.** లాఘవం, గౌరవం. పీఠ. 2.21; **2.** అల్పత్వం, తక్కువపాటు. పల్నా. 62; **3.** లేత వయసు, బాల్యం; **4.** అవమానం. చిన్నతల్లి వి. పినతల్లి. చిన్నతాపి వి. ఎదురాకు తాపి, సన్నగా పొడుగ్గా కోలగా ఉండే రేకుగల చిన్నతాపి. చిన్నదండెం వి. మగ్గం చిడతలు అమర్చినకొయ్య. చిన్నది విణ. చిన్నదైన. పాండు. 2.91. వి. **1.** పడుచు. చా.మం. 1,126; **2.** బాలిక; **3.** స్త్రీ. <చిన్న[1] + అది. చిన్నదినము వి. **1.** శవదహన మైన నాటి మరునటి దినం, పాల దినం; **2.** మరణించిన నాటి నుంచి మూడోదినం చేసే ప్రథమ ఉత్తరక్రియ. చిన్నదూలగొండ వి. దురాలభం, వృక్షవిశేషం. చిన్నదొర వి. చిన్నరాజు, చికిరాయడు, యువరాజు. చిన్ననక్కెర వి. భూగర్భదారం, వృక్షవిశేషం. చిన్ననవ్వు వి. చిరునవ్వు. పాండు. 1.213. చిన్ననా(టికతలు వి.బ.వ. గత చరిత్ర గాథలు. శివరా. 2.46. చిన్ననా(డు రూ. చిన్నటనా(డు. వి. చిన్నతనం, బాల్యం. శివరా. 2.46. చిన్ననీమ వి. మూలల మధ్యదిక్కు. చిన్ననువ్వు వి.బ వ. ఒకరకం నువ్వు. చిన్ననేపాళము వి. ఉపచిత్ర, వృక్షవిశేషం. చిన్ననేరేడు వి. ఒకరకం చెట్టు (Eugenia Heyneana). చిన్నపచ్చా వి. తక్కువ కొలతలుగల వస్తువు. చిన్నపడుచు వి. బుల్లి, బొట్టె, బాలిక. చిన్నపత్తి వి. ఒకరకం పత్తి. చిన్నపల్లేరు వి. క్షుద్ర గోక్షురకం, స్వాదు కంటం, వృక్ష విశేషం. చిన్నపసాడీలు వి.బ.వ. ధాన్యవిశేషం. చిన్న పా(పర వి. పుచ్చ, గోతుంబి. చిన్నపార వి. గడ్డిదొక్కనే చిన్న రేకుపార. చిన్నపాల వి. గ్రాహిణి, కచ్చుర, వృక్ష విశేషం. చిన్నపీట. వి. వెనకపీట, ఆసుపీటల్లో చివరిది. చిన్నపుగ వి. ఆషాఢమాసం. (జూలైనెల) లో వచ్చే కార్తె. చిన్నపుట్టి వి. ధాన్యపుకొలత, 400 మానికలు. చిన్నపురి తాడు వి. పట్టుదారం వడికే పెద్ద రాట్నం కదుర్లపట్టికి, చక్రానికి వేసే గట్టి దారం. చిన్నపువ్వు వి. స్త్రీలు ముంగురుల్లో అకరువుల వంటి పొడిని చల్లుకోటం. చిన్న పుసల రూ. చిన్నపుసాల, చిన్నపుసిలి, చిన్నపుసేల, చిన్న పూసెం. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె: పుష్యమికార్తె. సం. పుష్య-. ఒకనక్షత్రం. <చిన్న[1] + సం. పుష్య. చిన్న పుసాల రూ.చూ. చిన్నపుసల. వి. పుష్యమికార్తె. చిన్నపుసిలి రూ.చూ. చిన్నపుసల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. చిన్నపుసేల రూ.చూ. చిన్నపుసల. వి. ఆషాఢ మాసంలో వచ్చే కార్తె. చిన్నపూలు వి.బ.వ. మొక్కలు, బెంగనాలు. చిన్నపూవడ్లు వి.బ.వ. ధాన్యవిశేషం. చిన్నపూసెం రూ.చూ. చిన్నపుసల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. చిన్నపోవు రూ.చూ. చిన్న(బోవు. అ.క్రి. **1.** వెలవెలపోవు. పల్నా. 89; **2.** అవమానపడు చిన్నబయా హుండా రూ. చిన్నబయ్యాఉండా. వి. బియ్యంలో ఒక రకం. చిన్నబయ్యాఉండా రూ.చూ. చిన్నబయాహుండా.

వి. పెయ్యంలో ఒకరకం. చిన్నబలుసు వి. ఒకరకం ఆకు కూర (Canthiam parviflorum). చిన్నబూడిత వి. చేబూడిన, వ్రడంగిపనిముట్టు. చిన్నబీర వి. ఒకరకం బీర. చిన్నబుచ్చు రూ.చూ. చిన్నఁబుచ్చు. స.క్రి. అవమానించు. చిన్నబూడిదగుమ్మడి వి. జాలకం, ఒకరకం గుమ్మడి. చిన్నబెండ వి. ఒకరకం బెండ. చిన్నమాటలు వి.బ.వ. అవమానం కలిగించే మాటలు, దూషణవాక్యాలు. చిన్న మాడ వి. కొలదివెలగలమాడ, ఒకానొక నాణెం. దశా. 4.797. చిన్నమిటిపొద్దు వి. తెల్లవారుజాము. చిన్నముల్లంగి వి. క్షుద్రమూలకం, మహా కందం. చిన్నమూతి వి. గూన చివరి సన్నటి భాగం. చిన్నమేఁడాసింగి వి. మేఢిక, వృక్ష విశేషం. చిన్నమొక్కజొన్న వి. ఒకరకం మొక్కజొన్న. చిన్నమొల వి. గొడ్రు చెక్కకు క్రు బిగించే ఇనపకొండి, క్రుమొల. చిన్నఁబుచ్చు (-పుచ్చు) రూ. చిన్నబుచ్చు. స.క్రి. 1. విఫలం చేయు, భంగపరచు, చెరచు. క్రీడా. 95 ; 2. తక్కువచేయు, న్యూనపరచు. పి.శకు. 2.140. చిన్నఁబోవు(-పోవు) రూ. చిన్నపోవు, చిన్నవోవు. అ.క్రి. 1. ఖిన్నమగు. భాగ.విరా. 2.59 ; 2. శోభాహీనమగు. భార. మహా. 1.18 ; 3. విఫలమగు, చెడు. శృం.నై. 4.96. చిన్నమ్మవారు వి. ఉటలమ్మ, పొంగు, మశూచికంలో ఒక భేదం. <చిన్న$^{1}$+అమ్మవారు. చిన్నరాగవాళిచీర వి. తొమ్మిది కొలుకులు నలుపు, మూడు కొలుకులు ఇటాలి, పదికొలుకులు నలుపు, మూడుకొలుకులు ఇటాలి రంగుల్లో మధ్య నేసిన చీర. చిన్నరాయి రూ. సిన్నరాయి. వి. 1. చిన్నగుండప్ప, చిన్నరౌతు, సూదిరాయి, చిన్నసైజు పాత్రల్ని సర్దేదానికి వాడేరాయి ; 2. క్రౌతు, చిన్నదైన రాయి. చిన్నరి రూ.చూ. చిన్నారి. విశ. మనోజ్ఞమైన. ఇంపైన. చంద్రికా. 2.95. చిన్నరిపొన్నరి రూ.చూ. చిన్నారిపొన్నారి. విశ. ముద్దులొలికే. ఆం.భా. 3.26. చిన్నరికము రూ.చూ. చిన్నటికము. వి. పసితనం. చిన్నరేఁగు వి. బహుకరం, సౌవీరిక, వృక్ష విశేషం. చిన్నరౌతు వి. చిన్నరాయి. చిన్నసైజు పాత్రల్ని సర్దే రాయి. చిన్నటికము రూ. చిన్నరికము. వి. సన్నతనం, బాల్యం. ఆం.భా. 2.117. <చిన్న$^{1}$+టికము చిన్నల చంద వి.బ.వ. ఒకరకం అలచందలు, చిన్నరకం బొబ్బర్లు. చిన్నలు వి.బ.వ. చిన్నవారు, పిన్నలు, బాలుదు. చిన్నల్లు వి. ఇంటిలోపలి గది. చిన్నవరం రూ. చిన్నారం. వి. పిల్లగనెం, మడికీమడికీ మధ్య అడ్డుగా కట్టిన మట్టికట్ట. చిన్నవాడు వి. బాలుడు. పల్నా. 93. చిన్నవాఁడు వి. బాలుడు. చెన్న.బసవ. 1.32. చిన్నవోవు (-పోవు) రూ.చూ. చిన్నఁబోవు. అ.క్రి. 1. ఖిన్నుడగు. హర. 7.134 ; 2. చిన్నవుచ్చు; 3. అవమానంతో కుంగు. చిన్నసజ్జ వి. ఒకరకం ఆహారధాన్యం. చిన్నసద్ద వి. ఒకరకం సద్ద. చిన్నసందు వి. సాటుపంట, కట్టెలు పెట్ట టానికి ఆములో ఉంచిన సందు. చిన్నసంబావులు వి.బ.వ. ధాన్యవిశేషం. చిన్నసలప వి. నాసిబల్ల, కదవలు, చిన్న ప్యాలల్ని సర్సటానికి వాడే సలప. చిన్నసారి వి. కుండలు, కూజాలు, తొట్లు మొ. చేయటానికి వాడే నాల్గు చేతుల చిన్నసైజు సారె. చిన్నసుత్తి రూ. చిన్నసుత్తె. వి. 1. జంపరసుత్తి ; 2. చేతిసుత్తి. చిన్నసుత్తె రూ.చూ. చిన్న సుత్తి. వి. 1. జంపరసుత్తి ; 2. చేతి సుత్తి. చిన్నాచితక వి. 1. పసితనపు మాట(లు) ; 2. చిన్నచిన్న వస్తులు. చిన్నాట్రగడ్డ రూ. సినాట్ర గడ్డ. వి. తేలిక రకం, ఆడుతుర్రై, 3, 4, నెంబర్లు కావచ్చు, ధాన్య విశేషం. <చిన్న$^{1}$ + అట్రగడ్డ. చిన్నాము వి. పెంకు బట్టి, పెంకును కాల్చే బట్టి. <చిన్న$^{1}$+ఆము. చిన్నాము దాలు వి.బ.వ. చిన్నగింజలుండే ఆముదాలు. <చిన్న$^{1}$+ ఆముదాలు. చిన్నాయన వి. పినతండ్రి. <చిన్న$^{1}$+ నాయన. చిన్నారి రూ. చిన్నరి. విశ. 1. అందమైన, మనోజ్ఞమైన, ఇంపైన. వేంక. పంచ. 4.459 ; 2. సూక్ష్మ మైన. అల్పమైన. ద్వి.పరమ. 4.291 ; 3. చిన్నదైన. రాధి. 1.53. <చిన్న$^{1}$+-అరి. చిన్నారిపొన్నారి రూ. చిన్నరిపొన్నరి. విశ. 1. మనోజ్ఞమైన, ముద్దైన, అందమైన కాశీ. 1.7 ; 2. అల్పమైన, చిన్న, సూక్ష్మమైన. హర. 5.55. చిన్నాలుక వి. చిరినాలుక, కొండనాలుక. <చిన్న$^{1}$+నాలుక. చిన్నారం రూ.చూ. చిన్నవరం. వి. పిల్లగనెం.

చిన్న$^{2}$ వి. ఒకానొక చెట్టు. యయా. 4.15.

చిన్నపురాయి వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతినరాయి.

సం. చిహ్న-. గుర్తు.

చిన్నమంత చూ. చిన్నము.

చిన్నము వి. 1. నాలుగు గురివింద గింజల ఎత్తు ; నాలుగు గురివింద గింజల ఎత్తు బంగారు నాణెం. పావులూరి మల్లనగారి గణితశాస్త్రం ; 2. బంగారం. దశా. 10.7 ; 3. రెండు గురివింద గింజల ఎత్తు బంగారం ; 4. తులంలో ముప్పయ్యో వంతు ; 5. వరహాలో ఎనిమిదో వంతు విలువగల నాణెం ; 6. నాలుగు పాతికలు.

క. చిన్న.

చిన్నమంత విశ. కొంచెం. కళా. 4,128.

చిన్నాచితక చూ. చిన్న$^{1}$.

చిన్నాట్రగడ్డ చూ. చిన్న$^{1}$.

చిన్నాము చూ. చిన్న$^{1}$.

చిన్నాముదాలు చూ. చిన్న$^{1}$.

చిన్నాయన చూ. చిన్న$^{1}$.

చిన్నారి చూ. చిన్న$^{1}$.

చిన్నారిపొన్నారి చూ. చిన్న$^{1}$.

చిన్నాలు వి.బ.వ. ఊర్ధ్వ. పుండ్రద్వయం.

సం. చూర్ణ -. పొడి.

చిన్నాలుక చూ. చిన్న$^{1}$.

చిన్ని$^{1}$ రూ.చూ. సున్ని. వి. గుబ్బకన్ను, సారె మొలదించ టానికి గుబ్బరాయి మధ్యలోపెట్టిన రంధ్రం.

చిన్ని$^{2}$ రూ. చిని. చూ. చిన్న$^{1}$. విశ. 1. చిన్నదైన. కాశీ. 1.3 ; 2. మనోజ్ఞమైన, ఇంపైన, ముద్దైన. హర. 2.134 ; వి. 1. పిన్ని ; 2. ఎండబెట్టి తేనె మొ॥ వాటిలో వేసిన మామిడిముక్క ; 3. ఒకానొక చెట్టు.

త. చిన్నమ్. చిన్న.

చిన్నిఆకుచెట్టు వి. ఒకరకమైన చెట్టు (Acalypha fraticosa). చిన్నికలబంద వి. పొట్టిగా ఉండే ఒకరకం మొక్క (Aloevera). చిన్నిచుక్కలు వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. చిన్నిది విణ. చిన్నది, అందమైనది. <చిన్ని² + అది. చిన్నినవ్వు వి. మందహాసం, చిరునవ్వు. కావ్యా.చూ. 1.29. చిన్నిపువు¹ రూ.చూ. చిన్నిపువ్వు¹. వి. కుంకుమ కర్పూరాది చూర్ణం. కాశీ. 6.126. చిన్నిపువు² రూ. చూ. చిన్నిపూవు². వి. నమస్కార విశేషం. చిన్నిపువ్వు¹ రూ. చిన్నిపువు¹, చిన్నిపూ, చిన్నిపూవు¹. వి. కుంకుమ కర్పూరాది చూర్ణం, భూషణ విశేషం. కు.సం. 9.126. చిన్నిపువ్వు² రూ.చూ. చిన్నిపూవు². వి. నమస్కార విశేషం. హంస. 4.213. చిన్నిపూ రూ.చూ. చిన్నిపువ్వు¹. వి. కుంకుమ కర్పూరాది చూర్ణం. కాశీ. 7.147. చిన్నిపూతేకు వి. చిన్ని చెట్టు పూరేకువలె ఉండే అలంకార విశేషం. శృం.నై. 6.44. చిన్నిపూవు¹ రూ.చూ. చిన్నిపువ్వు¹. వి. కుంకుమ కర్పూరాది చూర్ణం. చిన్నిపూవు² రూ. చిన్నిపువు², చిన్నిపువ్వు². వి. నమస్కార విశేషం. ఘటికా. 2.177. చిన్నిపూవు³ వి. ఆభరణ విశేషం. చిన్నిబూచె వి. నమస్కారం. చిన్నిమ్మ వి. నిమ్మజాతికి చెందిన చిన్న మొక్క. <చిన్ని² + నిమ్మ. చిన్నియెలుక (-ఎలుక) వి. చిట్టెలుక. చిన్నివెన్నెల వి. మొక్కు, జోహారు. చిన్నివెన్నెలకందు వి. లేత చందమామ. మను. 2.43. చిన్నివేల్పులరాజు వి. ఉపేంద్రుడు. భీమ. 1.45. చిన్నీరు వి. అల్పజలం. రామా. 6.125. <చిన్ని² + నీరు.

చిన్నిదము వి. 1. చిన్నిపువ్వు ; 2. బంగారు ; 3. బంగారు నగ.

చిన్నియ రూ.చూ. చిన్నె. వి. 1. విలాసచేష్ట. నీలా. 2.92 ; 2. కళంకం, లాంఛనం, గుర్తులక్షణం.

చిన్నీ వి. ఆకుపచ్చపన్నె, తివాసీ నేతపని వాళ్ళ వాడుక.

చిన్నీరు చూ. చిన్ని².

చిన్నూబ రూ. సన్నూబ. వి. ఊబ తెగకు చేరిన ఒకరకం కలుపు మొక్క (Heteropogon contatas).

చిన్నె రూ. చిన్నియ. వి. 1. విలాసచేష్ట, చేష్ట. పల్నా. 7 ; 2. కళంకం, లాంఛనం, గుర్తులక్షణం. చంద్రికా. 6.39 ; 3. కొత్తమార్పు.

సం. చిహ్న-. గుర్తు ; ప్రా. చిణ్ణియ. ముద్రించబడింది ; క. చిన్న, చిన్నె. గుర్తు ; మ. చిన్నమ్.

<ప్రా. చిణ్ణియ.

చిన్నెలాడి వి. విలాసవతి, వగలాడి. చిన్నెలాడు వి. విలాసవంతుడు, వగలాడు, సౌందర్యవంతుడు.

చిన్నోరం చూ. చిన్న¹.

చిపిలి రూ.చూ. చిడిపి. విణ. చిలిపి చేష్టలు చేసే,

చిపిలివాడు అ.క్రి. మిక్కిలి కృశించు, బక్కచిక్కు.

చిప్ప వి. 1. మద్యం మొ॥ తాగటానికి ఉపయోగించేపావు. నృసింహ. 393 ; 2. నత్త మొ॥ జలచరాలపై పెంకు, శంబూకం, కప్పచిప్ప. రం. రా.యు. 307పు. 10 పం ; 3. ఖండం, ముక్క, తునక. రం. రా. యు. 357పు. 27పం ; 4. బ్రహ్మాండం. కొబ్బరికాయ మొ॥ వాటి సగ భాగం. కాశీ. 7.112 ; 5. శరీరంలో చిప్పఆకారంగా ఉండే ఒక ఎముక. మను. 4.45 ; 6. ముత్యపుచిప్ప, శుక్తి. ఆము. 2.3 ; 7. తాబేటి వెన్ను పెంకు. ప్రభా. 2.64 ; 8. చేప మీదిపొలుసు, శల్కం. పాండు. 3.167 ; 9. చిప్పగడ్డి. భూస్తృణం. ఆం. భా. 2.76 ; 10. చట్టి, వంటకు వాడే చిన్నమట్టిపాత్ర ; 11. కప్పెరగిన్నె, కొబ్బరి బరికేరాటి పైబద్దలను బిగించి వాటి మధ్య బోర్లించి కట్టిన చిప్ప ; 12. అట్ట, కుడక, వడిసెలలో రాయి పెట్టేచోటు ; 13. గెరచెక్క, చంకచెక్క, ఒడ్డెబండి చక్రానికి ఇరువైపుల అమర్చిన కొయ్యపలక ; 14. పూటీ, బండిచక్రం నిర్మాణంలో వంకర కొయ్య పలక ; విణ. అల్పం, చిన్న.

సం. శిల్ప-శ్మి. చెక్కుళ్ళు, పెదవులు ; శింబ-. తొంక ; ప్రా. సిప్పి-.శుక్తి ; అ.మా. సిప్ప, సిప్పి ; పా. సిప్పీ ముత్యం చిప్ప ; సిప్పికా, సిప్పీపుట ; అప. సిప్పి. ముత్యంపుట్టే చోటు : నే. సిపి. చిప్ప ; ఒ. సిప. గుల్ల ; బీ. సిపీ. గుల్ల ; హిం. సీప్, సీసీ, గుల్ల ; పం. సిప్పీ. గుల్ల ; సిం. సిప. గుల్ల ; గు. సీప్. గుల్ల ; మరా. సీప్, సింప్. గుల్ల ;

క. చిప్పు, సిప్పు, చింపి, చింపె, సింపి, సింపు, సింపె. ముత్యం చిప్ప, చిప్ప ; తు. చిప్పి. కొబ్బరి చిప్ప ; తిప్పి, సిప్పి ; త. ఇప్పి. కొబ్బరిచిప్ప ; చిప్పి. చిప్ప ; మ. ఇప్పి, చిప్పి. చిప్ప.

పో.చూ. పా.ప్రా. సిప్పీ.

<ప్రా. సిప్పి-.

చిప్పకట్టె రూ. సిప్పకట్టె. వి. కొయ్యతో చేసిన చిప్ప. చిప్పకత్తి వి. చెట్టు మొ॥ వాటిని నరికే మోటకత్తె. చంద్ర భా. 2.10 ; చిప్పకసవు వి. చిప్పగడ్డి, చిప్పర. క. చిప్ప-కసు వు. చిప్పగడ్డి. చిప్పకుంకటి రూ.చూ. చిప్పకూఁకటి. వి. కాకపక్షం. చిప్పకూఁకటి రూ. చిప్పకుంకటి. వి. చిన్నతనంలోపెట్టుకొనే చిన్న జుట్టు. రం. రా. బాల. 22పు. 19పం. చిప్పగడ్డి వి. చిప్ప కసవు. చిప్పగిన్నె వి. గిన్నెచిప్ప, అడుగుమట్టులో తవర గిన్నె లాగ ఉండే మట్టిపాత్ర. చిప్పగుద్దలి వి. పికాసి, ఒకవైపు సూదిలాగా. రెండోవైపు వెడల్పుగా పలుగులున్న పనిముట్టు. చిప్పగొడ్డలి రూ. సిప్పగొడ్లి. వి. చెరుకుగడలు మొ॥ వి. నరకటానికి ఉపయోగించే వెడల్పు పదునుగల గొడ్డలి. నీలా. 3.49 ; చిప్పచిప్పగోళ్ళు వి.బ.వ. బాలక్రీడావిశేషం. చిప్పచేతికిచ్చు అ.క్రి. భికారిని చేయు. <చిప్ప + చేయి + -కున్ + ఇచ్చు. చిప్పచేతికివచ్చు అ.క్రి. ఉన్నది పోగొట్టుకొని నిరాధారుడగు. చిప్పతంగోల వి. దోకుడు పార, గడ్డిచెక్కేపార. చిప్పతట్టలము రూ. చిప్పతట్లలం, వి. నేలపై పాకే ఒకకలుపు మొక్క, చెప్పుతట్టాకు. చిప్పతట్టాకు (-ఆకు) రూ. చెప్పుటట్టాకు, చెప్పుతట్టాకు. వి. చిప్పతట్లలం, ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడుకలుపు మొక్క (Cissus pedata). చిప్పతట్టు వి. కడగోడ,

హిం. చిమ్‌టా. తంటసం ;

క చిమట ; త. చిమిట్టా.

<హిం. చిమ్‌టా.

**చిమటా** రూ.చూ. చిమట[3]. వి. **1**. ఖడ్గముష్టి సంగ్రాహ్య తలం లోని చీలపట్టున అలుగు అమర్చటానికి ఉపయోగమయ్యే తావు ; **2**. కేశోత్పాటిని.

**చిమడకాలు** చూ. చిముడు. అ.క్రి. ఆములో పాత్రలుబాగా కాలు.

**చిమడబెట్టు** చూ. చిముడు.

**చిమికిచ్చు** స.క్రి. చిలకరించు, మట్టిమీదనీళ్ళు కొద్దికొద్దిగా చల్లు.

**చిమిట** రూ.చూ. చిమట[3]. వి తంటసం.

**చిమిటా** రూ.చూ. చిమట[3]. వి. తంటసం.

**చిమిటి**[1] రూ.చూ. చిమట[3]. వి. తంటసం.

**చిమిటి**[2] రూ.చూ. చిమ్మట[1]. వి. ఈలపురుగు.

**చిమిడిక** చూ. చిముడు.

**చిమిడిపడు** చూ. చిముడు.

**చిమిడివడు** చూ. చిముడు.

**చిమిని** రూ. చిమిలి[2], చిమ్ని, చిమ్నీ, చిమ్మిని, చిమ్మీ, చిమ్లి, వి. **1**. పొగనుఆపి కాంతినిచ్చే గొట్టం, పొగగొట్టం ; **2**. మంట, కొలిమి ; **3**. ఇంజను మొ. వాటినుంచి పొగగాని, ఆవిరిగాని పోవడానికి అమర్చిన గొట్టం.

ఇం. *Chimney*. పొగగొట్టం.

<ఇం. Chimney.

**చిమిలి** రూ.చూ. చిమ్మిలి. వి. నూనె, పప్పు, బెల్లంకలిపి దంచి చేసిన గోళాకారంలో ఉండే భక్ష్య విశేషం.

**చిమిలి**[2] రూ.చూ. చిమిని. వి. పొగనాపి కాంతినిచ్చేగొట్టం' పొగగొట్టం.

**చిముటా** రూ చూ. చిమట[3]. వి. తంటసం.

**చిముటాలు** వి.బ.వ. క్షౌరసమయంలో తంటసంతో వెంట్రుకలు ఊడదీయటం.

క. చిమిటి.

**చిముటు** స.క్రి. సైగచేయటానికి కన్నుమూసి తెరచు, కన్ను కొట్టు.

క. చిమిటు ; త. చిమిట్టు.

**చిముడు** అ.క్రి. **1**. (అన్నాదులు) అమితంగా ఉడుకు, అమితంగా ఉడికి ముద్దగు. చెడు. ద్వి. హరిశ్చ. పూ. 2236 పం. మను. 4.60 ; **2**. పాకంచెడు ; **3**. కాలు, తప్తమగు ; **4**. బాధపడు (విరహాదులతో) ; **5**. చితికిపోవు.

క. కిముఱ్. నలిగినస్థితి, నలుగుడు, కిముఱ్చు. నలుపు ; మ. చీక. అన్నంవలె ఉడుకు, ధ్వంసంచేయు.

**చిమడబెట్టు** స.క్రి. **1**. ఉడికించు, కలతపెట్టు. శాశ్ల. సం. 3.271 ; **2**. అన్నంమెత్తబడిపోయేటట్లు చేయు. **చిమిడిక** వి. చిమిడిన అన్నం. ఆం.భా. 2.257. **చిమిడిపడు** రూ. చిమిడివడు. అ.క్రి. **1**. (అన్నం మొ.) అమితంగా ఉడుకు, అమితంగా ఉడికి ముద్దగు. సిం.ద్వా. 5.142 ; **2**. బాధపడు ; **3**. చెడిపోవు. **చిమిడివడు** (-పడు) రూ.చూ. చిమిడిపడు. అ.క్రి. **1**. అన్నం మొదలైనవి ఎక్కువగా ఉడుకు ; **2**. బాధపడు ; **3**. చెడిపోవు. **చిముడుచు** రూ. చిముడ్చు. స.క్రి. ఎక్కువగా ఉడికి ముద్దయ్యేటట్లుచేయు. రామాభ్యు. 8.36. **చిముడ్చు** రూ.చూ. చిముడుచు. స.క్రి. చిమడజేయు, ఎక్కువగా ఉడికి ముద్దగా అయ్యేటట్లుచేయు.

**చిముడ్చు** చూ. చిముడు.

**చిమురుడు** వి. ఒకరకంపొద (Cadabaindica).

**చిములు** స.క్రి. వెదజల్లు, చిమ్ము.

**చిమ్ని** రూ.చూ. చిమిని. వి. పొగనాపి కాంతినిచ్చే గొట్టం.

**చిమ్నీ** రూ.చూ. చిమిని. వి. పొగగొట్టం.

**చిమ్నీగూడు** వి. దీపంగూడు, దీపంపెట్టుకొనేగూడు.

**చింపి** చూ. చిరుఁగు, విశ. చినిగిన. పండి.చ. 5.335. పు. జైమినిభా. 5.192 ; వి. **1**. చిరిగినగుడ్డ, జీర్ణవస్త్రం. సారంగ. 1.116, ఆం.భా. 2.157 ; **2**. చిరుగు. శుక.స. 2.44.

**చింపిగావించు** (-కావించు) స.క్రి. ధ్వంసంచేయు, పాడుచేయు. భార.ద్రోణ. 5.130. **చింపిరి** విశ. పొట్టిగాను బిరుసుగాను వంకరగానుఉండే (జుట్టు). హరిశ్చ. 4.168. **చింపిరాళ్ళు** వి.బ.వ. కంకరరాళ్ళు, గులకరాళ్ళు. **చింపులుచేయు** స.క్రి. **1**. ధ్వంసంచేయు, పోగొట్టు. కాళ. 87 ; **2**. చెరచు.

**చింపు** చూ. చించు, చిరుఁగు. స.క్రి. చిరిగేట్లుచేయు.

**చింపుడు** విశ. చినిగిన. ప్రబోధ. 3.20 ; వి. గుడ్డముక్క, పేలిక, తుంపు. విప్ర. 5.19.

**చింపులుచేయు** చూ. చింపి.

**చింబిలి** రూ.చూ. చిమ్మిలి. వి. చిమ్మిలి, నువ్వుపప్పు బెల్లం కలిపి దంపినముద్ద.

**చింబు** వి. ఆడమేక, ఛాగి. ఆం.భా. 2.265.

**చింబోతు** రూ. చీంబోతు, చీఁబోతు. వి. ముదురుమేకపోతు, ఛాగం. కాశీ. 2.43. <చింబు + పోతు. **చింబోతు హుమాయిజోదు** వి. ఛాగవాహనుడు, అగ్ని. అచ్చ.రా. యు. 4.94.

**చింబోతు** చూ. చింబు.

**చింబోతుహుమాయిజోదు** చూ. చింబు.

**చింబోర** రూ. చిలమోర. వి. సిగమోర, తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం. హంస. 5.96.

**చిమ్మ** వి. జలకణ సమూహం. మను. 3.136.

**చిమ్మనూనె** రూ. చిమ్మానూనె, సీమనూనె. వి. కిరసనాయిలు, సీమనూనె.

**చిమ్మచీకటి** రూ.చూ. చిమ్మఁజీకటి. వి. కటికచీకటి. కాశీ. 5.101.

**చిమ్మఁజీకటి** (-చీకటి) రూ. చిమ్మచీకటి, చిమ్మనచీకటి. వి. **1**. కటికచీకటి, అంధతమసం. భాస్క.రా. యు. 1552 ; **2**. చిన్నచీకటి, అవతమసం. ఆం.భా. 1.146.

**చిమ్మట**[1] రూ. చిమట[2], చిమిటి[2], చిమ్మిట, చిమ్మెట[1], చిమ్మేట[1]. వి. ఈలపురుగు, ఝిల్లిక, ఇలకోడి. మార్క. 2.118.

క. చిమ్మణ్ణి, చిమ్మణ్ణె, జిమ్మణ్ణె. ఈలపురుగు ;

త మి. చి మిటి.

**చిమ్మటజిట్టన** క్రి.విశే.(ధ్వ. కీచురాయి, కీ అనే ధ్వని చేయగా. < చిమ్మట + జిట్టు + అను + -అ[7]. **చిమ్మటతార** వి. సుషిర వాద్యవిశేషం, ఊదే ఒకానొకవాద్యం. మొల్ల.రా. యు. 3.26. **చిమ్మటబుట్టు** వి. ఈలపురుగుచేసే ధ్వని.

**చిమ్మట[2]** రూ.చూ. చిమట[3]. వి. తంటసం, మంగలవాని సాధన విశేషం. ఒం.భా. 2.301.

**చిమ్మటిపసు (-తిపసు)** అ.క్రి. గిరగిరతిరుగు. భాగ. 10 పూ. 3.25.

**చిమ్మనగొట్టము** చూ. చిమ్ము[1].

**చిమ్మనగ్రోవి** చూ. చిమ్ము[1].

**చిమ్మనచీకటి** రూ.చూ. చిమ్మచీకటి. వి. 1. కటికచీకటి, అంధతమసం. మను. 3.53 ; **2**. చిన్నచీకటి, అవత మసం.

**చిమ్మనపుగ్రోవి** చూ. చిమ్ము[1].

**చిమ్మనబిల్లలు** చూ. చిమ్ము[1].

**చిమ్మనము** చూ. చిమ్ము[1].

**చిమ్మరతాడు** రూ.చూ. చిమ్మెటతాడు. వి. చెలివితాడు, మోట తొండం చివర రెండు వైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు.

**చిమ్మరేగు** చూ. చిమ్ము[1].

**చిమ్మలాయి** వి. బాలక్రీడా విశేషం.

**చిమ్మసూనె** రూ.చూ. చిమ్మసూనె. వి. కిరసనాయిలు.

**చిమ్మిట** రూ.చూ. చిమ్మట[1]. వి. ఈలపురుగు, ఝిల్లిక, ఇల కోడి. ఆం. భా. 2.95.

**చిమ్మిని** రూ.చూ. చిమిని. వి. 1. పొగగూడు, పొగగొట్టం; **2**. లాంతరు మొ. పెట్టే పొగగూడు.

**చిమ్మిరి** రూ.చూ. చిమ్మిలి. వి. నువ్వుపప్పు, బెల్లం కలిపిదంచి చేసేముద్ద.

**చిమ్మిరేగు** చూ. చిమ్ము[1].

**చిమ్మిరేచు** చూ. చిమ్ము[1].

**చిమ్మిలి** రూ. చిమిలి, చిలిమి, చిమ్మిరి. వి. నువ్వుపప్పు బెల్లం కలిపిదంచి చేసేముద్ద. దశా. 8.352.

క. చిగిలి, చిమిళి. చిమిలి ;

సో. చూ. సం. చిమ్మ లి-, చిమ్మ లి. అరిసె.

**చిమ్మీ** రూ.చూ. చిమిని. వి. పొగగొట్టం.

**చిమ్ము[1]** చూ. చిందు. రూ. జిమ్ము. స.క్రి. 1. మీటు. భాస్క. రా. కిష్కిం. 168 ; **2**. వెదలించు. ఉ. హరి. 1.148 ; **3**. విక్షేపించు, చల్లు. భీమ. 5.129 ; **4**. పారద్రోలు, కొట్టు. హర. 3.71 , **5**. విసురు. మను. 5.163 ; **6**. ఆడించు, జళిపించు. కువ.చ. 5.4 ; **7**. వైచు. ధర్మా. 2.52 ; **8**. (బాణాదులను) ప్రయోగించు. అచ్చ. రా. యు. 344 ; **9**. తుడుచు, సమ్మార్జనం చేయు ; వి. **1**. తప్పు. భాగ. 9.390 ; 2. వేయుట. భాగ. 9 స్కం. ; **3**. పోటు, ఘాతం. ఆము. 6.80 ; **4**. మీటటం. శుక. 2.433.

క. చిమ్ము. వేళ్ళతో మీటు, మీటు, కత్తి మొ. వాటిని దూయు ; త. చిందు.

**చిమ్మనగొట్టము** వి. జలక్రీడలో నీళ్ళు చిమ్మేగొట్టం. **చిమ్మనగ్రోవి (-క్రోవి)** రూ.చూ. చిమ్మనపుగ్రోవి. వి. నీరు, వసంతం మొ. చిమ్మేగొట్టం, శృంగం. కళా. 4.194. వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. **చిమ్మనపుగ్రోవి (-క్రోవి)** రూ. చిమ్మనగ్రోవి. వి. నీరు. వసంతం మొ. చిమ్మే గొట్టం, శృంగం. ప్రభా. 2.81. వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. **చిమ్మనబిల్లలు** వి.బ.వ. **1**. చిమ్ముబిల్లలు ద్వి. భాగ. 10 ; **2**. బాల్యక్రీడా విశేషం. **చిమ్మనము** వి. చిమ్మటం, విక్షేపం. **చిమ్మరేగు** రూ.చూ. చిమ్మిరేగు. అ.క్రి. **1**. భయాదులచే చెదరు. మను. 4.68 ; **2**. క్రోధా దులచే విజృంభించు, రెచ్చు, అదరు, అతిశయించు. రామా. 8.93. **చిమ్మిరేగు** రూ. చిమ్మరేగు. అ.క్రి. **1**, క్రోధాదులచే విజృంభించు, రెచ్చు, అదరు, అతిశయించు. మను. 2.21; భయాదులచే చెదరు. **చిమ్మిరేచు** స.క్రి. చెలరేగునట్లు చేయు. తాళ్ల. సం. 3.110. **చిమ్ముడు** వి. **1**. చిమ్మటం ; **2**. మీటటం ; **3**. తుడవటం. **చిమ్ముబిల్లలు** వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. విష్ణువు. 7.202. **చిమ్ములాయి** వి. బాల్యక్రీడా విశేషం. హంస. 3.146. **చిమ్ములచురియ** వి. విసిరే బాకు. **చిమ్ములాట** వి. జలక్రీడా సమయంలో ఒకరిమీద ఒకరు నీళ్ళు చల్లుకోవటం. < చిమ్ము[1] + -లు + ఆట. **చిమ్ములాడు** అ.క్రి. చల్లులాడు, జలక్రీడలో ఒకరిమీద ఒకరు నీళ్ళు చల్లుకొను. పరమ. 4.107, ఘటికా. 2.125. < చిమ్ము + -లు + ఆడు.

**చిమ్ము[2]** వి. **1**. గోడలో బిగించే దర్వాజాకమ్మి ; **2**. పొరవ, మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడు గాటి బండ ; **3**. పెంకాముగోడ చివరి అంచు ; **4**. గిలకకు రెండువైపులా ఆధారంగా నిలపబడిన చిన్నకొయ్యముక్క.

**చిమ్మురాయి** వి. సున్నపు బట్టీ మెట్లను కట్టటానికి వాడిన రాయి.

**చిమ్మె** యా. చెమ్మె. వి. ప్రమిద.

**చిమ్మెగడ్డపార** వి. చివర వెడల్పుగల గునపం, అలుగు గడ్డపార.

**చిమ్మెట[1]** రూ.చూ. చిమ్మట[1]. వి. ఈలపురుగు, ఝిల్లిక, ఇల కోడి. వేంక. పంచ. 4.247.

**చిమ్మెట[2]** వి. ముక్కారు, మూగారు, మోటతొండం చివర వేసిన రంధ్రం.

**చిమ్మెటతాడు** రూ. చిమ్మరతాడు. వి. చిమ్మెటలో దూర్చే తాడు, చెలివితాడు.

**చిమ్మేట[1]** రూ.చూ. చిమ్మట[1]. వి. ఈలపురుగు.

**చిమ్మేట[2]** రూ.చూ. చిమట[3]. వి. ముక్కులో వెంట్రుకలు పెరికే ఇనప సాధనం, చిమ్మట.

**చిమ్లి** రూ.చూ. చిమిని. వి. పొగనాపి కాంతినిచ్చే గొట్టం.

**చియ్య** వి. మాంసం, కండ. ఆం. భా. 2.131.

**చియ్యపట్టు** అ.క్రి. కండపట్టు, బలియు.

**చిర** వి. కాడికున్న రంధ్రంలో పెట్టేకొయ్యముక్క.

**చిరకట్టె** వి. గూడతాడు చివరపట్టుకోడానికి అమర్చిన అడ్డుపుల్ల.

**చిరకపొత్తు** వి. ఆసామి అరకతోనే సాగుచేసి రైతుపంటలో ఒక భాగం పంచుకొనే పద్ధతి.

**చిరగడదుంప** చూ. చిరగడము.

చిరగడము రూ.చూ. చిరుగడము. వి. తియ్యకంద.

చిరగడదుంప రూ.చూ. చిరుగడదుంప. వి. చిలగడదుంప.

చిరచిర రూ.చూ. చిఱచిఱ. వి. 1. భేదం ; 2. కోపవికారం. ధ్వన్యను.

చిరచిరలాడు రూ.చూ. చిఱచిఱలాడు. అ.క్రి. కోపగించు.

చిరంజీవి వి. కొడుకు మొ. వాత్సల్య పాత్రులందు ఉపయుక్తమయ్యే ఆదర సూచక శబ్దం.

సం. చిరంజీవిన్. చిరకాలం జీవించేవాడు.

<సం. చిరంజీవిన్ (అర్థవిపరి.).

చిరటపాటుగా క్రి.విశ.ద్రు. పలచగా.

చిరత రూ. చిడత, చిత్త. వి. 1. మానులు మొ. వాటిని సులభంగా పగలగొట్టడానికి బీటలో కొంచెం దొప్పించి దానివెనుక కొట్టే ఉలికొనరూపంలో ఉన్నదళసరి మొద్దు ; 2. బండికి కట్టిన ఎద్దుల లోపైపున కాని వెలుపలి పైపున కాని కాడికున్న రంధ్రంలో వేసిన కాడిపలుపులు తగిలించే కొయ్యముక్క ; 3. అచ్చుకట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావడానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్య చెక్క ; 4. నిచ్చెన నిలువు కర్రలను కలుపుతూ మెట్టులాగ ఉపకరించే చిన్నకొయ్య ; 5. పడంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రంధ్రంగల రేకుబిళ్ళ ; 6. కోడెల వృషణాలు బిగించి నలగగొట్టడానికి ఉపయోగించే కర్రల జంటకట్టు ; 7. ఒకరికి దుర్భరస్థితి కలిగించడం ; 8. పలుపు.

చిరతకట్టె రూ. చిడతకట్టె. వి. 1. ఎదగొర్రు నొగలమీద బిగించిన అడ్డపట్టె ; 2. పంచ దించడానికి గుర్రపు కొయ్యల మీదవేసిన అడ్డవాసం. చిరతకొండి వి. 1. గొర్రుభాగం ; 2. అంకెన తగిలించే ఇనపకొండి. చిరతకొయ్య వి. అను మొదటి కొయ్యల దగ్గిరే అనిపడేందుకు బిగించిన చిన్న కొయ్య. చిరతతాడు రూ. చిడతలాడు, చిత్తతాడు, చిరత్తాడు. వి. 1. కమాను ; 2. పడుగు చాపేటప్పుడు ఊతొత్తె అడ్డ పట్టెనూ పడుగేరే కర్రనూ కలిపేతాడు. చిరతతోలు రూ. చిడతతోలు. వి. ఉదత తోలు, మరమగ్గంలో ఉదతకు కిందవేలాడే తోలుచుట్ట. చిరతనవేయు స.క్రి. బాధించు, చిరతలో వేసి కష్టపెట్టు. చిరతపుల్ల వి. 1. చిరకట్టె, చిర్ర ; 2. గూడఠాటి చివరఉన్న అడ్డపల్ల ; 3. మరమగ్గం నిలువు పట్టెకు మేరువు పలక బిగించి తాడు వడిపెట్టే చిన్నపుల్ల. చిరతలు వి.బ.వ. 1. పటకార్లు ; 2. కర్రతాళాలు, చిక్కులు, చిటికెలు. చిరత్తాడు రూ.చూ. చిరతతాడు. వి. మరమగ్గం నిలువుపట్టెను మేరువు పలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం.

చిరతపక్షి రూ.చూ. చిరుతపక్షి. వి. ఒకరకం పక్షి.

చిరతలి వి. 1. బిగుసీల. అనుపీటలు బిగింపుకు వేసేకొయ్య పేడు ; 2. దాసర్లు వాయించే కొయ్యతాళం.

చిరతవాలు వి. చిరుత ప్రాయం.

చిరత్తాడు చూ. చిరత.

చిరపాల వి. వృక్షవిశేషం, అడవిపాల.

చిరమనిఅంటు చూ. చిరమన. వి. చిరమని చెట్టు జిగురు.

చిరమర వి. 1. భేదం. భార. శాంతి. 1.58 ; 2. వెత, వగపు ; 3. ఒడిదుడుకు.

క. కెరళ్. కోపగించు ; త. వెరు. యుద్ధం, పోట్లాట, ప్రేమ కలహం ; మ. వెరు. యుద్ధం.

చిరసల వి. ఎర్ర చిరతల, ఎర్ర సరుగుడు, పూతికి, సురలి. ఒక రకం తీగ (Ventilago calyculata).

చిరాకు వి. 1. కోపం, విసుగు. కృష్ణ. 3.30 ; 2. ఉక్క వలన కలిగే కోపం.

క. కెరళ్. కోపించు, కోపగించు ; కెరళ్ప్పు. చేతులతో శబ్దంచేయు ; త. వెరు. యుద్ధం, కలహం, ప్రణయ కలహం ; వెరఱు (విరఱ్-). చిరచిరలాడు, భిన్నాభిప్రాయం కలిగి ఉండు ; చిరఱ్జు (చిఱఱ్జు-), చిరత్తు- (చిరత్తి). కోపించు.

చిరాకుపడు అ.క్రి. విసుగుకొను.

చిరి రూ.చూ. చిఱు. వి. చిన్న.

చిరికప్ప వి. చిన్నకప్ప. చిరికూర రూ.చూ. చిఱికూర. వి. ఒక రకం మూలిక (Amaranthus polygonoides). చిరికొండి రూ.చూ. చిఱికొండి. వి. చిన్న సిగ. చిరిగిట్ట రూ. చిరిగెటికె. వి. కాలివెనక అడుగు గిట్టకు అంగుళంపైన జంటగా మొలిచే చిన్న గిట్ట. చిరిగెటికె రూ.చూ. చిరిగిట్ట. వి. కాలివెనక అడుగు గిట్టకు అంగుళం పైన జంటగా మొలిచే చిన్న గిట్ట. చిరిచాప రూ.చూ. చిరుచాప. వి. సన్నటి తుంగ పోచలతో రంగు రంగులుగా అల్లిన మెత్తటి చాప. చిరిచేమాకు వి. ఒక రకం చేమాకు. చిరితాళము రూ.చూ. చిఱితాళము. వి. చిట్టితాళము. చిరితాళిబాదు వి. ఒకరకంచెట్టు (Dalbergia scandens). చిరినక్క వి. చిన్న నక్క. పల్నా. 4. చిరినవ్వు రూ.చూ. చిఱునగవు. వి. మందహాసం. చిరినాలుక వి. కొండనాలుక. చిరిపట్టె వి. బాలక్రీడ. చిరిపొట్ట వి. ఆకు విడవకుండా ఎన్ను లేర్పడే మొదటి దశ. చిరివేరు రూ.చూ. చిఱువేరు. వి. ఎర్రచాయ వేరు.

చిరిట వి. సీసా బిరడా.

చిరిపి వి. తైలమార్జకం, సన్నని మూతిగల తైలపాత్రలోని జిడ్డును తుడవటానికి ఉపయోగించే సాధన విశేషం. ఆం. భా. 2.243.

చిరిమన రూ. చిర్మాని. వి. కలప వ్యవసాయపు పనిముట్లకు, పరిశ్రమలో ఉపయోగపడే ఆకులుకలిగి జిగురు నిచ్చే ఒక రకం పెద్దచెట్టు (Angogeissus latifolio).

చిరిమల్లె రూ. సిరిమల్లె. వి. తెల్లని సువాసన కల్గిన పూలు పూసే ఒక రకం చెట్టు (Jasminum angustifolium).

చిరిమితరటు వి. తోలల్లిన చబుక.

చిరిమిడి చూ. చలిమిడి. వి. భక్ష్య విశేషం. హంస. 1.105.

చిరిమిల్ల వి. పదునైన పళ్ళెరం.

చిరుకంది చూ. చిఱు. వి. సిరికంది.

చిరుకపాలు వి. నాల్గో భాగం. ద.హిం.శా. సంపు. 5 శా. సం. 227. క్రీ.శ. 1627.

చిరుకు చూ. చిఱు. విశ. చిన్న.

చిరుకుంట చూ. చిఱు. వి. చెరువు కట్ట కింద కుంట.

**చిరుగజ్జెలరుద్రాక్షపేటు** చూ. చిఱు. వి. అంచులో రుద్రాక్ష పువ్వుల నమూనాలు నేసిన ఒకరకం డిజైను.

**చిరుగడదుంప** చూ. చిరుగడము.

**చిరుగడము** చూ. చిఱు. రూ. చిరగడము, చిరువడము. వి. చిలకడదుంప. కాశీ. 7.186.

**చిరుగడదుంప** రూ. చిరగడదుంప, చిలగడదుంప. వి. ఒక జాతి దుంప, మధుర కంద.

**చిరుగు** వి. ఒక రకమైన చెట్టు (Caryota urens).

**చిరుగుడు** రూ.చూ. చిరుఁగుడు. వి. తామర, గుండ్రకుష్ఠు ; విశ. చిరిగిన.

**చిరుగొమ్మ** చూ. చిఱు. వి. చూరు, బొద్దు, గోడలు మొ. వాటి చివర ఉండే శృంగారమైన అంచు. భాను. 4.135.

**చిరుఁగు** రూ. చినుఁగు. అ.క్రి. **1.** తూట్లుపడు. కు.సం. 12.175 ; **2.** (వస్త్రాదుల) చీలు. ఉ.హరి. 4.2 ; **3.** పీడు, సడలు, పదలు. పాండు. 3.69 ; వి. ఛిద్రం, రంధ్రం, చీలిక.

**చిరుఁగుడు** రూ. చిరుగుడు. వి. **1.** చిన్న తామర, చర్మవ్యాధి విశేషం. ఆం.భా. 2.128 ; **2.** కోతమనే కుష్ఠు.

**చిరుచాప** చూ. చిఱు. రూ. చిరిచాప. వి. జంబు అనే చెట్టు పట్టుతో నేసిన శ్రేష్ఠమైన చాప.

**చిరుత**[1] రూ.చూ. చిఱుత. వి. చిరతపులి.

**చిరుతపులి** రూ.చూ. చిఱుతపులి. వి. చిరతపులి.

**చిరుత**[2] విశ. చిన్న. పల్నా. 30. వి. కాష్ఠక్రీడ, బాలక్రీడా విశేషం.

**చిరుతఈత** వి. పళ్ళు తినడానికి, ఆకులు చాపలు, బుట్టల అల్లకానికి ఉపయోగపడే ఒకరకం చెట్టు (Phoenix farinifera). **చిరుతపక్షి** రూ. చిరతపక్షి. వి. ఒక రకం పక్షి.

**చిరుత**[3] వి. యువతి.

**చిరుతుక** వి. యువతి.

**చిరుతరి** వి. వ్రీహి భేదం, ఒక రకం వడ్లు.

**చిరుతలు**[1] వి.బ.వ. మిరుమిట్లు.

**చిఱుతలుకవియు** అ.క్రి. మిరుమిట్లుగొను. ద్వి.భాగ. 8. **చిరుతలుక్రమ్ము** అ.క్రి. మిరుమిట్లుగొను. **చిరుతలువాఱు (-పాఱు)** అ.క్రి. మిరుమిట్లుగొను.

**చిరుతలు**[2] వి.బ.వ. చిడతలు. పల్నా. 4.

**చిరుతసంబాపువాలు** వి.బ.వ. ధాన్య విశేషం.

**చిరుతిండి** రూ.చూ. చిఱుదిండి. వి. మిఠాయి మొ. రుచికరమైన అల్పాహార పదార్థం.

**చిరుతుక** చూ. చిరుత[3].

**చిరునగవు** రూ.చూ. చిఱునవ్వు. వి. చిరునవ్వు.

**చిరునవ్వు** రూ.చూ. చిఱునవ్వు. వి. లేతనవ్వు, మందహాసం. పల్నా. 46.

**చిరునామ** రూ. చిరునామా, చిఱునామ, సిరునామ, సిరునామా. వి. జాబులమీదను, లెక్కలమీద రాసే విలాసం, అడ్రసు.

హిం. ఉ. సర్నామా.
< ఉ. సర్నామా.

**చిరునామా** రూ.చూ. చిరునామ. వి. అడ్రసు, విలాసం.

**చిరుపోటి** చూ. చిఱు. వి. కట్టుబడిలో ఉన్న ఆర్చికింద ఆధారం? స్తంభాలమీద అడ్డంగా పరచిన లావాటి రాయి.

**చిరుబొబ్బర** చూ. చిఱు. వి. ఒక రకం పప్పుదినుసు, చిన్న బొబ్బర.

**చిరుమ** వి. అర్జున వృక్షం, ఏరుమద్ది చెట్టు (Terminali arjuna).

**చిరుము** స.క్రి. **1.** విజృంభించు. కాశీ. 63, 68 ; **2.** చిమ్ము

**చిరువడము** రూ.చూ. చిరుగడము. వి. ఒక జాతిదుంప, మధుర కంద. రుక్మా. 3.2.

**చిరువడములపాసెము** వి. భక్ష్య విశేషం. శృం.నై 6.123.

**చిరువడి** వి. ఒక రకం వడ్లు.

**చిరువాలు**[1] **(-పాలు)** రూ.చూ. చిఱువాలు. వి. ఇగర కాచిన పాలు.

**చిరువాలు**[2] వి. గుర్తు, ఆనవాలు.

**చిరుసెనగ** చూ. చిఱు. వి. ఒక రకం పప్పు దినుసు, చిన్న సెనగ.

**చిరేలేబుడ్డి** వి. కల్లుతీగలో ఈత చెట్టుకు కట్టే మట్టి కడవ.

**చిర్నవ్వు** రూ.చూ. చిఱునవ్వు. వి. మందహాసం, స్మితం, లేతనవ్వు. హరి. పూ. 7.38.

**చిర్మాని** రూ.చూ. చిరిమను. వి. ఉత్తమజాతికి చెందిన కలప నిచ్చే చెట్టునుండి లభించే నిర్మాణ ద్రవ్యం (Axlewood Anageissus latifolia).

**చిఱ్ఱ** రూ.చూ. చిట్ట[2]. గూడబాటి చివర ఉన్న అడ్డపుల్ల కాడి ఉన్న రంధ్రంలో పెట్టే కొయ్య ముక్క.

**చిఱ్ఱకొమ్ము** వి. నిటారుగా సన్నగా ఉన్న కొమ్ము. **చిఱ్ఱగ్గి** వి. కొద్దిపాటి ఎండ. < చిఱ్ఱ + అగ్గి.

**చిఱ్ఱి** వి. నేలమీద పెరిగే కలుపు మొక్క.

**చిఱ్ఱు** రూ.చూ. చిట్టు. వి. కోపం. ధ్వన్యను.

**చిఱ్ఱుబుఱ్ఱులు** వి.బ.వ. విసుగు వేసటలు, కోపతాపాలు. **చిఱ్ఱుముఱ్ఱాడు (-ఆడు)** అ.క్రి. ముందు వెనక లాడు. రాధా. 4.68. **చిఱ్ఱెత్తుకొచ్చు** అ.క్రి. తిక్కరేగు, కోపంవచ్చు. < చిఱ్ఱు + ఎత్తుకొను + -ఇ + వచ్చు.

**చిఱ్ఱెత్తుకొచ్చు** చూ. చిఱ్ఱు.

**చిఱ** రూ.చూ. చిట్టు[1]. వి. కోపం, చిరాకు. విశ. చింపిరి, చెదరిన.

**చిఱచిఱ** రూ. చిరచిర. వి. కోపం, కొరకొర. భార. శాంతి. 1.58. **చిఱచిఱలాడు** రూ. చిరచిరలాడు. అ.క్రి. కొరకొరలాడు, కోపపడు. మృత్యు. 3.53 వు. < చిఱచిఱ + -లు + ఆడు. **చిఱలువోడుచు(-పోడుచు)** చూ. చిఱ. అ.క్రి. మండిపడు, చిరాకుపడు.

**చిఱి**[1] రూ.చూ. చిట్టి. వి. ఒక జాతి కూరాకు, తండులీయం.

**చిఱికూర** రూ. చిరికూర. వి. ఒక రకం కూరాకు.

**చిఱి**[2] విశ. అల్పమైన.

**చిఱికొండి** రూ. చిరికొండి. వి. చిన్నసిగ. **చిఱిగోరు** వి. ఒకజాతి దుంప. హంస. 4.131. **చిఱితాళము** రూ. చిరి

తాళము. వి. చిట్టితాళము. **చిఱినెల్లి** రూ. చిఱునెల్లి. వి. ఊరగాయకు పనికివచ్చే కాయలుకాసే ఒకజాతి నెల్లి. హంస. 4.135. **చిఱిపనస** వి. లఘుకంటక ఫలం. **చిఱిసెనగలు** రూ. చిఱుసెనగలు. వి.బ.వ. మసూరాలు. చిన్న సెనగలు.

**చిఱి(గినవిస్తరి** చూ. చిరు(గు. వి. నానా బీభత్సమై పోయినది.

**చిఱు** రూ. చిరి. విశ. **1.** కొంచెం, స్వల్పం. కు.సం. 3.47 ; **2.** చిన్న.

క. కిఱ్, కిఱు, కిఱు, కిఱిదు, కిర్దు, కిత్తు. చిన్న ; తు. కిరి, కిరు. చిన్న, కిర్దు. తక్కువైన, కిర్తర. తక్కువ రకం ; కిరియె. తక్కువ పదవిలో ఉన్న ; త. చిఱు, చిఱ్ఱు. చిన్న, చిఱు(-ప్పి-,త్తి-). చిన్నగా ఉండు, తగ్గు ; చిఱుకుక్క, చిఱుక్కి. తగ్గు ; చిఱుమై. చిన్నతనం, చిఱువల్. పిల్లవాడు, బాల్యం ; చిఱియ. చిన్న ; మ. చిఱ్ఱు, చెఱ్ఱు. చిన్న, చెఱు. చిన్న ; చెఱుప్పం. బాల్యం ; తొ. కిఱ్. చిన్న ; కొండ. కిర్. చిన్న.

<మూ.ద్రా. *కిఱ్.

చిట్టడవి వి. చిన్న అడవి, తుప్పఅడవి. పి.శకు. 2.8. <చిఱు+అడవి. **చిట్టడుగు** వి. చిన్న అడుగులు గలవాడు. శివు. వేంక. పంచ. 2.126. **చిట్టంటుచే(తలు** వి.బ.వ. నఖక్షతాదిశృంగార చేష్టలు, విలాస చేష్టలు. రం.రా.బాల. 21 పు. 11 పం. **చిట్టంటులు** రూ.చూ. చిట్టంట్లు. వి.బ.వ. నఖదంతక్షతాదులు. విక్ర. 4.223. **చిట్టంట్లు** రూ. చిట్టంటులు. వి.బ.వ. నఖదంతక్షతాదులు, చిలిపిచేష్టలు. ఉ.హరి. 5.188. **చిట్టీ(దు** వి. చిన్నజాతి ఈత. శివరా. 3.100. **చిట్టెలుక** రూ. చిట్టెల్క. వి. చిన్న జాతి ఎలక, గిరిక. కాశీ. 6.257. **చిట్టెల్క** రూ.చూ. చిట్టెలుక. వి. చిన్నజాతి ఎలక, గిరిక. హరిశ్చ. 2.53. ఆం.భా. 2.86. **చిఱుకాటు** వి. చిన్నకాటు, గాయం. శృం.నై. 8.7. **చిఱుకొట్టు** రూ.చూ. చిట్టుకొట్టు. అ.క్రి. **1.** పగిరిపడు ; **2.** చీదరించు. **చిఱుగంట** వి. చిన్నగంట. శుక. 3.179. **చిఱుగాజునొక్కు** వి. గాజు యొక్క చిన్ననొక్కు. రాధా. 1.98. **చిఱుగాలి** వి. పిల్ల వాయువు, మందమారుతం. భార. అను. 1.182. **చిఱుగూబ** రూ.చూ. చిఱుతగూబ. వి. పైడికంటి అనే ఒక పక్షి. **చిఱుచీకటి** రూ.చూ. చిఱుత చీకటి. వి. కనుచీకటి. **చిఱుచే(ప** వి. రొయ్య. భార.ద్రోణ. 2.78. **చిఱుటేకు** రూ. చిఱుతేకు. వి. వృక్షవిశేషం, బారంగి.హంస. 4.11. త. చిఱుతేక్కు. **చిఱుతిండి** రూ.చూ. చిఱుదిండి. వి. తినుబండారం, పైతిండి. **చిఱుతేకు** రూ.చూ. చిఱుటేకు. వి. వృక్షవిశేషం, బారంగి. ఆం.భా. 2.54. **చిఱుతొడ** రూ.చూ. చిఱుదొడ. వి. జంఘ, పిక్క. **చిఱుదిండి (-తిండి)** రూ. చిరుతిండి, చిఱుతిండి. వి. నలితిండి, మిఠాయి మొ. రుచికరమైన అల్పాహారపదార్థం. కాశీ. 2.80. **చిఱుదొడ (-తొడ)** రూ. చిఱుతొడ. వి. జంఘ, పిక్క. భార ఆది. 5.256. **చిఱునగవు** రూ.చూ. చిఱునవ్వు. వి. చిన్ననవ్వు. భార.విరా. 5.143. **చిఱునవ్వు** రూ. చిరినవ్వు, చిరునగవు, చిరునవ్వు, చిర్నవ్వు, చిఱునగవు. వి. మందస్మితం, లేతనవ్వు. కు.సం. 5.41, భార. ఆరణ్య. 7.342. **చిఱునాలుక** వి. **1.** ఉపజిహ్వక, కొండనాలుక ; **2.** గళశుండిక, కొండనాలుకలో పుట్టే రోగ విశేషం. **చిఱునెల్లి** రూ.చూ. చిఱినెల్లి. వి. పిన్ననెల్లి, కూరనెల్లి. **చిఱుపాల** వి క్షీరావి, పిన్నపాల. ఆం.భా. 2.55. **చిఱుపాలు** వి. మీగడ, సగంవరకు ఇగరకాచిన పాలు. ఆము. 1.82. **చిఱుపులి** రూ.చూ. చిఱుతపులి. వి. చిరత పులి. ఆం.భా. 2.82. **చిఱుబంతిపసుపాడు** అ.క్రి. చిఱుబంతి పసుపు రాసుకొని స్నానం చేయు. భీమ. 2.28, హర. 5.37. **చిఱుబంతిపసపు** రూ.చూ. చిఱుబంతి పసుపు. వి. చాయపసుపు, హరిద్రావిశేషం. **చిఱుబంతిపసుపు** రూ. చిఱుబంతిపసపు. వి. చాయపసుపు, హరిద్రా విశేషం. హర. 2.107. **చిఱుబుఱ్ఱలు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. **చిఱుబొట్టు** వి. చిన్నబొట్టు. కాశీ. 3.213. **చిఱుబొద్ది** వి. వృక్షవిశేషం. విద్ధకర్ణి, అంబష్ఠ, కుచేల, పాపచేలి, అగరుసొనంటు, అగలుసొంటి. **చిఱుమాను** వి. అర్జునం, ఏరుమద్ది చెట్టు. **చిఱుమొగలి** వి. తృణకేతకి, వృక్షవిశేషం. **చిఱువడ్లు** వి.బ.వ. ధాన్యవిశేషం, పొట్టిగింజలవరి. **చిఱువరి** వి. ధాన్యవిశేషం. ఆం.భా. 2.234. **చిఱువాడు** వి. మిగుల్చుకొన్న చిల్లరద్రవ్యం. శుక. 3.117. త. చిఱువాడు. **చిఱువాలు (-పాలు)** రూ. చిరువాలు[1]. వి. ఇగరకాచిన పాలు, ఆనవాలు. ఆము. 1.82. **చిఱువేరు** రూ. చరివేరు. వి. ఎర్రరంగు వేయడాని కుపయోగించే ఒకానొక వేరు. తపతీ. 2.20. త. చిఱువేర్. **చిఱుశోదిమద్దలు** వి. వృక్షవిశేషం, చిన్నమద్ది. **చిఱుసాన** వి. ఆయుధాలకు పదును పెట్టే ఒక విధమైన చిన్నసాన. కాశీ. 1.121. **చిఱుసెనగలు** రూ.చూ. చిఱిసెనగలు. వి.బ.వ. చిన్నజాతి సెనగలు, మసూరం.

**చిఱుత** రూ. చిరుత[1]. వి. **1.** బాలుడు, బాలిక. భార.ఆది. 4.222 ; **2.** చిత్రకం, చిరతపులి. చంద్రాంగ. 2.38 ; **3.** సాము చేసేవారు తిప్పేచిన్నకోల ; **4.** ఎడ్ల మెడనుండి కాడితొలగి పోకుండటానికి తగిలించే కర్రచీల. విశ. **1.** చిన్న, అల్పమైన. ఆము. 2.53 ; **2.** లేత. వసు. 1.6.

క. చిఱుతె, చిఱక, చిర్క, చిరుక. చిన్నపులి, చిరుతపులి ; కొడ. చిరత. చిరతపులి ; త. చిఱుత్తై. ఒకరకం పులి ; కో. (కిబ్న).

**చిఱుతకాలము** వి. చిన్నవయసు, బాల్యం. భార.ఆది. 4.270. **చిఱుతగండు** వి. మగచిరుతపులి. మను. 4.37. **చిఱుతగూబ** రూ. చిఱుగూబ. వి. పైడికంటి. **చిఱుతచీకటి** రూ. చిఱుచీకటి. వి. కొంచెం చీకటి. కాశీ. 1.123. **చిఱుత(డు** వి. బాలకుడు, చిరుత. హరభక్త. 1. ఆ. చెన్న. బసవ. 3.53. **చిఱుతతనము** వి. లేతవయసు, బాల్యం. భార.ఉద్యో. 3.361. **చిఱుతనక్క** వి. ఒకరకం నక్క. **చిఱుతనగవు** రూ. చిఱుతనవ్వు. వి. చిన్ననవ్వు, చిరునవ్వు, మందహాసం. భార.అను. 4.110. **చిఱుతనగోడు** వి. ఖర్వ కాష్ఠక్రీడ, బిల్లగోడు. ఆం.భా. 2.307. **చిఱుతనగోల (-కోల)** వి. చిరుతనగోడు, బిల్లగోడు, ఒకానొక ఆట. **చిఱుతనబిల్లలు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. రుక్మి. 1.86. **చిఱుతనవ్వు** రూ.చూ. చిఱుతనగవు. వి. చిరునవ్వు.

రం.రా.ఉ. 110 పు. 11 పం. **చిఱుతనాఁడు** వి. చిన్నవయసు, బాల్యం. భార.ఉద్యో. 2.157. **చిఱుతపడు** అ.క్రి. కురచగు, పొట్టిఅగు. **చిఱుతపఱచు** స.క్రి. చిన్నదిగా చేయు. కాశీ. 2.163. **చిఱుతప్రాయము** వి. చిన్నవయసు, బాల్యం. నీలా. 1.3. **చిఱుతపిప్పలి** మిశ్ర.స. వి. చిన్న పిప్పలి, చిన్నజాతిపిప్పలి. అప్ప. 2.431. **చిఱుతపులి** రూ. చిరుతపులి, చిఱుపులి. వి. చిత్రకం, చిన్నిజాతిపులి. దశా. 2.200. **చిఱుతలు** వి.బ.వ. చిటితాళాలు, పాడే టప్పుడు లయ వేయటానికి వాయించే కర్రతాళాలు. **చిఱుతలువేయు** స.క్రి. కాలుసేతులు బంధించు. **చిఱుతవోవు** (-పోవు) అ.క్రి. 1. మొక్కపోవు. కాశీ. 1.138 ; 2. క్షీణించు ; 3. వన్నెతగ్గు. **చిఱుతుక** (చిఱుత + ఉక) వి. చిన్నవయసు వాడు, చిన్నవయసుది. భార.ఆది. 4.46. **చిఱుతుకఱేఁడు** వి. యువరాజు. సారంగ. 3.168.

**చిఱుతుక** చూ. చిఱుత.

**చిఱుతుకఱేఁడు** చూ. చిఱుత.

**చిఱునామ** రూ.చూ. చిరునామ. వి. జాబులపై రాసే విలాసం, అడ్రెస్సు.

**చిఱుము** స.క్రి. 1. చిమ్ము. భార.అరణ్య. 2.49 ; 2. కోరాడు. ఆం.భా. 3.132. అ.క్రి. చెలరేగు. ద్వి. హరిశ్చ. పూ. 418 పం.

క. సిఱు. చిమ్ము, ఎగురు ; తొ. సిఱ్. చిమ్ము ; గోం. జిరిఆ. ఊట, చెలము. రూ.చూ. చిందు, చిమ్ము ; కుయి. సిర్ప, సిఱ్. కదల్చు, వెదజల్లు.

**చిఱ్ఱు**[1] రూ. చిర్రు, చిఱ, చిఱ్ఱు. వి. 1. కోపం, కినుక. కు.సం. 10.66 ; 2. చింపిరితనం. విణ. చింపిరైనది. చంద్రరే. 374.

క. కిరు. కోపించు, కోపంతో మండిపడు ; కెరళ్. కోపించు ; త. చీఱల్. కోపం ; చిఱుకు(చిఱుక్కి). కోపించు, (చెరు(-వ్-,-ంట్-). అసహ్యించుకొను, కోపించు ; చెఱ్ఱార్, చెఱ్ఱుమ్. అసహ్యం, లక్ష్యంలేని కోపం, ప్రణయకలహం ; కో. చిర్వ్(చిర్); తొ. కిర్క్. తీవ్రమైన కోపం, వెర్రి.

**చిఱ్ఱగొట్టు** వి. చిర్రుబుర్రులాడేవాడు, విసుగుకొనేవాడు. **చిఱ్ఱచిఱ్ఱ** వి. సంభ్రమం, తొందర. విష్ణుపు. 7.147. **చిఱ్ఱతల** వి. చింపిరితల. ద్వి. భల్లా. 2.309.

**చిఱ్ఱ**[2] రూ. చిర్ర. వి. 1. గూడకాడు చివరనుండే అడ్డుపుల్ల ; 2. చిన్న కర్రముక్క ; 3. కోలుతో కొట్టిన దెబ్బ.

**చిఱ్ఱకూర** రూ. చిట్టికూర. వి. తండులీయం.

**చిఱ్ఱగోనె** వి. ఒకరకం బాలక్రీడ.

**చిఱ్ఱపోతు** వి. మాసిన గుడ్డల్లో ఉండే క్రిమి, చీరపోతు.

**చిఱ్ఱలువొడుచు** అ.క్రి. సంభ్రమించు, తడబడు. భార.విరా. 4.265. <చిఱ్ఱ[1] + -లు + పొడుచు.

**చిఱ్ఱి** రూ. చిఱి[1]. వి. 1. ఒకజాతి కూరాకు, తండులీయం. ఆం.భా. 2.67 ; 2. బిరుసుపొట్టి వెంట్రుకలు.

**చిఱ్ఱికూర** రూ.చూ. చిఱ్ఱకూర. వి. ఒకజాతి కూరాకు.

**చిఱ్ఱిపట్టె** వి. బాలక్రీడా విశేషం.

**చిఱ్ఱు** రూ.చూ. చిఱ్ఱ[1]. వి. 1. కోపంలో చేసేధ్వనికి అనుకరణం. కు.సం. 12.115 ; 2. కోపం. ధ్వన్యను.

క. త. చీఱు.

**చిఱ్ఱుకొట్టు** రూ. చిఱుకొట్టు. అ.క్రి. 1. ఎగిరిపడు ; 2. చీదరించు. **చిఱ్ఱుద్ది** వి. చిన్నఉద్ది, చిన్న జత. భాగ. 10 పూ. 730. <చిఱ్ఱు + ఉద్ది. **చిఱ్ఱుబుఱ్ఱలు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 3.146. **చిఱ్ఱుబుఱ్ఱు** వి. 1. కోపభయాదుల్లో అయ్యేధ్వనికి అనుకరణం. హర. 5.16 ; 2. శ్లేష్మం గొంతుకకు అడ్డుపడి నవుడయ్యే ధ్వనికి అనుకరణం. ధ్వన్యను. శుక. 3.30. **చిఱ్ఱుబుఱ్ఱుమను** అ.క్రి. బుసకొట్టు, కోపించు. **చిఱ్ఱుబుస్సు** వి. కోపంలో అయ్యేధ్వనికి అనుకరణం. శుక. 3.277. **చిఱ్ఱుబుస్సుమను** అ.క్రి. 1. చిరాకుపడు ; 2. బుసకొట్టు ; 3. కొరకొరలాడు. **చిఱ్ఱుబుస్సులాడు** అ.క్రి. 1. చిరాకుపడు ; 2. బుసకొట్టు ; 3. కొరకొరలాడు. **చిఱ్ఱుమను** అ.క్రి. 1. బుసకొట్టు. అచ్చరా. బాల. 106 ; 2. కొరకొరలాడు ; 3. చిరాకు పడు. <చిఱ్ఱు + అను. **చిఱ్ఱుముఱ్ఱాడు** అ.క్రి. 1. పెనుగులాడు, దొమ్ములాడు. కు.సం. 9.30 ; 2. చిడిముడి పడు, సంభ్రమించు. భార.విరా. 2.85 ; 3. సంచడించు, అతిశయించు, వ్యాపించు, ప్రసరించు. భార. విరా. 2.292 ; 4. తొట్రుపడు. భాగ. 10ఉ. 1172 ; స.క్రి. 1. చీల్చు, భేదించు. రం. రా. యు. 537 పు. 13పం. ; 2. ఖండించు, నిరాకరించు. బసవ. 5పు. 182 పం. <చిఱ్ఱుముఱ్ఱు + ఆడు. **చిఱ్ఱుముఱ్ఱు** వి. కోపంలో అయ్యేధ్వనికి అనుకరణం. కు.సం. 11.192. ధ్వన్యను. **చిఱ్ఱుముఱ్ఱుమను** అ.క్రి. కోపపడు. ప్రబోధ. 3.22. <చిఱ్ఱు ముఱ్ఱు + అను.

**చిల** రూ.చూ. చీల. వి. 1. మేకు. శా.శ. కో. పు. 108. ఉదయగిరి శాసనం ; 2. ఆకు పెంకు కప్పులున్న ఇళ్ళచూరు జారకుండావాసాల చివర వేసిన బెజ్జంలో బిగించిన కొయ్యముక్క.

**చిలక**[1] రూ.చూ. చిల్క. వి. 1. రామచిలక, శుకం ; 2. బీడా, కిళ్ళీ, నాగవల్లి సామానుల్లో ఒకటి ; 3. స్త్రీ ; 4. తోట కూరలో ఒకరకం (Amarantus viridis) ; 5. కొట్లో నిలవచేసేధాన్యం తినేపురుగు (Siloraga cerealella), వడ్ల చిలుకల్నే చిలకలని అంటారు.

**చిలకకర్ర** వి. నేతనేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవడానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడ దీసిన కొయ్యముక్క. **చిలకకొయ్య** రూ.చూ. చిలుకకొయ్య. వి. 1. వంకె, నాగదంతం ; 2. పడుగును ఊడ్తెకు కలిపే తాడు చివర కట్టినపుల్ల ; 3. అటుకలమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క. **చిలకగడి** రూ. చిలక గడె. వి. కిటికీ రెక్కల్ని బంధిస్తూ గుండ్రంగా తిరగడానికి వీలుగా అమర్చబడే చిన్నగడియ. **చిలకగడె** రూ.చూ. చిలకగడి. వి. కిటికీరెక్కల్ని బంధిస్తూ గుండ్రంగా తిరగడానికి వీలుగా అమర్చబడే చిన్నగడియ. **చిలకగుది** వి. మగ్గం అడ్డ కర్రలకు పైనకట్టినతాడు. **చిలకంచు** చూ. చిలకలంచు. వి. చిలకలమాదిరి డిజైన్లు వచ్చేట్టు నేసిన అంచు. **చిలకడ్డకర్ర** వి. కోతిపుల్లలుగాని, గిలకలుగాని

వేలాడ దీయటానికి మగ్గానికి పైన దారాలు కట్టినకఱ్ఱ. <చిలక² + అడ్డకఱ్ఱ. **చిలకతోటకూర** రూ.చూ. చిలుకతోటకూర. వి. తోటకూరలో ఒకరకం (Amarantus viridis). **చిలకదుడ్డి** వి. ఒకరకం పొద (Casearia tomentosa). **చిలకపచ్చ** వి. ఒకరకం పచ్చరంగు, రామచిలక రెక్కలరంగు. **చిలకపచ్చకడ్డీచీర** వి. చివర మూకంచు పెట్టి చిలక పచ్చ నలుపు వన్నెల్లో సన్నగడి పడేట్టు నేసినచీర. **చిలకపలుకు** రూ. చిలుకపలుకు. వి. 1. ముద్దుపలుకు ; 2 నేర్చినమాట. **చిలకపుల్ల** వి. 1. నేతనేసేటప్పుడు, అచ్చుకఱ్ఱలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడ దీసిన కొయ్యపుల్ల ; 2. ఒకరకం పావుచెక్క. **చిలకపీట** వి. పైనుంచి వేలాడ దీసిన పొడుగాటి కఱ్ఱ. **చిలకపేటు** చూ. చిలకలపేటు. వి. అంచులో చిలక ఆకారంలో వరసగా బొమ్మలు పడ్డ ఒకరకం డిజైను. **చిలకముక్కు** వి. బెజ్జమడతలో గాని, మోకాలి మడతలో కాని చిలకముక్కు ఆకారంలో ఉండేసుడి. **చిలకముక్కాకు** వి. చిలకతోటకూర. <చిలకముక్కు + ఆకు. **చిలకలకఱ్ఱ** వి. కోళిపుల్లలుగాని, గిలకలు గాని వేలాడ దియ్యటానికి మగ్గానికి పైన దారాలు కట్టిన కఱ్ఱ. **చిలకలకుండ** రూ. సిలకలకుండ. వి. అమ్మవారి కొలువుకు బోనం వండడానికి ఉపయోగించే మట్టికుండ. **చిలకలకొలికి** రూ.చూ. చిలుకల కొలికి వి. సుందరి, అతివ. **చిలకలంచు** చూ. చిలకలంచు. వి. చిలకల్లాగ డిజైను పడేట్టు నేసిన అంచు. **చిలకలతోరణం** వి. ఒంటి ఆకుల్ని మడిచి కుట్టికట్టే తోరణం. **చిలకలపేటు** చూ. చిలకపేటు. వి. అంచులో చిలక ఆకారంలో వరసగా బొమ్మలు పడ్డ ఒకరకం డిజైను. **చిలకలబారు** వి. అంచులో చిలకల ఆకారంలో వరసగా బొమ్మలుపడ్డ ఒకరకం డిజైను. **చిలకలబోనం** రూ. సిలకలబోనం. వి. చిలకల కుండలో అమ్మ వారికి వండిన పొంగలి. **చిలకలమందిరము** వి. ఉయ్యాల చెక్క. **చిలకలవేట** వి. ఆడవాళ్ళకోసం తిరగటం. **చిలకలార్చి** వి. పక్కభాగాలు వంపు ఉండే ఆర్చి. <చిలకల + ఆర్చి. **చిలకలసుడి** వి. బెజ్జమడతలో కాని మోకాలి మడతలో కాని ఉండే సుడి. **చిలకాడి** వి. గోడలో బిగించిన కొయ్యముక్క. <చిలక² + కాడి. **చిలక్కొట్టు** రూ.చూ. చిలుకకొట్టు. వి. 1. ఉంపుడు గత్తె, తనస్వాధీనంలో ఉన్న స్త్రీ. 2. చిలక తినిమిగిల్చిన పండు లేక కాయ. **చిలక్కొట్లు** వి.బ.వ. 1. పైపై తిరుగుళ్ళు ; 2. చిలక తిని మిగిల్చిన పళ్ళు లేక కాయలు. **చిలక్కొయ్య** రూ.చూ. చిలుక కొయ్య. వి. 1. చేతిమగ్గం పలకగుది తగిలించే కొయ్యపుల్ల ; 2. మగ్గం కుచ్చులాడుకట్టటానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల ; 3. ఇంటికప్పు వేయడంలో వాడే పల్చని చెక్క, దంతులకు మధ్యబిగించే చెక్క.

**చిలక²** వి. 1. కప్పుతాళం ; 2. చేదు బద్దలు రెంటినీ కలిపి బిగించే కొయ్య చిడత ; 3. గానుగ కఱ్ఱను కాడికి కలిపి కట్టేతాడు.

క. చిలక, చిలుకు. గొళ్ళెం లేదా తలుపులు వేసేచిన్న గొలుసు ; తు. చిళుకు, చిల్కు. కొక్కి లేదా కిటికీ గడియ.

**చిలకకట్టు** రూ. చిలక్కట్టు. వి. మగులు కొయ్య, మదురు వెయ్యడానికి గోడలో పాతిన కొయ్యముక్క. **చిలకట** రూ. చిలకడ, చిలుకడ, చిల్కడ. వి. 1. చిలకతాడు కట్టేకొయ్య కొలికి, గొళ్ళెం ; 2. నాగలి మోకు మొదటి కొన మెలితిప్పి వేసినముడి ; 3. గుఱ్ఱం జీనుకు తగిలించే గొళ్ళెం. <చిలక + కట్టు. **చిలక్కట్టు** రూ.చూ. చిలకకట్టు. వి. 1. పలుపు ముడిని దూర్చటానికి ఇంకొక చివర్న అమర్చిన తాటి ఉంగరం ; 2. పంచకట్టు. **చిలకడ** రూ.చూ. చిలకట వి. 1. చిలక తాడుకట్టేకొయ్య, గొళ్ళెం, చిలక్కొయ్య ; 2. సరి చేయటానికిగాని నేతనేయటానికిగాని దాపిన ఉన్ని పడుగు బిగింపుకు తలకోలకు తగిలించిన తాడు. **చిలకతాడు** రూ.చూ. చిలుకత్రాడు. వి. 1. పడుగు దాపేటప్పుడు ఊత్తై అడ్డపట్టెనూ పడుగేరే కఱ్ఱనూ కలిపేతాడు ; 2. మరమగ్గం నిలువు పట్టెను మెరువు పలకకు బిగించిన నన్నపుల్లతో వడిపెట్టినదారం. **చిలకత్రాడు** రూ.చూ. చిలుకత్రాడు. వి. 1. చిలుక కాలతాడు ; 2. నూలుపోగు. **చిలకన్నె** వి. సరిచేయడానికిగాని, నేత నెయ్యటానికి గాని, దాపిన ఉన్నిపడుగు బిగింపుకు తలకోలకు తగిలించిన తాడు.

**చిలక³** రూ.చూ. చెలిక. వి. కట్టుబడికి పనికివచ్చేరాళ్ళు గాని సున్నపురాళ్ళుగాని దొరికే పొలం.

**చిలకకూర** రూ.చూ. చిలుకకూర. వి. చిల్కకూర. హిలమోచిక, గ్రహణిని మూలవ్యాధిని పోగొడుతుంది.

**చిలకపార** రూ. చెలకపార. వి. మట్టిపని చేయడానికి పడ్డైవారు, రైతులు వాడేపార.

**చిలకమట్ట** వి. కంచర గాడిద.

**చిలకరించు** రూ.చూ. చిలుకరించు. స.క్రి. 1. మట్టిమీద నీళ్ళు కొద్ది కొద్దిగా చల్లు ; 2. సరి చేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి గంజిచిలుకు.

**చిలకాడి** చూ. చిలక¹.

**చిలకొట్టు** స.క్రి. మజ్జిగ మొ॥ వానిని గిలకొట్టు.

**చిలక్కొట్టు** చూ. చిలక¹.

**చిలక్కొట్లు** చూ. చిలక¹.

**చిలక్కొయ్య** చూ. చిలక¹.

**చిలగడతాడు** వి. పడుగు దాపేటప్పుడు, ఊత్తై అడ్డపట్టెనూ పడుగేరే కఱ్ఱనూ కలిపేతాడు.

**చిలగడదుంప** రూ.చూ. చిరుగడదుంప. వి. చిరుగడదుంప, ఎఱ్ఱదుంప, గెనుసుగడ్డ (Iponaea batatas).

**చిలగఱ్ఱతాడు** వి. ఎద్దు మీద గంతబిగించేతాడు.

**చిలచిల** వి. 1. ద్రవపదార్థాలు చిలకడం మొ॥ వాటికి అనుకరణం. వరాహ. 4.34 ; 2. ఎండటానికి అనుకరణం. 3. నట్టడానికి అనుకరణం.

త. చిలుచిలు (-ప్పు-,-ట్ట్-). నెమ్మదిగా వర్షం కురియు ; కొం. చిల్కడ్. వర్షంపడు ; పర్జి. చిల్క్. చిన్నయేరు ; కొలా. సిల్క్. నది.

**చిలచిలమను** అ.క్రి. (గంధంపూత మొదలైనవి) ఎండిపోవు. కళా. 6.254. ధన్యను. <చిల చిల + అను.

**చిలప¹** రూ.చూ. చెలప¹. వి. చెడిన పైరుతుట్ట.

**చిలప²** రూ.చూ. చెడిప. వి. బుఱ్ఱ.

**చిలప**³ వి. లడీలో పదోవంతు నూలు.

**చిలపలబండి** వి. గుమ్మటం లాంటి పనిముట్టు. **చిలపల రాట్నం** వి. దబ్బాలకు చిలపలు నూలు తోడేరాట్నం.

**చిలమరక** వి. తాడుతోగాని, తోలుతోగాని, అల్లి మూతికి తగిలించే అలంకారం.

**చిలముకుదాడు** వి. తాడుతోగాని, తోలుతోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం.

**చిలమోర** రూ.చూ. చింబోర. వి. తాడుతోగాని, తోలుతోగాని అల్లిమూతికి తగిలించే అలంకారం.

**చిలవ**¹ వి. **1**. జారిణి; **2**. కొంటెపనులు చేసేది.

**చిలవమాటలు** వి.బ.వ. వచ్చీరాని ఇంపుగూర్చే పసిబిడ్డల మాటలు.

**చిలవ**² వి. నీటిగోడి.

**చిలవలుపలవలుచేయు** చూ. చిలప³. స.క్రి. ఒకటంటే నూరు కల్పించు.

**చిలాట** వి. కిరాట జాతి, ఒక అనార్యజాతి. కిరాటశబ్దం తాలవ్యీకరణం చెందగా ఏర్పడ్డ శబ్దరూపం.

**చిలాత** వి. వేటగాడు, కిరాతుడు, నాగార్జునకొండ శాసనం. క్రీ.శ. 3వ శతాబ్దం.

సం. కిరాత-. వేటకాడు, అనాగరక జాతికి చెందిన వాడు; ప్రా. చిరాత-.

<ప్రా. చిరాత-.

**చిలాయి** వి. చాదు, పిల్లలకు బొట్టు పెట్టడాని కుపయోగించే నల్లని పదార్థం.

**చిలికించు** చూ. చిలుకు¹.

**చిలిపి** రూ.చూ. చిడిపి. విశే. **1**. అల్పమైన, చిన్న. జైమిని భా. 8.140; **2**. నికృష్టమైన, నీచమైన; **3**. దుష్టుడైన. వి. **1**. పిల్లలుచేసే తెలివైన కొంటెపని; **2**. నేర్పు. క్రమం, అలంకారం.

క. కెల. కొద్ది, కొన్ని; తు. కిన్ఞ్. కొద్దిగా; త. చిల్. కొద్దిగా, చిన్న; మ. చిల. కొద్దిగ, కొన్ని; కిల్‌గట్-(గచ్-). వయసుకన్న చిన్నగాఉండు; తొ. కిన్ఞ్. కొద్దిగా; కొలా. చిల్-, ఎల్క. ఎలక.

**చిలిపిచేష్టలు** వి.బ.వ. అల్లరిపనులు. **చిలిపిజాడ్యము** వి. సుఖరోగం. **చిలిపిడిత** యా.చూ. చిలిపిపిడత. వి. దిష్టికుండ. <చిలిపి+పిడత. **చిలిపిపిడత** రూ. చిలిపిడత. వి. దిష్టి పిడత, గడ్డిబొమ్మ. **చిలిపిబట్ట** వి. శిలిబ్బట్ట, ఎరుపు తెలుపు వన్నెల మచ్చ. **చిలిపిబొమ్మ** వి. దిష్టిపిడత, గడ్డిబొమ్మ. **చిలిపివన్నె** వి. గోధుమరంగు.

**చిలిమి** రూ.చూ. చిలుము². వి. గంజాయి పీల్చడానికి వాడే గొట్టం.

**చిలిమిడి** యా. చిలిమిద. వి. అక్షోళం, వృక్షవిశేషం. ఆం. భా. 2.36.

**చిలిమిద** రూ.చూ. చిలిమిడి. వి. ఒకరకం చెట్టు, అక్షోళం.

**చిలివిలి** వి. దట్టం, గట్టం.

**చిలివిలిపోవు(-పోపు)** అ.క్రి. **1**. చప్పుడు చేయు; **2**. అతిశయించు; **3**. కందు; **4**. అల్లరిని అడగు; **5**. దట్ట మగు, మమ్మరించు, సందడించు.

**చిలివిసము** చూ. చిలిపి. వి. **1**. పనికిమాలిన పని. ద్వి. పరమ. 5.361; **2**. అసూయ.

**చిలుం** రూ.చూ. చిలుము². వి. గంజాయి పీల్చడానికి వాడే మట్టిగొట్టం.

**చిలుక** రూ.చూ. చిల్క. వి. **1**. శుకం, కీరం. కు. సం. 3.74, భార. శాంతి. 6.250; **2**. ఇరుసుకుదిచీల, ఆణి. ఆం. భా. 2.203; **3**. చిలుకతోటకూర, హిలమోచిక; **4**. కొన్ని రెక్కల పురుగుల పేర్లలో తుదిపదం. ఉ. గడ్డిచిలుక; **5**. తలుపు బిగించే ఒకానొక గడియ; **6**. మిడత; **7**. అటక లమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క.

**చిలుకకూర** రూ. చిలకకూర. వి. చిలకతోటకూర, హిలమోచిక. **చిలుకకొట్టు** రూ. చిలక్కొట్టు. వి. **1**. చిలుకకొట్టిన, లోనిసారం పీల్చివేయ బడిన కాయ; **2**. ఉంపుడుకత్తె. **చిలుకకొట్టుడు** వి. పిల్లలు తాము తింటున్నది మరొకరికి పంచిపెట్టేటప్పుడు ఎంగిలి కాకూడదని తినేపదార్థం మీద బట్టవేసి కొరికి ఇచ్చే ముక్క. **చిలుకకొయ్య** రూ. చిలకకొయ్య, చిల క్కొయ్య, చిలుకొయ్య, చిలుక్కొయ్య, చిల్కకొయ్య. వి. వస్త్రాదులుంచడానికి గోడలో కొట్టిన చిలకవంటి ఆకారం గల కొయ్య, నాగదంతకం. పండి. చ. 1.41 పు. **చిలు కొయ్య** రూ.చూ. చిలుకకొయ్య. వి. ఏరకట్ట సామాను. తగి లించే కొంకికర్ర. **చిలుకగోణము** రూ. చిల్కగోణము. వి. అతుకు గుడ్డవేసిన గోచి. **చిలుకగోరువంకవలెనుండు** అ.క్రి. అన్యోన్యంగా ఉండు. **చిలుకచదువు** యా. చిల్కచదువు. వి. చెప్పినమాట మాత్రమే చెప్పడం, అర్థంచేసుకోకుండా చదివే చదువు. కళా. **6**.270. **చిలుకతత్తడిరవుతు** రూ.చూ. చిలుకతత్తడి రౌతు. వి. మన్మథుడు. **చిలుకతత్తడిరౌతు** రూ. చిలుక తత్తడిరవుతు, చిల్కతత్తడిరవుతు, చిల్కతత్తడిరౌతు. వి. మన్మథుడు- చంద్రికా. 2.68. వ్యు. చిలుకే గుర్రంగా కల్గి స్వారీ చేసేవాడు. **చిలుకతాళి** రూ. చిలుకతాళీ, చిల్క తాళి, చిల్కతాళీ. వి. పైభాగంలో రెండు పక్కల చిలకరూపం కలిగిన పతకం. శుక. 1.160. **చిలుకతాళీ** రూ. చూ. చిలుకతాళి. వి. పైభాగంలో రెండువైపుల చిలక రూపం కలిగిన పతకపు బిళ్ళ. రసిక. 1.75. **చిలుకతోటకూర** రూ. చిలకతోటకూర, చిల్కతోటకూర. వి. హిలమోచిక. **చిలుక నక్కునబెట్టజెక్కుసెమర్చు (-చెమర్చు)** అ.క్రి. సుకు మారంగా ఉండు. గౌ. హరి. ప్ర. 1597.98. **చిలుక నాలుక** రూ. చిల్కనాలుక. వి. శుకనాళం, వృక్ష విశేషం. **చిలుకనాలుకకూర** రూ. చిల్కనాలుకకూర. వి. శుకనాళం. **చిలుకపలుకు** రూ. చిలకపలుకు. వి. **1**. ముద్దుపలుకు, ఇంపైనమాట. విక్ర. 1.79; **2**. నేర్చిన మాట. **చిలుకపిట్ట** వి. చిలక, పక్షివిశేషం. **చిలుకపిండు** వి. చిలుకల గుంపు. కు. సం. 7.92. **చిలుకపోయినపంజరము** వి. వ్యర్థం. ఉ. హరి. 1.72. **చిలుకముక్కు** వి. శుకనాసం, చిలకముక్కులాగ ఉండే పువ్వులు పూసే చెట్టు. ఆం. భా. 2.66. **చిలుకముక్కులు** వి.బ.వ. ఒకరకం వడ్లు. ప్రబంధ. 112. **చిలుకమెట్టనిఫలములు** వి.బ.వ. చిలుకకొట్టని పళ్ళు. శివరా. 3.55. **చిలుకయారె(-ఆరె)** రూ. చిల్కయారె.

వి. చర్మకారుడు ఉపయోగించే ఒకరకం సూది, చెప్పులుకుట్టే సూది. చిలుకరవుతు రూ. చిలుకరౌతు. వి. శుకరాహుత్తు, మన్మథుడు. చిలుకరౌతు రూ. చూ. చిలుకరవుతు. వి. మన్మథుడు. చిలుకలకొలికి రూ. చిలకలకొలికి, చిలుకలకొల్కి, చిల్కలకొలికి, చిల్కల కొల్కి. వి. చిలుకలకొలుకుల వంటి చిల్కల కొలుకులుగల స్త్రీ. శృం.నై. 8.50. చిలుకలకొల్కి రూ.చూ. చిలుకల కొలికి. వి. చిలుకల కొలుకుల వంటి కొలుకులు గల స్త్రీ. ఆం. భా. 2.105. చిలుకలచదువు రూ. చిల్కల చదువు. వి. అర్థం చేసుకోకుండా చదివేచదువు. పల్నా. 75. చిలుకలు వి.బ.వ. ఈతిబాధలు. చిలుకవార్వపుజోదు రూ. చిల్కవార్వపుజోదు. వి. మన్మథుడు. వ్యు. చిలుక గుర్రంగాకల యోధుడు. చిలుకవార్వంపుమేటివజీరు(డు రూ. చిల్కవార్వంపు మేటి వజీరు(డు. వి. మన్మథుడు. వ్యు. చిలక గుర్రంగాకల శ్రేష్ఠుడైన యోధుడు.

**చిలుకడ** రూ.చూ. చిలకట. వి. 1. పగ్గం మొ. వాటికి వేసే కొలికిముడి ; 2. ఎద్దుగంతను బిగించటానికి ఉపయోగించే తాడుకొనన వేసే ముడి ; 3. కోశ బంధ గుణం, కత్తిఒరకు కట్టేతాడు.

క. చిలకి, చిలుక. గొళ్ళెం లేదా తలుపుకువేసే చిన్న గొలుసు ; తు. చిళుకు, చిలుక్క. కిటికీ కొక్కెం లేదా గొళ్ళెం.

**చిలుకత్తు** చూ. చిలుకు[2].

**చిలుకత్రాడు** రూ. చిలకతాడు, చిలకత్రాడు. వి. 1. చిలకకాలితాడు ; 2. నూలిపోగు.

**చిలుకమ్ము** చూ. చిలుకు[2].

**చిలుకరించు** చూ. చిలుకు[1].

**చిలుకరింపు** చూ. చిలుకు[1].

**చిలుకు**[1] రూ. చిల్కు[1]. అ.క్రి. 1. చిందు, చెదరిపడు, రాలు, పడు. భార. శాంతి. 6.121 ; 2. ప్రకటితమగు. మార్క. 3.128 ; 3. ప్రవేశించు. భాగ. 10ఉ. 1333 ; 4. మీరు, చెలరేగు. మను. 3.109 ; 5. (ద్రవం) ఊరు. కళా. 1.45 ; 6. కురియు, వర్షించు. వసు. 2.12 ; 7. ప్రసరించు, వ్యాపించు. దశా. 2.66. స.క్రి. 1. కురియు. కాశీ. 2.53 ; 2. మథించు, త్రచ్చు. పి. శకు. 1.39 ; 3. చల్లుకొను. ఆము. 4.147 ; 4. ప్రసరింపచేయు, వ్యాపింపచేయు. పాండు. 4.77 ; 5. వెలువరించు, ప్రకటించు. సారంగ. 3.117. వి. 1. జలక్రీడా విశేషం. నిర్వ. రా. 8.49 ; 2. మిగులు, శేషం ; 3. చిలుకు (మజ్జిగ చిలకటం) ; 4. నిట్టాడి పీటమీదనుంచి పైకి పొడుచుకొని వచ్చిన మేకు ; 5. మట్టిపాత్రలకు పక్కమీద పెట్టేపూజ ; 6. గోడ అడుగు భాగాన పెట్టే చుక్కలు బొట్లు, వేళ్ళతో సున్నం తీసి ఈతాకుల్లాగ కనపడేట్టు వేసిన ముగ్గు.

క. చిలుకు. పాలు చిలికినపుడైన శబ్దం ; త. చిలుప్పు. చిలుకు, కలుపు, ఆందోళన పరచు.

చిలికించు స.క్రి. 1. చిలకజేయు. భీమ. 3.62. ; 2. ప్రసరింపజేయు. విక్ర. 1.158. చిలుకరించు రూ. చిలకరించు, చిల్కరించు. స.క్రి. చల్లు, చిమ్ము, చిలుకు. చిలుకరింపు రూ. చిల్కరింపు. వి. చిలకరించడం, చల్లడం. చిలుకుగోలెం వి. పూలమొక్కలు వేయడానికి పొంపులు పెట్టిన అంచులుండే మట్టితొట్టి. చిలుకుచెక్క వి. ఇంటికప్పు వేయడంలో వాడే పల్చని చెక్క, దంతుల మధ్య బిగించే చెక్క. చిలుకుడు రూ. చిల్కుడు. వి. చిలకటం. చిలుకుడుగుంజ రూ. చిల్కుడుగుంజ. వి. పెరుగు మొ. వాటిని చిలకటానికి ఉపయోగించేగుంజ. చిలుకుతాడు రూ. చిల్కుతాడు. వి. జమిలిపగ్గాలతాడు. చిలుకుపెట్టు[1] స.క్రి. మట్టిపాత్రలకు అలంకారంగా పూజలుపెట్టు. చిలుకువాటం వి. అటక నిర్మించడానికి గోడలో పాతినకొయ్య.

**చిలుకు**[2] రూ. చిల్కు[2]. వి. 1. బాణం. ఇందు. 2.58 ; 2. అలుగు, బాణాగ్రం. ఆం.భా. 2.213.

త. చెలై. బాణం ; మ. చిల.

చిలుకత్తు వి. కవచవిశేషం. ఆం.భా. 2.204. <చిలుకు[2]+అత్తు. చిలుకమ్ము రూ.చూ. చిలుకుటమ్ము. వి. బాణ విశేషం. <చిలుకు[2]+అమ్ము. చిలుకుటమ్ము రూ. చిలుకమ్ము, చిల్కుటమ్ము. వి. 1. రెండుఅలుగులు గల బాణం. దశా. 5.115 ; 2. అలుగు కలిగిన బాణం. <చిలుకు[2]+అమ్ము. చిలుకుతూపు వి. అలుగుతో కూడిన బాణం, రెండడుగులబాణం. ఘటికా. 2.86. చిలుకుమార్చు రూ. చిల్కుమార్చు. స.క్రి. చంపు. చిలుకొత్తు రూ. చిల్కొత్తు. వి. కవచవిశేషం. ప్రబంధ. 5.14. <చిలుకు[2]+ఒత్తు.

**చిలుకు**[3] వి. 1. కొలికి, ముడి. పాండు. 5.136 ; 2. గొళ్ళెం ; 3. తాళంవేయడానికి వీలుగా అమర్చిన పరికరం.

చిలుకుపెట్టు[2] వి. గొళ్ళెంపెట్టు. చిలుకుముద్రించు అ.క్రి. తాళంవేయు. శుక. 3.348.

**చిలుకొత్తు** చూ. చిలుకు[2].

**చిలుక్కొయ్య** రూ.చూ. చిలుకకొయ్య. వి. మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు పాతిన కొయ్య.

**చిలుగు** రూ. చిల్గు. వి. దీర్ఘయష్టిక, వృక్షవిశేషం.

**చిలుప** రూ. చిల్ప. విశ. అల్పమైన, కొద్దిపాటి. శృం.నై. 1.19. వి. 1. కొంచెంగాచేరి నిలిచేనీరు. మను. 3.136 ; 2. ముక్క, ఖండం. చంద్రభా. 2.9 ; 3. కమాను, చిరతతాడు బిగింపుకు మెలిపెట్టే చిన్నపుల్ల.

చిలుపచిలుప రూ.చూ. చిలుపచిలుపని. విశ. అత్యల్పమైన, మిక్కిలికొలదియైన. శివరా. 1.50. చిలుపచిలుపచీకటి వి. కొద్దికొద్దిగాఉన్న చీకటి. శివరా. 3.96. చిలుపచిలుపని రూ. చిలుపచిలుప. విశ. అత్యల్పమైన, మిక్కిలికొలదియైన. భీమ. 4.123, మను. 4.17.

**చిలుపచిలుపన్** క్రి.విశ.ద్రు. బొళబొళమనేట్లుగా. ఉ.హరి. 3.27. ధ్వన్యను.

**చిలుము**[1] రూ. కిలుము, చిల్ము[1]. వి. 1. విషం. శృం.నై. 8.154 ; 2. లోహాదుల మలం, రాగిపాత్రలు మొ. వాటిలో కలిగేమురికి. శుక. 2.451 ; విశ. చిలుముకల.

క. కిలుబు. కిలుంపట్టు, కిలుముతో కప్పబడు ; తు. కిలింబు, కిలుబు, కిలుము. కిలిం, రాగిమీద చిలుము

హరింపచేయటం; త. చిలుంపు, చిలింపు. రాగిమీద చిలుం; కళింపు. తుప్పు, కళంకం; మ. కిళర్ కక్క. కిలుంపట్టు; కిళర్ వ్పు, కిళావ్ర, కళింపు. రాగిమీద చిలుం, హరింపచేయటం; కుయి. కిల్మ. తుప్పు.

**చిలుముగులియ** రూ.చూ. చిల్మగులియ. వి. ఒకజాతి పాము. **చిలుమువడులు** అ.క్రి. బాగా నష్టం వచ్చు, బాగా ఖర్చగు. **చిలుమువాలు** వి. తుప్పుపట్టిన కత్తి. ఆం. భా. 3.52. విశ. ఉలిపికట్టె, తులువ. ఆం. భా. 3.52. **చిలుమూచిద్రం** వి. శని, దరిద్రం మొ. వాటిని తెలిపే పలుకుబడి. **చిలుమూరు** అ.క్రి. రాగి మొ. పాత్రలలో మురికిపట్టు. హరి.పూ 5.142.

**చిలుము**[2] రూ. చిలిమి, చిలుం, చిల్మ[2], చిల్లము. వి. గంజాయి గొట్టం. పార్వ. 2.98.

**చిలుమూచిద్రం** చూ. చిలుము[1].

**చిలుమూరు** చూ. చిలుము[1].

**చిలువ**[1] రూ. చిల్వ[1]. చూ. చిలుము1. వి. పాము. భార.విరా. 4.118.

**చిలువకన్నియ** రూ. చిల్వకన్నియ. వి. నాగకన్య. **చిలువగట్టు** రూ. చిల్వగట్టు. వి. తిరపతికొండ. (వేంకటేశ్వర స్వామిని ధరించడానికి) ఆదిశేషుడు తాల్చినకొండ. **చిలువగట్టుదొర** రూ. చిల్వగట్టుదొర. వి. శ్రీవేంకటేశ్వరస్వామి, ఏడుకొండలరాయడు. ప్రబంధ. 25. వ్యు. శేషశైలాధిపతి. **చిలువజగము** రూ. చిల్వజగము. వి. నాగలోకం, పాతాళం. అచ్చ.రా.యు. 4.29. **చిలువజండెపుమేటి** రూ. చిల్వజండెపు మేటి. వి. 1. శివుడు; 2. గణపతి. వ్యు. పామును జండెంగా కల శ్రేష్ఠుడు. **చిలువటెంకి** రూ. చిల్వటెంకి. వి. పుట్ట, వల్మీకం. యయా. 4.39. వ్యు. పాముల నివాసం. **చిలువతాలుపు** రూ. చిలువతాల్పు, చిల్వతాలుపు, చిల్వతాల్పు. వి. శివుడు, నాగభూషణుడు. వ్యు. పాముల్నిధరించేవాడు. **చిలువతాల్పు** రూ.చూ. చిలువతాలుపు. వి. శివుడు. **చిలువతాలుపుబత్తిరిక** రూ. చిల్వతాలుపుబత్తికిక. వి. సముద్రం. వ్యు. శివుడి జమ్ములపొది. **చిలువతాల్పువేల్పువలపుటింతి** రూ. చిల్వతాల్పువేల్పువలపుటింతి. వి. పార్వతి. వ్యు. శివుడి ప్రియురాలు. **చిలువతిండి** రూ. చిల్వతిండి. వి. 1. గరుత్మంతుడు. ఉ.రా. 5.192; 2. నెమలి. అచ్చ.రా. కిష్కిం. 67. వ్యు. పాముల్ని తిండిగాకలది. **చిలువదొర** రూ. చిల్వ దొర. వి. సర్పరాజు, వాసుకి. **చిలువపట్టు** రూ. చిల్వపట్టు. వి. వల్మీకం, పుట్టు. అచ్చ.రా.బాల. 28. **చిలువపానుపుదంట** రూ. చిల్వపానుపుదంట. వి. విష్ణువు. **చిలువపేరు** వి. నాగాభరణం. హర. 4.28. **చిలువమన్నడు** వి. సర్పరాజు, శేషుడు. ఉ.రా. 204. **చిలువమల** రూ. చిల్వమల. వి. తిరుపతికొండ. **చిలువమలతేఁడు** రూ. చిల్వమలతేఁడు. వి. వేంకటేశ్వరస్వామి. ప్రబంధ. 186. **చిలువమలవాఁడు** వి. శేషాచలపతి, వేంకటేశ్వరుడు. ప్రబంధ. 161. **చిలువమేఁత** రూ. చిల్వమేఁత. వి. గాలి, వాయువు. వ్యు. పాముల ఆహారం. ఆం.భా. 1.59. **చిలువమేఁతరి** రూ. చిల్వమేఁతరి. వి. గరుడుడు. వ్యు. పాముల్ని మేతగాకలవాడు. **చిలువమేపరి** రూ. చిల్వమేపరి. వి. పాములు ఆహారంగా గలవాడు, గరుడుడు. సమీర. 6.141. **చిలువమేపరిపచ్చ** రూ. చిల్వ మేపరిపచ్చ. వి. గరుడపచ్చ, మణివిశేషం. ప్రబంధ. 5.66. **చిలువయిల్లాండ్రు** వి.బ.వ. నాగులభార్యలు. కాశీ. 1.130. **చిలువరాయఁడు** రూ. చిల్వరాయఁడు. వి. సర్పరాజు, శేషుడు. రామ. 241. **చిలువఱేఁడు** రూ. చిల్వఱేఁడు. వి. సర్పరాజు. **చిలువలగమికాఁడు** రూ. చిల్వలగమికాఁడు. వి. శేషుడు, ఫణిరాజు. **చిలువలదొర** రూ. చిల్వలదొర. వి. శేషుడు, ఫణిరాజు. **చిలువలేమలు** వి.బ.వ. నాగస్త్రీలు. భీమ. 1.98. **చిలువసొమ్ము** రూ. చిల్వసొమ్ము. వి. సర్వభూషణుడు, శివుడు.

**చిలువ**[2] రూ. చిల్వ[2]. వి. అడవిపొట్టిబాతు.

**చిలువ**[3] రూ. చిల్వ[3]. విశ. కొద్ది.

**చిలువానపుమిద్దె** చూ. చిలువానము.

**చిలువానము** రూ. చిల్వానము. వి. 1. ఇంటి ఖర్చుకు వేరుగా ఉంచే చిల్లర. శుక. 3.348; 2. కూడబెట్టిన ధనం.

క. చిలవాన. చిల్లర; తు. చిలవాన, చిల్వాన; త. చిల్వానమ్, చిలువాణమ్. సంచితం, మిగిలినది, ఇంటి ఖర్చులో మిగిలినది. చిల్లరద్రవ్యం; మ. చిలవానమ్.

<త. చిలువాణమ్.

**చిలువానపుమిద్దె** వి. చిల్లర వంటసామానుంచేగది. **చిలువాయనము**[1] రూ. చిల్వాయనము. విశ. క్షుద్రమైన. పాండు. 2.85, 4.77. వి. చిల్లర.

**చిలువాయనము**[2] వి. నక్క.

**చిలువాలపాయసము** చూ. చిలువాలు.

**చిలువాలు** రూ. చిఱువాలు, చిల్వాలు. వి. ఇగరకాచినపాలు, కర్దమీకృతదుగ్ధం. రం.రా.బాల. 53 పు. 21 పం.

**చిలువాలపాయసము** వి. పాలపరమాన్నం. చంద్రభా. 4.77.

**చిల్క** రూ. చిలక, చిలుక. వి. 1. శుకం, పక్షివిశేషం. కు.సం. 3.36; 2. చిలకతోటకూర. ఆం.భా. 2.73; 3. ఇరుసు తుది చీల, ఆణి. ఆం.భా. 2.203; 4. కొన్ని రెక్కల పురుగుల పేర్లలో తుదిపదం; 5. తలుపు బిగించే ఒకానొక గడియ.

క. తు. గిళి, గిణి. చిలుక; త. కిళి, కిళ్ళై. చిలక; మ. కిళి; కో. కిళివత్రై; గోం. కిల్; పర్జి. కిళ్; గ. కిరిఙ్.

పో.చూ. సం. శుక-. చిలుక.

మూ.ద్రా. *కిళ్.

**చిల్కకుచక్కెరపెట్టు (-పెట్టు)** స.క్రి. చిలకకు ఆహారమిచ్చు. రాజగో. 2.10. **చిల్కకొయ్య** రూ.చూ. చిలుక కొయ్య. వి. వస్త్రాదులుంచడానికి గోడలో కట్టిన చిలుకల వంటి ఆకారంగల కొయ్య, నాగదంతకం. పండి. చ. 1. 42 పు. **చిల్కగోణము** రూ.చూ. చిలుకగోణము. వి. అతుకులు వేసిన గోచి. **చిల్కచదువు** రూ.చూ. చిలుక చదువు. వి. అర్థం చేసుకోకుండా చదివే చదువు. పల్నా. 37. **చిల్కతత్తడిరవుతు** రూ.చూ. చిలుక తత్తడిరౌతు. వి. మన్మథుడు. **చిల్కతత్తడిరౌతు** రూ.చూ. చిలుకతత్తడిరౌతు.

వి. మన్మథుడు. **చిల్కతాళి** రూ.చూ. చిలుకతాళి. వి. పైభాగంలో రెండువైపులా చిలుకరూపం కలిగిన పతకం. ద్వి.శ.సా. 1.13 పు. 17 పం. **చిల్కతాళీ** రూ.చూ. చిలుకతాళి. వి. పైభాగంలో రెండుపక్కల చిలకరూపం కల్గిన పతకం. **చిల్కతేరు** వి. చిలకలు నడిపేరథం. శృం.నై. 7.41. **చిల్కతోటకూర** రూ.చూ. చిలుకతోటకూర, ఒకరకం తోటకూర. వి. హిలమోచిక. **చిల్కనాలుక** రూ.చూ. చిలుకనాలుక. వి. శుకనాళం, వృక్షవిశేషం. **చిల్కనాలుకకూర** రూ.చూ. చిలుకనాలుకకూర. వి. శుకనాళం, వృక్షవిశేషం. **చిల్కబోద** వి. చిలక్కి చెప్పినట్లు బోధపరచడం. భార. విరా. 5.105. **చిల్కయారె** (-ఆరె) రూ.చూ. చిలుకయారె. వి. చర్మకారుడు ఉపయోగించే చెప్పులుకుట్టే సూది. **చిల్కలకొలికి** రూ.చూ. చిలుకల కొలికి. వి. స్త్రీ. **చిల్కలకొల్కి** రూ.చూ. చిలుకల కొలికి. వి. 1. చిలకలకొలుకుల వంటి కొలుకులు గల స్త్రీ. ఉ.రా. 6.27; 2. అందగత్తె. శుక. 1.493. **చిల్కలచదువు** రూ.చూ. చిలుకల చదువు. వి. అర్థజ్ఞానం లేని చదువు. పాండు. 3.36. **చిల్కమోట** వి. ఇంటి కప్పు వేయడంలో వాడే పల్చని చెక్క. **చిల్కవార్వపుజోదు** రూ.చూ. చిలుకవార్వపుజోదు. వి. మన్మథుడు. **చిల్కవార్వంపుమేటివజీరుఁడు** రూ.చూ. చిలుకవార్వంపు మేటి వజీరుఁడు. వి. మన్మథుడు. **చిల్కసముద్రము** వి. ఒక సరస్సు. కాశీ. 1. 60.

**చిల్కగుల్ల** రూ.చూ. చెలకగుల్ల. వి. పొలాల్లో దొరికే గవ్వ.

**చిల్కడ** రూ.చూ. చిలకట. వి. 1. కోశబంధ గుణం, కత్తి ఒరకు కట్టేతాడు. ఆం.భా. 2.215; 2. పగ్గం మొ. వాటి కొసకు వేసే కొలికి ముడి; 3. ఎద్దు గంతను బిగించటానికి తాడుకొసకువేసే గుండ్రని ముడి.

**చిల్కరించు** చూ. చిల్కు[1].

**చిల్కరింపు** చూ. చిల్కు[1].

**చిల్కాపరిడిజైను** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**చిల్కు**[1] రూ.చూ. చిలుకు[1]. అ.క్రి. (ద్రవం) ఊరు. హంస. 1.34. విణ. కురిసే, వర్షించే. పాండు. 4.112.

**చిల్కరించు** రూ.చూ. చిలుకరించు. స.క్రి. చల్లు, చిమ్ము. చిలుకు. **చిల్కరింపు** రూ.చూ. చిలుకరింపు. వి. చల్లడం, చిలకరించడం. **చిల్కుడు** రూ.చూ. చిలుకుడు. వి. చిలకటం. **చిల్కుడుగుంజ** రూ.చూ. చిలుకుడుగుంజ. వి. పెరుగు మొ. వాటిని చిలకటానికి ఉపయోగించే గుంజ. **చిల్కుతాడు** రూ.చూ. చిలుకుతాడు. వి. జమిలిపగ్గాల తాడు.

**చిల్కు**[2] రూ.చూ. చిలుకు[2]. వి. 1. బాణం; 2. అలుగు, బాణాగ్రం.

**చిల్కుటమ్ము** రూ.చూ. చిలుకుటమ్ము. వి. అలుగుతో కూడిన బాణం, రెండలుగులుగల బాణం. చంద్రికా. 4.125. **చిల్కుమార్చు** రూ.చూ. చిలుకుమార్చు. స.క్రి. చంపు. **చిల్కులకోల** వి. అలుగు గలిగిన బాణం, రెండలుగుల బాణం. ప్రబంధ. 182. **చిల్కొత్తు** రూ.చూ. చిలుకొత్తు. వి. కవచవిశేషం. < చిల్కు[2] + ఒత్తు.

**చిల్కొత్తు** చూ. చిల్కు[2].

**చిల్గు** రూ.చూ. చిలుగు. వి. దీర్ఘయష్టిక, వృక్షవిశేషం.

**చిల్డ్రన్స్‌వార్డు** వి. పిల్లల ప్రత్యేకమైన గది లేదా విభాగం.
ఇం. *Children Ward.* పిల్లల విభాగం.
< ఇం. Children Ward.

**చిల్ప** రూ.చూ. చిలుప. వి. 1. నిల్వనీరు; 2. ముక్క; 3. కమాను. విణ. చిన్న.

**చిల్పి** చూ. చిప్పె[2]. వి. ఆచార్యుడు, కంసాలి. ద. హిం. శా. సంపు. 10 శా. సం. 396. క్రీ.శ. 1261.
సం. శిల్పిన్. శిల్పి.
< సం. శిల్పిన్.

**చిల్మి** వి. కూజానుంచి నీరు బైటికిపోయే భాగం.

**చిల్ము**[1] రూ.చూ. చిలుము[1]. విణ. చిలుముకల. ఆము. 1.61. వి. 1. లోహాదుల మలం, రాగి చెంబు మొ. వాటిలో కలిగే మురికి; 2. విషం.

**చిల్ముగులియ** రూ. చిలుముగులియ. వి. సర్పవిశేషం. సిం. ద్వా. 8.98.

**చిల్ము**[2] రూ.చూ. చిలుము[2]. వి. గంజాయిగొట్టం.

**చిల్ల**[1] రూ. చీల[1], చీళ, జిల్ల[1], సీల. వి. 1. బాణాగ్రంలో చెవివలె వంకరగా ఉండే ములికి. భార. శాంతి. 2.421; 2. మోటబొక్కెన తూములోదూర్చి మోకుజారకుండా వేసిన కొయ్యముక్క; 3. కట్టెమేకు; 4. పండ్లమాను, కార్లపొలిక మొ. వాటి దిండుకు వేసిన కొయ్యముక్క; 5. పిల్లుల్ని, పందుల్ని పొడిచే ఈటె; 6. మొన ఉన్న ఇనప లేక కొయ్యముక్క; 7. బండి చక్రం జారిపోకుండా కుండ పక్కన ఇరుసులోకి దించిన మేకు; 8. పంటి ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద; 9. అనుపీటకు దిగ్గొట్టిన నిలువు పుల్ల; 10. పడుగును ఊడ్తెకు కలిపేతాడు, చివరకట్టిన పుల్ల; 11. అచ్చు కట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొందుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; 12. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివరబిగించిన వెదల్పు బద్ద; 13. అరమగ్గం నిలువు పట్టెకు మేరువు పలకకు బిగించి తాడువడి బిర్రుపెట్టే పుల్ల; 14. కుచ్చు తాడుపుల్ల; 15. నేతమోకును చుట్టే పళ్ళచక్రం తిప్పటానికి చేతిగూటానికి బిగించిన పుల్ల.
సం. శల్య-. ఈటె, బాణం, ముల్లు; ప్రా. చిల్ల-, సల్ల-, సిల్ల. అస్త్ర విశేషం.
< ప్రా. చిల్ల-.

**చిల్లకట్టె** వి. 1. బాలక్రీడా విశేషం. హంస. 3.146; 2. చివరన ఇనపమొన ఉన్న కట్టె; 3. కళ్ళంలో గడ్డిలాగే కర్ర. **చిల్లకట్టి** వి. 1. బాలక్రీడా విశేషం; 2. కళ్ళంలో గడ్డిలాగే కర్ర, కొంకి కర్ర. **చిల్లకొయ్య** వి. అటక అమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క. **చిల్లకోల** వి. 1. చిల్లలుగల బాణం, కర్ణిశరం; పి. శకు. 1.113; 2. బిందిపాలం, విడిచివాటు గుదియ, ఆయుధ విశేషం. ఆం.భా. 2.216; 3. కొరడా, ఐదారు తాళ్ళు విడివిడిగా కల కొరడా. **చిల్లగొంది** (-కొంది) వి. తోమరం (చిన్నయీటె). **చిల్లచీరుకులాడు** అ.క్రి. సయ్యాటలాడు. **చిల్లజీర్కలు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. **చిల్లపుల్ల** వి. పంటె ఆకులు

బిగింపుకు వేసే అడ్డబద్ద. చిల్లపూట వి. కొయ్య చిల్లలు పెట్టి వేసిన పూట. చిల్లలతాడు వి. పడుగు చాపేటప్పుడు, ఊడ్తె అడ్డపట్టెనూ, పడుగేరే కర్రనూ కలిపేతాడు.

చిల్ల[2] వి. 1. పాయ, చీలిక ; 2. ఖండం, ముక్క. విశ. శూన్యమైన, వట్టి.

పో.చూ. సం. శిలా. రాయి ;

క. కెల్లె. చీలిక, చిన్నముక్కలైపోవు ; తు. కెలు. చీలిక ; త. చిల్లి. రాయి మొ. వాటి చిన్న తునకలు.

చిల్లకుండ వి. చచ్చినప్పుడు శిలలదగ్గర కొట్టడానికి వాడేకుండ. చిల్లచెవులు వి.బ.వ. వట్టిచెవులు, ఆభరణాలు లేని చెవులు. చిల్లజగడము వి. పనికిమాలిన జగడము. చిల్లజడ వి. పాయజడ. కకుత్స్థ. 1.120. చిల్లతర్కములు వి.బ.వ. చిల్లరవాదాలు. కు.సం. 8.136. చిల్లపాయ వి. నాలుగైదు పాయలు కలిసి ఒకటిగా ఉండేరకం. చిల్లపెంకు రూ.చూ. చిల్లపెంచు. వి. 1. పగిలిన కుండ మొ. వాటి ముక్క ; 2. మట్టిపాత్రల మీద అలంకారంగా గుర్తులు వేయడానికి సారెమీద మన్ను గోకడానికి ఉపయోగించే చిన్న పెంకుముక్క. చిల్లపెంకుమాత్రము వి. విలువలేనిది. శుక. 1.431. చిల్లపెంచు రూ. చిల్లపెంకు. వి. పగిలిన కుండముక్క మొ. వాటి చిన్నముక్క. బసవ. 3.499. పం. చిల్లపెంచాదిగా క్రి.విశ. పూర్తిగా. బసవ. 3.64. <చిల్లపెంచు + ఆది + కా (అగు[7]). చిల్లాకు వి. ఎంగిలాకు, చిన్న ఆకు.

చిల్ల[3] వి. 1. కతకం, ఇండుగ, వృక్షవిశేషం. ఆం.భా. 2.63 ; 2. సిద్ధకం, వృక్షవిశేషం. ఆం.భా. 2.66 ; 3. నేలల్లో వేరునంటుకొని పెరిగే పసుపుకొమ్ము ; 4. కేశీకంప. ఒక రకం కంచె మొక్క (Comniphora beroyi).

సం. సిద్ధక-. వృక్షవిశేషం ; ప్రా. సిల్లయ-.

క. చిల్ల, చిల్లు, చిత్తు, చలి ; త. ఇల్, ఇల్లమ్, ఇల్లి, ఇల్వ, చిల్లమ్. ఇండుగు చెట్టు, చిల్ల చెట్టు (Strychnos polatarum).

<ప్రా. సిల్లయ-.

చిల్లకంప వి. అందుగు, వేసవిలో పూసే సువాసనగల పసుపుపచ్చ పూలు, మెరిసే నల్లటి పళ్ళుగల ఒక కంచె మొక్క (Comniphora beroyi). చిల్లగింజ వి. ఇండుగు గింజ. వరాహ. 7.29.

చిల్ల[4] వి. ఆడు గద్ద.

ఒ. చిల్లో. గద్ద.

<ఒ. చిల్లో.

చిల్ల[5] వి. పిల్లకాలవ.

చిల్లతుంగ వి. చెమ్మనేలల్లో బాగా పెరిగే తుంగ(Cyperus haspan). చిల్లయిడు స.క్రి. చేలో గండి ఏర్పరచు.

చిల్ల[6] వి. ధూపద్రవ్య విశేషం.

సం. సిహ్లా. ధూపద్రవ్య విశేషం.

చిల్లమడ్డి వి. అందుగు బంకతో చేసిన ధూప ద్రవ్య విశేషం.

చిల్లగొండి రూ.చూ. చిల్లంగిగొండి. వి. కలహశీలుడు, జగడాలమారి.

చిల్లంగి రూ. చిళ్ళంగి. వి. 1. మూలికాదులచేత చేసే ఉచ్చాటనాది క్రియ, కార్మణం ; 2. కలహం, కొంటెతనం ; 3. చేతబడి లాంటిది.

చిల్లంగిగొండి రూ. చిల్లగొండి. వి. కలహశీలుడు, జగడాలమారి. చిల్లంగిచేత వి. 1. మోసం ; 2. కొంటె పని ; 3. చేతబడి. చిల్లంగిచేతలు వి.బ.వ. కొంటె పనులు. సిం.ద్వా. 4.22. చిల్లంగిపొత్తు రూ.చూ. చిల్లంగిపోతు. వి. దయ్యాలుపెట్టేవాడు, దయ్యాలపోతు. చిల్లంగిపోతు రూ. చిల్లంగిపొత్తు. వి. దయ్యాలపోతు, దయ్యాలను పెట్టే స్త్రీ, దయ్యాలను పెట్టే పురుషుడు.

చిల్లము రూ.చూ. చిలుము[2]. వి. గంజాయి గొట్టం.

చిల్లర వి. 1. చిలుకు, అల్పవిశేషం, శేషం. పల్నా. 106 ; 2. చింతపండు, మిరపకాయ మొ. అల్ప సంభారం, సామాన్యపు సరుకు. రాజవా. 2.69 ; 3. దుష్ట కృత్యం, చెడ్డపని. కువ.చ. 3.7 ; 4. చిన్న నాణేల మొత్తం ; 5. నత్తకాయ బాపతు. విశ. సామాన్యమైన, క్షుద్రమైన. తుచ్ఛమైన. ఉ.రా. 4.335.

క. చిల్లఱ, చిల్లఱె, చిల్లె. అల్పత్వం, చిన్నతనం, విభాగాలు, రూపాయి కంటే తక్కువ దర గల సొమ్ము ; చిలవాన్. చిల్లర డబ్బులు ; తు. చిల్లరె. చిల్లర, స్వల్పం ; త. చిల్లఱై. నానావిధాలైన చిల్లర వస్తువులు, విభజింపబడ్డ పరిణామాలు, చిల్లర సొమ్ము ; చిల్వానమ్. స్వల్పమైన, చిల్లరమైన, ఇంటి ఖర్చులో మిగిలిన చిల్లర ; మ. చిల్లఱ. చిన్న, అల్పమైన విషయం ; కో. చిల్ట్. పూర్ణ సంఖ్యలో స్వల్ప సంఖ్య ; తొ. సిలొర్. వెండి, చిల్లర.

చిల్లరకాడు వి. చిల్లరవాడు, సామాన్యుడు. చిల్లర చితుకగు అ.క్రి. రాసికి రంగానికి రానట్లయిపోవు. చిల్లర జనము వి. కూలినాలి చేసుకునేవారు, చిల్లరవాళ్ళు. చిల్లర దుకాణము వి. కిరాణా దుకాణం, టోకున కాకుండా విడి విడిగా వస్తువుల్ని అమ్మే దుకాణం. చిల్లరదేవుళ్లు వి.బ.వ. చిన్న చిన్న దేవుళ్ళు. శ్రీనాథుని చాటువు. చిల్లరపబ్బములు వి.బ.వ. చిన్న చిన్న శుభకార్యాలు. శుక. 2.521. చిల్లర బేరము వి. చిన్న బేరం. చిల్లరబేరగాడు వి. అమాంత గాడు, చిల్లర వస్తువుల్ని బేరం చేసేవాడు. చిల్లరమోపు వి. కొంచెంపాటి కట్ట లేక మూట. ద. హిం. శా. సంపు. 4. శా.సం. 935. క్రీ.శ. 1269. చిల్లరమ్ము వి. చిల్లకోల, తూట్లుకల అమ్ము. రా. వి. 3.65. <చిల్లర + అమ్ము. చిల్లరరాయి వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క. చిల్లరవాడు విశ. చిల్లరకాడు, సామాన్యుడు. ఆం.భా. 3.16. చిల్లరవారు విశ. బ.వ. అల్పులు. తక్కువ కులాల వారిని పూర్వం అనేవారు. భాస్క.రా. 75, పల్నా. 5. చిల్లరవాసం వి. మారుజాతి, కొయ్యవాసం. చిల్లరవెచ్చములు వి.బ.వ. పప్పు బియ్యం మొదలైన వస్తువులు. శుక. 2.183. చిల్లరషరకస్తులు వి.బ.వ. వివిధ సామాన్య వర్తక వస్తువులపై విధించే సుంకాలు. నెల్లూరు శాసనాలు. 105. క్రీ.శ. 1571. చిల్లరసంసారులు వి.బ.వ. తక్కువ డబ్బుకల

కుటుంబాలవారు. **చిల్లరసేయు (-చేయు)** స.క్రి. కలచు, కలవరపెట్టు. శుక. 3.535.

**చిల్లాకట్టి** వి. బిళ్ళంగోడు ఆట, కోడుబిళ్ళ.

**చిల్లాకు** చూ. చిల్ల[2].

**చిల్లాడము** రూ.చూ. చిల్లాణము. వి. వంకర కత్తి, బాకు.

**చిల్లాడు** స.క్రి. చెదరగొట్టు. అ.క్రి. తొలగిపోవు.

**చిల్లాణము** రూ. చిల్లాడము. వి. క్రరశస్త్రం, బాకు. చంద్రాంగ. 2.89.

క. చిల్లాణ. చిన్న బాకు.

**చిల్లాపల్లా** వి. చెల్లాచెదరు.

**చిల్లి** రూ. చిల్లు[2]. వి. తూటు, రంధ్రం. వైజ. 3.123.

సం. ఛిద్ర-, చిద్ర-. రంధ్రం; ప్రా. ఛిల్ల-; అమా. జైమహా. శౌర. ఛిల్ల.

క. జల్లి. మట్టి పాత్రలోని తూటు; త. ఇల్లి, చిల్లి; మ. చిల్లికుక్కత్తు. చిన్న రంధ్రం.

<ప్రా. ఛిల్ల-.

**చిల్లికడవ** వి. సారాగూనపై బోర్లించి పెట్టే రంధ్రం కలిగిన మట్టికుండ. **చిల్లిచీమ** వి. ఒక జాతి చేప. **చిల్లిపడు** అ.క్రి. రంధ్రం అగు, బెజ్జంపడు. **చిల్లిపోవు** అ.క్రి. రంధ్రాలు పడు. **చిల్లులుపడు** అ.క్రి. తూట్లుపడు. **చిల్లులు పుచ్చు** రూ.చూ. చిల్లులువుచ్చు. స.క్రి. తూట్లుపడజేయు. **చిల్లులుపెనం** వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజి వార్పుకు వాడే రెండంచులు కలిగిన మట్టిమూకుడు. **చిల్లులు మూకుడు** వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజి వార్పుకు వాడే రెండంచులు ఉండే మట్టిమూకుడు. **చిల్లులు వుచ్చు (-పుచ్చు)** రూ. చిల్లులుపుచ్చు. స.క్రి. తూట్లు పడజేయు. ఆము. 2.13. **చిల్లులువోవు (-పోవు)** అ.క్రి. తూట్లుపడు. శృం.నై. 4.24.

**చిల్లిక** వి. చిమ్మలు, ఇలకోడి.

సం. ఝిల్లికా. ఈలపురుగు.

<సం. ఝిల్లికా.

**చిల్లికోల** వి. విరదాడు, చిరతలబుడ్డి వాళ్ళు దండ మీదుగా కొట్టుకొనే మొదలు లావు చివర సన్నంగా పేనిన తాడు.

**చిల్లు**[1] వి. **1.** నీరు, చమురు మొ. పైకి చిమ్మటం మొ. వాటి ధ్వనికి అనుకరణం. కళా. 2.9; **2.** నరిచేసేటప్పుడు పడుగుమీద గంజి చిలకరించటం.

**చిల్లు**[2] రూ.చూ. చిల్లి. వి. రంధ్రం, కన్నం.

**చిల్లుపొల్లు** వి. చిందర వందర. కృష్ణ. 3.30. **చిల్లుపొల్లు సేయు (-చేయు)** స.క్రి. ధ్వంసంచేయు. కృష్ణ. 3.30. **చిల్లులగంటి** వి. చిల్లులుగల లోతులేని వెడల్పు గరిటె. **చిల్లుసెల్లులు** వి.బ.వ. పనికిరానివి లేదా పనికి వచ్చేవి.

**చిల్లుల్లి** వి. చిల్లపాయ.

**చిల్లెరగాళ్ళు** చూ. చిల్లరవారు. వి.బ.వ. తక్కువకులాలవారు.

**చిల్లోటి** వి. ఒక విధమైన డాలు, ఖేటక విశేషం. ఆం.బా. 2.216.

**చిల్లోటికేడము** రూ.చూ. చిల్లోటికేవడము. వి. ఒక రకం డాలు. **చిల్లోటికేవడము** రూ. చిల్లోటికేడము. వి. ఒక విధమైన డాలు.

**చిల్వ**[1] రూ.చూ. చిలువ[1]. వి. నోటిలో విషం గలది, పాము. మను. 3.62.

**చిల్వకన్నియ** రూ.చూ. చిలువకన్నియ. వి. నాగకన్య. **చిల్వగట్టు** రూ.చూ. చిలువగట్టు. వి. శేషశైలం. **చిల్వగట్టు దొర** రూ.చూ. చిలువగట్టుదొర, శ్రీ వేంకటేశ్వరస్వామి. **చిల్వగమికాఁడు** వి. సర్పరాజు, శేషుడు. అచ్చ.రా.యు. 15. **చిల్వజగము** రూ.చూ. చిలువజగము. వి. నాగ లోకం, పాతాళం. **చిల్వజందెపుమేటి** రూ.చూ. చిలువ జందెపుమేటి. వి. **1.** శివుడు; **2.** గణపతి. **చిల్వటెంకి** రూ.చూ. చిలువటెంకి. వి. వల్మీకం, పుట్ట. **చిల్వతాలుపు** రూ.చూ. చిలువతాలుపు. వి. శివుడు. **చిల్వతాలుపుబత్తశిక** రూ.చూ. చిలువతాలుపు బత్తశిక. వి. సముద్రం. వ్యు. ఈశ్వరుడి అమ్ములపొది. **చిల్వతాల్పు** రూ.చూ. చిలువ తాలుపు. వి. నాగభూషణుడు, శివుడు. **చిల్వతాల్పువేల్పు వలపుటింతి** రూ.చూ. చిలువతాల్పువేల్పు వలపుటింతి. వి. పార్వతి. **చిల్వతిండి** రూ.చూ. చిలువతిండి. వి. **1.** గరుత్మంతుడు; **2.** నెమలి. **చిల్వదొర** రూ.చూ. చిలువ దొర. వి. సర్పరాజు, వాసుకి. **చిల్వపట్టు** రూ.చూ. చిలువ పట్టు. వి. వల్మీకం, పుట్ట. **చిల్వపానుపుదంట** రూ.చూ. చిలువపానుపుదంట. వి. విష్ణువు. **చిల్వమల** రూ.చూ. చిలువమల. వి. శేషాచలం, తిరుపతికొండ. **చిల్వమలఱేఁడు** రూ.చూ. చిలువమలఱేఁడు. వి. శేషాచలపతి, వేంకటేశ్వర స్వామి. **చిల్వమేఁత** రూ.చూ. చిలువమేఁత. వి. గాలి. **చిల్వమేఁతరి** రూ.చూ. చిలువమేఁతరి. వి. పాములు ఆహారంగాగలవాడు. **చిల్వమేపరి** రూ.చూ. చిలువమేపరి. వి. గరుడుడు. **చిల్వమేపరిపచ్చ** రూ.చూ. చిలువమేపరిపచ్చ. వి. గరుడపచ్చ, మణివిశేషం. **చిల్వరాయఁడు** రూ.చూ. చిలువరాయఁడు. వి. సర్పరాజు. **చిల్వఱేఁడు** రూ.చూ. చిలువఱేఁడు. వి. సర్పరాజు. **చిల్వలగమికాఁడు** రూ.చూ. చిలువలగమికాఁడు. వి. శేషుడు, సర్పరాజు. **చిల్వలదొర** రూ.చూ. చిలువలదొర. వి. ఫణిరాజు, శేషుడు. **చిల్వసొమ్ము** రూ.చూ. చిలువసొమ్ము. వి. సర్పభూషణుడు, శివుడు. **చిల్వసొమ్ముములికి** వి. రౌద్రాస్త్రం. పాశుపతాస్త్రం. భాస్క. రా.యు. 1049.

**చిల్వ**[2] రూ.చూ. చిలువ[2]. వి. అడవి పొట్టిబాతు.

**చిల్వ**[3] రూ.చూ. చిలువ[3]. విణ. కొద్ది.

**చిల్వానము** రూ.చూ. చిలువానము. వి. **1.** ఇంటివాడుకపు సరుకు; **2.** కూడబెట్టిన ధనం.

**చిల్వాయనము** రూ.చూ. చిలువాయనము[1]. విణ. క్షుద్రమైన; వి. చిల్లర.

**చిల్వాలు** రూ.చూ. చిలువాలు. వి. ఇగరకాచిన పాలు.

**చిళ్ళ** విణ. చీలిన. వి. కొన, అంచు, పంగ.

క. చిళ్ళె. రెండుపాయలవటం, భాగం, పాయ (రెండు కొమ్మలు చీలినట్లు); కొ. చిల్. చెట్టు కొమ్మ, నది పాయ; చిల్ కట్. రెండుగా చీలిక ఉన్న కొమ్మ.

**చిళ్ళకోల** వి. అనేక దారులుకల చౌకు.

**చిళ్ళంగి** రూ.చూ. చిల్లంగి. వి. కోయజాతులవారు మనిషిని అడవి జంతువుగా మార్చే క్షుద్ర విద్య, చేతబడి.

**చిళ్ళచెట్టు** వి. కతకం, ఇండుగ.

**చివక**[1] వి. సన్నంగా నిడుపుగా ఉండే చిన్నకొమ్మ, ఉపశాఖ, చివ్వ. ఆం.బా. 2.37.

**చివక**[2] రూ.చూ. చివుక[1]. వి. పావలా.

**చివకట్టు** వి. 1. మరమగ్గం దొమ్మకు, నిలువ పట్టెకు ఏట వాలుగా బిగించిన కర్ర; 2. తిరుగుడు కర్ర గుబ్బ; 3. దండెను మోసే వంగల కొయ్య.

<చివ్వ[2]+కట్టు.

**చివగెడ** వి. ఆయుధ విశేషం.

**చివంగి** రూ.చూ. చివ్వంగి. వి. చిరుతపులి.

**చివఁగి** రూ.చూ. చివ్వంగి. వి. తరక్షువు, సివంగి.

**చివచివ** వి. శీఘ్రగమనాదుల్లో అయ్యే ధ్వనికి అనుకరణం. రామాభ్యు. 4.90. ధ్వన్యను.

**చివచివగా** క్రి. విశ. ప్ర. గబగబా. కళా. 8.95. <చివచివ+అగు[7]. **చివచివలాడవు** అ.క్రి. అరమరిక లేకపోవు. రాధికా. 4.102. <చివచివ+-లు+ఆడవు.

**చివర** వి. 1. అగ్రం, కొన, తుద, అంతం. కాశీ. 2.12; 2. ఉపశాఖ. ఆం.బా. 2.37; 3. అచ్చు కట్టేటప్పుడు అని వెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్నబెత్తం; 4. దండె దగ్గరి పడుగు పోగులు నెరపటానికి అచ్చు దగ్గర నేత పడుగులో దూర్చిన సన్నబెత్తం; 5. దోనుగకు బిగించే బద్దలో దూర్చిన సన్నబెత్తం; 6. పట్టుమగ్గం బిగింపుకోసం మడిగూటానికి పగ్గంతో నేసిన కొలికి.

**చివరతాడు** వి. నవలక్ష గుండు వేలాడదీసిన దారం. **చివరది** విశ. కడపటిది, కడగొట్టుది. <చివర+అది. **చివరరాయి** వి. నవలక్షగుండు. **చివరలాక** వి. నేత పడుగులో చువ్వ వెంబడి దూర్చిన వెదురుబద్ద. **చివరిబద్దె** వి. బట్టలో చివరివైపు నేసి వదిలిన బద్దె. **చివర్లకమ్మి** వి. ఒకరకం చీరకమ్మి. **చివర్లుకట్టు** వి. చీర కమ్మికి రెండు వైపులా రెండేసి పోగులు (గీరలు) వచ్చేట్టు నెయ్యడం.

**చివరిబద్దె** చూ. చివర.

**చివర్లకమ్మి** చూ. చివర.

**చివర్లుకట్టు** చూ. చివర.

**చివాలున** రూ. చివాల్న. క్రి. విశ. ప్ర. తటాలున, అతి శీఘ్రంగా. అప్ప. 1.14.

**చివాల్న** రూ.చూ. చివాలున. క్రి.విశ.ప్ర. ఒక్కఉదుటున, ఒక్కసారిగా.

**చివికిపోవు** చూ. చివుకు[2].

**చివికివెలమ** వి. కాకజంఘ, వెలమసంది, వృక్షవిశేషం. ఆం. బా. 2.66.

**చివిరించు** చూ. చివురు.

**చివుక**[1] రూ. చివక[2]. వి. రూపాయిలో నాలుగోవంతు, పావలా.

**చివుక**[2] రూ.చూ. చీవుక. వి. ఒకజాతి గబ్బిలం.

**చివుకపిట్ట** వి. ఒకజాతి గబ్బిలం, జతుక. **చివుకపిల్లి** వి. గబ్బిలంలాగ రెక్కలు కలిగి పిల్లిలా ఉండే జంతువు.

**చివుకంతయుఁబోవు** చూ. చివుకు[2].

**చివుకు**[1] రూ. చివుక్కు. వి. 1. మనసు నొొచ్చడంలోని అనుకరణం. పరాహ. 11.71; 2. పైకి లేవడం (ఎగయటం)లోని అనుకరణం. విష్ణు పు. 2.

**చివుకుచివుక్కను** అ.క్రి. మనసు బాధపడు. రాధికా. 4.102. <చివుకు[1]+చివుక్కు+అను.

**చివుకు**[2] అ.క్రి. 1. కృశించు, చిక్కు, క్షీణించు. భార.అరణ్య. 1.211; 2. క్షోభించు, కలగు. భార.శాంతి. 1.197; 3. (తడవటం, పాతబడటంవల్ల) సారహీనమగు, జీర్ణమగు విజ్ఞా. ఆచా. 129; 4. చచ్చు. హరి.పూ. 2.196. విశ. చీకిన, నిస్సారమైన, జీర్ణమైన. మొల్ల. బాల. 93.

త. చీఙ్, చీత్తై. కుళ్ళిన, చెడిన; మ. చీక, చీన్నుక. చెడు, పాడగు; చీకుక. చెడిన; కో. కిట్. పాడగు; కొలా. సివ్క్; కురు. కిట్ట్; మాల్తో, కిట్.

మూ.ద్రా. *కిప్-/ *కీ-.

**చివికిపోవు** అ.క్రి. సారహీనమై చెడు. **చివుకంతయుఁబోవు** అ.క్రి. సారంపోవు. హంస. 2.138. **చివుకుచెదారము** వి. మిక్కిలి చివికినది, బాగా శిథిలమైనది. చంపూ రా. 3.146.

**చివుక్కను** చూ. చివుక్కు.

**చివుక్కు** రూ.చూ. చివుకు[1]. వి. 1. (మనస్సు) నొొచ్చడంలో అనుకరణం. కళా. 3.47; 2. ఎక్కడం, దాటడం మొ. వాటిలో అనుకరణం. కళా. 5.111.

**చివుక్కను** అ.క్రి. హఠాత్తుగా మనస్సు కలతపొందు. <చివుక్కు+అను. **చివుక్కునదాఁటు** స.క్రి. ఒక్క ఉదుటులో లంఘించు. కవిక. 2.70. **చివుక్కునెక్కు(-ఎక్కు)** స.క్రి. ఒక్క ఉదుటులో ఎక్కు. హంస. 1.192. **చివుక్కుమను** అ.క్రి. చివుక్కను, మనస్సుకు బాధ కలుగు. <చివుక్కు+అను. **చివుక్కురు** వి. మనసు నొవ్వటంలో అయ్యేదానికి అనుకరణం. కళా. 3.47, ప్రభా. 3.92. **చివుక్కురుమను** అ.క్రి. చివుక్కను, అక్కిలిపడు. <చివుక్కురు+అను.

**చివురాకు** చూ. చివురు.

**చివురాకుఁదిండి** చూ. చివురు.

**చివురు** రూ.చూ. చిగురు[1]. వి. 1. పల్లవం, కిసలయం. కు. సం. 5.162; 2. గడప, అరుగు మొ॥ వాటికి ముగ్గులో పెట్టే అలంకార విశేషం; 3. దంతాలకు చుట్టూ, గోళ్ళ కింది ఉండే మెత్తని మాంసం. విశ. లేతయైన.

**చివిరించు** రూ.చూ. చిగురించు. అ.క్రి. 1. పల్లవించు, చిగురుతొడుగు. చంద్రికా. 4.37; 2. వర్ధిల్లు. **చివురాకు** రూ.చూ. చిగురాకు. వి. లేతాకు, పల్లవం. శివ రా. 3.118. **చివురాకుఁదిండి (-తిండి)** రూ. చిగురాకుఁదిండి. వి. పికం, కోయిల. చంద్రాంగ. 4.191. **చివురుఁగెమ్మోవి** వి. చిగురు వంటి ఎర్రని పెదవి. శృం.నై. 8.47. <చివురు+కెమ్మోవి. **చివురుఁగైదువుజోదు** రూ. చిగురుఁగైదువుజోదు. వి. మన్మథుడు. శృం.నై. 3.35. <చివురు+కైదువుజోదు. **చివురుఁజేకత్తివజీరుఁడు** వి. చిగురు చేత ఆయుధంగా కలవాడు, మన్మథుడు. హంస. 2.170. <చివురు+చేకత్తి వజీరుఁడు. **చివురుటాకు** రూ.చూ. చిగురాకు. వి. లేతాకు, పల్లవం. <చివురు+ఆకు. **చివురుఁబోఁడి** రూ.చూ. చిగురుంబోడి. వి. చిగురులాగ మనోజ్ఞమైన ఆడది, స్త్రీ. **చివురురంగు** వి. నలుపులో ఎరుపు వన్నె కలిసినది. **చివురులొత్తు** చూ.

చిగురొత్తు. అ.క్రి. **1.** చిగుర్చు, పల్లవించు. కు.సం. 5.162 ; **2.** అతిశయించు. మను. 6.29 ; **3.** అంకురించు, మొలకెత్తు, పుట్టు, కలుగు ; **4.** వికాసంపొందు ; **5.** అనురక్తమగు. **చివురువిలుకాఁడు** రూ.చూ. చిగురువిల్కాఁడు. వి. చిగురు విల్లుగా కలవాడు, మన్మథుడు. అచ్చ.రా.అయోధ్య. 40. **చివురువిల్తుఁడు** రూ. చిగురువిల్తుఁడు. వి. చిగురు విల్లుగా కలవాడు, మన్మథుడు. మృత్యు. 2.63. **చివురొత్తు** రూ.చూ. చిగురొత్తు. అ.క్రి. **1.** వికాసంపొందు. హరి.ఉ. 4.192 ; **2.** అంకురించు, మొలకెత్తు, పుట్టు, కలుగు ; **3.** అతిశయించు ; **4.** చిగుర్చు, పల్లవించు ; **5.** అనురక్తమగు.

**చివురొత్తు** చూ. చివురు.

**చివ్వ**[1] వి. యుద్ధం, కలహం. భార.ఉద్యో. 1.297.

**చివ్వకుఁగాలుద్రవ్వు(-త్రవ్వు)** అ.క్రి. యుద్ధానికి సిద్ధమవు. హరిశ్చ. 1.102. **చివ్వకుచేచాఁపు** అ.క్రి. కయ్యానికి కాలుదువ్వు. **చివ్వకుఁజేసాఁచు(-చాఁచు)** అ.క్రి. కయ్యానికి కాలుదువ్వు, యుద్ధానికి సిద్ధమగు. కాశీ. 1.109. **చివ్వపట్టు** వి. యుద్ధరంగం. అచ్చ.రా.సుందర. 108. **చివ్వరేఁగు** అ.క్రి. తగాదాపడు. **చివ్వలయోగిరపుఁదపసి(-తపసి)** వి. కలహాశనముని, నారదుడు. పారి. 5.84. **చివ్వలాడు** అ.క్రి. పోట్లాడు, చివ్వరేగు. **చివ్వలాఁడి** వి. కలహశీలురాలు. హరిశ్చ. 4.117.

**చివ్వ**[2] వి. **1.** సన్నంగా, పొడుగ్గా ఉండే రివ్వ, చువ్వ, ఉపశాఖ, చివక. ఆం.భా. 2.37 ; **2.** ఈటె. సాంబ. 2.43 ; **3.** ఒకవిధమైన బాణసంచు. రసిక. 6.191 ; **4.** వానం ; **5.** నూలులెక్క ; **6.** పడుగులో చివర మల కర్రతోబాటు ఎక్కించిన సన్నపుల్ల.

క. చీవు, చివ్వు. సన్నగా కోయు, క్షౌరంచేయు, గోకు, గోళ్ళు కత్తిరించు ; త. చీ(-వ్వ్-, -న్ట్-). గోకు ; చీవు(చీవి-). చెక్కుతీయు, గొరుగు, చెక్కు ; చీవల్. చెక్కు, గొరుగు ; మ. చీక. గోకు, చెక్కు, నునుపుచేయు ; చీవుక. చెక్కు, గోకు, నునుపుచేయు.

**చివ్వగడ** వి. బల్లెం, ఈటె. **చివ్వగుండు** వి. నవలక్కగుండు. **చివ్వతొక్కు** స.క్రి. **1.** దోనెగాడిలో బద్దెచువ్వ దూర్చు ; **2.** పడుగులో అచ్చుదగ్గర కర్ర దూర్చు ; **3.** నరిచేసేటప్పుడు పడుగులో కర్రలు దూర్చు. **చివ్వదగిలించు (-తగిలించు)** స.క్రి. దోనెగాడిలో బద్దెచువ్వ దూర్చు. **చివ్వలతడిక** వి. చివ్వలతో చేసిన తడక, ఒకానొక వేటసాధనం. చంద్రభా. 2.21. **చివ్వలేరు** స.క్రి. అనిపక్కన దూర్చిన పడుగు చువ్వలమీద పోగులు నెరుపు. <చివ్వ[2]+-లు+ఏరు. **చివ్వవెదురు** వి. ఒకానొక వేట సాధనం. శుక. 1.165.

**చివ్వంక** వి. కొంచెపాటి వంకర. కు.సం. 9.312. చివ్వంక <చిర్వంక <చిఱువంక.

**చివ్వంగి** రూ. చివంగి, చివఁగి, చివ్వఁగి, సివంగి, సివఁగి, సివ్వంగి, సివ్వఁగి. వి. చిరుతపులి. ఆము. 4.193.

క. సివంగి. చిరుతపులి, Tiger Wolf ; త. చివింకి. భారతదేశపు అడవిపిల్లి, సివంగి, వేటాడబడే చిరుతపులి ; మ. చివిన్ని. వేటాడబడే చిరుతపులి.

**చివ్వఁగి** రూ.చూ. చివ్వంగి. వి. తరక్షువు, సివంగి.

**చివ్వు**[1] స.క్రి. **1.** గీకు, గీచు. కాశీ. 3.50 ; **2.** చెక్కు. కువ.చ. 4.207, పరమ. 1.127 ; **3.** ఖండించు, తుంచు, నరకు. కళా. 1.76 ; **4.** రువ్వు. రాజ.చ. 2.149.

క. చివ్వు, చీవ్రు. సన్నగా కోయు, చెక్కు, గీరు ; సిగుర్, సిబుఖు, సివుఖు, సివ్రుఖు. చెక్కినట్టి ; త. చీవు. చెక్కు, నునుపుచేయు, తలదువ్వు ; మ. చీవు, చీవుకు. చెక్కు.

**చివ్వు**[2] స.క్రి. చెలువు.

**చివ్వుచివ్వున** చూ. చివ్వున.

**చివ్వున** రూ. జివ్వున. క్రి.విశ.ద్రు. శీఘ్రంగా. భార. మౌసల. 181.

**చివ్వుచివ్వున** క్రి.విశ.ద్రు. అతిశీఘ్రంగా.

**చిసోరు** వి. పిట్టగోడమీద పత్తింపుగోడ.

**చీ** అవ్య. **1.** ధిగర్థకం. భార.సభా. 2.185 ; **2.** నింద ; **3.** ఈసడింపు.

క. చీ. నింద ; తు. చీ, చిచీ, ఛీ, ఛీఛీ ; త.ను. చీ.

**చీకొట్టు** స.క్రి. చీచీ అను, గర్హించు, ధిక్కరించు. కుచే. 2.32. **చీచీ** అవ్య. **1.** ధిగర్థకం ; **2.** నిందను తెలిపే చీ శబ్దంయొక్క ఆమ్రేడిత శబ్దరూపం ; **3.** ఈసడింపును తెలిపే చీ శబ్దంయొక్క ఆమ్రేడిత శబ్దరూపం.

**చీకటి** వి. **1.** అంధకారం, తమస్సు. కు.సం. 2.198 ; **2.** దుఃఖం. సిం.ద్వా. 6 80 ; **3.** రాత్రి, చీకటికల రేయి. భాగ. 1.161.

గోం. సికాటీ. గాఢాంధకారం ; కొండ. సికటి. అంధకారం ; పర్జి. చికొడ్. అంధకారం ; కొలా. చీకటి. అంధకారం ; గద.ఒల్లా. సీకట్. అంధకారం.

**చీకటికండ్లు** వి.బ.వ. వెలుతురు చూడగానే కుంచించుకొని పోయే కళ్ళు. **చీకటిగాము** వి. గ్రహం, రాహువు, తమోగ్రహం. **చీకటిగుండెదిగులు** వి. సూర్యుడు. వేంక. ఆం. 12. **చీకటిగుయ్యారం** వి. దట్టమైన చీకటి. **చీకటిగొంగ** వి. సూర్యుడు. భాగ. 9.8. వ్యు. చీకటి యొక్క శత్రువు. **చీకటిగొను (-కొను)** అ.క్రి. అంధకారమయమగు. మను. 4.97. **చీకటిచెట్టు** వి. తమాల వృక్షం. **చీకటితప్పు** వి. జారత్వం, రంకు, వ్యభిచారం, చీకట్లో చేసే తప్పు. శృం.నై. 7.42. **చీకటితప్పుచేయు** అ.క్రి. వ్యభిచరించు. కాశీ. 2.80. **చీకటిత్రవ్వు** స.క్రి. **1.** వ్యర్థాలోచనలుచేయు. శాల్ల. సం. 4.53 ; **2.** వ్యర్థప్రయత్నంచేయు. శాల్ల. సం. 6.182. **చీకటిదొనఁగు** వి. చీకటి(లోచేసే) తప్పు, రంకు. **చీకటిపడు** అ.క్రి. **1.** ఇరులుకొను, అంధకారమగు ; **2.** మన్ను అగు. **చీకటిపాలగు** అ.క్రి. **1.** వ్యర్థమగు. శాల్ల. సం. 8.30 ; **2.** పాడగు. **చీకటిమడి** వి. నగ్నంగా ఉంటూ ఊరగాయ మొ. వాటిని ముట్టుకొనేఆచారం. **చీకటిమడికట్టు** అ.క్రి. దినమొలతో ఉండు. **చీకటిమిత్తి** వి. చంద్రుడు, చీకటి వేరువిత్తు. **చీకటిమొటికిల్లు** వి.బ.వ. చీకటి మొట్టికాయలు, బాల్య క్రీడా విశేషం. విష్ణు పు. 7.202. **చీకటిమొటికాయ** రూ.చూ. చీకటి మొట్టికాయ. వి. బాల క్రీడా విశేషం. ముఖంమీద గుడ్డవేసి

కనబడకుండా చేసి మొట్టిన వాళ్ళెవరో చెప్ప మనే ఆట. హంస. 3.146. **చీకటిమొట్టికాయ** రూ. చీకటి మొటికాయ. వి. బాల క్రీడా విశేషం. ముఖంమీద గుడ్డవేసి కనబడ కుండా చేసి మొట్టిన వాళ్ళెవరో చెప్పమనే ఆట. కువల. 1.78. **చీకటిమ్రాను** వి. చీకటిచెట్టు, తమాలం. యయా. 4.4. **చీకటియీఁగ** రూ.చూ. చీకటీఁగ. వి. **1.** నల్ల ఈగ ; **2.** చిన్నదోమ. < చీకటి + ఈఁగ. **చీకటిరేయి** వి. చీకటి రాత్రి, తమిస్ర. **చీకటివిరిచుక్క** వి. శుక్రుడు, వేగుచుక్క. ద్వి.పరమ. 7.530 ప. 7 పం. **చీకటివేరువిత్తు** వి. చంద్రుడు. ఆం.నా.సం. 1.15. వ్యు. చీకటిని నాశనం చేసే వాడు. **చీకటీఁగ** రూ. చీకటియీఁగ. వి. **1.** రాత్రుల్లో పశువులమీద వాలి నెత్తురు తాగే నల్లటి ఈగ ; **2.** గాలి కాలంలో కళ్ళచుట్టూ ముసిరే చిన్న పురుగు, చిన్నదోమ. **చీకటులగొంగ** రూ. చీకట్లగొంగ. వి. సూర్యుడు. సాంబ. 1.9. వ్యు. చీకట్ల శత్రువు. **చీకటులమిత్తి** రూ. చీకట్లమిత్తి. వి. చంద్రుడు. సాంబ. 1.10. వ్యు. చీకట్ల మృత్యువు. **చీకటులుక్రమ్ము** అ.క్రి. కళ్ళుచైర్లకమ్ము. **చీకటులుత్రవ్వించు** స.క్రి. అనవసరంగా శ్రమపడేటట్లుచేయు. వరాహ. 2.18. **చీకటులుత్రవ్వు** రూ. చీకట్లు త్రవ్వు. అ.క్రి. నేరాలు వెదకు. **చీకట్లగొంగ** రూ.చూ. చీకటుల గొంగ. వి. సూర్యుడు. **చీకట్లమిత్తి** రూ.చూ. చీకటులమిత్తి. వి. చంద్రుడు. **చీకట్లుగొను (-కొను)** అ.క్రి. అంధకారమయ మగు, చీకటితో నిండు. కళా. 4.88. **చీకట్లుగొలుపు (-కొలుపు)** అ.క్రి. అంధకార బంధురమగు. జైమిని భా. 2.70. **చీకట్లుత్రవ్వు** రూ.చూ. చీకటులు త్రవ్వు. అ.క్రి. నేరాలు వెదకు.

**చీకటీఁగ** చూ. చీకటి.

**చీకటులగొంగ** చూ. చీకటి.

**చీకటులమిత్తి** చూ. చీకటి.

**చీకటులుక్రమ్ము** చూ. చీకటి.

**చీకటులుత్రవ్వించు** చూ. చీకటి.

**చీకటులుత్రవ్వు** చూ. చీకటి.

**చీకట్లగొంగ** చూ. చీకటి.

**చీకట్లమిత్తి** చూ. చీకటి.

**చీకట్లు** చూ. చీకటి. వి.బ వ. ఆభరణ విశేషం.

**చీకట్లుగొను** చూ. చీకటి.

**చీకట్లుగొలుపు** చూ. చీకటి.

**చీకట్లుత్రవ్వు** చూ. చీకటి.

**చీకర** వి. బాణం. కృ.శకు. 2.197.

**చీకరపుల్లవేళ్ళు** వి. కుంచె పురికి వాడే చీపురుమొక్క వేళ్ళు.

**చీకరి** రూ.చూ. చీకిరి. విశే. మిరుమిట్లు గొలిపేటటువంటి.

**చీకరించు** రూ.చూ. చీకిలించు. అ.క్రి. మిరుమిట్లుగొను.

**చీకాకు** చూ. చీకు[2].

**చీకాకుచేయు** చూ. చీకు[2].

**చీకాకుపడు** చూ. చీకు[2].

**చీకాకుపఱచు** చూ. చీకు[2].

**చీకాకుపఱుచు** చూ. చీకు[2].

**చీకాయ** రూ.చూ. సీకాయ. వి. ఒక రకం చెట్టు.

**చీకికట్టె** వి. ఆము కాల్చుటకు వాడే చీకిచెట్టు కఱ్ఱ.

**చీకిచెట్టు** వి. ముళ్ళు కలిగిన ఒకానొక చెట్టు.

**చీకినూఁగు** రూ. సీకినూగు. వి. నువ్వు మొక్కలా ఉండే ఒక రకం కలుపు మొక్క.

**చీకిరి** రూ. చీకరి. విశే. మిరుమిట్లు గొలిపేటటువంటి.

**చీకిరికండ్లు** వి.బ.వ. వెలుతురు చూడగనే మూసుకొని పోయే కళ్ళు. **చీకిరించు** రూ.చూ. చీకిలించు. అ.క్రి. మిరుమిట్లుగొను. **చీకిరిమాకిరి** విశే. కొక్కిరి బిక్కిరి.

**చీకిరేణి** రూ.చూ. చీకిరేను. వి. వృక్ష విశేషం. దీన్నే 'చిగర, చికిరేని, చీగర, నల్లరేగు' అని కూడా పిలుస్తారు.

**చీకిరేను** రూ. చీకిరేణి. వి. ఒకానొక చెట్టు. వేంక. పంచ. 4.522 (Abbizzia amarakush).

క. సీగె. కాయలను తలంటు స్నానానికి వాడే ఒక రకం చెట్టు ; తు. సీగె, సీగె-కాయి ; త. చీ-క్కాయ్, చీయ-క్కాయ్, చికైక్కాయ్ ; మ. చీక్క-క్కాయి, చీయ-క్కాయి ; తొ. సిక్స్.

**చీకిలి** వి. చీపురుకట్ట, సమ్మార్జని ; క్రి.విశే.క్రు. కొక్కిరి బిక్కిరిగా.

క. చీపరి, చీపురుకట్ట ; కొడ. చీ.పె. చీపురుకట్ట ; త. చీ. శుభ్రంచేయు, కడుగు, ఊడ్చు, చీవు. శుభ్రంగా ఊడ్చటం, చీక్కు. చెత్త, తుక్కు ; మ. చూల్. చీపురుకట్ట ; తొ. కి.ప్. చీపురుకట్ట ; గోం. సైయానా, సైత్తానా, హేయానా. ఊడ్చటం ; కొండ. సి.ప. చీపురుకట్ట, సిపెర్. చీపురుకట్ట ; కుఇ. సేప. ఊడ్చటం, సేపెరి. చీపురుకట్ట; కువి. హెపలి, హేపినై. ఊడ్చటం, హెపారి, హెర్పొరి. చీపురుకట్ట; పర్జి. చేపిద్. చీపురుకట్ట; గ.ఒల్లా. సెపెట్, చేపేద్, సిపె. చీపురుకట్ట ; కురు. చీఁచ్నా, చిఁచ్‌నా. తుడిచివేయటం ; మాల్తో. చిచె. తుడపటం, శుభ్రంచేయు, చెలక. గడ్డితో చేసిన చీపురుకట్ట.

**చీకిలిమాకిలి** విశే. వంకర టింకర, కొక్కిరిబిక్కిరి. అల్లిబిల్లి. సారంగ. 1.15.

**చీకిలించు** రూ. చికిరించు, చికిలించు, చీకరించు, చీకిరించు, చీకురించు[2]. అ.క్రి. మిరుమిట్లుకొను. కాశీ. 3.195. స.క్రి. (కళ్ళను) మాటిమాటికి మూసి తెరచు. అష్టమ.క. 5.234 ప. 20 పం.

**చీకిలితొట్టి** వి. చికిలికుండ, సారెపక్కన ఉన్న తొట్టి.

**చీకివెలగ** వి. ఒకరకం వెలగ, వృక్షవిశేషం.

**చీకీలు** వి.బ.వ. పెద్ద పళ్ళాలు, తబుకులు.

**చీకు[1]** విశే. అంధమైన, గుడ్డి. భార.శల్య. 1.16. వి. **1.** అంధ కారం, చీకటి. సిం.ద్వా. 3.98 ; **2.** కర్తవ్యం తెలియక పోవటం. సారంగ. 3.202 ; **3.** బుద్ధి వికసించకపోవటం ; **4.** గుడ్డివాడు ; **5.** గుడ్డిది.

**చీకుకొక్కెర** వి. గుడ్డి కొక్కిరాయి, ఒక జాతి కొంగ. **చీకుపర్వు** అ.క్రి. చీకటి దట్టంగా వ్యాపించు. **చీకురించు[1]** అ.క్రి. అంధమగు, చీకటగు. సురా. 116. **చీకువాలు** వి. చీకటి, అంధకారం. కు.సం. 8.94. **చీకువాలుగవియు (-కవియు)** అ.క్రి. చీకటి అగు.

**చీకు[2]** రూ. చివుకు[2]. విశే. **1.** చివికిపోయిన, జీర్ణమైన. ఆధ్యా.

రా. బాల. 24 పు ; **2.** పనికిమాలిన. అచ్చ. రా. యు. **36.** వి. చుచ్చు. రాతిలోని మెత్తగా తెగే భాగం.

క. కీ. చీముకారటం, కుళ్ళిపోవటం ; కీర్ప, కీవ, కీము. చీము ; కొడ. కి.యి. కుళ్ళిపోవటం, చెడిపోవటం ; తెల. చీము, రసి ; తు. కీపు. చీము, రసి ; త. చీ. చీము ; చీల్. చీము, రసి ; చీక్కై. కఫం, శ్లేష్మం ; చీతమ్. చీము నెత్తురులు మలంతో పడే వ్యాధి ; చీత్తై. చెడిపోయిన చీత్తై-క్కణ్. పుసికట్టిన కన్నులు ; మ. చీ. చెడిపోయిన పదార్థం, చీక. కుళ్ళిపోవటం, చెడిపోవటం; చీక్క, చీకుక. చెడిపోవు ; చీచ్చల్, చీయల్. చెడిపోయిన ; తొద. కితిల్. చెడిపోయిన ; ఇ.న్క్క. చీమిడి ; కొండ. కిప్. చీము, గుమిలి ; కిట్. చెడిపోవటం ; గిబ్. చీమిడి ; కుఇ. సివెండి, సివెంజి. చీము ; (సివ. కుళ్ళిపోవు, చెడిపోవు ; కువి. సీవెస్సి, సిమెసి. చీము ; సర్లలి, (సినై. చెడిపోవు ; కొలా. సిప్క. చెడిపోవటం, సి.యే. చీము ; చీయుఇ్, సీయూద్. చీమిడి ; చిర్ముర్. గుమిలి ; నా. శీమ్. చీము ; కురు. కిత్నా. చీము ; మాల్తో. కిలె. చీము ; క్రతొ. చెడిపోవు ; బ్రా. కిష్. చీము, రసి, చీమిడి.

**చీకాకు** రూ. చికాకు. విణ. **1.** బాధపొందిన. యయా. 2.107 ; **2.** కలిగిన. రామాభ్యు. 7.96 ; **3.** చెదరిన, కలిగిన. సారంగ. 2.26. వి. **1.** చివికిన ఆకు ; **2.** క్షోభం, కలత, బాధ ; **3.** శ్రమ, ఆయాసం. < చీకు² + ఆకు. **చీకాకుచేయు** స.క్రి. **1.** చెదరుగొట్టు. చంద్రాంగ. **4.96** ; **2.** కలచు. శుక. 1.170. **చీకాకుపడు** రూ. చికాకుపడు. అ.క్రి. **1.** చెదరు. భార. భీష్మ. 1.295 ; **2.** పొడగు. ఉ. హరి. 3.36 ; **3.** కలతచెందు. శివ. రా. 1.58 ; **4.** ఖండితమగు, ముక్కలగు. వైజ. 1.131 ; **5.** గందరగోళపడు. విప్ర. 3.67. **చీకాకుపఱచు** రూ.చూ. చీకాకుపఱుచు. స.క్రి. కలతపెట్టు, చిక్కుపెట్టు. జైమిని భా. 2.28. **చీకాకుపఱుచు** రూ. చీకాకుపఱచు. స.క్రి. **1.** చెదరగొట్టు. భార. భీష్మ. 1.295 ; **2.** ముక్కలు ముక్కలగు. వైజ. 1.131 ; **3.** పొడగు, ధ్వంసమగు. ఉ. హరి. 3.36. **చీకుచింత** రూ. చీకూచింత. వి. ఆతురత మొ. **చీకుడు** వి. చివికిపోయిన స్థితి, వస్తువు. విణ. చివికిపోయిన. **చీకునువ్వు** రూ. చీకునూఁగు, సీకినువ్వు. వి. నువ్వుమొక్కలా ఉండే ఒక రకం కలుపుమొక్క. **చీకునూఁగు** రూ.చూ. చీకునువ్వు. వి. నువ్వులాగ ఉండే కలుపుమొక్క. **చీకునూలు** రూ. సీకునూలు. వి. మెతపునూలు మెత్తగా ఉండి తెగే నూలు. **చీకుబండ** వి. జారుడు రాయి. **చీకూచింత** రూ.చూ. చీకుచింత. వి. **1.** బాదర బంది ; **2.** సంకటం.

**చీకు³** రూ. చిబుకు. స.క్రి. **1.** చుంబించు. భాస్క. రా. సుందర. 487 ; **2.** చప్పరించు. ఆము. 6.17 ; **3.** కొరుకు, కరచు. వసు. 1.56.

క. చీపు, సీపు. చప్పరించు ; ఉమ్మ. ముద్దుపెట్టుకొను ; కొడ. ఉ.త్. పీల్చు, చప్పరించు ; త. చీప్పు. పీల్చు ; చూప్పు. చప్పరించు ; చూప్పి పాలపీక ; యూంపు. చప్పరించు ; ఊంపు. పాలపీక ; మ. ఈంపుక. చప్పరించు, నాకు, తాగు ; ఊంపుక. చప్పరించు ; ఉమ్మ. ముద్దుపెట్టుకొను ; కోట. ఉబ్. పురుష మర్మావయవాన్ని చప్పరించు ; కొండ. చి.ప్ ; కుఇ. జూంబ, జూబ. చప్పరించు ; కువి. జూపలి. చప్పరించు ; పర్జి. చూక్-, చూప్. చప్పరించు ; గ. చూప్క. చప్పరించు ; కురు. చీప్నా. పురుష మర్మావయవాన్ని చప్పరించు ; మాల్తో. చిపె. పురుషమర్మావయవాన్ని చప్పరించు ; చుంక్వే. ముద్దుపెట్టుకొను ; చుంక్వెసె. నోటితో జంతువులను పిలవటానికి చేసే ధ్వని.

ప్రా. చూ. సం. చుంబ్. ముద్దుపెట్టుకొను.

**చీకు⁴** రూ. సీకు. వి. ఇనపచువ్వ.

**చీకుతొట్టి** వి.బ.వ. (మాంసంముక్కలు) కాల్చటానికి వాడే మట్టితొట్టి.

**చీకు⁵** వి. కుయ్యంరాయి, రాతితో కట్టిన ఆర్చి మధ్య భాగంలో బలం కోసం బిగించిన పెద్దరాయి.

**చీకురాయి** రూ.చూ. చీకురువాయి. వి. **1.** ఒకజాతి గబ్బిలం. జతుక. ఆం. భా. 2.94 ; **2.** గబ్బిలం, తైలపాయిక. సాంబ. తిర్య. 81 ; **3.** ఇలకోడి.

**చీకురించు²** రూ.చూ. చీకిలించు. స.క్రి. చికిలించు.

**చీకురు** వి. పూతిక, రాతినేలల్లో పెరిగే పొడుగాటి కాడలుగల తృణ విశేషం (Aristida setacea).

**చీకురువాయి** రూ. చీకురాయి, చీకుఱాయి, చీకువాయి. వి. **1.** గబ్బిలం, తైలపాయిక. ద్వి. హరిశ్చ. పూ. 1842 పం. ; **2.** ఇలకోడి, చిమ్మట. గంధ. 141 ; **3.** జతుక, ఒకజాతి గబ్బిలం. ఆం. భా. 2.94.

క. చీకురు-వాయి. బొద్దింక.

**చీకుఱాయి** రూ.చూ. చీకురురాయి. వి. **1.** గబ్బిలం ; **2.** చిమ్మట పురుగు, ఇలకోడి.

**చీకువా** వి. ఒకదినుసుబట్ట.

**చీకువాయి** రూ.చూ. చీకురువాయి. వి. కీచురాయి.

**చీకూచింత** చూ. చీకు².

**చీఁజీకటి** వి. **1.** కృష్ణపక్షం ; **2.** కనుచీకటి.

**చీటకము** రూ.చూ. చిట్టకము. వి. **1.** రీతి, విధం. కాశీ. 5.81 ; **2.** లీల, అలవోక.

**చీటము** రూ.చూ. చిట్టకము. వి. **1.** శృంగార చేష్ట. హర. 5.39 ; **2.** క్రీడ, ఆట. హర. 7.72.

**చీటా** వి. కంకర. పునాదులను దిట్టపరచటం, గ్లాబులు పోత పొయ్యటం, మొ. పనులకు పనికివచ్చే రాతిముక్కలు.

హిం. సీతా, సీరవస్తువు.

<హిం. సీతా.

**చీటి¹** రూ. చీటీ. వి. **1.** లేఖ, జాబు. సుమతి శ. ఉ. రా. 6.302 ; **2.** ఆజ్ఞాపత్రం. శుక. 4.12. దశా. 1.119 ; **3.** ఖండపత్రిక. శుక. 1.121, ఆం. భా. 2.188.

హిం. చిట్ఠీ, చీటీ, చీఠీ. ఉత్తరం, జాబు, ఆజ్ఞాపత్రిక ; మరా. చిటీ, చిఠీ, చిఠి, కాగితంముక్క, ఒకవిధమైన పత్రం ; ఉ. చిఠి, చిఠ్ఠీ. ఆజ్ఞాపత్రం ;

క. చీటి ; త. చిట్టు.

< ఉ. చిఠ్ఠీ.

**చీటిబ్రాయు** అ.క్రి. ఎదుటి వానికంటె ఉన్నతుడగు

హంస. 5.204. స.క్రి. 1. ఆజ్ఞరాయు ; 2. మించు. చీట్లాట వి. పేకాట. <చీట్లు+ఆట. చీట్లాడు అ.క్రి. 1. పేకాడు ; 2. కలహించు. <చీట్లు+ఆడు. చీట్లు వి.బ.వ. పేక ముక్కలు. <చీటి[1]+-లు.

చీటి[2] వి. అద్దకపు గుడ్డ.

చీటిచీర వి. రంగు పూవులు అద్దబడిన చీర. చీటిబట్ట వి. అద్దకం ఉన్న వస్త్రం.

చీటికలిసె వి. ఉండి, పిల్లలు డబ్బుదాచి పెట్టటానికి ఉపయోగ పడే గుండ్రని చిన్నమట్టిబుడ్డి.

చీటికిమాటికి అవ్య.ద్రు. 1. నిష్కారణంగా. రం. రా. ఆరణ్య. 155 పు. 22 పం. ; 2. మాటి మాటికి. కాశీ. 4.270.

చీటీ రూ.చూ. చీటి[1]. వి. 1. ఖండపత్రిక ; 2. ఆజ్ఞాపత్రం ; 3. జాబు, లేఖ.

చీట్లాట చూ. చీటి[1].

చీట్లాడు చూ. చీటి[1].

చీట్లు చూ. చీటి[1].

చీడ రూ. జీడ. వి. 1. సస్యాదులకు కలిగే వ్యాధి. హరి. పూ. 7.160 ; 2. పీడ, బాధ ; 3. గజ్జి ; 4. పైరు చెరిచే పురుగు ; 5. వెత.

క. ఛీడె.

చీడపట్టు రూ. జీడపట్టు. అ.క్రి. 1. సస్యాదులకు వ్యాధి కలుగు ; 2. పీడతగుల. చీడపార వి. నెత్తురు పారుకొనే జబ్బు. చీడపాటు వి. పశువుల రక్తవిరేచన రోగం. చీడపురుగు రూ. చీకపురువు, చీడెపురుగు, జీడపురుగు. వి. కూరగాయలు, పెసర, పొగాకు మొ. రకాల పైర్లకు పట్టే పేను లేక దోమజాతికి చెందిన పురుగు. వేమన. 117. చీడపురుపు రూ.చూ. చీడపురుగు. వి. పత్సకీటం, పంటలకు పట్టే పురుగు. ఆం. భా. 2.87. చీడపేలు వి.బ.వ. గుడ్డలపై పాకేపేలు, చీరపేలు.

చీడి రూ.చూ. చీడీ. వి. అరుగు, తిన్నె, జగిలె.

చీడీ రూ. చీడి. వి. అరుగుగట్టు, మెట్టు. మెటికె.

హిం. సీఢీ. మెట్టు.

<హిం. సీఢీ.

చీదు[1] స.క్రి. 1. పడుగును పాయలుగా విడదీయు. వి. ఏడు పుంజాల నూలు, పడగు.

క. చీటుకు. ఏడుపుంజాల నూలు ; త. చీడు.

చీదుదబ్బ వి. నూలి చీదు తగిలించటానికి వెదురు బద్దలతో చేసిన చేనేత కార్మికుని సాధనం. హంస. 2.11.

చీదు[2] వి. ఒకరకం చెట్టు.

చీదు[3] వి. బోదెకాలువ.

చీడెపురుగు రూ.చూ. చీడపురుగు. వి. పైరును పాడుచేసే పురుగు.

చీడెలు వి.బ.వ. భక్ష్య విశేషం.

చీతలవ వి. ఒకానొక పిట్ట.

చీద వి. ఒకచిన్న సముద్రపు చేప.

చీదులు వి.బ.వ. శాల్తీలు, ఇంటికట్టు బడిలో వాడే కిటికీలు, దర్వాజాలు మొదలైన వాటి మొత్తం.

చీనము రూ. చీనాము[1]. వి. సీసమనే చెక్కుడుపని ముట్టు, చీరణం.

క. చిన్న. బంగారం ; తు. చిన్న. బంగారం ; త. చిన్నమ్. నాణెం, బంగారు నాణెం ; తొ. సిన్. బంగారం, చెవిరింగు ; టంగొని ; కొండ. చిన్క్. బంగారం.

చీనా వి. చైనాదేశం.

సం. చీన-. చైనాదేశం ;

క. చీనా.

చీనాకప్పురము వి. ధవళం, మేఘసారం. చీనాకర్కటి వి. పెద్దదోస, రాజకర్కటి. చీనాకలకండ వి. చిన్నపలుకుల పటికబెల్లం. చీనాదోసకాయ వి. కులకర్కటి. చీనాపంచదార వి. ఇసుకలాగ ఉండే తెల్లని ప్రశస్తమైన పంచదార.

చీనాము[1] రూ.చూ. చీనము. వి. సీసమనే చెక్కుడు పని ముట్టు, చీరణం.

చీనాము[2] వి. 1. బంగారం ; 2. నూలు, దారం ; 3. పట్టుబట్ట ; 4. జెండా.

సం. చీన-. చైనాదేశం.

చీని రూ. జీన్, జీని, జీనీ. విణ. చైనాదేశ సంబంధమైన, ప్రశస్తమైన.

సం. చీన-. చైనాదేశం.

క. చీని.

<సం. చీన-.

చీనిచక్కెర వి. ప్రశస్తమైన చక్కెర, చీనా పంచదార. రం.రా. బాల. 53 పు. 21 పం. చీనిపండు వి. 1. గజనిమ్మ ; 2. బత్తాయి, మూసంబి. చీనిపని వి. చైనావారి మలాము పని. చీనిపావడ వి. ప్రశస్తమైన పావడ. పారి. 4.28.

చీనిపిష్టము వి. సిందూరం.

చీనివాయి రూ.చూ. జీనువ. వి. లిక్కుపిట్ట.

చీనీ వి. 1. పట్టుబట్ట, ఒకరకం వస్త్రం. హంస. 5.356, ప్రబంధ. 615 ; 2. చీనిపండు (Cirtas aurantium or citrama Lush).

సం. చీన-. చైనాదేశం.

<సం. చీన-.

చీనీకుట్టు వి. మడుపుకుట్టు.

చీ(ద రూ.చూ. చింద. వి. చిందపక్షి, చీపరపిట్ట. పార్వ. 6.77, ప్రబంధ. 234.

చీ(దకన్నిడు చూ. చీ(దకన్ను.

చీ(దకన్ను వి. గుడ్డులేనికన్ను.

చీ(దకన్నిడు స.క్రి. ఉపేక్షించు, నిర్లక్ష్యంచేయు. భార.ఉద్యో. 4.76.

చీ(దఱ[1] రూ.చూ. చిందఱ[1]. వి. 1. బాధ ; 2. కోపం ; 3. రోత ; 4. క్షోభం ; 5. కీడు.

చీ(దఱగొను[1] (-కొను) అ.క్రి. 1. రేగు, రెచ్చు. భోజ. 6.315 ; 2. ఉపద్రవపడు. చీ(దఱచెందు అ.క్రి. చీకాకుపడు. పారి. 4.14 ; చీ(దఱరే(గు రూ.చూ. చిందఱ రే(గు. అ.క్రి. 1. రెచ్చు. కు.సం. 11.3; 2. ఆవేశ మెత్తు. హరి.ఉ. 1.101. చీ(దఱలుగొలుపు(-కొలుపు) స.క్రి. చీకాకుపెట్టు. జైమిని భా. 5.3. చీ(దఱవాపు (-పాపు)

అ.క్రి. దుఃఖంతీర్చు, చికాకు, కలత తొలగించు. కు.సం. 8.159. చీఁదఱించు స.క్రి. రోతపడు. అ.క్రి. 1. విసుక్కొను, చిరాకుపడు. చీఁదఱించుకొను స.క్రి. 1. అసహ్యించుకొను ; 2. రోతపడు. అ.క్రి. చిరాకుపడు. చీఁదఱింపు వి. 1. రోత ; 2. విసుగుదల ; 3. కినుక ; 4. తొందరపాటు.

**చీఁదఱ[2]** రూ.చూ. చిందఱ[2]. వి. 1. తూటు, చిల్లి ; 2. ఖండం, ముక్క, చీలిక.

చీఁదఱగొను[2](-కొను) అ.క్రి చిల్లులుపోవు, తూట్లుపడు. నీలా. 3.29. చీఁదఱలాడు స.క్రి. తునియలుచేయు. అ.క్రి. చెలరేగు. చీఁదఱలువోవు(-పోవు) రూ.చూ. చిందఱలువోవు. భోజ. 6.347.

**చీఁదఱించు** చూ. చీఁదఱ[1].

**చీఁదఱించుకొను** చూ. చీఁదఱ[1].

**చీఁదఱింపు** చూ. చీఁదఱ[1].

**చీఁదిచీఁదివేయు** చూ. చీఁదు.

**చీఁదు** స.క్రి. ధ్వని కలిగేటట్లుగా నాసికామలాదుల్ని విడుచు. కాశ. 2.147. అ.క్రి. బాణసంచు వెనుకవైపుకు తన్ని పేలిపోవు.

క. సీన్. చీదు ; తు. హీంగ్రుని, హీంపుని. ముక్కుని అదుము ; త. చింతు, చింతల్, చింతు. ముక్కుని అదుము ; మ. చింతుక, చీఱ్ఱుక, ముక్కుని అదుము ; గోం. ఈచానా. ముక్కునదుము ; కుఇ. ౖసింద. ముక్కుని అదుము ; సిహొ. చీదు ; కువి. సిందలి. ముక్కుని అదుము ; పర్జి. టీడ్. ముక్కుని శుభ్రం చేయు ; గ. చింద. చీదు ; కురు. చీగ్ర్చ్‌నా, ఇౖజనా. ముక్కుని శుభ్రంచేయు ; మాల్తో. ఇంజె. ముక్కుని శుభ్రంచేయు.

చీఁదిచీఁదివేయు అ.క్రి. ఏడ్పునటించు. చీఁదుడు వి. నాసికామలాన్ని పరిహరించడం. ఆం.భా. 2.126.

**చీఁద్రము** చూ. చీఁదఱ[1]. వి. రోత, శని.

**చీపర** వి. ఒక జాతిపక్షి, ఆళాయి.

**చీపరు** రూ.చూ. చీపురు. వి. 1. పొరక, ఒకరకం గడ్డి ; 2 రాతినేలల్లో మొలిచే ఒకరకం గడ్డిమొక్క.

**చీపి** రూ. చీపిరి[2]. వి. 1. ఒకవిధమైన నేత్రరోగం. చంద్రరే. 1.69 ; 2. ఒకవిధమైన పశురోగం.

**చీపిరి[1]** రూ.చూ. చీపురు. వి. 1. పొరక, ఒకరకం గడ్డి ; 2. రాతినేలల్లో మొలిచే ఒకరకం గడ్డిమొక్క.

**చీపిరి[2]** రూ.చూ. చీపి. వి. 1. నేత్రరోగ విశేషం ; 2. ఒకానొక పశువ్యాధి.

**చీపిరికట్టకమ్మి** వి. ఒకరకం చీరకమ్మి.

**చీపిరికన్ను** వి. రెప్పలార్చే చిన్నటి మూసురు కన్ను.

**చీపిరిబొత్తంచు** వి. చీరకు చివర నేసిన ఒకరకం చిన్నఅంచు.

**చీపు** వి. 1. అత్తంలో ఒకభాగం. ఆం.భా. 2.58 ; 2. దువ్వెన.

కొడ. చి.ప్-. దువ్వెన ; చి.పి. దువ్వెన ; తు. కీపు. గెల, గుత్తి ; చీపు. గుత్తి అరటిపండ్లు ; చింపు ; త. చీప్పు. దువ్వెన, అరటిపండ్లగుత్తి ; చీవు ; మ. చీక. దువ్వెన ; చింతుక, చిప్పి. చీర్పు ; తొ. కి.చ్ ; పర్జి. కీపిద్.

**చీపురగడ్డి** వి. తేమ ప్రదేశాల్లో పెరిగే ఒకరకం మొక్క (Leptochloachinensis).

**చీపురు** రూ. చీపరు, చీపిరి[1], జీపురు, సీపురు. వి. 1. రాతినేలల్లో ఎక్కువగా మొలిచే పొడుగాటి కాడల గడ్డిమొక్క (Aristida setacea) ; 2. జాడు, పొరక అని పిలవబడే ఒకరకం గడ్డి (Cyperas bulbosus).

**చీపురుకట్టసరసం** చూ. చీఁపురు. వి. మోటు సరసం.

**చీఫ్‌శక్రటేరి** వి. ప్రధానకార్యదర్శి.

ఇం. *Chief Secretary.* ప్రధానకార్యదర్శి.

<ఇం. Chief Secretary.

**చీఫ్** విఐ. ముఖ్యమైన, ప్రధానమైన.

ఇం. *Chief.* ముఖ్యమైన.

<ఇం. Chief.

**చీఫ్‌జస్టిస్** వి. ప్రధానన్యాయమూర్తి.

ఇం. *Chief-justice.* పలుకుబడిలో ప్రథముడు, ప్రధానన్యాయమూర్తి.

<ఇం. Chief-justice.

**చీమ** వి. పిపీలిక, నన్నగాడు. విక్ర. 4.27.

కుఇ. సీయ. పిపీలిక ; కొలా. సి.య, సిమె. పిపీలిక ; నా. శియ. పిపీలిక.

పో.చూ. సం. సీమికా. పిపీలిక.

చీమకన్ను వి. చిన్నకన్ను. ద్వి.పరమ. 4.299 పు. చీమకాయ రూ. సీమకాయ. వి. చీమల్లాటి చిన్నకాయలు ఉండే నల్లటి కలుపు మొక్క. చీమకాలు రూ. సీమకాలు. వి. చీమల్లాటి చిన్నకాయలు ఉండే నల్లటి కలుపు మొక్క. చీమకోళ్ళు రూ. సీమకోళ్ళు. వి.బ.వ. చీమలతొట్టి, మజ్జిగ కుండలోకి చీమలు ఎక్కకుండా నీళ్ళుపోసి పెట్టే మట్టి కుదురు. చీమచిటుకు వి. కొంచెం చప్పుడు. చీమచింత వి. చింతకాయలు ఆకారంలో ఉండే పళ్ళు కోసే ఒకరకం ముళ్ళచెట్టు. చీమచిప్పర వి. తృణవిశేషం. హంస. 5.45. చీమతుమ్మ రూ. సీమతుమ్మ. వి. జపాన్ తుమ్మ, ఒకరకం తుమ్మ (Jerasalem thorn, Parkinsonia aculeata). చీమతొట్టి రూ. సీమతొట్టి. వి. దనలి కాయలకు చీమలు పట్టకుండా భద్రపరిచేకుండ. చీమతొల్లు వి. గూబదూరుడు, చెక్కలో నన్నటి చిల్లి. చీమనడక వి. మెల్లని నడక. చీమంత విఐ. ఇసుమంత, ఇంచుకంత, అల్పమైన, కొంచెం. ఆము. 4.261. చీమపులి వి. చీమల్ని తినే పులుగు, ఎలుగుగొడ్డు. చీమలకుంది వి. చీమలతొట్టి, చీమలు ఎక్కకుండా మజ్జిగకుండకింద పెట్టే మట్టికుదురు. చీమలతొట్టి రూ. చీమల్తొట్టి, సీమలతొట్టి, సీమల్తొట్టి. వి. ఉట్టికుండ, చీమలు ఎక్కకుండా మజ్జిగకుండకింద పెట్టే మట్టి కుదురు. చీమలమ్రి వి. చీమలతొట్టి, మజ్జిగకుండలోకి చీమలు ఎక్కకుండా కింద నీళ్ళుపోసి పెట్టటానికి చేసిన మట్టికుదురు. చీమలమాను రూ. సీమలమాను. వి. చీమలతొట్టి, చీమలు ఎక్కకుండా మజ్జిగకుండ కింద పెట్టే మట్టి కుదురు. చీమలుజెట్లులుపాకినట్లుండు అ.క్రి. 1. బాధగా ఉండు ; 2. చిరాకుగాను, కోపంగాను ఉండు. చీమలు దూఱనిచిట్టడవికాకులుదూఱనికాఱడవి వి. ప్రవేశించటానికి శక్యంకాని అడవి, దట్టమైన అడవి. చీమల్తొట్టి రూ.చూ. చీమలతొట్టి. వి. ఉట్టికుండ, చీమలు ఎక్కకుండా మజ్జిగ

కుండ కింద పెట్టే మట్టికుదురు.

**చీమిడి** చూ. చీకు². వి. సింఘాణం, నాసామలం, ముక్కు నుంచి కారే ద్రవం. సిం.ద్వా. 1.100.

**చీము** వి. చెడి తెల్లగా ఉండే రక్తం, పుండునుండి కారే తెల్లటి ద్రవం. ఉ.రా. 3.323.

**చీముపట్టినవాఁడు** రూ. చీముపట్టినోడు. విణ. లెక్కవాడు, ధనవంతుడు. **చీముపట్టినోడు** రూ.చూ. చీముపట్టినవాఁడు. విణ. లెక్కవాడు, ధనవంతుడు. **చీముపట్టు** అ.క్రి. చీము కలదగు, పూయమయమగు. **చీముపోయు** అ.క్రి. చీముపట్టు, **చీములుగట్టు (-కట్టు)** అ.క్రి. చీముపట్టినట్లు బాధ చెందు. భార.ఉద్యో. 2.10. **చీమూనెత్తురులేకుండు** అ.క్రి. సిగ్గులేక ఉండు.

**చీముంత** వి. చెంబు, తంబుగ.

**చీమూనెత్తురులేకుండు** చూ. చీము.

**చీంబోతు** రూ.చూ. చింబోతు. వి. మేకపోతు.

**చీఁపచెవి** వి. 1. చీముకారే చెవి ; 2. కోర్కెతీరని గర్భిణి యొక్క సంతతికి కలిగే రోగం.

**చీఁపర** వి. ఒకజాతి తీగ, బట్టలల్లే తీగ. రామకృష్ణుని చాటువు.

**చీఁపురు** వి. రుడవటానికి పూచిక పుల్లలు, కొబ్బరి ఈనెలు మొ. వాటితో కట్టిన కట్ట, సమ్మార్జని.

క. చీపరి. సమ్మార్జని; కొడ. చి.పె. గడ్డితో చేసిన పొరక ; త. చీ. తుడిచివేయు, శుభ్రం చేయు ; చూయ్. తుడిచివేయు; చీవ్. శుభ్రంచేయు; చికుక్. చెత్త, తుక్కు; మ. చూల్. పొరక ; తొ. కి.ప్. పొరక ; గోం. సైయానా, సైత్తానా, హీయానా. శుభ్రంచేయు ; కొండ. సిప. శుభ్రంచేయు ; సిపెర్. పొరక ; కుఇ. సేప. శుభ్రం చేయు; సేపెరి ; కువి. హెపలి, హేపినై. శుభ్రంచేయు; హెపారి, హెర్పొరి. పొరక ; పర్జి. చేపిద్. పొరక ; గ. ఒల్లా. సిపెట్, చేపీద్, సెపె. పొరక ; కురు. చీఁచ్నా. పొడిగాచేయు ; చీఁచొన్. తుడిచివేయు ; మాల్తో. చిచె. తుడుచు, శుభ్రంచేయు; పెలకి. గడ్డితో చేసినపొరక.

**చీఁపురుకట్ట** రూ.చూ. చీఁపురుఁగట్ట. వి. పొలికట్టె, కళ్ళం లో ఊడ్చటానికి ఉపయోగించే కందిమండల చీపురు. **చీఁపురుఁగట్ట (-కట్ట)** రూ. చీఁపురుకట్ట. వి. తుడవటానికి పూచిక పుల్లలు, కొబ్బరి ఈనెలు మొ. వాటితో కట్టినకట్ట, సమ్మార్జని. కాశీ. 6.262. **చీఁపురుపుల్ల** వి. గడ్డిపోచ.

**చీఁబోతు** రూ.చూ. చింబోతు. వి. మేకపోతు. నార.పంచ. 3.157.

**చీర** రూ. చీరె¹. వి. 1. వస్త్రవిశేషం. భార. అరణ్య. 3.104; 2. స్త్రీలుకట్టుకొనే కోక ; 3. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట.

క. సీరె. గుడ్డ, వస్త్రం, కోక ; తు. శిరె, సీరె. స్త్రీలు కట్టుకొనేకోక ; త. చీరై. గుడ్డ; చీలై. గుడ్డ, వస్త్రం, కోక ; మ. చిల, శిల. గుడ్డ ; కొ. సి.లి. పైనకప్పుకొనే వస్త్రం.

సం. చీర-. వస్త్రం.

<సం. చీర- (అర్థవిపరి.). సంస్కృతచీర శబ్దం ద్రావిడ పదమని కొందరి అభిప్రాయం.

**చీరకమ్మి** వి. చీరఅడ్డకొనలో నేసినపట్టె. **చీరగట్టించు (-కట్టించు)** స.క్రి. బాలవితంతువుగాని, భర్త విడిచినదానిని గాని మరల వివాహమాడు, మారుమనువుచేయు. **చీరచాఁప** వి. ఒడలకు కట్టేతెరచాప. **చీరచిక్కు** అ.క్రి. 1. గర్భంవచ్చు, కడుపువచ్చు. సిం.ద్వా. 3.28 ; 2. చీరచాలకుండు, కోక తక్కువగు. వేంక.పంచ. 1.588. **చీరచింపు** వి. ఒకరకం చేప. సిం.ద్వా. 1.240. **చీరపిట్ట** వి. చీరపేను, బట్టనంటు కొనిఉండే తెల్లపేను. **చీరపేను** వి. చీరపిట్ట, బట్టకుఅంటు కొని ఉండే తెల్లపేను. భార.అను. 5.54. **చీరపేనులు** వి.బ.వ. సస్యవిశేషం. **చీరపోతు** వి. చీరపేను, బట్టనంటు కొని ఉండే తెల్లనిపేను. **చీరమీను** వి. ఒకరకం చేప. **చీరరోగము** వి. ఒకానొక రోగం. **చీరలపడుగు** వి. చీరల నేతకు వాడే పడుగునూలు. **చీరవేయు** స.క్రి. మగడు చని పోయినప్పుడు పుట్టింటివారు రేవులో విధవకు కొత్తచీరను ఇచ్చు. **చీరావి** వి. దెబ్బ తగిలిన కంటికి ఆవిరి పెట్టటానికి గుడ్డ నోటిలో పెట్టుకొని ఊది కలిగించే వేడి, గుడ్డఆవిరి. బసవ. 3.84. పు. 775 పం.

**చీరం** రూ.చూ. సీరె. వి. 1. నిలువు, ద్వారబంధపు నిలువు కమ్మి ; 2. చిలకకొయ్య, గోడలో బిగించిన కొయ్యముక్క.

**చీరణము** రూ. చీర్ణము. వి. చిన్న ఉలి, సేనం. వేంక. పంచ. 1.598.

సం. చీర్ణ-. చీల్చబడింది ; పో.చూ. మరా. చిర్లె. చిన్న ఉలి.

క. చేరణ, చీర్ణ, జిర్ణ. చిన్న ఉలి.

<సం. చీర్ణ-.

**చీరపులాక** రూ.చూ. చీరులాక. వి. పొరలాక, సీల్లాక. నేత పడుగులో దండెకు అచ్చుకూ మధ్య దూర్చిన వెదురుబద్ద.

**చీరము** వి. చిరకాలం.

సం. చిరమ్. చిరకాలం.

<సం. చిరమ్.

**చీరాకుచిక్కుడు** వి. ఒక రకం చిక్కుడు.

**చీరాలా** వి. లప్ప, చూరుకు ఆధారంగా గోడలో నాటిన కర్ర.

**చీరావి** చూ. చీర.

**చీరి** చూ. చీరు¹. వి. 1. లేశం, అణువు. భార.ఉద్యో. 4.201; 2. లక్ష్యం. వసు. 2.152.

**చీరికి** వి. పరవా, లక్ష్యం. గణుతి. **చీరికిఁగొను(-కొను)** స.క్రి. కొంచెమైనా లక్ష్యంచేయు. వసు. 2.152. **చీరికిఁ గైకొను(-కైకొను)** వి. లక్ష్యపెట్టు. నృసింహ. 3.126. **చీరికిఁ జేకొను(-చేకొను)** స.క్రి. కొంచెమైనా లక్ష్యంచేయు. నిర్వ. రా. 3.108. **చీరికిఁబోవు (-పోవు)** అ.క్రి. కొంచెమైనా లెక్క కెక్కు. భార. సౌప్తి. 1.232. **చీరికిలెక్కసేయు (-చేయు)** స.క్రి. కొంచెమైనా లెక్కచేయు. ద్వి.పరమ. 4.281.

**చీరిక** చూ. చీరు¹.

**చీరిసుత్తి** చూ. చీరు¹.

**చీరు¹** స.క్రి. 1. గీరు. భార.ఆది. 3.38 ; 2. చీల్చు. భార.స్త్రీ. 2.64 ; 3. ఖండించు, భేదించు. భార. అశ్వ. 4.104 ; 4. కోలుపట్టిన తర్వాత వాటి తయారీకి వెడల్పుగా వచ్చే టట్లు మట్టిని పట్టు ; 5. బలియు.

క. సిగి. చీలటం; సిగసు, సిగిసు. చీల్పించటం; సిగుళు. బద్దలైన, పగిలిన; సిగుఙ్, సిగుఱు, సిఫఱు, సివఱు, సీఫుఱు. చీలిక; సీఋ. వెదురుబద్ద; చీరు. చీల్చు; తు. తిగిపుని, తిగుపుని. బద్ద, చీలిక; తిగుతె, తిగ్తె, తిగితె. చీలిక; మ. చీంతుక. చించటం (కాగితాన్ని గాని, ఆకులనుగాని); చీత్తు. చీలిక, పేలిక; ఈరుక. చించటం; తొద. సిక్జ్. సూది మొనలాంటి కొయ్యముక్క; గోం. సిందెర్. కొయ్యముక్క చీలిక లేక వెదురు చీలిక మొ॥; హికానా. బద్దలుచేయు; కుఇ. సీకీ, సీకె, సికి-ఇంబ. విరచటం, తెంచటం; కువి. సీప్ల. చీలిక, బద్ద; పర్జి. చీక్-. చికిప్. బద్దలుచేయు; చింగ్. బద్దలగు; కురు. చీర్నా. విభజించటం; బ్రా. చీరింగ్. బద్ద, చీలిక.

పో.చూ. సం. చీర-. చింపిగుడ్డ.

**చీరిక** రూ. ఈరిక. వి. **1.** చీలిక, ఖండం, పాయ. కకుత్థ్స. 5.87; **2.** చింపిగుడ్డ, జీర్ణవస్త్రం; ఆం.భా. 2.157. **చీరిసుత్తి** రూ.చూ. చీరుసుత్తి. వి. పల్లుసుత్తె, రాతిని చీల్చటానికి పనికివచ్చే ఉక్కుపళ్ళుగల సుత్తె. **చీరుదంచు** రూ. సీరుదంచు. చీలినంచు. వి. వెలుపలి భాగంలో రెండుగా చీల్చి ఉండే అంచు. **చీరుడు**[1] వి. చీల్చటం, విదారణం. క. చీరు, చివరు; చివ్వరు. గోటితో చీల్చు; త. చీ, చీల్చు; మ. చీక. చీల్చు; కురు. చీర్ణ. చీల్చు; మాల్తో. చీర్చె. కోడి కాలియొక్క ఆలెబొట్టె. **చీరులాక** రూ. చీరపులాక. వి. **1.** అల్లు చేసేటప్పుడు అచ్చుకు అవతల పడుగులో ఎక్కించిన లాక; **2.** పౌర లాక, నేత పడుగులో దండెకూ అచ్చుకూ మధ్య దూర్చిన వెదరుబద్ద. **చీరుసుత్తి** రూ. చీరిసుత్తి, సీలుసుత్తి. వి. పల్లుసుత్తె, రాతిని చీల్చటానికి పనికివచ్చే ఉక్కుపళ్ళుగల సుత్తె.

**చీరు**[2] రూ.చూ. చీఱు. స.క్రి. పిలుచు. ఆము. 4.7.

**చీరుడు**[2] రూ. చీఱుడు. వి. పిలుపు, ఆహ్వానం. శ్రీరాధా. 5.147. **చీరువాఱు** స.క్రి. పిలుచు, చీరు.

**చీరె**[1] రూ.చూ. చీర. వి. చీర, కోక.

**చీరె**[2] రూ. సీరె. వి. నోరు, పీటగాల, రాట్నం ''బొమ్మ''లో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి.

**చీరెబొమ్మ** రూ. సీరె బొమ్మ. వి. బొమ్మ, రాట్నంపీటకు ఎడమవైపున కుదురు బిగించే నిలువు కొయ్య.

**చీర్చు** చూ. చీరు. స.క్రి. చీరు, చీల్చు, చీలేటట్లు చేయు.

**చీర్ణము** రూ.చూ. చీరణము. వి. చిన్న ఉలి, సేనం. హంస. 2.181.

**చీర్నం** వి. $\frac{1}{4}$ అంగుళం మందంగల గడ్డపలుగు.

**చీర్నికి** వి. చెక్కడంలో మలుపతిరిగే భాగం.

**చీఱు** రూ. చీరు2. అ.క్రి. పలవించు, ఏడ్చు. దశకు. 2.72; స.క్రి. **1.** పిలుచు, ఆహ్వానించు. భోజ. 5.201; **2.** వదురు. పేలు. పద్మ. 7.57.

క. కిఱుచు, కిఱిచు, కిఱుచు, కిర్చు. అరచు, పేలు; కిరచువికె. అరచు, పేలు; కీఱుగుట్టు, కిర్గుట్టు, గిఱు, చీఱు, జీరు. అరుచు, కేకలువేయు; త. కిఱావ్రు. అరచుట (నెమలిలాగ); కిరాకిఱాల్. నెమలిలాగా మళ్ళీ మళ్ళీ అరచుటకు ధ్వన్యనుకరణం; తొద. కిఱ్వ్. బిగ్గరగా అరచు; కొండ. కిరి. బిగ్గరగా అరచు.

<మూ.ద్రా. కిత్-.

**చీఱుడు** రూ.చూ. చీరుడు[2]. వి. **1.** ఏడ్పు; **2.** పిలుపు; **3.** వాగుడు.

**చీల**1 రూ.చూ. చిల్ల[1]. వి. **1.** ఆణి, ఇరుసు తుదిసీల, మేకు, కొలం. వేమన. 1.91; **2.** మేకు, చీల్చేది; **3.** శైలు, మొల, మొనగల ఇనప లేక కొయ్యముక్క; **4.** కడిసీల; **5.** గుబ్బ, గందప్పట్టెలమీద బలానికీ అలంకారానికీ నాటిన గుండ్రటి మేకు; **6.** కమ్మి. మోకు తగిలించటానికి వీలుగా గానుగమాను చివరనాటిన మేకు; **7.** గుత్తిజిల్ల, గుదిచిల్ల, మోట బొక్కిన తూములో దూర్చి మోకు జారకుండా వేసిన కొయ్యముక్క; **8.** పన్ను, పండ్లమాను, కార్ల పౌలిక మొ॥ వాటి దిండుకు వేసిన కొయ్యపన్ను; **9.** చీలకుండ. ఆములో పేర్చిన కుండలు సందుల్లో దాపుగా పెట్టిన ఓటికుండ.

క. కీల్, కీలు. కొయ్యచీల లేక మేకు; త. కీల్. జంతు శరీరంలోని కీలు; కిలమ్. గోరు, పెద్ద మేకు; కీలకమ్; తా. కి.ష్. పిడి: కు.ల్. పెట్టె కీలు: కొండ. కీ.ల్. దవుడ ఎముక కీలుని తలుపుకు ఉండే కీలు.

పో.చూ. సం. కీల-. మేకు.

**చీలకట్ట** వి. **1.** దండగట్ట, కళ్ళంచుట్టూ ఎన్నులు బయటికి పోకుండా వేసే చొప్పకట్టల హద్దు; **2.** వామి 'మొగవాయి'లో నిలువుగాను, అడ్డంగాను అమర్చే గడ్డికట్ట. **చీలకట్టు** వి. చేపల్ని పట్టే కొడమ రంధ్రంలోపల అల్లిన చిక్కుకట్టు. **చీలకుండ** రూ. శీలకుండ, శీలుకుండ, సేలకుండ. వి. అడ్డు, శిలకడకుండ, ఆము కాలేటప్పుడు కుండలు కదలకుండా కుండల వరసమీదుగా నిలువుగా బిగించే దాపుకుండ. **చీలకఱ్ఱ** వి. కొయ్యతో చేసిన మేకు. **చీలమడమ** వి. కాలి మడమకు చీలిన రెమ్మవంటిది. **చీలమండ** రూ. సీలమండ. వి. కాలి మడమలకు రెండుపక్కలా ఉండే కీలు, గుల్ఫం. ఆం.భా. 2.135. క. చీలమండె. కాలి మడమలకు రెండుపక్కలా ఉండే కీలు, గుల్ఫ. **చీలమన్ను** వి. ఔ. **1.** ఔషదాలు పుటం వేసే పాత్రల మూతికి చుట్టి దానిపైన పూసే మట్టి; **2.** లోహాల్ని కరిగించే మూసకు పూసే మన్ను. త. చీలైమణ్ (త. చీలై. గుడ్డ; మణ్. మట్టి.)

**చీల**[2] వి. తుంగజాతికి చెందిన ఒక రకం గడ్డి (Cyperus species).

**చీలగడ్డి** వి. తుంగలో ఒక రకం కలుపుమొక్క (Cyperus species).

**చీలఁదీయు** చూ. చీలు.

**చీలి** వి. **1.** పిల్లి, మార్జాలం. వేంక. ఆం. తిర్య. 92; **2.** పిల్లిని పిలిచేటప్పుడు ఉపయోగించే మాట; **3.** మాటకు ముందే ఏడ్చే వ్యక్తి.

క. చీలి. పిల్లిని పిలిచేటప్పుడు ఉపయోగించే మాట.

**చీలిగాఁడు** (-కాఁడు) వి. పిల్లి. గంధ. 64.

**చీలిక** చూ. చీలు.

**చీలికగుబ్బ** చూ. చీలు.

చీలికపొర చూ. చీలు.
చీలికె చూ. చీలు.
చీలిపోవు చూ. చీలు.
చీలినంచు చూ. చీలు.
చీలిసె రూ. సీల్సె. వి. దండె కట్టు, తూర్పార పోసేటప్పుడు మేలురాసి పక్కనపడే పొట్టు, గింజలు కలిసిన భాగం.
చీలు అ.క్రి. 1. చెడు, పోవు, నశించు. భాస్క.రా. అయోధ్య. 40 : 2. పగులు, బద్దలగు. దశా. 4.232.
చీలఁడీయు స.క్రి. విభజించు, మోసపుచ్చు. చీలిక రూ. చీలికె. వి. 1. పగులు, చీల్పు, బద్ద. చంద్రాంగ. 3.15 ; 2. పాయ. క. గీలు. చీల్చటం ; సీళ్, సిళు. బద్దలు చేయు; తు. పీలు. చీలిక, బద్ద ; సీలు. పగులు ; త. కీల్. చీల్చటం, పగలగొట్టు ; కీల్ ; కొండ. చి.ళ్. ముక్కలు. చీలికగుబ్బ వి. దోనెకు ఆధారంగా, కుడివైపున నేలలో పాతిన పంగలకొయ్య. చీలికపొర వి. మందుపెట్టి బండలు పేల్చి తీసిన రాతిపొర. చీలికె రూ.చూ. చీలిక. వి. పాయ, బద్ద, చీరిక. చీలిపోవు అ.క్రి. విడిపోవు, చినుగు. చీలినంచు వి. చీరుడంచు, రెండుగా చీలినట్లుండే అంచు. చీలుగాలవ రూ.చూ. చీలుగాలువ. వి. పిల్లకాలవ. పంటకాలవనుంచి చీలిన చిన్న కాలవ. చీలుగాలువ రూ. చీలుగాలవ. వి. పెద్ద కాలువనుండి చీలిన పిల్లకాలువ. చీలుచు రూ.చూ. చీల్చు. స.క్రి. 1. ఖండించు ; 2. చీరు, చీలికలు చేయు. చీలుడంచు వి. చీలినంచు, వెలుపలి భాగంలో రెండుగా చీల్చిఉండే అంచు. చీలుపంచు రూ. సీలుపంచు. వి. చీరుడంచు, వెలుపలి భాగంలో రెండుగా చీల్చిఉండే అంచు. చీలుపునాగ వి. ఒల్లంతు గొర్రు, గుంటక మొదలైన వాటికి నాగగా వేసిన పంగలకొయ్య. చీల్చినంచు రూ. సీల్చినంచు. వి. చీరుడంచు, వెలుపలి భాగంలో రెండుగా చీలినట్లుండే అంచు. చీల్చు రూ. చీలుచు. స.క్రి. 1. ఖండించు, భేదించు. ఉ.రా. 2.91; 2. చీరు, చీలికలు చేయు. ఉ.రా. 7.415. చీల్చుడంచు వి. చీలినంచు, వెలుపలి భాగంలో రెండుగా చీల్చి ఉండే అంచు. చీల్పఁగొట్టు స.క్రి. చీరు, చీలేటట్లు చేయు. చీల్పించు స.క్రి. బద్దలుచేయు.
చీల్చినంచు చూ. చీల్చు.
చీల్చు చూ. చీలు.
చీల్చుడంచు చూ. చీలు.
చీల్పఁగొట్టు చూ. చీలు.
చీల్పించు చూ. చీలు.
చీళ్ రూ.చూ. చిల్లు[1]. వి. 1. బండి ఇరుసు చీల ; 2. మేకు.
చీళితపెట్టు చూ. చీళితము.
చీళితము వి. 1. తొలగటం ; 2. రాలటం.
చీళితపెట్టు స.క్రి. 1. తొలగించు, తీసివేయు. శశా. 2.112 ; 2. రాల్చు.
చీవాట్లమారి చూ. చీవాట్లు.
చీవాట్లు రూ. చీవాళ్ళు. వి.బ.వ. చీకొట్టుళ్ళు, గర్హణవాక్యాలు, తిట్లు. < చీ + వాటులు.
చీవాట్లమారి వి. చీవాట్లు పడేవాడు, చీవాట్లు పడే స్త్రీ. హంస. 5.113. చీవాట్లుతిను అ.క్రి. తిట్లుపడు, నిందించబడు. చీవాట్లుపడు అ.క్రి. తిట్లు తిను, చీవాట్లు తిను. చీవాట్లు పెట్టు స.క్రి. గర్హించు, తిట్టు.
చీవాళ్ళు రూ.చూ. చీవాట్లు. వి.బ.వ. తిట్లు.
చీవించు చూ. చివ్వు. స.క్రి. కొయ్యలో చిత్తరువులు చెక్కు.
చీవుక రూ. చివుక[2]. వి. ఒక జాతి గబ్బిలం. ఆం.భా. 2.94.
-చు[1] ప్రత్య. వ్యా. కర్త్రర్థక ప్రత్యయం, ప్రధాన క్రియనుబట్టి మూడు కాలాల్ని తెలిపే ప్రత్యయం. 1. భూతకాలం – ధరించుచు వచ్చె. భార.కర్ణ. 2.80 ; 3. వర్తమానకాలం – గర్జించుచున్నవాడు. జైమిని భా. 2.46 ; 3. భవిష్యత్కాలం – ఎల్లెడల దీని నెఱిఁగించుచునే, వేదవిహిత నియతిన్ ద్వాదశ సంవత్సర వ్రతము జరియింతున్ మార్క. 1.140.
గోం. సెర్, సోడే, సోర్. కర్త్రర్థక ప్రత్యయం; కొండ. సిన్ ; కుఇ. జి ; కువి. హి, చి, జి ; కొలా. సాన్ ; ద్రా. ఇస.
-చు[2] ప్రత్య. 1. కొన్ని ధాతువులమీద వచ్చే ప్రేరణార్థకం. ఉదా. అర్చు, ఒర్చు ; 2. కొన్ని అకర్మకాల్ని సకర్మకాలుగ మార్చేది, కూల్చు, కాచు.
క. -చు, ఇచు. ఇసు . ప్రేరణ ప్రత్యయం ; కో.తొ. -చ్, -ప్ ; గోం. ఊస్ ; కుఇ. -స్.
< మూ.ద్రా. *-చ్చ్-.
చు[3] రూ.చూ. చూ. అవ్య. చుము, చుడు అనేవాని లుప్త శేష రూపం. ఇది ప్రసిద్ధి, నిశ్చయాదుల్ని తెలుపుతుంది. కళా. 6.161.
చుంయి రూ. చుఁయి, చుయ్యి. వి. నిప్పుగాని, కాలిన పాత్రాదులుగాని నీరు పీల్చినపుడు కలిగే ధ్వనికి అనుకరణం. మను. 4.17. ధ్వన్యను.
క. చుంయి, చుయ్, చొంయి ; కొ. చుఁఇఁ-. కాలిన పాత్రాదులమీద నీరుపడినప్పుడయ్యే ధ్వని ; కుఱు. చొఏఁ చొఏఁర్నా, చొఏఁ-మొఏఁ. వేగేటప్పుడయ్యే ధ్వని.
చుఁయి రూ.చూ. చుంయి. వి. నిప్పుగాని. కాలిన పాత్రాదులుగాని నీరు పీల్చినపుడు కలిగే ధ్వనికి అనుకరణం.
చుకాయించు స.క్రి. తీర్చు.
ఒ. చుకాయిదా. పూర్తిచేయు ; హిం. చుకానా. తీర్చు, పూర్తి చేయు : గు. చుకావవుఁ. తీర్చు, సరిచేయు ; మరా. చుకావిణేఁ. పూర్తిచేయు ; ఉ. చుకానా. తీర్చు, పూర్తి చేయు.
< ఉ. చుకా(నా) + -ఇంచు[3].
చుక్క[1] వి. 1. నక్షత్రం. కు.సం. 8.91 ; 2. శుక్రుడు, నవగ్రహాల్లో ఒక గ్రహం. క్రీడా. 51 ; 3. బడికి రెండవ వాడుగా కృతార్థుడైనవాడికి పెట్టే గుర్తు, రెండవరకంవస్తువు. కృ.శకు. 2.45 ; 4. నక్షత్రంలాగ ఉండే బొట్టు లేక గుర్తు. సుదంతా. 1.71 ; 5. నిషా మందు, తాగుడు ; 6. నీరు మొ॥ వాటి బిందువు ; 7. పావలాకాసు.
సం. శుక్ర-. కాంతి, స్వచ్ఛత, శుక్రగ్రహం; ప్రా.సుక్క. గ్రహ విశేషం; అ.మా. సుక్క-; పా. సుక్క-. గ్రహం, నక్షత్రం.
క. చుక్కి. శుక్రగ్రహం, శుక్రాచార్యుడు ; చుక్కె. చిన్న గుర్తు. చిక్కి, చిక్కె ; త. చుక్కై. నక్షత్రం ; గోం.

సుక్కుం ; కొండ. సుక ; కుఇ. సుక ; కువి. హూక ; పర్జి. సుక్క ; కొలా. సుక్క ; నా. ముక్క.

<ప్రా. సుక్క-.

చుక్కకట్టు వి. చిటికెకట్టు, చిన్న నూలు చిలపకు రంగు అద్దేటప్పుడు లెక్కప్రకారం కొన్నిచోట్ల రంగు అంటకుండా కట్టే కట్టు. చుక్కకన్ను రూ. చుక్కన్ను. వి. **1.** ఒక కంటిమీద మచ్చ: **2.** చెరుపు. చుక్కకార వి. ఒకరకం చేప. చుక్కకూఁకుడు వి. శుక్రాది గ్రహాల అస్తమయం, మౌఢ్యం. చుక్కచీర వి. నేత నిలువులో ఒక కొలికి నలుపు, ఒక కొలికి ఇటాలిరంగు పోగులు పెట్టి, రెండు కొలుకులు నలుపు, ఒకకొలికి ఇటాలి చొప్పున అడ్డానికి పెట్టి నేసిన చీర. చుక్కచేరు వి. **1.** చుక్కల చాలు. వసు. 5.116 ; **2.** చేర్చుక్క పాపట బొట్టు. వసు. 5.116. చుక్కతెగిపడినట్లు అవ్య. అకస్మాత్తుగా. పాండు. 3.24. చుక్కతొలివేల్పుగొంగ వి. తారక జిత్తు, కుమారస్వామి. వేంక. ఆం.దేవ. 7. చుక్కదున్న వి. నెత్తిమీద చుక్క ఉన్నదున్న. ఇట్టిది ప్రశస్తమైనది. చుక్కనుదుటిపిట్ట వి. గరుత్మంతుడు. వేంక. ఆం. దేవ. 18 వ్యా. చుక్క (అదృష్టచిహ్నం) నుదుటిమీదఉన్న పక్షి. చుక్కన్ను రూ.చూ. చుక్కకన్ను. వి. **1.** ఒక కంటి మీద మచ్చ ; **2.** చెరుపు. చుక్కపిల్ల వి. ఒకరకం చేప. చుక్కపిల్లి వి. శరీరం మీద చుక్కలు కల పిల్లి. చుక్కపుల్ల వి. గోడలకు, ద్వారాలకు రంగులు చుక్కలు పెట్టడానికి వాడే రాగిపుల్ల. చుక్కపేటంచు వి. చుక్కల చుక్కల డిజైను పడేట్టునేసిన అంచు. చుక్కపొడుచు అ.క్రి. 1. వేకువగు, శుక్రనక్షత్రం కనిపించు ; **2.** గుడ్డలపై చుక్కలవలె ఏర్పడు. స.క్రి. శరీరం మీద పచ్చబొట్టు పొడుచు. చుక్కపోతు వి. నెత్తిమీద తెల్లని చుక్క ఉన్నపోతు, ఇట్టిది శ్రేష్ఠమైనది. చుక్కబర్రె వి. ముఖం మీద చుక్కఉన్న గేదె, సీమగేదె. చుక్కబావి వి. దిగుడుబావి, నీళ్ళకోసం దిగడానికి మెట్టుపెట్టిన బావి. చుక్కబొట్టు వి. చుక్కలాగ ఉండే బొట్టు, బొట్టు. మను. 3.66. చుక్కమోముమెకము వి. గరుత్మంతుడు. చుక్కయెదురు రూ. చుక్కెదురు. వి. ప్రాతికూల్యం. ఉ. హరి. 3.147. విణ. హానికరమైన, ప్రతికూలమైన. హరిశ్చ. 4.179. చుక్కఱేఁడు వి. చంద్రుడు. రాజవా. 3.10. చుక్కలగమికాఁడు వి. చంద్రుడు. రం. రా. సుందర. 243 వ. 14 పం. చుక్కలచీర రూ. సుక్కలచీరి, సుక్కల్చీరె. వి. అంతటా చుక్కలు పడేట్టు నేసిన చీర. చుక్కలచ్చు వి. మట్టిపాత్రలపై చుక్కలు చుక్కలుగా ముద్రించడానికి వాడేఅచ్చు. చుక్కలతెరవు రూ. చూ. చుక్కలతెరువు, వి. తారాపథం, ఆకాశం. చుక్కలతెరువు రూ. చుక్కలతెరవు, చుక్కలతేరు. వి. తారాపథం, ఆకాశం. అచ్చ. రా.అయోధ్య 37. చుక్కలతేరు రూ.చూ. చుక్కలతెరువు. వి. చంద్రుడు. చుక్కలత్రోవ వి.తారాపథం, ఆకాశం. వేంక. ఆం.దేవ. 20. చుక్కలదొర వి. చంద్రుడు. పె.శకు. 2.187. చుక్కలము వి. దెబ్బ లేదా జబ్బువలన కంటిలో ఏర్పడిన మచ్చ. చుక్కలపేరు వి. తారాహారం. ఆభరణ విశేషం. చుక్కలముగ్గు వి. మధ్యకు పెరుగుతూ అంచులు తరుగుతూ ఉండే చుక్కల మధ్య నుంచి గీసిన ముగ్గు. చుక్కలమూర్తం వి. నక్షత్ర ఫలాన్ని బట్టి పెట్టిన ముహూర్తం. <చుక్క[1] + లు + -అ + సం. ముహూర్త-. చుక్కలరాజు వి. చంద్రుడు. శృం. నై. 1.5. చుక్కలరాయఁడు వి. చంద్రుడు. అచ్చ. రా. బాల. 185. వ్యా. నక్షత్రాలకు ప్రభువు. చుక్కలఱేఁడు వి. చంద్రుడు. శృం. నై. 7.82. వ్యా. నక్షత్రాలకు రాజు. చుక్కలుగోరాడు అ. క్రి. మిన్నంటు. వర. రా. అయో. 323వ. 6పం. చుక్కల్లోకి చూచు స.క్రి. గర్వాన్ని ప్రదర్శించు. చుక్కవాలు వి. ఎదురుచుక్క, ప్రాతికూల్యం. పారి. 2.40. చుక్కవేయు స.క్రి. సారాతాగు. చుక్కెదురు రూ.చూ. చుక్కయెదురు. విణ. హానికరమైన, ప్రతికూలమైన. కాశీ. 7.215. వి. ప్రాతికూల్యం.

చుక్క[2] వి. పుల్లబచ్చ, ఆమ్లవేతసం, వృక్షవిశేషం. ఆం. భా. 2.68.

సం. చుక్ర-. ఆమ్ల వేతసం, చింతపండు.

చుక్కకాఁడ వి. మాగాణి పొలాల్లో మొలిచే ఒకమొక్క (Sterroptyx diaphana). చుక్కకూర వి. ఒకరకం కూరాకు. చుక్కబొట్లలం వి. నేలమీద పాకే కలుపుమొక్క. చుక్కాకు వి. గరేకు, ఒత్తుగా పెరిగిన ఆకు. <చుక్క[2] + ఆకు.

చుక్కలి వి. ఒకానొక చెట్టు (Trophis aspera).

చుక్కా రూ.చూ. సుక్కా. వి. వేయించి వండిన మాంసం, సుక్కా.

చుక్కాకు చూ. చుక్క[2].

చుక్కాని రూ.చూ. చుక్కాను. వి. పడవ నడపటానికి ఉపయోగించే ఒకసాధనం, కర్ణం, అరిత్రం.

చుక్కాను రూ. చుక్కాని. వి. చుక్కాని, పడవను నడపటానికి ఉపయోగించే సాధన విశేషం. పాండు. 2.66.

అ. సుక్కాన్. చుక్కాని ; మరా. సుకాణూం, చుక్కాని ; ఉ. సుక్కాన్. చుక్కాని ; అర. సుక్కాన్.

<ఉ. సుక్కాన్.

చుక్కిళ్ళు వి.బ.వ. ముడతలు.

చుక్కీ వి. దుర్బిణి.

హిం. చుక్కీ. మోసం, దగా.

చుక్కుడునూలు రూ. సుక్కణ్ణూలు. వి. రెండుపోగులు కలిపి, పురిపెట్టిననూలు, గట్టినూలు.

చుక్కెదురు చూ. చుక్క[1].

చుంగు వి. **1.** కుచ్చు. ఆము. 2.75 ; **2.** కచ్చభేదం, కుచ్చె, చింగు. కువల. 2.6 ; **3.** బట్టయొక్క కుచ్చు.

క. చుంగు, జుంగు ; త. చుంకు ; కొలా. జుజె. గుడ్డ ; జుజ్బె. పంచె.

చుంగులువాఱు (-పాఱు) అ.క్రి. మడతలు మడతలుగా ఉండు, కొంగులు అంచులు వేలాడు. చంద్రాంగ. 6.15.

చుంగుడు వి. చిల్లర.

క. చుంగడి చిన్నదిగా ఉండటం, చిల్లర ; తు. చుంగుడి. చిల్లర ; త. చుంకుడు. చిల్లర ; పో. చూ. త. చుక్కు. చిన్నముక్క, ముక్క, నిరుపయోగమైనవస్తువు ;

చుక్కల్. చిన్నముక్క.

<త. చుంకుటు.

**చచ్చా** వి. తోలు, చర్మం. ఆము. 6.69.

**చచ్చు**[1] వి. సంతాప వ్యక్తీకరణ ధ్వనికి అనుకరణం.

**చచ్చుకొట్టు** అ.క్రి. సంతాపం మొ. వాటితో 'చుచ్చు' అను.

**చచ్చు**[2] వి. మేక. ఆం. భా. 2.265.

**చచ్చుబుడ్డి** రూ.చూ. చిచ్చుబుడ్డి. వి. చిచ్చుబుడ్డి.

**చచ్చుఋకు** విశ. మిక్కిలి తీక్ష్ణమైన. రామాభ్యు. 5.199.
<చుర్ + చుఋకు. వర్ణసమీ.

**చుంచాబుడ్డి** రూ. చుంచి బుడ్డి. వి. చిచ్చుబుడ్డి.

**చుంచిబుడ్డి** రూ.చూ. చుంచాబుడ్డి. వి. చిచ్చుబుడ్డి.

**చుంచు**[1] వి. **1.** చిన్నజుట్టు, జుట్టు, సిగ. భార. అరణ్య. 1.300 ; **2.** సింహం, గుర్రం మొ. వాటి జూలు. సారంగ. 1.63 ; **3.** నెమలి జుట్టు. ఆం. భా. 2.96.

క. చుంచు ;

పో. చూ. ప్రా. చుంచుఅ.

**చుంచుకురులు** వి.బ.వ. ముంగురులు, కూశటి. **చుంచుకుఱ్ఱ** వి. పసిబాలుడు, చిన్నవాడు. అచ్చ. రా. బాల. 104. **చుంచుగోడ** వి. చూరుగోడ, మడుసువేసిన ప్రహరీ గోడ. **చుంచుతాడు** వి. కుచ్చుతాడు, మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చు కట్టినదారం. **చుంచుదువ్వు** స.క్రి. కూకటిని పుడుకు, బుజ్జగించు. **చుంచుబండ** రూ. సుంచుబండ. వి. చుంచురాయి, చూరుబండ, చూరురాయి, చూరురౌతు, పెంజరాయి, పెంజసుంచు, మోటిబండ, గోడవెడల్పు కన్నా ఎక్కువ వెడల్పుగా ఉండు వానల నుంచి గోడను కాపాడుతూ ఆచ్ఛాదనంగా రెండు వైపులా ముందుకు పొడుచుకొని వచ్చినరాయి. **చుంచుమిద్దె** వి. కట్టడానికి ముందు భాగంలో ఉండే మిద్దె, ముందుకు చుంచులు వచ్చేటట్లుగా కట్టిన మిద్దె. **చుంచురాకొమరుఁడు** వి. పసిబాలుడు. రామా. 4.9. **చుంచురాయి** రూ.చూ. చుంచుఱాయి. వి. పైకప్పుకు వాడే ఒకరకమైన పలకరాయి. **చుంచుఱాయి** రూ. చుంచురాయి. వి. ఇంటికప్పుకు ఉపయోగించే పలకరాయి. **చుంచులపీట** వి. పట్టుమగ్గానికి పైన, చుంచుతాళ్ళు వేలాడదీసిన పై పట్టె.

**చుంచు**[2] వి. చుండు, గంధమూషికం, కంపెలుక. భార. అను. 4.265.

క. సుండ, సుండిలి, సుండిల్-, ఇలి, సొండిలి, సొండల్ఇలి, చుంచులి, చుంచు. చుంచెలక ; కొడ. చిణెలి ; తు. సుణ్ణెలి. ; త. చుణ్డాన్, చుణ్డెలి, చూఅన్, మూన్-, చూఋ ; పో. చూ. త. చుణ్ణ ; మ. చుంఎలి ; కొలా. చింఁదగ్ ;

పో. చూ.సం. ఛుఛ్ఛో-. మూషికం; ప్రా. చుంచుమ్. చుచ్చుం.

**చుంచెలుక** వి. కంపెలుక. <చుంచు[2] + ఎలుక.

**చుంచుబుడ్డి** వి. చిచ్చుబుడ్డి.

**చుంచెలుక** చూ. చుంచు[2].

**చుటుక్కు** వి. పదార్థాల్ని గోటితో మీటటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**చుట్ట**[1] చూ. చుట్టు. రూ.చూ. చుట్టము. వి. **1.** బంధువు. భార. ఉద్యో. 1.321 ; **2.** వలయం. హరి. ఉ. 9.220 ; **3.** మిత్రుడు. కాశీ. 5.292.

**చుట్టకట్టు** స.క్రి. సరిచేసిన పడుగును పొగడిగా కట్టు. **చుట్టకుదురు** రూ. చుట్టుకుదురు. వి. **1.** కుండ. మొ. సరిగా నిలవడానికి పెంటి. మొ. వాటితో చుట్టి కిందఉంచే చుట్ట. భీమ. 4.39 ; **2.** పొయ్యికి పక్కన ఎత్తుతక్కువగా కట్టిన చిన్న అరుగు. **చుట్టగాలి** రూ. సుట్టగాలి. వి. సుడిగాలి, గిరగిర తిరిగే వాయుగుండం. **చుట్టచుట్టు** స.క్రి. సరిచేసిన పడుగును పొగడిగా చుట్టు. **చుట్టచుట్టుకొనెడిదిట్ట** వి. పాము, కుండలి. **చుట్టజేయు** స.క్రి. సరిచేసిన పడుగును పొగడిగా చుట్టు. **చుట్టతెగులు** వి. ఆకుతోటల్లో పడే తెగులు. **చుట్టనేత** వి. మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగు నూలు. **చుట్టపక్కములు** రూ.చూ. చుట్టపక్కాలు. వి.బ.వ. బంధువులు. శశా. 3.85. **చుట్టపక్కాలు** రూ. చుట్టపక్కములు. వి.బ.వ. బంధువులు. రాధికా. 1.70. **చుట్టబద్ద** వి. బంతి, సొమ్మ, మట్టిపాత్రల కింద కుదురుగా పెట్టే గుడ్డచుట్ట. **చుట్టబిరుతాడు** వి. గుమ్మిదారం, రాటి ఆకులు, పైవీ కిందవీ కలిపి కట్టినదారం. **చుట్టరుగు** వి. ఒత్తరుగు, గోడల చుట్టూ బలానికి గట్టిన ఎత్తుతక్కువగా ఉండే చిన్న అరుగు. <చుట్ట[1] + అరుగు. **చుట్టలు** వి.బ.వ. చుట్టాలు, బంధువులు. భార.ఉద్యో. 3.391. **చుట్టలుగొను (-కొను)** అ.క్రి. చుట్టుకొను. ద్వా.ద. 5.74. **చుట్టలువెట్టు (-పెట్టు)** అ.క్రి. గిరగిర తిరుగు, గుండ్రంగా తిరుగు. ఉ.రా. 6.235. **చుట్టసిప్ప (-చిప్ప)** వి. తొక్కు పెట్టుకోడానికి మహమ్మదీయులు వాడే గుండ్రని మట్టిచిప్ప.

**చుట్ట**[2] చూ. చుట్టు. వి. పొగచుట్ట.

క. చుట్టి. చుట్ట ; త.మ. చురుట్టు ;

మరా. చుట్టా.

**చుట్టపీకె** వి. కాల్చిన చుట్ట, మొదటి ముక్క. **చుట్టసిలుం (-చిలుం)** వి. పొడుగు సొంగ, పొగపీల్చడానికి వాడే మట్టిగొట్టం. **చుట్టసొంగ** వి. సొంగ, పొగపీల్చే మట్టిగొట్టం.

**చుట్ట**[3] వి. పూటీ, బండి చక్ర నిర్మాణంలో వంకరకొయ్యపలక.

**చుట్టకంజేయు** చూ. చుట్టకట్టు. రూ. సుటకంజేయు. స.క్రి. సరిచేసిన పడుగును పొగడిగా చుట్టు.

**చుట్టగు** చూ. చుట్టు.

**చుట్టంచూపు** చూ. చుట్టము.

**చుట్టడిదము** చూ. చుట్టు.

**చుట్టనవేలు** రూ.చూ. చుట్టువేలు. వి. చూపుడువేలు. ర. 4.167.

**చుట్టపుచూపు** చూ. చుట్టము.

**చుట్టపుఁజూపు** చూ. చుట్టము.

**చుట్టపుఁదనము** చూ. చుట్టము.

**చుట్టపుమేరువు** చూ. చుట్టము.

**చుట్టపుమేలము** చూ. చుట్టము.

**చుట్టపుఁబగలు** చూ. చుట్టము.

**చుట్టపురాలు** చూ. చుట్టము.

**చుట్టపువాఁడు** చూ. చుట్టము.

**చుట్టము** రూ. చుట్ట[1]. చూ. చుట్టు. వి. **1**. బంధువు, సంబంధి. భార.ఆది. 2.198 ; **2**. నెచ్చెలి, మిత్రుడు. భార.ఆరణ్య. 1.227 ; **3**. ననుపుకాడు, విటుడు, ప్రియుడు. మను. 4.37.

త. చుఱ్ఱం. స్నేహితులు, బంధువులు ; మ. చుఱ్ఱం. స్నేహం, ప్రేమ.

**చుట్టంచూపు** వి. పిల్లపెత్తనం. **చుట్టపుచూపు** రూ.చూ. చుట్టపుఁజూపు. వి. తరచుగా గాక ఎప్పుడో ఒకసారి వచ్చి చూడటం. **చుట్టపుఁజూపు** రూ. చుట్టపుచూపు. వి. తరచుగా గాక ఎప్పుడో ఒకసారి వచ్చి చూడటం. **చుట్టపుఁదనము** వి. చుట్టరికం, బంధుత్వం. భార. స్త్రీ. 2.103. **చుట్టపుమేరువు** వి. గొప్ప చుట్టం. భార.ఉద్యో. 7.297. **చుట్టపుమేలము** వి. బంధువర్గం, బంధురీత్యా చేసే హాస్యం. పారి. 4.57. **చుట్టపుఁబగలు** వి.బ.వ. హితశత్రువులు. తాళ్ల. సం. 12.198. **చుట్టపురాలు** రూ. చుట్టమురాలు. వి. ఒకనితో అక్రమ సంబంధం కలిగిన స్త్రీ. **చుట్టపువాఁడు** వి. బంధువు. శుక. 1.142. **చుట్టమురాలు** రూ.చూ. చుట్టపురాలు. వి. ఉంపుడుగత్తె, మిండత, చుట్టపురాలు. **చుట్టఱికము** వి. **1**. స్నేహం, మైత్రి. భార.విరా. 1.131 ; **2**. బంధుత్వం. భార.ఉద్యో. 3.126 ; **3**. అంటు, ననుపు, జారత్వ సంబంధం. మను. 2.73. **చుట్టాలసురభి** వి. చుట్టాలకు కామధేనువు వంటివాడు, బంధుప్రియుడు. ఉ.హరి. 5.278. **చుట్టాలుపక్కాలు** వి. బ. వ. బంధువర్గం. పండి.చ.పురా. వు. 288.

**చుట్టఁబెట్టు** చూ. చుట్టు.

**చుట్టఱికము** చూ. చుట్టము.

**చుట్టలుఁగు** చూ. చుట్టు.

**చుట్టగ్లు** చూ. చుట్టు.

**చుట్టగ్లుదొర** చూ. చుట్టు.

**చుట్టవేయు** చూ. చుట్టు.

**చుట్టారము** చూ. చుట్టు.

**చుట్టాలసురభి** చూ. చుట్టము.

**చుట్టాలుపక్కాలు** చూ. చుట్టము.

**చుట్టిల్లు** చూ. చుట్టు.

**చుట్టిల్లుగుడిసె** చూ. చుట్టు.

**చుట్టివచ్చు** చూ. చుట్టు.

**చుట్టు** అవ్య. ద్రు. నలువైపుల. భార.సభా. 1.174. స.క్రి. **1**. ముట్టడించు. కు.సం. 5.82 ; **2**. ఆవరించు. నిర్వ.రా. 56 ; **3**. పరివేష్టించు.హర. 2.15 ; **4**. (తమలపాకులు, చాప, బట్ట, పూలు, తీగలు మొ.) చుట్టు. శృం.నై. 7.63 ; **5**. ప్రదక్షిణించు, వలగొను. కకుత్థ 1.177 ; **6**. (సున్న మొ.) రాయు. అ.క్రి. **1**. గిరగిర తిరుగు. ఆము. 4.81 ; **2**. మూగు, కవియు. కవిక 6.87. వి. **1**. చుట్టటం. ఆము. 4.153 ; **2**. స్త్రీలు కాలి రెండవ వేలికి పెట్టుకొనే గుండ్రని భూషణ విశేషం. ప్రభా. 1.60 ; **3**. ప్రక్క, వైపు. ఉ.రా. 6.235 ; **4**. చుట్ట, వలయం ; **5**. ఆవృత్తి, తడవ, మారు. విశే. **1**. రుజువుకాని, దూరమైన. కళా. 2.4 ; **2**. చుట్టూ ఉన్న, సమీపంగా ఉన్న.

క. సుత్తు. పరిభ్రమించు, తిరుగు, పరిభ్రమణం ; సుత్తిసు. పరిభ్రమింపజేయు ; సుత్త, సుత్తముత్త, సుత్తల్, సుత్తువికె, చుట్టి. చుట్ట ; తు. సుత్త. పరిధి ; సుత్తుని. తిరుగు, వీచు, తిప్పు ; సుందుని, తుత్తుని. ధరించు ; తుత్తు. చుట్ట ; త. చుఱ్ఱి, చుఱ్ఱు, చుఱ్ఱుముఱ్ఱుం. నలువైపుల, చుట్టుపక్కల ; చూఴు, చూఴై. చుట్టుముట్టు ; చూఴావళి, చూఴావారి, చూఴై. గాలిమర ; మ. చుఱ్ఱుక. చుట్టూ తిరుగు ; చుఱ్ఱు. గుండ్రని, ఉంగరం ; చుఴయుక. గుండ్రంగా తిరుగు ; చుఴెక్క. తిరుగు ; చుఴప్పు. వక్రత్వం ; కో. చుత్-చుతి. తిరుగు ; తొ. తుట్. తిరుగు ; కువి. సూతలి, సూతూ. చుట్టు ; పర్జి. చుత్. వీచు ; కొలా. సుట్. వీచు ; నా. సుట్. వీచు ; గ. చుట్. చుట్టు, చుట్టుపక్కల.

**చుట్టగు** అ.క్రి. దూరమగు. కళా. 2.4. <చుట్టు+అగు. **చుట్టడిదము** వి. చక్రాయుధం, సుదర్శనం. ఉ.హరిశ్చ. 1.9. <చుట్టు+అడిదము. **చుట్టఁబెట్టు** స.క్రి. **1**. కలియజేయు, కలుపు. అ.క్రి. తిరుగు. **చుట్టలుఁగు** రూ. చుట్టగ్లు. వి. చక్రాయుధం, సుదర్శనం. <చుట్టు+అలుఁగు. **చుట్టగ్లు** రూ.చూ. చుట్టలుఁగు. వి. చక్రాయుధం, సుదర్శనం. వేంక. ఆం. దేవ. 18. **చుట్టగ్లుదొర** వి. విష్ణువు. చంద్రాంగ. 3.101. **చుట్టవేయు** స.క్రి. చుట్టుకొను. **చుట్టారము** వి. చుట్టు. **చుట్టిల్లు** వి. చుట్టూ గుండ్రంగా గోడ పెట్టి మధ్యలో నిట్రాడు పాతి దూలాలు లేకుండ కట్టిన ఇల్లు. **చుట్టిల్లుగుడిసె** వి. చుట్టుగుడిసె, గుండ్రటి గుడిసె. **చుట్టివచ్చు** స.క్రి. **1**. పరివేష్టించు, చుట్టుకొను. ఉ.హరి. 2.84 ; **2**. ప్రదక్షిణించు. ఆము. 4.81. **చుట్టుకట్ట** **1**. చుట్టుగోడ, ఇంటికి చుట్టూకట్టినగోడ ; **2**. వాసూరకట్ట, ఆకుకప్పు జారకుండా గోడల వెంటనే సపారాన్ని బిగించి కట్టిన పెండెకట్టు ; **3**. గోడలమీదవేసే గుండ్రటి వంపు కొయ్యల చట్రం. **చుట్టుకట్టె** వి. మగ్గం దగ్గర పడుగు చుట్టచుట్టిన కఱ్ఱ. **చుట్టుకండువా** రూ. సుట్టుకండువా. వి. పాగ, తలకుచుట్టుకోటానికి నేసినబట్ట. **చుట్టుకప్పు** వి. ఇంటిచుట్టూ కప్పిన కురుకు కప్పు. **చుట్టుకఱ్ఱ** రూ. సుట్టుకఱ్ఱ, సుట్టుగఱ్ఱ. వి. **1**. మలగఱ్ఱ, నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ ; **2**. రాగోల కట్టె, ఆముకాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకొని రావడానికి వాడే పంగలకట్టె. **చుట్టుకళ్ళం** వి. కోసివేసిన పంటగడ్డి కుప్ప చుట్టూచేసే కళ్ళం. **చుట్టుకాని** వి. కిరగాని, పద్దుకుకాడి మరపటానికి అమర్చిన గానుగ మాదిరి కొయ్య యంత్రం. **చుట్టుకుదురు** వి. గడ్డిబొద్దు. **చుట్టుకైదుపు** రూ.చూ. చుట్టుఁగైదువు. వి. చక్రం, సుదర్శనం. **చుట్టుకైవారం** వి. **1**. మొలతాడు కైవారం ; **2**. పరిధి. **చుట్టుకొను** స.క్రి. **1**. పరివేష్టించు, చుట్టు అలముకొను. ఉ.హరి. 1.10 ; **2**. ఆవరించు, కమ్ము. కాశీ. 4.99, 5.100 ; **3**. పుష్పమాలాదుల్ని వలయాకారంగా ధరించుకొను. ఉ.రా. 1.4 ; **4**. చుట్టుముట్టు, ముట్టడించు. దశా. 2.375 ; **5**. దొంగిలించు. అ.క్రి. గిరగిర తిరుగు. ఆము. 5.123. **చుట్టుకొలారం** రూ.చూ. చుట్టుకొల్లారము. వి. ఇలారం, గుండ్రటి పెంకు

కప్పు. చుట్టుకొలుపు స.క్రి. చుట్టుకొనచేయు. చుట్టుకొల్లారము రూ. చుట్టుకొలారం, చుట్టుకొల్లారు, చుట్టుఁగులారము, చుట్టుఁగొల్లారము. వి. చతుశ్శాల, చుట్టు, మధ్య నాలుగు పక్కలా కట్టడంగల ఇల్లు. రం.రా. సుందర. చుట్టుకొల్లారు రూ.చూ. చుట్టుకొల్లారము. వి. చతుశ్శాల. ఆం భా. 2.14. కవిరాజ. 4.63. చుట్టుకోంర్డ రూ. చుట్టుకోర్న. వి. పొలం చుట్టూవచ్చేట్టు వేసిన కోంర్డ. చుట్టుకోర్న రూ.చూ. చుట్టు కోంర్డ. వి. పొలం చుట్టూవచ్చేట్టు వేసిన కోంర్డ. చుట్టుకోల రూ. చుట్టుగోల. వి. మలగర్ర, నేతపడుగులో చివరి పాయలు బిగించిన కర్ర. చుట్టుకోలు వి. చుట్టు కొనటం. హరి.ఉ. 7.49. చుట్టుగట్టు[1] (-కట్టు) స.క్రి. మలచుట్టు అల్లుచేసిన పడుగును మలలుగా విడదీసి చుట్టు. చుట్టుగట్టు[2] వి. 1. మేరగట్టు, చక్రవాళ పర్వతం. ఉ. హరిశ్చ. 1.31; 2. బావి పళ్ళేనికి చుట్టూ కట్టిన కొద్ది పాటి ఎత్తుగల పలచని గోడ. చుట్టుగంప వి. గుండ్రటిగంప. చుట్టుగాడి వి. గుండ్రంగా ఉండే గాడి. చుట్టుగుడిసె వి. గుండుకొట్టం, గుండుగుడిసె, గుండ్రంగా ఉండే గుడిసె. చుట్టుగుది వి. మగ్గం అచ్చుకు, పలకకు రాపిడి లేకుండా రెంటికీ మధ్య పెట్టిన మెత్త. చుట్టుగులారపిల్లు (-ఇల్లు) చూ. చుట్టుఁగులారము. వి. మధ్యనున్న ఖాళీ స్థలానికి నాలుగు వైపులా గదులున్న ఇల్లు. చుట్టుగుల్ల రూ.చూ. చుట్టుదు గుల్ల. వి. 1. నత్తగుల్ల; 2. గుండ్రని శంఖం. చుట్టుగొట్టం వి. గుండ్రటి గొట్టం. చుట్టుగోడ వి. ఇంటికి చుట్టూకట్టిన గోడ. చుట్టుగోల(-కోల) రూ.చూ. చుట్టుకోల. వి. మలగర్ర, నేత పడుగులో చివరిపాయలు బిగించిన కర్ర. చుట్టుఁగత్తి(-కత్తి) వి. చక్రం. పాండు. 2.33, సుద. 5.60. చుట్టుఁగులారము రూ.చూ. చుట్టుకొల్లారము. వి. నడుమ ఖాళీ చుట్టూ కట్టడం కల ఇల్లు. చుట్టుఁగైదువు రూ. చుట్టుకైదువు. వి. సుదర్శనం, చక్రాయుధం. ఉ.రా. 2.61. చుట్టుఁగైదువుజోదు వి. విష్ణువు. రామాభ్యు. 3.54. చుట్టుఁగొండ వి. చక్రవాళం. వ్యు. భూమిని చుట్టి ఉండే కొండ. <చుట్టు+కొండ. చుట్టుఁగొల్లారము రూ.చూ. చుట్టుకొల్లారము. వి. నడుమఖాళీ, చుట్టూకట్టడం కల ఇల్లు. చుట్టుచట్టం వి. చుట్టింటి చట్రం. చుట్టుచుట్టు రూ. సుట్టుసుట్టు. స.క్రి. మలచుట్టు, అల్లు చేసిన పడుగును మలలుగా విడదీసి చుట్టు. చుట్టుచెంగావి రూ. సుట్టు సెంగాయి. వి. అంచులో చుట్టూ ఎరుపురంగు అద్దిన తెల్ల గుడ్డ. చుట్టుచెంగావిచీర రూ. సుట్టు సెంగాయిసీర. వి. అంచులూ కమ్ములూ చుట్టూ ఎర్రరంగులో నేసిన తెల్లచీర. చుట్టుచౌకం వి. చౌకపిల్లు, పొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిట్రాడిల్లు. చుట్టుఁజవికె వి. నిట్రాడు లేకుండ కట్టిన చుట్టిల్లు. హంస. 5.205. చుట్టుఁజవిరె వి. నిట్రాడు లేకుండ కట్టిన చుట్టిల్లు. హంస. 2.75. చుట్టుడుగుల్ల రూ. చుట్టు గుల్ల. వి. నత్తగుల్ల. హంస. 4.186. చుట్టుతంతె వి. గుండ్రంగా ఉండే మెట్టు. చుట్టుతిరుగు అ.క్రి. చుట్టూ తిరుగు, పరిక్రమించు. చుట్టుదల(-తల) వి. చుట్టటం, పరివేష్టనం. చుట్టుదారి వి. తిన్నగా కాక తిరిగి తిరిగి పోయే మార్గం, దూరం దారి. చుట్టుపట్టు రూ. చుట్టుఁబట్టు. వి. సమీప ప్రాంతం. కాశీ. 3.82. స.క్రి. సరిచేసిన పడుగు చుట్టివేయు. చుట్టుపట్టె వి. వాసూర కట్ట, ఆకుకప్పు జార కుండా గోడల వెంటనే నపారాన్ని బిగించి కట్టిన పెండె కట్టు. చుట్టుపట్టెలు వి.బ.వ. చేనిలో దుక్కి అయిన తర్వాత చుట్టు నాలుగు గనిమల పక్కననే దున్ను చాళ్ళు. చుట్టు పడు అ.క్రి. చుట్టూతిరుగు. చుట్టుపాక వి. గుండ్రటి పాక. చుట్టుపెండె వి. గుండుపెండె, గుండ్రంగా కట్టిన పెండె. చుట్టుపొయ్యి రూ. సుట్టుపొయ్యి. వి. గుండు పొయ్యి, ఒకటే చుట్టు కైవారంగా గుండ్రంగా ఉండే మట్టిపొయ్యి. చుట్టుబట్టీ వి. గుండ్రంగా ఉండే సున్నపుబట్టీ. చుట్టుబండ వి. బావిగోడల మీద చుట్టూ పరిచిన రాతిపలక. చుట్టు బవంతి వి. లోగలి, మధ్యనున్న ఖాళీ స్థలానికి నాలుగు వైపులా గదులున్న ఇల్లు. చుట్టుబారి వి. ఎగుబారి, ఒకసారి మోటలాగిన తరవాత ఎద్దులు మోటబావివైపు ఎక్కి వెళ్ళే దారి. చుట్టుబెట్టు స.క్రి. పాత్రల కంఠానికి చుట్టూ పింజలు పెట్టు. చుట్టుమండె వి. బిళ్ళమండె, గుండ్రంగా వేసిన పొగాకు తోరణాల కుప్ప, గుండ్రంగా వేసిన గడ్డికుప్ప. చుట్టుమాలియ రూ. చుట్టుమాలె. వి. చుట్టు కొల్లారం. చుట్టుమాలె రూ.చూ. చుట్టుమాలియ. వి. చుట్టుకొల్లారం. చుట్టుమిద్దె వి. వలయాకారంలో ఉండే మిద్దె. చుట్టుముట్టు స.క్రి. ముట్టడించు. భార.ఆది. 8.290. చుట్టుముద్ద వి. సుద్ద, సారె పలక మీద వేసిన మట్టిముద్ద. చుట్టుమూటు వి. గుండాం, గుండ్రంగా నేలమీదనే ఇష్టమొచ్చిన చోట చిన్నచిన్న బుడ్లు మొ. కాల్చేచోటు. చుట్టుమేటు వి. గుండ్రంగావేసిన గడ్డివామి. చుట్టుఁబట్టు రూ.చూ. చుట్టుపట్టు. వి. చుట్టూ ఉన్న ప్రదేశం, సమీప ప్రదేశం. కాశీ. 3.82. చుట్టుఁబరువు రూ.చూ. చుట్టుఁబర్వు. వి. అశ్వమండలగతి. <చుట్టు+పరువు. చుట్టుఁబర్వు రూ. చుట్టుఁబరువు. వి. అశ్వమండలగతి. ఉ.రా. 1.68. చుట్టుఁబులుఁగు రూ.చూ. చుట్టుఁబుల్గు. వి. చక్రవాక పక్షి. చుట్టుఁబుల్గు రూ. చుట్టుఁ బులుఁగు. వి. చక్రవాకం కవి.రం. 3.121. చుట్టువడు (-పడు) అ.క్రి. చుట్టచుట్టలుగాపడు, పెనగొను. మను. 5.98. చుట్టువాఱు(-పాఱు) స.క్రి. 1. చుట్టుకొను, పరి వేష్టించు, ముట్టడించు. మను. 3.62; 2. తుమున్నంత రూపంలో చుట్టూ, అంతటా అనే అర్థాన్నిస్తుంది. కాళ. 3.171. చుట్టువాఱుకొను స.క్రి. వేష్టించు. చుట్టువాలు వి. చక్రాయుధం, సుదర్శనం. అచ్చ.రా.బాల. 3. చుట్టువాలు జోదు వి. విష్ణువు. చుట్టువాలుదారి వి. విష్ణువు. చుట్టువాలు దొర రూ.చూ. చుట్టువాల్దొర. వి. విష్ణువు. చుట్టువాల్దాలుపు (-తాలుపు) వి. చక్రధరుడు, విష్ణువు. అచ్చ.రా.యు. 161. వ్యు. సుదర్శన చక్రధారి. చుట్టువాల్దొర రూ. చుట్టు వాలుదొర. వి. విష్ణువు. లక్ష్మీ. వి. 3.61. వ్యు. సుదర్శన చక్రప్రభువు. చుట్టువాల్పేరిపిట్ట వి. చక్రవాకపక్షి. వ్యు. చక్రం అనే పేరుగల పిట్ట. చుట్టువిడియు స.క్రి. ముట్టడించు. చుట్టువు వి. గొడుగు. వ్యు. గుండ్రంగా ఉండేది. చుట్టువెట్టు (-పెట్టు) స.క్రి. 1. బాధించు; 2. ప్రదక్షిణంచేయు. చుట్టువేడెము వి. గుర్రం యొక్క మండల భ్రమణరూపమైన గతి విశేషం. విష్ణుపు. 8.64, దశా. 10.113. చుట్టువేలు రూ. చుట్టనవేలు. వి. చూపుడువేలు. చుట్టుసాళ్ళు వి.బ.వ.

ఆముపడుగులో కుండల పేర్పు మధ్య కట్టెకంపలేయడానికి వదలిన సందులు. చుట్టూత క్రి.విణ.క్రదు. అన్ని వైపుల. చుట్టూర క్రి.విణ.క్రదు. అన్ని వైపుల. చుట్టూరు వి. నాలుగు వైపులు. చుట్టెంట క్రి.విణ.క్రదు. తిరిగిన చోటెల్లా. పండి.చ. 5.480 ప. చుట్టు+వెంట. చుట్టేపు క్రి.విణ. అన్ని వైపుల. చుట్టేయు స.క్రి. అపహరించు. < చుట్టు+వేయు. చుట్లఁబెట్టు స.క్రి. 1. ప్రదక్షిణించు, వలగొను. ఆము. 2.10 ; 2. తిప్పలుపెట్టు, చిక్కులుపెట్టు. మను. 4.42. < చుట్టు+-లు+-అ⁷+పెట్టు. చుట్లు వి.బ.వ. స్త్రీల పాదాల ఉంగరాలు, కాలి మెట్లు. చుట్లువెట్టు(-పెట్టు) అ.క్రి. పరిభ్రమించు, దూరంగా పోక అక్కడక్కడనే తిరుగు. చుట్లువేయు స.క్రి. మలచుట్టు, అల్లుచేసిన పడుగును మలలుగా విడదీసి చుట్టు.

చుట్టూత చూ. చుట్టు.

చుట్టూర చూ. చుట్టు.

చుట్టూరు చూ. చుట్టు.

చుట్టెంట చూ. చుట్టు.

చుట్టేపు చూ. చుట్టు.

చుట్టేయు చూ. చుట్టు.

చుట్లఁబెట్టు చూ. చుట్టు.

చుట్లు చూ. చుట్టు.

చుట్లువెట్టు చూ. చుట్టు.

చుట్లువేయు చూ. చుట్టు.

చుడి వి. తమలపాకుల చిన్నకట్టలు కొన్ని పేర్చి కట్టిన పెద్ద కట్ట.

చుణుదులు వి.బ.వ. బాలక్రీడా విశేషం. ప్రబంధ. 613.

త. చుణంకై. ఒక విధమైన పిశాచనృత్యం.

చుండ రూ. సుండ. వి. కపిలబానకు అమర్చిన తోలుతొండం.

చుండలు వి.బ.వ. సెనగగుగ్గిళ్ళు.

చుండించు చూ. చుండు⁴.

చుండు¹ రూ. చుఁడు. మధ్యమపురుష బ.క్రి. 'చూడుండు' యొక్క లుప్తశేషం. భార. మౌసల. 1.185.

చుండు² వి. ఉప్పు చరచినట్లు తలమీద కలిగే వ్యాధి విశేషం.

క. సుణ్ణు, సుణ్ణొసు, జొణ్ణు ; కొడ. చుండ్ ; త. చుణ్ణు ; మ. చుణ్ణుక, చుళ్ళల్ ; గొ. సూర్. *చుర్-/*చుణ్-;

చుండు³ వి. చుంచు, కంపెలుక.

క. సుణ్ణ, సుణ్ణెలి, సుణ్ణిలిలి, సొండిలి, సొండిలిలి, చుంచిలి. చుంచెలుక ; కొడ. చిణ్ణెలి ; తు. సుణ్ణెలి ; త. చుణ్డాణ్, చుణ్ణెలి, చూఅణ్, యూంచూఱు ; మ. చుణ్ణెలి ; కొలా. చింగ్డాగ్ ; పో.చూ. త. చుణ్ణు ; పో.చూ. సం. ఛుణ్ణో. మూషికా. చుంచు ; చుచుందరీ.

చుండెలుక వి. కంపెలుక, గంధమూషి. < చుండు³+ ఎలుక.

చుండు⁴ అ.క్రి. ఆకులు మొ. వాటి సెగవల్లవాడు, శుష్కించు.

చుండించు స.క్రి. 1. ఎండించు ; 2. ఇంకించు.

చుండు⁵ స.క్రి. మెల్లిగా వేలితో కొట్టు.

చుండుకాయ వి. కాయలు కాయని మగఅటిచెట్టువేసే కడ్డీల వంటి గుండ్రటి పొడుగుకాయలు.

చుండెలుక చూ. చుండు³.

చుండ్రాట్లు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.148.

చుఁడు రూ.చూ. చుండు¹. మధ్యమపురుష బ. క్రి. 'చూడుఁడు' యొక్క లుప్తశేషం. కాశీ. 5.270.

చుదుము వి. ఒకరకం చేప (Trachinius draco).

చునాయించు స.క్రి. బట్టలు మొ. వాటిని మడతపెట్టు.

హిం. చునానా. ఎన్నుకొనేట్లుచేయు.

చుప్పనక రూ.చూ. చుప్పనాక. వి. 1. శూర్పణఖ ; 2. ఓర్వలేనితనం గల స్త్రీ.

చుప్పనాక రూ. చుప్పనక, చుప్పనాతి, చొప్పనాతి, సుప్పనాక, సుప్పనాతి. వి. 1. శూర్పణఖ, రావణుని చెల్లెలు. భాస్క. రా. అరణ్య. 1.133 ; 2. ఓర్వలేని తనంగల స్త్రీ.

సం. శూర్పణఖా. రావణుని చెల్లెలు ; ప్రా. సుప్పణహా, సుప్పణహా, సుప్పణహే.

< సం. శూర్పణఖా (అర్థవిపరి.).

చుప్పనాతి రూ.చూ. చుప్పనాక. వి. 1. రావణుని చెల్లెలు, శూర్పణఖ. భాస్క. రా. అరణ్య. 1.161 ; 2. ఓర్వలేని స్త్రీ.

నాతి (స్త్రీ) శబ్దప్రభావం ఈ చుప్పనాతి పదంపైఉంది.

చుప్పరము వి. మదం, పొగరు. రంగా. చ. 3.185.

చుప్పోలు వి. భక్ష్య విశేషం.

చుప్లిమామిడి వి. మామిడిలో ఒకరకం.

చుబ్బనచూఱ రూ. సుబ్బనసూఱ. వి. పెద్దకొల్ల. భాస్క.రా. యు. 1453. వ్యు. బయట పడేటట్లు చేసే చూర. క్రి. విణ. క్రదు. మనసార.

చుబ్బనచూఱలాడు స.క్రి. పెద్దగా కొల్లకొను. నిర్వ. రా. 8.74. < చుబ్బన చూఱ+-లు+ఆడు.

చుమ అవ్య. చూడుమా. (నిశ్చయాదుల్ని తెలుపుతుంది).

చుమి రూ.చూ. చుమీ. అవ్య. 1. చూడుమీ ; 2. నిశ్చయార్థకం.

చుమీ రూ. చుమి, చుమ్మి, చుమ్మీ. అవ్య. చూడుమీ (నిశ్చయార్థకం). భార. విరా. 1.110.

చుము చూ. చూచు. రూ.చూ. చుమ్ము. మధ్యమపురుష బ. క్రి. 'చూడుము' అనేదాని లుప్తశేషం. కేయూ. 2.118.

చుంపాత చూ. చుమ్మ³.

చుంబడాలు వి.బ.వ. అవ్యక్త చేష్టలు, బులు బుజ్జికాలు.

చుమ్మ¹ వి. వేదన, తీవ్రమైన బాధ, శోకం. ఆం. భా. 1.135.

సం. శ్రమ-.

చుమ్మచుట్లు వి.బ.వ. కడుపులో కలిగే వేదన, కడుపు నొప్పి. ఆం. భా. 3.37. చుమ్మలుచుట్టు అ.క్రి. మిక్కిలి బాధను పొందు. విజయ. 3.135. చుమ్మలువాఱు (-పాఱు) అ.క్రి. చుమ్మలు చుట్టు. శుక. 1.373.

చుమ్మ² రూ. చుమ్మా. అవ్య. నిశ్చయార్థకాదుల్ని తెలిపే శబ్దం.

చుమ్మ³ వి. చుట్టగుడ్డ, బరువు మోసేటప్పుడు తలపై మెత్తదనానికి చుట్టుగా చుట్టి పెట్టుకొనే గుడ్డ.

క. సింబి, సింబె, సివడు, సివడి, సిఫుడు,

సివుడి. చుట్టగుడ్డ ; తు. తుంబుని, తుంబావుని. భరించు, మోయు ; తుంబాఋని, తుమ్మెఋని. మోయు, బాధపడు ; త. చుమ (-ప్ప-,-న్ద్-). బరువును వహించు ; చుమటు. బరువు, చుట్టగుడ్డ ; చుమతలై, చుమైతలై. బరువు, బాధ్యత ; చుమతి. బరువు, అధిక్యం ; చుమత్తు. విధించు, నింపు ; చుమ్మాటు. చుట్టగుడ్డ ; మ. చుమ. బరువు ; చుమక్క. బరువు మోయటం ; చుమటు. బరువు; చుమతల. బాధ్యత, విధి ; పర్జి. కుమ్. తలపైమోయు ; చుంటుల్. చుట్టగుడ్డ ; కొలా. తంట్. తలగుడ్డ ; నా. చుమ్మచ్. చుట్టగుడ్డ. గ. ఒల్లా. కుమ్. తలమీద పెట్టుకొని మోయు ; కురు. కుమ్నా. తలమీద పెట్టుకొని మోయు, బాధ్యునిగా చేయు ; మాల్తో. కుమె. తలపై మోయు, బాధ్యత స్వీకరించు ; బ్రా. కుబేన్. బరువు ; పో. చూ. పర్జి. చుంబక, చుంబటు. చుట్టగుడ్డ ;

ప్రా. చుంభల- ; హిం. చుమ్మల్. చుప్లి ; మరా. చుంబల్. తలగుడ్డ.

చుంపాత వి. చుట్టగుడ్డ. చుమ్మగుడ్డ వి. తలపైన బరువు మోయటానికి పెట్టుకొనే గుడ్డచుట్ట, చుట్టగుడ్డ.

**చుమ్మనాదం** వి. 1. అసభ్య ప్రవర్తన ; 2. పిల్లలఏడ్పు.

**చుమ్మా** చూ. చూచు. రూ.చూ. చుమ్మ[2]. అవ్య. నిశ్చయార్థకాదుల్ని తెలిపే శబ్దం.

**చుమ్మి** రూ.చూ. చుమీ. అవ్య. నిశ్చయాదుల్ని తెలిపే ఉప్పుడు ప్రయోగించే శబ్దం.

**చుమ్మీ** రూ.చూ. చుమీ. అవ్య. నిశ్చయాదుల్ని తెలిపే టప్పుడు ప్రయోగించే శబ్దం.

**చుమ్ము** చూ. చూచు. రూ. చుము. మధ్యమ పురుష బ.క్రి. 'చూడుము' అనే దాని లుప్తశేషం, నిశ్చయాన్ని ప్రసిద్ధిని తెలుపుతుంది. భార. ఆది. 2.69.

**చుమ్ములుకట్టుకొను** స.క్రి. చుట్టుకొను.

**చుయి** రూ.చూ. చుయ్యి. వి. ధ్వన్యనుకరణ శబ్దం.

చుయికొట్టు అ.క్రి. చుయ్యిమను. ధ్వనించు.

**చుయ్యంకి** వి. వాద్య విశేషం, సొనాయి. ఆము. 4.35.

సం. తూర్యక-. వాద్యకాడు ; ప్రా. తూరిఅ-. వాదకుడు.

<సం. తూర్యక- (అర్థవిపరి.).

**చుయ్యి** రూ. చుయి. వి. నిప్పుమీదగాని, కాలినపాత్రలు మొ. వాటిమీదగాని నీళ్ళు చల్లినప్పుడు కలిగేధ్వనికి అనుకరణం.

**చుర** రూ.చూ. చురియ. వి. కత్తి.

చురకత్తి రూ.చూ. చూరకత్తి. వి. ఒకవిధమైన చిన్న కత్తి. హర. 2.115.

**చురక** రూ.చూ. చుఱక. వి. లోహపుకాడ మొ. వాటిని కాల్చి దేహంపైవేసే వాత. విశే. చురుకైన, తీక్షణమైన.

చుఱకతగిలించు స. క్రి. నొప్పి తగిలేటట్లు అను, శాస్తిచేయు. చుఱకటీఁడు వి. పూరుడు. వ్య. పౌరవ కలవాడు.

**చురచుర** రూ.చూ. చుఱచుఱ. వి. 1. చీరడంలో ధ్వనికి అనుకరణం. భాస్క. రా. యు. 1704 ; 2. మండటంలో ధ్వనికి అనుకరణం. ద్వి. హరిశ్చ. పూ. 1883పం ; 3. తీక్షణంగా చూడటం లోని దానికి అనుకరణం ; 4. నిప్పు.

చురచురచూచు స.క్రి. కోపంతో చూచు. కవిక. 2.127.

చురచురలాడు అ.క్రి. 1. కాలు, మండు ; 2. మిక్కిలి కోపపడు. కోపపడు. చురచురవోవు(-పోవు) రూ. చుఱచుఱవోవు. అ.క్రి. 1. మండు, దగ్ధమగు. భార. శల్య. 2.335 ; 2. మిక్కిలి కోపపడు.

**చురవుచ్చు(-పుచ్చు)** రూ.చూ. చుఱవుచ్చు. స.క్రి. దహించు. కాల్చు, నాశనంచేయు.

**చురి** వి. చిన్నకత్తి.

సం. ఛురీ. కత్తి.

<సం. చురీ.

చురిమ్రాను వి. వెలమచెట్టు, ధవవృక్షం. ఆం. భా. 2.45.

**చురియ** రూ. చుర, చూర,[3] చూరి, చూరీ, సురియ, సురె. వి. 1. కత్తి. కు.సం. 11.161 ; 2. ఖడ్గహస్తుడు, అంగరక్షకుడు.

సం. ఛురికా, క్షురికా. చిన్నకత్తి ; ప్రా. ఛూరో, ఛురిఆ, ఛురిగా, ఛురీ. బాకు ; ఛుర-. మంగలి కత్తి ; అ.మా. ఛుర, ఛురియా ; పా. ఛురికా-. కత్తి, బాకు ; అప. ఛురిఅ, ఛురియ.

క. చూరి, సురగి, సురిగి, సురిగె ; తు. చూరి. చిన్నకత్తి ; త. చురికై, చూరి, చూరికత్తి. బాకు ; మ. చురిక, చురియ ; కో. చూరి ; తొ. తూరి ; పో.చూ. త. మ. చూరి.

హిం. ఛూరీ.

<ప్రా. ఛురిఅ.

చురియకాఁడు వి. కత్తిపట్టిన సైనికుడు. కు. సం. 11.40.

చురియవెఱకు (-పెఱకు) స.క్రి. చురపుచ్చు, నాశనం చేయు.

**చురుక** వి. గొడ్లకు వచ్చే దొమ్మరోగం.

**చురుకు** రూ.చూ. చుఱుకు. వి. 1. పాతకమ్మలు కప్పుకొయ్య సాధనం ; 2. మూత్రవిసర్జన చేసేటప్పుడు కలిగే బాధ.

**చురుకుడుబద్ద** రూ. సురుకుడుబద్ద. వి. చూరుకట్టుబద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టడానికి వాడే పరికరం.

**చుఱక** రూ. చురక. వి. లోహపు కాడ మొ. వాటిని కాల్చి దేహంపై వేసే వాత.

చుఱకగు అ.క్రి. ధ్వనించు.

**చుఱకటీఁడు** రూ.చూ. చుఱుకటీఁడు వి. తెంపరి, చురుకుకలవాడు.

**చుఱచుఱ** రూ. చురచుర. వి. 1. తీక్షణంగా చూడటానికి అనుకరణం. కు. సం. 10.144 ; 2. మండటంలో ధ్వనికి అనుకరణం. హరి. ఉ. 8.47 ; 3. అగ్ని, నిప్పు. ప్రబోధ. 4.54 ; 4. చీరడంలోని ధ్వనికి అనుకరణం.

క. చుఱుచుఱు. నూనె, నీరు మొదలైనవి మరిగేధ్వని ; చుర్చు, చుచ్చు. మండు ; తు. చురుచురు. మండటం, వేగటం మొ. వాటిధ్వని ; త. చుఱుచుఱెనల్, చుఱ్ఱెనల్, చురీరెనల్, చురుచురు, చురుచురెనల్పు. మండటం మొ. వాటి ధ్వన్యనుకరణం ; కో. చుర్బుర్, చుర్బురిన్, చురిన్.

పో. చూ.మరా. సుర్ సుర్. తారాజువ్వ చేసేధ్వని.

**చుఱచుఱవోవు (-పోవు)** రూ.చూ. చురచురవోవు. అ.క్రి. మండు, దగ్ధమగు.

**చుఱపుచ్చు** రూ.చూ. చుఱవుచ్చు. స.క్రి. కాల్చు.

**చుఱవుచ్చు** రూ. చురపుచ్చు, చుఱపుచ్చు. స.క్రి. దహించు, కాల్చు, నాశనం చేయు. హరి. ఉ. 2.139, భాస్క.రా. యు. 358.

**చుఱుకటీఁడు** చూ. చుఱుకు.

**చుఱుకరి** చూ. చుఱుకు.

**చుఱుకు** రూ. చురుకు, చుఱుక్కు. వి. **1**. వేడిమి, ఉష్ణం. జైమిని భా. 4.25 ; **2**. పరాక్రమం, శౌర్యం. జైమిని భా. 6.140 ; **3**. ముల్లు మొ. గుచ్చుకొనటం, ఎండ మొ. వేడి సోకటం, తీక్ష్ణంగా చూడటంలో అయ్యేదానికి అనుకరణం. మను. 3.84 ; **4**. క్షతం, గాయం. శుక. 1.137. **5.** వాడి, పదును. నీలా. 1.19 ; **6.** వేగం, వడి. రుక్మి. 2.116 ; **7**. చెట్లమీద ఉండే చీమ. ఆం. భా. 3.49 ; **8.** ఉరి. ఆం.భా. 3.49; **9.** వాత, చురక. విణ. **1**. వేడిమిగల, ఉష్ణమైన. రామాభ్యు. 6.42 ; **2**. తీక్ష్ణమైన, తీవ్రమైన, క్రూరమైన. రసిక. 5.125 ; **3.** వాడిగల, పదునైన. అచ్చ. రా. యు. 364 ; **4.** వేగవంతమైన, శీఘ్రమైన. ఆం. భా. 1.65 ; **5**. సూక్ష్మ బుద్ధిగల.

క. చుఱుకు, చుఱకు, చుర్కు. అధికమైన వేడి, తొందర, వేగం ; కొడ. చురికి. వేగంగల ; తు. చురుకు. తొందర, కంగారు, వేగం ; త. చుఱుక్కు. తొందర, కంగారు ; చుఱుచుఱుప్పు. చుఱుకుతనం; చుఱుతి. వేగం, చురుకుతనం ; చుఱుక్కు. పదును ; చుఱుచుఱుప్పు. వేగం, చురుకుతనం ; కో. చుర్క్. బలమైన, ఉత్సాహమైన, వేగంగల.

**చుఱుకటీఁడు** రూ. చుఱకటీఁడు. విణ. శూరుడు. **చుఱుకరి** వి. పౌరవగలవాడు, శూరుడు. ఆం. భా. 2.185. త. మ. చుఱుక్కన్. చురుకుగలవాడు. **చుఱుకుఁగన్ను** వి. వేడికన్ను, అగ్నినేత్రం. ద్వి. హరిశ్చ. ఉ. 320పం. < చుఱకు + కన్ను. **చుఱుకుచూపు** స.క్రి. బాధించు, కాల్చు. జైమిని భా. 4.25. **చుఱుకుమినుకుతేఁడు** వి. వేడి వెలుగు, సూర్యుడు. రామాభ్యు. 6.42.

**చుఱుక్కు** రూ.చూ. చుఱుకు. వి. **1**. వ్యథ చెందటానికి అనుకరణం. ద్వి. హరిశ్చ. 930పం ; **2.** బాణం పల్లు మొ. గుచ్చుకొనడం, వేడిసోకడం మొ. వాటి అనుకరణం. ఆము. 1.82 ; **3.** కోపంలో అయ్యే అనుకరణం. కువ.చ. 4.178.

**చుఱుచూఁడు** వి. చురుకైనవాత, తీక్ష్ణమైన కాలుపు. ప్రబోధ. 4.54.

**చుఱుచూఁడులుచూఁడు** స.క్రి. చురుకుమని వాత పడేట్లు కాల్చు. పి. శకు. 3.180.

**చుఱువుచ్చు (-పుచ్చు)** రూ. చూ. చుఱ్ఱువుచ్చు. స.క్రి. కాల్చు.

**చుఱ్ఱడుచు** చూ. చుఱ్ఱు.

**చుఱ్ఱను** చూ. చుఱ్ఱు.

**చుఱ్ఱు** వి. కాలటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. యయా. 5.118.

**చుఱ్ఱడుచు** అ.క్రి. బాధకలిగించు. కవిక. 3.92. <చుఱ్ఱు + అడఁచు. **చుఱ్ఱను** అ.క్రి. వెతచెందు. జైమిని భా. 1.89. < చుఱ్ఱు + అను. **చుఱ్ఱుకొను** స.క్రి. కాల్చు. **చుఱ్ఱుచుఱ్ఱు** వి. మిక్కిలి వేడి. **చుఱ్ఱుపుచ్చు** రూ.చూ. చుఱ్ఱువుచ్చు. స.క్రి. బాధించు. **చుఱ్ఱుమను** అ.క్రి. వెతచెందు. శృం. నై. 6.130. **చుఱ్ఱువుచ్చు** రూ. చుఱువుచ్చు, చుఱ్ఱుపుచ్చు. స.క్రి. కాల్చు.

**చులకన** రూ.చూ. చుల్కన. వి. తేలిక. విణ. **1**. తేలికైన; **2.** గౌరవహీనమైన.

**చులకర** రూ. జులుకు, సురుకు. వి. చిట్టె, నాగటిమోకు చివర వేసే ముడి.

**చులుక** రూ. చుల్క. క్రి. విణ. ద్రు. **1**. జంకు లేకుండా భార. ఆది. 6.254 ; **2**. సులభంగా, వేగంగా, అనాయాసంగా. భార. ఆది. 6.260 ; **3**. అనాదరంగా, అగౌరవంగా. భార. శల్య. 2.324. విణ. **1**. తక్కువైన, హీనమైన. భార. ఆది. 7.230 ; **2** సుకరమైన, తేలికైన.

క. చులుక. సులభంగా, వేగంగా, సులువు ; చులక, చులుకు ; త. చుళువ్ర ; కో. చుళ్వ్.

**చులుకఁగాఁబలుకు** స.క్రి. చులకన చేసి మాట్లాడు, కించపరచు. పండి.చ. ప్రథ. 2. 412. **చులుకంజేయు** రూ. చులుకఁజేయు. చుల్కఁజేయు. స.క్రి. **1**. తేలికచేయు, బరువు లేనిదిగా చేయు. భార. భీష్మ. 2 71; **2**. న్యూనపరచు, లాఘవపరచు. **చులుకఁజూచు** రూ. చుల్కఁజూఁచు. స.క్రి. అనాదరంగా చూచు. పె. శకు. 1.43. **చులుకఁజేయు** రూ.చూ. చులుకంజేయు. స.క్రి. **1**. కించపరచు, తక్కువచేయు. భార. ద్రోణ. 1.356 ; **2.** తేలికచేయు. **చులుకన** రూ.చూ. చుల్కన. వి. **1.** తేలిక. భార. సభా. 1.182 ; **2**. వేగం, వడి. హరి. ఉ. 1.39. భాస్క. రా. అరణ్య. 2.381. విణ. **1.** గౌరవ హీనమైన, లాఘవ పాత్రమైన. భార. కర్ణ. 3.52 ; **2**. తేలికైన, బరువులేని. ఆము. 5.63 ; **3.** పలుచనైన, విరళమైన. **చులుకఁదనము** వి. తేలిక, లాఘవం, అగౌరవం, అవమానం. ఉ. హరి. 2.78. **చులుకపడు** రూ. చుల్కపడు. అ.క్రి. **1**. న్యూనమగు, తక్కువగు ; **2**. తేలికపడు. **చులుకపాటు** రూ.చూ. చుల్కపాటు. వి. న్యూనత, లాఘవం.

**చుల్క** రూ.చూ. చులుక. క్రి. విణ. ద్రు. **1**. సులభంగా, వేగంగా. భార. ఆది. 7.197 ; **2**. అనాదరంగా, అగౌరవంగా. విణ. **1**. తక్కువైన, హీనమైన. ఆము. 6.119 ; **2.** సుకరమైన, తేలికైన.

**చుల్కఁజూచు** రూ.చూ. చులుకఁజూచు. స.క్రి. అనాదరంగా చూచు. చెన్న బసవ. పీఠి. 96. **చుల్కఁజేయు** రూ.చూ. చులుకంజేయు. స.క్రి. **1**. తేలికచేయు, బరువు లేనిదిగా చేయు ; **2**. న్యూనపరచు, లాఘవపరచు, **చుల్కన** రూ. చులకన, చులుకన. విణ. **1**. గౌరవహీనమైన, లాఘవపాత్రమైన. భార. ఆది. 6.130 ; **2**. పల్చనైన, విరళమైన. భార. కర్ణ. 1.66. వి. **1**. తేలిక ; **2**. వేగం, వడి. **చుల్కపడు** రూ.చూ. చులుకపడు. అ.క్రి. **1**. న్యూనమగు, తక్కువగు ; **2**. తేలికపడు. **చుల్కపాటు** రూ. చులుకపాటు

వి. న్యూనత, లాఘవం. హరి. ఉ. 8.98. చుల్కఁబారు అ.క్రి. తేలికయగు.

చుల్ల రూ.చూ. చుల్లి. వి. మగగురి, శిశ్నం. వేంక. అం. మాన. 40.

చుల్లకూతలు వి.బ.వ. అబద్ధపు మాటలు. చుల్లజుండు రూ. చుల్లదుండు. వి. మొటిమవంటి చిన్న నెత్తురు గడ్డ. చుల్లదుండు రూ.చూ. చుల్లజుండు. వి. మొటిమవంటి చిన్న నెత్తురు గడ్డ.

చుల్లరము[1] వి. 1. కోడె వయసుగల పంది. చంద్రాంగ. 2.94; 2. ఆడపంది.

చుల్లరము[2] విశే. కఠినమైన. ప్రబంధ. 788. వి. హింస. బాధ.

చుల్లరవెట్టు స.క్రి. హింసించు, బాధపెట్టు. అష్టమ. క. 1.26.పు. 4పం. < చుల్లరము + పెట్టు.

చుల్లరవెట్టు చూ. చుల్లరము[2].

చుల్లాయిమాటలు చూ. చుల్ల. వి.బ.వ. ఎత్తిపొడుపు ఎగతాళి చూడలేని తనం కలగలుపుగా ప్రదర్శించే మాటలు.

చుల్లి రూ. చుల్ల, సుల్ల. వి. మగగురి. శిశ్నం. సాంబ. 2.19.

సం. క్షుద్ర-క్షుల్ల. అల్పమైన; ప్రా. చుల్లి-. చిన్నది; దేశీ. ప్రా. చుల్ల-. అల్పం, శిశువు;

క. తుణ్ణి, తుణ్ణె. చిన్నది; త. చుణ్ణి, చుళ్, చుళ్ళి; మ. చుణ్ణి ,చుళ్ళు.

< ప్రా. చుల్లి-.

చువక రూ.చూ. చువ్వ. వి. 1. ఉపశాఖ; 2. బెత్తం.

చువ్వ రూ. చువక. వి. 1. సన్నగా నిడుపుగా ఉండేరివ్వ, ఉపశాఖ. చిత్రభా. 1.7; 2. శూలం, రాట తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; 3. చూరుకుట్టు బద్దలోని లోహభాగం.

చువ్వకమ్మి రూ. సువ్వకమ్మి. వి. ఒకరకం సన్నటి కమ్మి. చువ్వకుట్టు స.క్రి. చువ్వతొడుగు, పడుగులోగాని, బద్దెలో గాని సన్నబెత్తం దూర్చు. చువ్వకొమ్ము వి. సన్నగా ఉండే కొమ్ము. చువ్వకొయ్య వి. పావుచెక్కల గూటం, మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. చువ్వ తొడుగు స.క్రి. చువ్వకట్టు, పడుగులోగాని బద్దెలోగాని సన్నబెత్తం దూర్చు.

చువ్వన రూ. చువ్వున. క్రి. విశే. ద్రు. చివ్వున, శీఘ్రంగా. నవనాథ. 1.19 పు. 16పం.

చువ్వరించు రూ.చూ. జువ్వరించు. అ.క్రి. విజృంభించు.

చువ్వున రూ.చూ. చువ్వన. క్రి. విశే. ద్రు. చివ్వున, శీఘ్రంగా. నవనాథ. 1.53పు. 8పం.

చువ్వె రూ. చువ్వే. అవ్య. ప్రసిద్ధి, నిశ్చయం మొ. వాటిని తెలిపే శబ్దం. భార. అరణ్య. 1.222.

చువ్వే రూ.చూ. చువ్వె. అవ్య. ప్రసిద్ధి, నిశ్చయం మొ. వాటిని తెలిపే శబ్దం. భార. శాంతి. 4.68.

చూ రూ. చుమీ. అవ్య. చూడుము, చూడుఁడు, మొ. వాటి లుప్తశేష రూపం. ప్రసిద్ధిని, నిశ్చయాన్ని తెల్పుతుంది. భార. ఆది. 3.219.

చూక వి. దండె దగ్గర పోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేత పడుగులో దూర్చిన సన్న బెత్తం.

చూకరాయి వి. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి అవతలకు వేలాడ దీసిన రాయి.

చూకురు వి. 1. శోకం, దుఃఖం. సిం.ద్వా. 12.37; 2. కలత; 3. బాధ.

సం. శోక-. దుఃఖం.

చూకురుపడు అ.క్రి. 1. శోకించు, దుఃఖించు. బ్రహ్మో. 2. ఆ; 2. కలత చెందు.

చూచా రూ.చూ. చూచాయ. వి. స్వల్పం, కొంచెం.

చూచాయ చూ. చూపు. రూ. చూచా. వి. 1. జాడ; 2. తెలిక.

ప్రో.చూ. సం. సూచనా. ప్రకటించడం, వ్యక్తం చేయటం.

< చూపు + చాయ.

చూచాయగా క్రి.విశే.ద్రు. 1. సూచన ప్రాయంగా. రాధా. 1.6; 2. స్వల్పంగా; 3. చూచీ చూడనట్లుగా; 4. అస్పష్టంగా.

చూచికొను చూ. చూచు.

చూచిచూచి చూ. చూచు.

చూచిపెట్టు చూ. చూచు.

చూచివాడుకొను చూ. చూచు.

చూచు స.క్రి. 1. వీక్షించు, కనుగొను, దర్శించు. భార.ఆది. 4.99; 2. ఎరుగు, తెలుసుకొను. భార.ఆది. 6.249; 3. ఎంచు, తలచు. కు.సం. 10.151; 4. పరిశీలించు, పరీక్షించు. భార.విరా. 2.89; 5. ఆలోచించు, విచారించు. భార.ద్రోణ. 2.105; 6. చేయు, ధాతువువలె ఇతర క్రియలతో కూడి ప్రేరణార్థాన్ని ఇస్తుంది. భార. అను. 1.13; 7. చేయు, కావించు. హరి.పూ. 1.130; 8. గురిచేయు, లక్ష్యంగొను. ఉ.హరి. 4.234; 9. పాటించు, లెక్కచేయు, లక్ష్యపెట్టు. వరాహ. 10.36; 10. ఆదరించు, మన్నించు. పారి. 1.41; 11. ఎదురు చూచు. ఆము. 3.39; 12. జాగ్రత్తగా చూచు, కాపాడు. ఆము. 4.245; 13. చదువు, పఠించు. కాళ. 13; 14. అనుభవించు. వసు. 4.28; 15. వెదకు, అన్వేషించు. సుద. 2.64; 16. ముట్టు, అంటు, తాకు. జాహ్నవీ. 4.34. అ.క్రి. 1. యత్నించు, పూను, ఉద్యమించు. నిర్వ.రా. 3.67; 2. ఉత్సహించు, అభిలాషపడు. కవిక. 1.36.

క. చూపు. వీక్షించు, కనుగొను, దర్శించు; చూటి-సూటి. లక్ష్యం, గురి; కొడ. తుడుకు. పరీక్షించు; తు. సూపిని, తూపిని, హూపిని. చూచు, పరీక్షించు, కనుగొను, పరిశీలించు, ఆలోచించు, లక్ష్యపెట్టు; తూపాఫని. చూపించు; సూకె. దృష్టి; త. చూళ్. ఎంచు, కనుగొను, తెలుసుకొను, ఆలోచించు; చుఁబ్చి. ఆలోచన, తెలివి, జ్ఞానం; చూఝ్చి. ఆలోచన, పరిశీలన; చూఝ్చియఁణ్. మంత్రి; ఉఱుకు. ధ్యానించు, ఆలోచించు; చుట్టు. ఎత్తిచూపు, లక్ష్యపెట్టు; తుంటు. గమనించు, లక్ష్యపెట్టు; మ. చూటుక. సరిచేయు; చుట్టు. ఎత్తి

చూపు ; గోం. హుఱానా, సుఱానా. చూచు ; హుఅ స్థానా. చూపు ; సూరానా. వీక్షించు, ఎదురుచూచు ; సూఙ్-హుఙ్. ఎదురు చూచు ; కొంద. సూఙ్. చూచు ; కుఇ. సూఙా(సూఙ్). చూచుట ; సూటు. వేలెత్తిచూపు ; పర్జి. చూఙ్. చూచు ; గ. సూఙ్‌సూఙ్ ; బ్రా. హున్నింగ్. చూచు, ఎదురుచూచు, ఆలోచించు.

<మూ.ద్రా.*చూ-/*తూ-.

చూచికొను రూ.చూ. చూచుకొను. స.క్రి. ఎదురు చూచు, వీక్షించు. చూచిచూచి వి. ఎంతోకాలం నిరీక్షించి. చూచిపెట్టు స.క్రి. పనిచేసిపెట్టు. చూచివాడుకొను స.క్రి. జాగ్రత్తగా వాడుకొను. చూచుకొను రూ. చూచికొను. స.క్రి. 1. గమనించు ; 2. ఏరుకొను. చూడఁగలవాఁడు రూ. చూడఁగలాఁడు. వి. మన్మథుడు. రాజవా. 3.75. విణ. చూడతగినవాడు, అందగాడు. విజయ. 2.164. చూడఁగలాఁడు రూ.చూ. చూడఁగలవాడు. విణ. మన్మథుడు. విణ. చక్కనివాడు. చూడఁగాఁజూడఁగా క్రి.విణ.ద్రు. 1. చూస్తూ ఉండగానే. మను. 3.23 ; 2. ఎక్కువగా చూడగా. చూడఁజాలక అవ్య. చూచి సహించలేక. కాశీ. 2.80. చూడఁజూడన్ క్రి.విణ.ద్రు. 1. చూస్తూ ఉండగానే. భార.ఆది. 2.81 ; 2. చక్కగా పరిశీలింపగా. వేమన. 1.18. చూడదొడ్డమంచముకోడు వి. పై ఆటోపమే కాని లోపల ఏమీ లేదనటం (అర్థవిపరి.). చూడనోడు(-ఓడు) అ.క్రి. చూడటానికి సిగ్గుపడు. చూడముచ్చటగు అ.క్రి. కన్నులపండుగగు. చూడఁబోయినతీగ కాళ్లఁదగులు అ.క్రి. వెదకబోయినదే ఎదురగు. సుద. 2.64.

చూటిది చూ. చూలు. వి. చూలుతో ఉన్నపశువు.

చూట్కి రూ.చూ. చూడ్కి. వి. దృష్టి, కన్ను.

చూడఁగలవాఁడు చూ. చూచు.

చూడఁగలాఁడు చూ. చూచు.

చూడఁగాఁజూడఁగా చూ. చూచు.

చూడఁజాలక చూ. చూచు.

చూడఁజూడన్ చూ. చూచు.

చూడదొడ్డమంచముకోడు చూ. చూచు.

చూడనోడు చూ. చూచు.

చూడబుత్తి వి. ఒకరకం కలుపు మొక్క.

చూడముచ్చటగు చూ. చూచు.

చూడఁబోయినతీగకాళ్లఁదగులు చూ. చూచు.

చూడామణిగడిచీర వి. తెలుపు, నలుపు రంగుల్లో చిటికెన వేలెడువెడల్పు చారలు పడేట్లు నేసిన గళ్ళ చీర.

నం. చూడామణి-. తలమానికం.

<నం. చూడామణి-+గడిచీర.

చూడి[1] రూ.చూ. చూఁడు[2]. వి. 1. పశువు చూలు, పశు గర్భం ; 2. చూలు కలది.

చూడియావు (-ఆవు) రూ. చూఁడియావు. వి. గర్భంతో ఉన్న ఆవు.

చూడి[2] వి. ఏర్పడుతున్నఎన్ను, ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను.

చూడికి రూ.చూ. చూడ్కి. వి. 1. దృష్టి, చూపు. పండి.చ. 1.52 ; 2. కన్ను ; 3. పోలిక.

చూడ్కి రూ. చూట్కి, చూడికి. చూ. చూచు. వి. 1. దృష్టి, చూపు. భార.ఆది. 5.256, కు.సం. 7.80 ; 2. విధం, రీతి. శృం.నై. 2.100 ; 3. కన్ను, భాగ. 10పూ. 989.

చూడ్కికందు అ.క్రి. కనపడు, తోచు. కాశీ. 4.130. చూడ్కిపండువు వి. కన్నులపండగ, నేత్రపర్వం. పారి. 3.52. చూడ్కులపండువు వి. కన్నులపండగ, నేత్రపర్వం. పారి.1.1.

చూడ్కులపండువు చూ. చూడ్కి.

చూఁడి రూ.చూ. చూఁడు[2]. వి. 1. చూలు, గర్భం ; 2. గర్భం కలది.

చూఁడిగేదె వి. కడుపుతో ఉన్న బఱ్ఱె. చూఁడియావు (-ఆవు) రూ.చూ. చూడియావు. వి. కడుపుతో ఉన్న గోవు.

చూఁడించు చూ. చూఁడు[1].

చూఁడు[1] స.క్రి. 1. దహించు, కాల్చు. భార.అశ్వ. 3.169 ; 2. దీపం మొ. వాటిని వెలిగించు, అంటించు. మను. 5.44.

క. సుడు(సుట్టు). కాల్చిన, వేపిన, ఉడికించిన ; సుడుక. కాల్చేవాడు; సుడవికె, సుడుహ. కాలే, మండే ; సుడు-గాడు. స్మశానం ; సూడు-కాలే, సుంటుగె. కాల్చిన మాంసం ; సూఱె. గడ్డితో చేసిన దివిటి ; సొడ, సొడరు, సొడలు. దీపం ; కొడ. చూడ్. కాలే ; చూడ-గళ. స్మశానం ; తుడి. కాగడా ; తు. సుడిపిని, సుడ్పిని, తుడుపిని. కాలే, మండే ; సుడవె. కాలేశవం ; సుడుగాడ్డు. స్మశానం ; సుడ్పుడు. గొంతుమంట ; సుతరం, తడరం, తుడారు. దీపం ; చూడు. వేడి ; సొడరు. కమురుకంపు ; సూటె-టూటె. కాగడా (కొబ్బరాకులతో చేసినది) ; చుట్టూ. కాల్చిన, ఉడికించిన, కాగడా, దివిటీ ; త. చూటు. వేడి చేసిన, కాల్చిన, ఉడికించిన ; చూటర్. వెలుగు, కాంతి, మంట, సూర్యుడు, చంద్రుడు, గ్రహం ; చూటల్. కాలుతున్న కట్టెనుండి వచ్చే నూనెబొట్లు, వెలిగే దీపం నుండి రాలే నూనె బొట్లు ; చూటలై, చూటు-కాటు. స్మశానం ; మ. చూటుక. కాల్చు, దహించు ; చూటువిక్క. అంటించు ; చూటర్. కాంతి, నిప్పు ; చూటుల. స్మశానం ; చూటు. కాలు ; చూట్టు. కాగడా ; కో. తుర్. కాల్చు ; చు.ర్.గ.ర్. స్మశానం ; చు.ర్. వేడి, కాల్చిన ఇనుముపై సుత్తితో కొట్టినప్పుడు వచ్చే కాంతి ; తొ. తుర్(తుట్-). కాల్చు ; కుఇ. సొడు. నిప్పుగూడు, పొయ్యి ; కువి. వదాని. కాల్చు ; హుటనై. కాలు, రగులుకొను ; కొలా. సుడ్. వండు ; చుర్. కాల్చటం ; కురు. కుర్నా(కుట్టన్). వేడి చేసిన, వండబడిన ; మాల్తో. కుఙ్(కుట్). కాల్చు ; కుఙ్నఙ్. వేడి ; కుర్బ్. వేడి, కాంతి ; -కుఙ్. కాల్చు.

పో.చూ. ప్రా. చుడులి. కాగడా, దివిటీ ; మరా. చుడీ. దివిటీ, కాగడా (గడ్డితో చేసినది).

చూఁడించు స.క్రి. తగలబెట్టు. చూఁడుఁగొడుపు వి. పశువులకు వాత వేసే ఇనపకోల. హరి.పూ. 6.21.

<చూఁడు[1]+కొడుపు.

చూఁడు[2] రూ. చూడి[1], చూఁడి. వి. పశుగర్భం. నీలా. 3,55.

క. చూల, సూల. గర్భం ; త. చూల్. కడుపుతో

ఉండు, గర్భం, గుడ్డు ; మ. చూలి. గర్భం.
మూ.ద.ద్రా. *చూల్.

**చూపట్టఁగలది** చూ. చూపు[1].

**చూపట్టు** చూ. చూపు[1].

**చూపడు** చూ. చూపు[1].

**చూపరానిచోటు** చూ. చూపు[1].

**చూపరి** చూ. చూపు[1].

**చూపఱ** చూ. చూపు[1].

**చూపఱు** చూ. చూపు[1].

**చూపఱులు** చూ. చూపు[1].

**చూపించు** చూ. చూపు[1].

**చూపిడు** చూ. చూపు[1].

**చూపు**[1] చూ. చూచు. వి. **1.** దృష్టి, వీక్షణం. భార. ఆది. 4.95 ; **2.** చూడటం, దర్శనం. నిర్వ. రా. 7.135 ; **3.** కనబడటం, అగపడటం. హరి. పూ. 7.33 ; **4.** కన్ను, నేత్రం. ఇందు. 2.20 ; **5.** చక్కన. అ.క్రి. పొడచూపు, కనపడు. భార. విరా. 4.91. స.క్రి. **1.** కనబరచు, అగపరచు, వ్యక్తంచేయు, ప్రకటించు. భార. ఉద్యో. 3.6 ; **2.** ఏర్పరుచు. హరి. పూ. 1.40 ; **3.** కలిగించు. కాశీ. 1.90 ; **4.** పెట్టు, ఇచ్చు. జైమిని భా. 2.16.

**చూపట్టఁగలది** విశ. చూడదగిన, రూపసిఅయిన. శుక. 3.151. <చూపు+పట్టు+-అ[1]+కల+అది. **చూపట్టు** అ.క్రి. కనపడు, ప్రత్యక్షమగు, గోచరమగు, తోచు. కాశీ. 4.118. < చూపు+పట్టు. **చూపడు** అ. క్రి. చూపట్టు, కనపడు. సమీర. 1.179. <చూపు+పడు. **చూపరానిచోటు** వి. మర్మస్థలం. **చూపరి** వి. చూడతగినవాడు, అందగాడు. హంస. 4.147. <చూపు+-అరి. **చూపఱ** రూ. చూపఱు. విశ. బ.వ. చూచేవారు, ద్రష్టలు. భార. ఆది. 6.17, కు. సం. 2.66. **చూపఱు** రూ. చూ. చూపఱ. విశ. బ.వ. చూచేవారు, ద్రష్టలు. కు. సం. 8.66, భార. భీష్మ. 1.288. **చూపఱులు** వి.బ.వ. చూస్తున్నవారు. భార. విరా. 1.82. **చూపించు** స. క్రి. చూపు, కనపరచు. <చూపు+-ఇంచు[3]. **చూపిడు** స.క్రి. గురిపెట్టు, కన్నువేయు, లక్ష్యం ఉంచు. <చూపు+ఇడు. **చూపుగుల్లము** రూ. చూపుడు గుల్లము. వి. చూడటానికి గుర్రంలాగ ఉండి పనికి ఉపయోగపడనివాడు. ద్వి. హరిశ్చ. ఉ. 1496పం. **చూపుచెక్క** వి. గొడుగు బల్లమీద వేసే లతలుచెక్కిన చెక్క. **చూపుచెంగు** వి. నేత మొదట నేసిన చెరగు. **చూపుటోయము** వి. ఒక విధమయిన పన్ను. నెల్లూరి శాసనాలు. కనిగిరి శాసనం. క్రీ. శ. 1534. **చూపుడు** విశ. చూడటానికి చక్కగా ఉండే, అందమైన. భార. ఉద్యో. 4.387. **చూపుడుకత్తి** వి. జాతరలో పోతును నరికేటప్పుడు పైకెత్తి చూపేకత్తి. **చూపుడుకోడె** వి. బాగా మేపి చూడటానికి అందంగా ఉండే పశువు. **చూపుడుగుల్లము** రూ.చూ. చూపుగుల్లము. వి. చూడటానికి గుర్రంలాగ ఉండి పనికి ఉపయోగపడని వాడు. **చూపుడుఁగొంగు** (-కొంగు) వి. బట్టలమ్మేవాడు మడతలో పైకిపెట్టి చూపే మంచి చెరగు. **చూపుడుఁగోక** (-కోక) వి. అవతలి నుంచి ఇవతలకు కనపడే కోక, పలచని నేతగల కోక. **చూపుడుఁబూటి** విశ. దృశ్యాలు చూపడానికి ఒప్పుకొన్న పూట కాపు. విజ్ఞా. వ్యవ. 86. **చూపుడుప్రేలు** వి. బొటనవేలి తర్వాతి వేలు, తర్జని. **చూపుదోషం** వి. ముట్టుమైల, చూపుమైల వల్ల కలిగేదోషం. **చూపునేత** వి. బట్టముందరి భాగంలో మూరెడు పొడుగు నేసిన నేత. **చూపుబద్ద** వి. గొడుగుబల్లమీద వేసే లతలుచెక్కిన చెక్క. **చూపుముగరం** వి. గోడలో దర్వాజాకు పక్కన నాటిన కొయ్య స్తంభం. **చూపెట్టు** స.క్రి. **1.** ఉపేక్షతో చూచు, తటస్థంగా ఉండి చూచు. ఉ.రా. 5.11 ; **2.** జాగ్రత్తగా చూచు, ఏకదృష్టితో చూచు. సారంగ. 1.122 ; **3.** చూపించు. <చూపు+పెట్టు. **చూపోవు** అ.క్రి. చూచిసహించు, ఓర్చు. భార. శాంతి. 2.396. <చూపు+ఓవు. **చూపోర్చు** అ.క్రి. సహించు, ఓర్చు. వర. రా. అయోధ్య. పు. 247 పం. 14. **చూప్పట్టె** వి. దర్వాజా చట్రపుపైకమ్మి.

**చూపు**[2] వి. ఎదురు.

**చూపెట్టు** చూ. చూపు[1].

**చూపోవు** చూ. చూపు[1].

**చూపోర్చు** చూ. చూపు[1].

**చూప్పట్టె** చూ. చూపు[1].

**చూర**[1] రూ.చూ. చూఱ. వి. కొల్ల, దోపుడు, కొల్లగొన్న వస్తువు. పల్నా.

**చూరకాఁడు** రూ.చూ. చూఱకాఁడు. వి. దోచుకొనేవాడు, కొల్లగొట్టేవాడు. **చూరకొను** రూ.చూ. చూఱకొను. స.క్రి. **1.** కొల్లపెట్టు, దోచుకొను ; **2.** వ్యర్థంచేయు. **చూరగా** క్రి.విశ. ద్రు. స్వేచ్ఛగా. **చూరపుచ్చు** రూ. చూఱపుచ్చు. స.క్రి. **1.** దోచుకొను, కొల్లపెట్టు ; **2.** వ్యర్థంచేయు. **చూరపోవు** రూ.చూ. చూఱవోవు. అ.క్రి. **1.** కొల్లపోవు ; **2.** పాడగు. **చూరయిచ్చు** రూ. చూ. చూఱయిచ్చు. స.క్రి. ఎక్కువగా ఇచ్చు. **చూరయేట** వి. బలిమేక. **చూరలాడు** రూ.చూ. చూఱలాడు. స.క్రి. దోచుకొను, కొల్లపెట్టు, వ్యర్థంచేయు. **చూరవిడుచు** రూ.చూ. చూఱవిడుచు. స.క్రి. కొల్లగొట్టి వదిలివేయు. పల్నా. **53.** **చూరాడు** రూ.చూ. చూఱాడు. స.క్రి. **1.** దోచుకొను, కొల్లపెట్టు ; **2.** వ్యర్థంచేయు.

**చూర**[2] వి. **1.** పొడి ; **2.** వజ్రాల చూర ; **3.** ముత్తెపు చూర ; **4.** కార్లీ, సన్నటి ముక్కలు.
సం. చూర్ణ-. పొడి.

**చూరబొగ్గు** వి. పొడిగా మారిన బొగ్గు. **చూరవక్క** వి. వక్కపొడి.

**చూర**[3] రూ.చూ. చురియ. వి. చిన్నకత్తి.

**చూరకత్తి** రూ. చురకత్తి, చూరుకత్తి. వి. ఒకవిధమైన చిన్నకత్తి. ద్వి. భార. 1.16 పు.
క. చూరికత్తి. చిన్నకత్తి ; త. చూరిక్కత్తి.

**చూరణ** వి. మల్ల విద్యా విశేషం, ఒక విధమైన నరుకు. మల్లు. పు. 3.69.
సం. చూర్ణ-. పొడి.
<సం. చూర్ణ-.

**చూరణనఱకు** వి. కత్తి పోరులో ఒకరకం వేటు.

ప్రబంధ. 78.

**చూరాడు** చూ. చూర[1].

**చూరి** రూ.చూ. చురియ. వి. 1. కృపాణికాగ్రం, కత్తిమొన. ఆం. భా. 2.214 ; 2. ఒక విధమయిన చిన్న కత్తి. ఆం. భా. 2.217.

**చూరికట్టుపుల్ల** చూ. చూరు[1].

**చూరియావు** వి. ఒకవిధమైన రంగుగల ఆవు.

**చూరీ** రూ.చూ. చురియ. వి. 1. చిన్నకత్తి ; 2. కత్తిమొన.

**చూరు**[1] వి. బౌ. ఇంటికప్పు మొ. వాటి అంచు. పండి. చ. 1.41 ప.

క. చూరు, సూర్, సూరు. చూరు, ఇంటికప్పు మొ. వాటిఅంచు ; కో. వ.చ.ర్. ; పర్జి. ఘునిర్ : చూరు.

**చూరికట్టుపుల్ల** వి. పూరింట ఆకుకప్పును కప్పడానికి వాడే పరికరం. **చూరుకమ్మి** వి. చూరుపట్టె, పెండెలు జారి రాకుండా ముందు చూరుకు ఎత్తుగా అమర్చిన పట్టె. **చూరుక్ర్ర** వి. చూరిన క్ర్ర. **చూరుకుట్టు** రూ. చూరుకుర్రు. వి. ఇంటిమీది ఆకులు మొ. గాలికి చెదరకుండా గట్టిగా ఉండటానికి నార మొ. వాటిలో కుట్టే కుట్టు. **చూరుకుట్టుదబ్బ** రూ.చూ. చూరుకుట్టుబద్ద. వి. పూరింటి ఆకుకప్పు కుట్టడానికి వాడే పరికరం. **చూరుకుట్టుబద్ద** రూ. చూరుకుట్టుదబ్బ. వి. చూరుకుట్టడానికి నారగుచ్చేదబ్బనం లాగ ఉపయోగించే వెదురుబద్ద మొ. **చూరుకుండిబద్ద** వి. పూరింటి ఆకుకప్పును కుట్టడానికి వాడే పరికరం. **చూరుకుర్రు** రూ.చూ. చూరుకుట్టు. వి. కార్తీసుపని, చూరుమట్టు, చూరుదించడం, చూరుదగ్గర అల్లినపెండి. **చూరుకొయ్య** వి. చూరు అందంగా ఉండటానికి పెట్టే సన్నటి చూరుచెక్క. **చూరుగొల్లచ్చి** వి. పూరింటి ఆకుకప్పును కుట్టడానికి వాడే పరికరం. **చూరుచెక్క** వి. 1. పాణిబల్ల, మోలియ చెక్క, పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క ; 2. తుండేటి బల్ల, నజరుకడ్డీ, నదరుపట్టె ; 3. చూరుమట్టం సరిచేసిబాగుచేయటానికి వాడే సన్నటి బద్ద. **చూరుడుబద్ద** రూ.చూ. చూరుబద్ద. వి. పూరింటి ఆకుకప్పును కుట్టడానికి వాడేపరికరం. **చూరుదబ్బ** రూ.చూ. చూరుబద్ద. వి. 1. పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి బద్ద ; 2. పూరింటి ఆకుకప్పు కుట్టడానికి వాడేపరికరం. **చూరుదిమ్మ** వి. చూరు జారకుండ కప్పుమీద వేసే పట్టి. **చూరుదూలం** వి. ముంజూరు దగ్గరకు పొడుచుకు వచ్చిన దూలం. **చూరుపట్టి** రూ.చూ. చూరుపట్టె. వి. 1. పెంకుటింటి చూరుకిందవేసిన వెడల్పాటి చెక్క ; 2. చూరువెంట కప్పుమీద వేసే సున్నపుపట్టి. **చూరుపట్టివాసం** వి. పంచదించడానికి గుర్రపు కొయ్యల మీద వేసిన అడ్డ వాసం. **చూరుపట్టె** రూ. చూరుపట్టి. వి. చూరుకమ్మి, పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క. కరి. శ. 29. **చూరుపని** వి. చూరుదించడం. **చూరుపెండి** వి. 1. చూరుదగ్గర అల్లిన పెండి ; 2. ఆకు కప్పులు జారకుండా గోడల వెంటనే సపారాన్ని బిగించి కట్టినపెండెకట్టు. **చూరుప్లేటు** వి. బాల్కనీ గోడమీదనుంచి ముందుకు పొడుచుకు వచ్చిన కప్పు. ఇం. *Plate*. పశ్చిం. <చూరు[1]+ఇం. Plate. **చూరుబండ** వి. గోడకన్న ఎక్కువ వెడల్పుగా ఉండి, ఎండ వానల నుంచి గోడను కాపాడుతూ ఆచ్ఛాదనంగా రెండు వైపులా ముందుకు పొడుచుకు వచ్చిన రాయి. **చూరుబద్ద** రూ. చూరుడుబద్ద, చూరుదబ్బ. రూ. చూరుకుబద్ద. వి. 1. చూరుచెక్క, పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క ; 2. పూరింటి ఆకుకప్పు కుట్టటానికి వాడే పరికరం. **చూరుబల్ల** వి. పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క, ఇంటిచూరుకింద వాసాలకు బిగించే బల్ల. **చూరుమట్టు** వి. చూరుకుట్ట, చూరు దించడం. **చూరుముద్ద** వి. మిద్దె చూరు బండమీదవేసే మట్టిపాత్ర. **చూరుమొగ్గ** వి. చూరుకమ్మిలో మొగ్గలాగ ఏర్పడే అలంకార విశేషం. జైమిని భా. 5.157. **చూరురాయి** వి. గోడకన్నా ఎక్కువ వెడల్పుగా ఉండి ఎండవానలనుంచి దాన్ని కాపాడుతూ ఆచ్ఛాదనంగా రెండువైపులా ముందుకు పొడుచుకు వచ్చిన రాయి. **చూరురౌతు** వి. గోడకన్నా ఎక్కువ వెడల్పుగా ఉండి ఎండవానలనుంచి దాన్ని కాపాడుతూ ఆచ్ఛాదనంగా ముందుకు పొడుచుకొచ్చిన రాయి. **చూరువట్టివ్రేలాడు** అ.క్రి. ఎంతకూ వదలకుండా ఉండు. కవి.ర. 3.104. **చూరువట్టివ్రేలు** అ.క్రి. ఎంతకూ వదలకుండా, చూరుపట్టుకొని వేలాడు. కాశీ. 5.193. **చూరువట్టుకవ్రేలాడు** అ.క్రి. ఎంతకూ వదలకుండా, చూరుపట్టుకొని వేలాడు. సిం.నార.శ. 41. **చూరువాసం** వి. పంచదించడానికి గుర్రపు కొయ్యలమీద వేసిన అడ్డవాసం. **చూరుసల్పు** వి. గోడమీది చూరుబండ. **చూరెలుక** వి. చూరుల్లో ఉండే ఒకజాతి చిన్న ఎలక.

**చూరు**[2] వి. వక్కలు మొ. వాటి పొడి. అప్ప. 2.429.

క. చూరు, చూరిసు, ముక్కలుగా చేయు ; చూర. ముక్క, భాగం; తు. చూరు. ముక్క, తునక ; త. తూజి. పొడి, దుమ్ము ; కురు. చ్చురా. ఒకరకమైన చక్కెర.

సం. చూర్ణ-. పొడి ; ప్రా. చూరు, చూర. ముక్కలుగా చేయు, చూరిఅ. చూర్ణం ; అ.ప. చూర. పొడి ; నే.బెం.గు మరా. చూర్. ముక్కలు.

**చూరు**[3] అ.క్రి. పొగచూరు, పొగపట్టు. శృం.నై. 3.161.

త. చూర్. తిరుగుట, చుట్టుట.

**చూరు**[4] రూ.చూ. చూఱు. స.క్రి. కొల్లగొట్టు, బిలాఐదెచ్చు.

**చూరుకత్తి** రూ.చూ. చూరకత్తి. వి. 1. చిన్నకత్తి, చురిక ; 2. అచ్చుతిశే పడుగులో చెమికలు కోసే కత్తి ; 3. పొరుషంతో కయ్యాలాడే స్త్రీ.

**చూరుగోడ** వి. టోపిగోడ, బొద్దుగోడ, మగులుగోడ, మదులు వేసిన ప్రహారిగోడ.

**చూరె** హూ. చూరే. అవ్య. చూడరె యొక్క లుప్తశేషరూపం. ప్రసిద్ధి, నిశ్చయం మొ. వాటిని తెలుపుతుంది. భార.ఆది. 5.150.

**చూరెలుక** చూ. చూరు[1].

**చూరే** రూ.చూ. చూరె. అవ్య. 'చూడరే' యొక్క లుప్త శేష రూపం. ప్రసిద్ధి, నిశ్చయం మొ. వాటిని తెలుపుతుంది. దశకు. 3.48.

**చూర్పు** వి. ఇంటికప్పు, టొపారం.

**చూరొక్క** వి. వక్కలను నిలువుగా సన్నంగా చీల్చింది, చూర వక్క.

**చూఱ** రూ. చూర[1], చూరు[4]. వి. కొల్ల, దోపుడు (కొల్లగొన్న వస్తువు). భార.విరా. 5.204.

క. సూఱె-. కొల్లగొట్టు, దోచుకొను ; తు. సూరె-. కొల్లగొట్టు, దోచుకొను ; త. సూఱై, చూఱై-. దోపిడి. బందిపోటు దొంగతనం ; కొద. సుఱ్ఱ్య-. దోపిడి.

సం. చురా. దొంగతనం.

**చూఱకాఁడు** రూ. చూరకాఁడు. వి. కొల్లగొట్టేవాడు. దశకు. 6.95. **చూఱకొను** రూ. చూరకొను. స.క్రి. కొల్లగొట్టు. భార.మౌసల. 213. **చూఱకోలు** వి. **1**. చూరకొనటం, కొల్లగొట్టటం. భార.ద్రోణ. 2.257 ; **2**. దోపుడు, చూర. దశకు. 7.60. **చూఱగైకొను(-కైకొను)** స.క్రి. కొల్లగొట్టు. విష్ణుపు. 6.60. **చూఱదెచ్చు (-తెచ్చు)** స.క్రి. కొల్లగొట్టి తెచ్చు. భార.విరా. 3.199. **చూఱపట్టు** రూ.చూ. చూఱవట్టు. స.క్రి. కొల్లగొట్టు. పె.శకు. 2.156. **చూఱపుచ్చు** రూ. చూరపుచ్చు, చూఱవుచ్చు. స.క్రి. **1**. కొల్లగొట్టు, దొంగిలించు. దశకు. 11.120 ; **2**. ఆక్రమించు. భీమ. 4.60 ; **3**. చెడగొట్టు. నిరంకు. 2.51 ; **4**. అపహరించు. **చూఱపెట్టు** రూ.చూ. చూఱవెట్టు. స.క్రి. కొల్లగొను. శివరా. 3.79. **చూఱపోవు** రూ.చూ. చూఱవోవు. అ.క్రి. **1**. కొల్లపోవు ; **2**. పాడగు. **చూఱయిచ్చు** రూ. చూరయిచ్చు. స.క్రి. యథేచ్ఛగా అనుభవించడానికి ఇచ్చు. దశకు. 4.64. <చూఱ + ఇచ్చు. **చూఱలాడు** రూ. చూరలాడు. స.క్రి. కొల్లగొట్టు, అపహరించు. హరి.ఉ. 4.109. <చూఱ+-లు+ఆడు. **చూఱలిచ్చు** స.క్రి. యథేచ్ఛగా అనుభవించడానికి ఇచ్చు. వసు. 1.133. <చూఱ+-లు +ఇచ్చు. **చూఱలుకొను** రూ. చూఱలుగొను. స.క్రి. కొల్లకొట్టు. ఉ.రా. 4.157. **చూఱలుగొను(-కొను)** రూ.చూ. చూఱలుకొను. స.క్రి. కొల్లకొట్టు. **చూఱలుదెచ్చు(-తెచ్చు)** స.క్రి. కొల్లగొట్టి తెచ్చు. **చూఱలువట్టు** రూ. చూఱలువట్టు. స.క్రి. కొల్లగొట్టు. చిత్ర.భా. 6.66. **చూఱలువుచ్చు** రూ.చూ. చూఱలుపుచ్చు. స.క్రి. **1**. పోగొట్టు, చెడగొట్టు ; **2**. అపహరించు ; **3**. కొల్లగొట్టు. **చూఱలువట్టు(-పట్టు)** రూ.చూ. చూఱలుపట్టు. స.క్రి. కొల్లగొట్టు. **చూఱలువిడుచు** స.క్రి. చూరగొననిచ్చు, ఇష్టానుసారంగా అనుభవించనిచ్చు. **చూఱలువుచ్చు(-పుచ్చు)** రూ. చూఱలుపుచ్చు. స.క్రి. **1**. పోగొట్టు, చెడగొట్టు. భాగ. 10 పూ. 977 ; **2**. అపహరించు ; **3**. కొల్లగొట్టు. **చూఱలుసేయు** స.క్రి. యథేచ్ఛగా అనుభవించడానికి ఇచ్చు. భాగ. 6.12. **చూఱలొసఁగు** స.క్రి. యథేచ్ఛగా అనుభవించడానికిచ్చు. శుక. 2.555. <చూఱ +-లు+ఒసఁగు. **చూఱవట్టు(-పట్టు)** రూ. చూఱపట్టు. స.క్రి. కొల్లగొట్టు. విక్ర. 1.96. **చూఱవిడుచు** రూ. చూరవిడుచు. స.క్రి. చూరగొననిచ్చు, ఇష్టం వచ్చినట్లు అనుభవించనిచ్చు. భార.అను. 4.202. **చూఱవుచ్చు (-పుచ్చు)** రూ.చూ. చూఱపుచ్చు. స.క్రి. **1**. అపహరించు. పద్మ. 1.162 ; **2**. కొలగొట్టు, దొంగిలించు ; **3**. ఆక్రమించు ; **4**. చెడగొట్టు. **చూఱవెట్టు(-పెట్టు)** రూ. చూఱపెట్టు. స.క్రి. కొల్లగొను. శివరా. 3.73. **చూఱవోవు(-పోవు)** రూ. చూరపోవు, చూఱపోవు. అ.క్రి. కొల్లపోవు, దొంగిలింపబడు, నశించు. పండి.చ. 1.12 పు, కాశీ. 4.112. **చూఱాడు** రూ. చూరాడు. స.క్రి. కొల్లగొట్టు, అపహరించు. హరి.పూ. 9.150. <చూఱ+ఆడు.

**చూఱాడు** చూ. చూఱ.

**చూలగు** చూ. చూలు.

**చూలాలితనము** చూ. చూలు.

**చూలాలు** చూ. చూలు.

**చూలి** చూ. చూలు.

**చూలు** చూ. చూఁడి. వి. **1**. గర్భం, వేకటి. భార.విరా. 1.286 ; **2**. సంతానం, భాగ. 9.517.

క. చూలు. గర్భం ; త.మ. చూల్.

<మూ.ద.ద్రా. చూల్.

**చూలగు** అ.క్రి. చూలు కలది అగు, గర్భవతి అగు. విజ్ఞా. ఆచా. 129. **చూలాలితనము** వి. గర్భిణీత్వం, కడుపుతో ఉండటం. **చూలాలు** వి. ఔ. గర్భిణి, కడుపుతోఉన్న స్త్రీ. వరాహ. 11.131. **చూలి** వి. సంతానం. హరి.పూ. 1.3. **చూలుకొను** అ.క్రి. గర్భందాల్చు, కడుపుతో ఉండు. కాశీ. 4.60. **చూలుచేయు** స.క్రి. కడుపుచేయు. **చూలునిలుచు** అ.క్రి. గర్భం (కడుపు) నిలబడు. **చూలుపడు** రూ. చూలువడు. అ.క్రి. గర్భంతాల్చు, కడుపుతో ఉండు. **చూలువడు(-పడు)** రూ.చూ. చూలుపడు. అ.క్రి. గర్భంతాల్చు, కడుపుతో ఉండు.

**చూళిక** వి. వ్యాకరణం.

సం. చూళికా. శిఖరం, తెరవెనక ఉండి తెలిపే విషయ సూచనాదులు.

<సం. చూళికా (అర్థవిపరి.).

**చూవె** రూ. చూవే. అవ్య. 'చూడవె'యొక్క లుప్తశేషరూపం. **1**. నిశ్చయాన్ని తెలుపుతుంది. భార.ఆది. 2.50 ; **2**. ప్రసిద్ధిని తెలుపుతుంది. భార.ఆది. 4.84 ; **3**. వాక్యాలంకారం. భార.ఆది. 5.150 ; **4**. చూడుమి.

**చూవే** రూ.చూ. చూవె. అవ్య. 'చూడవే'యొక్క లుప్తశేషరూపం. భార.ద్రోణ. 4.167.

**చెకచెక** రూ.చూ. చకచక. క్రి.విశే.ద్రు. వేగంగాఁ పరుగెత్తడం మొ. వాటిలో అయ్యే అనుకరణం.

**చెకచెకలాడు** అ.క్రి. సంతోషంతో చెలరేగు, తుళ్ళు. ధ్వన్యను.

**చెకడము** రూ.చూ. చెక్కడము. వి. రత్నాల్ని పొదగడం. ముకుం. 1.314.

**చెకడా[1]** వి. **1**. సరుకులు తెచ్చే రెండెడ్లబండి ; **2**. ఒంటెద్దు బండి.

సం. శకట-. బండి ; ప్రా. ఛకడ- ; మరా. ఛకడా.

<మరా. ఛకడా.

**చెకడాబండి** రూ. చెకొడాబండి, చెక్కడబండి, చెక్కడాబండి, చెక్కాబండి, సెకటాబండి, సెక్కడబండి, సెక్డాబండి. వి. గూడుబండి, పైన గూడుఉన్న ప్రయాణపుబండి.

**చెకడా[2]** వి. తలమీద చేతితోవేసిన దెబ్బ.

చెకపికగా క్రి.విశే.ద్రు. వడిగా, చురుగ్గా.

చెకపికలాడు రూ. చెకబొకలాడు. స.క్రి. 1. చెక్కలుముక్కలు చేయు. సారంగ. 1.74 ; 2. తొందరపెట్టు ; 3. బాధించు.

చెకబొకలాడు రూ.చూ. చెకపికలాడు. స.క్రి. చెక్కముక్కలు చేయు. సాంబో. 3.146.

చెకము వి. వస్త్రం మొదలఁ బద్దె.

చెకముకి రూ.చూ. చకుముకి. వి. నిప్పు కలగటానికై ఒకరకం రాతితో తాకించే ఉక్కుతునక.

చెకవికలాడు అ.క్రి. తొట్రుపడు, త్వరపడు.

చెకాచెకలు రూ. చెక్కచెక్కలు. వి.బ.వ. చెక్కచెక్కలు. రంగా. చ. 3 198.

చెకింగు వి. అటంకం చేయటం, నిలపటం, సోదా చేయటం. ఇం. *Checking.* సోదా చేయటం.

<ఇం. Checking.

చెకుందము వి. నేర్పు, ప్రౌఢతనం.

చెకుముకి రూ.చూ. చకుముకి. వి. 1. నిప్పు చేయటానికి ఉపయోగించే ఉక్కుముక్క. శుక. 2.16 ; 2. ఫిరంగి.

చెకుముకిరాయి రూ. చెకుముకిఱాయి. వి. నిప్పు పట్టడానికి రాతినికొట్టే ఉక్కుముక్క, 'ఫ్లింట్'. చెకుముకిరాయుఁడు వి. తంటాలు, కొండేలు చెప్పి విరోధాలు పుట్టించే వ్యక్తి, తంటాలమారి. చెకుముకిఱాయి రూ.చూ. చెకుముకిరాయి. వి. నిప్పు కలగటానికి రాతిని కొట్టే ఉక్కుముక్క.

చెకొడాబండి రూ.చూ. చెకడాబండి. వి. గూడుబండి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి.

చెకోత్ర రూ. చెకోర్త. వి. పంపరపనస, ఒకరకం పండు (Citrus decumana).

చెకోర్త రూ.చూ. చెకోత్ర. వి. పంపరపనస, ఒకరకం పండు.

చెక్క చూ. చెక్కు². వి. 1. పేడు, చిన్న ముక్క, ఖండం. భార. శాంతి. 6.126 ; 2. చెట్టుపట్ట. దశా. 1.279 ; 3. తోలు ; 4. వరిపిండిలో ఉప్పుగాని, బెల్లంగాని చేర్చి చమురు పోసి బాండాలిలో కాల్చిన తినుబండారం ; 5. పోకచెక్క ; 6. చెప్పు ; 7. పొలంలో ఒక భాగం ; 8. వంటచెరకు ; 9. నూలు లెక్క, 28 పోగుల దారం, లడిలో పదోవంతు నూలు. ఏడు పుంజాల నూలు చిలప ; 10. డబ్బా రాట్నం చక్రానికి అమర్చిన సాపు చెక్క ; 11. పడుగు పెట్టుకొనే కొయ్య చెక్క ; 12. గూన పెంకు నున్నబరచడానికి వాడే పల్చని వెదురు కొయ్య ; 13. గుంటక మొ॥వాటి దిండులోదూర్చిన కొయ్యముక్క. గుంటక గొర్రు మొ॥ వాటి నిర్మాణంలో వేసిన అడ్డ పట్టె ; 14. సుమారు ఒక అంగుళం మందంగల రాతి పలక ; 15. తలుపు రెండు రెక్కలలో ఒకటి ; 16. పరానికి అడ్డంగా వేసే ఇనప బద్దీ ; 17. గానుగ చక్రం బెసగకుండా బిగించే కొయ్య ముక్క ; 18. మూతి కూనలోని సగం భాగం ; 19. ఫలకం, చెక్క. ఉదా. మామిడిచెక్క.

క. చక్క, చెక్కె, సక్కె, సెక్కె. చిన్నముక్క ; తు. చక్కె, చెక్కె, చెక్కి. కర్రముక్క ; చెప్పె. పేడు, చిన్న కర్రముక్క ; త. చక్కై. చిన్న కర్రముక్కలు, పేళ్ళు ; కో. చెక్. చిన్నముక్క ; కు.ఇ. సెప్పు. కురిమినది, గోకి తీసినది ; కువి. సెకలి. ముక్క, తునక ; పర్జి. చెక్కే. కర్రముక్క, తునక ; చెక్క. కర్రముక్క ; కొలా. సెక్. చిన్నకర్రముక్క ; చెక్క, సెక్క. చెట్టుబెరడు ; నా. సెక్క. ముక్క, తునక, చెట్టుపట్ట ; బ్రా. సెర్గ్. చీల్చు, బద్దలు చేయు, కోయు.

పో.చూ. సం. శకల-. ముక్క.

చెక్కకత్తి వి. 1. నవారు నేసేటప్పుడు పడుగులో వేసిన పేకపోగు దట్టించే కొయ్య పనిముట్టు ; 2. పచ్చిపెంకు తుడిచే సాధనం. చెక్కకప్పు వి. పలచని చెక్కతో చేసిన కప్పు. చెక్కకరిణె వి. కొయ్యతో చేసిన తాపి. చెక్కకూర్పు వి. పలచని చెక్కలతోవేసిన కప్పు. చెక్కకొఱఁజు వి.చెక్క పిడుచు, పశువుల శరీరంనుంచి రక్తాన్ని పీల్చే ఒకజాతి పిడుఙు. చెక్కకొఱఁదురు వి. పశువుల శరీర రక్తాన్ని పీల్చే ఒకరకం పిడుఙు. చెక్కకోవి వి. రెండువైపులా పూసలుండే కొయ్య అనుగొట్టం. చెక్కసుందు వి. పచ్చిమట్టి పాత్రలకు పూజలు పెట్టడానికి వాడే కొయ్య అచ్చు. చెక్కగుద్దుడు వి. మట్టిని మెత్తగా నలగొట్టటానికి, మట్టిపాత్రలను దట్టించడానికి కుమ్మర్లు వాడే సాధనం. చెక్కగూటం వి. బేల్దారులు, వడ్రంగులు వాడే కొయ్య సుత్తి. చెక్కచెక్కలు రూ. చూ. చెకాచెకలు. వి.బ.వ. ముక్కముక్కలు. చెక్కచెట్టు వి. ఎర్రరంగు వేయటానికి ఉపయోగించే చెక్క కలిగిన ఒక జాతి చెట్టు. చెక్కటాపి రూ.చూ. చెక్కతాపి. కొయ్యతో చేసిన తాపి. చెక్కడ వి. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకొన్న గడ్డిగాదం. చెక్కతంతె వి. కర్రలతో కట్టిన మెట్టు. చెక్కతాపి రూ. చెక్కటాపి, చెక్కదాపి. వి.చెక్కతో చేసిన తాపి. చెక్కతుంద వి. ముస్తకం. వేళ్ళు లావుగా, గింజలు మూడు పలకలుగా ఉండే చెట్టు (Cyperus species). చెక్కతొగరు వి. 1. మద్ది చెక్కతో వేసిన ఎరుపురంగు ; 2. ఒకరకం తడిరంగు. చెక్కదబ్బ వి. బెత్తెడు వెడల్పున పల్చగా ఉండే రేకుముక్కను ఒకవైపున పిడిగా పనికొచ్చేటట్టు చుట్ట చుట్టి తయారుచేసిన పనిముట్టు. చెక్కదాపి(-తాపి) రూ.చూ. చెక్క తాపి. వి. బేలు దారి గోడ మొ॥ వాటిమీద పూసిన గారను రాసి మట్టిపరిచే వైపున పిడి అమర్చిన గుండ్రని నిడుపు చేసే చిన్న పలక. చెక్కదిమ్మ వి. లాదుమీద మోది చదును చెయ్యటానికి వాడే కొయ్య కత్తె. చెక్కదిమ్మెన వి. కొయ్యదిమ్మగల దిమ్మెన. చెక్కనీళ్ళు వి.బ.వ. మేకలకు, గొర్రెలకు చీడపట్టినప్పుడు అనేకరకాల చెట్టు బెరళ్ళు వేసి కాచిన నీరు. చెక్కనేల రూ. చెక్కునేల. వి. సామాన్యమైన ఎర్రనేల. చెక్కపట్టు స.క్రి. తాపీతో నున్నపరుచు. చెక్కపంటె చూ. చెలక పంటె. వి. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యబద్ద పంటె. చెక్కపరుపు వి. 1. ఆద్దాన బండిమీద పరిచిన చెక్క కూర్పు ; 2. పలచని చెక్కలతో వేసిన కప్పు. చెక్క పలక వి. ఆకు కప్పుమీది మిట్టపల్లాలు సరిచేసే చెక్క సాధనం. చెక్కపార వి. ఇనపరేకుకు బదులు పల్చని చెక్కను బిగించిన పార. చెక్కపిడుఁజు రూ. చెక్కపిఱుఁజు. వి. పశువుల రక్తాన్ని పీల్చే ఒక రకం పిడుఙు. చెక్కపిఱుఁజు రూ.చూ. చెక్కపిడుఁజు. వి. పశువుల రక్తాన్ని పీల్చే ఒక

రకం పిడుజు. చక్కపీట వి. కుండల్ని వానేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి వాడే కొయ్యపీట. చెక్కపేడు వి. ఆము పదుగులో వెయ్యడానికి, ఆము వెచ్చబెట్టడానికి వాడే చిన్న కర్రపేడు. చెక్కపేరు వి. పశువుల రక్తాన్ని పీల్చే ఒకానొక జంతువు. చెక్కపేర్పు వి. పలచని చెక్కలతో వేసిన కప్పు. చెక్కపేలు వి.బ.వ. గోమారు. చెక్కపొట్టు వి. ఆము పదుగులో వేసే చెట్ల బెరడు, కర్ర నుసి మొ.నవి. చెక్కపొడి వి. **1.** వక్కపలుకులు, చెక్కలగుండ; **2.** ఆము పదుగులో వేసే చెట్ల బెరడు, కర్ర నుసి. చెక్కబెల్లం వి. సెనగపప్పు, కొబ్బరి, నెయ్యి, ఏలకులు కలిపి బెల్లపుపోగులో పోసి ఆరినతర్వాత చెక్కలుగా కోసే రుచికరమైన తినుబండారం. చెక్కబొగ్గు వి. కట్టెలు కాల్చి తయారుచేసిన బొగ్గు. చెక్కమెట్టు వి. కర్రలలో కట్టినమెట్టు. చెక్కమొద్దు వి. దిమ్మెన అడుగున ఉండే కొయ్యదిమ్మ. చెక్కయింగువ వి. నాతిహింగువు, ఒక రకం ఇంగువ. (చెక్క+ఇంగువ). చెక్కరాయి వి. కాల్చి సున్నం చేయటానికి ఉపయోగించే రాయి. చెక్కరించు స.క్రి. చీల్చు, చీలేటట్లు చేయు. చెక్కరౌతు వి. ఇంటి నేలమీద పరిచే పల్చని రాయి. చెక్కలు వి.బ.వ. వక్కలు. చెక్కలుచేయు స.క్రి. ఖండించు. రాజవా. 5.21. చెక్కలువాపు (-వాపు) స.క్రి. తునకలుచేయు, పగలగొట్టు. జైమిని భా. 5.72. చెక్కలువాఱు (-వాఱు) అ.క్రి. ముక్కలగు. భాగ. 6.320. చెక్కసారె వి. వడ్రంగి తయారుచేసిన కొయ్యసారె. చెక్కసుత్తి వి. వేల్దారులు, వడ్రంగులు వాడే కొయ్యసుత్తి. చెక్కసున్నం రూ. సెక్కసున్నం. వి. గోడలమీద మొదటిసారిగా పూతపనికి వాడే సున్నం. చెక్కాడు స.క్రి. ఖండించు. <చెక్క+అడు. చెక్కోటు వి. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోనికి నెట్టడానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపడానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ. చెక్కోటులేటు వి. మగ్గం ఉదతకు పైన కట్టిన దారం.

**చెక్కడకుంచె** చూ. చెక్కు[1].

**చెక్కడబండి** రూ.చూ. చెకడాబండి. వి. గూడుబండి.

**చెక్కడము** చూ. చెక్కు[1].

**చెక్కడాబండి** రూ.చూ. చెకడాబండి. వి. గూడుబండి, పైన గూడుఉన్న ప్రయాణపు బండి.

**చెక్కనంపీట** వి. నదరు ముగరంమీది పీట.

**చెక్కాడు** చూ. చెక్క.

**చెక్కాబండి** రూ.చూ. చెకడాబండి. వి. గూడుబండి.

**చెక్కి** రూ.చూ. చెక్కిలి. వి. **1.** శంఖం; **2.** చెక్కిలి, కపోలం.

**చెక్కికొను** చూ. చెక్కు[1].

**చెక్కిపుచ్చు** చూ. చెక్కు[1].

**చెక్కియము** రూ.చూ. చెక్కెము. వి. **1.** ఎముకలలోని నెయ్యి, కొవ్వు; **2.** మస్తిష్కం, మెదడు.

**చెక్కిలి** రూ. చెక్కి, చెక్కు[3]. వి. గండస్థలం. భాస్క.రా. అరణ్య. 2.188.

క. కెన్నె. చెక్కిలిపైభాగం; కెక్కె. చెక్కిలి; కెందారె. కణతలు; తు. కెన్నె, కెన్నె. చెక్కిలి; కెప్పె, కెబ్బు. చెక్కిలి; కెప్పడె. చెక్కిలివాపు; గెబ్బు. చెక్కిలిపైభాగం; త. చెన్నై. కణతలు; చెన్నె, కెన్నై, చెక్కిలి; మ. చెన్ని. చెక్కిలి పైభాగం; కొన్ని. చెక్కిలి; చెన్నమ్. దవుడ; కొ. కెయ్‌ల్. చెక్కిలి; పో. చూ. కెనార. కణత; చెక్కిలి పైభాగం; గోం. కొర్‌వి, కోఱ్‌వి. చెక్కిలి.

చెక్కిలినొక్కు స.క్రి. బుగ్గలు నిమురు.

**చెక్కి** రూ. సక్కి, సెక్కి. చూ. చెక్రం. వి. బండి కుండకు సాయిమేకుకు ఉన్న సందులో ఇరుసువేసిన ఇనపబిళ్ళ.

చెక్కిబిళ్ళ వి. బండి అడ్డకు మధ్య వేసే ఇనప బిళ్ళ.

**చెక్కు**[1] స.క్రి. **1.** దోపు, దూర్చు, పెట్టు. మను. 4 57; **2.** సవరించు, దిద్దు. బహుళా. 1.6; **3.** రత్నాల్ని పొదుగు, ఖచించు. దశా. 3.172; **4.** (కత్తితో) పొడుచు.

క. సెక్కు సెర్‌కు. పొదుగు, దోపు, దూర్చు, సెక్కె. దూర్చు; చుచ్చు. దోపు, దూర్చు; తు. చుచ్చుని. పొడుచు, దూర్చు; త. చెరుకు, పొదుగు. పెట్టు; చెరుయు. దూర్చు, చొప్పించు; చొరుకు. దూర్చు; చొరువు. కవచం; మ. చెరుతుక. దూర్చు, దోపు; చొరుకుక. దోపు, దూర్చు; తెరుకుక. దోపు; కొ. తెగ్. నడుంబిగించు; గ. చిట్ట్. గుచ్చు; కురు. ఖ్రెరనా. దూర్చు, గుచ్చు; మాల్తో. ఖ్వేర్. దూర్చు, దోపు.

<మూ.ద్రా. *కెర్-.

చెక్కడకుంచె వి. సరిచేసేటప్పుడు, పదుగుఆరేపదునులో ఉండగా సందుసందుకూ ఆపుతూ దువ్వేకుంచె. చెక్కడము రూ. చెకడము. వి. **1.** రత్నాలు మొ. వాటిని పొదగడం. పాంచాలీ. 1.68; **2.** రాళ్ళు మొ. వాటిని చెక్కిచేసినపని. చెక్కికొను స.క్రి. సవరించు, దిద్దు. బహుళా. 1.6, సురా. 126. చెక్కిపుచ్చు స.క్రి. మెరుగుకోసంచెక్కు. విష్ణు.నా. 3.287.

**చెక్కు**[2] రూ. చిక్కు[3]. స.క్రి. **1.** ఖండించు, నశింపచేయు. భాస్క.రా. కిష్కిం. 67; **2.** విగ్రహాలు మొ. వాటిని చెక్కు. దశా. 3.186; **3.** దోకుడుపార మొ. వాటితో దోకు. వి. **1.** ఫలకం, చెక్క. సానంద. 1.8 ప.; **2.** చెట్టుపట్ట, చెక్క. ఆం.భా. 2.37.

తు. చెక్క, చెక్కె. చెక్కు; కువి. సెక్; పర్జి. చెక్క్; కొలా. కెర్క్-. గీయు; నా. సెక్క్. చెక్కు.

<మూ.ద్రా. *కెర్-క్.

చెక్కుచెదరు అ.క్రి. **1.** పాలిపోవు; **2.** చెడు, పాడగు. చెక్కుడు వి. రాతిని కావలసిన రూపంలోకి తేవడం. చెక్కుడుకట్టుబడి వి. రాతిని చెక్కికట్టేపద్ధతి. చెక్కుడుపలుగు వి. దోకుడుపార. చెక్కుడుపాఱ వి. గడ్డిచెక్కడానికి ఉపయోగించే ఒకసాధనం. శుక. 3.410. చెక్కుడురాయి వి. కట్టుబడికిగాని నేలపై పరవడానికిగాని స్తంభాలుగా నిలపడానికిగాని వాడే చెక్కిన లేక మలచినరాయి. చెక్కుడుపేడు వి. అముపదుగులో చేసే చెట్లబెరడు. చెక్కుద్రౌతు వి. నేలపైపరవడానికిగాని స్తంభాలుగా నిలపడానికిగాని వాడే చెక్కిన లేక మలచిన రాయి. చెక్కునేల రూ.చూ. చెక్కనేల. వి. గట్టినేల, సామాన్యంగా ఎర్రనేల. చెక్కురాలు

వి. బండి కుండకు ఆకులు దూర్చటానికి వీలుగా అమర్చిన రంధ్రం. చెక్కులుసేయు (-చేయు) స.క్రి. నశింపచేయు. ఆము. 4.31. చెక్కేయు అ.క్రి. 1. ఎదైనఎత్తుకొని పారిపోవు; 2. చెప్పకుండాపారిపోవు; 3. తీవ్రంగా విమర్శించు.

చెక్కు[3] రూ.చూ. చెక్కిలి. వి. గండస్థలం, చెక్కిలి. శృం.నై. 1.17.

చెక్కుచెమరించు అ.క్రి. బడలు, అలసటపొందు. విజయ. 3.62. చెక్కుచెమరుచు రూ.చూ. చెక్కుసెమర్చు. అ.క్రి. అలయు, బడలు. అవ్య. (వ్యతిరేకార్థంగా ప్రయోగించబడేటప్పుడు) ఏ మాత్రం అలసిపోక అనిఅర్థం. భార. శల్య. 1.50. చెక్కుటద్దము వి. అద్దంవంటి కపోలం. శృం.నై. 6.103. చెక్కులు[1] వి.బ.వ. చెక్కిళ్ళు. చెక్కులొత్తు అ.క్రి. కలుగు, ఉదయించు. భాగ. 10 పూ. 770. <చెక్కు[3]+-లు+ఒత్తు. చెక్కుసెమరుచు (-చెమరుచు) రూ.చూ. చెక్కుసెమర్చు. అ.క్రి. అలయు, బడలు. చెక్కుసెమర్చు (-చెమర్చు) చూ. చెక్కుచెమరుచు, చెక్కుసెమరుచు. అ.క్రి. అలయు, బడలు. ద్వి.హరిశ్చ. పూ. 1696 పం. చెక్కూఁదు స.క్రి. చెక్కిలిచేర్చు. <చెక్కు[3]+ఊఁదు.

చెక్కు[4] వి. హుండీ.

చెక్కు[5] రూ.చూ. చిక్కు. వి. ఒకదానిమధ్యపరకు మరొకటి దూర్చిపేర్చిన ఇటికరాళ్ళవరస.

చెక్కు[6] వి. పైకంచెల్లించడానికి బ్యాంకుకి ఇచ్చే ఆజ్ఞాపత్రం. ఇం. *Cheque*. చెక్కు.

< ఇం. Cheque.

చెక్కుదారం వి. మిషను పురిదారం.

చెక్కులు[2] వి.బ.వ. గానుగను ఒకమారు ఆడి చమురు తీయటం.

చెక్కూఁదు చూ. చెక్కు[3].

చెక్కెము రూ. చెక్కియము. వి. ఎముకల్లోఉండే నెయ్యి. చంద్రాంగ. 2.105.

సం. చక్రక-. నూనెగానుగ; చక్రియ-. నూనెకు సంబంధించినది; ప్రా. చక్కియ-. తైలం.

క. చెక్కు. చెరకు లేదా నూనెగానుగ; త. చెక్కు. నూనెగానుగ; చెక్కాన్. గానుగవాడు; మ. చెక్కన్. తైలికుడు;

<ప్రా. చక్కియ-.

చెక్కేటు చూ. చెక్క.

చెక్కేటులేటు చూ. చెక్క.

చెక్కేయు చూ. చెక్కు[2].

చెక్నం వి. కొయ్యమీదచెక్కిన లతలు.

చెక్‌పోస్టు వి. రహదారిలోఉన్న తనిఖీచేసే స్థలం. ఇం. *Checkpost*. రహదారిలో తనిఖీచేసేస్థలం.

<ఇం. Checkpost.

చెక్రం రూ. సెక్రం. వి. 1. రాట్నం ఆకుల రాపిడి నిలువులకు తగలకుండా మధ్యన వేసిన కొయ్యబిళ్ళ; 2. పంటె ఆకుల బిగింపుకు వెదురు బద్దలతో అమర్చిన గుండ్రటి చిట్టె; 3. అడ్డ గమ్మి, అడ్డంగా అమర్చిన రాటె; 4. ఆకుల చక్రం; 5. మరాసు పెద్ద చక్రం; 6. మరాసు ఆకులను ఇరుసుకు బిగించటానికి పెట్టిన చిన్న చక్రం; 7. ఊత్తై అడ్డ పట్టెకు బిగించటానికి ఒకరకం చేతి గూటానికి కింది వైపు అమర్చిన ఇనప చక్రం; 8. నేత మోకు అమర్చటానికి ఒకరకం చేతి గూటానికి కింది వైపు అమర్చిన ఇనప చక్రం; 9. పెద కోలను మోసే చక్రం; 10. మగ్గం మీద అచ్చు గుదులు తగిలించే కొయ్య కప్పి; 11. డాబీ ఠిండుకు పక్కగా అమర్చిన చక్రం; 12. డాబీ కొలలు లేపటానికి, గొలుసు మాదిరిగా, సన్నబద్దలు కూర్చిన సాధనం; 13. పట్టు వడికే పెద్దరాట్నం, రాట్నం కట్టుబడిలో ఇరుసుకు బిగించిన ఇనప చక్రం; 14. బండి కుండకు, సాయి మేకుకు మధ్య నున్న సందులో ఇరుసుకు వేసిన ఇనప బిళ్ళ.

సం. చక్ర -. రథాంగం, బండి కల్లు, కుమ్మరి సారె, విష్ణు చక్రం.

<సం. చక్ర -.

చెక్రం రాటం వి. దబ్బాలకు నూలుతోడే రాట్నం. చెక్రం లాహిరీ వి. అంచులో నేసే ఒకరకం (డిజైను) లత. చెక్రం కుక్క వి. గుండ్రటి ఇనుప దోనె బిగింపు కోసం, పళ్ళ చక్రం గాడిలో పడేట్టు, బీమ్ కొయ్యకు బిగించిన ఇనప కొండి, కమాను. చెక్రంగిరక వి. మగ్గంమీద అచ్చులు తగిలించే కొయ్య కప్పి. చెక్రపాల వి. రెండు పట్టెల మధ్య వేరేరంగు సందు వచ్చేట్టు నేసిన జంపఖానా. చెక్రబద్ద వి. రాట్నం ఇరుసుమీద తిరగటానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపు చెక్క. చెక్రబద్దె వి. చీరపైట కొంగు చివర, అరంగుళం వెడల్పున పడుగు పోగులు విడిచి తర్వాత అరంగుళం వెడల్పున పేకపోగులు పెట్టినేసిన భాగం. చెక్రం పేటు వి. చీర అంచులో చక్రం ఆకారంలో వరుసగా నేసిన డిజైను. చక్రంపేటుచాపు వి. అంచులో చక్రం పేటు నమూనా పెట్టి నేసిన రెండు పంచెలు. చెక్రంపేటుచీర వి. అంచులో చెక్రం మాదిరి లత నేసిన చీర. చెక్రంపొయ్యి రూ. సెక్రంపొయ్యి. వి. కింద ఒక కుండ పాతి చుట్టూ మన్నువేసి కుండమీద మట్టిచక్రం పెట్టి మన్నురాసి తయారు చేసిన పొయ్యి. చెక్రంబేలు వి. చక్రం మాదిరి, గుండ్రటి పువ్వులత. చెక్రాలకర్ర వి. కోతిపుల్లలుగానీ, గిలకలు గానీ వేలాడదియ్యడానికి మగ్గానికి పైన దారాలు కట్టిన కర్ర.

చెక్రపాల చూ. చెక్రం.

చెక్రబద్ద చూ. చెక్రం.

చెక్రబద్దె చూ. చెక్రం.

చక్రవంతి రూ.చూ. చెక్రవర్తి. వి. అయిదారడుగుల ఎత్తుపెరిగే ఆకు కూర మొక్క (Chempodiumalbum).

చెక్రవర్తి రూ. చెక్రవంతి, సెక్కాంతి, సెక్రమంతి, సెక్రాంతి. వి. అయిదారడుగుల ఎత్తు పెరిగే ఆకు కూర మొక్క (Chempodiumalbum).

సం. చక్రవర్తిన్-. సార్వభౌముడు.

<సం. చక్రవర్తిన్- (అర్థవిపరి.).

చెక్రాలకర్ర చూ. చెక్రం.

చెంక వి. 1. కపోలం, చెంప. పార్వ. 4.107, ఆం.భా. 2.143; 2. పార్శ్వం.

చెంకవేయు అ.క్రి. చెంపమీద కొట్టు.

చెంగగొను (-కొను) స.క్రి. దాటు, జయించు. బాస్క.రా. యు. 910.

చెంగ(గొట్టు చూ. చెంగు[1].

చెంగనలు రూ.చూ. చెంగనాలు. వి.బ.వ. నమస్కారాలు. హంస. 4.213.

చెంగనాడు చూ. చెంగు[1].

చెంగనాలు చూ. చెంగు[1]. రూ. చెంగనలు. వి.బ.వ. **1.** ఆవులు మొ. వేసే గంతులు. బహుళా. 2.3 ; **2.** నతి విశేషం. ప్రబంధ. 880 ; **3.** బాల క్రీడా విశేషం. ఆం.భా. 3.44.

చెంగల చూ. చెన్-.

చెంగలి[1] వి.ఔ. **1** పార్శ్వ భాగం. భీమ. 3.126 ; **2.** సమీప ప్రదేశం. రసిక. 3.77. విణ. సమీపంగా ఉన్న. ఉ.రా. 3.78.

చెంగలిగొను (-కొను) వి. చెంగలించు, ఎక్కువగు. పండి. చ. ద్వితీ. 4 పు. 133.

చెంగలి[2] చూ. చెన్-. వి. రక్తతృణం, చెంగలి గడ్డి. బహుళా. 2.3, ఆం.భా. 2.76.

చెంగలికోష్టు వి. ఒకానొక మందు చెట్టు.

చెంగలించు అ.క్రి. **1.** వికసించు. కాశీ. 3.23 ; **2.** ప్రకాశించు, ఒప్పు. భీమ. 3.57 ; **3.** విజృంభించు. జైమిని భా. 7.158 ; **4.** నవ్వు, హసించు. కళా. 6.200 ; **5.** ఆవిర్భవించు, కలుగు. చిత్రభా. 5.130 ; **6.** అతిశయించు. విప్ర. 7.367 ; **7.** ఉత్సాహపడు, వేడుకపడు. యయా. 4.76.

చెంగలిదు అ.క్రి. గంతులువేయు.

చెంగలింపు చూ. చెంగలించు. వి. వికాసం, చెంగలించటం.

చెంగలువ చూ. చెన్.

చెంగలువదొర చూ. చెన్-.

చెంగలువనెచ్చెలి చూ. చెన్-.

చెంగలువనేస్తి చూ. చెన్-.

చెంగలువకోష్టు చూ. చెన్-.

చెంగల్వ చూ. చెన్-.

చెంగల్వకోష్ట చూ. చెన్-.

చెంగల్వదొర చూ. చెన్-.

చెంగల్వదొరజాలు చూ. చెన్-.

చెంగల్వనెచ్చెలి చూ. చెన్-.

చెంగల్వనేస్తి చూ. చెన్-.

చెంగాలి చూ. చెన్-.

చెంగావి చూ. చెన్-.

చెంగావిరంగు చూ. చెన్-.

చెంగిపాటు చూ. చెంగు[1].

చెంగిపోవు చూ. చెంగు[1].

చెంగు[1] స.క్రి. విడుచు. జైమిని భా. 1.79. అ.క్రి. **1.** పాయు, తొలుగు. ప్రభు. 3.84. పు. 12పం ; **2.** చలించు. రామాభ్యు. 5.224 ; **3.** ఓడిపోవు. వి. ఎగరటం మొ. వాటిలో అనుకరణం. సీలా. 3.74

క. *చంగు, చెంగు*. గెంతు, ఎగురు ; *చంగనె*. చురుకుగా గెంతు, దుముకు ; తు. *చంగ, చంగనె, చంగె*, *యంగె*. గమత్తు, హాస్యం, ఉల్లాసం, ఆట.

చెంగ(గొట్టు స.క్రి. ఓడించు. భాను. 2.209. <చెంగు[1]+-అ[7]+కొట్టు. చెంగనాడు స.క్రి. తూలనాడు, తొలగనాడు. <చెంగు+-అ[7]+ఆడు. చెంగిపాటు అ.క్రి. **1.** దూకు ; **2.** దాటు. చెంగిపోవు అ.క్రి. **1.** దూకు ; **2.** దాటు. చెంగుచెంగున క్రి. విణ. ద్రు. హఠాత్తుగా, ఆకస్మికంగా. చెంగున క్రి. విణ. ద్రు. పరిగెత్తటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. చెంగుపిల్లి వి. అడవిపిల్లి, సివంగి.

చెంగు[2] రూ.చూ. చెఱంగు. వి. చెరగు, బట్టయొక్కకొన. సీలా. 1.60.

క. *సెఱంగు, సెఱగు, సఱంగు, సఱగు*. బట్టయొక్క కొనచెరగు ; తు. *సెరంగు*. చీరచెరగు ; కో. *చెర్నగల్*. బట్టయొక్కకొన ; తొ. *ఙెర్గై*. బట్టమూల, కొన.

చెంగు[3] వి. వాద్య విశేషం. ఆం. భా. 1.129.

చెంగొత్తు స.క్రి. మాగాణిగట్లు పారతో తవ్వి బాగుచేయు.

చెంగోలు (-కోలు) వి. అధికారాన్ని సూచించే దండం.

చెంగోవ వి. మాగాణి పొలంలో రొంపి ఎక్కువగా దున్ని గనిమలను పారలతో నరికి సరిచేయటం, కయ్యారం.

చెంగోవతీయు స.క్రి. గట్లు సరిచేయు. చెంగోవవేయు స.క్రి. గట్లు సరిచేయు.

చెచ్చెర రూ. చెరచెర, చెఱచెఱ. క్రి. విణ. ద్రు. **1.** శీఘ్రంగా. భార.సభా. 1.5 ; **2.** సులభంగా. ఆం. భా. 3.30.

క. *చచ్చర, చెచ్చెర*. వడిగా, వేగంగా, త్వరగా ; *చచ్చరిగ*. తీరికలేనివాడు ; త. *చరక్క*. శీఘ్రంగా, వేగంగా.

చెంచడము రూ. చంచడము, చెంచెడము. వి. **1.** నింద్యుడు. పాండు. 196 ; **2.** నింద్యురాలు. విప్ర. 4.64 ; **3.** ఒక జాతిడేగ. చంద్రాంగ. 2.77.

చెంచల రూ.చూ. చెంచలి[2]. వి. ఒకజాతి కూరాకు.

చెంచలి[1] రూ. సెంచల, సించలి, సెంచెల. వి. మెట్టనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపు మొక్క (Digera arversis forsk).

క. *చంచలి*. చిన్నచెట్టు.

చెంచలి[2] రూ. చెంచల. వి. ఒకజాతి కూరాకు చెట్టు. ఆము. 4.134, ఆం. భా. 2.68.

చెంచిత చూ. చెంచు[1].

చెంచు[1] వి. **1.** కిరాతభేదం. శృం. నై. 8.130; **2.** చెంచుజాతి మనిషి.కాశీ. 5.71.

క. *చెంచ, చెంచు*. కిరాతజాతి వాడు, శబర తెగ వాడు.

చెంచిత రూ. చూ. చెంచెత. వి. కిరాతజాతి స్త్రీ, చెంచుది. భాగ. 10పూ. 793. క. *చెంచిత*. కిరాతస్త్రీ. చెంచుకాటేరుచీర వి. నలుపు, ఎరుపు రంగుల్లో అయిదేసి సన్నపట్టెలు పడేట్టు పడుగు, పేక వేసిన తెల్లచీర. చెంచు జొన్న వి. పచ్చజొన్నల్లో ఒకరకం. చెంచుమల వి. చెంచు దుర్గం. చెంచుమలచూఱకారు(డు వి. చెంచుదుర్గాన్ని కొల్లగొట్టిన వాడు, బిరుద విశేషం. శృం. నై. 1.42. చెంచుమల హరి వి. ముప్పైరెండు నపుంసక రాగాల్లో ఒకటి. హంస. 5.124. చెంచువా(డు విణ. శబరుడు. చెంచెత రూ.

చెంచిత. వి. ఎరుకత, ఒకజాతి కిరాతస్త్రీ. కాశీ. 5.71, హర. 7.41. చెంచోరిచీర వి. ఎరుపు తెలుపు రంగుల్లో బెత్తెడేసి వెడల్పు పట్టెలు పడేట్టు నేసిన తెల్లచీర.

**చెంచు**[2] వి. కొండనగం, ఒకరకం చెట్టు (Albizziaxelibrissin ormoelics).

**చెంచెడము** రూ.చూ. చెంచడము. వి. ఒకజాతి డేగ.

**చెంచెత** చూ. చెంచు[1].

**చెంచెలపోత** వి. గట్టు దగ్గర నాలుగు నుంచి ఎనిమిదివరకు చాళ్ళు దున్నటం, మండల చాళ్ళు.

**చెంచోరిచీర** చూ. చెంచు[1].

**చెంజమల** వి. చెంచుదుర్గం, చెంచువాళ్ళు నివసించే కొండ.

**చెంజి** వి. చెంచుదుర్గం, చెంచువాళ్ళు నివసించేకొండ.

**చెటచెట** వి. విడిచి పెట్టటంలో అయ్యేధ్వనికి అనుకరణం. పండి. చ. 3.201 పు.

**చెటాకు** వి. **1.** అరతవ్వ ; **2.** ధాన్యపు కొలత. 1/8 పడి, 1/16 సేరు, 1/32 పడి.

సం. షట్ + టంక- ; ప్రా. ఛటంక- ; మరా. ఛటాంక్ ; నే. ఛటాంక్ ; బెం. ఛటాక్ ; ఒ. ఛటాంకి ; హిం. ఛటాక్ ; పం. ఛటాంక్.

**చెటాయించు** రూ.చూ. చెడాయించు. అ.క్రి. బరితెగించు. స.క్రి. తోసిపుచ్చు.

**చెటాలుమోకు** రూ.చూ. చెటాల్‌మోకు. వి. మొదలులావుగాను చివర సన్నంగాను ఉండే మోకు.

**చెటాల్‌మోకు** రూ. చిటాలుమోకు, చిటేలుమోకు, చెటాలు మోకు, సిటాలుమోకు, సిటేలుమోకు, సెటాల్‌మోకు. వి. మొదలులావుగాను, చివర సన్నంగాను ఉండేమోకు.

**చెటేలునతిరుగు** అ.క్రి. అడ్డులేక తిరుగు.

**చెట్ట**[1] చూ. చెడు. విణ. ద్రోహి, దుష్టుడు. భార. ద్రోణ. 4.209. వి. **1.** కీడు, చేటు, ఆపత్తు, అశుభం. భార. ఆశ్ర. 1.25 ; **2.** అశుభం. ఆం. భా. 1.99.

**చెట్టతనము** వి. దుష్టత్వం. భార. అను. **4**.382. **చెట్టలాడు** స.క్రి. తిట్టు, దూరు. <చెట్ట[1] + -లు + ఆడు. **చెట్టవచ్చు** అ.క్రి. కీడు కలుగు.

**చెట్ట**[2] వి. చేయి, హస్తం. భీమ. 2.147.

**చెట్టగొను (-కొను)** స.క్రి. **1.** చేపట్టు, గైకొను. దశకు. 5.81 ; **2.** పెండ్లాడు. **చెట్టవట్టలు** రూ. చెట్టపట్టాలు. వి.బ.వ. అన్యోన్యంగా చేతులు పట్టు కోవటాలు. **చెట్టపట్టలువట్టు (-పట్టు)** స.క్రి. ఒకరిచేతులు ఒకరు పట్టుకొను. పండి. చ. 5.401 పు. **చెట్టవట్టాలు** రూ. చెట్టపట్టలు, చెట్టాపట్టాలు. వి.బ.వ. ఒకరి చేతులు ఒకరు పట్టు కోవటాలు. పరమ. 4.59. **చెట్టపట్టు** రూ.చూ. చెట్టవట్టు. స.క్రి. **1.** చేయిపట్టు, పెళ్ళాడు. కృ. శకు. 2.74, విజయ. 2.159 ; **2.** ఆదరించు. అచలా. 3.41. వి. పెళ్ళి, వివాహం. **చెట్టపట్టుకొను** స.క్రి. **1.** పెళ్ళాడు; **2** అండకొను. **చెట్టవట్టు** రూ. చెట్టపట్టు. స.క్రి. **1.** పాణిగ్రహణం చేసికొను, పెళ్ళాడు. శృం. నై. 4.48 ; **2.** ఆదరించు. వి. పెళ్ళి, వివాహం. **చెట్టాపట్టాలు** రూ.చూ. చెట్టపట్టాలు. వి.బ.వ. ఒక విధంగా ఒకరి చేతులు ఒకరు పట్టుకోవటాలు. బహుళా. 2.54.

**చెట్టపుమైకము** వి. ఒత్తెడుపిల్లి, పునుగుపిల్లి. సాంబ. తిర్య. 12.

**చెట్టరికెపాము** చూ. చెట్టుడుగు పాము. వి. ఎక్కువ విషంగల తెల్లటిపాము.

**చెట్టాపట్టాలు** చూ. చెట్ట[2].

**చెట్టిగాడు** వి. కూలికి మగ్గాలు నేయించేవాడు.

**చెట్టిరంగు** వి. లేత ఎరుపురంగు, సీకాకిరంగు.

**చెట్టు** వి. **1.** గుల్మం, పొద. కు. సం. 5.61 ; **2.** వృక్షం. ద్వి. పరమ. 2.106పు. విక్ర. 1. 199 ; **3.** ఓషధి. ఆం. భా. 2.35.

క. గిడ, గిడు. చెట్టు, మిరప, వంగవంటి మొక్క, చిన్నచెట్టు, పొద ; కొత. గిడ. పొద, మొక్క ; తు. గిడ. పొద ; త. చెటి. పొద, గుబురు ; మ. చెటి. చిన్నచెట్టు ; కో. గిఙ్‌వ్. మొక్క ; తొ. కిడ్ఫ్. పొద ; కొలా. సెట్, చెట్. పొద, చెట్టు ; నా. సెట్. చెట్టు.

<మూ.ద్రా. *కెట్-.

**చెట్టుకట్టు** రూ. చెట్టుగట్టు. అ.క్రి. మొదలు కట్టి చెట్టుగా ఏర్పడు, పెరుగు. పాండు. **3**.139. **చెట్టుకొకదగు** అ.క్రి. చెల్లాచెదరగు. శుక. 1.182. **చెట్టుగట్టు(-కట్టు)** రూ.చూ. చెట్టుకట్టు. అ.క్రి. పెరుగు, వర్ధిల్లు, మొక్క పక్క కొమ్మలతోను, పిలకలతోను గుబురుగా పెరుగు. ద్వి.పరమ. **4**.266 పు. **చెట్టుగట్టుట(-కట్టుట)** వి. కష్ట పెట్టడం. **చెట్టుగొట్టిపైవేసికొనుట** వి. వ్యర్థంగా బాధ తెచ్చు కోడం. **చెట్టుచెడుకాలమునకుగుక్కమూతిపిందె** వి. చెడే కాలానికి దుర్బుద్ధిపుట్టడం. **చెట్టుజాతర** వి. వానరాకపోతే నడిపే ఆచారం, అడవినుంచి ఇష్టమైన చెట్టును నరికి తెచ్చి ధాన్యాదుల్ని కలిపిరుబ్బి రొట్టెలుచేసి మేకపోతును కొట్టి రొట్టెలు నెత్తురు కలిపి గొయ్యితీసి గొయ్యిలో పెట్టి చెట్టును పాతడం అనే కార్యక్రమం. **చెట్టుడుగుపాము** చూ. చెట్టరికె పాము. వి. చెట్లపై ఉండే పాము. **చెట్టుతమ్మ** చూ. తెల్ల తమ్మ. వి. చెట్టుగా పెరిగే రకం, గింజ తెల్లగా, కాయ వెడల్పెక్కువ, పొడవు తక్కువగా ఉండేరకం. **చెట్టుదేవర** వి. వానకోసం నడిపే ఆచారం, ఊరి బయట అందరూ ఒక చెట్టును పూజించి అక్కడ అన్నం తింటారు. **చెట్టువెట్టు** వి. కోతి, వానరం. అచ్చ.రా. సుందర. 156. **చెట్టునడిగి నట్టులు** రూ. చెట్లునడిగినట్టు. అవ్య. ఆకస్మికంగా అయినట్లు. చంద్రభా. 3.20. **చెట్టునడిగినట్లు** రూ.చూ. చెట్లునడిగినట్టులు. అవ్య. హఠాత్తుగా అయినట్లు. **చెట్టునదిగినట్టులు** రూ. చెట్టు నదిగినట్లు. అవ్య. హఠాత్తుగా అయినట్లు. **చెట్టునదిగినట్లు** రూ.చూ. చెట్టునదిగినట్టులు. అవ్య. హఠాత్తుగా అయినట్లు. **చెట్టుద్రిమ్మరి** వి. వానరం, కోతి. అచ్చ.రా.బాల. 72. వ్యు. చెట్లపై తిరిగేది. **చెట్టుపట్ట** వి. నార, వల్కం. **చెట్టుపడు** రూ.చూ. చెట్టువడు. అ.క్రి. స్తంభించు. **చెట్టుపేరు చెప్పికాయలమ్ముకొను** అ.క్రి. వెనుకటి గొప్ప చెప్పుకొని బ్రతుకు. **చెట్టుపేరుచెప్పుకొనిపండ్లమ్ముకొను** అ.క్రి. వెనుకటి గొప్పచెప్పుకొని బ్రతుకు. **చెట్టుబిడారు** వి. కోతి. అచ్చ.రా. సుందర. 119. వ్యు. చెట్టు వాసస్థానంగా కలది. **చెట్టువడు** రూ. చెట్టుపడు. అ.క్రి. స్తంభించు, మాన్పడు. ఉ.రా. 6.343. **చెట్టుసేమలు(-చేమలు)** వి.బ.వ. చెట్టు, తుప్ప

మొదలైనవి. విప్ర. 2.19. **చెట్టూచేమ** వి.బ.వ. చెట్టు మొ. **చెట్టెక్కిచేతులువిడిచినట్లు** అవ్య. గొప్పస్థితికి వచ్చి భ్రష్ట మైనట్లు. వరాహ. 1.96. **చెట్టెక్కు** అ.క్రి. విఫలమగు. <చెట్టు+ఎక్కు. **చెట్టొక్కపిట్టయగు** అ.క్రి. తలకొకదారి అగు. సిం.నార.శ. 57. <చెట్టు+ఒక్కపిట్ట+అగు. **చెట్లకమ్మి** వి. మూడురంగులు పెట్టి చెట్టు, ఆకులు, కాయలు మొ. నమూనాలు నేసిన కమ్మి. **చెట్లకుంపటి** వి. పూల మొక్కలు పెంచడానికి ఉపయోగించే మట్టికుండ. **చెట్ల కొఱవి** వి. దుష్టుడు. వ్య. చెట్లకు నిప్పుపెట్టేవాడు. **చెట్ల గుద్దలి** రూ. చెట్లగుద్దెల, చెల్లగుద్దేలి. వి. దున్నటానికి ముందు పొలంలో చిన్న చెట్లను కొట్టే సాధనం. **చెట్లగుద్దెల** రూ.చూ. చెల్లగుద్దలి. వి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. **చెట్లగుద్దేలి** రూ.చూ. చెట్ల గుద్దలి. వి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. **చెట్ల(గలియు (-కలియు)** అ.క్రి. అడవిలో కలియు, నశించు. కలు. శ. 14. **చెట్లడ్డ** వి. దున్నటానికి ముందర పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. **చెట్లతొట్టి** వి. పూల మొక్కలు పెంచదానికి ఉపయోగించే మట్టితొట్టి. **చెట్లపాది** వి. తీగపాదు, పొట్ల, కాకర మొ. వాటి పాదు. **చెట్లపాలు గట్లపాలుఅగు** అ.క్రి. చెల్లా చెదరగు. **చెట్లముంత** వి. మొక్కలకు అంటు వేయడానికి వాడే చిన్న మట్టి పాత్ర.

**చెట్టుప** రూ. చట్టుప. వి. పక్షం, రెక్క. భార.ఆది. 4.46.

త. చెట్టై. రెక్క, రెక్కఎముక, ఈక.

**చెట్టూచేమ** చూ. చెట్టు.

**చెట్టెక్కిచేతులువిడిచినట్లు** చూ. చెట్టు.

**చెట్టెక్కు** చూ. చెట్టు.

**చెట్టొక్కపిట్టయగు** చూ. చెట్టు.

**చెట్లకట్టియ** రూ. చెట్లకట్టె. వి. **1**. మూర్ఖుడు; **2**. కోపి; **3**. తుంటరి, దుండగీడు.

**చెట్లకట్టె** రూ.చూ. చెట్లకట్టియ. **1**. మూర్ఖుడు; **2**. కోపి; **3**. తుంటరి, దుండగీడు.

**చెట్లకమ్మి** చూ. చెట్టు.

**చెట్లకుంపటి** చూ. చెట్టు.

**చెట్లకొఱవి** చూ. చెట్టు.

**చెట్లగుద్దలి** చూ. చెట్టు.

**చెట్లగుద్దెల** చూ. చెట్టు.

**చెట్లగుద్దేలి** చూ. చెట్టు.

**చెట్ల(గలియు** చూ. చెట్టు.

**చెట్లడ్డ** చూ. చెట్టు.

**చెట్లతొట్టి** చూ. చెట్టు.

**చెట్లపాది** చూ. చెట్టు.

**చెట్లపాలుగట్లపాలుఅగు** చూ. చెట్టు.

**చెట్లముంత** చూ. చెట్టు.

**చెడకోణకమాను** వి. అంచెలంచలుగా మధ్యభాగానికి చొచ్చు కున్నట్లుండే ఆర్చి.

**చెడగరము** రూ.చూ. చెడుగరము. విశ. క్రూరమైన, క్రూరు డైన. భద్రా. 2.

**చెడ(గొట్టు** చూ. చెడు.

**చెడతాగు** చూ. చెడు.

**చెడతిరుగు** చూ. చెడు.

**చెడనాడు** చూ. చెడు.

**చెడపోరుట** చూ. చెడు.

**చెడమడతిట్టు** రూ.చూ. చెడాబడాతిట్టు. స.క్రి. నోటికి వచ్చి నట్టు తిట్టు.

**చెడమడాతిట్టు** రూ.చూ. చెడాబడా తిట్టు. స.క్రి. నోటికి వచ్చినట్టు తిట్టు.

**చెడ(బుట్టు** చూ. చెడు.

**చెడవాపు** చూ. చెడు. రూ. చెడాపు, సెడాపు. వి. చెంపలు వాయడం.

**చెడాపు** రూ.చూ. చెడవాపు. వి. చెంపల వాపు.

**చెడాబడతిట్టు** రూ.చూ. చెడాబడా తిట్టు. స.క్రి. ఇష్టం వచ్చి నట్టు తిట్టు.

**చెడాబడాతిట్టు** రూ. చెడమడ తిట్టు, చెడమడా తిట్టు, చెడాబడ తిట్టు, చెడామడ తిట్టు, చెడామడా తిట్టు. స.క్రి. విచక్షణ లేకుండా తిట్టు, ఎడాపెడా నోటి కొచ్చినట్టుగాతిట్టు.

హిం. ఛేడ్‌నా. బాధించు, పీడించు; మరా. ఛడ(ణే). బాధించు, పీడించు; ఉ. బడా. పెద్ద.

**చెడామడతిట్టు** రూ.చూ. చెడాబడా తిట్టు. స.క్రి. నోటికి వచ్చి నట్టు తిట్టు.

**చెడామడాతిట్టు** రూ.చూ. చెడాబడా తిట్టు. స.క్రి. నోటికి వచ్చినట్టు తిట్టు.

**చెడాయించు** రూ. చెటాయించు. అ.క్రి. బరితెగించు. స.క్రి. తోసిపుచ్చు.

హిం. చఢ్‌నా. ఎక్కటం; చఢానా. ఎక్కించటం.

<హిం. చఢా(నా)+-ఇంచు[3].

**చెడి** వి. చెక్కడపుపనిలో ఉబ్బెత్తుగా ఉండే భాగం.

**చెడిది** చూ. చెడు. వి. **1**. అశుభం. ఆం.భా. 1.99; **2**. ఆపత్తు. ఆం.భా. 2.211; **3**. చేతబడి.

**చెడిదిబడిది** వి. **1**. చేతికి దొరికిన వస్తువుల మొత్తం; **2**. చెడిపోయిన దాని మొత్తం.

**చెడిప** రూ. చెడిపె, చెలప[1], చెలిప[1], చెలిపె. చూ. చెడు. వి. రంకుటాలు, లంజ. భార.అను. 4.115.

త. చెడియళ్. చెడిన.

**చెడిపె** రూ.చూ. చెడిప. వి. రంకులాడి. అచ్చ.రా. అయోధ్య. 13.

**చెడిపాడిరాయి** వి. చిన్నదైన రాయి.

**చెడిపోవు** చూ. చెడు.

**చెడిబడి** చూ. చెడు. విశ. మంచిదీ చెడ్డదీ అయిన.

**చెడిబ్రతికినవారు** చూ. చెడు.

**చెడీ** రూ.చూ. చెడ్డి. వి. చల్లడం, మట్టలాగు.

**చెడు** అ.క్రి. **1**. నశించు, పోవు. భార.ఆది. 6.62; **2**. తుమున్నంతంగా 'మిక్కిలి' అనే అర్థాన్నిస్తుంది. భార. విరా. 5.66; **3**. మృతుడగు, చచ్చు. భార. భీష్మ. 1.197; **4**. కొల్లపోవు. విజ్ఞా. ప్రా. 25; **5**. దూరం అగు. హరి.పూ. 6.125; **6**. భయపడు. క్షోభపడు, కలగు. ఉ.హరి. 5.225; **7**. దురవస్థను పొందు. హర. 3.15;

8. ఇది కొన్ని నామవాచకాలకు అను ప్రయుక్తమై 'చెడినదగు' అనే అర్థాన్నిస్తుంది. కాశీ. 1.111; 9. వ్యర్థమగు. జైమిని భా. 6.125; 10. పాడగు, భ్రష్టమగు. ఆము. 1.38; 11. తగ్గు. ఆము. 2.9; 12. మలినమగు. ఆము. 2.28; 13. చిముడు. ఆము. 4.223. విణ. చెడ్డ, దుష్టమైన. భార. ఉద్యో. 3.91.

క. కెడు, కిడు. నశించు, చెడు, మలినమగు; కెడిసు, కిడిసు. నశించు, చెడు; కిట్టు. నశించు, చెడు; కెట్టె. చెడు; కెడ్డతన. చెడునడత; కెడక, కెడిక, కెడుక. దుర్మార్గుడు, నీచుడు; కెడెక, కెడికె, కెడుకుతన, కెడకుతన. నశించు; తు. కెడగుని. చెడు, నశించు; కెడకు, కెడ, కెడుక. నష్టం; కెట్టు. చెడ్డ; కేడు, కేడగె. కీడు, ఆపద, ప్రమాదం; త. కెటు. చెడిపోవు, మలిన మగు, నశించు, మోసం, అవినీతి, నష్టం; కెట్ట. చెడిన, మలిన మైన; కెట్టవన్. అవినీతి పరుడు; కెట్టవళ్, కెటల్-యాళ్. అశుభం, చెడు; కెటుతల్. అపాయం; కెటుతై. కీడు, నష్టం, ప్రమాదం; కెటువ్వు. నశించు, చెడు; కేటు. నశించు, నష్టపడు, కీడు, చావు; కెటున్. దుఃఖితుడు. దురవస్థపొందేవాడు; కేటి, చెటి. చెడు వాసన, చెడినది, కుళ్ళినది; మ. చెటిక్క. మలినమైన; కెటు. నశించు; కెటుక. నశించిన; కెటువ్వు. దుర్మార్గం, చెడుమార్గం; కెటుతై. నశించు, కీడు, బలహీనత, దుఃఖం; కెటువ్పిక. ఎండటం వల్ల చెడిన; కెట్టు. నశించు, చెడు; కెటుక్క. ఆర్చు, అణచు; కేటు. నష్టం, బాధించు; కేటున్. నీచుడు, కో. కెఙ్-. చావు, నశించు; కెఙ్చ్-. నశించు, చెడు; కెఙ్. కీడు; వెయ్ఙ్, చెట్ వెయ్ఙ్; తొ. కొఙ్. నీచమైన, నశించిన, చచ్చు; కొఙ్చ్. మంత్ర విద్యచే చంపు; గోం. కఱితన. కుళ్ళు, చెడు; కువి. హేడినై, హెర్సినై. నశించు, చెడు; పర్జి. చిట్. నశించు; కొలా. కిట్. నశింప చేయు, చెడు; నా. కిట్. చల్లార్చు, నశింప చేయు; గ. సిట్. పోవు.

<మూ.ద్రా. *కెట్.

చెడగొట్టు స.క్రి. పాడుచేయు. ఉ.రా. 2.61. చెడతాగు అ.క్రి. ఎక్కువగా తాగు. చెడతిరుగు అ.క్రి. విచ్చలవిడిగా తిరుగు. చెడనాడు స.క్రి. నిందించు. నిర్వ. రా. 8.117, భార. శాంతి. 1.117. చెడపోరుట వి. తీవ్రంగా యుద్ధం చేయటం. చెడబుట్టు (-పుట్టు) అ.క్రి. గౌరవం చెడపుట్టు. చెడిపోవు అ.క్రి. పాడుగు. శుక. 2.369. చెడిబ్రతికినవారు వి.బ.వ. హీనస్థితిలో ఉండి శ్రీమంతులై నడమంత్రపు సిరిచే ఎగుడు దిగుడుగా ప్రవర్తించే వారు. చెడుకంపు వి. పూతిగంధం. చెడుగళ్ళు (-కళ్ళు) వి. మాంసం కాల్చడానికి గుచ్చే శూలం. మను. 4.19. చెడుజాతి వి. అడవిజాతి (కోయ, కిరాత మొ.). చెడుతలఁపు వి. దుర్గుణం. చెడుదుమ్ము వి. 1. పులిగోరు; 2. గోరు; 3. కొనుగు. చెడుప్రత్తి వి. అడవిప్రత్తి. చెడురాతి వి. సరిగా కాలక, బాగా సున్నం ఇవ్వని రాయి. చెడువాకతనము వి. చెడగొట్టే లక్షణం.

చెడుకురాయి వి. చిన్నదైన రాయి.

చెడుగఁడు చూ. చెడుగు.

చెడుగరము చూ. చెడుగు.

చెడుగాడు చూ. చెడుగు.

చెడుగు చూ. చెడు. విణ. 1. క్రూరమైన. భార. అను. 1.6; 2. దుష్టమైన. మార్క. 1.224. వి. 1. ధూర్తుడు. ఆం.భా. 3.7; 2. అశుభకార్యం; 3. చెడ్డమాట.

క. కెడుకు, కెడకు. అవినీతి, దుష్టప్రవర్తన, కుళ్ళటం, నాశం.

చెడుగఁడు వి. క్రూరుడు. హరి. పూ. 5.126. చెడుగరము రూ. చెడగరము. విణ. దుష్టమైన. వేంక. పంచ. 1.763. చెడుగాడు స.క్రి. నిందించు. మల్ల. నీతి. 49. <చెడుగు + ఆడు. చెడుగుడి రూ.చూ. చెడుగుడు. వి. బాలక్రీడ. చెడుగుడు రూ. చిడుగుడి, చెడుగుడి. వి. బాలక్రీడ. చెడుసుఁదనము వి. దుష్టత్వం. ఉ.రా. 2.318.

చెడ్డ[1] చూ. చెడు. విణ. దుష్టమైన. శుక. 2.475. వి. 1. కీడు; 2. దొనగు, తప్పు.

చెడ్డతనము వి. దుర్మార్గత్వం. చెడ్డతొయ్యాలి వి. చెడుస్త్రీ, కులట. చెడ్డపని వి. కానిపని, చెడుపని. చెడ్డమాట వి. కానిమాట, చెడుమాట. చెడ్డయిల్లు వి. చిన్నగుడిసె. <చెడ్డ + ఇల్లు.

చెడ్డ[2] వి. ఎక్కువ.

చెడ్డి రూ. చెడీ, చెడ్డీ. వి. మోకాలు వరకు తొడుక్కునే వస్త్ర విశేషం.

సం. చండాతక-. లాగు; ప్రా. చండాతక. లాగు; మరా. చొళ్ణా. చడ్డి.

క. చడ్డి, చణక, చణ్ణ, చెణ్ణ, చెడ్డి. లాగు; తు. చల్లణ. లాగు, చెడ్డి; త. చల్లటమ్. మోకాలువరకు ధరించే వస్త్ర విశేషం; మ. చల్లటమ్. మోకాలివరకు ధరించే వస్త్ర విశేషం; కో. చలళమ్, చలళ్మ్, చాలళమ్. చెడ్డీ, లాగు.

<మరా. చడ్డీ.

చెడ్డీ రూ.చూ. చెడ్డి. వి. మోకాలి వరకు ఉండేలాగు.

చెడ్డు స.క్రి. 1. తొడ చరచు. రాధికా. 3.16; 2. దూరు, నిందించు.

చెణకు స.క్రి. అంటు, తగులు.

చెణగరము వి. 1. వ్యాధుడు; 2. దుష్టుడు, దురాచారుడు; 3. దుండగం.

చెణుకు వి. చమత్కారం, నేర్పుమాట. రాధికా. 3.16. విణ. అల్పమైన, కొద్ది. స.క్రి. 1. కదిలించు; 2. కోపం పుట్టించు; 3. రేపు.

చెంటి వి. అడ్డంగా అమర్చిన రాట.

చెంటితాడు వి. అడ్డగమ్మి ఆకుల్ని కలిపి కట్టిన తాడు.

చెండాట[1] చూ. చెండు[1].

చెండాట[2] చూ. చెండు[2].

చెండాడు[1] చూ. చెండు[1].

చెండాడు[2] చూ. చెండు[2].

**చెండి** వి. **1.** దుర్గ, పార్వతి.

సం. చండీ-. దుర్గ, పార్వతి.

<సం. చండీ-.

**చెండిచెకపికలాడు** చూ. చెండు[1].

**చెండిపోతు** రూ.చూ. చండిపోతు. వి. మొరకు, మొండికట్టె.

**చెండు**[1] స.క్రి. **1.** ఖండించు. భార. విరా. 3.229; **2.** పోగొట్టు. రాజవా. 3.29; **3.** చంపు. నీలా. 1.3; **4.** చీల్చు; **5.** తొలగించు.

క. కిండి. పగులు, బీట; త. కెంటు. ముక్కలుగా కోసి తిను; కుఇ. గెంజ. వైపాలగు; గెస్స. (గెస్-). చీలిక ఏర్పరచు; కువి. గెహ. చీల్చు; పో.చూ. గోం. క్రిడివిత్తి. వ్రదంగిపిట్టు;

పో.చూ. సం. ఖండ్. ముక్కలు చేయు.

<మూ.ద్రా. *కెణ్-/కిణ్.

**చెండాట**[1] స.క్రి. చంపటం. <చెండు[1] + ఆట. **చెండాడు**[1] స.క్రి. **1.** ఖండించు, చీల్చు. భార. ద్రోణ. 1.256; **2.** చంపు. ఉ. హరి. 2.86. త. సెండాడు. <చెండు[1] + ఆడు. **చెండిచెకపికలాడు** స.క్రి. ఖండించు. **చెండుచిండాడు** స.క్రి. ఖండించు. **చెండుబెండాడు**[1] స.క్రి. **1.** ఖండించు. రం. రా. బాల. 6 వు. 1 పం.; **2.** చీల్చు, నరుకు. శుక. 1.247. **చెండుబెండు** వి. తునక తునకలు. ముక్క ముక్కలు. **చెండుబెండొనరించు** స.క్రి. ఖండించు. అచ్చ. రా. సుందర. 108.

**చెండు**[2] వి. **1.** కందుకం. (పూలు మొ. వాటి బంతె) భాగ. 10పూ. 914; **2.** బాలక్రీడా విశేషం. కాశ. 3.33; **3.** మర మగ్గంలో ఒక సొరుగు నుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టడానికి చేత్తో తాళ్ళను గుంజే పిడి; **4.** వేరు సెనక్కాయల గుత్తి; **5.** పొగాకు మొక్క తలమీద పూచే పూత; **6.** చెటాలున మోగించి పొలంలో పిట్టల్ని తోలే మోకు; **7.** వడంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండేరేకు బిళ్ళ.

క. చెండు, చందు, సెండు. ఆడుకొనే బంతి; తు. చెండు. ఆడు కొనేబంతి; త. సెణ్ణు, చెంటు. బాల క్రీడా విశేషం, దారం బంతి; మ. చెండు. నూలుబంతి; కో. చెండి. బాలక్రీడా విశేషం; తొ. సెడ్.

**చెండాట**[2] వి. బంతిఆట. <చెండు[2]+ఆట. **చెండాడు**[2] స.క్రి. బంతిఆడు. <చెండు[2] + ఆడు. **చెండుగోరింపులు** వి.బ.వ. గోరింపు బంతులు. బాల్యక్రీడా విశేషం. దశా. 8.81. **చెండుజిల్లా** వి. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల. **చెండుతాడు** వి. కుచ్చు తాళ్ళలో రైమను తాడుకు ఒక వైపు కట్టిన దారం. **చెండుదానిమ్మ** వి. కాయలు లేకుండ చెండుల్లాగ పూలు మాత్రం పూసే ఒక జాతి దానిమ్మ చెట్టు. **చెండుపుల్ల** వి. చేతి నాడెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల. **చెండుపువుకుంచె** వి. బంతి పువ్వు మాదిరిగా గుండ్రటి పరుపుగల కుంచె. **చెండుపువ్వు పరుపు** వి. కుంచె పురి కట్టుబడిలో, బంతి పువ్వు మాదిరిగా కట్టిన గుండ్రటి పరుపు. **చెండుపూలు** వి.బ.వ. బంతిపూలు. **చెండుబెండాడు**[2] స.క్రి. బంతితో ఆడు. **చెండుమల్లి** రూ. చెండు మల్లె. వి. ముద్దమల్లె, ఒకజాతి మల్లె, బంతిమల్లె. **చెండుమల్లె** రూ.చూ. చెండుమల్లి. వి. ముద్దమల్లె, బంతిమల్లి. **చెండుముల్లు** వి. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల. **చెండ్లు** వి.బ.వ. బంతి ఆట.

**చెండు**[3] వి. ఎద్దు మూపురం.

**చెండుసుడి** వి. మూపురం మీద ఉండే సుడి. ఇది శుభ లక్షణం.

**చెంద్రకోల** చూ. చెరణాకోల. వి. కాడికి కట్టే ఎద్దుల్ని తోలే కర్ర.

**చెండ్లు** చూ. చెండు[2].

**చెతురు** వి. నేర్పుమాట.

సం. చతుర-. నిపుణమైన.

<సం. చతుర-.

**చెతురులాడు** స.క్రి. నేర్పుగాపలుకు. < చెతురు + -లు + ఆడు.

**చెతెంద** వి. పచ్చని, తెల్లనిపూలు పూసే ఒకరకం చెట్టు (Desmodium cepholotes).

**చెత్త** వి. **1.** నిస్సార పదార్థం, బలహీనమయినవాడు. రాజవా. 5.8; **2.** అవకం. చీపురుతో తుడిచిన పెంట. ఆం.బా. 2.22; **3.** పశువుల తొక్కిలి, పశువులు తొక్కిన గడ్డిగాదం; **4.** ఎండుగడ్డి.

సం. త్యక్త-; ప్రా. చత్త-. విసర్జించటం; త్యక్తత.

క. సత్తె, సదె; తు. సెదె. పెంట; త. సత్తై, చెత్తై; మ. చెత్త. గడ్డి, పూరిగడ్డి, పుల్లలపోగు.

< ప్రా. చత్త-.

**చెత్తగొడుగు** వి. ఆకులు, గడ్డి మొ. వాటితో చేసిన గొడుగు. హర. 7.12. **చెత్తతోయు** స.క్రి. చిమ్ము.

**చెత్తుపొంచె** వి. సిమెంటు కప్పు పోత పోయడానికి వాడే అచ్చు.

**చెత్రిపుల్ల** వి. ఉండేలుకు కట్టిన తీగ.

**చెద** చూ. చెదలు. వి. పుట్టపెట్టే చీమ, పుస్తకాలు మొదలగు వాటిని తినే ఒకరకం తెల్లనిపురుగు. వాసిష్ఠ. 3.29.

**చెదపట్టు** రూ. చెదవట్టు. స.క్రి. చెదపురుగులు పట్టు. **చెదపురుగు** వి. పుట్టపెట్టే చీమ, పుస్తకాలు కర్రలు మొ. వాటిని తినే ఒకరకం తెల్లని పురుగు. **చెదవట్టు** (-పట్టు) రూ. చూ. చెదపట్టు. స.క్రి. చెదపురుగులు పట్టు.

**చెదరంగానాడు** చూ. చెదరు.

**చెదరగొట్టు** చూ. చెదరు.

**చెదరబడు** చూ. చెదరు.

**చెదరబాఱు** చూ. చెదరు.

**చెదరించు** చూ. చెదరు.

**చెదరు** రూ. చెదురు. అ.క్రి. **1.** తప్పించుకొని పోవు, పారి పోవు. భార. ఉద్యో. 2.139; **2.** వ్యాపించు, కమ్ము. కేయూ. 2.102; **3.** చలించు. భాగ. 10 పూ. ఉ. 833; **4.** అటూఇటూ పోవు, ఇటూఅటూ పడు. విక్ర. 1.158; **5.** కలగు, కలతపొందు. కళా. 5.75; **6.** చెడిపోవు. కళా. 7.100; **7.** తప్పిపోవు. వాల్మీ. 7.100.

క. కెదఱ్, కెదఱు, చదఱు, చదఱిసు, చెదఱు. వ్యాపించు, కమ్ము; కెదఱ్. వ్యాపించిన; కెదఱ్, చిందర

వందరగా ఉన్నజుట్టు ; కెదరికె. వ్యాపించిన ; తు. చదు ఱుని. వ్యాపింపదగిన ; చదరావ్పని, చదరివుని. వ్యాపించు, విడిపోవు ; చదురు, చదర. వ్యాప్తి ; త. చితఱ్ (-వ్.-న్త్). వ్యాపించు, వ్యాపించిన, వ్యాపింప దగిన ; చితఱ్ (-ప్ప్-, -త్త్-). వ్యాపించు, కమ్ము ; చిత రల్. చెదజల్లడం ; చితఱు (చితఱ్-). వ్యాపించు, చల్లు; చిత్తై(-వ్-, న్-). వ్యాపింప తగిన ; చిత్తై (-ప్ప్-, -త్త్-). చెదురు ; చిన్దు, చిన్తి. చెదురు ; మ. చితరుక. చెదర తగిన ; చితరిక్క, చితరుక. చెదరతగిన ; చింతుక, చిన్నుక. చెదరతగిన ; చిన్నిక. చెదరు.

< మూ.ద్రా. *కెత్-.

**చెదరంగానాడు** స.క్రి. తూలనాడు. ఆము. 4.220. < చెదరు + -అ[7] + అగు + -అ[7] + ఆడు. **చెదరఁగొట్టు** స.క్రి. చెల్లాచెదరుచేయు, ఓడించు. < చెదరు + -అ[7] + కొట్టు. **చెదరఁబడు** అ.క్రి. అటు ఇటుపడు. భాస్క. రా. యు. 1182. < చెదరు + -అ[7] + పడు. **చెదరఁబాఱు** అ.క్రి. 1. ఇటూఅటూ పడు, ఇటూఅటూపోవు, చలించు. సర్వే. శ. 48 ; 2. ఇటూఅటూ చెదరిపడు. చంద్రాంగ. 5.63 ; 3. వ్యాపించు. < చెదరు + -అ[7] + పాఱు. **చెదరించు** స.క్రి. 1. చిందరచేయు. భార. ద్రోణ. 1.185 ; 2. చెదరచేయు. భార. కర్ణ. 2.316. < చెదరు + -ఇంచు[3].

**చెదలకొమ్ము** చూ. చెదలు.

**చెదలు** రూ. చెదులు. వి. పుట్టపెట్టే చీమ, కాగితాలు మొ. వాటిని తినే ఒకరకం తెల్లచీమ. మను. 4.37.

క. గెదల్, గెజ్జలు, గెద్దలె, గెద్దెలు. చెదపురుగులు ; కొడ. కెదె. చెదపురుగు ; త. చితల్, చితలై. చెదపురు గులు ; కొలా. చెద. చెదపురుగు ; నా. శెదల్.

సం. శిథిలి. చేకొఱుజు, పచ్చరంగు చెదలు.

**చెదలకొమ్ము** వి. గేదె కొమ్ముకు పురుగుపట్టి గుల్లచేసే జబ్బు. **చెదలుమన్ను** వి. పేడతో కలిపి నేలను అలకడానికి మేలైన మట్టి, పుట్టలు తవ్వి తెచ్చిన మన్ను. **చెదలుకాళ్ళు** వి.బ.వ. ఒకచోట కాసేపు కూడ నిలకడగా నిలువలేనివాడు.

**చెదారము** వి. అవకరం. చెత్త. కాశీ. 4.91.

**చెదురు** రూ. చూ. చెదరు. అ.క్రి. తప్పించుకొనిపోవు. చంద్రాంగ. 6.96.

**చెదురుమదురు** వి. అక్కడక్కడ ఐనది, చెల్లా చెదరైనది.

**చెదులు** రూ.చూ. చెదలు. వి. కొయ్యవంటి వస్తువులను తినే తెల్లచీమ.

**చెద్దర్** రూ.చూ. చాదర. వి. దుప్పటి.

**చెన్** చూ. కెన్-. విశే. ఎఱ్ఱని.

క. కె-, కెమ్. ఎఱ్ఱని, తు. కెమ్ ; త. చె-, చెమ్ ; మ. చె-, చెమ్, చేయ ; కో. కెన్, కెత్, కెవ్. ఎఱ్ఱని, ఎఱ్ఱదనం ; మాల్తో. కెసా, కెస్గా. ఎఱ్ఱని ; బ్రా. ఖీసున్. ఎఱ్ఱని, బంగారం ; కొడ. చొ. ఎఱ్ఱనైన ; చొన్ద్. ఎరుపు, చొ. పి. ఎరుపు, ఎఱ్ఱని ; చొమ్. చిన్నఎద్దు ; తు. చన్న. ఎరుపు ; చన్న నాయి. తోడేలు ; త. చె, చెం, చెప్వ్, చెయ్య, చేతకల్, చేతు. ఎరుపు ; చెక్కమ్, చెక్కర్, చెక్కల్, చెకిల్, చెమ్మై, చెమ్, చెవ్వ, చెవ్వల్, చెప్పల్. ఎరుపు ; చెయ్యవఁల్, చెయ్యఁల్, చివల్, ఎనల్. ఎఱ్ఱదనం, ఎరుపు, గోధుమరంగు గల మనిషి ; చెవల్, చెవలై, చివలై. ఎఱ్ఱటి మనిషి లేదా జంతువు ; చెక్క-చ్చివ, చెక్కఁన, చెకు. ఎక్కువ ఎఱ్ఱదనం ; చెన-నాయ్. మట్టిరంగు కుక్క ; మ. చె, చెం, చేయ. ఎరుపు ; చెప్పు, చెవ్వ, చొన. ఎఱ్ఱదనం ; చెక్కల్. తెల్లవారు; చెక్కపూ, చెచ్చిపూ. ఎఱ్ఱనిపూలుచెట్టు ; చెన్నుక, చెంపిక్క, చెనెక్క, చువక్క. ఎఱ్ఱని ; చువప్పు, చొప్ప. ఎఱ్ఱరంగు, కెంపు ; చెప్పు. ఒకరకం కెంపు.

< మూ. ద్రా. *కెమ్-.

**చెంగల** రూ.చూ. చెంగలి[2]. వి. ఒకరకం కలుపుమొక్క. **చెంగలి[2]** రూ. చెంగల, చెంగాలి. వి. రక్తతృణం, ఒకరకం గడ్డి, మాగాణిలో ఎక్కువగా మొలిచే పాకి పెరిగే కలుపు మొక్క. ఆం. భా. 2.76 (Iseilema laxum). **చెంగలికోష్టు** రూ.చూ. చెంగల్వకోష్టు. వి. ఒకానొక మందు చెట్టు. **చెంగలువ** రూ.చూ. చెంగల్వ. వి. 1. ఎఱ్ఱకలువ ; 2. ప్రియంతో కుక్క కియ్య బడ్డపేరు. **చెంగలువకోష్టు** రూ. చూ. చెంగల్వకోష్టు. వి. ఒకమందు చెట్టు. **చెంగలువదొర** రూ.చూ. చెంగల్వదొర. వి. చంద్రుడు. **చెంగలువనెచ్చెలి** రూ.చూ. చెంగల్వ నెచ్చెలి. వి. చంద్రుడు. **చెంగలువనేస్తి** రూ. చెంగల్వనేస్తి. వి. కలువలకు మిత్రుడు, చంద్రుడు. ప్రబంధ. 290. **చెంగల్వ** రూ.చెంగలువ. వి. 1. ఎఱ్ఱకలువ, హల్లకం. ఉ. రా. 8.153 ; 2. రక్తోత్పలం, ఎఱ్ఱతామర. ఇందు. 4.71. క. చెంగణిగల్. ఎఱ్ఱకలువ; త. చెంగళు న్ఱ్. < చెన్ + కల్వ. **చెంగల్వకోష్టు** రూ. చెంగలికోష్టు, చెంగలువకోష్టు. వి. ఒకానొక మందుచెట్టు, పారిభావ్యం. అప్ప. 2.431. **చెంగల్వచెలికాడు** వి.పద్మమిత్రుడు, సూర్యుడు. ఇందు. 4.71. **చెంగల్వదొర** రూ. చెంగలువదొర. వి. చంద్రుడు. యయా. 1.25. **చెంగల్వదొరఱాయి** వి. చంద్ర కాంతమణి. యయా. 1.25. **చెంగల్వనెచ్చెలి** రూ. చెంగలువ నెచ్చెలి. వి. చంద్రుడు. **చెంగల్వనేస్తి** రూ.చూ. చెంగలువ నేస్తి. వి. ఉత్పల మిత్రుడు, చంద్రుడు. **చెంగల్వపగవాఁడు** వి. కువలయ శత్రువు, సూర్యుడు. ఇందు 4.71. **చెంగల్వ మాల** వి. చెంగల్వ పూలమాల, ఎఱ్ఱకలువల మాల. ద.హిం. శా. సంపు. 6. శా. సం. 896. క్రీ. శ. 1287. **చెంగాయి** రూ. సెంగాయి. వి. ఒకరకం కలుపుమొక్క. **చెంగాలి** రూ.చూ. చెంగలి[2]. వి. ఒకరకం కలుపుమొక్క, మాగాణి పొలాల్లో ఎక్కువగా పెరుగుతుంది. **చెంగావి** వి. 1. కుసుంభ వర్ణం గల వస్త్రం. రాజ. చ. 3.110 ; 2. మనోజ్ఞమైన ఎరుపు. శుక. 1.160. **చెంగావిరంగు** వి. ఒకరకం ఎరుపురంగు. **చెందమ్మి** వి.ఎఱ్ఱతామర, కోకనదం. వసు. 3.182. < చెన్ + తమ్మి. **చెందల** వి. సుందరమైన తల. విప్ర. 1.68. < చెన్ + తల. **చెందామర** వి. ఎఱ్ఱతామర. ఉ. రా. 1.138. < చెన్ + తామర. **చెందొగ** రూ. చెందొవ. వి. ఎఱ్ఱకలువ. పారి. 2.52. < చెన్ + తొగ. **చెందొగచెలి** రూ.చూ. చెందొవ చెలి. వి. చంద్రుడు. **చెందొవ** రూ.చూ. చెందొగ.

వి. ఎఱ్ఱకలువ. నీలా. 3.9. చెందొవచెలి రూ. చెందొగ చెలి. వి. చంద్రుడు. నరస. 5.73. చెందొవరా వి. కలువల రేడు. చంద్రుడు. ప్రబంధ. 27. చెందొవరాయఁడు వి. చంద్రుడు. వ్యు. కలువల రేడు. చెందొవవిందు వి. చంద్రుడు. రామే. 5.55. చెంబట్టు వి. ఎఱ్ఱపట్టు. విక్ర. 6.67.

**చెనకియాడు** చూ. చెనకు.

**చెనకు** రూ. చెన్కు. స.క్రి. **1.** (యుద్ధం మొ. వాటిలో) మార్కొను, ఎదుర్కొను. భార.ద్రోణ. 2.278 ; **2.** (పరస్త్రీని) రమించు. హరి.ఉ. 8.69; **3.** తాకు, స్పృశించు, ముట్టుకొను. కాశీ. 3.157; **4.** ద్వేషించు. రాఘవ. 4.42 ; **5.** రేపు, రేగ జేయు. కళా. 5.60 ; **6.** కాటువేయు. ఉ. హరిశ్చ. 2.19. వి. **1.** పరస్త్రీని కూడటం, రమించటం. పాండు. 3.72 ; **2.** దెబ్బ, ఘాతం. కకుత్స్థ. 1.181 ; **3.** గోళ్ళు మొ. వాటివలన కలిగిన గాయం. రాజవా. 3.48.

క. కెణకు. రెచ్చగొట్టు ; తు. కెణకుణి, కెణ్కుని, కెనకుని. రెచ్చగొట్టు, విసిగించు, కోపం తెప్పించు; కుఱు. ఖెన్నా. (పరస్త్రీని) రమించు.

<మూ.ద్రా. *కెణ్-.

**చెనకియాడు** (-ఆడు) స.క్రి. కొట్టు. కకుత్స్థ. 1.181.

**చెనగపొట్టు** రూ. సెనగపొట్టు. చూ. సెనగ. వి. ఆములో నిప్పు రాజేసుకోటానికి ఆము పసుగులో కుండల కింద పోయడాని కుపయోగించే వేరుసెనగకాయల పొట్టు.

**చెనఁగి** రూ.చూ. చెన్నఁగి. వి. పొట్టి కొబ్బరిచెట్టు. ద్వి.సార.చ. 2.80 పు. 1 పం.

**చెనఁగులు** రూ.చూ. చెన్నఁగులు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**చెనటిపేర్లు** చూ. చెనటి. వి.బ.వ. దుష్టపుమాటలు, మూర్ఖపు పలుకులు. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 117.

**చెనఁటి** రూ.చూ. చెన్నఁటి. విణ. **1.** వ్యర్థమైన. భార.భీష్మ. 3.228 ; **2.** శూన్యమైన, వట్టిదైన. భార.ద్రోణ. 2.334 ; **3.** దుష్టమైన, కుత్సితమైన. మార్క. 3.239 ; **4.** తుచ్ఛమైన, నీచమైన. భాస్క.రా. ఆరణ్య. 2.395 ; **5.** క్రూరమైన. ద్వి. హరిశ్చ. పూ. 1883 పం. ; **6.** అదృష్టంలేని. కుచే. 2.110. క్రి.విణ. ద్రు. వ్యర్థంగా. భార.భీష్మ. 3.239.

**చెనయు**[1] చూ. చెనకు. స.క్రి. **1.** ఎదిరించు, ప్రతిఘటించు, పోరు. నిర్వ.రా. 2.13; **2.** తాకు, ముట్టు. ఆం.భా. 3.132.

**చెనయు**[2] అ.క్రి. ఒప్పు. పండి. చ. 1.2 పు. స.క్రి. **1.** పోలు. భార.ఉద్యో. 2.112 ; **2.** పొందు. కాశీ. 1.91.

**చెనికె** వి. పార.

**చెనిక్కాయపొట్టు** రూ. సెనిక్కాయ పొట్టు. వి. వేరుసెనక్కాయల పొట్టు.

**చెనుపరి** విణ. గ్రామ్య సంబంధి, అసభ్యమైన. భాస్క.రా.బాల. 593.

**చెన్కు** రూ.చూ. చెనకు. స.క్రి. యుద్ధాదుల్లో ఎదుర్కొను. మార్కొను. నరస. 5.130.

**చెంత** చూ. చెందు. వి. **1.** సమీపం, వద్ద. భార.భీష్మ. 2.235, ద.హిం.శా. సంపు. 10, శా.సం. 510, క్రీ.శ. 1315 ; **2.** పక్క వైపు. కుచే. 2.8.

**చెందనం** వి. **1.** ముదురు పసుపురంగు ; **2.** ముళ్ళ గోరింట పువ్వులో తేలిక రంగు ; **3.** పసుపులో తెలుపువన్నె ; **4.** గంధం రంగు.

సం. చందన-. మంచి గంధం.

<సం. చందన-.

**చెందమ్మి** చూ. చెన్-.

**చెందల** చూ. చెన్-.

**చెందామర** చూ. చెన్-.

**చెందిరము** రూ. చందురము, చంద్రము, చెంద్రము, చెంద్రిమ, చెంద్రిమము, చెంద్రెము. వి. **1.** గంగ సిందూరం. భాస్క.రా.యు. 1.71 ; **2.** నర సిందూరం. ఆం.భా. 2.280.

సం. సిందూర-. చూర్ణ విశేషం ; ప్రా. అ.మా. సిందూర-. ఎరుపు రంగు.

<ప్రా. సిందూర-.

**చెందిరిక**[1] రూ.చూ. చెంద్రిక[1]. వి. **1.** కుసుంభవర్ణం. వసు. 5.81 ; **2.** కుంకుమపూవు రంగు ; **3.** ముక్కునగ, ముక్కెర.

**చెందిరిక**[2] రూ. చెంద్రిక[2]. వి. కమ్మ మొ. వాటి వలయం, దుద్దు. మను. 5.58.

సం. చంద్రక-. చంద్రుడిలా గుండ్రంగా ఉండే.

త. చెందిరిక్కమ్. ఉంగరం.

<సం. చంద్రక-.

**చెందిలి** వి. తక్కువ, లోటు, కొరత. మల్హ. 1.38.

**చెందు** స.క్రి. **1.** చేరు. భార.ఆది. 4.23 ; **2.** పొందు. భార. ఆది. 4 231 ; **3.** (రతిలో) కలియు, కూడు. భార.విరా. 2.26. అ.క్రి. **1.** వసించు. భార.శాంతి. 6.598 ; **2.** కలుగు. భీమ. 6.15 ; **3.** సిద్ధించు. వరాహ. 2.91 ; **4.** అంటుకొను. పారి. 2.45 ; **5.** చేరు. వాల్మీ. 3.112.

క. సేర్. కలియు, కూడు, చేరు, సమీపించు, పొందు ; తు. శేరుని. కలియు, కూడు, సమీపించు, చేరు ; త. చేర్. కలియు, కూడు ; చేర్క్కై. కూడబెట్టు, కలుపు, కూర్చు ; చేర్త్తి. చేరు, కలియు, కూడు ; చేర్న్తార్. ఒకరి రక్షణయందుండువారు, ఒకరిపై ఆధారపడేవారు; చేర. కలియు, కూడు ; మ. చెరుక. సమీపించు, కలియు, కూడు ; చేర. సమీపించు ; కో. చె.ర్. చె.డ్. కలుపు, కూడు ; చెట్. కూర్చు.

**చెందుగపులి** వి. చిరుతపులి, సివంగి.

**చెందుప్పు** రూ. ఇందుప్పు. వి. సైంధవ లవణం, రాతి ఉప్పు. కాశీ. 3.12.

సం. సింధు, లవణమ్. రాతి ఉప్పు, సింధుదేశపు ఉప్పు ; ప్రా. సెంధవ, సింధవ- ; అ.మా. సింధవ.

క. ఇందుప్పు ; తు. సైందుప్పు ; త. ఇంతుప్పు ; మ. ఇంతు, ఇంతుప్పు.

<సం. సింధు+ఉప్పు.

**చెందువ** వి. తెల్లని పూలుపూసే ఒకరకం చెట్టు (Alibizzia

lebbeck).
చెందొగ చూ. చెన్-.
చెందొగచెలి చూ. చెన్-.
చెందొవ చూ. చెన్-.
చెందొవచెలి చూ. చెన్-.
చెందొవరా చూ. చెన్-.
చెందొవరాయఁడు చూ. చెన్-.
చెందొవవిందు చూ. చెన్-.
చెంద్రకమలంఅంచు వి. ముడుచుకొన్న తామరపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు.
సం. చంద్ర-. చంద్రుడు; కమల-. పద్మం.
చెంద్రకాంత వి. చంద్రకాంతం (Mirabilisjalapa Linn).
చెంద్రకాంతరంగు వి. చంద్రకాంతపువ్వు రంగు, ఒక మాదిరి ఎరుపు.
చెంద్రకాలచీర వి. సాదా అంచుపెట్టి నేసిన ఒకరకం నేతచీర.
చెంద్రకావి చూ. చెందిరము. విశ. సిందూరంలాంటి ఎరుపుగల. విజయ. 2.92, సాంబో. 5.4.
చెంద్రగుడి చూ. చెంద్రగూడు. వి. చెంద్రుడిచుట్టూ ఏర్పడే పరివేషం.
సం. చంద్ర-. చంద్రుడు.
<సం. చంద్ర-+గుడి.
చెంద్రగూడు వి. చంద్రుడి చుట్టూ ఏర్పడే పరివేషం.
సం. చంద్ర-. చంద్రుడు.
<సం. చంద్ర-+గూడు.
చెంద్రమండలం వి. చంద్రుడిచుట్టూ ఏర్పడే పరివేషం.
సం. చంద్రమండల-. చంద్రగోళం.
<సం. చంద్రమండల- (అర్థవిపరి.).
చెంద్రము రూ.చూ. చెందిరము. వి. గంగ సిందూరం. భీమ. 5.110.
చెంద్రవంక వి. ఒకరకం నేతచీర.
సం. చంద్ర-. చంద్రుడు.
<సం. చంద్ర-+వంక.
చెంద్రవంకలు వి.బ.వ. ఒక రకం ధాన్యవిశేషం.
సం. చంద్ర-. చంద్రుడు.
<సం. చంద్ర- +వంక- +-లు.
చెంద్రవంకెలు వి.బ.వ. పట్టుపురుగులను పెంచడానికి వాడే బుట్ట.
సం. చంద్ర-. చంద్రుడు.
<సం. చంద్ర- +వంకె+-లు
చెంద్రహారం వి. 1. మెడలో వేసుకొనే ఒక రకం గొలుసు; 2. చంద్రహారం గొలుసుమాదిరి లత.
సం. చంద్రహార-. హార విశేషం.
<సం. చంద్రహార-.
చెంద్రబెర వి. చిన్న పూలుపూసే ఒక రకం చిన్న చెట్టు లేదా పొద (Cipadessa bacclfera).
చెంద్రాలకమ్మి వి. 1. రెండువేళ్ళ వెడల్పు గళ్ళుపడేట్టు నేసిన కమ్మి; 2. మెళ్ళో వేసుకొనే చంద్రహారం, గొలుసుమాదిరి డిజైను కమ్మి.

చెంద్రిక[1] రూ. చెందిరిక[1]. వి. 1. కుసుంభవృక్షం. ఒక జాతి పుష్పవృక్షం. పారి. 2.12; 2. కుసుంభ వర్ణం. మను. 5.68; 3. కుసుంభపుష్పం. విజయ. 3.131.
సం. సింధూరక-. ఎర్రరంగు కలిగిన.
<సం. సిందూరక-.
చెంద్రికవన్నియ రూ. చెంద్రికవన్నె. వి. కుసుంభవర్ణం. వసు. 6.74. లేత ఎరుపు రంగు. చెంద్రికవన్నె రూ.చూ. చెంద్రిక వన్నియ. వి. కుసుంభ వర్ణం, లేత ఎరుపు రంగు. ఆం.భా. 2.154.
చెంద్రిక[2] రూ.చూ. చెందిరిక[2]. వి. 1. తాటాకు జాబు మొ. వాటి మీది వలయం. విజయ. 3.131; 2. స్త్రీలు ముక్కుకు ధరించే ఆభరణ విశేషం.
చెంద్రిమ రూ.చూ. చెందిరము. వి. సిందూరం.
చెంద్రిమము రూ.చూ. చెందిరము. వి. సిందూరం.
చెంద్రెము రూ.చూ. చెందిరము. వి. సిందూరం.
చెన్నగోడ వి. చుట్టూ గోడల మీద ముక్కోణం ఆకారంలో కప్పు వరకు కట్టిన పక్కగోడ.
చెన్నంగి[1] రూ.చూ. చెన్నఁగి. వి పొట్టి కొబ్బరి చెట్టు.
చెన్నంగి[2] వి. 1. తెల్లని పూలు పూసే గోరింటజాతికిచెందిన కలుపు మొక్క (Lagerstroemia parviflora); 2. ఒక రకం కూరాకు మొక్క.
చెన్నంగి[3] వి. టేకు జాతికి చెందిన చెట్టు (Lagerstroemia lenceolata).
చెన్నంగివడ్లు చూ. చెన్నఁగులు. వి.బ.వ. తోకవడ్లు, నెమలివడ్లు.
చెన్నంగులు రూ.చూ. చెన్నఁగులు. వి.బ.వ. చవిటి నేలకు పనికి వచ్చే వడ్లు.
చెన్నఁగి రూ. చెనఁగి, చెన్నంగి[1]. వి. పొట్టి కొబ్బరిచెట్టు. ద్వి.సార.చ. 2.80 పు. 1 పం.
చెన్నఁగులు రూ. చెనఁగులు, చెన్నంగులు. వి.బ.వ. ఒకరకం వడ్లు, 'వెలవడాలు' అని బ్రౌను. సాంబ. మాన. 52.
చెన్నచెర్ల వి. నాగలి.
చెన్నచెఱకు వి. విశల్య, అగ్నిశిఖ, తలిగొర్ర, వృక్షవిశేషం. ఆం. భా. 2.68.
చెన్నఁటి రూ. చెనఁటి. విశ. 1. వట్టి, శూన్యమైన. భార. విరా. 2.301; 2. నీచమైన, తుచ్ఛమైన. హరి.పూ. 7.37; 3. దుష్టమైన. అచ్చ.రా. సుందర. 145.
చెన్నఁటిపోవు అ.క్రి. వ్యర్థమగు. హరి. ఉ. 10.123.
చెన్నఁడు వి. చెన్నకేశవస్వామి, విష్ణువు.
చెన్నబిగువు వి. ఒంటి గుజ్జు బిగింపు.
చెన్నమలుపుకర్రచట్టం వి. చెన్నగోడల యింటికి కత్తెర కొయ్యలతో కట్టిన చట్టం.
చెన్నంపల్లిపంచాయితి వి. తాడిపత్రి పంచాయతి. ఇద్దరి తగువును పెద్దలు కలిసి అక్రమమైన తీర్పుచెప్పటం.
చెన్నలరు చూ. చెన్ను.
చెన్నలిల్లు రూ. చెన్నాలిల్లు. వి. చెన్నగోడలుగల ఇల్లు.
చెన్నాపట్నంసోగ వి. దబరా గిన్నెలాగ ఉండే మట్టిపాత్ర.
చెన్నాపట్నండేక్కా వి. మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా, పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో

నిలువుగా ఉండే మట్టి పాత్ర.
చెన్నారు చూ. చెన్ను.
చెన్నాలిల్లు రూ.చూ. చెన్నలిల్లు. వి. చెన్నగోడలు గల ఇల్లు.
చెన్నిల్లు వి. చెన్నగోడలు గల ఇల్లు.
చెన్ను వి. 1. అందం, సౌందర్యం. కు.సం. 3.14; 2. విధం, రీతి. కు.సం. 11.26; 3. విలాసం. భార. భీష్మ. 2.256; 4. శోభ, కాంతి. దశా. 1.262; 5. దూలం మీదనుంచి మూలలకు వేసే వాసం. విశ. 1. మనోహరమైన, అందమైన. భార. ద్రోణ. 2.338; 2. సమాసంలో 'ఎర్రని' అనే అర్థాన్నిస్తుంది.

క. చన్ను, చెన్ను. సౌందర్యం, చక్కదనం, కాంతి, శోభ; చన్న, చెన్న. అందమైన వాడు, సుందరుడు; చన్నె, చెన్నె, చన్నగె. మనోహరమైన, అందమైన; తు. చన్న. సౌందర్యం, శోభ, చక్కని; త. చంతమ్.

చెన్నలరు అ.క్రి. ఒప్పు, ప్రసరించు. నీలా. 2.38. చెన్నారు అ.క్రి. ఒప్పు, అందంగా ఉండు. పారి. 4.31. చెన్నుఁడు వి. అందగాడు. చెన్నుదఱుఁగు (-తఱుఁగు) అ.క్రి. కాంతిహీనమగు. భార. విరా. 2.156. చెన్నుఁదనము వి. అందం, సొగసు. కాళింది. 3.39. చెన్నువడు అ.క్రి. శోభ కలుగు. చెన్నుపఱుచు స.క్రి. శోభ కలిగించు. చెన్నుమిగులు అ.క్రి. ఒప్పు. హరి. పూ. 5.178. చెన్నుమీఱు అ.క్రి. ఒప్పు. హరి. ఉ. 6.34. చెన్నుమెఱయు అ.క్రి. శోభిల్లు. పారి. పీఠి. 17. చెన్నెసలారు అ.క్రి. ఒప్పు. హరి. ఉ. 2.128.
చెన్నెసలారు చూ. చెన్ను.
చెపుడు రూ.చూ. చెప్పుడు. వి. చెప్పటం, తెలియపల్కటం.
చెప్పన్నదేశాలు రూ.చూ. చప్పన్నదేశాలు. వి.బ.వ. ఏభైఆరు దేశాలు.
చెప్పిఅంపు చూ. చెప్పు[1].
చెప్పిచూచు చూ. చెప్పు[1].
చెప్పించు చూ. చెప్పు[1].
చెప్పిపంపు చూ. చెప్పు[1].
చెప్పిపుచ్చు చూ. చెప్పు[1].
చెప్పు[1] స.క్రి. 1. వచించు, వినిపించు. భార.ఆది. 6.58; 2. తెలుపు, ఎరిగించు. కు.సం. 4.43; 3. వర్ణించు, స్తుతించు. పొగడు. భార.విరా. 4.7; 4. తిట్టు, నిందించు. భార.ద్రోణ. 2.144; 5. గ్రంథాదుల్ని రచించు. విజ్ఞా. వ్యవ. 152; 6. పఠించు. కాశీ. 2.22; 7. ఆజ్ఞాపించు, నియోగించు, నిమంత్రించు. కాశీ. 4.15; 8. ఉపదేశించు, బోధించు, పాఠం చెప్పు. శృం.నై. 4.28; 9. నిర్వచించు, కాశీ. 2.103. వి. మాట. కు.సం. 7.871.

క. చెప్పి. చెవి; త. చెప్పు(చెప్పి-). చెప్పు, సమాధానమిచ్చు, వెల్లడిచేయు; మ. చెప్పుక. చెప్పు; కురు. కెబ్ (కెప్), కెబ్నా. కోపపడు, తిట్టు, తప్పు పట్టు, ఉపన్యసించు.

చెప్పిఅంపు స.క్రి. చెప్పిపంపు. చెప్పిచూచు స.క్రి. 1. చెప్పు. విక్ర. 1.129; 2. పూను; 3. యత్నించు. చెప్పించు స.క్రి. 1. చెప్పేటట్లుచేయు. భార.శాంతి. 2.15; 2. సిఫారసుచేయు. చెప్పిపంపు స.క్రి. వార్తపంపు. దశా. 2.109. చెప్పిపుచ్చు స.క్రి. వార్తపంపు. భార. మౌసల. 117. చెప్పుకొను స.క్రి. మాట్లాడుకొను, అనుకొను. చెప్పుకోలు వి. 1. తెల్పుకోలు; 2. చదువుకొనటం. చెప్పుచేతలు వి.బ.వ. ఒకరు (పెద్దవారు) చెప్పినట్లు, చేసినట్లు, వినటం చేయటం, విధేయత. చెప్పుడు రూ. చెపుడు. వి. చెప్పటం, తెలియపల్కటం. చెప్పుడుమాట వి. 1. ఒకరు చెప్పినమాట, కొండెం; 2. ఒకరు చెప్పిన ద్రోహపు మాట.
చెప్పు[2] వి. పాదరక్ష. భార.అను. 3.177.

క. కిఱ్పు, కెర్పు, చెప్పు; కెర, కిరబు, కెరహు, కెర్పు. చెప్పు, జోడు; త. చెరుప్పు; మ. చెరిప్పు; కో. క్రెవ్; తొ. కెర్వ్; గోం. సెప్పుమ్; కువి. సెప్పూ; పర్జి. చెరుప్, చెర్పు; కొలా. క్రెరి; నాయ. క్రెరి.

పో.చూ. హిం. చప్పూ, చెప్పల్. మొ.

చెప్పుకాలు రూ. చెప్పుగాలు. వి. చెప్పువేసుకొన్న కాలు. బసవ. 3.72. చెప్పుక్రిందతేలువలెనుండు అ.క్రి. ప్రతిక్రియ చేయలేక అణగిఉండు. చెప్పుగాలు(-కాలు) రూ.చూ. చెప్పుకాలు. వి. చెప్పువేసుకొన్న కాలు. చెప్పుటట్టలు వి.బ.వ. చెప్పుల అడుగున ఉండే చర్మపుపొరలు. ఆము. 7.14. చెప్పుమీదకుచ్చువలెఎసురుటలు వి.బ.వ. హీనుడు పడే ఎక్కసపు పాట్లు. చెప్పులలోనికాళ్ళు వి.బ.వ. ఎప్పుడూ ఒకచోట నిలవని కాళ్ళు, ఎప్పుడూ తిరుగుతూ ఉండే వాళ్ళ పట్ల ఉపయోగించే పలుకుబడి. చెప్పుల్లోకాళ్ళుపెట్టుకొను అ.క్రి. వెంటనే తిరిగి పోవటానికి సిద్ధంగా ఉండు.
చెప్పుకూన వి. పచ్చిగా ఉండగనే పక్కలను సలపతో పైకి వంచిన కూన.
చెప్పుటట్ట రూ.చూ. చెప్పుతట్ట. వి. గోధాపది. వృక్షవిశేషం. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు మొక్క.
చెప్పుతట్ట రూ. చెప్పుటట్ట. వి. గోధాపది, వృక్షవిశేషం. ఆం. భా. 2.61. తెల్లని ఎర్రని పూలుపూసే ఒకరకం చెట్టు (Desmodium polycarpum).

చెప్పుతట్టాకు రూ.చూ. చిప్పతట్టాకు. వి. ఒకానొక చెట్టు కాండం (Asarum europoeum cissus pedata). <చెప్పు తట్ట+ఆకు.
చెమట రూ. చిమట, చమర, చెమర, చెమ్మట. చూ. చెమరు[1]. వి. స్వేదం, ఘర్మం. కు.సం. 5.41, నిర్వ.రా. 1.59, భార. భీష్మ. 1.119.

తు. శియ, సియ, సియ్మ. చలువ, తడి; తెయ్మ. దగ్గు, రొంప; త. చెమ్మల్. నీరు; కురు. సింధారా. తడిఅగు.

సం. స్విమ్. కారు; మహా. సింప(టెమ్). జల్లు.

చెమటకాయ రూ. చెమరకాయ. వి. ఎండవేడిచేత శరీరం మీద కలిగే చిన్నగుల్ల. చెమటకోక వి. 1. ఒక విధమైన వేట సాధనం. సిం.ద్వా. 1.235; 2. చెమట పాత; 3. చేతిరుమాలు. చెమటగొట్టు విశ. చెమట పట్టిన వాడు. చెమటచిత్తడి వి. విపరీతమైన చెమట. కళా. 1.147. చెమటదీయించుకొను స.క్రి. ముఖక్షౌరం చేసికొను. చెమటనెత్తురుగఁదలఁచు స.క్రి. అతిగారాబంతో చూచు. విక్ర.

6.59. **చెమటనెత్తురుగాఁగఁదలఁచు** అ.క్రి. అతిప్రేమతో చూచు. పద్మ. 9.17. **చెమటనెత్తురుగాఁగసేవించు** స.క్రి. అతిప్రేమతో చూచు. పి.శకు. 3.77. **చెమటపట్టు** అ.క్రి. చెమటపోయు. **చెమటపాఁత** వి. వేటగాడు డేగ వాలడానికి మణికట్టుకు కట్టుకొనేగుడ్డ. **చెమటపోయు** అ.క్రి. చెమటపట్టు. **చెమటలుపట్టు** అ.క్రి. చెమటలుపోయు. **చెమటలుపోయు** అ.క్రి. చెమటలు పట్టు. **చెమటయున్ని** వి. ఒకరకం ఉన్ని. **చెమటయూడ్చిసంపాదించు** స.క్రి. శ్రమపడి సంపాదించు. **చెమటయూడ్చు** అ.క్రి. మిక్కిలి శ్రమపడు. **చెమటయోడ్చు** అ.క్రి. మిక్కిలి శ్రమించు.

**చెమటియావు** (-ఆవు) రూ. చెమిటియావు. వి. చిత్రవర్ణం గల గోవు. ఆం.భా. 2.262.

**చెమడాముల్లు** వి. మరమగ్గం ఉడతకు పైన ఉడతతోలు కొనలు బిగించిన ఇనప పుల్ల.

**చెమడాలెక్కఁదీయు(-తీయు)** స.క్రి. చితకకొట్టు.

**చెమర** రూ.చూ. చెమట. వి. 1. స్వేదం ; 2. శ్రమ.

**చెమరకాయ** రూ. చూ. చెమటకాయ. వి. చెమట పొక్కు.

**చెమరించు** చూ. చెమరు[1].

**చెమరు**[1] రూ. చెమ్మరు. వి. చెమట, స్వేదం. కు.సం. 10.79. అ.క్రి. కరగు. ప్రబంధ. 19.

క. చెవరు. కరగు, చెమటతో తడియు ; తు. సియ్మ, తెయ్మ. చలువ, తడి ; త. చెయ్మల్. నీరు ; కురు. సింధార్నా. తడిఅగు.

సం. సిమను, సిమ. కారు ; మహా. సింప(ణెమ్). జల్లు ; నే. సిమ్. తేమనేల ; పో.చూ. సం. స్తిమ్. తడిఅగు.

మూ.ద.ద్రా. *చిమ్.

**చెమరించు** రూ. చెమ్మరించు. అ.క్రి. చెమట కలదగు. శృం.నై. 5.154. **చెమరుకాయ** రూ.చూ. చెమరుఁగాయ. వి. చెమటకాయ. **చెమరుఁగాయ** రూ. చెమరుకాయ. వి. చెమటకాయ. **చెమరునెత్తురుగాఁగఁదలఁచు** స.క్రి. అత్యాదరంతో చూచు. భార.శాంతి. 2.369. **చెమరుచు** రూ.చూ. చెమర్చు. అ.క్రి. స్విన్నమగు, చెమ్మగిల్లు. హర. 7.87. **చెమరునెత్తురునగు** అ.క్రి. రక్తబాంధవ్యం కలదగు. నిర్వ.రా. 5.104. **చెమరుఁబోతు**[1] విణ. మిక్కిలి చెమటకల(వాడు). **చెమరువెట్టుకొను** (-పెట్టుకొను) స.క్రి. లోబర్చుకొను. **చెమర్చు** రూ. చమరుచు, చెమరుచు, అ.క్రి. స్విన్నమగు, చెమ్మగిల్లు. కు.సం. 5.133.

**చెమరు**[2] వి. ఒకజాతి కాకి. పి.శకు. 1.132.

**చెమరుకాకి** రూ.చూ. చెమరుఁగాకి. వి. ఒకజాతి కాకి, బొంతకాకి. **చెమరుఁగాకి** రూ. చెమరుకాకి, చెమర్కాకి, చెముడుకాకి, చెమురుకాకి. వి. ఒకజాతి కాకి. మను. 4.57. **చెమరుఁబోతు**[2] వి. చెమరుకాకి. తపతీ. 5.15. **చెమర్కాకి** రూ.చూ. చెమరుఁగాకి. వి. చెమరుకాకి. వేంక.తిర్య. 103.

**చెమర్కాకి** చూ. చెమరు[2].

**చెమర్చు** రూ.చూ. చెమరు[1].

**చెమాయించు** చూ. చెమ్మ. అ.క్రి. చెమర్చు, చెమ్మగిలు.

**చెమికలు** రూ. చేకులు. వి.బ.వ. నేతనేసేటప్పుడు తెగిన పోగులు అతుక్కోడానికి ఉపయోగించే గంజి పెట్టిన నూలు ముక్కలు. హంస. 2.11.

**చెమికె** రూ. చెముక, చేకి. వి. 1. వస్త్రం నేసిన నూలు కంటె భిన్నజాతి నూలుతో నేసిన బట్ట అంచు. పండి.చ. 5.344 పు. ; 2. పన్నె సందుల్లో నుండి అవతలకు దూర్చిన పోగుల్లో అచ్చుతకటానికి కోసిన కొనలు లేక పాయ.

**చెమికెముడి** రూ. చేకిముడి. వి. చెమికెలగుది, అచ్చులో, పన్నెగూళ్ళలో నుంచి దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దె దారాలుగాని (పోగులు వెనక్కు జారకుండా పాయ (లు)గా విడదీసివేసిన చివరి ముడి. **చెమికెలగుత్తి** వి. అచ్చుతికేటప్పుడు, కోసి తీసివేసిన బద్దె దారాలు. **చెమికెలగుది** వి. అచ్చులో, పన్నెగూళ్ళలో నుంచి దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగులు వెనక్కు జారకుండా పాయలు(లు)గా విడదీసి వేసిన చివరిముడి.

**చెమిటితాడు** రూ.చూ. చెముడుతాడు. వి. చేడుకర్ర లేదా చేడు బద్దకు చివర కట్టినదారం.

**చెమిటిపలక** రూ.చూ. చెముడుపలక. వి. దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందిపైపు బిర్రుపెట్టే కర్ర.

**చెమిటిపలుపు** రూ. చెముడుపలుపు. వి. ములుకట్టుతాడు.

**చెమిటిబల్ల** రూ.చూ. చెముడుబల్ల. వి. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా, పైపైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క.

**చెమిటిబొందు** రూ. చూ. చెముడుబొందు. వి. చేడుకర్రలు బిగింపుకు, దారాలకు వేసే లోహపుచుట్టు.

**చెమిటిముల్లు** రూ.చూ. చేడుముల్లు. వి. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టడానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపుముక్క.

**చెమిటిముళ్ళగొట్టం** వి. చెముడు ములు గొట్టం, చేడుముళ్ళు వేసుకొనే వెదురు గొట్టం.

**చెమిటియావు** రూ.చూ. చెమటియావు. వి. చిత్రవర్ణంకల గోవు.

**చెముక** రూ.చూ. చెమికె. వి. నేతగుడ్డ తుదిలో ఉండే విడి అంచు.

**చెముకట్టు** వి. అడ్డ కట్టె, పట్టుదారం చుట్టేడొలక కట్టుబడిలో ఇరుసుకు బిగించిన పొడుగాటి కొయ్యపట్టె.

**చెముడు** రూ. జెముడు. వి. వృక్షవిశేషం, ఒకానొక చెట్టు. సింహుండం. ఆం. భా. 2.56. (Euphorbia tirucaui). E. I. సం. 5. శా. సం. 10. క్రీ.శ. 1102.

**చెముడుకన్నం** వి. బట్ట అంచులో చేడుముల్లు గుచ్చినపుడు పడ్డ బెజ్జం.

**చెముడుకర్ర** రూ. చేడుకర్ర. వి. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా, కిందివైపు బిర్రుపెట్టేకర్ర.

**చెముడుకాకి** రూ.చూ. చెమరుఁగాకి. వి. చెమరుకాకి.

**చెముడుగుది** రూ. చేడుగుది. వి. చేడుకర్రకు (కొన్నిచోట్ల చేడుబద్ద) చివర కట్టిన దారం.

**చెముడుతాడు** రూ. చెమిటి తాడు, చేడుతాడు. వి. చేడు కర్రకు-కొన్ని చోట్ల చేడుబద్దకు-చివర కట్టిన దారం.

**చెముడుతీపుతాడు** వి. బొడ్డుతాడు, నేతబట్టమీద, చేడు

కర్రలను అడ్డంగా బిరుపెట్టే పొడుగుదారం.

**చెముడుదబ్బ** రూ. చేడుబద్ద. వి. దోనె ముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా పైవైపు బిరుపెట్టే కొయ్య బద్ద.

**చెముడుదారం** రూ. చేడుదారం. వి. నేతబట్ట మీద, చేడు కర్రల్ని అడ్డంగా బిరుపెట్టే పొడుగుదారం.

**చెముడుపలక** రూ. చెమిటిపలక, చేడుపలక. వి. దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగాపైవైపు బిరుపెట్టే పొడుగు చెక్క(లు).

**చెముడుపలుపు** రూ.చూ. చెమిటి పలుపు. వి. చేడుపలుపు, చేడు కర్రకు–కొన్నిచోట్ల చేడుబద్దకు–చివరకట్టిన దారం.

**చెముడుపాల** వి. వృక్షవిశేషం, తీక్ష్ణ తైలం.

**చెముడుబల్ల** రూ. చెమిటిబల్ల, చేడుబల్ల. వి. దోనె ముందర. నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, పైవైపు బిరుపెట్టే పొడుగు చెక్క(లు).

**చెముడుబొందు** రూ. చెమిటిబొందు, చేడుబొందు. వి. చేడుకర్రల బిగింపుకు, దారాలకు వేసే లోహపు చుట్టు, రింగు.

**చెముడుములుగొట్టం** వి. చేడు ముళ్ళు వేసుకొనే వెదురు గొట్టం.

**చెముడుముల్లు** రూ.చూ. చేడు ముల్లు. వి. చేడుముల్లు, నేత నేసేటపుడు గుడ్డను బిరుపెట్టటానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క.

**చెమురుకాకి** రూ.చూ. చెమరుఁగాకి. వి. చెమురు కాకి.

**చెంప** రూ. చెఁప. వి. 1. పార్శ్వం, పక్క. క్రీడా. పీఠి. 65 పు.; 2. కపోలం, చెంప. వైజ. 2.45; 3. చెవి, స్తంభంపై అంచున, రెండువైపులా మేకు బందీ చేసిన చెక్క; 4. చేతి మగ్గం పలక వేలాడ దియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం.

క. కెన్నె. చెంప; తు. కెన్ని, కెన్నె. చెంప; త. చెన్ని. తల, ఏనుగు యొక్క కణత భాగం; చెన్ని, చెన్నె. చెంప, చెక్కిలి; మ. చెన్ని, కెన్ని. కణతలు; కొన్ని. చెక్కిలి; చెన్నమ్. చెక్కిలి, దౌడ; చెప్పి. చెక్కిలి; కో. కెయన్. కపోలం; గోం. కోర్వే, కొఱ్వే. చెంప.

పో.చూ. సం. కేనార-. కణత, తల, చెంప.

**చెంపకట్టు** వి. కుంచె చెంపకు వేసిన దారపు కట్టు. **చెంపకల్లీ** వి. స్త్రీభూషా విశేషం, చెంపసరులు. కటి. శ. 15. **చెంపకాయ** వి. చెంపదెబ్బ, చెంపకాయ. **చెంపకాయలుతిను** అ.క్రి. చెంపపెట్టుతిను. **చెంపకుచేరెడు కండ్లు** వి.బ.వ. విశాలమైన కళ్ళు. **చెంపకొప్పు** వి. చెంపకు ఒరిగేట్లుగా పెట్టిన కొప్పు. వైజ. 2.134. **చెంపగిల్లు** అ.క్రి. 1. పక్కకు తిరుగు; 2. పెడదారి పట్టు. **చెంపగుది** వి. పడుగు చాపేటప్పుడు, ఊడ్తై అడ్డ పట్టెనూ పడుగేరే కర్రను కలిపేతాడు. **చెంపతల** వి. మిక్కిలి సమీప ప్రదేశం, చేరువ చోటు. వేంక. పంచ. 3.164. **చెంపతాడు** వి. పడుగు చాపేటప్పుడు, ఊడ్తై అడ్డ పట్టెనూ పడుగేరు కర్రనూ కలిపేతాడు. **చెంపదబ్బ** వి. పన్నెకట్టుబడిలో, ఈనెల వరకు చివర బిగించిన వెదల్లుబద్ద. **చెంపదారం** వి. కుచ్చు తాళ్ళలో తైమను తాడుకు ఒకవైపున కట్టిన దారం. **చెంపదెబ్బ** వి. చపేటం, చెంపకాయ. **చెంపనిలుపు** వి. మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె. **చెంపపలక** వి. బొమ్మ, పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువు కొయ్యకు బిగించిన పిడి. **చెంపపెట్టు** రూ.చూ. చెంపవెట్టు. వి. చపేటం, చెంపకాయ. చంద్రాంగ. 3.27. స.క్రి. చెంపమీదకొట్టు. **చెంపబిల్ల** రూ.చూ. చెంపబిళ్ళ. వి. తలగడవంటి ఒరుగు దిండు. **చెంపబిళ్ళ** రూ. చెంప బిల్ల. వి. తలగడవంటి ఒరుగు దిండు, మెత్త. రాధికా. 3.40. **చెంపలఁగొట్టు** స.క్రి. తిరస్కరించు. **చెంపలాక** వి. కుంచెలాక, కుంచె కట్టు బడిలో, పురిబిగింపుకు, రెండు పక్కలా వేసికట్టిన వెదురు బద్ద. **చెంపలువేయు** స.క్రి. చెంపకాయలు కొట్టు, చెంపమీద కొట్టు. కువ.చ. 2.100. **చెంపలువేసికొను** అ.క్రి. పశ్చాత్తాపపడు. **చెంపవెట్టు** (-పెట్టు) రూ. చెంపపెట్టు. స.క్రి. చెంపమీద కొట్టు. కాశీ. 5.130. వి. చెంపకాయ. **చెంపశుద్ధిచేయు** స.క్రి. చెంపదెబ్బ వేయు. **చెంపసరాలు** రూ. చెంపసరులు. వి.బ.వ. స్త్రీల కర్ణాభరణ విశేషాలు, చెంపకల్లీలు. **చెంపసరులు** రూ.చూ. చెంపసరాలు. వి.బ.వ. స్త్రీల ఆభరణ విశేషం, చెంప కల్లీలు. **చెంపసీల** వి. పలకసీల, చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య.

**చెంబం** వి. రంగు కొలుచుకొనే చిన్నపాత్ర.

**చెంబట్టు** చూ. చెన్.

**చెంబడి** వి. పల్లెవాడు. ప్రబంధ. 217.

**చెంబడిపల్లె** వి. బెస్తపల్లె, గూడెం. **చెంబడివాడు** వి. 1. పల్లెవాడు; 2. నావికుడు.

**చెంబిదుత్త** చూ. చెంబు.

**చెంబీదుత్త** చూ. చెంబు.

**చెంబు** రూ. చెమ్మ. వి. 1. రాగి మొ. వాటితో చేసిన చిన్న మూతిగల పాత్రవిశేషం. హర. 3.94; 2. స్వల్పపాత్ర. శ్రీ. శృం. 31.

క. చంబు, చెంబు, చొంబు. రాగి లేక గాజుతో చేసిన పాత్ర; కొడ. చెంబి. రాగి లోహపు పాత్ర; తు. చెంబు. ఇత్తడి, రాగి, చిన్న రాగి లేక ఇత్తడి పాత్ర; త. చెంపు. రాగి, బంగారం, లోహపు పాత్ర; తంపికై. ఒకరకమైన చిన్న నీటి కుండ; మ. చెమ్పు, చెమ్పు. రాగి, రాగిపాత్ర; తొ. ౙెబ్. రాగి; కొబ్. చిన్నఇత్తడి పాత్ర; కొండ. కెబై, కెబ్-గిండి. చిన్నగొట్టంగల మంచినీళ్ళు తాగే లోహపుపాత్ర;

పో.చూ. సం. శుల్బ-. తామ్రం; ప్రా. తంబ-. రాగి; మరా. చబూ. కూజా.

**చెంబిదుత్త** రూ. చెంబీదుత్త. వి. చేదదుత్త, నూతినుండి నీళ్ళు తోడడానికి వాడే చిన్నమూతిగల మట్టిపాత్ర. **చెంబీ దుత్త** రూ.చూ. చెంబిదుత్త. వి. చూడ్డానికి అందంగా పాలటికలాగ ఉండేమట్టిపాత్ర. **చెంబుగడ్డ** వి. పెద్దనీరుల్లి. **చెంబుగూడు** వి. గుండ్రంగాఉండే గూడు. **చెంబుతల** వి. చెంబువలె నున్ననైనతల, బట్టతల. ఆము. 6.19. **చెంబు పట్టుకొనివెళ్ళు** అ.క్రి. దొడ్డికివెళ్ళు, మలవిసర్జనకువెళ్ళు. చెంబు

**బుగిడి** వి. గుండ్రటిమొగ్గమాదిరిగా నేసినడిజైను. **చెంబుముంత** రూ. చెమ్ముంత. వి. గుండుచెంబులాగ ఉండే మట్టిపాత్ర. **చెంబులోధనము** వి. కొంగుబంగారం. **చెంబుల్లి** వి. పెద్దసైజు నీరుల్లి.

**చెంబేలిపూవు** వి. అంచులో, చెంబేలీ (జాజిపువ్వు మాదిరిది) పువ్వునమూనాలో నేసినవస్త్రం.

హిం. ఉ. చమేలీ. జాజిపువ్వు.

< ఉ. చమేలీ + పూవు.

**చెమ్మ** వి. **1.** తడి. ఆర్ద్రత, ఊట. రం.రా. బాల. 77పు. 26 పం. ; **2.** చెమ్మచెట్టుతీగ. విఱ. తడిసిన, ఆర్ద్రమైన. ఆము. 1.61.

క. చెమరు. కరుగు. తడిఅగు ; తు. శిమ. తడి, తేమ; త. చెమ్మళ్. నీరు ; సిమ్మ. చల్లని ; కురు. సింధార్నా. తడిఅగు.

**చెమ్మకాయ** వి. పదిపదిహేను అంగుళాల పొడవున బద్దగాఉండే కాయలు గుత్తులు గుత్తులు కాసే ఒకరకం మొక్క (Canavalia sp.). **చెమ్మగించు** స.క్రి. చెమ్మగిల్లజేయు, తడుపు. వేంక. పంచ. 1.103. **చెమ్మగిలు** రూ.చూ. చెమ్మగిల్లు. అ.క్రి. తడిగలదగు, చెమటపోయు. ఉ.రా. 6.92. **చెమ్మగిల్లు** రూ. చెమ్మగిలు. అ.క్రి. తడిగలదగు, ఆర్ద్రమగు, చెమటపోయు. మను. 1.50. **చెమ్మటిలు** రూ.చూ. చెమ్మటిల్లు. అ.క్రి. చెమర్చు. **చెమ్మటిల్లు** రూ. చెమ్మటిలు. అ.క్రి. చెమర్చు. **చెమ్మభూమి** వి. చిత్తడినేల, బురదనేల. **చెమ్మయురుకు** (-ఉరుకు) రూ. చూ. చెమ్మయుఱుకు. అ.క్రి. చెమ్మగిల్లు. **చెమ్మయుఱుకు** (-ఉఱుకు) రూ. చెమ్మయురుకు. అ.క్రి. చెమ్మగిల్లు. మను. 3.18.

**చెమ్మచెక్క** వి. బాలికాక్రీడావిశేషం.

**చెమ్మచెక్కలు** వి.బ.వ. బాలికలు చప్పట్లుకొడుతూ ఆడే ఆట.

**చెమ్మట** రూ.చూ. చెమట. వి. స్వేదం. ఉ.రా. 6.65.

**చెమ్మరించు** చూ. చెమ్మరు.

**చెమ్మరు** రూ.చూ. చెమరు. అ.క్రి. చెమటకలదగు, తడికలదగు. చెమ్మగిల్లు.

**చెమ్మరించు** రూ.చూ. చెమరించు. అ.క్రి. చెమటకలదగు, తడికలదగు, చెమ్మగిల్లు. సమీర. 2.88.

**చెమ్మిలిపాము** వి. పాములాగఉండే ఒకచేప (Gymnotus catenatus).

**చెమ్ము** రూ.చూ. చెంబు. వి. చిన్నలోహపాత్ర.

**చెమ్ముంత** రూ.చూ. చెంబుముంత. వి. గుండుచెంబులాగ ఉండే మట్టిపాత్ర.

**చెమ్ముకట్టు** వి. చెంపతాడు, పడుగుచాపేటపుడు, ఊడైఅడ్డ పట్టెనూ పడంగు కర్రనూ కలిపేతాడు.

**చెమ్మె** రూ.చూ. చిమ్మె. వి. దేవాలయాల్లో, దీపంముట్టించడానికి ఎత్తుగా మట్టితో చేసినదిమ్మె.

**చెయి**[1] రూ.చూ. చే. వి. **1.** హస్తం. భార. ఉద్యో. 3.19 ; **2.** సామర్థ్యం. పార్వ. 6.70 ; **3.** తొండం. అచ్చ.రా. యు. 362, వేంక. అం. 91 ; **4.** రెండుమూరల కొలది ; **5.** బలం, దిటవు ; **6.** గలీత, తలుపులు మొ. వాటిని లాగి తెరవటానికి ఉపయోగపడే పరికరం.

క. కై, కెయి, గెయి. చేయి ; తు. కై ; త. కై, చెయ్. చేయి ; మ. కై.

**చెయికావలి** వి. చేదోడు, సాయం, సమయానికిపనికి వచ్చేది. **చెయికుంచె** వి. చేతికుంచె, పడుగుదువ్వే ఒకరకం కుంచె. **చెయికొయ్య** వి. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టేకొయ్య. **చెయికోలు** వి. **1.** కుడిపక్క ; **2.** వెలుపలిభాగం. **చెయిగరచు** (-కరచు) అ.క్రి. నష్టంవచ్చు. **చెయిగాచు** (-కాచు) అ.క్రి. అభయమిచ్చు, సాయపడు. వర.రా. బాల. పు. 96 పం. 10. **చెయిగుంజ** వి. మగ్గంమీదనేతబిర్రుపెట్టటానికి, మోకుకట్టేకొయ్య. **చెయిగూటం** వి. చేతిగూటం, మగ్గంమీదనేత బిర్రుపెట్టటానికి మోకుకట్టేకొయ్య. **చెయిచాఁచు** రూ.చూ. చేయిచాఁచు. స.క్రి. ఏదైనా తీసుకోడానికి చేతినిచాచు, యాచించు. సుద. 5.156. **చెయిచేసికొను** స.క్రి. కొట్టు. పర.రా.యు. పు. 40 పం. 12. అ.క్రి. స్వయంగాపనికిదిగు. **చెయితొట్టి** వి. బిందెడు నీళ్ళుపట్టే చిన్నతొట్టి. **చెయిదంతె** వి. పైరులో కలుపుపోవడానికి వాడే ఒంటిపలుగుపరికరం. **చెయిదప్పిపోవు** (-తప్పిపోవు) అ.క్రి. చెయిజారిపోవు. **చెయిదాటు** అ.క్రి. వశంతప్పు, చెయి మారు. **చెయిపట్టు** స.క్రి. **1.** కాపాడు ; **2.** పెండ్లాడు. **చెయిపట్టుగాపట్టియిచ్చు** (-ఇచ్చు) స.క్రి. పట్టించిఇచ్చు. **చెయిపట్టుగోడ** రూ. చెయ్యిపట్టుగోడ. చేపట్టుగోడ. వి. మిద్దెపై అంచులదగ్గర, బట్టీమసిలి పక్కన, కట్టేపల్చనిపొట్టిగోడ. **చెయిపలక** వి. చేతిమగ్గంపన్నెబిగించిన పైచెక్క. **చెయిపిడి** వి. దూదిఏకేటప్పుడు కమానునరం కొట్టేకొయ్యబడితె, ఊడైను నిలబెట్టితాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం. **చెయిపిడిగోడ** వి. మిద్దెపై అంచుల దగ్గర, బట్టీమళలపక్కన, కట్టేపల్చని పొట్టిగోడ. **చెయిబిరుసు** వి. ఒకతెగబాణనంచు. **చెయిమల** వి. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. **చెయిమించు** అ.క్రి. **1.** అధికుడగు. చిత్ర.భా. 2.107 ; **2.** చెయిదాటిపోవు. స.క్రి. కొట్టు. **చెయిమీఱు** స.క్రి. చేతితోకొట్టు. తాళ్ల. శృం.శ. 103 ; అ.క్రి. **1.** చేతికిఅందకుండాపోవు. వశందాటిపోవు ; **2.** గొప్పవాడగు. **చెయిముద్ద** వి. పంటెకు నూలుచుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టేకొయ్య. **చెయిమెలకువ** వి. కత్తెరపట్టుపట్టినతర్వాత లోపలఒకచెయ్యి, వెలుపల ఒకచెయ్యి పెట్టి లావురావాల్సినచోట లావు, సన్నంరావాల్సినచోట సన్నం వచ్చేటట్లు అతిజాగర్తగా వాటను సారెపైతయారు చేసేనేర్పు. **చెయిమేకు** వి. మగ్గం మీద నేతబిర్రుపెట్టటానికి, మోకుకట్టేకొయ్య. **చెయివాటు** వి. దొంగతనం. **చెయివేసియపహసించు** (-అపహసించు) స.క్రి. చేతులు తట్టిపరిహాసంచేయు. ఉ.హరి. 4.161.

**చెయి**[2] రూ. చెయ్యి[2], చెవి[2], చేయి[2]. వి. తాళపుచెవి.

< పో. శావి. తాళంచెయ్యి.

**చెయిదము** రూ.చూ. చెయిది. వి. పని, కృత్యం. భార.శాంతి. 2.406.

**చెయిది** రూ. చెయిదము, చెయ్దము, చెయ్ది. చూ. చేయు. వి.

కృత్యం, పని. భార.అరణ్య. 1.139.
త. చెయితి.
చెయినంచు చూ. చెయిను.
చెయిను వి. 1. ఇరుసు సులువుగా తిరగటానికి బాల్ బేరింగుల్లో ఉండే గొలుసు ; 2. ఊత్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనపపనిముట్టు ; 3. వరుసపరంపర, కట్టు, బంధం.
ఇం. *Chain*. గొలుసు.
<ఇం. Chain.
చెయినంచు వి. గొలుసు మాదిరిగా డిజైను పడేట్టు నేసిన అంచు. <చెయిను + అంచు. చెయినుడాబీ వి. ఒకరకం డాబీ, సన్నబద్దలగొలుసు దిండుకు తగిలించింది. చెయిను బద్ద వి. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద. చెయినులాక వి. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద.
చెయిరు వి. 1. కుర్చీ ; 2. అధికారపీఠం.
ఇం. *Chair*. కుర్చీ.
<ఇం. Chair.
చెయువు రూ.చూ. చెయ్వు. వి. కార్యం, పని. భాగ. 10, పూ. 195.
చెయువులసాకిరి రూ. చైవులసాకిరి. వి. కర్మసాక్షి, సూర్యుడు. అచ్చ.రా. యు. 273.
చెయ్దము రూ.చూ. చెయిది. వి. పని, కృత్యం. హరి.పూ. 9.55.
చెయ్ది రూ.చూ. చెయిద. వి. కృత్యం, పని. భార.ఆది. 7.213.
చెయ్యడ్డుడుకుండ చూ. చెయ్యి[1].
చెయ్యాఁగు చూ. చెయ్యి[1].
చెయ్యాఁచు చూ. చెయ్యి[1].
చెయ్యాడించు చూ. చెయ్యి[1].
చెయ్యాడు చూ. చెయ్యి[1].
చెయ్యి[1] రూ.చూ. చేయి. వి. 1. హస్తం, చేయి. రం.రా. కిష్కిం. 220 పు. ; 2. తొండం. అచ్చ.రా. బాల. 195 ; 3. సారెపలకను చుట్టూ కలుపుతూ బిగించే కొయ్యముక్క ; 4. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువు కొయ్యకు బిగించిన పిడి ; 5. ఎత్తును కాని లోతును కాని చెప్పే పరిమాణం.
చెయ్యడ్డుడుకుండ వి. సంగటి ముద్దలు చేసేటపుడు నీళ్ళద్దుకోడానికి, చేతులు కడుక్కోడానికి వాడే వెడల్పు మూతిగల చిన్న మట్టిపాత్ర. చెయ్యాఁగు స.క్రి. అడ్డగించు. <చెయ్యి[1] + ఆఁగు. చెయ్యాఁచు స.క్రి. అడ్డగించు. <చెయ్యి[1] + ఆఁచు. చెయ్యాడించు స.క్రి. కొట్టు. చెయ్యాడు అ.క్రి. రెండు మూరల కొలది అగు. <చెయ్యి[1] + ఆడు. చెయ్యికర్ర వి. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువు కొయ్యకు బిగించిన పిడి. చెయ్యికాల్చుకొను స.క్రి. సొంతంగా వంట చేసుకొను. చెయ్యిగలమెకము (-కలమెకము) వి. ఏనుగు. అచ్చ.రా.బాల. 195. వ్యు. తొండంకల జంతువు. చెయ్యిచూచు స.క్రి. హస్తరేఖల్ని పరీక్షించి భవిష్యత్తు చెప్పు. చెయ్యిచ్చు అ.క్రి. సాయపడు ; స.క్రి. మోసగించు. చెయ్యి తడిచేయు స.క్రి. లంచమిచ్చు. చెయ్యితిరుగు అ.క్రి. అనుభవం గడించు, ఆరితేరు. చెయ్యిదిమ్మెస వి. చిన్నదిమ్మెస, పని వాళ్ళు కూర్చొని వాడే దిమ్మిస. చెయ్యిపట్టుగోడ రూ.చూ. చెయిపట్టుగోడ. వి. చేపట్టుగోడ, మిద్దెపై అంచుల దగ్గర, బట్టీమసిలి పక్కన కట్టే పల్చనిగోడ. చెయ్యిపార రూ. చేపార. వి. కూర్చుని పని చెయ్యడానికి పనికి వచ్చే చిన్న పార. చెయ్యిపిడి వి. ఇటికచ్చును పట్టుకోడానికి పెట్టిన హొట్టికామ. చెయ్యిపుల్ల వి. పత్తిరాట్నం తిప్పేపిడికి బిగించిన పుల్ల. చెయ్యిబాన వి. చాకళ్ళు బట్టలు పిండడానికి వాడే మట్టిపాత్ర. చెయ్యిమన్ను రూ. చేమన్ను వి. చేమన్ను. చేత్తో పూతపెట్టే మన్ను. చెయ్యివిప్పకొలుపు వి. నమస్కారం. చెయ్యియూరికేలేకుండు అ.క్రి. ఏదో పనిచేస్తూ ఉండు. చెయ్యివిదిలించు స.క్రి. ఏదో కొంతపెట్టు. చెయ్యీడు వి. రెండుమూరలున్న బట్ట. <చెయ్యి[1] + ఈడు. చెయ్యూఁత వి. 1. హస్తావలంబం ; 2. సహాయం. <చెయ్యి[1] + ఊఁత. చెయ్యూఁదికొను అ.క్రి. చెయ్యిచ్చు, తోడ్పడు. <చెయ్యి[1] + ఊఁదికొను. చెయ్యెత్తిచూపు స.క్రి. తప్పుపట్టు. వర.రా. యు. పు. 249. పం. 16. <చెయ్యి[1] + ఎత్తి చూపు. చెయ్యెత్తుపొడవు వి. నిలువెత్తుపొడవు. <చెయ్యి[1] + ఎత్తు పొడవు. చెయ్యొగ్గు స.క్రి. అంజలించు, ప్రార్థించు. తాళ్ల. సం. 10.2. <చెయ్యి[1] + ఒగ్గు.
చెయ్యి[2] రూ.చూ. చెయి[2]. వి. తాళపుచెవి.
చెయ్యీడు చూ. చెయ్యి[1].
చెయ్యూఁత చూ. చెయ్యి[1].
చెయ్యూఁదికొను చూ. చెయ్యి[1].
చెయ్యెత్తిచూపు చూ. చెయ్యి[1].
చెయ్యెత్తుపొడవు చూ. చెయ్యి[1].
చెయ్యొగ్గు చూ. చెయ్యి[1].
చెయ్వు రూ. చెయువు, చైవు. చూ. చేయు. వి. 1. కార్యం, పని, విలాస చేష్ట. భార.ఆది. 8.21 ; 2. నియోగం. ద. హిం.శా.సంపు. 5. శా.సం. 100.
చెయ్వులు వి.బ.వ. విలాస చేష్టలు. భార.ఆది. 5.176, కు.సం. 8.100.
చెర[1] వి. 1. శీఘ్రత ; 2. శీఘ్రంగా వెళ్ళటంలో అయ్యే ధ్వనికి అనుకరణం ; 3. కోపాదులలో అయ్యే ధ్వనికి అనుకరణం. క్రి.విశ.ద్రు. శీఘ్రంగా.
చెరచెర రూ.చూ. చెచ్చెర. క్రి.విశ.ద్రు. 1. శీఘ్రంగా ఆం.భా. 1.65 ; 2. కోపం ; 3. వికారం ; 4. చురుకు.
చెర[2] రూ.చూ. చెఱ. వి. 1. కష్టం ; 2. ఖైదు.
చెరకపంటె వి. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్య బద్దల పంటె.
చెరకా వి. నూలు వడికే రాట్నం వంటి కొయ్యయంత్రం.
హిం. చర్ ఖా. నీళ్ళు మొ. తోడే సాధనం, రాట్నం ; మరా. చరక. చెరకుగానుగు, యంత్రం ; పార. చర్ ఖ. రాట్నం.
<హిం. చర్ ఖా.
చెరకు రూ.చూ. చెఱకు. వి. ఇక్షువు, తియ్యని రసం కలిగిన ఒకరకం పంట. పల్నా. 111 (Saccharum officinarum).

చెరకులపందెము రూ. చెఱకుల పందెము. వి. చెరకు గడల్ని నరకటంలో ప్రావీణ్యం చూపుతూ వేసుకొనే పందెం. పల్నా. 38. చెరకుసోగ వి. చెరకుఆకు.

చెరగడం వి. ఎర్రని పూలుపూసే ఒక పొద (Indigofera enneaphylla).

చెరగతుకు చూ. చెరగు.

చెరగు రూ.చూ. చెఱఁగు. వి. 1. చీర చివరిభాగం; 2. మోకుతాడు.

చెరగతుకు వి. అచ్చుతికేటప్పుడు, కొంగు బద్దెపోగులకు పడుగు పోగులు అతుకు. చెరగుకడ్డీ వి. సులిగె, నేసిన గొంగడి బిగింపు కోసం ఉన్ని మగ్గం దోనెగాడిలో పెట్టిన కర్ర. చెరగుచీర వి. మూరెడు పొడుగు పట్టుకొంగు, పట్టంచుల్లో జరీ చేమంతి పువ్వులా జరీకడ్డీ పడేట్టు నేసిన చీర. చెరగుచేయు స.క్రి. ముందు నేతనేయు. చెరగుఝూలు వి. చీర చెరగులో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగు మీద, పంతెన మాదిరిగా కట్టిన లావుదారాల సమూహం. చెరగునేత వి. చీర మొదటగాని, చివరగాని మూరెడు పొడుగు నేసిన నేత. చెరగుమాయు రూ.చూ. చెఱఁగు మాయు. అ.క్రి. స్త్రీలు బహిష్ఠగు. చెరగుమొద్దు వి. చెరగు నేతకు వాడే దారాలు చుట్టే కొయ్యపట్టె.

చెరగొట్టు చూ. చెర్లుగొట్టు. వి. మారిన రూపం.

చెరంగ వి. ఒకరకం చెట్టు (Dioscorea wallichii).

చెరఁగు రూ.చూ. చెఱఁగు. వి. 1. దిక్కు, వైపు, భాగం; 2. వస్త్రం యొక్క కొంగు; 3. అంచు, అంతం, కొన; 4. వస్త్రం, వస్త్రభేదం.

చెరఁగునముడివేసికొను స.క్రి. వశవర్తిగా చేసుకొను. చెరఁగుమాయు రూ.చూ. చెఱఁగుమాయు. అ.క్రి. కొంగు మాయు, ముట్టగు. చెరఁగుమూయు చూ. చెఱఁగుమాయు. అ.క్రి. ముట్టగు.

చెరణాకోల రూ. చెర్ణకోల, చెర్నాకోల. వి. 1. చబుకుకట్టిన కర్ర, కొరడా; 2. కాడికి కట్టిన ఎద్దుల్ని తోలే కర్ర.

హిం. చెర్‌నా. పశువుల్ని అదలించటం.

చెరప రూ. చెఱప. వి. చెక్కిలి, చెంప.

క. కెన్నె. కణత, చెక్కిలి పై భాగం; కెక్కె. చెక్కిలి; కెందార. కణతలు; కొడ. కెయ్ణ్. కణత; తు. కెన్ని, కెన్నె. చెక్కిలి; కెప్పె, కెబ్బు. చెక్కిలి, కణత, చెక్కిలి వాపు; గెబ్బు. కణతలు; త. చెన్ని. తల, ఏనుగు కణత; చెన్ని, చెన్నె. చెక్కిలి; మ. చెన్ని, కెన్ని. కణత; కొన్ని. చెక్కిలి; కో. కెయ్ణ్. చెక్కిలి; గోం. కోర్వి, కోఝ్వి. చెక్కిలి;

పో.చూ. సం. కేనార-. చెంప, కణత.

చెరపంజాట రూ.చూ. చెఱపనచేట. విశ. 1. నాశకుడైన; 2. నాశకురాలైన. వి. తుంటరి, జాల్ముడు.

చెరపఁజాట రూ.చూ. చెఱపనచేట. వి. జాల్ముడు, తుంటరి.

చెరపనచేట రూ.చూ. చెఱపనచేట. వి. వెధవ, తుంటరి. కుక్కు. 40.

చెరపనాబత్తుడు వి. ప్రతికార్యం చెడగొట్టేవాడు.

చెరమ రూ. చెఱమ. వి. ముక్కుపుటం, నాసాపుటం. భాస్క. రా.యు. 861.

చెరమివేయు రూ.చూ. చెఱమివేయు. స.క్రి. 1. నరకు, తునుము; 2. తరిమివేయు.

చెరలాట చూ. చెరలు.

చెరలాటము చూ. చెరలు.

చెరలాటలాడు చూ. చెరలు

చెరలాడు చూ. చెరలు.

చెరలు రూ. చరలు, చెఱలు. అ.క్రి. ఉత్సహించు. బసవ. 7.40. పం. వి. ఉత్సాహం.

క. కెరళ్. కోపించు. అరచు, కేకలుపెట్టు, ఏడ్చు; తు. కెర్లె. శబ్దం, ధ్వని; త. చిరఱ్ఱు(చిరఱ్ఱి). అరచు, గట్టిగా పిలచు, అధికంగా కోపించు.

<మూ.ద్రా. *కెర్-అల్. <కేర్-అల్.

చెరలాట రూ.చూ. చర్లాటము. వి. 1. అధిక క్రీడ. ప్రభు. 4.131 వ. 7 పం.; 2. నరసం. చెరలాటము రూ.చూ. చర్లాటము. వి. చెరలాడటం, అధికక్రీడ. రాఘవ. 2.6. చెరలాటలాడు అ.క్రి. చెరలాడు, నరసమాడు. చెరలాడు రూ. చరలాడు, చెర్లాడు, చెఱలాడు, చెల్లాడు. అ.క్రి. 1. అధికంగా క్రీడించు, సంచరించు, తిరుగు. కు.సం. 12.142; 2. వ్యాపించు. శృం.నై. 4.140; 3. నరస మాడు. రుక్మా. 3.104; 4. వేడుకతో ఆడుకొను, అలముకొను; 5. జీరాడు. చెరలుకొట్టు అ.క్రి. 1. ఉత్సాహం చూపు. శ్రీరం.మా. 2.295; 2. ఉబ్బు. చెరలుగొట్టు రూ. చూ. చెర్లుగొట్టు. వి. మారిన రూపం. చెరలువెట్టికొను (-పెట్టికొను) స.క్రి. లోబరుచుకొను. చెరలువొడుచు (-పొడుచు) అ.క్రి. ఉత్సాహం చూపు. భార.విరా. 4.265.

చెరవ రూ. చెరవము, చెరివె, చెర్వ, చెర్వము, చెర్వి, చెర్వె. వి. 1. గుండ్రని ఉండాలాగ నీళ్ళు కాచడానికి వాడే మట్టి పాత్ర. సారంగ. 2.249; 2. వెడల్పు మూతిగల రాగి మొ. వాటితో చేసిన పాత్ర. ఆం.భా. 2.245.

సం. శరావ-, శరావక-. పళ్ళెం, పాత్ర; సరక-. నీళ్ళుతాగే పాత్ర; ప్రా. సరావ-. పాత్రవిశేషం; అ.మూ. సరగు, సరావ. మట్టిపాత్ర.

క. చరవిగె, చరివిగె, చర్విగె, చవరిగె. జలపాత్ర; త. చరాకై. లోహపాత్ర; చరువమ్. వెడల్పు మూతి గల పాత్ర; కుఇ. సారె. పెద్ద మట్టికుండ.

<ప్రా. సరావ-.

చెరవదలు అ.క్రి. 1. పచ్చిక బీడు మొదలగువాటిలో, సొంత పశువులు మేసిన తర్వాత ఇతరులవాటికి వదలివేయు; 2. పీడ వదలించుకొను.

చెరవము రూ.చూ. చెరవ. వి. వెడల్పు మూతిగల రాగి మొ. పాత్ర, ఇత్తడిబిందె. ఆం.భా. 2.245.

చెరవుకండె వి. చీరచెరగు నెయ్యటానికి వాడే దారపుకండె.

చెరవుకోడి వి. నీటికోడి. హంస. 3.12.

చెరవువెట్టు (-పెట్టు) స.క్రి. బలిచేయు, నరకు.

చెరవెట్టుకొను (-పెట్టుకొను) చూ. చెఱ. స.క్రి. చెరపెట్టు.

చెరాయి వి. పుంత, పోరంబోకు.

హిం. చేరాఈ. సేవ, దాసత్వం.

చెరి[1] రూ. చెఱి[2]. వి. 1. పుస్తం, వస్త్రం. మట్టి, కర్ర, రత్నాలు మొ. వాటితో చేసే శిల్పం. ఆం.భా. 2.296 ; 2. చిత్ర లేఖనాదికం.

చెరి[2] రూ.చూ. చెఱి. అవ్య. ఒక్కొక్కదానికి, పరస్పరం.

చెరికచ్చినేత వి. చన్నేత, పేకపోగులు కలవకుండా విడి విడిగా కనిపించేటట్లు నేసిన నేత. చెరికొంగునేత వి. బద్దె తట్టిన తరువాత నేసిన నేత.

చెరికి వి. ధూర్తుడు, టుంటరి. ఆం.భా. 3.7.

చెరిగిపారవేయు చూ. చెరుగు[1]. రూ. చెలిగిపారవేయు. స.క్రి. 1. ఇతరుల దోషాల్ని వెదుకు ; 2. పాండిత్యం చూపు ; 3. నరుకు.

చెరిగొట్టు వి. మోటెద్దులను మోటబారిపై వెనక్కు నడుపు, వెనక కపిల.

చెరియించు అ.క్రి. చరించు, సడయాడు.

సం. చర్. నడచు.

<సం. చర్ + -ఇంచు[3].

చెరివి రూ.చూ. సెలవి. వి. 1. పెదవి మూల, సెలవు ; 2. చెలివి, నాల్కపై వచ్చిన వ్యాధి (పుండు).

చెరివె రూ.చూ. చెరవ. వి. చెరవం, బండె.

చెరివెలు వి ఒకరకం పొద లేదా మొక్క (Oldenlandia umbellata).

చెరుకాకంచు వి. చిగురు వదలకుండా, అంతా జరీపెట్టి నేసిన అంచు.

చెరుకు రూ.చూ. చెఱకు. వి. వాణిజ్యపు పంటగా పెంచబడే తృణ విశేషం.

చెరుకుమోకు వి. బండిపైన ఎత్తుగా వేసిన గడ్డి మొదలగు వాటిని లాగి, బిగించే లావుపాటి పొడవుమోకు, చెరగు, పెద్ద తాడు, మోకుతాడు. చెరుగ్గొట్టం వి. గానుగుపొయ్యికి బెల్లం పాకం చేసేటప్పుడు పెనంవెనుక పొగ పోవటానికి పెట్టే మట్టిగొట్టం.

చెరుగు[1] స.క్రి. 1. (బియ్యం మొ. వాటిని) చేటతో బాగుచేయు. శుక. 2.208 ; 2. నరుకు.

క. కేఱు. చెరుగు ; మ. చేఱుక. చెరగు, విసరు, బియ్యం మొ. చెరగు ; తొ. కోర్ (కోరై). చెరగు ; కొండ. కెర్, కెరి. కిందకి మీదకి ; గోం. సేటీ. చెరగు ; కుఇ. సేసి. చెరగు ; కువి. కోర్ (కోరై). చెరగు ; పర్జి. కేడ్. చెరగు ; కేతి, కేటి. చేట ; కొలా. కేడ్ (కిట్ట్). చెరగు ; కేడ్, కేట్ట. కిందకి, మీదకి చెరగు ; కేట్. చేట ; గ. కేయ్. చెరగు ; ఒల్లా. కేయ్. చెరగు ; కురు. కేఁస్నా (కిస్యస్). కిందికి మీదకి చెరగు ; కేబెర్. చేట ; మాల్తో. కేసె. చెరగు ; కెత్సు. చేట.

<మూ.ద్రా. *కెట్ట్.

చెరుగు[2] వి. 1. చేలో ఒకమూల ; 2. నాగలి మోకు చివర వేసే ముడి ; 3. బండపైన ఎత్తుగా వేసిన గడ్డి మొ. వాటిని లాగి బిగించే లావుపాటి పొడవు మోకు.

చెరుగుబిళ్ళ వి. తోవను సులువుగా బిగించటానికి బిగు తాడుకు వేసిన చెక్కబిళ్ళ.

చెరుగు[3] అ.క్రి. మాసిపోవు.

చెరుగ్గొట్టం చూ. చెరుకు.

చెరుఁగు రూ.చూ. చెఱఁగు. వి. చీర చివరి భాగం.

చెరుచు రూ.చూ. చెఱుచు. స.క్రి. పోగొట్టు.

చెరుపు వి. ఆభరణ విశేషం.

చెరుమ వి. చెక్కటం, చెరువు, దోపుడు.

చెరువు[1] స.క్రి. 1. గుచ్చు, నాటు, పొడుచు. భార.భీష్మ. 3.108 ; 2. పువ్వులు మొ. సంఘటించు, తురుము. హరి. ఉ. 3.16 ; 3. సవరించు. సిం.ద్వా. 1.235. వి. దోపుడు, సందుల్లో దోపే ఆకులు మొ. పదార్థం. ఉ.హరి. 5.236.

క. సెర్థు, సెక్కు. దోపు, లోపలికి దూర్చు ; తు. పచ్చుని. గుచ్చు, దూర్చు ; త. సెరుక్కక, చెరుకు(-చెరుకి). దోపు, దూర్చు ; చొరుకు, చెరుము, చొరుకు. ముణుకు, దొచ్చు కొనిపోవు, దూర్చు, దోపు, పెట్టు ; చొరుప్పు. కోశం, కత్తి మొ. వాని ఒఱ ; మ. చెరుతుక. దోపు ; తెరుక్కుక. లోనికి దోపు ; చొరుకక. దోపు ; తొ. తెగ్ (-తెగై-). నడుముకు వేసే బట్టను కలుపు ; గ. (ఏ.వ.). చిల్ట్. దూర్చు (జడలో పూలు తురిమినట్లు) ; కురు. ఖిరొ్నా, ఖిఁర్యాస్. దూర్చు ; మాల్తో. కెరె. లోనికి దూర్చు.

చెరువు[2] రూ.చూ. చెఱవు. వి. 1. తటాకం, కొలను. రాఘవ. 2.6 ; 2. మూడు వైపులా ఎత్తుగా కట్టఉండి నాలుగోవైపు నీళ్ళురావటానికి దారి ఉన్న జలాశయం.

చెరువుకట్ట వి. చెరువుచుట్టూఉన్న గట్టు. చెరువుకాకి వి. ఒకరకం కాకి. చెరువుకాలవ వి. చెరువులోనికి నీళ్ళుతెచ్చే కాలవ, చెరువునుండి పంటపొలాలకు పెట్టే కాలవ. చెరువు కాల్వపనిముఖాలు వి.బ.వ. చెరువునుంచి తవ్వబడ్డ పంట కాలవల మరమ్మత్తులు. నెల్లూరి శాసనాలు క్రీ.శ. 1638. చెరువుకువెళ్ళు అ.క్రి. మలవిసర్జనకు వెళ్ళు, నీళ్ళ చాయ పోవు, చెంబట్టుకుపోవు. చెరువుకొమ్ము వి. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగాఉన్న చివర ఏర్పరచిన మార్గం. చెరువుకోడి వి. నీటికోడి. హంస. 3.12. చెరువుగంగమ్మ వి. వానకోసం జరిపే జాతర. చెరువుగట్టు వి. చెరువుచుట్టూ ఉన్న గట్టు. చెరువుగర్భం వి. నీళ్ళు నిలిచే చెరువు లోపలిభాగం. చెరువుతొట్టి రూ. చెరువుతొట్టు. వి. నీళ్ళు నిలిచే చెరువు లోపలి భాగం. చెరువుతొట్టు రూ.చూ. చెరువుతొట్టి. వి. నీళ్ళు నిలిచే చెరువు లోపలి భాగం. చెరువుపునాది వి. నిర్మాణస్థలం మొత్తాన్ని చదును చేసి తవ్విన విశాలమైన పునాది. చెరువుమట్టి వి. చెరువు మన్ను, పాత్రల తయారీకి చెరువుల్లోనుండి తెచ్చే జిగట మట్టి. చెరువుమన్ను వి. పాత్రల తయారీకి చెరువుల్లోనుండి తెచ్చే జిగటమట్టి.

చెరువు[3] రూ.చూ. చెఱఁగు. వి. చీర చివరి భాగం.

చెర్చిఆర్చి వి. ముక్కోణపు ఆర్చి, త్రిభుజాకారంలో ఉండే ఆర్చి.

ఇం. *Church*. చర్చి, *Arch*. ధనురాకారంగా ఉన్న.

<ఇం. Church + ఇం. Arch.

చెర్చు రూ.చూ. చెఱుచు. స.క్రి. ధ్వంసంచేయు. పండి.ప. 3.205 వ.

చెర్ణకోల రూ.చూ. చెరణాకోల. వి. 1. కొరడా ; 2. కాడికి

కట్టిన ఎద్దుల్ని తోలే కఱ్ఱ.

చెర్నాకోల రూ.చూ. చెరణాకోల. వి. 1. కొరడా ; 2. కాడికి కట్టిన ఎద్దుల్ని తోలే కఱ్ఱ.

చెర్మం వి. మరమగ్గంలో ఉడతకు కింద వేలాడే తోలుచుట్ట. సం. చర్మన్. తోలు.
<సం. చర్మన్.

చెఱ్ఱ వి. సారె సులభంగా తిరగడానికి వీలుగా గుబ్బిగడ్డలో వేసిన ఇనపగుండు.

చెర్లమన్ను చూ. చెఱవు. వి. చెరువుమన్ను, పాత్రల తయారీకి చెరువుల్లోనుంచి తెచ్చే జిగట మన్ను.

చెర్లాట రూ.చూ. చర్లాటము. వి. చెరలాట, అధిక క్రీడ. కళా. 3.10.

చెర్లాటము రూ.చూ. చర్లాటము. వి. అధిక క్రీడ. ఉ. హరి. 4.269.

చెర్లాటమాడు రూ.చూ. చర్లాటమాడు. అ.క్రి. సరసాలాడు. పాండు. 3.63.

చెర్లాడు రూ.చూ. చెరలాడు. అ.క్రి. 1. అధికంగా క్రీడించు ; 2. వ్యాపించు ; 3. వేడుకతో ఆడుకొను ; 4. సరస మాడు ; 5. జీరాడు.

చెర్లగొట్టు రూ. చెరలుగొట్టు. వి. మారినరూపం. పండి.చ.ద్వితీ. 4. పుట 115.

చెర్వ రూ.చూ. చెరవ. వి. నీళ్ళు కాచుకోటానికి ఉపయోగపడే ఇత్తడి పాత్ర.

చెర్వము రూ.చూ. చెరవ. వి. వంటకు, నీళ్ళు కాచుకోటానికి ఉపయోగపడే ఇత్తడి పాత్ర.

చెర్వి రూ.చూ. చెరవ. వి. వంటకు నీళ్ళు కాచుకోటానికి ఉపయోగపడే ఇత్తడి పాత్ర, గిన్నె.

చెర్వు రూ.చూ. చెఱవు. వి. కొలను. చిట్టివలస శాసనం క్రీ.శ. 1086. కాశీ. 6.29.

చెర్వుకట్టుకవులు వి. చెరువు కట్ట తెగిపోయిన కారణంగా, దానిని పునర్నిర్మాణం చేసి వనరు ఏర్పాటు చేయటానికి చేసిన నిబంధనం. ద.హిం.శా. సంపు. 10 శా. సం. 771 క్రీ.శ. 1691. చెర్వుకుంచాలు వి.బ.వ. చెరువు పని ముఖానికి కొల్చే కుంచాల మేర ధాన్యం, చెరువమేర ధాన్యం. నెల్లూరు శాసనాలు సంపు. 3. క్రీ.శ. 1756 సం. చెర్వుపనిముఖాలు వి.బ.వ. చెరువు మరమ్మత్తులు. నెల్లూరి శాసనాలు. రాపూరు శాసనం. 34. క్రీ.శ. 1638. చెర్వుమేర వి. చెర్వుపని ముఖానికిచ్చే మేర ధాన్యం.

చెర్వె రూ.చూ. చెరవ. వి. చెరవం, బిందె.

చెఱ రూ. చెర[2]. వి. 1. కారాగారం, చెరసాల. భార. సభా. 1.119 ; 2. చెరలో పడింది, బంది. కు. సం. 10.126 ; 3. బాధ, వెత. హరి. ఉ. 8.47 ; 4. నిర్బంధం. దాస్యం. ఆము. 6.45.

క. సెఱె. చెరలో నుంచు ; తు. సెరె. కారాగారం ; త. చెఱి (-వ్-న్త్). దట్టంగా ఉండు, గుంపుగాఉండు, (గాజుల్లా) గుత్తంగా ఉండు, నిర్బంధంలో ఉంచబడు, హద్దులో ఉంచబడు ; చెఱ (ప్పి-,-త్తి). కలియు. మూయు, నిలువ చేయు, సంపాదించు ; చెఱి, చెఱిప్ర. సాంద్రత, ఆధిక్యం ; చెఱు, చెఱువ్-, చెట్ట్-. అదుపులో ఉంచు, దాచు, అడ్డగించు, అధిగమించు ; చెఱుప్పు. నిర్బంధం ; మ. చెఱుక్కుక. నిలుపు, లోన పెట్టి మూయు ; చెఱియుక. గుంపు, గూడు ; కో. చెర్. జైలు, చెరసాల ; సెర్. చెరసాల ; తొ. సెర. కారాగారం, చెర ; గోం. కెహ్‌తానా. మూయు ; కుఇ. క్రీప (-క్రీత). పొంగు, ఉబ్బు ; పర్జి. కెడ్ప్(-కెడ్త్). మూయు, (తలుపు) తాళం వేయు ; కొలా ; గెత్ (-గెత్త్). మూయు (తలుపు) ; పో.చూ. క. కిక్కఱిసు.

చెఱగొను (-కొను) స.క్రి. చెఱపట్టుకొను. భార. అరణ్య. 6.9. చెఱదెచ్చు (-తెచ్చు) స.క్రి. బందిగాతెచ్చు. భాగ. 10ఉ. 206. చెఱపట్టు రూ.చూ. చెఱవట్టు. స.క్రి. చెరగొను, బందిగాచేయు భాగ. 10 ఉ. 209. చెఱపోవు రూ. చెఱవోవు. అ.క్రి. నిర్బంధంగా పట్టుపడు. భార. అరణ్య. 6.196. చెఱఁబడ్డవాఁడు (-పడ్డవాడు) విశ. బందెకాడు. చెఱఁబెట్టు (-పెట్టు) స.క్రి. బంధించు. కు. సం. 11.96. చెఱలిచ్చు స.క్రి. స్త్రీలను బానిసలుగా ఇచ్చు. కు. సం. 10.139. <చెఱ + -లు + ఇచ్చు. చెఱలుగొను (-కొను) స.క్రి. చెఱపట్టు. విష్ణు పు. 2.123. చెఱలుచూఱలుపుట్టుకొని వి. బందీలుగా చేయటం, దోపిడీలు దాపురించిన దుష్కాలం. సింహ. శ. 45. చెఱలుదెచ్చు (-తెచ్చు) స.క్రి. ఖైదులు తెచ్చు. హరి. ఉ. 4.45. చెఱలు పట్టు స.క్రి. బందీలుగా తెచ్చు. సమీర. 1.150. చెఱవట్టు (-పట్టు) రూ. చెఱ పట్టు. స.క్రి. చెరగొను. భార. అరణ్య. 7.61. చెఱపడు (-పడు) అ.క్రి. చెరపోవ, బందీ అగు. హరి. ఉ. 4.179. చెఱవెట్టుకొను (-పెట్టుకొను) స.క్రి. లోబరచు కొను. క్రీడా. 200. చెఱవోవు (-పోవు) రూ.చూ. చెఱపోవు. అ.క్రి. నిర్బంధంచేత పట్టుపడు. ఉ.రా. 6.318. చెఱసాల వి. కారాగృహం; సం. శాలా. ఇల్లు. అచ్చ. రా. సుం. 18 <చెఱ + సం. శాలా.

చెఱకడము చూ. చెఱకు.

చెఱకు రూ. చెరకు, చెరుకు, చెఱుకు. వి. 1. ఇక్షువు. తియ్యని రసం కలిగి పంచదార, బెల్లం మొ. వాటి తయారీకి ఉపయోగ పడే ఒకగడ. కు. సం. 1.30. హర. 1.20 ; 2. వంట కట్టె. (వంట పూర్వ పదంగా ఉన్నప్పుడే ఈ అర్థం) ; 3. బెల్లం.

క. చెఱుకు, చెరుకా.

చెఱకడము వి. బెల్లం, గుడం. ఆము. 2.97. చెఱకు కదలి వి. ఇక్షుదం. చెఱకుంగుడుము రూ. చెఱకుఁగుడుము. వి. చెఱకు బెల్లం. ద. హిం. శా. సం. 5. శా. సం. 1295. క్రీ.శ. 1233 చెఱకుఁగట్టి వి. చెరకుగడ. చెఱకుఁగుడుము రూ.చూ. చెఱకుంగుడుము. వి. చెరకుబెల్లం. చెఱకుఁగోల (-కోల) వి. ఇక్షుదండం, చెరకుగడ. హర. 1.19. చెఱకుతోట వి. ఇక్షువనం. చెఱకునపండొదవినట్లు అవ్య. చెరుక్కి పళ్ళు కాసినట్లు (అసంభవమైన విషయం). విక్ర. 7.20. చెఱకుఁదీఁగె (-తీగె) వి. చెరకుగడ. హర. 1.18. చెఱకు పండిన పండు వి. అసంభవం. తాళ్ల. సం. 12.75. చెఱకుపందెము రూ. చెఱుకుపందెము.

చెరకు గడల్ని నరకటంలో ప్రావీణ్యం చూపుతూ వేసుకొనే పందెం, బాలక్రీడా విశేషం. కువ.చ. 5.9. **చెఱకుపాన కములు** వి.బ.వ. చెరకురసం. **చెఱకుపాలు** వి. ఇక్షురసం. చెరకురసం. ఉ.రా. 7.164. **చెఱకులపందెము** రూ.చూ. చెరుకులపందెము. వి. పందెం వేసుకొని చెరకుగడలను విరిచే ఒకఆట, బాలక్రీడా విశేషం. హంస. 3.146. **చెఱకువిలుకాఁడు** రూ.చూ. చెఱకువిల్కాఁడు. వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. దశా. 2.282. **చెఱకువిలుతుఁడు** రూ.చూ. చెఱకువిల్తుఁడు. వి. మన్మథుడు. **చెఱకువిల్కాఁడు** రూ. చెఱకు విలుకాఁడు. వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. ఉ.రా. 6.200. **చెఱకువిల్తుఁడు** రూ. చెఱకువిలుతుఁడు. వి. మన్మథుడు. భీమ. 4.123. **చెఱకువిల్లు** వి. మన్మథ ధనుస్సులలో మొదటి విల్లు, ఇక్షుధనువు. హర. 5.40.

**చెఱంక్కుగుజ్జు** చూ. చెఱకు. వి. చెరుకుబెల్లం. ద.హిం.శా. సంపు. 6. శా. సం. 1203. క్రీ.శ. 1225.

**చెఱంగునముడుచుకొను** చూ. చెఱఁగు. స.క్రి. కొంగున కట్టుకొను. హర. 1.19.

**చెఱఁగు** రూ. చెంగు², చెరగు, చెరఁగు, చెరుగు, చెరుఁగు, చెరువు³, సెరగు, సెరుగు. వి. **1**. దిక్కు, వైపు, భాగం. భార.విరా. 2.7 ; **2**. వస్త్రం యొక్క కొంగు. భార.భీష్మ. 2.155 ; **3**. అంచు, అంతం, కొన. శృం. నై. 6.80 ; **4**. వస్త్రం. వస్త్రభేదం. చంద్రికా. 1.65 ; **5**. మోకు తాడు.

క. సెఱఁగు, సెఱగు, సఱగు, సఱంగు. చీర కొంగు, బట్ట చివరికొన; కొడ. చెంగ్ల్. చెంగు ; తు. సెఱంగు. చీరచెరగు ; తొ. తెర్గ్. కొంగు.

**చెఱఁగుపెనచు** స.క్రి. స్త్రీలు సిగ్గు, తత్తరపాటు మొ. కలిగినపుడు పైట చెరగును వేలికి చుట్టుకొని నులిపెట్టు. మను. 3.106. **చెఱఁగుమాయు** రూ. చెరగుమాయు, చెరఁగు మాయు. అ.క్రి. వస్త్రం మాసినదగు, ముట్టగు, బహిష్ఠగు. కాశీ. 2.72.

**చెఱచు** రూ.చూ. చెఱుచు. స.క్రి. **1**. పాడు చేయు ; **2**. పోగొట్టు ; **3**. పరస్త్రీని రమించు.

**చెఱచెఱ** రూ.చూ. చెచ్చెర. క్రి.విశే.ద్రు. వడిగా, సులువుగా. వి. శీఘ్రత, వేగం, వడి.

**చెఱచెఱలాడు** అ.క్రి. కోపంచేత మండు. క. కిఱు. కోపంచేత మండిపడు; కెరళ్. కోపించు ; త. చిఱుక్కు. కోపించు, అసహ్యం, అయిష్టం, కోపం ; చెఱుమ్పు, చెఱల్. ద్వేషం, పగ ; చెఱ్ఱమ్. పగ, అసహ్యం, విముఖత్వం ; చిరట్టు. కోపించు ; కో. చిర్వ్. కోపించు ; తొంకిఱ్క్. పిచ్చి ; కుఇ. కిరెని. చిరచిర లాడు. <చెఱచెఱ + -లు + ఆడు.

**చెఱపనచేట** చూ. చెఱపు.

**చెఱప** రూ.చూ. చెరప. వి. చెంప, తెంప, చెక్కిలి.

**చెఱపు** రూ.చూ. చెఱుపు. వి. కీడు, హాని. స.క్రి. తుడుచు, పోగొట్టు.

**చెఱపనచేట** రూ. చెరపం జాట, చెరపఁ జాట, చెరపనచేట. వి. **1**. నాశకుడు. జైమిని భా. 4.69 ; **2**. గాలుగ్రాడు, ఆలోచించక చేసేవాడు. ఆం. భా. 3.6.

**చెఱపుకొను** స.క్రి. **1**. నాశనం చేసుకొను ; **2**. తుడుచుకొను.

**చెఱమ** రూ.చూ. చెరమ. వి. ముక్కుపుటం, నాసాపుటం. మను. 4.45.

**చెఱమివేయు** రూ. చెరమి వేయు. స.క్రి. **1**. తరిమి వేయు ; **2**. తునుము.

**చెఱలాడు** చూ. చెఱలు.

**చెఱలు** రూ.చూ. చెరలు. అ.క్రి. ఉత్సహించు.

**చెఱలాడు** రూ.చూ. చెరలాడు. అ.క్రి. తిరుగు, విహరించు. **చెఱలుగొట్టు (-కొట్టు)** అ.క్రి. కిలకిలలాడు.

**చెఱవు** రూ. చరువు. చఱు, చెరువు², చెర్వు, చెఱువు². వి. చెరువు, కొలను. ఏడువాడల పాలెం శాసనం. క్రీ.శ. 1018.

క. కెఱె. చెరువు ; సెఱె. బంధం, చెరసాల ; కొడ. కెరె. చెరువు ; తు. కెరె, కిరె, కెఱు. కృత్రిమ తటాకం ; త. చెఱి, చెఱివు. సాంద్రత, సంఘం, చెరువు, పొలం ; కో. కెర్. జలాశయం ; తొ. కెఱ్ప (కెఱ్జ్). నీరు ; పర్జీ. చెరు. చెరువు ; కొలా. చెరు. చెరువు ;

పో.చూ. సం. సరస్-. కొలను.

<మూ.ద్రా. *కెఱ్-

**చెఱువుకెళ్ళు** అ.క్రి. మలవిసర్జనకై వెళ్ళు.

**చెఱి**[1] రూ.చూ. చెఱు. అవ్య. ఒక్కొక్కనికి, ఒక్కొక్కదానికి. భార. ఉద్యో. 1.219.

**చెఱియొకటి (-ఒకటి)** వి. చెరిసగం, తలకొకటి. **చెఱి యింత (-ఇంత)** అవ్య. ఒకరొకరు ఇంతింతపొప్పున. **చెఱిసగము** వి. పరస్పరం సగభాగం. **చెఱిసహాయస్వాహా** వి. ఇద్దరూ కలిసి ఒక దానిని అపహరించటం.

**చెఱి**[2] రూ.చూ. చెరి¹. వి. పుస్తం, వస్త్రం, మట్టి, కఱ్ఱ, రత్నాలు మొ. వాటితో చేసే శిల్పం.

**చెఱిపివేయు** చూ. చెఱుపు.

**చెఱు** రూ. చెరి², చెఱి¹, చెఱుక. అవ్య. ఒక్కొక్కనికి, ఒక్కొక్కదానికి. భార. ఆది. 7.50.

**చెఱుక** రూ.చూ. చెఱు. అవ్య. పరస్పరం. ఒకరికొకరు, చెరి ఒక్క.

**చెఱుకు** రూ.చూ. చెఱకు. వి. ఇక్షువు, తియ్యని రసం కలిగి పంచదార, బెల్లం మొ. వాటి తయారీకి ఉపయోగపడే ఒకగడ.

**చెఱుకుపందెము** రూ.చూ. చెఱకు పందెము. వి. పందాల్లోని భేదం.

**చెఱుచు** రూ. చెరుచు, చెర్చు, చెఱచు. చెఱుఱ్చు. స.క్రి. **1**. నశింప చేయు. భార. ఆది. 3.120 ; **2**. భంగపరుచు. భార. ఆది. 5.185 ; **3**. పరస్త్రీని రమించు. కేయూ. 2.21 ; **4**. ధ్వంసంచేయు. పండి. చ. వాద. 205 పు ; **5**. పోగొట్టు. హర. 3.23 ; **6**. వ్యర్థం చేయు. హర. 6.115 ; **7**. నష్టం చేయు. ఆము. 5.127 ; **8**. చంపు. కళా 3.102; **9**. మానభంగం చేయు.

క. కెఱు, కిఱు. పాడు చేయబడు, ధ్వంసం చేయబడు ;

కెడిసు, కిడిసు. నాశనం చేయు ; కొడ. కెఱ్- (కెట్-). మరణించు, పాడు చేయబడు ; తు. కెడగుని. పాడు చేయు; కెడుకు, కెడ, కెడకు. నష్టం ; కెడకె. బాధించే వాడు, హింసకుడు; కెడిసు, కిడిసు. పాడగు, నాశనమగు, చెడు ; త. కెటు. (కెటుప్ - కెట్ట్). పాడగు, చెడగొట్టు; కెటు ( - ప్ప్ -, - త్త్ - ). నాశనం చేయు ; మ. కెటు. పాడు; కెటుక. చెడిన. కెటులి. నాశనం, ప్రమాదం, ఆపద, నీరసం ; కెటుంప్. కుళ్ళడం ; కెటుంపిక. ఎండి పాడ వటం ; తొ. కొఱ్ (కొట్). పాడగు ; గోం. కరీతానా (కరిస్తానా). కుళ్ళు, చివుకు ; కొండ. కెర్ - (కెట్). చచ్చు, నాశనమైన, పోయిన ; కువి. హేడిన్రై, హేల్జినై. నాశనంచేయు, ధ్వంసంచేయు ; పర్జి. చిట్. పైకెళ్ళు ; గ. ఒల్లా. సిట్. పైకి వెళ్ళు.

**చెఱుచువాడు** వి. నాశకుడు.

**చెఱుఇచ్చు** రూ.చూ. చెఱుచు. విణ. చెడగొట్టే. శాసన ప్రయోగం.

**చెఱుపరి** చూ. చెఱుపు.

**చెఱుపు** రూ. చెఱపు, చెఱ్పు. వి. కీడు, పనిచెరుపు, విఘ్నం. అచ్చ.రా.యు. 435 ; స.క్రి. తుడుచు.

క. కెడకు, కెడుకు. నాశం ; కెడుహ. నాశం, అదృశ్యం ; కొడ. కెడి. నాశం : తు. కెడుక, కెడ, కెడకు. నాశం, నష్టం; కేడు. అల్లరి, అపాయం, నష్టం ; త. కెటు. అపాయం, పేదతనం ; మ. కెటు. నాశం; కెటుతి, నాశం, నీరసం, కష్టం ; కెటుంపు. కుళ్ళిపోవడం ; కో. కెర్, కెఱ్. నాశం, అపాయం, అంత్యక్రియోచితమైన ; తొ. కుడిల్. దురదృష్టం.

**చెఱిపివేయు** స.క్రి. **1**. నాశనం చేయు ; **2**. తుడిచి వేయు. **చెఱుపరి** వి. చెరచువాడు. చంద్రాంగ. 5.108. క. కెడక, కెడిక, కెడుక, కిడుక. నాశకుడు ; కేడిగ, కేడుగ. నాశకుడు ; కేడితన, కేడిగతన. నాశక స్వభావం ; తు. కెడకె, కేడింగె. అల్లరి చేసేవాడు ; త. కెట్టువన్. నీతి బాహ్యుడు.

**చెఱుబలి** చూ. చెఱువు².

**చెఱుము** చూ. చెఱుపు. స.క్రి. **1**. రాపుడుచేయు ; **2**. రుద్దు ; **3**. పూయు, పూలుపెట్టు.

**చెఱువు¹** వి. సత్రం, సదనం.

**చెఱువు²** రూ.చూ. చెఱవు. వి. తటాకం, కొలను. భార. సభా. 1.43.

**చెఱుబలి** వి. చెరువుకుఇచ్చేబలి. **చెఱువుకెళ్ళు** వి. మల విసర్జనకై వెళ్లు. **చెఱువుగంగమ్మ** వి. వర్షంకోసం చెరువుకు మేకపోతును బలియిచ్చి చేసే జాతర. **చెఱువుపాలగు** అ.క్రి. గంగపాలగు. బసవ. 6.165. **చెఱువువిడిచికాలువపొగడు** స.క్రి. పెద్దదాన్ని వదలి చిన్నదాన్ని స్తోత్రంచేయు. ఉ.హరి. 4.186.

**చెఱ్పు** రూ.చూ. చెఱుపు. స.క్రి. చెడగొట్టు. బార్సానుర శాసనం. ద.హిం.శా. 10. శా.సం. 644. క్రీ.శ. 1060.

**చెలక¹** రూ.చూ. చెలిక. వి. **1**. బీడు ; **2**. క్షేత్రం, మెట్ట చేను ; **3**. వరిమడి ; **4**. కట్టుబడికి పనికి వచ్చేరాళ్ళుగాని సున్నపురాళ్ళుగాని దొరికే పొలం.

**చెలకగుల్ల** రూ. చిల్కగుల్ల. వి. పొలాల్లో దొరికేగుల్ల. **చెలకదుక్కి** వి. మెట్టదుక్కి. **చెలకదున్నకం** వి. మెట్టసాగు. **చెలకదూరం** వి. పొలంయొక్క వైశాల్యం. **చెలకనాఁగలి** వి. మెట్టనాగలి. **చెలకపత్తి** వి. గింజ, పువ్వుపచ్చగాఉండే ఒక రకం ఎర్రపత్తి. **చెలకపార** రూ. చిలకపార. వి. మట్టిపని చెయ్యడానికి వడ్డెవాళ్ళు, రైతులు వాడే పార. **చెలకసేద్యం** వి. బీటిసేద్యం, మొదటిసాగు.

**చెలక²** వి. చిన్నకొయ్యముక్క.

**చెలకపంటె** వి. దబ్బాఆకారంలో ఉండే ఒకరకం కొయ్య బద్దలపంటె.

**చెలకోల** చూ. చెరణాకోల. వి. **1**. కొరడా ; **2**. కాడికికట్టిన ఎద్దుల్ని తోలేకర్ర.

**చెలగ** వి. **1**. యౌవనం తొణికిసలాడేస్థితి ; **2**. ఎదకానున్న ఆవుపెయ్య, చెలపెయ్య ; **3**. ఊరకే రంకెలు వేయటం, కావరపుకోడెకొసరు.

**చెలగట్లు** వి.బ.వ. చెల్లాటం.

**చెలగము** చూ. చెలఁది. వి. సాలెపురుగు.

సం. శలక-. సాలెపురుగు.

<సం. శలక-.

**చెలగు** రూ.చూ. చెలవు¹. స.క్రి. ఖండించు, నరుకు.

**చెలంగు** రూ.చూ. చెలఁగు. అ.క్రి. **1**. వికసించు. కు.సం. 5.87 ; **2**. విజృంభించు. భార. భీష్మ. 1.82 ; **3**. అతిశయించు. భార. అశ్వ. 4.212.

**చెలఁగఁబాఱు** చూ. చెలఁగు.

**చెలఁగాటము** చూ. చెలఁగు.

**చెలఁగాటలు** చూ. చెలఁగు.

**చెలఁగించు** చూ. చెలఁగు.

**చెలఁగు** రూ. చెలంగు, చెలవు². అ.క్రి. **1**. శబ్దించు, మోగు, ప్రతిధ్వనించు. భార.ఆది. 5.124 ; **2**. వ్యాపించు. కు.సం. 2.102 ; **3**. ఉత్సహించు. నిర్వ. రా. 6.48 ; **4**. విజృంభించు. భార.భీష్మ. 3.13 ; **5**. సంతోషించు. భార. అరణ్య. 7.193 ; **6**. ఉండు. ఉ.హరి. 6.213 ; **7**. కలుగు. భాస్కరా.యు. 236 ; **8**. ఒప్పు. పల్నా. 73 వ. ; **9**. బొబ్బరించు, సింహనాదంచేయు. జైమిని భా. 7.32 ; **10**. ప్రకాశించు. విప్ర. 4.35 ; **11**. వికసించు. రసిక. 5.14 ; **12**. క్రీడించు. విణ. ఒప్పే. కు.సం. 2.48.

క. కెలె. అరచు. కోపం లేదా ఆనందంతో అరచు ; కొడ. కిల్ప్ - (కిల్ప్). ఆనందంతో కేక పెట్టు ; తు. కిలెప్పుని, కిలేవుని, కిలెపుని, కెలెప్పుని. ఈలవేయు ; త. చిలై (-ప్ప్-, -త్త్-). మోగు, గర్జించు, ప్రతిధ్వనించు, కోపగించు ; చిల్ - ఎణల్. ఖంగుమనే, కీచుమనే ధ్వని ; చిలంపు, చిలంపి. ధ్వనిచేయు, ప్రతిధ్వని, కడియాల సవ్వడి ; మ. చిల, చిలప్పు, చిలెప్పు. మోత ధ్వని ; తొ. కిస్- (కిసె). కూయు ; గోం. కిలితానా. గట్టిగా ఏడ్చు : కుయి. క్లాప (క్లాత్). అరచు, ఏడ్చు (మగపక్షి పిలుపు) ; కువి. కీలెరి-కీలై. అరచు, బొబ్బరించు.

**చెలఁగఁబాఱు** అ.క్రి. చిలువలు, పలువలుబెట్టి విస్తరిల్లు. **చెలఁగాటము** వి. వేడుకగా తిరగటం. **చెలఁగాటలు** వి.బ.వ.

చెల్లాటం, వేడుకగా తిరగటం. చెలఁగించు స.క్రి. **1.** చెలగ చేయు, విజృంభింపఁజేయు. మైరా. 2.87; **2.** సంతోషింప చేయు. ద్వి.పరమ. వి. 7.530 వ; **3.** కలగచేయు. అని. 2.91. చెలరేఁగు అ.క్రి. **1.** సంభ్రమించు, వేగిరపడు. కు.సం. 5.83; **2.** ఉత్సహించు. భాగ. 10పూ. 1688; **3.** మించు, అతిశయించు. చంద్రికా. 4.107; **4.** ఉప్పొంగు. సారంగ. 1.32; **5.** విజృంభించు, మిక్కిలిరేగు.

**చెలది** రూ.చూ. చెలిది.వి. చర్మవ్యాధి విశేషం.

**చెలంతు** వి. ఉత్సాహం. కృ. శకుం. 2.20.

**చెలంది** రూ.చూ. చెలఁది. వి. సాలెపురుగు, లూత. కాశ.శ. 2.93.

**చెలఁది** రూ. చెలంది, చెల్ది[1]. వి. సాలెపురుగు. లూత. బసవ. 3.289 పం.

క. చెలన్ని, సెలది, సెలంది. సాలెపురుగు; త. చిలంతె, చిలమ్పి.

ఇం.ఆ. పో.చూ. సం. శలక-.

చెలఁదితెర వి. సాలెపురుగు నేసిన నేత, సాలెపట్టు. సారంగ. 1.15. చెలఁదినేతమూట వి. సాలెపురుగు నేతతో కట్టిన పదార్థం, అస్థిర పదార్థం. ఆము. 6.62. చెలఁదిపుర్వు వి. సాలెపురుగు. కళా. 3.83. చెలఁదిబల్లి వి. సాలెపురుగు. వేంక. ఆం. 95.

**చెలప[1]** వి. పైరు చేనిలో పైరు వచ్చి అక్కడక్కడ ఏర్పడిన వెలితి, చిలప, చెలిపె.

**చెలపనాటు** వి. వాలిపోయిన మొక్కల్నిగాని, ఒత్తుగా ఉన్న మొక్కల్నిగాని తీసి అక్కడక్కడ తిరగ నాటడం.

**చెలప[2]** రూ. చిలప[2]. వి. **1.** బర్రె; **2.** ప్రాయపు బర్రెదూడ.

చెలపెయ్య వి. ఎదకారుకు వచ్చిన ఆవుదూడ, చెలగ.

**చెలప[3]** రూ.చూ. చెడిప. వి. రంకుటాలు, స్వైరిణి.

**చెలపాది** వి. మచ్చరగొట్టు, చలమరి.

**చెలపెయ్య** చూ. చెలప[2].

**చెలమ** రూ. చలమ, చెల్మె. వి. **1.** నీరు ఊరటానికి తవ్విన గొయ్యి, కూపకం. రం.రా. ఉ. 71 పు. 17 పం.; **2.** నీరూరే చిన్న గుంట.

క. చెలమె, చెలిమె, చెలుమె. కన్నం, నీటిగుంట, నీటి ఒడ్డున నీరూరడానికి తవ్విన గుంట; కువి. సలమ. నుయ్యి.

చెలమకుంట వి. ఏటిలో నీరెండి పోయిన చోట తీసిన ఊటనీటి కుంట.

**చెలయు** రూ.చూ. సెలయు. అ.క్రి. **1.** విజృంభించు; **2.** విసరు.

**చెలరాదు** అ.క్రి. విజృంభించు, చెలరేగు.

**చెలరుచు** రూ. చెలర్చు. చూ. సెలయు. అ.క్రి. విజృంభించు.

**చెలరేఁగు** చూ. చెలఁగు.

**చెలర్చు** రూ.చూ. చెలరుచు. అ.క్రి. విజృంభించు.

**చెలవమాను** వి. సిడెను మోసే పంగల గుంజ, చెలవలుమాను.

**చెలవి** రూ.చూ. సెలవి. వి. పెదవి చివరి భాగం.

**చెలవించు** చూ. చెలవు[1].

**చెలవు[1]** రూ. చెలగు, సెలవు. స.క్రి. ఖండించు, నరుకు. అచ్చ.రా.బాల. 201.

చెలవించు స.క్రి. నరికించు, ఖండించచేయు. ద్వి.తి. సారంగ. 1.17 పు. 30 పం.

**చెలవు[2]** రూ.చూ. చెలఁగు. అ.క్రి. పెంపెక్కు.

**చెలాకిపడు** చూ. చలాకీ. అ.క్రి. **1.** ఉత్సాహపడు; **2.** సంతోషపడు.

**చెలామణి** రూ.చూ. చెలావణి. వి. చెల్లుబడి, సాగుబడి.

**చెలామణిఅగు** రూ. చెలామణియగు. అ.క్రి. **1.** నాణెలు చెల్లుబడి అగు; **2.** మాటా మొ. చెల్లుబడి అగు. **చెలామణియగు** రూ.చూ. చెలామణి అగు. అ.క్రి. నాణెం మొ. వ్యవహారంలో చెల్లుబడి అగు.

**చెలాయించు** రూ. చలాయించు. స.క్రి. స్వేచ్ఛగా జరిగించు, నడిపించు. పద్మ.యు. 42.

హిం. చలానా. నడిపించటం, వెళ్ళగొట్టటం; ఉ. చలానా. నడిపించటం. వెళ్ళగొట్టటం.

<హిం. చలా(నా) + -ఇంచు[3].

**చెలావణి** రూ. చలామణి, చలావణి, చెలామణి. వి. చెల్లుబడి, సాగుబడి. అని.చ. 3.16.

హిం. చలానా; ఉ.పార. చలాన్. వాడుకలో నుండు.

<ఉ. చలాన్.

**చెలి[1]** రూ. చెలియ. వి. **1.** మిత్రుడు, మిత్రురాలు. ద.హిం. శా.సం. 4 శా.సం. 1013; **2.** చెలికత్తె. కు.సం. 5.91; **3.** స్త్రీ, అతివ. కవిరా. 4.79; **4.** ఒకరకం చెట్టు.

త. చిలతన్. మిత్రుడు; చిలటి. ఆప్తమిత్రుడు, సేవకురాలు, సేవకుడు; సెల్లి; గోం. సెలాఅ, సెలార. సోదరి, చెల్లెలు; హెలాఅ. సోదరి; పర్జీ. చాలల్. సోదరి; కొలా. సెల్లయ్. చెల్లెలు; గ. ఒల్లా. సెలల్, సెలార్. సోదరి.

**చెలికత్తియ** రూ.చూ. చెలికత్తె. వి. మిత్రురాలు, సఖురాలు. భార.విరా. 5.388. **చెలికత్తె** రూ. చెలికత్తియ, చెల్కత్తె. వి. మిత్రురాలు, సఖురాలు. కు.సం. 6.31. **చెలికాఁడు** వి. మిత్రుడు. భార.ఉద్యో. 2.24. **చెలికారము** వి. చెలిమి, స్నేహం. శృం.నై. 2.50. **చెలితనము** వి. మైత్రి. హరి.ఉ. 7.75. **చెలిబోటి** వి. చెలికత్తె, సకియ. **చెలిమరి** రూ. చెల్మరి. వి. **1.** చెలికాడు; **2.** చెలికత్తె. సాం.ని. మాన. 5. <చెలిమి + -అరి. **చెలిమి** రూ. చెల్మి. వి. **1.** మైత్రి, అనురాగం, స్నేహం. భార.ఆది. 2.110; **2.** సంబంధం. **చెలిమికత్తియ** రూ.చూ. చెలిమికత్తె. వి. మిత్రురాలు, సఖురాలు. వాల్మీ. 1.2. **చెలిమికత్తె** రూ. చెలిమికత్తియ, చెల్మికత్తియ, చెల్మికత్తె. వి. స్నేహితురాలు, సఖురాలు. కు.సం. 6.27. **చెలిమికాఁడు** రూ. చెల్మికాఁడు. వి. స్నేహితుడు. కాశీ. 1.121. **చెలిమిచుక్క** రూ. చెల్మిచుక్క. వి. అనూరాధా నక్షత్రం. **చెలిమిచెలువ** రూ. చెల్మిచెలువ. వి. స్నేహితురాలు, మిత్రురాలు. కృష్ణ. 4.49. **చెలిమిబోఁటి** వి. స్నేహితురాలు. రసిక. 1.2. **చెలిమివాఁడు** రూ. చెల్మివాఁడు. విణ. చెలికాడు, వలపుకాడు, ప్రియుడు. చంద్రాంగ. 1.84. **చెలిమివెలఁదుక**

వి. స్నేహితురాలు. రసిక. 4.30. చెల్కత్తె రూ.చూ. చెలికత్తె. వి. మిత్రురాలు, సఖురాలు. కువ.చ. 4.139.

**చెలి**[2] చూ. సెలవి. వి. పెదవిమూల.

**చెలిక** రూ. చిలక[3], చెలక[1], చెలికె, చెల్క. వి. **1.** బీడు.మను. 4.37 ; **2.** చేను, క్షేత్రం ; **3.** ఏడుమార్లుఏడు పైరు వేసే మెట్టపొలం.

**చెలికపట్టు** వి. **1.** చేను, క్షేత్రం ; **2.** బీడు. **చెలిక వెలుగు** వి. కాకజంఘ, వృక్షవిశేషం, కాకిదొండ.

**చెలికి** వి. బట్టీ దిమ్మకట్టు బడిలోని రాయి.

**చెలికె** రూ.చూ. చెలిక. వి. **1.** బీడు ; **2.** చేను, క్షేత్రం.

**చెలిగిపారవేయు** రూ.చూ. చెరిగిపారవేయు. స.క్రి. 1. ఇతరుల దోషాల్ని గాలించు ; **2.** పాండిత్యం చూపు.

**చెలించు** స.క్రి. టంకం పెట్టు, లోహాలను అతుకు.

**చెలిది** రూ. చెలది, చెల్ది[2]. వి. **1.** చర్మరోగ విశేషం. ఆం.భా. 2.128 ; **2.** మేహరోగం.

క. గెనటి. చర్మం మీద ఏర్పడే గోధుమ రంగు మచ్చలు.

**చెలిప** వి. గుడికొన, దేవాలయ శిఖరం.

**చెలిపి** వి. చెంప, చెక్కిలి, చెరప.

**చెలిపె**[1] రూ.చూ. చెడిప. వి. రంకుటాలు, స్వైరిణి.

**చెలిపె**[2] వి. చేనులో అక్కడక్కడ పైరుచచ్చి ఏర్పడిన వెలితి.

**చెలిమిడి** వి. అష్టంగులీయభేదం, ఒకవిధమైన సీరుచిర్రి, వృక్ష విశేషం. గోచికిత్స. 31.

**చెలిమె** రూ.చూ. సెలవి. వి. చెలివి, పెదవిమూల.

**చెలివి** రూ.చూ. సెలవి. వి. పెదవిమూల.

**చెలివితాడు** వి. మోటతొండం చివర రెండు వైపులా రంధ్రాలు వేసి దూర్చే తాడు.

**చెలియ** రూ.చూ. చెలి[1]. వి. **1.** చెలికత్తె. నిర్వ.రా. **5.**122 ; **2.** ప్రియురాలు. పల్నా. 65 ; **3.** సఖి, మిత్రురాలు. మను. 6.66 ; **4.** ఆడది. సాంబ. 20 ; **5.** చెల్లెలు.

**చెలియలికట్ట** చూ. చెలియలు.

**చెలియలు** రూ. చెల్యలు, చెల్లియ, చెల్లియలు, చెల్ల, చెల్లెలు. వి.బొ. అనుజ, చిన్నతోబుట్టువు. భార.ఆది. 6.193.

గోం. సేలాడ్, సేలార్. చెల్లెలు ; పర్జి. చాలల్. చెల్లెలు ; చాలచిల్. చెల్లెళ్ళు ; గ. సేలవ్. చెల్లెలు ; సేలసిల్. చెల్లెళ్ళు.

**చెలియలికట్ట** రూ. చెల్లెలికట్ట. వి. వేల, సముద్రం. భార.ఉద్యో. 4.22.

**చెలివి** రూ. చెలివిరి[1]. వి. వృక్షవిశేషం.

**చెలివిరి**[1] రూ.చూ. చెలివి. వి. ఒకానొక చెట్టు.

**చెలివిరి**[2] చూ. సెలవి. వి. పెదవి మూల.

**చెలివిప్వ** వి. నమస్కార విశేషం.

**చెలీపాబెట్టు** స.క్రి. కొట్టివేయు, పంక్తి కింద హంసపాది గుర్తు పెట్టు.

**చెలుకు** రూ. చెలుగు. స.క్రి. **1.** ఉత్పాటనం చేయు, పెరుకు. సానంద. **2.**33 వ ; **2.** కొమ్ములు మొ. వాటితో పొడిచి పొడిచి చిమ్మివేయు. కకుత్స. 1.152 ; **3.** విసరు.

క. సళె, సెళ్. లాగు, తీసివేయు, లాగడం ; తు. సెళె, బలమైన ; సళె. బలం ; కుఇ. జెల్క, జెల్ప. లాగు.

మూ.ద.ద్రా.*చెళ్-.

**చెలుగు** రూ.చూ. చెలుకు. స.క్రి. **1.** కుళ్ళగించు, సాధనాలతో నేలను తిరగవేయు ; **2.** చించు.

**చెలుగుడుకత్తి** వి. మందంగా ఉండే కత్తి.

**చెలుపు** స.క్రి. **1.** రాచు, పూయు, అలదు. కు.సం. 8.66 ; **2.** చెక్కు.

తు. సెలిపుని. శుభ్రపరుచు; సెలియుని, సెల్లియుని. శుభ్రపడు ; కో. కెర్ప్. పూయు, రాయు.

**చెలుపుచెక్క** వి. పరదాచెక్క, అలుమరను అరలుగా విభజించే చెక్క.

**చెలువ** రూ. చెల్వ. వి. **1.** అందం గల స్త్రీ, ఆడది. కు.సం. 5.130. భార.విరా. 1.253 ; **2.** భార్య. కళా. **2.40.** <చెలువు+-అ.

క. చలువతి, చలువె, చల్వి, చెల్వి, చెల్వె. అందమైన స్త్రీ ; తు. చెలువికె. అందం ; త. చెల్వమ్. చెల్వు. సౌభాగ్యం, సంపద, అందం, ఆనందం.

**చెలువగు** చూ. చెలువు.

**చెలువందు** చూ. చెలువు.

**చెలువము** రూ. చెల్వము. వి. **1.** అందం, కాంతి, సొగసు, శోభ. కు.సం. 6.82. భార.విరా. 2.23 ; **2.** విధం, రీతి. భార.ద్రోణ. 2.77 ; **3.** కుశలం, క్షేమం. చంపూ రా. 2.20. విణ. సుందరమైన, అందం కలిగిన, మనోహరమైన. హరి.ఉ. 3.191, శృం.నై. 6.39.

క. చలు, చలువె, చలుప్ప, చల్వ, చల్వు, చలువ్పకె, చల్వికె, చెలువ, చెలుప్ప, చెల్వ, చెల్వి, చెల్వు, చెలువికె, చెల్వికె. అందం, మృదుత్వం, లావణ్యం ; చలువతన. అందం, కులుకులాడితనం ; తు. చెలువికె. అందం ; చెలువె. అందగాడు ; త. చెల్వమ్, చెల్వు. సౌభాగ్యం, సంపద, అందం, ఆనందం ; చెల్వన్. సంపన్నుడు ; చెల్వి సంపన్నురాలు, లక్ష్మి ; చెల్వికెక్కె. విలాసం, సమృద్ధిగా ఉన్న సంపద ; చెల్లమ్. సమృద్ధిగా ఉన్న సంపద ; మ. చెల్లమ్. సంపద.

**చెలువలుమాను** వి. చొప్పదొడ్డి దారికిగాను పాతిన, పంగం టించిన మొద్దు.

**చెలువారు** చూ. చెలువు.

**చెలువు** రూ. చెల్వు. వి. **1.** అందం, సొగసు, శోభ. భార. సభా. **2.**31, కు. సం. **3.**14 ; **2.** యుక్తం. అర్హం. భార. భీష్మ. 1.91 ; **3.** కాంతి. భార. భీష్మ. **3.**146 ; **4.** విధం. భార. భీష్మ. 3.223 ; **5.** ప్రియం, ఇంపు. భార. శాంతి. 6.466 ; **6.** కుశలం, మేలు. హంస. **1.**135.

క. చెలు, చలువె, చలుప్ప, చల్వ, చల్వు, చలువికె, చల్వికె. అందం, సొగసు, సొంపు ; తు. చెలువికె. అందం, ప్రకాంతత ; చెలువె. అందం, సొగసు ; త. చెల్వమ్, చెల్వు. ధనం, ఆస్తి, అందం, ఆనందం, భోగం.

చెలువేసు రూ. చెల్వేగు. అ.క్రి. ఒప్పు. భార. సభా. 1.145. చెలువందు అ.క్రి. ఒప్పు. భార. సౌప్తి. 1.155. చెలువారు రూ.చూ. చెల్వారు. అ.క్రి. ఒప్పు. భార. ఆశ్ర. 2.27. చెలువుమిగులు అ.క్రి. శోభించు, ఒప్పు. భార. విరా. 5.190. చెలువుఁడు రూ.చూ. చెల్వుఁడు. వి. 1. ఉపపతి, రంకుమగడు, విటుడు. పాండు. 3.85 ; 2. భర్త, మగడు. శుక. 1.440 ; 3. సుందర పురుషుడు. నీలా. 2.30. తు. చెలువె. అందగాడు ; త. చెల్లన్. సంపన్నుడు. చెలువొందు రూ.చూ. చెల్వొందు. అ.క్రి. ఒప్పు.

చెలువొందు చూ. చెలువ.

చెలో వి. బండి తోలటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. అ.క్రి. వెళ్ళు.

హిం. ఉ. చలో. వెళ్ళు ; చల్‌నా. వెళ్ళటం.

< హిం. చలో.

చెల్క రూ.చూ. చెలిక. వి. 1. క్షేత్రం, చేను. ఆము. 3.33 ; 2. బీడు.

చెల్కత్తె చూ. చెలి$^{1}$.

చెల్కా వి. కమిచీ.

చెల్గు రూ.చూ. చెలఁగు. అ.క్రి. 1. కలుగు. భాస్క. రా. యు. 276 ; 2. విజృంభించు. సారంగ. 1.94.

చెల్ది$^{1}$ రూ.చూ. చెలఁది. వి. సాలెపురుగు.

చెల్ది$^{2}$ రూ.చూ. చెలిది. వి. 1. చర్మవ్యాధి విశేషం; 2. మేహరోగం.

చెల్మరి చూ. చెల్మి.

చెల్మి రూ.చూ. చెలిమి. వి. 1. అనురాగం, స్నేహం, మైత్రి. భార. ఆది. 2.127 ; 2. సంబంధం. నీలా. 2.30.

చెల్మరి రూ.చూ. చెలిమరి. వి. 1. చెలికాడు ; 2. చెలికత్తె. చెల్మికత్తియ రూ.చూ. చెలిమికత్తె. వి. సఖి, స్నేహితురాలు. చెల్మికత్తె రూ.చూ. చెలిమికత్తె. వి. సఖి, స్నేహితురాలు. చెల్మికాఁడు రూ.చూ. చెలిమికాఁడు. వి. చెలువుఁడు, చెలిమరి, స్నేహితుడు. చెల్మిచుక్క రూ.చూ. చెలిమిచుక్క. వి. అనురాధా నక్షత్రం. చెల్మిచెలువ రూ.చూ. చెలిమిచెలువ. వి. చెలికత్తె, సకియ. చెల్మివాఁడు రూ.చూ. చెలిమివాఁడు. విణ. చెలికాడు.

చెల్మె రూ.చూ. చెలమ. వి. నీరూరే చిన్నగుంట.

చెల్యలు రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు ద.హిం.శా. సంపు. 6. శా. సం. 841, క్రీ. శ. 1364.

చెల్ల$^{1}$ రూ. చెల్లా. అవ్య. సంతాప, ఆశ్చర్యాదుల్ని తెలుపుతుంది. ఉ.రా. 6.61, దశా. 7.1.

చెల్లరా అవ్య. సంతాపార్థకం. పద్మ. 9.47. చెల్లరె రూ. చెల్లరే, చెల్లారె, చెల్లారే. అవ్య. సంతాపాదుల్ని తెలుపుతుంది. హరి. ఉ. 7.215. చెల్లరే రూ.చూ. చెల్లరె. అవ్య. సంతాపాశ్చర్యాదుల్ని తెలిపే శబ్దం. వీర. వి. 2.261. చెల్లారె రూ.చూ. చెల్లరె. అవ్య. ఆశ్చర్య సంతాపాదుల్ని తెలుపుతుంది. చెల్లారే రూ.చూ. చెల్లరె. అవ్య. చెల్లరే. ఆశ్చర్య సంతాపాదుల్ని తెలిపే శబ్దం.

చెల్ల$^{2}$ వి. కాలపేసి వృక్షం.

చెల్లఁగట్టు చూ. చెల్లు.

చెల్లచెదరగు చూ. చెల్లచెదరు.

చెల్లచెదరు రూ.చూ. చెల్లాచెదరు. విణ. మిక్కిలి చెదరిన. భాస్క. రా. యు. 748, హరి. పూ. 7.39.

చెల్లచెదరగు రూ.చూ. చెల్లాచెదరగు. అ.క్రి. చెల్లాచెదరై పోవు.

చెల్లనికాసు చూ. చెల్లు.

చెల్లఁదిరుగు చూ. చెల్లు.

చెల్లపిళ్లలు వి.బ.వ. ముద్దుబిడ్డలు. శాళ్ల. సం. 8.54.

త. సెల్వం. అందం ; పిళ్ళై, సంతానం.

చెల్లపిళ్ళరాయఁడు చూ. చెల్లపిళ్ళలు. వి. ఏ చింతాలేకుండా భోగియై తిరుగుతూండే వాడు.

చెల్లఁబెట్టు చూ. చెల్లు.

చెల్లఁబో చూ. చెల్లు.

చెల్లవిడుచు చూ. చెల్లు.

చెల్లా రూ.చూ. చెల్ల$^{1}$. అవ్య. చెల్లరే, అకటా.

చెల్లాకుచెదరగు చూ. చెల్లాకు చెదరు.

చెల్లాకుచెదరు రూ. చూ. చెల్లాకుం జెదరు. క్రి. విణ. చెల్లా చెదరుగా.

చెల్లాకుచెదరగు అ.క్రి. చెల్లాచెదరగు రంగా. చ. 3.63.

చెల్లాకుంజెదరు రూ. చెల్లాకు చెదరు. క్రి. విణ. చెల్లాచెదరుగా.

చెల్లాకుంజెదరుచేయు స.క్రి. చెల్లాచెదరు చేయు. రంగా. 2.247.

చెల్లాచెదరగు చూ. చెల్లాచెదరు.

చెల్లాచెదరు రూ. చెల్లచెదరు. విణ. మిక్కిలిచెదరిన. హరి. ఉ. 6.135.

చెల్లాచెదరగు రూ. చెల్లచెదరగు. విణ. చెదరిపోవు. భార. విరా. 5.196.

చెల్లాట రూ.చూ. చల్లాటము. చూ. చెల్లాడు. వి. క్రీడ.

చెల్లాటగట్టు వి. క్రీడాద్రి. సుద. 1.89.

చెల్లాటమాడు చూ. చెల్లాటము.

చెల్లాటము రూ.చూ. చల్లాటము. వి. క్రీడ. వేంక. పంచ. 4.127.

క. చల్ల, చెల్ల. గొప్పసంతోషం, పరిహాసం, ఎగతాళి ; చల్లవాడు. ఆట, కుప్పిగంతులు ; చల్లాటు, చెల్లాటు. ఆట, పరిహాసం.

చెల్లాటమాడు అ.క్రి. క్రీడించు. హంస. 1.134.

చెల్లాడు రూ.చూ. చెల్లాడు. అ.క్రి. ఆటలాడు. రాజ. చ. 1.47.

చెల్లానేత వి. రెండుపావు చెక్కలనూ ఒకేమట్టంలో ఉంచి నేసిన నేత.

చెల్లాయి చూ. చెలియలు. వి. చెల్లియ, చెల్లి, < చెల్లి + -ఆయి$^{4}$.

చెల్లారె చూ. చెల్ల$^{1}$.

చెల్లారే చూ. చెల్ల$^{1}$.

చెల్లి చూ. చెలియలు. వి. చెలియలు, చెల్లెలు.

చెల్లించు చూ. చెల్లు.

చెల్లిపోవు చూ. చెల్లు.

చెల్లింపఁగను చూ. చెల్లు.

చెల్లియ రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు.

**చెల్లియలు** రూ.చూ. చెలియలు. వి. సోదరి, తోబుట్టువు, అనుజ.

**చెల్లు** అ.క్రి. 1. సమర్థుడగు. భార. ఉద్యో. 2.42; 2. జరుగు. భార. భీష్మ. 1.232; 3. (పలుకు, పంతం, ఆజ్ఞ మొ.) సాగు, నెగ్గు. భార. ద్రోణ. 5.103. శృం. నై. 7.166; 4. శక్యమగు. భార. కర్ణ. 1.210; 5. మృతి హొందు, చచ్చు. భార. శల్య. 1.370; 6. ఒప్పు. భార. శాంతి. 6.512; 7. కొనసాగు, నెరవేరు, సిద్ధించు. భార. అను. 4.386; 8. వశమగు, అధీనమగు. మార్క. 1.165; 9. ముగియు, సమాప్తం అగు. భార. అరణ్య. 7.204; 10. కడచు, గతించు. శివరా. 2.75; 11. నశించు. వరాహ. 7.31; 12. అర్హమగు, యుక్తమగు. వరాహ. 9.127, పల్నా. 23; 13. వ్యయం అగు, అయిపోవు. వరాహ. 10.38; 14. ఋణాదులు తీరు. ద్వి. హరిశ్చ. పూ. 1933 పం.; 15. సరిపోవు, సమానం అగు. హంస. 1.62; 16. సొమ్ము ముడుపులు మొ. చేరవలసిన వారికి చేరు; 17. మారు, అంగీకరింపబడు, చెలామణి అగు; 18. వ్యవహార దర్శనాధికారం. నె. శా. CP. 5 క్రీ.శ. 1406. విణ. చేరిన. ద్వి. పరమ. 6.480. వి. లావాదేవీలు లేకపోవటం.

క. సల్- (సంద్-). ప్రవేశించు, కలియు, అంగీకరించు, వ్యవహారంలో ఉండు, ప్రసిద్ధిలోకి వచ్చు, విలువ కలిగిఉండు; సల. ప్రవేశించటం; సలికె. చెల్లించటం, చెల్లింపు; సలిగె, సలుగె. పరిచయం, స్వాతంత్ర్యం; సలిసు. చొప్పించు, సలుపు; సలుహా. ప్రవేశించటం; సలె. శాశ్వతంగా, చెల్లింపు; సల్లిసు. భోజనం వడ్డించు; తు. సల్లుని. తగిఉండు, విలువకలిగిఉండు; సందుని. జరుగు, గతించు; సందావుని. చెల్లించు; సంపాయ. చెల్లింపు; సలగుని. పెంచు; సలాయిసుని. అప్పు మొ. తీర్చు; త. చెల్ (చెల్వ్-, చెన్ఱ్-). గతించు, తగివుండు, నాశనమగు, చచ్చు; మ. చెల్క. ప్రవేశించు, చెలామణిలో వుండు; చెలవ్. ఆదాయం, ఖర్చు; చెలుత్తుక. మాటనెరవేర్చు, చెల్లెక్క. చేయించు; కో. చల్- (చద్-). అంగీకరింపబడు, తగిఉండు; చల్ప్. అప్పు మొ. చెల్లించు; చల్వో. చెల్వో. ఖర్చులకు ఉంచిన డబ్బు; తొ. సల్- (సద్-). చెందివుండు; సల్ఫ్. ఖర్చులు; గోం. హందానా. వెళ్ళు; కుఇ. సల్ప (సస్-). వెళ్ళు; కువి. (వుం) హజ్జలి. వెళ్ళు; పర్జీ. చెన్- చెంద్-. వెళ్ళు; కొలా. సెల్-. వెళ్ళు; నా. చ-, చెచండకమ్)-. వెళ్ళు; గ. ఒల్లా. సెన్- (సెయ్-, సెండ్-). వెళ్ళు; కురు. కల్ర్నా. ఎడతెగక ఉండు.

< మూ.ద్రా. *చల్-.

**చెల్లగట్టు** (-కట్టు) స.క్రి. చెల్లించు. **చెల్లనికాసు** వి. ఎందుకూ పనికి రానిది. సంపంగి మన్న. శ. 36. **చెల్లదిరుగు** అ.క్రి. పూర్తిగా తిరుగు. శుక. 2.160. **చెల్లబెట్టు** స.క్రి. నశింపచేయు. పాండు. 5.208. **చెల్లబో** అవ్య. 1. ప్రశంసార్థకం. భార. అశ్వ. 4.120; 2. ఆక్షేపార్థకం. ఉ. హరి. 4.154; 3. సంతాపార్థకం. భోజ. 5.326. **చెల్లవిడుచు** స.క్రి. యథేచ్ఛగా ప్రవర్తించనిచ్చు. నిర్వ. రా. 7.104. **చెల్లించు** స.క్రి. 1. నెగ్గించు, నెరవేర్చు. భార. విరా. 5.320; 2. నడుపు. జరిగించు. భార. శాంతి. 6.82; 3. అప్పులను తీర్చు. ఉ. హరి. 3.117; 4. కడతేర్చు, చంపు. నీలా. 3.73. **చెల్లిపోవు** అ.క్రి. 1. చనిపోవు, దాటిపోవు. వర. రా. అరణ్యపు. 218. పం. 24; 2. తీరిపోవు; 3. ఖర్చగు; 4. సాగు. **చెల్లింపగను** స.క్రి. ముగింప గలుగు. రం.రా. బాల. పు. 36 పం. 2. **చెల్లుచీటి** రూ. చెల్లుచీటీ. వి. సొమ్ము చెల్లించిన వాడికి పుచ్చుకొన్న వాడు సొమ్ము ముట్టినట్లు రాసిఇచ్చే రసీదు. ద్వి. పరమ. వి. 6.480. **చెల్లుచీటియిచ్చు** స.క్రి. వదలివేయు. **చెల్లుచీటీ** రూ.చూ. చెల్లుచీటి. వి. రసీదు. **చెల్లుపత్రము** చూ. చెల్లుచీటి. వి. రసీదు. **చెల్లుబడి** వి. 1. సాగుబడి, సాగుపాటు, అధికారం. హరి. పూ. 2.36. హర. 5.8; 2. దక్షత, సమర్థత. భాగ. 10 పూ. 1390. విణ. 1. సాగిన, నెగ్గిన. చంద్రాంగ. 3.143; 2. చెందిన, సంబంధించిన. ప్రబంధ. 161. **చెల్లుబడివాడు** విణ. మాట చెల్లేవాడు, ప్రసిద్ధుడు. భాస్కరా. యు. 747. **చెల్లువిడుచు** స.క్రి. స్వేచ్ఛగా ప్రవర్తింప నిచ్చు. శుక. 2.203. **చెల్లువెట్టు** (-పెట్టు) స.క్రి. కాతాకు జమ చేయు.

**చెల్లె** రూ.చూ. చెలియలు. వి. 1. చెల్లెలు. ఉ. హరిశ్చ. 3.37; 2. వాత్సల్యార్థకం. దశా. 8.82.

**చెల్లెలికట్ట** చూ. చెల్లెలు.

**చెల్లెలు** రూ.చూ. చెలియలు. వి. ఔ. అనుజ, తనకన్న చిన్నదైన సోదరి. శృం. నై. 7.11, ద. హిం. శా. సంపు. 4. శా. సం. 933. క్రీ.శ. 1241.

**చెల్లెలికట్ట** రూ.చూ. చెలియలి కట్ట. వి. సముద్రపు గట్టు, వేల. భాగ. 8.709.

**చెల్లోకి** చూ. చెల్లు. వి. మాటచెల్లుబడి, చెలామణి.

**చెల్వ** రూ.చూ. చెలువ. వి. 1. స్త్రీ. భార. విరా. 1.1; 2. భార్య. హరి. 4.154.

**చెల్వగు** చూ. చెల్వు.

**చెల్వము** రూ.చూ. చెలువము. వి. 1. అందం, శోభ, సొగసు, కాంతి. మను. 1.55; 2. విధం, రీతి; 3. కుశలం, క్షేమం. విణ. సుందరమైన, అందంగలిగిన, మనోహరమైన. ఆము. 5.107.

**చెల్వారు** చూ. చెల్వు.

**చెల్వు** రూ.చూ. చెలువు. వి. 1. విధం. కు. సం. 1.119; 2. అందం, సొగసు, కాంతి, శోభ. భార. ద్రోణ. 5.114; 3. మేలు, క్షేమం; 4. ప్రియం, ఇంపు; 5. కాంతి; 6. యుక్తం.

**చెల్వగు** రూ.చూ. చెలువగు. అ.క్రి. ఒప్పు. < చెల్వు + అగు. **చెల్వారు** రూ. చెలువారు. అ.క్రి. ఒప్పు. భార.శాంతి. 1.349. **చెల్వుడు** రూ. చెలువుడు. వి. 1. ఉపపతి. రంకు మగడు, విటుడు. పాండు. 3.71; 2. భర్త, మగడు; 3. సుందర పురుషుడు. **చెల్వొందు** రూ.చెలువొందు. అ.క్రి. ఒప్పు. నిర్వ. రా. 6.128.

**చెల్వొందు** చూ. చెల్వు.

**చెళ్ళు** వి. చెంపదెబ్బ ధ్వనికి అనుకరణం. ధ్వన్యను.

**చెవ** రూ.చూ. చెవ్వ. వి. గజ్జి, వాలారిష్టం.

**చెవలకాడ** వి. చెమ్మ నేలల్లోను, నల్లరేగడి నేలల్లోను మొలిచి పసుప్పచ్చటి పూలు పూసే పాకుడు కలుపు మొక్క.

**చెవలకాయ** రూ. చెవళకాయ. వి. గోరు చిక్కుడుకాయ.

**చెవలకుండ** చూ. చెవి[1]. వి. చేత్తోపట్టుకోడానికి వీలుగా పక్కన కాడలుండే కూరల పాత్ర.

**చెవలమరిగె** చూ. చెవి[1]. వి. అంచు లేకుండా పట్టుకోడానికి కాడలుండే మట్టిపాత్ర.

**చెవలసట్టి** రూ.చూ. చెవుల చట్టి. వి. పట్టుకోడానికి రెండు వైపుల ఆధారం ఉన్న చిన్న మట్టిపాత్ర.

**చెవలాకు** వి. చెమ్మనేలల్లోను, నల్లరేగడి నేలల్లోను మొలిచి పసుపు పచ్చని పూలుపూసే పాకుడు కలుపుమొక్క.

**చెవళకాయ** రూ.చూ. చెవలకాయ. వి. గోరు చిక్కుడు కాయ, మటిక్కాయ, గోకరికాయ.

**చెవాకు** చూ. చెవి[1].

**చెవాల** వి. పొడుగాటి కాముగల ఒకరకం పార.

**చెవి[1]** రూ. చెవు. వి. **1.** కర్ణం, వీను, శబ్దగ్రహణం కలిగిన శరీరావయవం. కు. సం. 1.81, భార. ఉద్యో. 1.304 ; **2.** రాట్నం భాగాల్లో ఒకభాగం. కదురు తిరగటానికి వీలుగా రాట్నం బొమ్మకు బిగించిన తోలుముక్క. శుక. 2.419 ; **3.** గిలకకు ఆధారంగా దోర్నపట్టె మీద బిగించిన చిన్నకొయ్య ; **4.** స్తంభంపై అంచున రెండు వైపులా మేకు బందీ చేసిన చెక్కలు ; **5.** ఇటికచ్చును పట్టుకోడానికి పెట్టినపిడి ; **6.** హొయ్యిలు, పెనాలు మొ. వాటిని పట్టుకోడానికి పక్కల్లో బొద్దుగా ఉంచిన భాగం ; **7.** తంబూర తంతెలను బిగించు కొయ్యమేకు రాటంలో కదురు అమర్చటానికి బిగించిన తోలుముక్క ; **8.** డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువు చెక్క ; **9.** డబ్బా రాట్నానికి గంటం బిగించే బొమ్మకు చేసిన చిల్లు ; **10.** చేతిమగ్గం పలక వేలాడదీయటానికి ఆధారంగా ఉండేపక్క భాగం ; **11.** మరమగ్గ. నొరుగు చివరనాడెను ఆపటానికి బిగించినకొయ్య చెక్క ; **12.** అడ్డదారి రాయి, మగ్గానికి తగిలించి ఉన్న పడుగు నేలకు ఆనకుండా ఊనికగా పెట్టిన కొయ్య.

క. కివి, కిమి. చెవి ; కొడ. కెవిన్ ; తు. కెచి, చెరఁడు ; త. చెవి. చెవి ; చెవిటు. కపోలం ; మ. చెవి. చెవి, చెవియొక్క బయటి భాగం : చెవిక్క. వినటం ; చెప్పటు, చెకిటు. చెవి, చెవిబయట భాగం ; కో. కియ్వ్. కెన్. చెవి ; తొ. కిఫై ; గోం. కవి ; కుఇ. క్రికు. చెవి ; క్రీకు. చెవులు ; కువి. కిరియూ ; పర్జి. కెకొల్ ; కొలా. కెవ్ ; నా. కెవ్ ; గ. ఒల్లా. కెకొల్ ; కురు. ఖేబ్దా ; మాల్తో. కెథ్వ ; బ్రా. ఖఫ్. పో.చూ. సం. శ్రవస్. కర్ణం.

**చెవాకు** రూ.చూ. చెవియాకు. వి. కర్ణ భూషణం. పి. శకుం. 4.78. **చెవికట్టు** వి. గిలకకు ఆధారంగా దోర్నప్పట్టె మీద బిగించిన చిన్నకొయ్య. **చెవికఱచు** రూ. చెవిగఱచు. అ.క్రి. గుసగుసలాడు, కొండేలు చెప్పు. **చెవికాయాకు** చూ. చెవ్వాకు[2]. వి. ఒకరకం ఆకు. **చెవికిచవియగు** అ.క్రి. కర్ణపర్వమగు, వినటానికి ఇంపుగాఉండు. పాండు. 1.151. **చెవికింజేఁదు** వి. వినటానికి అసహ్యమైన విషయం. భార. ఉద్యో. 2.94. **చెవికిందియ్యబుగాఁబల్కు** స.క్రి. మధురంగా మాట్లాడు, వినటానికి ఇంపుగా ఉండేటట్లు మాట్లాడు. ఉ. హరి. 1.128. **చెవికివేఁడిగఁబల్కు** స. క్రి. మనసు బాధపడేటట్లు మాట్లాడు. ప్రబా. 3.132. **చెవికెక్కు** అ.క్రి. గ్రహింపుకల్గు, నచ్చు, మనసుకెక్కు. < చెవి[1] + కున్ + ఎక్కు. **చెవికొఱక** వి. కొనచెవి. **చెవికొఱికిపుల్లింగాలుపెట్టు** స.క్రి. ఒకరిపై రహస్యంగా ఏదేదో చెప్పి ద్వేషం కలిగించు. **చెవికొఱుకు** అ.క్రి. గుసగుసలాడు, కొండేలు చెప్పు. బహుళా. 5.76. **చెవికోసికొను** స.క్రి. ఆసక్తితో వినగోరు. **చెవిగఱచు**(-కఱచు) రూ.చూ. చెవికఱచు. స.క్రి. రహస్యంగా చెప్పు. **చెవిగాడి** వి. రాట్నం చెవికి ముందువైపు పెట్టినచిల్లి. **చెవిగుట్టులు** వి.బ.వ. చాడీలు. **చెవిగూబ** వి. చెవిబొక్క, గూబ. కర్ణరంధ్రం. **చెవిగూబలదరు** అ.క్రి. బాగా దెబ్బతగులు. < చెవిగూబ + -లు + అదరు. **చెవిగోసినమేకవలెంఅరచు** అ.క్రి. **1.** మేమే అని అరచు ; **2.** ఏడ్చు. **చెవిచెఱుక్క నెఱుగకుండఁజెప్పు** స.క్రి. అతిరహస్యంగా చెప్పు. బోజ. 6.144. **చెవిచెంతఁజేర్చు** స.క్రి. ఆదరంగా చూచు. జైమిని భా. 1.86. **చెవిచెందు** రూ.చూ. చెవిఁజెందు. అ.క్రి. వినపడు. కుమ. చ. 4.168. **చెవిచేఁదగు** అ.క్రి. అప్రియమగు. **చెవిచేసికొను** స.క్రి. ఆసక్తితో వినకోరు. **చెవిచొరుపాము** వి. కర్ణజలూక, చెవిజలగ. **చెవిఁజెందు** రూ. చెవిచెందు. అ. క్రి. వినబడు, చెవిలో పడు. బోజ. 5.222. **చెవితమ్మె** వి. పోగులు ఉంచుకొనే తావు, చెవి కింది భాగంలో ఉన్న మెత్తని ప్రదేశం. **చెవితాలి** వి. బొమ్మ చెవి (తోలుముక్క) కి కదురు తగిలించటానికి పెట్టిన చిల్లి. **చెవిదండపల్కు** స.క్రి. రహస్యంగాచెప్పు. కళా. 4.113. **చెవిదాకావచ్చు** అ.క్రి. ఎరుకకు వచ్చు. తెలియు. **చెవిదార్చు**(-తార్చు) అ.క్రి. చెవిఒగ్గు. మను. 4.17. **చెవిదిడ్డి** వి. రాట్నం చెవికి వెనకవైపున పెట్టిన చిల్లి. **చెవిదేలగిలనిచ్చు** స.క్రి. చెవి వాలవేయు. విప్ర. 2.70. **చెవిదోరఁగట్టఁజెప్పు** (-చెప్పు) స.క్రి. చెవినిల్లు కట్టుకొని చెప్పు, అనేక పర్యాయాలు చెప్పు. **చెవిదోరఁగట్టు** అ.క్రి. మిక్కిలి చెప్పుటతో చెవులు చీములు కట్టు. **చెవిదోరఁబెట్టు** (-పెట్టు) స.క్రి. చెవిఒగ్గిపిను, విను. ఆం. భా. 3.119. **చెవినపేనువాఱు** (-పాఱు) అ.క్రి. మాటవైకొను. **చెవినాను** (-ఆను) స.క్రి. చెవిపెట్టుకొను, విను. వర. రా. అయో. పు. 270, పం. 24. **చెవినిడు** (-ఇడు) స.క్రి. విను. **చెవినిపడు** అ.క్రి. ఎరుకకు వచ్చు, తెలియు. **చెవిని పెట్టకుండు** స.క్రి. వినకపోవు. **చెవినిల్లుకట్టుకొని పోరడం** వి. ఎల్లప్పుడు దగ్గరుండి అనేక సార్లు చెప్పటం. **చెవినిల్లుగట్టు** (-కట్టు) అ.క్రి. ఎల్లప్పుడు దగ్గరనే ఉండు రాఘవ. 4.54. **చెవినిల్లుగట్టుకచెప్పు** స.క్రి. నిరంతరం బోధచేయు. విప్ర. 5.40. **చెవినిల్లుగట్టుకపోరు** స.క్రి. చెవినిల్లు కట్టుకొని చెప్పు. **చెవినిల్లుగట్టుకొను** అ.క్రి. ఎల్లప్పుడు

దగ్గర ఉండు. **చెవినివేయు** స.క్రి. ముందుగా చెప్పిఉంచు. **చెవినులుము** స.క్రి. దండించు, శిక్షించు. **చెవిపట్టితెచ్చు** స.క్రి. బలాత్కారంగా లాక్కొనివచ్చు. మను. 4.34. **చెవిపట్టె** వి. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. **చెవిపుండు** వి. కర్ణపాకం. **చెవిపెట్టు** రూ. చెవిఁబెట్టు. స.క్రి. చెవియొగ్గు, శ్రద్ధవహించు విను.కు. సం. 1.81. **చెవిపేద** వి. చెప్పుడు మాటలు నమ్మేవాడు. **చెవిపోఁగులు** వి.బ.వ. తమ్మంట్లు, అంటుజోళ్ళు. **చెవిపోటు** వి. చెవిలోకలిగే బాధ, కర్ణశూల. **చెవిబొక్క** వి. చెవిగూబ, కర్ణరంధ్రం. **చెవిమెలివేయు** స.క్రి. శిక్షించు. బలవంతం పెట్టు. **చెవిమొదలు** వి. చెవిగూబ. **చెవిఁబడు (-పడు)** అ.క్రి. వినపడు. కువ.చ. 4.168. **చెవిఁబెట్టు (-పెట్టు)** రూ.చూ. చెవిపెట్టు. స.క్రి. విను. బహుళా. 5.6. **చెవిఁబొందు** అ.క్రి. వినపడు. భార. అను. 1.360. **చెవియాకు (-ఆకు)** రూ. చెవాకు, చెవ్వాకు[1]. వి. కర్ణభూషణం, తాటంకం, చెవికమ్మ. పండి.చ. 1.215. కాశీ. 2.72. **చెవియార** క్రి. విశ. ద్రు. చెవితృప్తి పొందేటట్లుగా. భార.అశ్వ. 2.49. **చెవియుఁజెక్కునెఱుఁగకుండ** క్రి.విశ.ద్రు. ఎవరికీ తెలియకుండా. భోజ. 6.144. **చెవియొగ్గు (-ఒగ్గు)** స.క్రి. ఆలకించు. **చెవియొడ్డు (-ఒడ్డు)** స.క్రి. చెవియొగ్గు. భార.ఉద్యో. 1.23. **చెవిలోఁజెప్పు (-చెప్పు)** స.క్రి. రహస్యంగా చెప్పు. కళా. 4.50. **చెవిలోనూఁదు (-ఊఁదు)** స.క్రి. రహస్యంగా దుర్బోధలు చేయు. **చెవిలోవేయు** స.క్రి. రహస్యంగా తెలియచేయు. **చెవిలోవేసికొను** స.క్రి. మనసుపెట్టివిను. **చెవిలోసొంటికొమ్మూరు** అ.క్రి. మూర్ఛపడినప్పుడు శుశ్రూష చేయు. రామాభ్యు. 8.103. **చెవివాలఁబెట్టు (-పెట్టు)** స.క్రి. ఆలకించు. **చెవివాలవేయు** అ.క్రి. చెప్పుడు మాటలకు లోబడు. **చెవివేయు** స.క్రి. చెప్పు. **చెవిౘ్రేలవేయు** స.క్రి. అంగీకరించు. వేంక.పంచ. 1.754. **చెవిసోకఁజెప్పు(-చెప్పు)** స.క్రి. మనసునకు నాటేటట్లు చెప్పు. విజయ. 1.31. **చెవులకంచుడు** వి. చెవులుండే మట్టిపాత్ర. **చెవులకడాయి** వి. రెండంగుళాల లోతులో అడుగు వెడల్పుతో రెండంచులతో ఉండే మట్టిపాత్ర. **చెవులకమ్మి** వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు, ఏటవాలుగా బిగించిన కర్ర. **చెవులకుండ** వి. చేత్తో పట్టుకోడానికి వీలుగా పక్కల్లో కాడలుండే కూరల పాత్ర. **చెవులకొయ్య** వి. ఒకరకం లోహపుపాత్ర. **చెవులచట్టి** రూ. చెవలసట్టి. వి. పట్టుకోడానికి రెండువైపుల ఆధారం ఉన్న చిన్న మట్టిపాత్ర. **చెవులచిప్ప** వి. మూతి వెడల్పు తక్కువగా ఉండి పట్టుకోడానికి కడేలుండే మట్టిపాత్ర. **చెవులటికె** వి. చెవులచట్టి, పట్టుకోడానికి పక్కలో చెవులుండే చిన్న మట్టిపాత్ర. **చెవులతాడు** వి. పంటె తల చిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టిన తాడు. **చెవులపట్టి** రూ. చెవులపట్టె[1]. వి. నిలువుగుంజల మీద వేసిన అడ్డకొయ్య, మోటబావి. **చెవులుపట్టె[1]** రూ.చూ. చెవులపట్టి. వి. మోటబావి కొమిరెల మీద ఉన్న అడ్డపట్టె. **చెవులపట్టె[2]** వి. ఒకరకం లోహపుపాత్ర. **చెవులపండుగు** రూ.చూ. చెవులపండువు. వి. వినసొంపు, చెవికి ఆనందకరమైన విషయం. **చెవులపండువు** రూ. చెవులపండుగు. వి. చెవికి ఆనందకరమైన విషయం. భార.శల్య. 2.193. **చెవులపాములు** వి.బ.వ. రెండు చెవుల మీద పాము పడగల్లాగా ఉండే సుళ్ళు. **చెవులపిల్లి** వి. చెవులపోతు, కుందేలు. **చెవులపిల్లితీగ** వి. బాలబందకాడ. **చెవులపీట** వి. రాట్నంపేటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య. **చెవులపువు** రూ.చూ. చెవులపూవు. వి. చెవికి పెట్టుకొనే ఒక నగ. యయా. 4.90. **చెవులపువ్వు** రూ.చూ. చెవులపూవు. వి. చెవికి పెట్టుకొనే ఒక నగ. ఆం.భా. 2.148. **చెవులపూవు** రూ. చెవులపువు, చెవులపువ్వు. వి. చెవికి పెట్టుకొనే ఒక నగ. కళా. 7.60. **చెవులపోతు** వి. శశం, కుందేలు. ఉ.రా. 6.235. **చెవులబొమ్మ** వి. రాట్నంపీఁకు ఎడమ వైపున కదురుబిగించే నిలువు కొయ్య. **చెవులంబెట్టుకొను** స.క్రి. విను.ఉ.హరి. 1.184. **చెవులఁబెట్టు (-పెట్టు)** స.క్రి. చెప్పినది విను. నలచ. 5.141. **చెవులఁబోయు (-పోయు)** స.క్రి. చెప్పు. బోధలుచేయు, భార. స్త్రీ. 1.142. **చెవులరాయి** వి. దండెను మోసే పంగల కొయ్య. **చెవులలోచెట్లుమొలుచు** స.క్రి. వినిపించుకోకపోవు. **చెవులలోవేళ్ళుపెట్టుకొను** స.క్రి. ఏమాత్రం వినకపోవు. **చెవులవ్రేళ్ళుచెఱివికొను** స.క్రి. చెవులు మూసుకొను. **చెవులాకు** వి. ఎలుక చెవి ఆకు. **చెవులారన్** క్రి.విశ.ద్రు. చెవులు తృప్తి పొందేటట్లుగా. నిర్వ.రా. 10.43. **చెవులుగడియలుపడు** అ.క్రి. తిండిలేక పోవటంతోనో, పెద్ద శబ్దం వల్లనో చెవులు మూసుకొనిపోవు. పాండు. 3.103. **చెవులుగఱచు(-కఱచు)** స.క్రి. కొండేలు చెప్పు. వేంక. పంచ. 1.445. **చెవులుగింగురుమను** అ.క్రి. దెబ్బతో చెవుల్లో శబ్దం పుట్టు. **చెవులుచికిలిచేసుకొను** స.క్రి. సావధానంగా విను. **చెవులుచిందరపడు** అ.క్రి. చెవులుచిల్లులు పడినంత ధ్వని కలుగు. **చెవులుచిందర్లవోవు (-పోవు)** అ.క్రి. చెవులు చిల్లులుపడు. విప్ర. 4.19. **చెవులుచిందఱపోవు** అ.క్రి. చెవులు తూట్లుపడు. కళా. 7.19. **చెవులుచిందఱలుపోవు** అ.క్రి. చెవులు తూట్లుపడు. **చెవులుచిల్లులువోవు (-పోవు)** అ.క్రి. చెవులు తూట్లుపడు. శృం.నై. 4.24. **చెవులుచీములుగట్టు(-కట్టు)** అ.క్రి. దుర్భాషలతో బాధకలుగు, వినరాని మాటలవల్ల బాధపడు. భార.ఉద్యో. 2.10. **చెవులుజాడించు** అ.క్రి. వెళ్ళు. **చెవులుఝాడించుకొను** అ.క్రి. పనికాక వెనుతిరుగు. **చెవులుతూఁటుపడు** అ.క్రి. చెవులు చిల్లులుపడేటంత ధ్వని కలుగు. **చెవులుతెగినవెధవ** వి. ఒకతిట్టు, నిష్ప్రయోజకుడు. **చెవులుదుల్పు** స.క్రి. నిర్లక్ష్యంచేయు. **చెవులుపట్టాడించు** రూ.చూ. చెవులువట్టియాడించు. స.క్రి. లోకువచేయు. విజయ. 2.106. **చెవులువట్టియాడించు** రూ.చూ. చెవులువట్టియాడించు. స.క్రి. వేళాకోళంచేయు, లోకువచేయు. **చెవులుపిండు** స.క్రి. బలవంతంచేయు. **చెవులుబిదెర్లువడు (-పడు)** అ.క్రి. చెవులు వినపడకుండ అగు. **చెవులుబీటలువాఱు (-పాఱు)** అ.క్రి. చెవులు గింగుర్లుపోయే శబ్దం కలుగు. భార.ద్రోణ. 3.222. **చెవులువట్టియాడించు** రూ. చెవులుపట్టాడించు, చెవులుపట్టియాడించు. స.క్రి. వశవర్తిని చేసికొను. నిర్వ.రా. 4.22. **చెవులుసోఁకు** అ.క్రి. వినబడు,

చెవిబడు. భార.ద్రోణ. 2.230. చెవులేసులు వి. మహమ్మదీయులు కూరాకు వాడే చిన్న మట్టిపాత్ర.

**చెవి**[2] రూ. చెయ్, చెయి[2], చెయ్యి[2]. వి. తాళంచెవి. బహుళా. 5.98.

పో. షావె ; ఫ్రెం. క్లీ.

<పో. షావి.

**చెవికెలు** వి.బ.వ. గట్టినూలు పోచలు.

**చెవిటి** చూ. చెవుడు.

**చెవిటికిఁబట్టినసంకు** చూ. చెవుడు.

**చెవిటిపంచాయితీ** చూ. చెవుడు.

**చెవిటిమాలోకం** చూ. చెవుడు.

**చెవిటిముల్లు** చూ. చెవు.

**చెవిటిమూఁగ** చూ. చెవుడు.

**చెవిటివాఁడు** చూ. చెవుడు.

**చెవు** రూ.చూ. చెవి[1]. వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర.

**చెవిటిముల్లు** రూ.చూ. చేడుముల్లు. చూ. చెవి[1]. వి. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి, అంచుచివర గుచ్చే సన్నటి లోహపు ముక్క. **చెవుకట్టు** వి. 1. స్తంభంపై అంచున రెండువైపులా మేకు బందీ చేసిన చెక్కలు ; 2. గిలకకు రెండువైపులా ఆధారంగా నిలబడిన చిన్న కొయ్యముక్క ; 3. గోడలో బిగించే దర్వాజాకమ్మి ; 4. మరమగ్గం బొమ్మకు నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **చెవుకట్టుతాడు** వి. చేతిమగ్గం పలక బుజానికి కట్టిన చిన్న దారం. **చెవుకట్టు** వి.బ.వ. కపిలె బిళ్ళను అమర్చేందుకు దూలం పైన బిగించిన రెండు నిలువు కొయ్యలు. **చెవుగూట** వి. గోడలో బిగించే దర్వాజాకమ్మి. **చెవుగూటం** వి. దండెచెవి, దండెను మోసే పంగల కొయ్య పై భాగం. **చెవుపేట** వి. జువ్వాయిమోకు. బండి కాడి నుండి పోలుకర్ర కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**చెవుకాయలం** వి. ఒకరకం కలుపుమొక్క.

**చెవుడు** వి. 1. బధిరత్వం. కు.సం. 6.19 , భీమ. 5.115 ; 2. పెద్ద విన్నపం.

క. కివ్రుడు, కివడు, కెప్పు. చెవిటివాడు, చెవిటిది ; కిప్ర్డ్జ్. చెవిటివాడు ; కివ్రుడ, కివడ, కెప్పు. చెవిటివాడు ; తు. కెప్పు, కెప్పుతన. చెవిటితనం ; కెప్పె, కెప్పి. చెవిటివాడు, చెవిటిది ; కెబురె. చెవిటివాడు ; త. చెవిటు. చెవిటితనం, చెవిటివ్యక్తి లేక జంతువు ; చెవిటన్, చెవిటి. చెవిటివాడు, చెవిటిది ; కో. కెవ్. చెవిటితనం ; కెవ్ణ్, కెవి. చెవిటివాడు, చెవిటిది ; తొ. క్యుద్. చెవిటితనం ; కొలా. సెవడ్క. చెవిటి.

**చెవిటి** వి. వినపడనివాడు. నృసింహ. 2.90. **చెవిటికిఁబట్టినసంకు** వి. వ్యర్థం. కళా. 2.96. **చెవిటిపంచాయితీ** వి. అసలు సంగతి తెలియక చెప్పేతీర్పు. **చెవిటిమాలోకం** వి. చెవిటివాడు. **చెవిటిమూఁగ** వి. చెవుడూ, మూగతనం గలవాడు. **చెవిటివాఁడు** విణ. బధిరుడు. వినపడనివాడు. **చెవుడుకట్టె** వి. నేసిన గుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర. **చెవుడుకట్టెముల్లు** వి. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి, చివరగుచ్చే సన్నటి లోహపు ముక్క. **చెవుడుకర్ర** వి. దోనె ముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, కిందివైపు బిర్రుపెట్టె కర్ర. **చెవుడుకొను** అ.క్రి. చెవులు వినపడకుండు. **చెవుడుదారం** వి. చేతుకర్రకు లేదా చేడుబద్దకు చివరకట్టిన దారం. **చెవుడుపడు** రూ.చూ. చెవుడువడు. అ.క్రి. బధిరమగు, చెవుడుగలదగు. మార్క. 6.197. **చెవుడుపఱుచు** స.క్రి. చెవుడు కలుగజేయు. **చెవుడుపలుపు** వి. చేడుకర్రకు లేదా చేడుబద్దకు చివరకట్టిన దారం. **చెవుడుపాటు** రూ. చెవుడ్పాటు. వి. చెవిటితనం. **చెవుడువడు(-పడు)** రూ. చెవుడుపడు, చెవుడ్పడు. అ.క్రి.. బధిరమగు, చెవుడుకలదగు. భార.మౌసల. 50. **చెవుడ్పడు** రూ.చూ. చెవుడువడు. అ.క్రి. బధిరమగు, చెవుడుగలదగు. శృం.నై. 4.28. **చెవుడ్పాటు** రూ.చూ. చెవుడుపాటు. వి చెవిటితనం.

**చెవుడ్పడు** చూ. చెవుడు.

**చెవుడ్పాటు** చూ. చెవుడు.

**చెవుమాద** చూ. చెవి[1]. వి. చెవిలో పుండు.

**చెవులకంచుడు** చూ. చెవి[1].

**చెవులకడాయి** చూ. చెవి[1].

**చెవులకమ్మి** చూ. చెవి[1].

**చెవులకుండ** చూ. చెవి[1].

**చెవులకొయ్య** చూ. చెవి[1].

**చెవులచట్టి** చూ. చెవి[1].

**చెవులచిప్ప** చూ. చెవి[1].

**చెవులటెకె** చూ. చెవి[1].

**చెవులతాడు** చూ. చెవి[1].

**చెవులపట్టి** చూ. చెవి[1].

**చెవులపట్టె**[1] చూ. చెవి[1].

**చెవులపట్టె**[2] చూ. చెవి[1].

**చెవులపండుగు** చూ. చెవి[1].

**చెవులపండువు** చూ. చెవి[1].

**చెవులపాములు** చూ. చెవి[1].

**చెవులపిల్లి** చూ. చెవి[1].

**చెవులపిల్లితీగ** చూ. చెవి[1].

**చెవులపీట** చూ. చెవి[1].

**చెవులపువు** చూ. చెవి[1].

**చెవులపువ్వు** చూ. చెవి[1].

**చెవులపూవు** చూ. చెవి[1].

**చెవులపోతు** చూ. చెవి[1].

**చెవులబొమ్మ** చూ. చెవి[1].

**చెవులంబెట్టుకొను** చూ. చెవి[1].

**చెవులఁబెట్టు** చూ. చెవి[1].

**చెవులఁబోయు** చూ. చెవి[1].

**చెవులరాయి** చూ. చెవి[1].

**చెవులలోచెట్లుమొలుచు** చూ. చెవి[1].

**చెవులలోవేళ్ళుపెట్టుకొను** చూ. చెవి[1].

**చెవులవ్రేళ్ళుచెఱవికొను** చూ. చెవి[1].

**చెవులాకు** చూ. చెవి[1].
**చెవులారన్** చూ. చెవి[1].
**చెవులుగడియలుపడు** చూ. చెవి[1].
**చెవులుగఅచు** చూ. చెవి[1].
**చెవులుగింగురుమను** చూ. చెవి[1].
**చెవులుచికిలీచేసుకొను** చూ. చెవి[1].
**చెవులుచిందరపడు** చూ. చెవి[1].
**చెవులుచింపర్లువోవు** చూ. చెవి[1].
**చెవులుచిందఅపోవు** చూ. చెవి[1].
**చెవులుచిందఅలుపోవు** చూ. చెవి[1].
**చెవులుచిల్లులువోవు** చూ. చెవి[1].
**చెవులుచీములుగట్టు** చూ. చెవి[1].
**చెవులుజాడించు** చూ. చెవి[1].
**చెవులుఝాడించుకొను** చూ. చెవి[1],
**చెవులుతూ(టుపడు** చూ. చెవి[1].
**చెవులుతెగినవెధవ** చూ. చెవి[1].
**చెవులుదుల్పు** చూ. చెవి[1].
**చెవులుపట్టాడించు** చూ. చెవి[1].
**చెవులుపట్టియాడించు** చూ. చెవి[1].
**చెవులుపిండు** చూ. చెవి[1].
**చెవులు బిదెర్లువడు** చూ. చెవి[1].
**చెవులుబీటలువాఱు** చూ. చెవి[1].
**చెవులువట్టియాడించు** చూ. చెవి[1].
**చెవులుసోకు** చూ. చెవి[1].
**చెవులేసులు** చూ. చెవి[1].
**చెవ్వ** రూ. చెవ. వి. శిశుఖర్జువు, పిల్లలకుపట్టే గజ్జి. ఆం.భా. 2.129.

చెవ్వకాయలు వి.బ.వ. శిశుఖర్జువు, పిల్లలకుపట్టే గజ్జి.

**చెవ్వంగము** వి. నూనెతోడే గొట్టము, బొంబాయి, పంపు.
**చెవ్వలాట** వి. కామపరవశులు చేసే లీల.
**చెవ్వాకు[1]** రూ.చూ. చెవియాకు. వి. **1**. కర్ణభూషణం. ఆం.భా. 2.147 ; **2**. ముసలిస్త్రీలు చెవులకు పెట్టుకొనే రంగు తాటాకు చుట్ట ; **3**. పేదకుటుంబాల్లో ముండమోపులు కమ్మలకు బదులుగా చాయ అద్దిన తాటాకును గుండ్రంగా చుట్టి చెవిలో పెట్టుకొనే ఆకు.
**చెవ్వాకు[2]** చూ. చెవికాయాకు. వి. ఎలుక చెవ్వాకు.
**చెవ్వు** వి. మూసకర్రలకు పక్కన బిగించిన చెక్కముక్క. కొయ్యస్తంభం పీటకు కిందుగా వేసిన పలచని చెక్క.
**చెస్సు** వి. చదరంగం, సొగటాలాట.

ఇం. *Chess.* చదరంగం.

< ఇం. Chess.

**చే[1]** రూ. చెయి[1], చెయ్యి[1], చేయి. వి. **1**. హస్తం. కు.సం. 6.12 ; **2**. వశం, అధీనత. భార.ద్రోణ. 2.315 ; **3**. తొండం. ఆము. 4.187,

క. కెయ్, గెయ్, కయ్, కయి. చెయ్యి ; కొడ. కయ్ ; తు. కై ; త. కై, చెయ్ ; మ. కై, కయి ; కో. కయ్ ; తొ. కొయ్ ; గోం. కై ; కొం. కిఅ ; కుఇ. కజు ; కువి. కేయూ, కేజు ; పర్జి. కెయ్ ; కొలా. కి ; నా. కి. (కీల్) ; గ. కి ; ఒల్లా. కిఅ ; కురు. ఖెక్హా ; మాల్తో. కెకె.

పో.చూ. సం. కయ-. చెయ్య.

< మూ.ద్రా. *కెయ్.

**చేఆసు** రూ.చూ. చేతిఆసు. వి. చేత్తో పడుగునూలుపోసే కొయ్య పనిముట్టు. **చేకటిగుండ్లు** వి.బ.వ. **1**. చేతికట్లు, సంకెలలు ; **2**. మురుగులు ; **3**. గాజులు ; **4**. తోడాలు. **చేకటులు** రూ.చూ. చేకట్లు. వి.బ.వ. చేతులకు పెట్టుకునే ఒకరకమైన కడియాలు. **చేకట్టుదండ** వి. ఇతరుల చేతుల్ని స్తంభింపచేసే దండ. పి.శకుం. 1.113. **చేకట్టులు** రూ.చూ. చేకట్లు. వి.బ.వ. **1**. సంకెలలు ; **2**. చేతికి పెట్టుకునే ఒక రకమైన కడియాలు. **చేకట్లు** రూ. చేకటులు, చేకట్టులు. వి.బ.వ. **1**. చేతికట్టు, చేతి సంకెల. వసు. 2.45 ; **2**. హస్తభూషా విశేషం. వేంక.ఆం.మాన. 1.130. **చేకత్తి** వి. **1**. కరవాలిక, చేతికత్తి, చిన్నకత్తి. రామాభ్యు. 2.22 ; **2**. మల్లులు పోట్లాడడానికి ఉపయోగించే కత్తి. ఆం.భా. 2.206. **చేకత్తికా(డు** వి. **1**. చేకత్తికలవాడు, మల్లుడు. ప్రబంధ. 616 ; **2**. వీరుడు, భటుడు. **చేకలవా(డు** రూ. చేగలవా(డు. విశే. **1**. బాహుబలశాలి, పరాక్రమవంతుడు. శేష. 4.92 ; **2**. ఈవిగలవాడు, దాత. **చేకసి** వి. చేతుల దురద. **చేకాచు** అ.క్రి. సాయపడు, చేయడ్డపెట్టు. వర.రా. బాల.పు. 49. 25 పం. **చేకానుక** రూ..చేకాన్క. వి. చేతితో ఇచ్చే కానుక, ఉపాయనం. శుక. 3.534. **చేకాన్క** రూ. చూ. చేకానుక. వి. చేతితో ఇచ్చే కానుక, ఉపాయనం. దశా. 1.278. **చేకావలి** రూ. చేకావళి. వి. తాత్కాలికావసరాలకు చేతిలో ఉంచుకొనే డబ్బు. **చేకావళి** రూ.చూ. చేకావలి. వి. చేతిలో తాత్కాలికావసరాలకు ఉంచుకొనే సొమ్ము. **చేకాసు** వి. చేతిలోని డబ్బు. విప్ర. 4.16. **చేకురు** రూ. చేకుఱు, చేకూరు. అ.క్రి. **1**. లభించు. కు.సం. 3.279 ; **2**. సిద్ధించు, నెరవేరు ; **3**. చిక్కు, పట్టుపడు. **చేకుఱు** రూ.చూ. చేకురు. అ.క్రి. **1**. సిద్ధించు, నెరవేరు. భార.ఉద్యో. 2.122 ; **2**. లభించు, కలుగు. భార.భీష్మ. 3.293 ; **3**. చిక్కు, పట్టుబడు. దశకు. 5.123. **చేకూడు** అ.క్రి. **1**. లభించు, ప్రాప్తించు. భాగ. 8.575 ; **2**. సిద్ధించు, నెరవేరు. యయా. 5.32. **చేకూనలు** వి.బ.వ. **1**. చేతిబిడ్డలు ; **2**. చిన్నదూడలు. పండి.చ. 2.305 పు. **చేకూరు** రూ.చూ. చేకురు. అ.క్రి. **1**. శక్యమగు. రం.రా.యు. 303 పు. 2 పం. ; **2**. అనుకూలమగు, వశపడు. ఆము. 4.222 ; **3**. హస్తగతమగు, కలుగు, లభించు. రామాభ్యు. 3.82 ; **4**. నెరవేరు, సిద్ధించు. దశా. 5.92. **చేకూరుచు** రూ. చేకూర్చు. స.క్రి. ఒనగూర్చు, సమకూర్చు. **చేకూరుపు** రూ. చేకూర్పు. వి. నమస్కారం, చేమోడ్పు. **చేకూర్చు** రూ.చూ. చేకూరుచు. స.క్రి. ఒనగూర్చు, సమకూర్చు. **చేకూర్పు** రూ.చూ. చేకూరుపు. వి. నమస్కారం. **చేకూలి** వి. ఎప్పటికప్పుడు ఇచ్చే కూలి, ఏరోజుకారోజు ఇచ్చే కూలి. పండి.చ. 1.49 పు. **చేకొణద** రూ. చేకొణిది. వి. క్షీరమోరట, ఒకానొక చెట్టు. **చేకొణిది** రూ.చూ. చేకొణద. వి. క్షీరమోరట.

**చేకొఱుచు** రూ. చూ. చేకొఱుపు. వి. పచ్చపెదలు. **చేకొఱుజు** రూ. చూ. చేకొఱుడు. వి. పచ్చరంగుగల పెదలు, శిథిలి. **చేకొఱుదు** రూ. చేకొఱుచు, చేకొఱుజు. వి. పచ్చ రంగు గల పెదలు, శిథిలి. కాశీ. 6.58. **చేకొను** స.క్రి. **1.** నమ్ము, విశ్వసించు. భార. ఆది. 2.50 ; **2.** జయించు, వశపరచుకొను, స్వాధీనం చేసుకొను. భార. ఆది. 2.52 ; **3.** పుచ్చుకొను, గ్రహించు, తీసుకొను. భార. ఆది. **2.**195; **4.** అనుభవించు. భార. ఆది 4.91; **5.** తోడ్కొను. భార. ఆది. 4.198 ; **6.** దగ్గరచేర్చుకొను, ఆదరించు, మన్నించు. భార. ఆది. 6.193 ; **7.** పరిగ్రహించు, స్వీకరించు. భార. ఆది. 7.155 ; **8.** లక్ష్యపెట్టు. శివత. సా. 308 ; **9.** పొందు, చెందు. భార. ఉద్యో. 1.210 ; **10.** తాల్చు, ధరించు. భార. భీష్మ. 1.246 ; **11.** రక్షించు. భార. భీష్మ. 3.241 ; **12.** తెలుసుకొను, గుర్తించు. భాస్క. రా. కిష్కిం. 210 ; **13.** ఆర్జించు, సంపాదించు. భాస్క. రా. యు. 907 ; **14.** పాణిగ్రహణం చేసుకొను, పెళ్ళాడు. భాగ. 10ఉ. 135 ; **15.** పట్టుకొను. మను. 4.24 ; **16.** భావించు. ఎంచు. పారి. 1.92. విణ. స్వీకరించే. కు.సం. 9.84. అ.క్రి. పూను, కడగు. కు.సం. 11.101, ప్రభా. 5.80. **చేకొద్దికుంచము** వి. అందు బాటులో ఉన్న అమూల్యవస్తువు. చంద్రాంగ. 1.57. **చేకొలుపు** స.క్రి. చేకొనచేయు. **చేకోనితువ్వాలు** వి. ఒకరకం తువ్వాలు. **చేకోల** రూ.చూ. చేగోల. వి. చేతికర్ర. భాస్క.రా. అయోధ్యా. 205. **చేకోలు** వి. చేకొనటం, పుచ్చుకోవటం. **చేగంజి** వి. నేతనేసేటప్పుడు పడుగుమీద చేతితో పూసే గంజి. **చేగడియ** వి. చేతితో తీసుకోతగిన గడియ. శుక. 2.127. **చేగలమెకము (-కలమెకము)** వి. తొండం కల జంతువు, ఏనుగు. అచ్చ. రా. సుందర. 108. **చేగలవాఁడు (-కలవాడు)** రూ.చూ. చేకలవాఁడు. విణ. **1.** బాహుబలశాలి, పరాక్రమవంతుడు ; **2.** ఈవిగల వాడు, దాత, త్యాగి. **చేగానుఁగు** వి. చేతితో తిప్పేగానుగ. హర. 1.18. **చేగిండి** వి. చిన్నగిండి, కూజా. దశా. 4.97. **చేగుంజ** వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య. **చేగుడ్డ** వి. నేత నేసేటప్పుడు, గంజిగాని నూనెగాని చేతికి అంటుకొన్నప్పుడు తుడుచుకోడానికి వాడే గుడ్డ. **చేగూటం** చూ. చేతిగూటం. వి. మగ్గం మీదనేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య. **చేగూడ** వి. ఒకమనిషి మాత్రమే వేసేగూడ. **చేగొడ్డలి** వి. బౌ. గండ్రగొడ్డలి, చిన్నగొడ్డలి. భాగ. 9.467. **చేగొయ్య (-కొయ్య)** వి. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య. **చేగోడ** వి. చేపట్టుగోడ, మెట్లపక్కన కట్టేపల్చని పొట్టిగోడ. **చేగోడి (-కోడి)** రూ. చేగోజి. వి. భక్ష్యవిశేషం, కోడిపడ. **చేగోజి** రూ.చూ. చేగోడి. వి. భక్ష్యవిశేషం. **చేగోల (-కోల)** రూ. చేకోల. వి. చేతికర్ర. చెన్న బసవ. 2.229. **చేచమురు** వి. **1.** నెయ్యి ; **2.** సొంతడబ్బును ఇతరులకు ఖర్చుపెట్టటం (అర్థవిపరి.). **చేచాఁచు** రూ.చూ. చేయిచాఁచు. అ.క్రి. **1.** ఆశపడు, అపేక్షపడు ; **2.** సిద్ధమగు. స.క్రి. అభ్యర్థించు, కోరు. **చేచాఁపు** రూ.చూ. చేసాఁపు. వి. నమస్కారం. **చేచేతఁగుడిపించు** స.క్రి. స్వయంగా అనుభవింపచేయు. **చేచేతులఁజేసికొను** స.క్రి. స్వయంగా చేసుకొను. **చేజంత్రము** వి. చేతితో తిప్పేయంత్రం. హర. 1.22. **చేజోడి** వి. చేతులు చేతులు పట్టుకొని పోయేవాడు. కవిక. 4.99. **చేఁజిక్కు** అ.క్రి. వశమగు. రాధా. 2.105. **చేఁజేతుల** క్రి. విణ. ప్రు. తమకు తాముగా, చేఆర. **చేతగులు** రూ. చూ. చేతవులు. అ.క్రి **1.** లభించు, దొరుకు ; **2.** నష్టం వచ్చు. **చేతడి** వి. **1.** చేతిలోఉన్నడబ్బు, పైసా. **2.** చేతబడి. **చేతడిచేయు** స.క్రి. లంచమిచ్చు. **చేతడియాఱకుండగా** క్రి.విణ.ప్రు. వెనువెంటనే. హర. 2.103. **చేతడుపు** స.క్రి. **1.** కొంచెంగా తడుపు ; **2.** లంచమిచ్చు ; వి. **1.** లంచం ; **2.** కొద్దిగా పదును చేయటం. **చేతప్పు** వి. **1.** రాతతప్పు. పాండు 1.71 ; **2.** చేతితో చేసిన పొరపాటు. **చేతముకు** వి. చిన్నతముకు, చిన్నతుడుము. **చేతవులు** రూ. చేతగులు. అ.క్రి. **1.** లభించు, దొరుకు. ఉ. హరి. 5.22. **2.** నష్టం వచ్చు. **చేతాకిడి** వి. చేతితోముట్టుకోవడం. **చేతాఁకు** వి. సాహసం, తెంపు. భార. ద్రోణ. 2.302. **చేతాళము** వి. **1.** చేతులు తట్టటం, చేతులుచప్పుడు ; **2.** చేతబడి. **చేతాళంపొయ్యి** వి. సారెపైన కాక విడిగా చేతితోచేసిన వంటపొయ్యి. **చేతాల్లు** వి.బ.వ. మల్లుని ఆయుధాలు. ఆం. భా. 2.207. **చేతావాతాకాకపోవు** అ.క్రి. చేతకాకపోవు, పనితెలియకపోవు. **చేతొట్టి** రూ.చూ. చెయితొట్టి. వి. బిందెడు నీళ్లపట్టే చిన్నతొట్టి. **చేత్రాడు** వి. మల్లుని ఆభరణ విశేషం. ప్రబంధ. 78. **చేత్రాళ్ళు** వి.బ.వ. చేదతాళ్ళు. **చేదండ** వి. హస్తవలంబం, చేయూత. ద్వి. సార. చ. 3.115పు. 3పం. **చేదంతె** వి. **1.** పొలాన్ని చిన్న చిన్న మళ్ళుగా చేసుకోవటానికి ఉపయోగించే కొయ్యపరికరం ; **2.** కుప్పనుంచి ఎరువులాగే పరికరం ; **3.** కళ్ళంలో కంకులు, గడ్డులు లాగేకొయ్య పనిముట్టు. **చేదప్పిపోవు (-తప్పిపోవు)** అ.క్రి. చెయ్యిజారిపోవు. హంస. 2.215. **చేదప్పు (-తప్పు)** అ.క్రి. చేయిదాటిపోవు, గతించు. ఉ.రా. **4.**105. **చేదరిసెనము** రూ.చూ. చేదర్సెనము. వి. చేకానుక. **చేదర్సెనము** రూ. చేదరిసెనము. వి. చేకానుక. జైమిని భా. 3.76. **చేదస్తి** వి. చేతిరుమాలు. **చేదివియ** రూ. చేదివ్వె. వి. దివిటీ, కరదీపం. మను. 5.71. **చేదివ్వె** రూ.చూ. చేదివియ. వి. దివిటీ, కరదీపం. వైజ. 3.74. **చేదుడ్డు** వి. చేతికర్ర. హరిశ్చ. 2.9. **చేదోడు (-తోడు)** రూ. చేయిదోడు. వి. సహాయం. కార్యసహాయం. భార. ఉద్యో. 1.377. దశకు. **4.84.** **చేదోడుపడు** అ.క్రి. సహాయమగు, తోడ్పడు. హరి.ఉ. 5.201. **చేదోడువాదోడు** వి మాట సాయం. **చేదోయిముకుళించు** స.క్రి. నమస్కరించు. జైమిని భా. 1.104. **చేనిమ్మపండు** వి. అందుబాటులోఉన్నవాడు లేదా ఉన్నది. తాళ్ల. సం. 11.2 భా. 67. **చేనీరు** వి. చేతిలోకి తీసుకొన్న నీరు. వర.రా. యు. 196 పు. 12 పం. **చేనులుచు** స.క్రి. చేతిని మెలిపెట్టు. పండి.చ. 4.126 పు. **చేనెత్తురుకాకుండు** అ.క్రి. రక్తపాతం చేయకుండు. రాజ.చ. 2.89. **చేనేత** వి. చేతిలో నేసే నేత. **చేపట్టిన మన్ననలు** వి.బ.వ. పొందిన బహుకృతులు. తాళ్ల. సం.

8180. **చేపట్టు** స.క్రి. **1.** చేతితో పట్టుకొను. భార.అరణ్య. 1.300; **2.** స్వీకరించు, గ్రహించు. భాస్క.రా. కిష్కిం. 1.30 ; **3.** (ఆశ్రితులు మొదలైనవారిని) ఆదరించు, చేరదీయు. హరి.పూ. 1.37 ; **4.** అనుగ్రహించు. నృసింహ. 5.144 ; **5.** ధరించు, తాల్చు. ఉ.హరి. 2.146 ; **6.** ఆశ్రయించు. భాగ. 1.91 ; **7.** సంపాదించు. శృం.నై. 2.77 ; **8.** నిర్ణయించు, స్థిరపరచు. శృం.నై. 6.36 ; **9.** వహించు, పూను. శివరా. 1.103 ; **10.** వివాహమాడు. మను. 6.56 ; **11.** రతిలో కూడు, కలియు. కళా. 4.128; అ.క్రి. చేపట్లు పట్టు. భార.విరా, 1.81 ; వి. **1.** పాణిగ్రహణం, పెళ్ళి. సిం.ద్వా. 4.23 ; **2.** ముగ్గు మొ॥ వాటితో చేతితో పెట్టే పట్టు. పాండు. 4.168; **3.** అవలంబం. భల్లా. 3. **చేపట్టుగోడ** రూ.చూ. చెయిపట్టుగోడ. వి. మిద్దెపై అంచుల దగ్గర, బట్టీ మశలపక్కన, కట్టే పల్చని పొట్టిగోడ. **చేపట్టు(గుంచము (-కుంచము)** వి. **1.** చేతిలోని కుంచం వంటివాడు, ఎవరేది కోరితే అది ఇచ్చేవాడు. శుక. 1.48 ; **2.** స్వాధీనుడు. శుక. 1.77. **చేపట్టు(గొమ్మ(-కొమ్మ)** వి. హస్తావలంబం, ఆశ్రయం. ఉ.రా. 1.37. **చేపట్టుచేయు** స.క్రి. భోజనానికి కూర్చునేముందు విస్తరి వేసేచోట ముందుగా నీళ్ళు చల్లి అలికి ముగ్గుపెట్టు, శుద్ధిచేయు. పాండు. 4.163. **చేపట్లకువచ్చు** అ.క్రి. కొట్లాటకు వచ్చు. ఉ.రా. 6.361. **చేపట్లు** వి. బ.వ. కలహం. ప్రబోధ. 4.27. **చేపడవ** వి. చేతితో నడిపే పడవ. హంస. 4.182. **చేపడు** అ.క్రి. **1.** పట్టుపడు, దొరుకు. భార.ఉద్యో. 4.68 ; **2.** లభించు. భార.భీష్మ. 2.199 ; **3.** అగు, కలుగు. హరి.ఉ. 7.106; **4.** వశమగు, అధీనమగు. ఆము. 4.200. **చేపలక** వి. మరమగ్గంలో పన్నె బిగించిన పై చెక్క. **చేపల్లటీ** వి. అంతరపల్లటి, ఒక రకం పావురం. **చేపార** రూ.చూ. చెయ్యిపార. వి. కూర్చుని పని చెయ్యడానికి పనికివచ్చే చిన్నపార. **చేపాలు** వి. చిరకపొత్తు, ఆసామి అరకతోనే సాగుచేసి రైతు పంటలో ఒకభాగం పంచుకొనే పద్ధతి, శ్రమ ఫలితం. **చేపావడ** వి. చేతి రుమాలు. రఘురా. 2.133. **చేపుడికిళ్లు** వి.బ.వ. చేతితో తడుపుకోవటాలు. సు.శ. 92. **చేపూత** వి. చేతితో పూసిన పూత. **చేపెట్టు** వి. చేతిదెబ్బ, దెబ్బ. గుద్దు. **చేపెట్టుమేయు** అ.క్రి. దెబ్బతిను. చంపూరా. 5.60. **చేపెట్టె** వి. చిన్న పెట్టె. అల్పమంజూష. **చేపొయ్యి** వి. చేబదులు, వద్దులేని అప్పు. **చేబడి** వి. పని, చేతిపని, చేతబడి, ప్రయోగం. సాంబో. 4.21. **చేబడితె** వి. ఏతం తొక్కే మనిషి పడకుండా పట్టుకోటానికి పక్కన పాతిన కొయ్య, (ఏతపుగుంజ) పట్టుగడ. **చేబదను** వి. కొద్దిపాటి తడిగల జిగురు. **చేబదులు** రూ. చేతి బదులు. వి. చేతి అప్పు, పద్దు మొదలగునవి రాయకుండా, వడ్డీ లేకుండా పుచ్చుకొన్న అప్పు. **చేబంతులు** వి.బ.వ. కందుక క్రీడావిశేషం. బ్రహ్మో. 3,30. **చేబాడిత** రూ. చేబాడిస, చేబాడిసె. వి. చిన్న బాడిత, చెక్కుడు సాధనం. కకుత్స. 2.23. **చేబాడిస** రూ.చూ. చేబాడిత. వి. చిన్న బాడిత. **చేబాడిసె** రూ.చూ. చేబాడిత. వి.చిన్నబాడిత. **చేబారలువిడు** అ.క్రి. వట్టిచేతులు చాపు, అంగలార్చు. వర.రా. కిష్కిం. పు. 498 పం. 3. **చేబారలువెట్టు** అ.క్రి. పారిపోవు, అంగలార్చు. రాజగో. 1.46. **చేబియ్యము** వి.బ.వ. చేతితో బాగుచేసిన బియ్యం, దంపుడు బియ్యం. **చేబిరుసులు** వి బ.వ. ఒక విధమైన బాణసంచు. రాజ వా. 5.61. **చేబుఱ్ఱ** వి. ఊదే సాధన విశేషం. ద్వి.పరమ. 7.498. **చేబోడి** వి. చేతిలో ఏమీ లేనివాడు. నిరుపేద. కవిక. 4.99. **చేమగ్గము** వి. పడుగులో పేక దారపుకండె బిగించిన నాడె చేతతో వేస్తూ నేసే మగ్గం, చేతిమగ్గం. **చేమన్ను** రూ.చూ. చెయ్యిమన్ను. వి. చేతితో పూత పెట్టే మన్ను. **చేమఱచు** అ.క్రి. హస్తకౌశల శూన్యుడగు. కళా. 4.184. **చేమాకుపెట్టు** వి. సారె చక్రానికిచుట్టూ మన్ను మెత్తి పైన నునుపుకోసం పేడ, మట్టి కలిపి పూత పూయడం. **చేమించు** అ.క్రి. చేయి దాటిపోవు. వర.రా. కిష్కిం. పు. 353, పం. 12. **చేమిరి** వి. **1.** ఆతంచనం, తోడు. వేంక.పంచ. 4.455 ; **2.** మిరప, వంగ, మొ. వాటి నారు నాటినవెంటనే పాదు మొదట పోసే కొద్దినీళ్ళు. **చేమిరిపడు** అ.క్రి. విరుగుపడు, తోడుపెట్టు. **చేమీ(దుగా** క్రి.విశ.ద్రు. చేతితో. పాండు. 4.267. **చేముంచినేరముచేయు** స.క్రి. బుద్ధిపూర్వకంగా తప్పుచేయు, చేజేతులా చేయు. విష్ణుపు. 4.266. **చేమేకు** వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి, మోకుకట్టే కొయ్య, చేతిగూటం. **చేమేకులకొయ్య** వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టడానికి మోకు కట్టే కొయ్య, చేతి గూటం. **చేమొగుచు** అ.క్రి. చేతులు ముడుచు, చేతులు జోడించు, నమస్కరించు. వైజ. 2.7. **చేమొగుపు** వి. నమస్కారం, ప్రణతి. ప్రబంధ. 880. **చేమోడుచు** రూ.చూ. చేమోడ్చు. స.క్రి. నమస్కరించు. **చేమోడ్చు** రూ. చేమోడుచు. స.క్రి. నమస్కరించు. ఆం.నా.సం.మాన. 31. **చేమోడుపు** రూ.చూ. చేమోడ్పు. వి. నమస్కారం. **చేమోడ్పు** రూ. చేమోడుపు. వి. నతి. ఉ.రా. 4.224. **చేయప్పు (-అప్పు)** వి. చేబదులు, పద్దు లేకుండ తీసుకొన్న అప్పు. శుక. 2.368. **చేయము** వి. ఆభరణ విశేషం. **చేయమ్ము (-అమ్ము)** వి. చేతితో విసిరే బాణం. ద్వి.పరమ.వి. 6.485 ష. **చేయల(తి** విశ. అధీనమైన, వశమైన, సాధ్యమైన. నిర్వ.రా. 4.84. వి. **1.** చేతిబలం. భార.ద్రోణ. 4.243; **2.** సమీపం. భాస్క.రా.అరణ్య. 2.46. **చేయాడు (-ఆడు)** అ.క్రి. ఖర్చు పెట్టటానికి డబ్బు కలుగు. **చేయిచ్చు (-ఇచ్చు)** అ.క్రి. **1.** చేతికి దొరుకు. శృం.నై. 2.46; **2.** మోసంచేయు. **చేయీ(త** వి. తెప్ప మొ॥ లేకుండ చేతులతో ఈదే ఈత. భార.విరా. 4.213. **చేయూ(త (-ఊత)** వి. కరావలంబం, ఆధారం. రం.రా.ఉ. 172 పు. 20 పం. **చేయూ(దుకొను** అ.క్రి. చేతుల్ని ఆధారంగా దేనిపైనో ఆనించు. పండి.చ. 5.279 పు. **చేయెత్తు (-ఎత్తు)** వి. నిలువెత్తు, మనిషి నిలచి చేయి పైకెత్తినప్పుడుండే ఎత్తు. ఇందు. 3.48. స.క్రి. **1.** నమస్కరించు. సారంగ. 2.204 ; **2.** చేతిని పైకెత్తు. **చేయేతము (-ఏతము)** వి. చేతితో ఉపయోగించే ఏతాం. హంస. 1.186. **చేయొడ్డు** స.క్రి. అడ్డుపెట్టు. భార.శాంతి. 4.158. **చేరాటం** వి. నూలు తీసే రాట్నం. **చేరౌతు** వి. తట్టురాయి, పక్కకట్టురౌతు, కట్టుబడి చేసేటప్పుడు సమయానికి అందుబాటులో ఉన్న రాయి. **చేలాగిచ్చు**

స.క్రి. చేయూతనిచ్చు. ఇందు. 3.27. **చేలాగు** వి. చేయూత కైదండ. ఇందు. 3.27. **చేవట్టికాలుద్రొక్కు** స.క్రి. పెండ్లియాడు. < చే[1] + పట్టు + -ఇ + కాలు + ద్రొక్కు. **చేవట్టితిగుచు(-పట్టితిగుచు)** స.క్రి. చేయిపట్టి లాగు. కళా. 7.123. **చేవడి** వి. చేతి వాడి, చేవాడి, దొంగతనం. **చేవడించు** స.క్రి. చేతితో పట్టుకొని నలిగిపోయేటట్లు చేయు. పాండు. 3.89. **చేవదలు** స.క్రి. 1. వదలు, విడిచిపెట్టు. కకుత్స. 2.91; 2. దానంచేయు. **చేవలంతి** రూ.చూ. చేవలంతి. వి. 1. చేతి శక్తి, భుజశక్తి ; 2. సమీపం; విశ. అధీనమైన, వశమైన. **చేవలంతి** రూ. చేవలంతి. వి. 1. చేతి శక్తి, భుజశక్తి. హర. 1.20; 2. సమీపం. పి.శకు. 1.132; విశ. అధీనమైన, వశమైన. పాండు. 3.118. **చేవాటు** విశ. సమీపంగా ఉన్న, తక్కువదూరంలో ఉన్న. ద్వి.హరిశ్చ. పూ. 1830. **చేవాటునేల** వి. సమీపప్రాంతం, చేతితో రాయి విసిరినంత దూరం. గౌ.హరి.ప్రథ.పంక్తి. 1729.30. **చేవాడిమెఱయు** స.క్రి. చేతి మెలకువ చూపు. పర.రా.యు. పు. 366 పం. 13. **చేవాఁడి** వి. చేతి దురుసుతనం. ప్రబంధ.767. **చేవాఁడికాఁడు** వి. చేతిలో చురుకు గలవాడు. దొంగ. సాంబ.మాన. 12. **చేవార్నె** వి. పొడుగు చాలనప్పుడు మోట మోకు చివర అతికే తాడుముక్క. **చేవాలు** వి. సురికను మెదిపే పనిముట్టు. **చేవిచ్చు** స.క్రి. నమస్కరించు. **చేవిడుచు** స.క్రి. విడిచిపెట్టు, వదలు, పీడు. **చేవిప్పు** వి. నమస్కృతి, దండం, నతి. ప్రబంధ. 880. **చేవీచు** అ.క్రి. చెయ్యి వీచు, సైగ చేయు. **చేవెలుఁగు** వి. 1. ఎదుటి వస్తువు బాగా కనిపించటానికి చేతితో కంటికి పెట్టుకొనే అడ్డు, హస్తావరణం. హర. 2.49; 2. దివిటీ, కాగడా. **చేవేసినవ్వు** అ.క్రి. చేతులు చరచి నవ్వు. ద్విప.కల్యా. 129. **చేవ్రాలు** వి.బ.వ. 1. చేతిలోని రేఖలు, నవనాథ. 3.145 పు.; 2. సంతకం. **చేవ్రేలు** వి. కరాంగుళి, చేతివేలు. **చేసడలు** స.క్రి. వదలు, విడుచు. వసు. 6.84. **చేసన్న** వి. చేసైగ, అభినయం. **చేసన్నసురుతులు** వి.బ.వ. అభినయ హస్తాలు. **చేసన్నాయి** వి. ఊదే సన్నాయి, వాద్యవిశేషం. **చేసరులు** వి.బ.వ. హస్తాభరణ విశేషం. హంస. 5.356. **చేసఱచినగు (-చఱచినగు)** అ.క్రి. చేతులు కొట్టి నవ్వు. శృం.నై. 2.46. **చేసాఁచిఅడుగు** స.క్రి. యాచించు. **చేసాఁచు** రూ.చూ. చెయి చాఁచు. అ.క్రి. 1. అపేక్షపడు, ఆశపడు. ఉ.హరి. 5.155; 2. సిద్ధమగు. కాశీ. 1.109. స.క్రి. అర్థించు, కోరు. **చేసాఁపు** రూ. చేచాఁపు. వి. నమస్కారం. ప్రబంధ. 880. **చేసేత** అవ్య.ద్రు. 1. ఒకరొకరి చేతిమీదుగా. నిర్వ.రా. 1.26; 2. వెంటనే. భార.శాంతి. 3.251; 3. స్వహస్తాలతో, స్వయంగా. వరాహ. 7.60. **చేసైగ** వి. చేతితో చేసే సంజ్ఞ.

**-చే[2]** రూ.చూ. -చేత[1]. ప్రత్య.ద్రు. తృతీయా విభక్తి ప్రత్యయం. (ఇది హస్తార్థకమైన 'చేయి' శబ్దానికి తృతీయార్థంలో ద్వితీయా విభక్త్యంతమై క్రమంగా ప్రత్యయంగా మారింది). భార.ఆది. 8.98.

**చేకచెట్టు** వి. ఇసుకనేలల్లో ఉప్పునీరుగాని, ఉప్పునీటి గాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అ॥ ఎత్తున పెరిగే చెట్టు (Casurina equisefifolia).

**చేకట్టు[1]** వి. 1. నాలుగు కొయ్యలలో ఓగించబడిన దర్వాజా ; 2. ద్వారబంధపు నిలువు కమ్మి ; 3. దర్వాజా చట్రపు పై కమ్మి.

**చేకట్టుబండ** వి. దర్వాజా ఉత్తరాసిమీద పరిచే బండ. **చేకట్టుబల్ల** వి. కుసి తగిలించడానికి రంధ్రం ఉంచి దర్వాజా పై కమ్మిమీద పరచిన చెక్క.

**చేకట్టు[2]** వి. హంసపాదును అతుకుతూ పైకి కొట్టిన కొయ్య కట్టు.

**చేకట్టు[3]** వి. ఓడకు కట్టిన ముక్కోణపు తలుపుచట్రం.

**చేకము** వి. బట్టయొక్క బద్దె, వత్తి, దశ. ఆం.శా. 2.153.

**చేకఱె** రూ.చూ. చేగ్రి. వి. ఎరుపులో నలుపు, చేవనలుపు.

**చేకి** రూ.చూ. చెమికె. వి. పన్నె సందుల్లోనుంచి అపతలకు దూర్చిన (బెంతు దారాలుగాని, బద్దెదారాలుగాని) పోగుల్లో అచ్చుతకటానికి కోసిన కొసలు, లేక పాయ.

**చేకిపట్టె** వి. అచ్చుపోగుల్లో, చెమికె ముడికొయ్యగా మిగిలిన పోగులు. **చేకిముడి** రూ.చూ. చెమికెముడి. వి. అచ్చులో, పన్నెగూళ్ళలోనుంచి దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగులు వెనక్కు జారకుండా పాయలుగా విడదీసివేసిన చివరి ముడి.

**చేకిలేటు** రూ. చాక్లెట్టు. వి. 1. తియ్యగా ఉండే పదార్థం ; 2. ఒకరకం ముదురురంగు.

ఇం. *Chocolate.* తియ్యని పానకం, తియ్యగాఉండే పదార్థం.

< ఇం. Chocolate.

**చేకు[1]** వి. చేటు, చెరుపు.

**చేకునేల** వి. గడ్డి బలిసి, దున్నడానికి కష్టమైన నేల. సీకునేల.

**చేకు[2]** వి. పరిమాణం.

**చేకు[3]** వి. 1. చెక్కే పనిముట్టు ; 2. చిన్న కత్తి.

**చేకులు** రూ.చూ. చెమికలు. వి.బ.వ. నేత నేసేటప్పుడు తెగిన పోగులు అతుకుకోడానికి ఉపయోగించే గంజిపెట్టిన నూలు ముక్కలు.

**చేగ** రూ.చూ. చేవ. వి. 1. శ్రేష్ఠత్వం. కాశీ. 7.185 ; 2. వృక్షసారం. భాగ. 10 పు. 767 ; 3. బలం. వేంక.పంచ. 1.519 ; 4. దానంలోని సారం. యయా. 1.69 ; విశ. సారంగల. కళ. 3.25.

**చేగగడ్డ** వి. ఓషధీ విశేషం. **చేగదేఱు** అ.క్రి. చేవదేరు, గడిదేరు. తాళ్ళ.సం. 8.118. **చేగదోరె** వి. ఎరుపు కాస్త తక్కువగా ఉన్న చేవరంగు. **చేగరి** రూ.చూ. చేగ్రి. వి. ఎరుపులో నలుపు, చేవనలుపు. **చేగ్రి** రూ. చేకఱె, చేగరి, చేగారి. వి. ఎరుపులో నలుపు, చేవనలుపు. < చేగ + కట్టి.

**చేగారి** రూ.చూ. చేగ్రి. వి. ఎరుపులో నలుపు, చేవనలుపు.

**చేగిలికుదురు** వి. వాటకుదురు, వాటకుండకింద ఎత్తుకోనం పెట్టుకొనే మట్టికుదురు.

**చేగు[1]** వి. దుష్టుడు, కఠినుడు, క్రూరుడు. అష్టమ.క. 1.29 పు. 11 పం.

త. చేకు. కాఠిన్యం.

**చేగు[2]** వి. ఇబ్బిళి, అడవుల్లో పెరిగే మహా వృక్షాల్లో ఒకటి

(Dalbergia latifolia).

**చేచేపు** చూ. చేపు.

**చేంచె** వి. అచ్చుబిళ్ళ, అచ్చు కట్టేటప్పుడు వడివారం చుట్టే కొయ్య.

**చేట[1]** వి. **1.** శూర్పం, చెరిగే సాధనం. శృం.నై. 7.76 ; **2.** చెరగటానికి వాడే వెదురుబుట్ట.

క. కేఱు. చెరగటం ; మ. చేఱుక. బియ్యం చెరగటం; కో. కె.ర్- కెరి- ; తొ. కొ.ర్. చెరగటం ; గోం. సేతి ; కుఇ. సేని ; కువి. హేచి ; పర్జి. కేట్, కేడ్. చెరగటం ; కెతి, కెటి. చేట ; కొలా. కె.ద్. చెరగటం ; కె.త్. చేట; నా. కేద్. చెరగటం ; కేత్. చేట ; గ. ఒల్లా. కెయ్. చెరగటం ; కేటి, కేటిన్, కెటెన్. చేట ; కేయ్. చెరగటం ; కురు. కేఁస్నా. చేటతో కిందికి పైకి చెరగటం ; కేఁతెర్. చేట; మాల్తో. కెసె. గాలించు, జల్లించు ; కెత్ను. చేట.

**చేటకమాను** రూ. చేటా కమాను, సాటకమాను. వి. టార్చి కిటికీలమీద, గుమ్మాలమీద వేసే అర్ధచంద్రాకారపు ఆర్చి. **చేటకొట్టు** స.క్రి. ఇంకేమీ లేదను. **చేటకొమ్ము** వి. వెలుపలికి ఏటవాలుగా వాలి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము. **చేటకొమ్ము నచేరు** అ.క్రి. **1.** అతి దరిద్రస్థితిలో మునుగు; **2.** విత్తులులేకపోవు. **చేటకొల్లారు** వి. మూడుపక్కల చేరిక కట్టడంగల ఇల్లు, త్రిశాల. ఆం.భా. 2.14 **చేటగొట్టు** (**-కొట్టు**) స.క్రి. కళ్ళంలో నువ్వులు, పెసలు, మినుములు మొ.నవి చేటలతో విసిరి పొల్లు వేరుచేయు. **చేటగోళ్లబోఁటి** వి. శూర్పణఖ. అచ్చ.రా.అరణ్య. 11. వ్యు. చేటవంటి గోళ్ళు గల స్త్రీ. **చేటచెవులమెకము** వి. ఏనుగు. వ్యు. చేటలవంటి చెవులుగల జంతువు. **చేటచెవులవేల్పు** వి. గణపతి, శూర్పకర్ణుడు. **చేటచేర్పు** వి. చేటను గోడకు ఆన్చినట్లుండటం. **చేటచేఱు** వి. ఆడవాళ్ళు ఒక విధమైన కోక కట్టు. **చేటపాక** వి. వెడల్పాటి పాక. **చేటపెయ్య** వి. **1.** ఒకానొక తిట్టు, దద్దన్న. హంస. 5.113 ; **2.** దూడ చచ్చిన ఆవునిగాని, గేదెనిగాని చేపటానికి, చచ్చిన దూడ చర్మాన్ని కుట్టి దానిలో గడ్డిపెట్టి చేసిన దూడ, కృత్రిమ వత్సం. **చేటపాలి** వి. నిండురాసిని చేటతో విసిరే ఆచారం. **చేటప్ప** వి. చేటడులుగా తీసుకొన్న ధాన్యం. < చేట[1] + అప్ప. **చేటబట్టు** స.క్రి. కాకలుకొట్టు, అము హొయ్యిదగ్గర నిప్పు రాజేసి చేటలో విసురు. **చేటబిచ్చం** వి. గ్రామవృత్తుల వాళ్ళకు చేటలతో మామూలుగా ఇచ్చే గింజలు. **చేటభారతము** వి. **1.** విషయాన్ని దీర్ఘంగా చెప్పటం ; **2.** అక్కరకురాని దీర్ఘ ప్రసంగం. **చేటయెత్తుకవచ్చు** (**-ఎత్తుకవచ్చు**) అ.క్రి. తినటానికి వచ్చు. శుక. 3.21. **చేటరాయి** వి. కుండరాయి, కుండల్ని నర్సే రాయి. **చేటరిక్క** వి. విశాఖా నక్షత్రం. **చేటరిక్కనెల** వి. వైశాఖమాసం. **చేటలగూడ** వి. రెండు చేటలు కలిపి కట్టిన గూడ. **చేటలోపడు** అ.క్రి. పుట్టు. **చేటలో పడినది మొదలు కాటిలోపడువఱకు** అవ్య.ద్రు. పుట్టిందిమొదలు చచ్చేవరకు. **చేటవంపులు** వి.బ.వ. ఒక రకం వడ్లు. **చేటవీనులదణి** వి. గణపతి, శూర్పకర్ణుడు. **చేటసవతురిక్క** వి. విశాఖా నక్షత్రం. **చేటాకమాను** రూ.చూ. చేటకమాను. వి. కిటికీలమీద, గుమ్మాలమీద వేసే 'అర్ధ చంద్రాకారపు ఆర్చి.' **చేటార్చి** వి. చేటకమాను, టాకార్చి, దబ్బకమాను, దబ్బార్చి నెలవంకార్చి, కిటికీలమీద గుమ్మాలమీద వేసే అర్ధ చంద్రాకారపు ఆర్చి. **చేటిసురు** స.క్రి. కాకలుకొట్టు, అము హొయ్యిదగ్గర నిప్పు రాజేసి చేటతో విసురు. < చేట[1] + ఇసురు.

**చేట[2]** రూ.చూ. చేటు. వి. చెట్ట, కీడు.

**చేటాకమాను** చూ. చేట[1].

**చేటార్చి** చూ. చేట[1].

**చేటిసురు** చూ. చేట[1].

**చేటు** రూ. చేట[2]. వి. **1.** బాధ. భార.విరా. 1.126 ; **2.** చెరుపు, నాశం. భార.ఉద్యో. 2.56 ; **3.** మృతి, చావు. భాస్క.రా. అరణ్య. 2.148 ; **4.** అశుభం. ఆం.భా. 99 ; **5.** కీడు, ఆపద. ఆం.భా. 2.211.

క. కెడు, కిడు (కెట్ట్). పాడగు, నాశంచేయు ; కెడిసు, కిడిసు. నాశనం చేయు, పాడు, నాశం ; కెట్ట. పాడైన, మలినమైన; కెట్టె. పాడు ; కెట్టతన. చెడుతనం ; కెడక, కెడిక, కెడుక, కిడుక. పాడైన మనిషి, చెడు ; కెడకి, కెడికె, కెడుకి. దుర్మార్గురాలు ; కెడుకతన, కెడుకుతన. చెడ్డతనం ; కెడుహ. చెరుపు ; కిడ. చెడినవాడు ; కిడి, కిడుక. చెడగొట్టేవాడు ; కెడితన, కేడిగతన. చెడగొట్టే స్వభావం ; కేడికె. చెడు స్త్రీ ; కొడ. కెడ్ (కెట్ట్-). నాశంచేయు, చెడుచేయు ; కెడి. నాశం ; తు. కెడగుని. నాశం, నష్టం ; కెడుకు, కెడ, కెడుకు. చెరుపు, హాని; కెడకె. బాధించేవాడు; కెట్ట. చెడ్డ ; కేడు. నష్టం, చెడు ; త. కేడు (కెడుప్-, కెట్ట్-). క్షీణించు, మురిగిపోవు, చెడిపోవు ; కెడుప్ప్-, కెడుత్త్. చెడటం, నాశనమవటం ; కెట్ట. చెడు, నాశం ; కెట్టవన్. ద్రోహి ; కెడుతల్. నాశం. నష్టం ; కెడుతి. ద్రోహి ; కెడుంపు. నాశం, చెడుకాలం ; కెడు. నాశం, చావు ; కేడన్. దుర్మార్గుడు ; మ. కెడు. నాశం ; కెడుక. నాశనం చేయబడు; కెడుతి. చెరుపు, పాడు, కష్టం ; కెడుంపు. చెడటం, మురగటం ; కెట్ట. నష్టమైన, చెడ్డ ; కేడన్. మోసగాడు, వంచకుడు ; చెటి, అసహ్యం ; కో. కెడ్ (కెట్). చావటం, చెడగొట్టబడిన ; కెజ్బ్. నాశం. నష్టం; గోం. కరీతానా. చెడిపోవు ; కరీస్తానా ; కువి. హేడినై. హెర్సినై. నాశంచేయు ; పర్జి. చిట్, చిటిప్. నాశనంచేయు ; కొలా. కిట్, కిటిప్ ; నా. కిట్ ; గ.ఒల్లా. సిట్. బయటికిపోవు ; సిట్ప్. నిప్పుపెట్టు.

< మూ.ద్రా.* కెట్.

**చేటుకాలము** వి. వినాశకాలం. భార.ద్రోణ. 4.291 ; త. కెడుకాలమ్. **చేటుతఱి** వి. వినాశకాలం. భాస్క.రా. యు. 461. **చేటుపడు** రూ.చూ. చేడ్పడు. అ.క్రి. **1.** చచ్చు ; **2.** కలగు, కలతపొందు ; **3.** భంగపడు ; **4.** బాధపడు. **చేటుపాటు** రూ.చూ. చేడ్పాటు. వి. భంగం. భార. స్త్రీ. 2.47. **చేటుపాటులకు లోనగు** అ.క్రి. ఇబ్బందులకు, ఇక్కట్టులకు లోబడు. శుక. 3.265. **చేటుమణఁగు** అ.క్రి. **1.** చెడు ; **2.** చచ్చు ; **3.** కలగు. **చేటుమారి** వి. పొగరు

బోటు, చెనటి. త. కేటువన్. ఒకానొక తిట్టు. **చేటుమునుగు** అ.క్రి. **1.** కీడొందు ; **2.** కలతపడు. **చేటుమూడు** అ.క్రి. **1.** కీడొందు ; **2.** కలతపడు. **చేట్లకొలవి** వి. తుంటరి, ఎంబెన్న, దద్దమ్మ. అం.భా. 3.13. **చేడ్పడు** రూ. చేటుపడు, చేడ్వడు. అ.క్రి. **1.** చచ్చు. భార.ఆది. 8.259 ; **2.** కలతనొందు, వ్యాకులపడు, ఖిన్నమగు. భార.అరణ్య. 4.63 ; **3.** భంగంపొందు, భగ్నమగు, పోవు. భార.విరా. 2.23; **4.** బాధపడు, కష్టపడు. భీమ. 3.5. త. కెటుపడు. ప్రమాదంలో పడు, ఆపదపొందు. **చేడ్పాటు** రూ. చేటుపాటు. వి. **1.** బాధ, కష్టం. భార. విరా. 4.95 ; **2.** అశుభం, ఆపద. అచ్చ.రా.బాల. 63. త. కేటుపాటు. **చేడ్వడు** రూ.చూ. చేడ్పడు. అ.క్రి. **1.** భంగపడు ; **2.** చచ్చు ; **3.** బాధపడు ; **4.** కలతపొందు.

**చేట్లకొలపి** చూ. చేటు.

**చేట్లపురులు** వి.బ.వ. అమాయకురాలు, పసిపాప.

**చేడ** రూ. చాడ. వి. చేను దున్నటానికి మొదటి తడవగా నీరు పెట్టటం.

**చేడచాలు** వి. మాగాణికి మొదటిసారి దమ్ముపెట్టి దున్నిన చాలు. **చేడదుక్కి** వి. దుంపదుక్కి, నీళ్ళుపెట్టి దున్నిన మాగాణి పొలం, మాగాణిలో నీళ్ళుపెట్టి దున్నటం.

**చేడలేయు** రూ.చూ. చేడాల్లేయు. అ.క్రి. పెట్టిపోవు, మట్టిపాకం లోపంవల్లగాని, కాపు లోపంవల్లగాని, ఆముకాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

**చేడాల్లేయు** రూ. చేడలేయు. అ.క్రి. పెట్లిపోవు, మట్టిపాకం లోపంవల్లగాని, కాపు లోపంవల్లగాని. ఆముకాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

**చేడిగేరియ** వి. **1.** చెడుగు ; **2.** కొంప చెరుపు.

**చేడియ** రూ. చేడె[1]. వి. **1.** స్త్రీ, ఆడది. భార.విరా. 2.27 ; **2.** భార్య. హరి.పూ. 2.40.

సం. చేటికా. దాసి ; ప్రా చేడిఆ.

<ప్రా. చేడిఆ.

**చేడు** వి. దోనెమీది నేసిన గుడ్డ ముడుచుకొనిపోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర లేదా బద్ద.

**చేడుకట్టె** రూ. చేరుకట్టె. వి. దోనె ముందర, నేసినగుడ్డ ముడుచుకుపోకుండా, అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర. **చేడుకట్టెతాడు** వి. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం. **చేడుకట్టెదారం** వి. చేడుపలుపు. చేడుకర్ర లేక చేడుబద్దకు చివరకట్టిన దారం. **చేడుకట్టెముల్లు** వి. చేడుముల్లు, నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టడానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపుముక్క. **చేడుకర్ర** రూ.చూ. చెముడుకర్ర. వి. దోనె ముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర. **చేడుకొక్కు** వి. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి అంచుచివర గుచ్చే సన్నటి లోహపుముక్క, చేడుముల్లు. **చేడుగుది** రూ.చూ. చెముడు గుది. వి. చేడుకర్ర లేక చేడుబద్దకు చివర కట్టిన దారం. **చేడుదబ్బ** వి. చేడుబద్దలు రెండూ కలిపి బిగించిన రేకు. **చేడుదుబద్ద** రూ.చూ. చెముడు దబ్బ. వి. దోనెముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, పైపైపు బిర్రుపెట్టే కొయ్య బద్ద. **చేడుతాడు** రూ.చూ. చెముడుతాడు. వి. చేడుకర్రకు లేదా చేడుబద్దకు చివర కట్టిన దారం. **చేడుదారం** రూ.చూ. చెముడుదారం. వి. నేతబట్టమీద చేడుకర్రల్ని అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం. **చేడుపలక** రూ.చూ. చెముడు పలక. వి. దోనెముందర నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా పైపైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క. **చేడుపలుకు** వి. చేడుకర్ర లేక చేడుబద్దకు చివర కట్టిన దారం. **చేడుపలుపు** రూ.చూ. చెమిటి పలుపు. వి. చేడుక్రర లేక చేడుబద్దకు చివర కట్టిన దారం. **చేడుబద్ద** రూ.చూ. చెముడుదబ్బ. వి. దోనెముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, పైపైపు బిర్రుపెట్టే కొయ్య బద్ద. **చేడుబల్ల** రూ.చూ. చెముడుబల్ల. వి. దోనెముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా పైపైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క. **చేడుబిర్రుతాడు** వి. బొడ్డుతాడు, నేత బట్ట మీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం. **చేడుబొందు** రూ.చూ. చెముడు బొందు. వి. చేడుకర్రల బిగింపుకు, దారాలకు వేసే లోహపు చుట్టు, రింగు. **చేడుమలుపు** వి. చేడుపలుపు, చేడుబద్దకు చివర కట్టిన దారం. **చేడుములికి** వి. చేడుముల్లు, నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క. **చేడుముల్లు** రూ. చెముడుముల్లు, చెవిటి ముల్లు. వి. నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క. **చేడుమొల** వి. చేడుముల్లు, నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క. **చేడుసిలమలకతాడు** వి. చేడుపలుపు, చేడుకర్ర లేక చేడుబద్దకు చివర కట్టిన దారం.

**చేడె[1]** రూ.చూ. చేడియ. వి. **1.** స్త్రీ, ఆడది. భీమ. 1.4 ; **2.** భార్య.

**చేడె[2]** వి చెరువు కట్టలకు కలిగిన బొక్క, గండి.

**చేడెకొట్టు** రూ. చాడగొట్టు, సేడగొట్టు. అ.క్రి. వెళ్ళిపోవు, మట్టిపాకం లోపంవల్లగాని కాల్పు లోపంవల్లగాని ఆము కాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

**చేడ్పడు** చూ. చేటు.

**చేడ్పాటు** చూ. చేటు.

**చేడ్వడు** చూ. చేటు.

**చేణిక** వి. వెడల్పు అంచుతో గుంటగా ఉండే మూకుడు.

**-చేత[1]** యా. -చే[2]. ప్ర.ద్రు. తృతీయా విభక్తి ప్రత్యయం, ఇది కర్తృ, కరణాద్యర్థాల్లో ఉపయోగించ బడుతుంది. ఉదా. **1.** కర్త్రర్థంలో వచ్చే ప్రత్యయం. భార. ఆది. 6.34, కు.సం. 12.149 ; **2.** గ్రహ్యాది యోగజమైన పంచమిలో వచ్చే ప్రత్యయం. హరి.ఉ. 2.122 ; **3.** కరణార్థంలో వచ్చే ప్రత్యయం. హరి.ఉ. 4.210.

**చేత[2]** చూ. చేయు. రూ.చూ. చేంత. వి. తయారీ, చేసే తీరు.

**చేతకత్తె** రూ.చూ. చేంతకత్తె. వి. చెలికత్తె. **చేతగట్టు** రూ.చూ. చేంతగట్టు. వి. కృతకాద్రి. **చేతలపాలు** రూ.చూ. చేతరపాలు. వి. చిరకపొత్తు, ఆసామి అరకతోనే సాగుచేసి

రైతు పంటలో ఒక భాగం పంచుకునే పద్ధతి, రెక్కల కష్టానికి మాత్రమే పొందే ఫలభాగం.
**చేతగానిమాటలు** చూ. చేయి.
**చేతగుండెకాయయిడు** చూ. చేయి.
**చేతనగు** చూ. చేయి.
**చేతనఁబ్రాలు** రూ. చేతన్నఁబ్రాలు. వి.బ.వ. తలంబ్రాలు. వాల్మీ. 1.70.
**చేతనయినట్లుచెప్పు** చూ. చేయి.
**చేతనించు** చూ. చేయి.
**చేతఁదీఱకుండు** చూ. చేయి.
**చేతఁదీఱు** చూ. చేయి.
**చేతన్నఁబ్రాలు** రూ.చూ. చేతనఁబ్రాలు. వి.బ.వ. తలంబ్రాలు.
**చేతబడి** చూ. చేయి. వి. చేతడి, చాతబడి.
**చేతంబోవు** చూ. చేయి.
**చేతఁబట్టు** చూ. చేయి.
**చేతరపాలు** రూ. చేతలపాలు. వి. చిరకపొత్తు, ఆసామి అరకతోనే సాగుచేసి, రైతు పంటలో ఒకభాగం పంచుకొనే పద్ధతి, రెక్కల కష్టానికి మాత్రమే పొందే పంటలో భాగం.
**చేతరాసి** రూ.చూ. చేతరాసి. వి. ఝురసి, చాదరాసి కూర.
**చేతరికముచేయు** అ.క్రి. కీడుచేయు.
**చేతరించు** అ.క్రి. చైతన్యం కలదగు. కు.సం. 5.66.
క. చేతరిసు.
**చేతలపాలు** రూ.చూ. చేతరపాలు. వి. చిరకపొత్తు.
**చేతాడు** చూ. చేద.
**చేతాతొట్టి** వి. వాటసట్టి, కుండలు వానేటప్పుడు సారె ఏక్కన నీళ్ళు పెట్టుకొనే మట్టి పాత్ర.
**చేతానికట్టె** వి. జేబందు (చెక్కు), పొడుగ్గా సన్నగా ఉండే కొయ్య తాపి.
**చేతిఅద్దకం** చూ. చేయి.
**చేతిఆను** చూ. చేయి.
**చేతిఆనుమాను** చూ. చేయి.
**చేతిక** వి. బౌద్ధమత శాఖ.
**చేతికట్ట** చూ. చేయి.
**చేతికబ్బు** చూ. చేయి.
**చేతికర్ర** చూ. చేయి.
**చేతికాయ** చూ. చేదు[1].
**చేతికిఅందివచ్చు** చూ. చేయి.
**చేతికిఎముకలేకపోవు** చూ. చేయి.
**చేతికిచిప్పయిచ్చు** చూ. చేయి.
**చేతికిచెయ్యినష్టం** చూ. చేయి.
**చేతికిలోనగు** చూ. చేయి.
**చేతికివచ్చు** చూ. చేయి.
**చేతికీలుబొమ్మ** చూ. చేయి.
**చేతికుంచె** చూ. చేయి.
**చేతికొమ్ము** చూ. చేయి.
**చేతికొయ్య** చూ. చేయి.
**చేతిక్రింద** చూ. చేయి.
**చేతిగరలుకనబడు** చూ. చేయి.
**చేతిగుడ్డ** చూ. చేయి.
**చేతిగుండు** చూ. చేయి.
**చేతిగూటం** చూ. చేయి.
**చేతిగోడ** చూ. చేయి.
**చేతిచమురు** చూ. చేయి.
**చేతిచమురుభాగవతము** చూ. చేయి.
**చేతిచిలుమువదలు** చూ. చేయి.
**చేతిచెక్క** చూ. చేయి.
**చేతిజంత్రం** చూ. చేయి.
**చేతిజముదాని** చూ. చేయి.
**చేతిజల్లెడ** చూ. చేయి.
**చేతిడి** చూ. చేయి.
**చేతితడాఖు** చూ. చేయి.
**చేతితేటమాన్పు** చూ. చేయి.
**చేతినాడె** చూ. చేయి.
**చేతినిమ్మపండు** చూ. చేయి.
**చేతిపట్టె** చూ. చేయి.
**చేతిపంటె** చూ. చేయి.
**చేతిపని** చూ. చేయి.
**చేతిపలక** చూ. చేయి.
**చేతిపార** చూ. చేయి.
**చేతిపారువ** చూ. చేయి.
**చేతిపిడి** చూ. చేయి.
**చేతిపీట** చూ. చేయి.
**చేతిపూత** చూ. చేయి.
**చేతిపెంకు** చూ. చేయి.
**చేతిబంగారం** చూ. చేయి.
**చేతిబదులు** చూ. చేయి.
**చేతిబరువుకనుఁగొను** చూ. చేయి.
**చేతిబిడ్డ** చూ. చేయి.
**చేతిబీర** చూ. చేదు[1].
**చేతిబొమ్మ** చూ. చేయి.
**చేతిమగ్గం** చూ. చేయి.
**చేతిమీఁదుగా** చూ. చేయి.
**చేతిమొద్దు** చూ. చేయి.
**చేతియ** రూ.చూ. చేదియ. వి. బౌద్ధ స్తూపం.
**చేతియదరుప్రేఁతలు** చూ. చేయి.
**చేతియద్దము** చూ. చేయి.
**చేతియప్ప** చూ. చేయి.
**చేతిరాట్నం** చూ. చేయి.
**చేతిరూపురిక్క** చూ. చేయి.
**చేతిలాడె** చూ. చేయి.
**చేతిలోఉండు** చూ. చేయి.
**చేతిలోచేయివేయు** చూ. చేయి.
**చేతిలోతేమ** చూ. చేయి.
**చేతిలోనిది** చూ. చేయి.
**చేతిలోనివాఁడు** చూ. చేయి.

**చొర(గొట్టు** చూ. చొచ్చు. రూ. జొరగొట్టు, జొ(్రగొట్టు. స.క్రి. చొప్పించు, చొచ్చుకొని పోయేటట్లు చేయు.

**చొరచొర** చూ. చొచ్చు. క్రి.విణ. ద్రు. అతివేగంగా.

**చొర(జోటులేకుండు** చూ. చొచ్చు.

**చొరపో(త** వి. నిరంతరమైన పోత, ఎడతెరిపిలేని పోత.

**చొరమాను** వి. మోట ఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి మొద్దు.

**చొర(బడు** చూ. చొచ్చు.

**చొర(బాఱు** చూ. చొచ్చు.

**చొర(బెట్టు** చూ. చొచ్చు.

**చొరవ**[1] చూ. చొచ్చు. వి. **1.** ప్రవేశం. భార. ఉద్యో. 4.376 ; **2.** బుద్ధికుశలత. భార. శాంతి. 6.187 ; **3.** రుచి. భాగ. 10 పూ. 73 ; **4.** సాహసం. వైజ. 3.97 ; **5.** ఖాళీ ప్రదేశం ; **6.** ధైర్యం.

**చొరవకత్తియ** రూ. చొరవకత్తె. వి. చొరవగల స్త్రీ. **చొరవకత్తె** రూ.చూ. చొరవకత్తియ. వి. చొరవగల స్త్రీ. **చొరవకా(డు** వి. **1.** సాహసి. ఆము. 4.61 ; **2.** ప్రవేశించేవాడు. చంద్రాంగ. 4.61. **చొరవచేయు** అ.క్రి. సాహసించు, తెగించు. **చొరవలుచేయు** అ.క్రి. తెగించు, సాహసించు.

**చొరవ**[2] రూ. చొరె. వి. మోట ఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ లేదా మొద్దు.

**చొరవరాయి** వి. మోట ఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ.

**చొరవడ** చూ. చొరవ[1]. వి. చొరవ, సాహసం.

**చొరవడి**[1] చూ. చొరవ[1]. వి. చొరవ, సాహసం.

**చొరవడి**[2] వి. ఒక రకం మోటుబండి.

**చొరవేయు** చూ. చొచ్చు.

**చొరిగాడు** చూ. చొచ్చు. వి. వేటగాడు.

**చొరియ** రూ.చూ. చటి. వి చరియ, ఏటవాలుగా ఉండే కొండ గట్టు.

**చొరు** అ.క్రి. ప్రవేశించు.

**చొరుగు** రూ.చూ. చొరువు. వి. **1.** ఎండిన ఆకు, చొక్కాకు. జైమిని భా. 5.83 ; **2.** బీరువా మొ. వాని అర. విణ. ఎండిన.

**చొరుదల** చూ. చొచ్చు.

**చొరువాకు** చూ. చొరువు.

**చొరువు** రూ. చొరుగు. వి. చొక్కాకు, ఎండిన ఆకు. భార. ద్రోణ. 1.264. విణ. ఎండిన, శుష్కించిన. కళా. 6.254.

**చొరువాకు** రూ.చూ. చొరువుటాకు. వి. ఎండిన ఆకు, చొక్కాకు. < చొరువు + ఆకు. **చొరువుటాకు** రూ. చొరువాకు. వి. ఎండిన ఆకు, చొక్కాకు. నిర్వ.రా. 3.32. < చొరువు + ఆకు.

**చొరె** రూ.చూ. చొరవ[2]. వి. మోట ఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ లేదా మొద్దు.

**చొఱ**[1] రూ.చూ. చోఱ[1]. వి. రాజీవం, కూరవండుకొనే ఒక చేప. భాస్క.రా.యు. 987.

**చొఱ**[2] రూ. చొర, చోఱ[2]. వి. బాలుడు, పిల్లవాడు. రం.రా. సుందర.

**చొఱవా(డు** రూ.చూ. చోఱవా(డు. వి. పిల్లవాడు.

**చొఱచొఱ** రూ. జొఱజొఱ. వి. నెత్తురు కారటం, నిప్పు రాలటం మొ. వాటికి అనుకరణం. హరి.ఉ. 10.175. ధ్వన్యను.

**చొఱిగా(డు** వి. **1.** బోయ. ఉ.హరి. 4.29. ; **2.** బెస్త ; **3.** చెంచు.

**చొఱ్ఱ** రూ.చూ. చోఱ[1]. వి. రాజీవం, కూరవండుకొనే ఒక చేప. పారి. 2.99.

**చొలచు** చూ. చొలయు. స.క్రి. బాధించు. దశకు. 2.73.

**చొలయు** రూ. సొలయు. అ.క్రి. **1.** జంకు, వెనుదీయు. భార. ఆది. 5.131 ; **2.** మూర్ఛపోవు ; **3.** వైముఖ్యాన్ని పొందు.

క. సోర్. సడలు, క్షీణించు ; జోల్. సడలు, వదులు ; సోలు. అవియు ; కొడ. చొల్. మూర్ఛిల్లు, తూలు ; త. చోర్ (వ్-న్త్-). ఒరగు, తూగు, వణుకు, కృశించు, క్షీణించు, సడలు, మూర్ఛిల్లు, సొమ్మసిల్లు ; చొరవు. బలహీనత, అశ్రద్ధ, క్షీణించు ; మ. చోరుక. జారు, కిందపడు ; కో. చొవ్ (చొల్). అలియు.

**చొలా** రూ.చూ. చోలా. వి. కంచుకం, చొక్కా.

**చొలిమిడి** వి. చిర్రికూర, ఒక రకం కూర.

**చొల్లాయిమాటలు** చూ. చొల్లు.

**చొల్లు** రూ. చొళ్ళు, జొల్లు. వి. చొంగ, లాల. కాశీ. 5.68.

క. జొల్లు. చొంగ, లాల ; త. చొళ్ళు. చొంగ ; చాలై. నోటిలో ఊరు లాల, చొంగ ; కో. జొల్. చొంగ ; కుఇ. డెయి, చొంగ ; మాల్తో. తుల్లైపె. చొంగ.

**చొల్లాయిమాటలు** వి.బ.వ. ఎగతాళి, అసూయ కలిసిన మాటలు. **చొల్లుకబుర్లు** రూ. చొళ్లకబుర్లు. వి.బ.వ. పనికి మాలిన మాటలు. **చొల్లుమాటలు** రూ. చొళ్లమాటలు. వి.బ.వ. పనికిమాలిన మాటలు. **చొల్లువాఱుడుమాటలు** వి.బ.వ. సొల్లు కబుర్లు, వ్యర్థ ప్రలాపాలు. బసవ. 6.171.

**చొళ్లియము** రూ.చూ. చొళ్లెము. వి. జడతో చుట్టిన చుట్ట. కాశీ. 2.146.

**చొళ్లు** రూ.చూ. చొల్లు. వి. చొంగ, లాల.

**చొళ్లకబుర్లు** రూ.చూ. చొల్లుకబుర్లు. వి.బ.వ. పనికి మాలిన మాటలు. **చొళ్లమాటలు** రూ.చూ. చొల్లుమాటలు. వి.బ.వ. పనికి మాలిన మాటలు.

**చొళ్లెము** రూ. చొళ్లియము, జొళ్లెము. వి. జడతో చుట్టిన చుట్ట. ఉ.హరి. 1.58, హర. 5.5.

సం. చూలక-. జుట్టు ; ప్రా. చోల్లయ-. సంచి, గోనె ; చోలఅం-. కవచం ; చూరా. కేశశిఖ.

క. చొళ్ళెయ.

< ప్రా. చోల్లయ-.

**చో** ప్రత్య.ద్రు. **1.** సమయంలో. భార. ఆది. 2.18 ; **2.** హేత్వర్థకం. భార. ఆది. 6.107 ; **3.** చేదర్థకం, పక్షంలో. కు.సం. 3.88 ; **4.** ఏని, అప్పటికి. ఉ.రా. 1.34. అవ్య.ద్రు. (అచ్చోటన్, ఇచ్చోటన్ మొ. సమాసాల్లో ఉత్తరపదమైన 'చోటు' శబ్దానికి సప్తమ్యేక వచనాంతమైన 'చోటన్' యొక్క లుప్తశేష రూపం). **1.** స్థలంలో,

ప్రదేశంలో. భార. ఆది. 3.140 ; **2.** వైపున, వైపునకు. కాశీ. 1.138 ; **3.** ఎడల. ఆము. 4.102.

**చోకు** స.క్రి. ఉక్కిరి బిక్కిరి చేయు, అడ్డగించు, మూసివేయు. ఇం. *Choke*. అడ్డగించు.

< ఇం. Choke.

**చోగ** రూ.చూ. చొక్కా². వి. వస్త్ర విశేషం.

**చోఁకు** రూ. సోఁకు. స.క్రి. **1.** తాకు. కు.సం. 5.610 ; **2.** (గ్రహపీడా కోపాదులు) ఆవేశించు, ఆవహించు. భాస్క. రా. బాల. 2.12. వి. **1.** స్పర్శం, తాకుడు. భార. విరా. 2.238 ; **2.** దెబ్బ. భాస్క.రా.యు. 191. అ.క్రి. తగులు. భార. విరా. 5.385.

క. సోకు, సొక్కు. సొంకు, సుంకు, తాకు, స్పృశించు, పట్టుకొను, తగులుకొను, పైబడు ; సొంకువికె, సొగసు. తాకటం ; తు. సోకుని, సోయెని, సోంకు(సుని, సోంగుని. వ్యాధివలె పీడించు, తగులు, తాకు ; సోఁకు. అంటువ్యాధి ; త. చోకు. భూతం, దెయ్యం, పిశాచం ; మ. చోకు. దెయ్యం ; గోం. సోకానా. పూయు, పులుము, రాయు ; పర్జి. చొక్క్. (గ్రహపీడాదులు) కలిగి ఉండు, పొంది ఉండు.

**చోటిచ్చు** చూ. చోటు.

**చోటీరాయి** రూ.చూ. చొటీరాయి. వి. రాతిలో కట్టిన ఆర్చి మధ్యలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

**చోటు** వి. బొ. **1.** తరి, సమయం. భార. ఆరణ్య. 2.140 ; **2.** స్థానం, తావు, ప్రదేశం. కు.సం. 3.38 ; **3** విషయం. భార. శాంతి. 5.614 ; **4.** ఆశ్రయం, ప్రాపు. విక్ర. 1.111 ; **5.** అవకాశం, సందు. కకుత్స్థ. 2.82 ; **6.** ఉనికిపట్టు, నివాస స్థానం. ఉ.రా. 5.140.

**చోటిచ్చు** అ.క్రి. **1.** అవకాశమిచ్చు. కళా. 4.43 ; **2.** ఆశ్రయ మిచ్చు. **చోటుచేయు** అ.క్రి. స్థానమిచ్చు. శాఖ. నం. 4.157. **చోటుచేసికొను** అ.క్రి. ఆశ్రయ మేర్పరుచుకొను.

**చోడమేక** వి. పొట్టిమేక, కంచిమేక.

**చోడలు** వి.బ.వ. ఆహార ధాన్యం. దీని కాడలు, ఆకులు పశువుల ఆహారం (Eleusine cercana).

**చోడి**[1] వి. సస్యవిశేషం, మెట్టనేలల్లో సాగుచేయబడే ఒక పంట. విష్ణు పు. 4.273.

**చోడిఅంబలి** వి. చోడిపిండితో కాచిన గంజి. **చోడిసున్ని** వి. చోడిపిండి. చెన్న బసవ. 2.73. **చోళ్లు** వి.బ.వ. రాగులు.

**చోడి**[2] వి. దొంగతనం చేసే స్త్రీ, రంకుటాలు. విశ్వే.శ. 53.

హిం. చోరీ. దొంగతనం ; ఉ. చోరీ. దొంగతనం.

< ఉ. చోరీ.

**చోడిగాడు** వి. కోణంగి, గంటాడిగాడు.

**చోదు** వి. బ్రహ్మ రంధ్రం. విక్ర. 1.

**చోదుమ** వి. కష్టం. ఆం.భా. 1.150.

**చోదుముట్టు** రూ. సోదుముట్టు. అ.క్రి. వ్యాపించు. ద్వి.పరమ. 4.341 పు.

**చోద** వి. **1.** కష్టం. వేంక. పంచ. 1.382 ; **2.** దుష్కృత్యం. అహల్యా. 3.24.

**చోపా** వి. అలిందం, తలవాకిట పక్కన ఉండే గృహం.

**చోపానమగు** అ.క్రి. డస్సిపోవు, నెమ్మదిగా నడచు.

**చోపిడు** చూ. చోపు.

**చోపు** రూ. జోపు. స.క్రి. **1.** తరుము. భార. ఆది. 1.5 ; **2.** పనుచు, అంపు. కు.సం. 6.25 ; **3.** పక్షులు మొ. వానిని తోలు, పారదోలు. భార. స్త్రీ. 2.83 ; **4.** (గ్రహాదుల్ని) ఉచ్చాటనం చేయు. దశకు. 11.51 ; **5.** దొసుపు. క్రీడా. 25 ; **6.** (పైకి రావటానికి దాగి ఉన్న మృగాదుల్ని) కలచు. కకుత్స్థ. 4.98. వి. **1.** విసురు. కువ.చ. 2.5 ; **2.** దాగి ఉన్న మృగాదుల్ని వేటకాళ్ళు కలతపరచటం.

సం. క్షుభ్. క్షోభించు, కలతపడు.

**చోపిడు** స.క్రి. **1.** పారదోలు. వైజ. 3.98 ; **2.** చోపువెట్టు. చంద్రరే. 2.13 ; **3.** కలచు. < చోపు + ఇడు. **చోపుడు** వి. వేటలో మృగాదులకు కావించే కలత. **చోపుడుగట్టె** వి. **1.** చోపుడుపెట్టే కర్ర ; **2.** గ్రహోచ్చాటన చేసే మంత్రదండం. **చోపుడుగోల (-కోల)** వి. **1.** చోపుడుపెట్టే కర్ర. మను. 4.55 ; **2.** గ్రహోచ్చాటన చేసే మంత్రదండం. **చోపుడువెట్టించు (-పెట్టించు)** స.క్రి. కలచు. ఉ.రా. 7.408. **చోపుడువెట్టు (-పెట్టు)** స.క్రి. వేటకాళ్ళు దాగిఉన్న మృగాదుల్ని పైకి రావడానికి కలచు. శుక. 1.168. **చోపువెట్టు(-పెట్టు)** స.క్రి. దాగిఉన్న మృగాదులు పైకి రావటానికి వేటగాళ్ళు కలచు. మను. 4.37.

**చోపుదారు** వి. వెండిబెత్తం పట్టుకొని రాజుముందర బరాబరి చేస్తూ నడిచేవాడు. రంగా. చ. 2.16.

హిం. చోబ్‌దార్. ద్వారపాలకుడు ; మరా. చోప్‌దార్. వేత్రధారుడు ; ఉ. చోబ్‌దార్. ద్వారపాలకుడు, దండాన్ని చేత్తోపట్టుకొని ముందువెళ్ళే సేవకుడు ; పార. చోబ్‌దార్, చోబ్‌గార్. దండం చేత్తోపట్టుకొని రాజుముందర నడిచే సేవకుడు.

< ఉ. చోబ్‌దార్.

**చోర** వి. సన్నటి ముక్కలు.

**చోరీ** వి. దొంగతనం, చౌర్యం.

హిం. ఉ. చోరీ. దొంగతనం.

< ఉ. చోరీ.

**చోరుగస్తి** వి. గస్తివాళ్ళపై అధికారి.

హిం. ఉ. చోర్. దొంగ ; గశ్త్. తిరగటం.

**చోఱ**[1] రూ. చొర1, చొఱ1, చొట్ట. వి. రాజీవం, కూర వండుకొనే ఒకచేప, క్రూరమత్స్య విశేషం. భార. ద్రోణ. 4.110.

క. చొఱ. మరచేప, సొరచేప ; త. చుఱవు, చుఱ, చుఱా. మరచేప, సొరచేప ; మ. చుఱా, చిఱాకు. సొర చేప.

**చోఱబుడుత** వి. **1.** చొరచేపపిల్ల. చంద్రాంగ. 4.246 ; **2.** చేపలవంటి కన్నులుగల స్త్రీ. చంద్రాంగ. 4.347.

**చోఱమీను** వి. చొరచేప, రాజీవం.

**చోఱ**[2] రూ.చూ. చొఱ². వి. బాలుడు.

చోలవాఁడు రూ. చొఁలవాఁడు. వి. **1.** బాలుడు. ఉ.రా. 6.290 ; **2.** బాలసేవకుడు.

**చోలా** రూ. చొలా. వి. చొక్కా. ఆం.భా. 2.156.

సం. చోళ-, చోడక-. చొక్కా ; ప్రా. చోలఅ. కవచం ; చోలా. రవిక ; పా. చోళక-. గుడ్డముక్క ; అ. సోలా. చొక్కా ; బెం. చోలీ. చిన్నచొక్కా ; ఒ. చోళా, చోళీ. రవిక, చొక్కా ; పం. చోలా. కవచం ; చోలి. రవిక ; మరా. చోళా, చోళీ. రవిక.

< మరా. చోళా.

**చోళము** వి. జొన్న. బసవ. 195.

క. జోళ. జొన్నలు ; తు. జోళ. జొన్నలు ; త. చోళమ్. జొన్న, మొక్కజొన్న ; మ. చోళమ్. జొన్న, మొక్కజొన్న.

<త. చోళమ్.

**చోళమువిఱుచు** స.క్రి. జొన్నలను పేలాలుగా వేపు. ఉ.హరి. 3.71.

**చోళవాళి** చూ. చోళము. వి. జొన్నలిచ్చే నిర్ణయం. బసవ. 6.693 పం.

త. చోళణ్. జొన్నలు ; వాళి. నిర్ణయం.

<త. చోళణ్‌వాళి.

**చోళీగుడ్డ** చూ. చోలా. వి. ఆడువాళ్ళ రవికెలకోసం నేసిన బట్ట.

**చోళ్లు** చూ. చోడి[1].

**చోవా** వి. అలిందం. వసు. వ్యా. 5.65.

అ. సుప్ఫా. వరండా ; మరా. సోవా. వరండాలో భాగం.

< మరా. సోవా.

**చోవి** చూ. చోలా. వి. బూరెలు మొ. వండేటప్పుడు పూరణం పెట్టటానికి ఉపయోగించే పలచని పిండి.

**చౌ** రూ.చూ. చవు-. విశ. **1.** చతురస్రమయిన ; **2.** నాలుగు.

**చౌకటులు** రూ.చూ. చవుకట్టులు. వి.బ.వ. **1.** ముత్యాలు మొదలైనవి నాల్గు చేర్చి కట్టిన పోగులు, కర్ణాభరణ విశేషం. నీలా. 2.50 ; **2.** దోరణపు పట్టెమీద కపిలెబిల్లకు ఆధారంగా రెండువైపుల అమర్చిన గుజ్జులు. **చౌకట్టుపోగులు** వి.బ.వ. ముత్యాలు మొదలైనవి నాలుగు చేర్చి కట్టిన పోగులు, కర్ణాభరణ విశేషం. యయా. 4.94. **చౌకట్టులు** రూ.చూ. చవుకట్టులు. వి.బ.వ. **1.** ముత్యాలు మొ. నాలుగు చేర్చి కట్టిన పోగులు, కర్ణాభరణ విశేషం. ప్రబంధ. 605 ; **2.** దోరణపు పట్టెమీద కపిలబిల్లకు ఆధారంగా రెండు వైపుల అమర్చిన గుజ్జులు. **చౌకట్లు** రూ.చూ. చవుకట్టులు. వి.బ.వ. **1.** ముత్యాలు మొ. నాలుగు చేర్చికట్టిన పోగులు, కర్ణాభరణ విశేషం. కళా. 5.113 ; **2.** దోరణపు పట్టెమీద కపిలె బిల్లకు ఆధారంగా ఇరుపక్కలా అమర్చిన గుజ్జులు. ద్వి.సార.చ. 21 పు. 6 పం. **చౌకాఁడిగుదియ** రూ. చవుకాఁడి గుదియ. వి. నాలుగు పక్కల తీరిన ఇనపదండం. కవిక. 2.197, ఆం.భా. 2.301. **చౌకాలిపీట** రూ. చవుకాలిపీట. వి. నాలుగు కాళ్ళుగల ఎత్తుపీట. **చౌగంటి** రూ. చవుగంటి. వి. **1.** నాలుగు కన్నులు గలవాడు ; **2.** ద్విశీర్షుడు, అగ్ని దేవుడు ; **3.** శరభమృగం. **చౌడోలి** రూ. చవడోలి, చవుడోలి, చవుడోలీ, చవుడోలు, చౌదోలీ, చాడోలు. వి. ఏనుగు వీపుమీద కూర్చోడానికి అమర్చిన తొట్టి, అంబారి. రసిక. 4.98. హిం. చౌడోల్. పల్లకి. **చౌడోలీ** రూ.చూ. చౌడోలి. వి. ఏనుగుమీద కూర్చోడానికి అమర్చిన తొట్టి, అంబారి. అచ్చ. రా.యు. 205. **చౌడోలు** రూ.చూ. చౌడోలి. వి. అంబారి. పల్నా. 30. **చౌదంతి** రూ.చూ. చవుదంతి. వి. ఐరావతం. దశా. 2.229. **చౌపద** వి. పద్యవిశేషం. కవి జనా. జాతి. 32. సం. చతుష్పద్. నాలుగు పంక్తులు కలది ; ప్రా. చౌప్పఅ ; కుమా. చౌపై. జంతువు ; క. చౌపది. **చౌపదము** రూ. చవుపదము. వి. **1.** గిలకల పద్యం, గీతి విశేషం. జైమిని భా. 5.196 ; **2.** నాట్య విశేషం. **చౌపుట** రూ.చూ. చౌపుటము. వి. నాల్గుకాళ్ళతో కుప్పళించి దుముకటం. **చౌపుటము** రూ. చవుపుటము. చౌపుట. వి. నాలుగుకాళ్ళు పైకెత్తి దాటేదాటు. ఉ. హరిశ్చ. 3.131. **చౌబారభవంతి** వి. మధ్యనున్న ఖాళీస్థలానికి నాలుగు వైపులా గదులున్న ఇల్లు. **చౌభవంతి** వి. మధ్య నున్న ఖాళీస్థలానికి నాలుగువైపులా గదులున్న ఇల్లు. **చౌవంచ** రూ.చూ. చౌవంచి. వి. అయిదు. ఉ.రా. 8.295. **చౌవంచి** రూ. చవుపంచ, చవ్వంచ, చౌవంచ. వి. అయిదు. పండి.చ. 2.125. **చౌవీథి** రూ.చూ. చవువీథి. వి. శృంగాటకం, నాలుగు దారులు కలిసేచోటు, చౌకు. **చౌషష్టి** రూ. చవుషష్టి, చవుసట్టి. వి. అరవైనాలుగు, చతుష్షష్టి. రుక్మాంచ. 5.165. సం. చతుష్షష్టి-. **చౌషష్టికలావిశారదుడు** వి. అరవైనాల్గు విద్యల్లో నేర్పరి. **చౌషష్టికళలు** వి.బ.వ. అరవైనాలుగు విద్యలు. **చౌసాల** రూ.చూ. చవుసాల. వి. చుట్టుకొల్లారు, నడుమ నాలుగు పక్కలా కట్టడంగల ఇల్లు. **చౌసీతి** రూ.చూ. చవుసీతి. వి. ఎనభై నాలుగు. వైజ. 3.74. **చౌసీతిబంధములు** వి.బ.వ. ఎనభై నాలుగు రతిబంధ విశేషాలు.

**చౌక**[1] రూ. చవక, చవుక. విశ. **1.** స్వల్పమైన, నీచమైన. పండి. చ. 2.125 పు. ; **2.** అగ్గువ, వెలతక్కువైన. వి. **1.** చులకనతనం, తిరస్కారం. కుప.చ. 2.15 ; **2.** లాఘవం. సిం.ద్వా. 3.194.

క. చౌక. చౌక, చవకదనం ; త. చవుక్కై, చౌక్కమ్ ; మరా. సంవగ, సంవఘ. వెలతక్కువైనది.

**చౌకచేయు** రూ. చవుకసేయు, చౌకసేయు. స.క్రి. తక్కువ చేయు, చులకనచేయు. పి. శకు. 4.163, నిరంకు. 2.34. **చౌకనాగలి** వి. చౌకనేలలు దున్నే నాగలి. **చౌకపడు** రూ. చవుకపడు. అ.క్రి. చులకనగు, తేలికగు. మత్స్య. 1.151. **చౌకపఱుచు** రూ.చవుకపఱుచు. స.క్రి. తేలికచేయు. ఉద్భటా. 1.21. **చౌకమట్టి** రూ. చవుకమట్టి. వి. ఎఱ్ఱమట్టి కలిసినమట్టి. **చౌకయగు** అ.క్రి. చులకనగు. పాండు. 4.42. **చౌకయొనర్చు** స.క్రి. చౌకచేయు, తక్కువచేయు. శుక. 2.117. **చౌకసేయు(-చేయు)** రూ.చూ. చౌకచేయు. స.క్రి. తక్కువ చేయు, చులకనచేయు. శుక. 1.514.

**చౌక**[2] వి. చూరుపట్టుకు వాడే మెలిపెట్టిన ఆకు, ఆకుచుప్ప.

**చౌక**[3] చూ. చవుకము. వి. నాలుగోవంతు, పావు.

**చౌకంరాయి** చూ. చౌకము.

చౌకంకిస్తీ చూ. చౌకము.

చౌకంకొట్టం చూ. చౌకము.

చౌకంగడిచీర చూ. చౌకము.

చౌకట్ రూ.చూ. చౌకోట్. వి. తలుపును తగిలించే చట్రం.

చౌకట్టు రూ.చూ. చౌకోట్. వి. తలుపును తగిలించే చట్రం.

చౌకడీరిబ్బనంచు వి. నల్చదరం గళ్ళుపడేట్టు నేసిన రిబ్బను మాదిరి అంచు.

చౌకంతాపీ చూ. చౌకము.

చౌకపిల్లు చూ. చౌకము.

**చౌకము** రూ.చూ. చవుకము. వి. **1.** నాలుగు, నాలుగింటి సమూహం. పుంజీ. బసవ. 5.98 ; **2.** అశ్వగతి విశేషం. భాస్క.రా. బాల. 30 ; **3.** నలుచదరపుగడి. క్రీడా. 134 ; **4.** చతురస్రం. దశా. 6.47 ; **5.** నాలుగు. అం.భా. 2.306 ; **6.** నలుచదరంగావేసే వామిఅడుగున మొదట పరచిన గడ్డికట్టలు ; **7.** చదరంగా ఉండే తుండుగుడ్డ. విణ. చతురస్రంగా ఉన్న, నలుచదరమైన. దశా. 6.47.

**చౌకంరాయి** వి. **1.** నాలుగువైపుల మలచబడి కట్టుబడిలో వాడబడే రాయి ; **2.** పలచగా చదరంగా ఉండే చిన్న సైజు ఇటుక. **చౌకంకిస్తీ** వి. చతురస్రాకారంలో ఉండే కిస్తీ. **చౌకంకొట్టం** వి. పొడుగు, వెడల్పు సమానంగా ఉన్న నిట్రాడిల్లు. **చౌకంగడిచీర** వి. నవకోల గడిచీర, నేతలో పొడుగు, వెడల్పు సమానంగా వచ్చేట్టు నేసే గళ్ళచీర. **చౌకంతాపీ** వి. నలుచదరంగా ఉండే రేకుగల తాపీ. **చౌకపిల్లు** వి. పొడుగు, వెడల్పు సమానంగా ఉన్న నిట్రాడిల్లు. **చౌకంపొవ్వు** వి. నాలుగు పలకలుగా ఉండే బట్టీపొయ్యి. **చౌకంబండ** వి. చదరంగా నాలుగు పలకలుగా ఉన్న రాయి. **చౌకంబాయి** వి. నలుచదరంగా ఉండే చుట్టుగోడఉన్న బావి.

చౌకంపొవ్వు చూ. చౌకము.

చౌకంబండ చూ. చౌకము.

చౌకంబాయి చూ. చౌకము.

**చౌకళి** చూ. చౌ. రూ. చవుకళి. వి. **1.** ముత్యాలు మొదలైనవాటిని అమర్చిన పోగులజత. దశకు. 7.201; **2.** ఆడవారి కోకల నేతలో నూలిపోగులతో ఏర్పడిన చచ్చౌకపు గడి. శుక. 1.224.

**చౌకళించు** రూ. చవుకళించు. అ.క్రి. **1.** దుముకు. పల్నా. 115 ; **2.** ఒప్పు, శోభిల్లు. క్రీడా. 217, అప్ప. 4.227 వ. ; **3.** చలించు. వరాహ. 4.133 ; **4.** ఎగురు. వరాహ. 11.122 ; **5.** నటించు, ఆడు. ఇందు. 2.55 ; **6.** వ్యాపించు. విజయ. పీఠి. 36. స.క్రి. దాటు. ఉ.రా. 7.66. **చౌకళింత** రూ. చవుకళింత. వి. **1.** చౌకళించటం ; **2.** అశ్వగతి విశేషం, వల్గితం. **చౌకళింపు** రూ. చవుకళింపు. వి. అశ్వగతి విశేషం. అం.భా. 2.198.

చౌకానిచీర వి. నేతలో పొడుగు వెడల్పులు సమానంగా వచ్చేట్టు నేసిన గళ్ళచీర.

**చౌకారము** రూ.చూ. చవుకారము. వి. నబ్బు, వస్త్రధావన పదార్థం. అం.భా. 2.301.

**చౌకి**[1] రూ. చవుకి. వి. కంచం.

**చౌకి**[2] రూ.చూ. చౌకి[1]. వి. కాపు, కాపుకై ఏర్పడ్డస్థలం.

**చౌకి**[3] రూ.చూ. చౌకి[3]. వి. ఇటుకరాళ్ళకుప్ప.

**చౌకిటి** రూ.చూ. చౌకిడీ. వి. పొడుగు వెడల్పు సమానంగా నేసిన గడి.

**చౌకిడి** రూ.చూ. చౌకిడీ. వి. పొడుగు వెడల్పు సమానంగా నేసిన గడి.

**చౌకిడీ** రూ. చౌకిటి, చౌకిడి, చౌకిళీ. వి. పొడుగు వెడల్పు సమానంగా నేసిన గడి.

**చౌకిడీచీర** వి. పొడుగు వెడల్పులు సమానంగా వచ్చేట్టు నేసిన గళ్ళచీర. **చౌకిడీతీగె** వి. నేతలో గళ్ళు, తీగెలు పడేట్టు నేసిన డిజైను. **చౌకిడీతీగెబుగిడి** వి. అంచులో చిన్న గడి, తీగ, బుగిడి వరసగా పడేట్టు నేసిన డిజైను. **చౌకిడీ రుమాలు** వి. ఒకరకం తలపాగ.

**చౌకిళీ** రూ.చూ. చౌకిడీ. వి. పొడుగు వెడల్పు సమానంగా నేసిన గడి.

**చౌకీ**[1] రూ. చవుకీ[1], చౌకి[2]. వి. **1.** సుంకరిమెట్టు, పన్నుపుచ్చుకొనే చోటు ; **2.** నాలుగు వీథులు కలిపే చోటు ; **3.** రక్షకభటుడు.

సం. చతుష్క- ; ప్రా. చఉక్క- ; ఒ. చౌకి-. నాలుగు దార్లు కలిసేచోట రక్షకభటుడుండే స్థలం ; హిం. చౌకీ. చతుష్కం, నాలుగుదార్లు కలిసే చోటు ; గు. చౌకీ. రక్షణం, కాపలా, రక్షకభటద్వయం ; మరా. చౌకీ. ఎత్తైన గద్దె. సుంకాలు వసూలుచేసే స్థలం.

< మరా. చౌకీ.

**చౌకీ**[2] రూ. చవుకీ[2]. వి. దండ, మాల. వరాహ. 9.88.

**చౌకీ**[3] రూ. చౌకి[3]. వి. బట్టీమీదకి మోసుకుపోవడానికి వీలుగా ఒకటి అడ్డం, ఒకటి నిలువుగా ఇటికలను పేర్చిన పేర్పు.

**చౌకు** రూ.చూ. చుకు. వి. **1.** చేరుకోల, తగటు, కళ. కువ.చ. 1.39 ; **2.** నీటతడిసి మెత్తగిలిపోవటం.

**చౌకుచెట్టు** రూ.చూ. చవుకుచెట్టు. వి. ఒకానొకచెట్టు.

**చౌకురాయి** వి. చదరంగా నాలుగు పలకలుగా ఉన్న రాయి.

**చౌకోట్** రూ. చౌకట్, చౌకట్టు, చౌకోటు, శౌకోట్. వి. తలుపును తగిలించే చట్రం.

**చౌకోటు** రూ.చూ. చౌకోట్. వి. ద్వారబంధపు నిలువుకమ్మి.

**చౌగియ** వి. రాజచిహ్నం చివర కలిగిఉండే దండం. తపతీ. 1.13.

హిం. చౌగాన్. కర్రతో బంతినికొట్టు, ఒకవిధమైన ఆట, నగారా వాయించటానికుపయోగించే దండం ; ఉ. చౌగాన్, చౌగాం. గుర్రంమీదనుండి కర్రతో ఆడే ఒక విధమైన ఆట ; పార. చౌగాన్. చివర వంగిఉన్న కర్ర.

< ఉ. చౌగాన్.

**చౌట** రూ. చవుట. వి. పెంపుడుచిలక ఉండే పంజరం. భార. ఆను. 3.181.

**చౌటకరి** రూ.చూ. చవుటక్రి. వి. కపిలవన్నె.

**చౌటకరె** రూ.చూ. చవుటక్రి. వి. కపిలవన్నె.

**చౌటక్రె** రూ.చూ. చవుటక్రి. వి. కపిలవన్నె.

**చౌటకొమ్మ** వి. శశశృంగం, కుందేటికొమ్ము, అసంభవమైన విషయం.

**చౌటవరి** చూ. చౌడు.

**చౌటిపడియలు** చూ. చౌడు.

**చౌటిపడె** చూ. చౌడు.

**చౌటీరాయి** రూ. చోటీరాయి. వి. రాతితోకట్టిన ఆర్చి మధ్యలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

హిం.ఉ. చౌడా. వెడల్పైన.

<ఉ. చౌడా+రాయి.

**చౌటుప్పు** చూ. చౌడు.

**చౌడు** రూ. చవుడు, సౌడు. వి.ఔ. 1. చౌటినేల. భార.అను. 3.181 ; 2. చౌటిమన్ను, ఊసరమృత్తిక. విప్ర. 2.18 ; 3. బిరుసుగాఉండే ఉప్పునేల ; 4. నూలును చలవచెయ్యటానికి సున్నంతోపాటు ఉడకబెట్టే పదార్థ విశేషం.

క. చవుళు, సవుళు, సవళు. ఉప్పుదనం ; తు. చవులు, చవుళు. ఉప్పన ; త. చవటు. చౌటినేల, నీరు మొ. వాటిలో అడుగున చేరినమురికి ; చవర్. ఉప్పదనం.

**చౌటవరి** రూ. చవుటవరి. వి. ఒకజాతి వడ్లు. ప్రబంధ. 112. **చౌటిపడియలు** వి.బ.వ. చౌటినేలల్లోని చెలములు. బసవ. 7.181. **చౌటిపడె** వి. ఉప్పునీళ్ళు నిలిచిన చిన్న పల్లం. పల్నా. 106. **చౌటుప్పు** రూ. చవుటుప్పు. వి. రోమకం, లవణభేదం, బిడవలవణం. ఆం.భా. 2.249. <చౌడు+ఉప్పు. **చౌడుమిద్దె** వి. చౌడుమట్టి కప్పున్న మిద్దె.

**చౌతఇనాం** వి. నాలుగోవంతు పన్ను మాత్రం కట్టేటట్లు తీర్మానించి చాకలి, మంగలి మొ. వృత్తులవారికిచ్చిన ఇనాం.

హిం. చౌథా. నాల్గో.

**చౌతా** రూ.చూ. చవుతా. వి. డోలి, చిన్నపల్లకి.

**చౌతాయీ** రూ. చవుదాయి, చౌదాయి, చౌధాయీ. వి. పన్నులో నాలుగోవంతు.

ఒ. చౌథాఈ. నాల్గోభాగం ; హిం. చౌథాఈ ; గు. చౌథాఈ ; మరా. చౌథాఈ ; ఉ. చౌథాఈ.

<ఉ. చౌథాఈ.

**చౌతి** రూ.చూ. చవుతి. వి. పక్షంలో నాలుగో తిథి.

**చౌతు** రూ. చవుతు[1]. వి. ఒకవిధమైన కుళ్ళాయి. ఆము. 6.80.

**చౌదరి** రూ. చవుదరి, చౌదరు, చౌదురు, సవుదురి. వి. 1. పరగణాకుగాని, గ్రామానికిగాని పెత్తనకాడుగా ఉండే కాపు. ఉ.హరిశ్చ. 4.23 ; 2. అధికారి. వేణు.శ. 38 ; 3. బిరుదువాచకం ; 4. పెద్దసెట్టి, కుమ్మరి కులపెద్ద ; 5. ఆంధ్ర దేశంలో కమ్మవారి నామాంతాల్లో ఈ పదం వాడుకలో ఉంది.

బెం. చౌధరీ ; ఒ. చౌధురీ. పర్యవేక్షకుడు ; గు. చౌధ్రీ. మండలానికి అధికారి ; మరా. చౌధరీ. గ్రామాధికారి, పర్యవేక్షకుడు, మండలాధికారి ; పార. చఉద్ధఅర

<మరా. చౌధరీ.

**చౌదరితనము** రూ. చవుదరితనము. వి. అధికారం, గొప్పతనం. శుక. 2.414.

**చౌదరు** రూ.చూ. చౌదరి. వి. బిరుదనామం.

**చౌదాయి** రూ.చూ. చౌతాయీ. వి. పన్నులో నాల్గోవంతు.

**చౌదురు** రూ.చూ. చౌదరి. వి. బిరుదునామం.

**చౌధాయీ** రూ.చూ. చౌతాయీ. వి. పన్నులో నాల్గోవంతు.

**చౌని** వి. దండు విడిసిన చోటు.

**చౌరసం** వి. ఇటికతో కట్టిన గోడ.

**చౌరు** రూ.చూ. చవురు. వి. 1. లొట్ట ; 2. తీపితో కలిపిన ఉప్పు ; 3. రసం, రుచి ; 4. చవుడు.

**చౌరుకొట్టు** రూ. చౌరుగొట్టు. అ.క్రి. లొట్టలువేయు, లొట్టలువేస్తూ నములు. ఆము. 2.73. **చౌరుగొట్టు(-కొట్టు)** రూ.చూ. చౌరుకొట్టు. అ.క్రి. లొట్టలువేయు, లొట్టలువేస్తూ నములు. అష్టమ.క. 2.82 పు. 19 పం.

**చౌలము** రూ. చవులము. వి. అర్ధరూపాయి. ఆం.భా. 2.273.

**చౌలు**[1] చూ. చెవి. వి.బ.వ. చెవులు. పార్వ. 4.104.

**చౌలు**[2] రూ.చూ. చవులు. వి.బ.వ. ముత్యం, కాంతి.

# ఛ

**ఛ** వి. తాలవ్యమహాప్రాణ శ్వాస స్పర్శ వర్ణం.

**ఛటఛట** వి. పేలడంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కు.సం. 6.143. ధ్వన్యను.

**ఛటచ్ఛటా** వి. గుర్దటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. భార.ఆరణ్య. 3.395. ధ్వన్యను.

**ఛడావు** వి. హెచ్చు.

హిం.ఉ. చఢావ్. ఆక్రమణ, పైకి ఎక్కటం.

< ఉ. చఢావ్.

**ఛడి** రూ. ఛెడి. వి. బెత్తం.

మరా. ఛడీ. బెత్తం.

<మరా. ఛడీ.

**ఛడేలుమనిపించు** స.క్రి. చెళ్ళున కొట్టు.

**ఛత్రీపుల్ల** వి. పెంకుకోతకు వాడే మొనగల సాధనం.

**ఛప్ప** చూ. చప్పు[3]. విశే. రుచిలేని, నిర్జీవమైన.

**ఛప్పన్న** రూ. చప్పన్న, చెప్పన్న, షట్పన్న. వి. యాభైఆరు. అని.చ. 5.11.

హిం. ఛప్పన్. ఏభైఆరు ; మరా. ఛప్పన్. ఏభైఆరు.

<మరా. చప్పన్

**ఛప్పా**[1] రూ. చప్పు[1]. వి. ముద్ర. విశ్వే.శ. 57.

హిం. ఛాపా. ముద్ర, రాత్రులందు చేసే ఆకస్మిక దండయాత్ర; ఉ.మరా. ఛప్పా. ముద్ర, ఆకస్మిక దండయాత్ర; ఉ. ఛాపా. ముద్ర, ఆక్రమణం.

<ఉ. ఛాపా.

**ఛప్పా**[2] చూ. చప్పు[3]. విశ. రుచిలేని, నిస్సారమైన.

**ఛత్రమేకాహునర్** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**ఛాందసము** వి. 1. వేదజడత్వం, లోకజ్ఞానం లేకపోవటం. ఆము. 5.157; 2. వేదజడులు చెప్పేమాట. దశా. 3.66.

సం. ఛాందస-. వేద సంబంధమైనది, ఛందస్సంబంధమైనది.

<సం. ఛాందస- (అర్థవిపరి.).

**ఛాందసు(డు** వి. వేదజడుడు, లోకజ్ఞానం లేనివాడు. పాండు. 1.115.

సం. ఛాందస-. శ్రోత్రియుడు, వేదం చదివినవాడు.

<సం. ఛాందస- (అర్థవిపరి.).

**ఛాన్సు** వి. అవకాశం, అదృష్టం, దైవికం.

ఇం. *Chance*. అవకాశం.

<ఇం. Chance.

**ఛాపాఖానా** వి. ముద్రణాలయం.

హిం.ఉ. ఛాపాఖానా. ముద్రణాలయం.

<ఉ. ఛాపాఖానా.

**ఛాపా** వి. ఆకస్మికంగా చేసే ముట్టడి.

హిం.ఉ. ఛాపా. ముద్ర; ఛాపామార్నా. ముట్టడి చేయటం.

**ఛాలా** రూ.చూ. చాల. వి. అతి మిక్కిలి.

**ఛావణి** వి. సేనలు విడిదిచేసే చోటు.

**ఛెడి** రూ.చూ. ఛడి. వి. 1. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; 2. పంటిమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకర్ర; 3. రంగునీళ్ళు అందాలో ఉడకబెట్టడానికి నూలు లడీలు తగిలించిన ఇనపఊచ; 4. తివాసీ నేసేటప్పుడు పైదోనెకు ఇవతల పయుగు అనిలో దూర్చిన చువ్వ.

**ఛెడేగోలు** చూ. ఛడి. రూ. చిడిగోలు. వి. గర్తలుండేటట్లు తీసిన గోలు.

**ఛెత్తు** వి. ఇంటిమీది మూత.

**ఛెద్దర్** రూ.చూ. చాదర. వి. పక్కమీద పరచుకొనే ఒకరకం దుప్పటి.

**ఛెన్నీ** వి. రాళ్ళమీద గీతలుగీసే సన్నటి మొనదేలిన సాధనం.

**ఛెపాన్** వి. చివరలు మందంగా మధ్య గుంటగాఉండే చెక్కడం పని.

**ఛెపాన్‌దర్వాజా** వి. పైపట్టికి, కిందపట్టికి పరదాలు తీసిన ద్వారబంధం.

**ఛేరు** వి. కుర్చీ, అధికార పీఠం.

ఇం. *Chair*. కుర్చీ.

<ఇం. Chair.

**ఛేర్మన్** వి. అగ్రాసనాధిపతి, అధ్యక్షుడు.

ఇం. *Chairman*. అగ్రాసనాధిపతి.

<ఇం. Chairman.

# జ

**జ**[1] వి. ఇ, ఈ, ఎ, ఏ లతో కూడినప్పుడు తాలవ్య స్పృష్టోష్మమైన అల్ప ప్రాణ నాదంగానూ, ఇతరాచ్చులతో కూడినప్పుడు దంత్య స్పృష్టోష్మమైన అల్ప ప్రాణ నాదంగానూ ఉచ్చరించబడుతుంది. దంత్యతాలవ్యాలైన ఇట్టి 'జ' వర్ణాలు సవర్ణాలు.

**జ**[2] వి. జనానికి సాంకేతికాక్షరం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 26. క్రీ.శ. 1412.

**జ**[3] వి. జంగాలనటానికి సాంకేతికాక్షరం. కందుకూరు శాసనం. క్రీ.శ. 1614.

**జకాతి** వి. మూటిపన్ను, పొరుగూరి బళ్ళనుంచి వసూలుచేసే పన్ను.

మరా. జకాత్. విదేశవస్తువులమీద వేసే పన్ను; అర. ఝకాత్.

<మరా. జకాత్.

**జకేరా** రూ. జఖేరా. వి. 1. కుప్ప; 2. కొటారు.

హిం. జఖీరా. సమూహం, పోగు; మరా. జకీరా. ఖజానా; ఉ. జఖీరహ్. పోగుచేయటం; పార. జఖీరహ్, జఖీదత్. ఖజానా, సామానుగది; అర. జఖీరహ్. పోగుచేయటం; ఖజానా. గోదాం. భవిష్యదుపయోగానికి దాచి ఉంచటం; ఝుకిరా, ఝుఖీరా. గుంపు. పోగు.

క. జకేరె.

<మరా. జకీరా.

**జక్కర** వి. నది, ఏరు, ప్రవాహం. నీలా. 1.103.

**జక్కరభూమి** వి. ఊటనీటితో సాగుచేసే నేల. **జక్కరరాయ(డు** వి. సముద్రుడు. **జక్కరలతే(డు** వి. నదుల పెనిమిటి, సముద్రుడు. అచ్చ.రా.యు. 82.

**జక్కలి** వి. గేలి, ఎగతాళి, వెక్కిరింత.

క. చక్కంద. పనికిమాలినమాట, ఆనందం, తృప్తి; తు. చక్కంద. న్యాయంగా ఉండే స్వభావం; త.

చక్కట్టుమ్, చక్కంతమ్. ఎగతాళి, వినోదం, ఆక్షేపణ.

జక్కలించు చూ. జక్కలింపు. స.క్రి. గేలిచేయు. క. జకుక్కలిసు, జకుక్కళిసు. గేలిచేయు, ఆడు, ఆనందించు.

జక్కలింత చూ. జక్కలింపు. వి. గేలి, ఎగతాళి, వేళాకోళం.

జక్కలింపు వి. గేలిచేయటం, పరిహసించటం.

**జక్కవ** రూ. జక్కువ. వి. కోకం, చక్రవాకపక్షి. కు.సం. 3.34.

సం. చక్రవాక-. పక్షివిశేషం; ప్రా. చక్కవాగ-, చక్కవాయ-, చక్కాఅ, చక్కవాజి, చక్కవాఈ; అశో. చకవాక; కా. చాంకవ్; నే. చఖెవా; బెం. చకా; ఒ. చకుఆ, చకువి; హిం. చక్వా, చకఈ; పం. చక్వా; సిం. సక్వా; గు. చక్వొ; మరా. చక్వా, చక్వీ.

క. జక్కవక్క; తు. జక్కిపక్కి; త. చక్కర వాకం.

< ప్రా. చక్కవాయ-.

జక్కవకవవిప్వ వి. చంద్రుడు. ఆం.నా.సం.దేవ. 15. జక్కవగొంగ వి. చంద్రుడు. జక్కవచంటి వి. చక్రవాకాల వంటి చన్నులు గలది. గుబ్బెత, స్త్రీ. ఘటికా. 2.86. జక్కవచెలి వి. సూర్యుడు. భర్తృ. 2.14. జక్కవపగతుఁడు వి. చంద్రుడు, జక్కవకవవిప్వు. జక్కవలగొంగ వి. చక్రవాకాలకు శత్రువు, చంద్రుడు. శృం.నై. 8.201. జక్కవల చెలి వి. సూర్యుడు, చక్రవాకప్రియుడు. జక్కవలమేలు వి. సూర్యుడు, చక్రవాకప్రియుడు. జక్కవలయంటు(-అంటు) రూ. జక్కవలయంట. వి. సూర్యుడు. వ్యు. చక్రవాక ప్రియుడు. జక్కవలతేఁడు వి. సూర్యుడు. ఆం.నా.సం. దేవ. 16. జక్కవలసంగాతి వి. సూర్యుడు, చక్రవాక ప్రియుడు. జక్కవలసూడు వి. చక్రవాకాలకు శత్రువు, చంద్రుడు. అచ్చ.రా.యు. 311.

**జక్కి**[1] వి. తిరగలి. కాశీ. 2.74.

సం. చక్రిన్. చక్రాలు గలది; ప్రా. చక్కి, చక్కియ.

< ప్రా. చక్కి.

**జక్కి**[2] వి. గుర్రం. నీలా. 2.97.

జక్కిదాయ వి. గుర్రానికి శత్రువు, దున్నపోతు. జక్కిదాయ పడగసామి వి. మహిషకేతనుడు, యముడు. అచ్చ.రా.యు. 1.65. జక్కిమోర వి. దేవయోని విశేషం, అశ్వముఖుడు. అచ్చ.రా.బాల. 144. జక్కివేల్పు వి. కిన్నరుడు, కింపురుషుడు.

**జక్కించు** అ.క్రి కట్టుపడు.

**జక్కిణి** రూ. జక్కిణీ, జక్కిని. వి. 1. నాట్యభేదం. రామాభ్యు. 2.131; 2. జాతి విశేషం. విష్ణుపు. 7.277; 3. సంగీత వర్ణ విశేషం, ఒక విధమయిన పాట.

సం. యక్షిణీ-. కుబేరుని భార్య, యక్షస్త్రీ; ప్రా. జక్ఖిణీ; పా. యక్ఖ-; కా. యెచ్; హిం. జఖ్నీ. దుర్గను సేవించే యక్షస్త్రీ; పం. జక్ఖ్. ఒకానొక దేవత; మరా. జఖీన్, జాఖీన్. ప్రసవ సమయంలోగాని, నీటమునిగి గాని మరణించిన స్త్రీ ప్రేతాత్మ; జాఖీన్, జాంఖీన్. అశుభ్రంగా ఉన్న ముసలి స్త్రీ.

క. జకణి, జక్కణి, జక్కిణి. మృతసువాసిని; త. జక్కిణి.

< ప్రా. జక్ఖిణీ.

జక్కిణిగొను(-కొను) అ.క్రి. నాట్యంచేయు. కువ.ప. 2.92.

**జక్కిణీ** రూ.చూ. జక్కిణి. వి. నాట్యభేదం. దశా. 7.1.287.

**జక్కిని** రూ.చూ. జక్కిణి. వి. 1. లోకాంతరంలో దేవత్వాన్ని పొందిన ముత్తైదువ, మృతసువాసిని. ఆం.నా.సం.మాన. 4; 2. కుబేరుని భార్య.

జక్కినీఁడు వి. కుబేరుడు.

**జక్కినీఁడు** చూ. జక్కిని.

**జక్కు**[1] స.క్రి. చెక్కు.

జక్కుగావించు (-కావించు) స.క్రి. చెక్కివేయు, వేత పెట్టు.

**జక్కు**[2] వి. ఎత్తు, జిత్తు.

**జక్కుదంట** చూ. జక్కులు.

**జక్కులగమికాఁడు** చూ. జక్కులు.

**జక్కులదంట** చూ. జక్కులు.

**జక్కులదొర** చూ. జక్కులు.

**జక్కులదొరనేస్తి** చూ. జక్కులు.

**జక్కులపాదుసా** చూ. జక్కులు.

**జక్కులపురంధ్రి** చూ. జక్కులు.

**జక్కులబోనంబులు** చూ. జక్కులు.

**జక్కులతేఁడు** చూ. జక్కులు.

**జక్కులతేనిచెలి** చూ. జక్కులు.

**జక్కులతేనిచెలికాఁడు** చూ. జక్కులు.

**జక్కులతేనిపట్టి** చూ. జక్కులు.

**జక్కులవాంద్రు** చూ. జక్కులు.

**జక్కులీఁడు** చూ. జక్కులు.

**జక్కులు** వి.బ.వ. 1. యక్షులు. ఆం.భా.భూ. 22; 2. కామేశ్వరిని కొలిచే ఒకజాతి మాంత్రికులు; 3. యక్షగానాల్ని ప్రదర్శించే ఒక జాతి.

సం. యక్ష-. ఒకానొక దేవజాతి; ప్రా. జక్ఖ-. ఒకానొక దేవజాతి, కుబేరుడు; మహా. జక్ఖ; అ.మా. జక్ఖ-; మా. యశ్క; పా. యక్ఖ-. మానవస్థాయికి గంధర్వస్థాయికి మధ్యనున్న ఒకానొక దేవజాతి; కా. యెచ్. ఒకానొక దేవత; హిం. జాక్; పం. జక్ఖ్. ఒక దేవజాతి.

క. జక్క; త. ఇయక్కన్. యక్షుడు; ఇయక్కమ్. యక్షలోకం; ఇయక్కి. యక్షిణి.

< ప్రా. జక్ఖ-.

జక్కుదంట వి. యక్షులలో దిట్ట, కుబేరుడు. అచ్చ.భా.ర. 2.26 పు. జక్కులగమికాఁడు వి. యక్షేశుడు, కుబేరుడు. యయా. 3.93. జక్కులదంట వి. కుబేరుడు. జక్కులదొర వి. కుబేరుడు, యక్షేశుడు. అచ్చ.రా.బాల. 21. జక్కుల దొరనేస్తి వి. కుబేరుని స్నేహితుడు, శివుడు. జక్కులపాదుసా వి. కుబేరుడు. జక్కులపురంధ్రి వి. యక్షగానాలు ప్రదర్శించే స్త్రీ. సం. పురంధ్రీ-. స్త్రీ. జక్కులబోనంబులు వి.బ.వ. మిథ్యాభోజనాలు, హుళక్కితిళ్ళు. వ్యు. వివాహం మొ.

ఉత్సవాల్లో శూద్రులు కాళీ జరేనికుండల్ని తలమీదపెట్టు కొని 'బోనాలు బోనాలు' అని అంటారు. జక్కులవాళ్ళు, శూద్రులు. **జక్షులతేఁడు** వి. యక్షేశుడు. కుబేరుడు. అచ్చ. రా. అరణ్య 126. **జక్షులతేనిచెలి** వి. కుబేరుని మిత్రుడు. శివుడు. **జక్కులతేనిచెలికాఁడు** వి. శివుడు, కుబేరుని మిత్రుడు. **జక్కులతేనిపట్టి** వి. కుబేరుని కొడుకు, నలకూబరుడు. **జక్కులవాండ్రు** విణ.బ.వ. కామేశ్వరిని కొలిచేవారు. **జక్కులీఁడు** వి. జక్కులజాతివాడు. చంద్రరే. 5.31.

**జక్కువ** రూ.చూ. జక్కవ. వి. కోకం. చక్రవాకపక్షి. విక్ర. 3.39.

**జక్కువలయంటు** రూ.చూ. జక్కవలయంటు. వి. చక్రవాకపక్షుల్ని చేర్చేవాడు, సూర్యుడు. సాంబ.దేవ. 9.

**జక్కొను** అ.క్రి. లభించు, దొరుకు. పండి.చ. 2.135 వ.

**జక్కొలుపు** రూ.చూ. జక్కొల్పు. స.క్రి. 1. సవరించు, చక్కబరుచు; 2. చేయు, కావించు; 3. ఉపయోగపరుచు, నియోగించు.

**జక్కొల్పు** చూ. జక్కొను. రూ. జక్కొలుపు. స.క్రి. 1. సవరించు, చక్కబరుచు. పండి.చ. 1.88 వ.; 2. కావించు, చేయు. పండి.చ. 5.359 వ.; 3. ఉపయోగపరచు, వినియోగించు. బసవ. 4.887 పం.

**జఖేరా** రూ.చూ. జకేరా. వి. పోగుచేయటం.

**జగ[1]** రూ.చూ. జగా[1]. విణ. పెద్దదైన, గొప్ప, ప్రశస్తమైన. అచ్చ.రా.యు. 68.

**జగజంటు** వి. గండరగండడు, జగత్తులో ఎన్నికగన్న శూరుడు. **జగజంత** వి మాయలాడు, మాయలాడి. **జగజంపు** వి. ముత్యాలు మొ. వాటి జాలరు, జల్లి. ఆము. 6.130; విణ. అధికమైన, పెద్ద. దశా. 2.66. క. *జగజమ్పు*. **జగజెట్టి** రూ. జగాజెట్టి. వి. 1. గొప్పమల్లుడు. భార.ఉద్యో. 3.175; 2. అడవిపంది, ఒంటిగాడు. రాజవా. 3.64; విణ. శ్రేష్ఠమైన(వాడు). భీమ. 1.81. **జగజోలి** విణ. మిక్కిలి మోసగాడు. రం.రా.అయోధ్య. 94వ. 29పం. వి. 1. అల్లరి. ద్వి.పరమ. వి. 7.545 వ.; 2. తగులాటం. శుక. 3.127. **జగడంబు** వి. ప్రశస్తమైన కాంతి. వసు. 3.46. **జగదొంగ** రూ. గజదొంగ. వి. గొప్పదొంగ. వాల్మీ. 3.147. **జగపావురము** వి. ప్రశస్తమైన పావురం. ద్వి.సార.చ. 2.95 వ. 5 పం. **జగపీఁట** వి. పెద్దపీట. బహులా. 5.179. **జగబంటు** వి. గొప్పబంటు. అచ్చ.రా.యు. 122. **జగబిరుదు** వి. గొప్పయోధుడు, మహావీరుడు. వ్యు. గొప్పబిరుదు కలవాడు. **జగమగఁడు** వి. గొప్పశూరుడు. అచ్చ.రా.యు. 68. **జగరౌతు** వి. శూరుడైన సేనాపతి.

**జగ[2]** రూ. జగా[2]. వి. కాంతి. విజయ. పీఠి. 36.

**జగజంబు** వి. అతిశయం, పెంపు.

**జగజ్జ్యోతి** వి. ఒకరకమైన దీపం. ఆము. 4.35.

సం. *జగత్*. ప్రపంచం; జ్యోతిస్. ప్రకాశం; *జగజ్జ్యోతిస్-*. ప్రపంచంయొక్క కాంతి.

< సం. జగజ్జ్యోతిస్- (అర్థవిపరి.).

**జగడగొండి** చూ. జగడము.

**జగడమాడు** చూ. జగడము.

**జగడము** వి. 1. తగవు, వాదు. వరాహ. 7.31; 2. యుద్ధం, పోరు. దశా. 6.119.

సం. *ఝకట-*. వివాదం; ప్రా. *ఝగడ-*. వివాదం; దేశీ. *ఝగడ*; అప. *జగడ*. కలహించు; బి. *ఝగడ*; హిం. *ఝగ్డా*; గు. *ఝగ్డో*. పోట్లాట; మరా. *ఝగ్డా*. పోట్లాట.

క. *జగళ*. పోట్లాట, యుద్ధం; తు. *జగళ*. పోరు, వివాదం.

< మరా. ఝగ్డా.

**జగడగొండి** వి. కలహశీలురాలు, కలహశీలుడు. **జగడమాడు** అ.క్రి. కలహించు. క. *జగళాడు*. < జగడము + ఆడు. **జగడంపుఁగూటితపసి** వి. నారదుడు. అచ్చ.రా.యు. 154. వ్యు. కలహాశనముని. **జగడంపుటోరెంపుజడదారి** వి. నారదుడు. వ్యు. కలహం భోజనంగాకల ముని. **జగడాలచీలి** వి. కలహశీలుడు, కలహశీలురాలు. **జగడాలమారి** వి. కలహశీలురాలు, కలహశీలుడు. **జగడాలముని** వి. నారదుడు. **జగడాలమునితేఁడు** వి. నారదమహాముని. రామాభ్యు. 371. **జగడించు** అ.క్రి. జగడమాడు, కలహించు. జైమిని భా. 8.209.

**జగడంపుఁగూటితపసి** చూ. జగడము.

**జగడంపుటోరెంపుజడదారి** చూ. జగడము.

**జగడవాఁడు** విణ. చేతాళం వాయించేవాడు.

**జగడాలచీలి** చూ. జగడము.

**జగడాలమారి** చూ. జగడము.

**జగడాలముని** చూ. జగడము.

**జగడాలమునితేఁడు** చూ. జగడము.

**జగడించు** చూ. జగడము.

**జగతి[1]** వి. 1. వేదిక, అరుగు. భాస్క.రా. కిష్కిం. 384; 2. పునాదిగోడల మధ్యఉన్న మట్టితో నింపవలసిన గుంట; 3. బావికి చుట్టూ కట్టిన అరుగు.

క. *జగతి, జగలి, జగళి, జగులి*. అరుగు లేదా వేదిక, దైవపీఠం, విగ్రహాన్ని పెట్టే అరుగు, రాయి, మన్ను మొ. వాటితో చేసిన అరుగు; తు. *జగలి*. బయటఉన్న వరండా.

**జగతి[2]** వి. మూడు అనే సంఖ్యకు సాంకేతిక పదం.

సం. *జగత్*. ప్రపంచం, లోకం, స్వర్గ, మర్త్య పాతాళ లోకాలని మూడు లోకాలు (త్రిలోకాలు).

< సం. జగత్.

**జగతిజోతులు** చూ. జగతీజ్యోతి. వి.బ.వ. కరదీపికా విశేషం.

**జగతిరాయి** వి. దర్వాజా చట్రం కింద వేనుమెంటు పైన గడపగా వేసే రాయి.

**జగతీజ్యోతి** వి. ఒకవిధమైన దీపం.

సం. *జగతి*. ప్రపంచం; జ్యోతిస్. కాంతి; *జగతి జ్యోతిస్*. ప్రపంచంయొక్క కాంతి.

< సం. జగతీజ్యోతిస్ (అర్థవిపరి.).

**జగదొబ్బగండఁడు** వి. జగదేక వీరుడు. హరి.పూ. 1.11.

**జగన్నాథమూల** వి. తూర్పు, ఉత్తరాల మధ్యమూల, ఈశాన్యం.

సం. *జగన్నాథ-*. విష్ణువు.

జ్గగము వి. ప్రపంచం, లోకం. నీలా. 1.52, అచ్చ.రా.యు. 1.22.

సం. జగత్. మనుష్యులు, జంతువులు, ప్రపంచం; ప్రా. జగల్. ప్రపంచం, ప్రాణి; పా. జగత్. ప్రపంచం; సిం. డియ. ప్రపంచం.

<ప్రా. జగత్.

జ్గగముకన్ను వి. జగచ్చక్షువు, సూర్యుడు. అచ్చ.రా.యు. 300, నీలా. 3.45. జ్గగముచుట్టము వి. లోకబాంధవుడు, సూర్యుడు. అచ్చ.రా.అయోధ్య. 38. జ్గగముతల్లి వి. 1. పార్వతి, లోకజనని. ఆం.నా.సం.దేవ. 9; 2. లక్ష్మి. జ్గగములఁబుట్టించుజాణఁడు వి. బ్రహ్మ. వ్యు. లోకాల్ని పుట్టించే నేర్పరి. జ్గగమువిందు వి. సూర్యుడు. అచ్చ.రా. యు. 431.

జగలి రూ.చూ. జగ్గిలె. వి. అరుగు, తిన్నె.

జగలిగంటి వి. ఆకుపచ్చని పూలు, ఎర్రని పళ్ళు, ముళ్ళు కలిగిన ఒకరకం చెట్టు (Diospyros montaana).

జగా[1] రూ. జగ[1], జాగా[2], జెగ. విశ. పెద్ద, గొప్ప, ప్రశస్తమైన. చంద్రదూ. 1.113, ఉ.రా. 6.120.

సం. జగత్. ప్రపంచం; హిం.ఉ. జగహ్. స్థలం, చోటు.

<ఉ. జగహ్.

జగాజెట్టి రూ.చూ. జగజెట్టి. వి. గొప్పమల్లుడు. ఇందు. 2.21.

జగా[2] రూ.చూ. జగ[2]. వి. కాంతి. శశా. 3 40.

జగా[3] వి. ప్రపంచం.

<సం. జగత్. ప్రపంచం.

జగా[4] రూ. జాగా[1]. వి. స్థలం. నె.శా.సం. 2. శా.సం. 5 (క్రీ.శ. 1653–54).

హిం. జగహ్. స్థలం, హోదా; మరా. జాగా. స్థలం, కార్యాలయం; ఉ. జగహ్. స్థానం, అవసరం; పార. జయగాహ్. వాసస్థానం, జన్మప్రదేశం, వస్తువులచోటు.

<ఉ. జగహ్.

జగాయించు స.క్రి. మిక్కిలి తిట్టు, దులుపు.

జగిలం వి. భూమట్టంనుంచి పైవరకుగల రచ్చఎత్తు.

జగిలి రూ.చూ. జగ్గిలె. వి. 1. హాలు పక్కగది; 2. గదుల అడుగు భాగాన్ని మట్టితొక్కి గట్టిపరచటం; 3. పునాదులు నింపే మట్టి; 4. అరుగు, తిన్నె.

జగిలిగాఁడు(-కాఁడు) రూ.చూ. జగిలెకాఁడు. వి. తోడిఅల్లుడు.

జగిలిపోయు స.క్రి. జల్లెడపట్టు.

జగిలె రూ.చూ. జగ్గిలె. వి. అరుగు, వేదిక. రసిక. 1.36.

జగిలెకాఁడు రూ. జగిలిగాఁడు, జగిలెఁడు. వి. తోడల్లుడు. అచ్చ.రా.అయోధ్య. 19.

జగిలెఁడు రూ.చూ. జగిలెకాఁడు. వి. తోడల్లుడు. ఆం. నా. శే. 47.

జగులు వి. పెనుగాడి దగ్గర పక్కవాసాలను హెచ్చుతగ్గులు లేకుండా సరిచేయడం.

జగే అవ్య. నిరసన సూచక శబ్దం. శుక. 3.196.

జగ్గఁడు వి. పూరీ జగన్నాథ స్వామి.

సం. జగన్నాథ-. పూరీక్షేత్రంలోని విష్ణువు.

<సం. జగన్నాథ-.

జగ్గరు వి. కర్మాగారాల్లో చేసిన పింగాణీ జాడీ.

ఇం. *Jug*. జాడీ.

బహుశః <ఇం. Jug.

జగ్గిలె రూ. జగలి, జగిలి, జగిలె, జవలి, జవిలె. వి. అరుగు, వేదిక. యయా. 5.45.

క. జగతి, జగలి, జగులి. కృత్రిమంగా లేచిన ప్రదేశం, యజ్ఞవేదిక, విగ్రహం, స్తంభంయొక్క పీఠం; తు. జగలి. ఆరుబయలు పంచపాళి లేక వరండా.

జగ్గు[1] ద్రవపదార్థాలని ఉంచడానికి వాడే పిడి తొండంగల కూజావంటి పాత్ర.

ఇం. *Jug*. కూజావంటి పాత్ర.

<ఇం. Jug.

జగ్గుకూజా వి. జగ్గు మాదిరి ఉండే కూజా. ఇం. *Jug*. పాత్ర విశేషం. <ఇం. Jug+కూజా.

జగ్గు[2] వి. 1. మెరవటానికి అనుకరణం, అధిక ప్రకాశం. ఇందు. 6.124; 2. గమన వేగాదులలో అయ్యే అనుకరణం. శుక. 3.71; 3. ఒయ్యారం. దశా. 8.33; 4. నాట్య విశేషం; 5. వేగం, శీఘ్రత; విశ. 1. సుందరమైన, ఒప్పిదమైన. హంస. 1.207; 2. తళతళలాడే స్వభావం కల. హంస. 1.218.

జగ్గుగొడుగు వి. వన్నెల గొడుగు, గిడుగు. జగ్గుజగ్గున క్రి.విశ. ద్రు. మిక్కిలి వేగంగా. ప్రబంధ. 788. జగ్గుట వి. 1. వేలాడటం; 2. మెరవటం. జగ్గుతనము వి. వెలుగు, వన్నె, అందం. జగ్గులాఁడి వి. వగలాడి, వన్నెలాడి.

జంక వి. వికారం.

జంకవాఁడు విశ. జిడ్డుకాడు, సోమరి.

జంకాయించు చూ. జంకు. స.క్రి. జడిపించు, బెదిరించు.

జంకించు చూ. జంకు.

జంకు రూ. జంకె, జనుకు. అ.క్రి. 1. భయపడు, బెదురు. భార. విరా. 2.54; 2. సంకోచించు, సందేహించు, వెనుదీయు; 3. చలించు, జవ్వాడు; 4. కుంగు, దిగబడు, ఒరిగిపోవు. వి. 1. భయం. నీలా. 2.54; 2. సంకోచం.

క. జంకిసు. తిట్టు, గద్దించు; జంకె, జంకెణె. తిట్టు, గద్దించు; త. చంకు. అధైర్యపడు; కువి. దంగ్. అధైర్యపడు, వణుకు, తడబడు; కురు. జంక. ఉలికిపడు; మాల్తో. జంగ్. ఉలికిపడు.

సం. శంక్-. సందేహించు, భయపడు; ప్రా. సంకై, సంకన. సందేహం, భయం; అ. మా. సంక్లో. సందేహించు, నిందించు; పా. సంక్-. సందేహించు, కంగారుపడు; హిం. సకానా. సందేహింపజేయు; పం. సంగ్నా. సిగ్గుపడు; ల. సంగన్. సిగ్గుపడు; సిం. సంగాజణు. భయపెట్టు.

పో.చూ. కురు. జంక-. ఉలికిపడు, బెదరు; మాల్తో. టంక్. కుదపటం, ఊడ్చటం.

జంకించు స.క్రి. తర్జించు. భార.విరా. 2.54; హర. 4.20. జంకెన వి. 1. భర్త్సనం, బెదిరింపు. నరస. 2.36;

**2.** కోపదృష్టి. కువ.చ. 4.178 ; **3.** భీతి, బెదురు. ఆం. భా. 1.133. విణ. **1.** కోపయుక్తమైన. పారి. 1.124 ; **2.** చంచలమైన. సురా. 30. క. జంకెణ. **జంకెనచేయు** స.క్రి. బెదరించు.

**జంకె** రూ.చూ. జంకు. వి. బెదరింపు, తర్జనం. భార.భీష్మ. 2.133.

**జంకెయొనర్చు** స.క్రి. బెదిరించు. భాగ. 10 పూ. 302.

**జంకెసేయు**[1](-చేయు) స.క్రి. **1.** బెదిరించు ; **2.** గద్దించు.

**జంకెన** చూ. జంకు.

**జంకెనచేయు** చూ. జంకు.

**జంకెసేయు**[2](-చేయు) స.క్రి. ప్రోత్సహించు.

**జంక్షను** వి. కూడలి, కలిసేచోటు.

ఇం. *Junction.* కూడలి, కలిసేచోటు.

< ఇం. Junction.

**జంఖానా** రూ.చూ. జముకాణము. వి. రత్నకంబళి, జంబుఖానా.

**జంగ** వి. **1.** పాదం, అంజ. పి.శకు. 2.107 ; **2.** పంగ. వరాహ. 7.59 ; **3.** దాటు. నరస. 5.213 ; **4.** విలుకాడు బాణం వేసేటప్పటి స్థితి. అహల్యా. 2.78 ; **5.** పిక్క, తొడ. కవిరా. 1.67 ; **6.** అశ్వప్లుతగతి విశేషం. ఆం. భా. 2.198 ; **7.** పత్తిరాట్నం అడ్డపీటకు దిగ్గొట్టిన కొయ్య ; **8.** ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; **9.** రాట్నం అడ్డపట్టె ; **10.** నార వడికేటప్పుడు కదురుపై కొన మోపటానికి తొడకు చుట్టుకొనే ఇనపరేకు తొక్కు ; **11.** తొక్కుడు పీట ; **12.** దబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య ; **13.** రాటి మూలం గూర్చిన కట్టె ; **14.** దూలం అంచున బిగించిన పొట్టి గుజ్జు.

సం. జంఘా. కాలిపిక్క ; ప్రా. జంఘా.

క. జంగె. దూరంగా వేసిన అడుగు ; పర్జి. జంగె. అడుగు దూరంగా వేసిన అడుగు.

< ప్రా. జంఘా.

**జంగగంతు** వి. గుర్రపు దాటు. **జంగగొను(-కొను)** వి. దాటు, దూకు. పారి. 2.93. **జంగనడ** రూ. జంగనడక. వి. అశ్వగతి విశేషం. సిం.ద్వా. 8.71. **జంగనడక** రూ.చూ. జంగనడ. వి. కాలు చాచిపెట్టి నడిచే నడక. **జంగనడపు** వి. అశ్వగతి విశేషం. ఆం.భా. 2.198. **జంగపీట** రూ. జంగప్పీట. వి. కిసాన్ రాట్నం కిందపట్టె. **జంగప్పీట** రూ. చూ. జంగపీట. వి. జంగమీద బిగించిన పీట. **జంగలుగొను(-కొను)** స.క్రి. దాటు, లంఘించు.

**జంగంఇనాం** చూ. జంగము.

**జంగంసేర్లు** వి. బ.వ **1.** డాబీమగ్గంలో, పక్కలనుంచి అంచు పోగుల్లోకి వేలాడే లావు దారాలు ; **2.** వజానేతకోసం అమర్చిన దొడ్డిలో నడిమి జల్లినుంచి ఏటవాలుగా గాని, పక్కజల్లి నుంచి నిటారుగా గాని వేలాడే లావు దారాలు.

**జంగకొలము** చూ. జంగము.

**జంగచాఁప** వి. ఒక జాతి కలుపుమొక్క.

**జంగతి** వి. అసుపీటలు బిగించిన పొడుగు పట్టె.

**జంగపిల్లి** రూ.చూ. జంగుఁబిల్లి. వి. అడవిపిల్లి.

**జంగపురుపు** రూ. జంగము పురుగు. వి. ఆముదం చెట్లను తినే ఒక జాతి చీడపురుగు. గోపీ.రా.యు. 289 పు.

**జంగమదేవర** చూ. జంగము.

**జంగమము** వి. **1.** జంగంజాతివాడు. పండి. చ. 1.218 పు. ; **2.** శివ భక్తుడు.

సం. జంగమ-. తిరిగేది, చరిష్ణువు.

< సం. జంగమ- (అర్థవిపరి.).

**జంగమయ** చూ. జంగము.

**జంగమయ్య**[1] చూ. జంగము.

**జంగమయ్య**[2] చూ. జంగము.

**జంగము** వి. **1.** లింగధారులై శివారాధన చేసే ఒక జాతి. పండి.చ. 1.56 ; **2.** దేవుడు. యయా. 4.14 ; **3.** శివ భక్తుడు. ఆం.భా. 2.285 ; **4.** ఒకజాతి భిక్షుకుడు ; **5.** తిరిగేది.

సం. జంగమ-. తిరిగేవాడు ; మరా. జంగమ. లింగ ధారియై శివారాధన చేసే ఒక జాతి.

క. జంగమ-.

< సం. జంగమ-.

**జంగంఇనాం** వి. **1.** తమకు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ. వారు ఇచ్చిన భూమి ; **2.** వడ్లబత్తుడికిచ్చిన భూమి. < జంగము + ఇనాము. **జంగకొలము** వి. జంగాల గుంపు. హర. 2.51. < జంగము + కొలము. **జంగమదేవర** రూ.చూ. జంగముదేవర. వి. జంగము జాతివాడు. **జంగమయ** రూ.చూ. జంగమయ్య[1]. వి. **1.** జంగము జాతివాడు ; **2.** శివుడు. **జంగమయ్య**[1] రూ. జంగమయ. వి. **1.** పూజ్యుడైన జంగం జాతివాడు. కాశీ. 1.15 ; **2.** శివుడు. ఆం.భా. 1.37. **జంగమయ్య**[2] వి. సీతాకోకచిలుక. **జంగముదేవర** రూ. జంగమదేవర. వి. **1.** పూజ్యుడైన జంగం జాతివాడు ; **2.** శివుడు. **జంగమురాలు** వి.స్త్రీ. **1.** జంగంజాతి స్త్రీ. శ్రీనాథుని చాటువు ; **2.** శైవ భిక్షుకి. < జంగము + ఆలు. **జంగమసత్రము** వి. జంగములు లేదా శివదాసులకోసం పెట్టిన సత్రం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 728. **జంగాలవృత్తి** వి. జంగాల జీవన భృతి కోసం యిచ్చిన మాన్యం. నె.శా. ఒంగోలు. 85. క్రీ.శ. 1428.

**జంగముపురుగు** రూ.చూ. జంగపురుపు. వి. ఆముదపు చెట్లచీడ.

**జంగలీసాంబ** వి. మంచి సన్నరకం వడ్లు.

**జంగాణము**[1] వి. పై పెదవి.

సం. జంగాల-. గతిని వారించేది.

**జంగాణము**[2] వి. నిడువాటు.

**జంగాలపచ్చ** వి. ఆకుపచ్చరంగుగల ఓషధి విశేషం. హంస. 2.227.

క. జంగాల్‌పచ్చ.

**జంగాలవృత్తి** చూ. జంగము.

**జంగాళము**[1] విణ. **1.** బిగువుకాని, వదులైన. కాశీ. 6.209 ; **2.** నిడువాటు.

క. జంగళ-. వదులు.

**జంగాళము**[2] వి. కృత్రిమమైన పచ్చ. పండి.చ. 5.341 పు.

**జంగాళి** చూ. జంగాళము1. విశ. వచునైన. అష్టమ. క. 3.134 ప. 3505 పం.

**జంగి**[1] వి. గజ్జి.

**జంగి**[2] చూ. జంగీ. వి. తుపాకి, ఫ్రోవి, అగ్ని ప్రసారణం.

హిం. ఉ. పార. జంగీ. యుద్ధ సంబంధమైనది.

< ఉ. జంగీ.

**జంగికట్టుబడి** వి. యుద్ధానంతరం యోధుల కిచ్చే మాన్యం.

**జంగిటిదోలు** చూ. జంగిడి[1].

**జంగిడి**[1] రూ.చూ. జంగిలి[1]. వి. **1.** పశువుల మంద, జంగిలి; **2.** స్వల్పబుద్ధి; **3.** ఊరి పశువులు ఒక చోట కూడే చోటు.

**జంగిటిదోలు** స.క్రి. పశువుల మందలను తోలు.

**జంగిడి**[2] రూ.చూ. జంగిడీ. వి. పళ్ళెంలాగ అల్లిన సన్న వెదురు బద్దల అల్లకం.

**జంగిడిపూట** వి. సన్నకారు రైతులు కలిసి చేలకు నీరు పారించుకొనే కాలపరిమితి.

**జంగిడీ** రూ. జంగిడి[2]. వి. ధాన్యాన్ని సంచుల్లో పోయటానికి ఉపయోగించే పాత్ర, పళ్ళెంలాగ అల్లిన సన్న వెదురు బద్దల అల్లకం.

**జంగియ** రూ.చూ. జంగు[1]. వి. ఒక రకం గజ్జె.

**జంగిలి**[1] రూ. జంగిడి[1]. వి. **1.** గోసమూహం. ఉ. హరి. 6.66; **2.** మృగ సమూహం. యయా. 1.26; **3.** పశువుల మంద. ద్వి. హరిశ్చ. ఉ. 560 పం.

క. *జంగళి*; త. *సంగిలి*.

< సం. జంగల-. అడవి.

**జంగిలికాయు** స.క్రి. పశువుల్నికాయు. **జంగిలికొను** స.క్రి. జంగిలిమేయు. **జంగిలిగొడ్లు** వి.బ.వ. జంగిడి పశువులు.

**జంగిలి**[2] వి. అల్ప సైన్యాధిపతి. ప్రబంధ. 160.

**జంగిలిగమికాఁడు** వి. అల్ప సేనాధిపతి. ఆం. భా. 2.184.

**జంగీ** విశ. యుద్ధ సంబంధమైన. భద్ర. శ. 23. వి. సైనికుడు.

హిం. *జంగీ*. సైనికుడు, వీరుడు; మరా. *జంఘీ*. సమర్థుడు; ఉ. *జంగీ*. సైనికుడు; పార. *జంగీ*. ధైర్యవంతమైన, యుద్ధం చేసేవాడు.

< ఉ. జంగీ.

**జంగు**[1] రూ. జంగియ, జంగె. వి. ఒక విధమైన గజ్జె. రాజవా. 2.114. శ్రీరం.మా. 4.153.

క. *జంగు*. జంగ భిక్షువులు కాలికి ధరించే గజ్జె.

**జంగు**[2] వి. జవ్వాది. విశ. అరణ్యంలో ఉండే.

హిం. ఉ. *జంగల్*. అడవి.

**జంగుపిల్లి** రూ.చూ. జంగుఁబిల్లి. వి. అడవిపిల్లి. **జంగుఁబిల్లి** రూ. జంగపిల్లి, జంగుపిల్లి. వి. జంగాల బిడాలం, అడవిపిల్లి. యయా. 2.49.

**జంగె** రూ.చూ. జంగు[1]. వి. ఒక రకం గజ్జె.

**జంగెత** చూ. జంగము. వి. జంగం జాతి స్త్రీ. బసవ. 7.410 పం., పండి.చ. 1.51 పు.

**జజాయి** రూ.చూ. జెజాయీ. వి. ఒక విధమైన ఫిరంగి. ఆం. భా. 2.218.

**జజాయీ** రూ.చూ. జెజాయీ. వి. ఒక విధమైన ఫిరంగి. రంగా.చ. 3.32.

**జజ్జర** రూ. జాజర[1]. వి. **1.** దంభోక్తి. ద్వి.హరిశ్చ.ఉ. 670 పం.; **2.** వంచన, కపటం, మోసం.

సం. *జర్జర*-. శిథిలమైన, జీర్ణించిన; ప్రా. **జజ్జర**-. జీర్ణం, సచ్ఛిద్రం.

< ప్రా. జజ్జర- (అర్థవిపరి.).

**జజ్జరకత్తియ** రూ.చూ. జజ్జరకత్తె. వి. వంచకురాలు. **జజ్జరకత్తె** రూ. జజ్జరకత్తియ, జాజరకత్తియ, జాజరకత్తె. వి. వంచకురాలు. **జజ్జరకాఁడు** రూ.చూ. జాజరకాఁడు. వి. వంచకుడు, మోసగాడు. ద్వి. హరిశ్చ. ఉ. 670 పం.

**జజ్జరిల్లు** రూ. జజ్జలిల్లు. అ.క్రి. దద్దరిల్లు, భయపడు.

**జజ్జలిల్లు** రూ.చూ. జజ్జరిల్లు. అ.క్రి. **1.** దద్దరిల్లు, భీతిలు; **2.** కంగారుపడు.

**జజ్జవతలుపు** వి. వెదురు బద్దల్తో అల్లిన తలుపు.

**జజ్జావకొట్టు** స.క్రి. చప్పుడు చేయు, మెత్తగా చితగ్గొట్టు.

**జజ్జు**[1] విశ. శిథిలమైన, ప్రబంధ. పీఠి; 16. వి. పచ్చులోని దోషం.

క. *జజ్జు*.

సం. *జజ్జర*-. శిథిలమైన; ప్రా. *జజ్జర*-.

**జజ్జుకొను** అ.క్రి. దుర్బలమగు, బలహీనమగు. **జజ్జుజజ్జగు** అ.క్రి. మిక్కిలి నలిగిపోవు.

**జజ్జు**[2] వి. **1.** మెత్తని నేల; **2.** రాతిలో మెత్తగా తెగే భాగం.

**జజ్జుకొట్టు** స.క్రి. వంగేటట్లు చేయు, వంచు.

**జఝాయీ** రూ.చూ. జెజాయీ. వి. ఒక విధమైన ఫిరంగి.

**జంజ** రూ.చూ. జంజా. వి. గుంపు, సమూహం.

**జంజడ** వి. ఇరుసు తుది సీల, మేకు, ఆణి. ఆం.భా. 2.203.

**జంజా** రూ. జంజ. వి. గుంపు, సమూహం.

సం. *ఝంఝా*. వానతో కూడిన పెనుగాలి.

**జంజాటము** విశ. దుఃఖకరమైన. భీమ. 6.26. వి. **1.** ఆర్భాటం, ఆడంబరం. క్రీడా. 92; **2.** క్లేశం. భాగ. 1.104; **3.** తగులం, కోరిక; **4.** వెత, దుఃఖం.

క. *జంజడ*, *జంజాట*. ఇబ్బంది.

**జంజాటించు** అ.క్రి. రొదచేయు, గోలచేయు. భాగ. 8.447.

**జంజాటించు** చూ. జంజాటము.

**జంజాడి** రూ.చూ. జముదాడి. వి. **1.** నిడుపైన పిడిగల కటారి, తెలుగువారుపయోగించే ఒక రకం కత్తి; **2.** జముదాడి.

**జంజాలి** రూ.చూ. జముదాడి. వి. **1.** జముదాడి, యమధాటి; **2.** నిడుపైన పిడిగల కత్తి.

**జంజాళి** రూ.చూ. జముదాడి. వి. **1.** తెలుగువారుపయోగించే ఒక రకం కత్తి, నిడుపైన పిడిగల కత్తి; **2.** జముదాడి.

**జంజీరు** వి. సంకెల.

హిం. ఉ. *జంజీర్*. సంకెల.

< ఉ. జంజీర్.

**జంజెడ** రూ.చూ. దంపెడ. వి. నాగలి నుంచి తలేటి కాడికి

కట్టే మోకు.

జంజెపుకాడి వి. ఒక జత ఎద్దులు బండిని లాగేటప్పుడు రెండో జత ఎద్దులతో కట్టే కాడి.

జంజెరం వి. మెళ్ళో వేసుకొనే జంధ్యం.

జంజెరకాడి చూ. జంజెపుకాడి. వి. ఒక జత ఎద్దులు బండిని లాగేటప్పుడు రెండో జత ఎద్దులతో కట్టే కాడి.

జంజెరాలపున్నమ రూ.చూ. జంద్యాల పౌర్ణమి. వి. శ్రావణ పౌర్ణమి, నేత పనివారు బ్రాహ్మణులు మొ. వారు ముఖ్యంగాచేసుకొనే పండుగ.

జంజెరుదొడ్డి వి. బండెల దొడ్డి, గొర్ల చెర.

జంజెలపున్నమ రూ.చూ. జంద్యాల పౌర్ణమి. వి. శ్రావణ పౌర్ణమి, నేతపనివారు బ్రాహ్మణులు మొ. వారు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

జటి వి. సముద్ర మట్టంలో పెరిగే ఒక రకం చెట్టు (Ficus infectoria).

జటిక వి. కంకిలో గింజలున్న రెమ్మ, రెల్ల.

జటికరోగం వి. రాగి తెగులు. రెల్లల్లో గింజ ఏర్పడని రోగం.

జటిసర్ద వి. ఒక రకం ఆహార ధాన్యం.

జట్ట వి. కాయముక్క. రాజవా. 2.100.

త. సట్టై.

సం. శలాటు-. పచ్చికాయ, ఒక రకం దుంప, బిల్వం.

జట్టి[1] రూ. జట్టీ. వి. **1.** అమ్మకం, అమ్ముడు. భోజ. 3.209; **2.** వెల, మూల్యం, విలువ. హరిశ్చ. 4.114; **3.** విక్రేయ పదార్థాలు, అమ్మకపు సరుకు. ద్వి. హరిశ్చ. ఉ. 240 పం.; **4.** బేరం. ద్వి. హరిశ్చ. ఉ. 1485; **5.** సరుకంతటికీ క్రయవిక్రయాలు స్థిరపరచుకోటానికి చేసుకొనే ఒడంబడిక; **6.** ధనాది నిమిత్తమైన జగడం, విణ. సదృశమైన, సమానమైన. కకుత్థ్స. 2.109.

ప్రా. సట్టు-. వినిమయం, మారుబేరం.

<ప్రా. సట్ట-.

జట్టికత్తియ రూ. జట్టికత్తె. వి. **1.** మారుబేరకత్తె; **2.** సరుకులుకొనే స్త్రీ. జట్టికత్తె రూ.చూ. జట్టికత్తియ. వి. **1.** మారుబేరకత్తె; **2.** సరుకులుకొనే స్త్రీ. జట్టికాఁడు వి. **1.** వర్తకుడు. భార. అను. 5.75; **2.** ఓడ నడిపేవాడు, మాలిమికాడు. పండి.చ. 1.15 పు.; **3.** కొనేవాడు, క్రేత. వసు. 1.109; **4.** సభికుడు, జూదమాడించేవాడు. ఆం. భా. 2.304. జట్టికొను రూ. జట్టిగొను. స.క్రి. **1.** విలుచు, క్రయించు. భార. శాంతి. 4.40; **2.** మల్లురు పోటీపడు. ప్రభా. 4.133; **3.** వశపరచుకొను, స్వాధీనపరచుకొను; జట్టిగొను రూ.చూ. జట్టికొను. స.క్రి. **1.** వశపరచుకొను, స్వాధీనపరచుకొను. రాజవా. 3.211; **2.** విలుచు, క్రయించు; **3.** మల్లురు పోటీపడు. జట్టిదక్కు అ.క్రి. గుత్తగా అమ్ముడుపోవు. ద్వి. హరిశ్చ. ఉ. 1.532 పం. జట్టియాడు (-ఆడు) స.క్రి. గుత్తగా బేరమాడు, గుత్తగా బేరంచేయు. హర. 1.20. జట్టియిచ్చు (-ఇచ్చు) స.క్రి. గుత్తగా విక్రయించు, అమ్ము. హరి. ఉ. 9.46. జట్టియిడు (-ఇడు) స.క్రి. గుత్తగా వెలకిచ్చు, గుత్తగా విక్రయించు. భార. శాంతి. 5.494.

జట్టి[2] వి. ఒక జాతి పావురం.

జట్టింగ వి. ఒక జాతి దొంగ, చోర భేదం.

జట్టీ రూ.చూ. జట్టి[1]. వి. **1.** గుత్త వ్యాపారం; **2.** తగవు, జగడం.

జట్టు రూ. జత్తు. వి. **1.** సమూహం, గుంపు. విజ్ఞా. ప్రా. 40; **2.** ఉద్ది, సమానులైనవారి సముదాయం.

సం. సార్థ-. వర్తకుల గుంపు, బిడారు, సమూహం; ప్రా. పా. సత్థ. బిడారు.

<ప్రా. సత్థ.

జట్కా వి. గుర్రబ్బండి.

హిం. ఝట్కా.

జడ రూ. జెడ. వి. **1.** అంటుకొని పోయిన, ఋషులు మొ. వారి వెంట్రుకల చుట్ట. భార. ఆది. 4.254; **2.** వేణి. వేనలి. మను. 3.83; **3.** సింహం మొ. వాటి మెడమీది జూలు. అచ్చ.రా. యు. 425; 4. చుట్టుగుడిసె కొప్పు చుట్టూ పేనివేసిన గడ్డిచుట్ట; **5.** పెండెగా కట్టిన కట్టు; **6.** సన్నటి తీగ అల్లికగల మండ.

సం. జటా. అల్లుకొన్న జుట్టు; ప్రా. జడా. శిఖ; సడా, సఢా. సింహాదుల కేసరం; పా. జటా; అప. జడా; పో.చూ.సం. సటా, శటా, కేసరం.

క. జటి, జడ్గె, జడి, జెడె; కొడ. జడె; తు. జడె. జెడె; త. సటై, చటై; మ. చట, చెట, చిట, ఝట; కో. జెఝ్వ్.

<ప్రా. జడా.

జడకట్టు రూ.చూ. జడగట్టు. అ.క్రి. జడగా ఏర్పడు, మెలిపడు. జడకంది వి. ఆంధ్రదేశంలో ఎక్కువగా పండించే పప్పుదినుసు (Cajanus eiedicus). జడకుచ్చు వి. స్త్రీలు జడలో చేర్చి అల్లుకొనే భూషణ విశేషం. హర. 2.93. జడకుసుమ వి. డెల్టాల్లో ఎక్కువగా పండే పంట, ఎన్ను ముద్దగా ఉండేరకం. జడకొఱ్ఱ వి. ఛామల మాదిరిగా ఉండే ఆహార ధాన్యం, ఎన్ను జల్లిగా జడలాగ ఉండే రకం. హంస. 4.127. జడగట్టు(-కట్టు) రూ. జడకట్టు. అ.క్రి. జడగాఏర్పడు, అంటుకొనిపోవు. మను. 2.9. జడగంటలు వి బ.వ. జడకు వేలాడదీసే ఆభరణ విశేషం. జడగాంజ రూ.చూ. జడగాఁజ. వి. గంజాయిచెట్టు. జడగాఁజ రూ. జడగాంజ. వి. గంజాయిచెట్టు. సాంబ.మాన. 34. త. సటైక్కంజా, గంజాయిచెట్టు; పో.చూ.సం. జటాగాంధారి-. జడగొను(-కొను) అ.క్రి **1.** పెనగొను, మెలిపడు, కలిసిపోవు. పి.శకు. 2.137; **2.** జడగా ఏర్పడు, అంటలు కట్టు. యయా. 1.102. జడచిక్కినదయ్యము వి. మంత్ర తంత్రాల వలన చేచిక్కిన దయ్యం. జడతల వి. జుట్టు ఒత్తుగానున్న తల. జడదారి వి. **1.** జడలు ధరించినవాడు, ఋషి. వసు. 2.78; **2.** శివుడు, ఈశానుడు. సాంబ.దేవ. 14; **3.** వానప్రస్థుడు. సం. జటాధారిన్. జడల్ని ధరించిన వాడు; ప్రా. జడా. జడ.<ప్రా. జడా+సం. ధారిన్. జడదారికన్పాప వి. చంద్రుడు. వ్యు. శివుడి కను పాప. జడదారి చెవిబుగ్గ వి. గంగానది, జాహ్నవి.

జడదారిచెవియూట(-ఊట) వి. గంగ. జడదారిపెద్ద వి. ఋషిశ్రేష్ఠుడు. ఉ.రా. 2.309. జడదారియింటికోడి వి. ఇంద్రుడు. వ్యు. గౌతముని ఇంటిదగ్గర కోడి (బనవాడు). జడదాలుపు(-తాలుపు) రూ.చూ. జడదాల్పు. వి. జడలు ధరించిన వాడు, ఋషి. జడదాలుపువేలుపు (-తాలుపువేలుపు) రూ. జడదాలుపువేల్పు. వి. ధూర్జటి, శివుడు. చంపూరా. 2.72. జడదాలుపువేల్పు(-తాలుపువేల్పు) రూ.చూ. జడదాలుపు వేలుపు. వి. శివుడు, ధూర్జటి. జడదాల్పు(-తాల్పు) రూ. జడదాలుపు. వి. జడలు ధరించినవాడు, ఋషి. కకుత్స్థ. 1.222. జడనువ్వులు వి. బ. వ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజల చెట్టు (Sesamum indicum). జడపెండె వి. వాసాలకు కిందా పైనా రెండేసి బద్దలు వేసి తాడుతో కట్టిన కట్టు. జడప్రత్తి వి. జడలాగ ఏర్పడే గింజలుగల ఒక జాతిపత్తి, కార్పాస భేదం, పొడవైన గింజలు వరుస అతుక్కొని ఉండే పత్తి, జంధ్యాల పత్తి. క. జడెహత్తి, కార్పాస విశేషం; త. సడైప్పరుత్తి. జడబట్టె వి. చమరం, సవరపు మెకం. జడబిల్ల రూ. జడబిళ్ళ. వి. నాగరం, చేమంతిపూవు, స్త్రీ శిరోభూషణం. వేంక.ఆం.మాన. 1.130. క. జడెబిల్లె; త. సడైవిల్లై. జడబిళ్ళ రూ.చూ. జడబిల్ల. వి. జడకుపెట్టుకునే నగ. జడబ్రతుకు వి. జటాయువు. అచ్చ.రా. అరణ్య. 75. వ్యు. ఎక్కువ ఆయువు కలది. జడముడి వి. 1. గుండ్రంగా ముడిచిన ఈశ్వరుని జడలముడి, కపర్దం. భార. ద్రోణ. 5.409; 2. జడల యొక్క ముడి. ద్వి. భాగ. 10 నం. జడముడిజంగము వి. కపర్ది, శివుడు. జడముడితాల్పు వి. శివుడు. వ్యు. కపర్దం ధరించినవాడు. జడమెకము వి. కేసరి, సింహం. చెన్నబసవ. 4.267. జడలగంటు వి. శివుని జటాజూటం. జడలమెకము వి. కేసరి, సింహం. అచ్చ.రా. బాల. 47. జడలసికదేవర వి. ధూర్జటి, శివుడు. అచ్చ.రా. సుందర. 54. జడలుకట్టు రూ.చూ. జడలుగట్టు. అ.క్రి. జడలుగా ఏర్పడు, అంటుకొనిపోవు. జడలుగట్టు (-కట్టు) రూ. జడలుకట్టు. అ.క్రి. జడలుగాఏర్పడు, అంటుకొనిపోవు. కు.సం. 7.838. జడల్గలకోతిమిన్నమేపుట్టువు వి. కేసరి పుత్రుడు, ఆంజనేయుడు. జడసాంబ వి. మంచి సన్నరకం వడ్లు. జడాత్రిగడ్డ వి. కంకి ముద్దగా ఉండేరకం(వడ్లు).

జడక వి. 1. చినిగినబట్ట. విజ్ఞా. ఆచా. 111, మార్క. 1.224; 2. మాసిన ముతక వస్త్రం.

సం. శాట-, శాటక-; ప్రా. సాడఅ, సాడగ, సాడిఅ, సాడియా, సాడీ. వస్త్రం; అ.మా. సాడ, సాగడ, సాడయు. ఉత్తరీయం.

<ప్రా. సాడఅ.

జడను విణ. మందమైన, అలసత్వంకల. హరి. పూ. 7.116. వి. 1. అలసత, మాంద్యం. హరి. ఉ. 3.180; 2. కొరత, లోపం. మను. 3.47; 3. సంశయం, సందేహం. పాండు. 5.167.

సం. జడతా, జడత్వ-, జాడ్య-. అలసత, అజ్ఞానం, మాంద్యం; ప్రా. జడ-. జడియ-, జడ్డ-.

<ప్రా. జడ-.

జడనుపడు అ.క్రి. 1. మాంద్యమునొందు. భాగ. 2.225; 2. కాంతి తగ్గు, మందగించు. మను. 3.119.

జడవాన రూ.చూ. జడివాన. వి. తుఫాను, గాలివాన.

జడాత్రిగడ్డ చూ. జడ.

జడాయించు స.క్రి. ఆముపడుగులో పాత్రల్ని వరసలవారిగా అమర్చు.

జడి[1] వి. 1. విడవకుండా కురిసే వాన, ముసురు. హరి. ఉ. 4.237; 2. వాన (ధార). రాఘవ. 2.5; 3. రంకు, కోలాహలం. వసు. 2.152; 4. బాధ. విణ. నిరంతరమైన, అవిచ్ఛిన్నమైన, దట్టమైన. హర. 2.25.

క. జడి. నిరంతరవృష్టి; తు. జడిపిని, జడిపుని. ఎడతెగక కురియు.

సం. ఝరీ. ప్రవాహం; ప్రా. ఝాడీ. నిరంతరవృష్టి; బెం. ఝడ్. తుఫాను; గు. మరా. ఝడీ.

జడికొను రూ. చూ. జడిగొను. అ.క్రి. 1. గుంపుకూడు, సంక్షుభవించు; 2. అతిశయించు; 3. ఎడతెగకుండు; 4. ఎడం లేకుండు. జడిగాడ్పు వి. ప్రచండ వాయువు, గట్టిగా విసిరేగాలి. జడిగురియు (-కురియు) అ.క్రి. ఎక్కువగా వర్షించు. జడిగొను (-కొను) రూ. జడికొను. అ.క్రి. 1. సంక్షుభవించు, గుంపుగూడు. బసవ. 7.910 పం.; 2. ఎడతెగక ఉండు. భాస్క.రా. 1075; 3. ఎడము లేక ఉండు. రం.రా.సుందర. 247 పు. 20 పం.; 4. అతిశయించు, మెండుకొను, ముమ్మరించు. నృసింహ. 2.135; జడిగొలుపు రూ.చూ. జడిగొల్పు. స.క్రి. జడిగొనచేయు, జడిజడిగా కురియుంచు, అవిచ్ఛిన్నంగా కురియించు. వరాహ. 11.113. జడిగొల్పు రూ. జడిగొలుపు. స.క్రి. జడిజడిగా కురియించు, అవిచ్ఛిన్నంగా కురియించు. జైమిని భా. 5.190. జడిపట్టు రూ. జడివట్టు. వి. జడిపట్టటం. హరి. పూ. 7.160. అ.క్రి. 1. ముసురుపట్టు; 2. పట్టుదలపట్టు. జడిపెట్టు రూ.చూ. జడివెట్టు. స.క్రి. 1. బాధపెట్టు. ప్రభు. 2.32 పు. 1 పం.; 2. కాలక్షేపంచేయు. జడివట్టు రూ.చూ. జడిపట్టు. అ.క్రి. 1. ముసురుపట్టు. హర. 1.10; 2. పట్టుదలపట్టు. సకలనీతి సమ్మతము. 369. వి. జడిపట్టటం. జడివాన రూ. జడవాన. వి. సందులేకుండా కురిసే సన్నవాన, నిరంతర వృష్టి. ఇందు. 3.77. జడివెట్టు రూ. జడిపెట్టు. స.క్రి. 1. కాలక్షేపం చేయు. కాశీ. 4.50; 2. బాధపెట్టు. జడిసామి వి. వరుణుడు. వ్యు. నీటిరాజు.

జడి[2] అవ్య. ద్రు. శీఘ్రంగా.

సం. ఝటితి. శీఘ్రంగా; ప్రా. ఝడత్తి. శీఘ్రం; అప. ఝడత్తి. వెంటనే;

క. జడితి; తు. జడితి, ఝడితి; మ. చడితి.

<ప్రా. ఝడత్తి.

జడిగం రూ.చూ. జడ్డిగము[1]. వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎద గొర్రిమీద అమర్చే పిడత.

జడిగెం రూ.చూ. జడ్డిగము[1]. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎదగొర్రిమీద అమర్చేపిడత.

జడించు రూ.చూ. జడియించు. స.క్రి. బెదరించు, జడిపించు.

**జడితి** అవ్య. ద్రు. జరజర, వడిగా.

సం. ఝటితి-. శీఘ్రంగా ; ప్రా. ఝడత్తి- ; అప. ఝడత్తి.

< ప్రా. ఝడత్తి.

**జడిపించు** చూ. జడుపు[1].

**జడియించు** చూ. జడియు[1].

**జడియు[1]** అ.క్రి. **1**. భయపడు, భీతిల్లు. పండి. చ. 1.126; **2**. కంపించు, వణుకు. ఉ.హరి. 2.109 ; **3**. చలించు, కదులు. కాశీ. 1.47 ; **4**. చెదిరిపడు, రాలు. వసు. 2.140 ; **5**. మోగు, ధ్వనిచేయు. వసు. 3.67 ; **6**. దట్టమగు. సారంగ. 3.238 ; **7**. స్రుక్కు, మూర్ఛిల్లు. శుక. 3.448.

క. జడే, జడె. బెదిరించు, భయపెట్టు, గద్దించు; వళి. మరొకరి శక్తిని క్షీణపరచు ; తు. జడు. భయం; జంగు, జళ్లు. అస్థిరత; జళ్లుగ. బలహీనమైన, దుర్బలమైన మనిషి ; మ. చళుణ్ణుక. భయపెట్టు, వణికించు.

< మూ.ద.ద్రా. *చట్- / *చల్-.

**జడియించు** రూ. జడించు, స.క్రి. బెదరించు, జడిపించు.

**జడియు[2]** స.క్రి. **1**. ఉక్తమున్నంతమైన 'తొలగు' ధాతువుకు అనుప్రయుక్తమై ప్రేరణార్థాన్నిస్తుంది. భార. విరా. 5.397 ; **2**. తిప్పు, భ్రమింపజేయు. భార. ఉద్యో. 1.323 ; **3**. తొలగించు. భార. ఉద్యో. 3.176 ; **4**. నివారించు, అడ్డగించు. భార.భీష్మ. 2.193 ; **5**. కొట్టు. భాగ. 8.334. అ.క్రి. తొలగు, తొలగిపోవు. భార.శాంతి. 3.508.

క. జడిసు. కొట్టు ; జడే. ఆడించు, కత్తి ఝళిపించు, కొట్టు ; తు. జడియుని, దడిపుని. అవతలకి తోయుట ; మ. చాటుక. తోయు ; చాట్టుక. బాణములువేయు, విసరు ; చాట్టు. విసరుట ; చాట్ట. కొరడా ; గోం. జఙ్ హుత్. తీవ్రంగా కదుపుట ; కుఇ. జఙ్ప. గుడ్డ, చెయ్యి, కాలు కదల్చలేక ఆడించు ; కొలా. జడ్ప. దులిపివేయు.

**జడుపు[1]** చూ. జడియు. రూ.చూ. జళుపు. వి. భయం, భీతి. వైజ. 3.65.

క. జడే. బెదిరించే భాష ఉపయోగించు, భయపెట్టు, బెదిరించు, నింద ; తు. జడు. భయం, బిడియం.

**జడిపించు** స.క్రి. భయపెట్టు. ద్వి. హరిశ్చ. ఉ. 339 పం.

**జడుపు[2]** వి. ఒకరకం అంటురోగం (పశువులకు వచ్చే వ్యాధి).

**జడుపుగాటు** వి. ఒకరకం అంటురోగం.

**జడుము** వి. అడవిదారి.

**జడెగం** యా.చూ. జడ్డిగము[1]. వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎదగొర్తిమీద అమర్చే పిడత.

**జడ్జి** యా. జడ్జీ, జెడ్జి. వి. **1**. తీర్పుకర్త, న్యాయాధిపతి ; **2**. విమర్శకుడు.

ఇం. *Judge*. న్యాయాధిపతి.

< ఇం. Judge.

**జడ్జిమెంటు** వి. న్యాయస్థానపు తీర్పు.

ఇం. *Judgment*. న్యాయాలయపు తీర్పు.

< ఇం. Judgment.

**జడ్జీ** యా.చూ. జడ్జి. వి. న్యాయాధిపతి, ధర్మాధర్మ నిర్ణేత.

**జడ్డు[1]** వి. కీడు, కష్టం, బాధ, సంకటం. విష్ణుపు. 5.102.

సం. జాడ్య-. అలసత్వం, మూర్ఖత్వం, మాంద్యం ; ప్రా. జడ్డ-.

< ప్రా. జడ్డ-.

**జడ్డు[2]** రూ. జెడ్డ. వి. **1**. హల్లుతో కూడిన హల్లు. ఆం.బా.భూ. 124, కవిజనా. సంజ్ఞా. 13 ; **2**. రెండు కలిసినవి.

క జడ్డు. సమీపత, ఏకత.

**జడ్డన** క్రి.విశే.ద్రు. తటాలున, శీఘ్రంగా. భాగ. 1.260.

**జడ్డి[1]** రూ. జడ్డె[1]. వి నడుమ బరువుకట్టి ఇద్దరు మనుషులు మోసుకొనిపోవటానికి ఉపయోగించే పొడవైన కర్ర, పాటి కర్ర.

**జడ్డిపెట్టె** వి. జడ్డికి కట్టిన పెద్దపెట్టె. **జడ్డియూఁతె(-ఊఁతె)** వి. నడుమ పిడిగల ఊఁతె.

**జడ్డి[2]** రూ. జడ్డె[2]. విశే. **1**. తెలివితేటలు లేని ; **2**. మూగ అయిన ; **3**. పిచ్చి.



**జడ్డిగము[1]** రూ. జడిగం, జడిగెం, జడెగం, జడ్డిగెం, జటిగెం. వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎదగొర్తిమీద అమర్చే పిడత. ప్రబా. 4.124.

సం. సాధికా. ఉపకరణం ; ప్రా. సాఢిగా, సాహిఆ ; క. సడ్డె. జడ్డిగం.

< ప్రా. సాఢిగా.

**జడ్డిగంలడె** వి. జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి పీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంలొట్ట** వి. జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి పీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంకట్టె** వి. జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి పీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంకర్ర** రూ. జడ్డిగపు కర్ర. వి. జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి పీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంకొమిరె** వి. జడ్డిగప్పిడతలో విత్తనాలు పోయే రంధ్రాల మధ్య ఎత్తుగా చెక్కిన భాగం. **జడ్డిగంకొళివి** వి. జడ్డిగప్పిడత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి పీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంకోవి**

వి. జడ్డిగప్పిడతత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి వీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంగిన్నె** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యపిడత. **జడ్డిగంగిలక** వి. జడ్డిగం తాళ్ళు బిగించటానికి అమర్చిన కొయ్యపలక. **జడ్డిగంగొట్టం** వి. జడ్డిగప్పిడతత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి వీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంచిప్ప** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంచిలక** వి. జడ్డిగపు తాళ్ళు బిగించటానికి అమర్చిన కొయ్యపలక. **జడ్డిగపుకట్టెలు** వి.బ.వ. గొర్రిపట్టెలను జడ్డిగపుపిడుతను గుచ్చిన గొట్టాలు. **జడ్డిగపుత్రాళ్ళు** వి.బ.వ. గొట్టమును పిడుతకు కట్టే తాళ్ళు. **జడ్డిగపుపిడత** రూ. జడ్డిగంపిడత. వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంపంతె** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంపిడత** రూ.చూ. జడ్డిగపుపిడత. వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంపీట** వి. జడ్డిగపుతాళ్ళను బిగించటానికి అమర్చిన కొయ్యపలక. **జడ్డిగంబిళ్ళ** వి. జడ్డిగపు తాళ్ళను బిగించటానికి అమర్చిన కొయ్యపలక. **జడ్డిగంబుడ్డి** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంబుర్ర** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంబొంగు** వి. జడ్డిగప్పిడతత విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంబొడ్డు** వి. జడ్డిగప్పిడతలో విత్తనాలు పోయే రంధ్రాల మధ్య ఎత్తుగా చెక్కిన భాగం. **జడ్డిగంబొర్ర** వి. జడ్డిగప్పిడతలో విత్తనాలు జారి చాళ్ళలో పడటానికి వీలుగా అమర్చిన వెదురుగొట్టం. **జడ్డిగంముంత** వి. జడ్డిగానికి అమర్చిన కొయ్యగిన్నె. **జడ్డిగంముల్లు** వి. జడ్డిగప్పిడతలో విత్తనాలు పోయే రంధ్రాల మధ్య ఎత్తుగా చెక్కిన భాగం. **జడ్డిగంమొగ్గ** వి. జడ్డిగప్పిడతలో విత్తనాలు పోయే రంధ్రాల మధ్య ఎత్తుగా చెక్కిన భాగం.

**జడ్డిగము**[2] వి. తల, శిరస్సు. ఉ.రా. 3.237.

**జడ్డిగంపంతె** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంపిడత** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంపీట** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబిళ్ళ** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబుడ్డి** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబుర్ర** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబొంగు** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబొడ్డు** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంబొర్ర** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంముంత** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంముల్లు** చూ. జడ్డిగము[1].

**జడ్డిగంమొగ్గ** చూ. జడ్డిగము[1].

**జడ్డిగెం** రూ.చూ. జడ్డిగము[1]. వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎదగొర్తి మీద అమర్చేపిడత.

**జడ్డీ**[1] రూ.చూ. జడ్డి[1]. వి. రెండు పొడుగాటి బొంగులను కల్పుతూ మధ్యలో రేకు బిగించి మోతకు పనికి వచ్చేట్లు చేసిన సాధనం.

**జడ్డీ**[2] రూ.చూ. జడ్డి[2]. విశ. **1**. తెలివితేటలు లేని; **2**. మూగ అయిన; **3**. పిచ్చి.

**జడ్డు**[1] **1**. తగులం, అనుబంధం. భాగ. 2.61; **2**. జడను. అలసత, మాంద్యం. భాగ. 8.266; **3**. పారవశ్యం. **విశ**. జడమయిన, తెలివిలేని. భాగ. 10 పూ. 257; **4**. కష్టం. బాధ. నార.పంచ. 1.51.

క. *జడ్డు, జిడ్డు, దడ్డు*. నొప్పిలేమి, కాయగాచిన మచ్చ, పులిపిరికాయ, మచ్చ; *దడ్డ*. మొద్దువాడు; కొడ. *దడ్డె*. మొద్దువాడు; తు. *జడ్డు*. నొప్పిలేమి; *దడ్డు, దడ్డె*. బుద్ధిహీనుడు.

**జడ్డుదనము** వి. మాంద్యం, జడత్వం. భాగ. 2.53. < జడ్డు+తనము. **జడ్డుకాడు** వి. సోమరి, జంకవాడు. సం. *జడ-*. జడుడు, మందుడు. **జడ్డుపడు** రూ. చూ. జడ్డువడు. అ.క్రి. **1**. జడతనొందు; **2**. పారవశ్యం పొందు. **జడ్డువడు (-పడు)** రూ. జడ్డుపడు. అ.క్రి. **1**. జడతనొందు, అలసతనొందు. పండి. చ. 1.61 పు. **2**. పారవశ్యం పొందు, భాగ. 1.260.

**జడ్డు**[2] వి. పడుగు తీసిన తర్వాత కళ్ళంలో ధాన్యం మీద ఉండే చెత్తాచెదారం.

**జణిగెం** రూ.చూ. జడ్డిగము[1]. వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి ఎదగొర్తి మీద అమర్చే పిడత.

**జంట** రూ. జమట. వి. **1**. జోడు, యుగళం. భార.ఆది. 2.34; **2**. తోడు, అండ, సాయం. భార.కర్ణ. 2.85; **3**. స్త్రీపురుషుల జత, జమట, కవ. మను. **4.39**. అవ్య.క్రి. **1**. వెంట, వెంబడి. ఉ.హరి. 2.140; **2**. సమీపంగా. భోజ. 6.32. విశ. **1**. జతఅయిన, జోడైన. ఇందు. 1.17; **2**. ద్విగుణితమైన, రెట్టింపయిన. ఆం.నా.సం. మాన. 42.

క. *జంటి*; త. *జతై*.

**జంటకడ్డీఅంచు** వి. జల్లజరీగీరల జంటగా పడేట్టు నేసిన అంచు. **జంటకవ్వం** వి. మెడనుంచి రెండు జబ్బల వరకు వ్యాపించిన రెండు చారలు. **జంటకిస్తీ** వి. ఒకే రెక్కను రెండు భాగాలు చేస్తూ చెక్కిన కిస్తీ. **జంటక్కిడి** వి. రెండు లొట్టలు గింజలు జారే వెదురు బొంగులు వేసిన అక్కడి. < జంట+అక్కడి. **జంటగూన** వి. ఒకేకావిడికి రెండువైపులా కట్టిన రెండు మోటలు. **జంటచేపలు** వి.బ.వ. అంచులో రెండేసి చేపలు వరసగా పడేట్టు నేసిన డిజైను. **జంటచ్చుమగ్గం** వి. రెండచ్చు లమర్చిన మగ్గం. < జంట+అచ్చుమగ్గం. **జంటదంటచౌకములపాళ్లతెలిముద్ద** వి. చంద్రుడు. ఆం.నా.సం. దేవ. 15. **వ్యు.** పదహారు కళలుకల తెల్లని బింబం (జంట = రెండు; దంట = రెండు; చౌకము = నాలుగు. $2 \times 2 \times 4 = 16$). **జంటనలుహజ్జలమెకము** వి. శరభమృగం. దశా. **5.115**. **వ్యు.** ఎనిమిది పాదాలుకల జంతువు (జంట = రెండు; నలు = నాలుగు; హజ్జలు = పాదాలు). **జంటనాడెనేత** వి. రెండు నాడెలతో నేసిన నేత. **జంటపిట్ట** వి. చక్రవాకం, జక్కవ. సాంబ.తిర్య. 78. **వ్యు.** జంటగా ఉండే పక్షి. **జంటపేటు** వి. అంచులో నేసే ఒక రకం డిజైను. **జంటపొట్ల** వి. కాయలు జంటలు జంటలుగా దిగే పొట్లకాయ రకం. **జంటపొయ్యి** రూ. జమటపొయ్యి. వి. రెండు పొయ్యిల్ని ఒకటిగా అతికించినట్లు చేసిన పొయ్యి. **జంటబాణము** వి. ఒకవిధమైన బాణానంచా. హంస. 3.28.

జంటబీర వి. ఒకరకం బీర (Luffa acutangula). **జంటముక్కాలి** వి. షట్పదం, తుమ్మెద. అచ్చ.రా. యు. 469. వ్యు. ఆరు కాళ్ళు కలది (జంట = రెండు ; మూఁడు + కాలు). **జంటమొగమువేల్పు** వి. అగ్ని. వ్యు. రెండు ముఖాలు కల దేవుడు. **జంటమొగమువేల్పుతేజీ** వి. పొట్టేలు. వ్యు. అగ్ని వాహనం. **జంటమొగంబులసామి** వి. అగ్నిదేవుడు. రామరా. 351. **జంటమోములదంట** వి. అగ్నిదేవుడు. అచ్చ.భా. 4.61 ప. **జంటమోములవేలుపు** రూ. జంటమోములవేల్పు. వి. ద్విముఖదేవత, అగ్నిదేవుడు. అచ్చ. రా. యు. 12. **జంటమోములవేల్పు** రూ. చూ. జంటమోముల వేలుపు. వి. అగ్నిదేవుడు. **జంటమోములసామి** వి. అగ్ని. వ్యు. ఇరు ముఖాల ప్రభువు. **జంటరాసి** వి. మిథునరాశి, యమళం. **జంటరివేణి** రూ. జంటవిరేని, జమటరివేణి. వి. పెళ్ళికివాడే రంగులు పూసిన అరివేణి కుండలు. < జంట + అరివేణి. **జంటరేవులు** వి. బ. వ. కొమ్ము రేవులు పక్కగా అము పక్కలో రెండు జంటలుగా విడిచిన సందులు. **జంటలు** వి. బ. వ. పూర్వోత్తరాభాద్రలు. **జంటవిరేని** రూ.చూ. జంటరివేణి. వి. పెళ్ళికివాడే రంగులు పూసిన అరివేణి కుండలు. జంట + అవిరేని (< అరివేణి). **జంటసరం** వి. జమిలివాసం. **జంటాఱు** విశ. పన్నెండు. నీలా. 3.35. < జంట + ఆఱు. **జంటాఱుమేనులసామి** వి. సూర్యుడు. **జంటాల్పొయ్యి** వి. రెండు పొయ్యిల్ని ఒకటిగా అతికించినటు చేసిన పొయ్యి. **జంటించు** స.క్రి. జోడించు, కూర్చు. మల్లు ప. 2.4. < జంట + -ఇంచు[3]. **జంట్రైదు** వి. పది. కృష్ణ. 1.14. < జంట + ఐదు.

**జంటాఱు** చూ. జంట.

**జంటాఱుమేనులసామి** చూ. జంటాఱు.

**జంటాల్పొయ్యి** చూ. జంట.

**జంటి** రూ. జంటీ. వి. జరీపట్టె. ఉ.రా. 6.131, చంద్రాంగ. 2.36.

**జంటించు** చూ. జంట.

**జంటీ** రూ.చూ. జంటి. వి. జరీపట్టె. శుక. 1.200.

**జంటు** అ.క్రి. జంటపడు, జతకూడు.

**జంట్రైదు** చూ. జంట.

**జండా** రూ.చూ. జెండా. వి. టెక్కము, పడగ.

**జండ్లపేటు** చూ. జంట. వి. అంచులో నేసే ఒక రకం డిజైను.

**జత** వి. 1. జంట, యుగ్మం. హర. 5.55 ; 2. జట్టు, పక్షం. కువ.చ. 3.132 ; 3. సామ్యం, తుల. నీలా. 3.24 ; 4. చెలిమి, మైత్రి ; 5. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట ; 6. లాగూ బొక్కాల జంట. విశ. సమానమైన, సాటిఅయిన. నీలా. 1.52.

సం. యూథికా. గుంపు, సమూహం, మేళం ; ప్రా. జూథిఅ ; హిం. జథా ; మరా. జథ, జథా.

క. జతె ; త. సడై.

< మరా. జథ.

**జతకూడు** రూ.చూ. జతగూడు. స.క్రి. కలియు, రమించు. అ.క్రి. 1. జట్టుగా ఏర్పడు ; 2. కలుగు, లభించు. **జతగట్టు(-కట్టు)** అ.క్రి. 1. గుంపుకూడు, సంఘీభవించు ; 2. పక్ష్యాదుల జతగూడు. **జతగాఁడు(-కాఁడు)** వి. మిత్రుడు, స్నేహితుడు. **జతగావించు(-కావించు)** స.క్రి. జతచేయు, సరిచేయు. మల్ల భూ. నీతి. 18. **జతగూడు** రూ. జతకూడు. స.క్రి. రమించు, కలియు. రం.రా.కిష్కిం. 198 పు. 15 పం. అ.క్రి. 1. జతగా కూడు, జట్టుగా ఏర్పడు. రం.రా.కిష్కిం. 198 పు. 15 పం. ; 2. కలుగు, లభించు. దశా. 2.413 ; 3. స్నేహంచేయు, చెలిమిచేయు. **జతచేయు** స.క్రి. జోడించు, రెంటిని కలుపు. **జతపడు** అ.క్రి. 1. చేకూరు, లభించు. అధ్యా.రా.ఉ. 246 పు.; 2. కూడు, కలియు. సీతారా. 3.64; 3. సరిపడు, అనుకూలమగు. **జతపఱచు** రూ.చూ. జతపఱుచు. స.క్రి. 1. పదిలపరుచు ; 2. జతపడచేయు, సిద్ధపరచు. **జతపఱుచు** రూ. జతపఱచు. స.క్రి. 1. పదిలపరుచు . 2. జతపడచేయు, సిద్ధపరుచు. **జతలుగట్టు(-కట్టు)** అ.క్రి. 1. గుంపుగూడు. సంఘీభవించు. హరి.పూ. 8.21 ; 2. పక్ష్యాదులు కవకూడు, జోడుకట్టు. **జతవచ్చు** అ.క్రి. సమానమగు, ఈడగు. జాహ్నవీ. పీఠి. 1.72.

**జతన** రూ.చూ. జతనము. వి. 1. హెచ్చరించేటప్పుడు ఉపయోగించే పదం. కళా. 8.230 ; 2. యత్నం. చంద్రాంగ. 1.16.

**జతనపడు** రూ.చూ. జతనుపడు. అ.క్రి. యత్నించు.

**జతనము** రూ. జతన, జతనా, జతను. వి. 1. యత్నం. భార. శాంతి. 1.78 ; 2. జాగ్రత్త. పారి. 5.86 ; 3. ఉత్సాహం, శక్తి. ఆం.భా. 2.190. విశ. 1. నిరపాయమైన, పదిలమైన. భాస్క.రా. కిష్కిం. 54 ; 2. శ్రేష్ఠమైన, మేలైన. అహల్యా. 3.77 ; 3. సిద్ధమైన, సన్నద్ధమైన. చెన్న బసవ. 2.207.

సం. యత్న-. యత్నం ; యతన- ; ప్రా. జత్త- ; పా. యతన-.

క. జతణ, జతన. శ్రద్ధ ; తు. జత్న ; త. యత్తనం, యత్తినం ; కురు. జతన్, జితనా.

< సం. యతన-.

**జతనముచేయు** స.క్రి. పదిలపరుచు, భద్రంచేయు. భాస్క.రా.యు. 1830.

**జతనా** రూ.చూ. జతనము. వి. హెచ్చరించేటప్పు డుపయోగించే పదం. కువ.చ. 2.47.

**జతను** రూ.చూ. జతనము. వి. హెచ్చరికను సూచించే పదం.

**జతనుపడు** రూ. జతనపడు. అ.క్రి. నిరపాయంగా ఉండు, పదిలంగా ఉండు. హరి.పూ. 4.5. **జతనుపఱుచు** స.క్రి. 1. పదిలపరుచు, భద్రపరుచు. హరి.ఉ. 1.81 ; 2. సిద్ధంచేయు, సిద్ధపరుచు. శశా. 3.5.

**జతి** వి. 1. సంగీతంలో గీత భేదం. బసవ. 1 పు. 533 పం.; 2. నాట్యయోగ శబ్ద సంతతి. బహుళా. 5.74; 3. గానయోగ్యశబ్ద సంతతి. చెన్నబసవ. 2.237.

సం. యతి-. ఛందశ్శాస్త్రంలో ప్రసిద్ధ విశ్రామ స్థానం ; ప్రా. జఈ, జఇ.

క. జతి ; తు. జతి ; త. జతి.

< సం. యతి-.

**జతులుపెట్టు** అ.క్రి. గానంచేయు.

జతికె రూ. జతిగె, జత్క, జుతికె, జుత్తిగ, జొతిక, జొతికె, జొత్తికె, జోత[1], దొత్తే. వి. **1.** ఎద్ల మెడలకు అందానికి గాని, కాడికి పూన్చడానికిగాని కట్టే తాడు లేదా తోలు; **2.** పడుగు నూలులో చివర పాయగా విడదీసిన పోగు.

క. చొత్తిగె, జుతిగె, జత్తిగె, జొత్తగె, జొత్తిగె.

సం. యోక్త్ర-. కాడికిగాని నాగలికిగాని కట్టే తాడు; ప్రా. జొత్త, జొత్తయ; పా. యొత్త-. కాడితాడు; యోక్తక-. తాడు, బంధం; నే. జొత్. కాడి, నాగలి; బెం. జొత; ఒ. జుత, జొత. కాడితాడు; బీ. జొత్. గుర్రం నడుముకు వేసే పట్టీ; హిం. జొత్. తాడు, కాడికి మెడకు కట్టే తాడు, పం. జొతర. తోలుపట్టె; సిం. జ్యొటొ. గడ్డిపోచ; గు. జొతార్, జ్యోతు. కాడి తోలుపట్టి.

< క. జతిగ. < ప్రా. జొత్తయ. < సం. యోక్త్ర-.

జతికెదారం వి. నేత పడుగులో చివరపాయకు కట్టిన దారం.

జతిగె రూ.చూ. జతికె. వి. కాడి కట్టడానికి ఎద్ల మెడకు తగిలించే పట్టెడ, కాలిపలుపు.

జతులుపెట్టు చూ. జతి.

జత్క రూ.చూ. జతికె. వి. ఎద్ల మెడలకు అందానికిగాని కాడికి పూన్చటానికికాని కట్టే తాడు లేదా తోలు.

జత్తాయితంబసు అ.క్రి. సిద్ధపడు.

జత్తిగె వి. విత్తనాలు చల్లటానికి మూడు రంధ్రాలు పొడిచి వెదగొర్తిమీద అమర్చే పిడత, బీజా వాపానికి ఉపయోగించే జడ్డిగం.

జత్తు రూ.చూ. జట్టు. విశ. సమానమైన. నవనాథ. 1.46 ప. 1 పం. వి. గమి, సమూహం, జట్టు. విప్ర. 3.86.

జది వి. సముద్ర మట్టంలో పెరిగే ఒక రకం చెట్టు (Ficus infectoria).

జద్దు వి. **1.** పారవశ్యం. శివరా. 1.64; **2.** కఠిన హృదయత, నిర్దయత.

సం. జగ్ధ-. అలసటనొందిన, భక్షితం; పా. జద్ధు.

< పా. జద్ధు.

జద్దుపడు రూ.చూ. జద్దువడు. అ.క్రి. (ఆనందం మొ. వాటివల్ల) పరవశత్వం చెందు. జద్దువడు రూ. జద్దుపడు. అ.క్రి. (ఆనందం మొ. వాటివల్ల) పరవశత్వం చెందు. శివరా. 1.64.

జన రూ. చన, సెన. వి. **1.** చేపలగుడ్లు ఒకటిగా కలిసి ఉండే కోపు; **2.** కంటి గుడ్డులోని పదార్థం; **3.** కోడి గుడ్డులో పాగు.

జనం వి. బండిచక్రం జారిపోకుండా కుండపక్కన ఇరుసులోకి దించిన మేకు.

జనకజనకగడి వి. ఒక రకం నేత గడి.

జనక్‌జనక్‌పేటంచు వి. ఒక రకం డిజైనులో నేసిన అంచు.

జనపతట్టు చూ. జనము.

జనపనార చూ. జనము.

జనపమోకు చూ. జనము.

జనపవారు వి.బ.వ. ఒక కులంవారు.

జనపవిత్తులు చూ. జనము.

జనము రూ. జనుం, జనుము, జనువు. వి. నారతీయటానికి ఉపయోగించే ఒక రకం పైరు. విష్ణు.నా.3. (Crotalaria juncea).

సం. శణ-. జనుం; ప్రా. సణ-, సిణ-. ధాన్యవిశేషం, తృణవిశేషం; అమా. సణ; పా. సణ; కమా. సణ్; నే. సన్; అ. క్సన్; బెం. సన్; ఒ. ఛణి; బీ. సన్; హిం. సన్, సనీ; పం. సణ్; సిం. సిణీ; గు. సణియు, సణ్; మరా. సణ్; సింహ. సన, హణ.

క. సణబు, సణంబు; త. చణప్పు, చణప్పై, చణల్; మ. శణం; కుఇ. సొని; కువి. జలంగ.

< ప్రా. సణ-.

జనపతట్టు వి. జనపనార పట్టాతో కుట్టిన కుంచె చెంప. జనపనార రూ. జనుపనార. వి. జనుం పైరు నుంచి తీసిన నార. జనపమోకు వి. జనపనారతో పేనిన పగ్గం. చెన్న బసవ. 2.204. జనపవిత్తులు వి.బ.వ. భంగా బీజా, శనగ గింజలు.

జనముద్దు వి. అల్లారు ముద్దు.

సం. జన-. మానవ సమూహం.

< సం. జన + ముద్దు (మిశ్ర. స.)

జనరల్ రూ. జ్రనల్. విశ. సర్వసామాన్యమైంది. అందరికీ అన్నిటికి సమానంగా అన్వయించేది. వి. సైనికోన్నతోద్యోగి.

ఇం. *General.* సర్వసామాన్యమైన, సైనికోన్నతోద్యోగి.

< ఇం. General.

జనరల్‌ఎడ్యుకేషన్ వి. సాధారణ విద్య.

ఇం. *General education.* సాధారణ విద్య.

< ఇం. General education.

జనరల్‌నాలెడ్జి వి. లోకజ్ఞానం.

ఇం. *General knowledge.* లోకజ్ఞానం.

< ఇం. General knowledge.

జనరల్‌మర్చంట్స్ వి.బ.వ. **1.** చిల్లర వ్యాపారి; **2.** కిరాణా వ్యాపారి.

ఇం. *General merchants.* చిల్లర వ్యాపార్లు.

< ఇం. General merchants.

జనలు రూ.చూ. జన్నలు. వి.బ.వ. కిటికీలు, జనాలు, జనారులు.

జనవరి రూ. జెనవరి. వి. ఆంగ్ల పంచాంగం ప్రకారం సంవత్సరంలో మొదటి నెల.

ఇం. *January.* సంవత్సరంలో మొదటి నెల.

< ఇం. January.

జనాగాయి వి. రెండు పక్షాలున్నపుడు అటూ, ఇటూ తిరిగేవాడు, దొర్లుడు పుచ్చగాయి.

జనానా వి. **1.** మహమ్మదీయ స్త్రీలుండే నివాసం; **2.** అంతఃపురాంగనల సమూహం.

హిం. జనానా. స్త్రీలకు సంబంధించిన; మరా. జనానా. అంతఃపురం; ఉ. జనానా. స్త్రీలయొక్క, స్త్రీలకు తగిన; పార. జనానహ్. స్త్రీల ప్రత్యేకాలు,

స్త్రీ సంబంధమైన.

<ఉ. జనానా.

**జనాఫా** రూ.చూ. జనాభా. వి. జన సంఖ్య.

**జనాభా** రూ. జనాఫా. వి. జన సంఖ్య.

హిం. జనాబ్. జనాన్ని పుట్టించటం; ఉ. జనాబ. ప్రజలు.

<ఉ. జనాబ.

**జనాభాదస్తు** వి. జనాభా పన్ను. **జనాఫాలెక్క** వి. జనగణనం, ప్రజల సంఖ్యను లెక్కపెట్టటం. **జనాఫాసిస్తు** వి. జనాభా పన్ను.

**జనారులు** రూ.చూ. జన్నలు. వి.బ.వ. కిటికీలు, జన్నలు.

**జనార్లు** రూ.చూ. జన్నలు. వి.బ.వ. కిటికీలు, జనారులు.

**జనార్లగూడు** వి. కిటికీగూడు.

**జనాలు** రూ.చూ. జన్నలు. వి.బ.వ. కిటికీలు, జనలు.

**జనిగెపట్టు** వి. జలగపట్టు వంటి పట్టు, గట్టి పట్టు.

**జనుం** రూ.చూ జనుము. వి. నారతీయటానికి ఉపయోగించే పంట.

**జనుకు** రూ.చూ. జంకు. అ.క్రి బెదరు, భయపడు. వేఙ. ళ. 24.

**జనుగడ్డి** వి. సముద్ర మట్టంలో పెరిగే పశువుల మేతగా ఉపయోగపడే ఒక రకం గడ్డి (Amphilophis petusa).

**జనుగొయ** రూ. ననగొయ్య. వి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండి చట్రపు నిలువు పట్టెలకు బిగించిన కర్ర.

**జనుపనార** చూ. జనుము.

**జనుపనారపట్టా** చూ. జనుము.

**జనుము** రూ.చూ. జనము. వి. నారతీయటానికి ఉపయోగించే ఒక రకం పైరు.

**జనుపనార** రూ.చూ. జనపనార. వి. జనుం పైరు నుంచి తీసిన నార. **జనుపనారపట్టా** వి. గోనె సంచి. **జనుము పండుగ** వి. జనపచేను పూత పట్టినప్పుడు నార తీసేవాళ్ళు చేసుకొనే పండుగ.

**జనుపు** రూ.చూ. జనము. వి. నారతీయటానికి ఉపయోగించే ఒక రకం పైరు.

**జంత[1]** రూ. జంతె[1], జెంత. వి. 1. లంజ. సుద. 3.114; 2. స్త్రీ. సారంగ. 3.101; 3. గయ్యాళి. సాంబ. మాన. 5, ఆం.భా. 2.117. విశే. 1. దుష్టురాలైన (స్త్రీ). రామాభ్యు. 5.138; 2. సాహసికురాలైన (స్త్రీ). శగా. 4.135.

సం. యన్త్ర-. ఒత్తిడి, బలప్రయోగం; ప్రా. జంత-. వశమొనర్చు; జంత. వశీకరణం, రక్ష.

<ప్రా. జంత-.

**జంతతనము** వి. 1. గయ్యాళితనం. శుక. 2.180, 336; 2. దుష్టత్వం. **జంతమాటలు** వి.బ.వ. మాయ మాటలు. ద్వి. సార. చ. 3.107 పు. 190 పం.

**జంత[2]** రూ. జంతె[2]. చూ. జంత్రము. వి. కలుపుపోయేటట్లు దున్నే పనిముట్టు.

సం. యన్త్ర-. యంత్రం; ప్రా. జంత-. పనిముట్టు, సాధనం.

<ప్రా. జంత-.

**జంతపట్టు** అ.క్రి. కలుపు తెగి, చక్కగా పండటానికి పైరు మధ్యలో దున్ను.

**జంతనం** రూ.చూ. జంత్రము. వి. 1. పెద్ద పడుగులు ఒకే సారి పోసే ఒక రకం ఆను; 2. పన్నె తయారు చేసే కొయ్య పనిముట్టు, 3. చుక్క కట్టటానికి, నూలు బొందులు తగిలించే ఒక రకం కొయ్య పనిముట్టు; 4. గొంగడి నేసేటప్పుడు అవి తెరవటానికి అచ్చు గోలకు కట్టిన కొయ్య పనిముట్టు.

**జంతర** రూ.చూ. జంత్రము. వి. 1. పెద్ద పడుగులు ఒకే సారి పోసే ఒక రకం ఆను; 2. పన్నె తయారు చేసే కొయ్య పనిముట్టు; 3. చుక్క కట్టడానికి, నూలు బొందులు తగిలించే ఒక రకం కొయ్య పనిముట్టు; 4. గొంగడి నేసేటప్పుడు అవి తెరవడానికి అచ్చు గోలకు కట్టిన కొయ్య పనిముట్టు.

**జంతరబొమ్మ** వి. గొంగడి మగ్గం జంత్రంలో కింది కట్టెను, పై కట్టెను కలిపే నగిషీ చెక్క.

**జంతరము** రూ.చూ. జంత్రము వి. 1. మర; 2. కీలు బొమ్మ; 3. వింత పని; 4. గాన సాధనం.

**జంతి** వి. 1. సన్నటి పీఠి, సందు; 2. రెండు దూలాల మధ్య వేసే అడ్డ కొయ్య; 3. చిన్న దిండు.

**జంతిక** రూ. జంతికె. వి. 1. జంతికెల గొట్టం. చంద్రాంగ. 4.209; 2. భక్ష్యవిశేషం, సారెనత్తు. ఆం.భా. 2.255.

సం. యన్త్రక-, యన్త్రికా. యంత్రాన్ని నడిపే వాడు; ప్రా. జంతిఅ. యంత్ర సంబంధమైనది.

<ప్రా. జంతిఅ.

**జంతికకురుపు** రూ. జంతికె కురుపు. వి. అనేక రంధ్రాలు గల రణం (కురుపు). **జంతికచుట్లు** వి.బ.వ. 1. జంతికల కర్ర, జంతికల్ని చేసే యంత్ర విశేషం. చంద్రాంగ. 4.209; 2. జంతికలాగ చుట్టిన చుట్లు, ఒక రకం పిండి వంట. చెన్నబసవ. 4.358; 3. జిలేబి. **జంతికపుండు** రూ. జంతికె పుండు. వి. అనేక రంధ్రాలు గల కురుపు. జల్లెడ కురుపు. ఆం.భా. 2.130.

**జంతికె** రూ.చూ. జంతిక. వి. 1. చక్కిలం, మణుగు పూవు; 2. జంతిక గొట్టం.

**జంతికెకురుపు** రూ.చూ. జంతిక కురుపు. వి. చాల రంధ్రాలుపడే కురుపు, రాచకురుపు, జంతిక పుండు. **జంతికె పుండు** రూ.చూ. జంతిక పుండు. వి. అనేక రంధ్రాలు ఉన్న రణం (కురుపు).

**జంతె[1]** రూ.చూ. జంత[1]. వి. 1. గయ్యాళి; 2. లంజె; 3. స్త్రీ.

**జంతె[2]** రూ.చూ. జంత[2]. వి. 1. మిద్దె యింటికి అడ్డంగా వేసిన పట్టె; 2. కలుపు మొక్కలు పోవడానికి దున్నే పనిముట్టు.

**జంత్రం** రూ.చూ. జంత్రము. వి. 1. పెద్ద పడుగులు ఒకేసారి పోసే ఒక రకం ఆను; 2. పన్నె తయారీలో వాడే కొయ్య పనిముట్టు; 3. చుక్క కట్టడానికి, నూలు బొందులు

తగిలించే ఒక రకం కొయ్య పనిముట్టు; **4.** గొంగడి నేసేటప్పుడు అవి తెరవడానికి అచ్చుగోలుకు కట్టిన కొయ్య పని ముట్టు.

జంత్రంవారు వి. గొంగడి నేసే మగ్గం జంత్రాన్ని, అచ్చు కోలను కలిపేనరం. జంత్రంకఱ్ఱ వి. పన్నెతయారు చేసే జంత్రంలో నిలువుకొయ్యలు బిగించిన వెదురు బొంగు. జంత్రంతాడు వి. పన్నెకట్టే జంత్రం బొమ్మ దండెలు బిగించి కట్టిన దారం. జంత్రందండె వి. అచ్చుకట్టే జంత్రానికి, నిండుపుల్లలు బిగించిన కిందిపీట. జంత్రందిండు రూ. దంతెరదిండు. వి. గొంగడి నేసే మగ్గం జంత్రానికి కింద బిగించిన కొయ్యచెక్క. జంత్రంపీట వి. అచ్చుపడి కట్టడానికి కఱ్ఱలు బిగించే కొయ్యపనిముట్టు.

**జంత్రగాఁడు** చూ. జంత్రము.

**జంత్రపుగుది** చూ. జంత్రము.

**జంత్రపుగూటం** చూ. జంత్రము.

**జంత్రపుతాడు** చూ. జంత్రము.

**జంత్రపుబిళ్ళ** చూ. జంత్రము.

**జంత్రబొమ్మ** చూ. జంత్రము.

**జంత్రబ్బిళ్ళ** చూ. జంత్రము.

**జంత్రము** రూ. జంతనం, జంతర, జంతరము, జంత్రం. వి. **1.** మర. భార. ద్రోణ. 1.371; **2.** అద్భుతమైనపని. నృసింహ. 4.123; **3.** సుకరంగా పనిచేసుకోడాని కుపయోగించే సాధన విశేషం. హర. 1.22; **4.** వీణ. సారంగి మొ. గాన సాధనం. మను. 2.43; **5.** కీలుబొమ్మ, మరబొమ్మ. కవిక. 2.197.

సం. *యంత్ర*-. మర; *యంత్రిక*-. చేతిమర, ప్రా. *జంత*-. మర, గాలిమర, నీటిమర; పా. *యంత*-. మర; కా. *ఎంద్రద*. నూలువడికే యంత్రం; కుమా. *జంతొ*. చేతిమర, మరరాయి; నే. *జాతొ*. తిరగలి రాయి; అ. *జత్*. చేతిమర; బెం. *జాంత్*. అచ్చు యంత్రం; ఒ. *జాంతి*. అడకత్తెర; హిం. *జాంత్*, *జాంతా*. చేతిమర; పం. *జందర్*. నీటిమర, బియ్యంమర; సిం. *జంద్రు*. చేతిమర; *జొంద్రొ*. తాళపుమర; గు. *జంత్రుఁ*, *జత్రుఁ*. తీగలు చేసే యంత్రం.

క. *జంత్రం*; తు. *జంత్ర*; త. *ఇయంతిరం*, *ఎంతిరం*, *ఏంతిరం*; మ. *ఏంత్రం*; గోం. *జంతర్*. సంగీతసాధన విశేషం; కువి. *జెథ*. తిరుగలి; గ. *జంతర్ కండు*. తిరుగలి.

<ప్రా.జంత-.

జంత్రగాఁడు వి. **1.** యంత్రం నడిపేవాడు. భాగ. 10 పూ. 1759; **2.** వీణ. సారంగి మొదలైన సాధనాల్ని వాయించేవాడు. వరాహ. 9.26. <జంత్రము+కాఁడు. జంత్రపుగుది వి. అచ్చుకట్టే జంత్రం కొయ్యకు కట్టినదారం. జంత్రపుగూటం వి. అచ్చుకట్టే జంత్రం కిందపీటకు గాని నిలువు కమ్మికి గాని బిగించిన నిలువుపుల్ల. జంత్రపుతాడు వి. అచ్చుకట్టే జంత్రం కొయ్యకు కట్టినదారం. జంత్రపుబిళ్ళ రూ. జంత్రబ్బిళ్ల. వి. అచ్చుకట్టేటప్పుడు వడిదారం మట్టిన కొయ్య. జంత్రబొమ్మ వి. **1.** మాయలాడి. ద్వి. హరిశ్చ. ఉ. 1199. పం.; **2.** జంత్రపుబొమ్మ, కీలుబొమ్మ. <జంత్రము+బొమ్మ. జంత్రబ్బిళ్ళ రూ.చూ. జంత్రపుబిళ్ళ. వి. అచ్చు కట్టేటప్పుడు వడిదారం కట్టినబిళ్ళ.

**జందాలపండుగ** చూ. జందెము.

**జందియము** రూ.చూ. జన్నిదము. వి. **1.** యజ్ఞోపవీతం, బ్రహ్మసూత్రం. ద్వి. హరిశ్చ. 935; **2.** భుజం మీద నుంచి రొమ్ముకు అడ్డంగా నరికిన నరుకు.

**జందివారము** రూ.చూ. జన్నిదము. వి. జందెము.

**జందెం** చూ. జన్నిదము. వి. నేతలో డిజైను పడడానికి డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోనికి వేలాడదీసిన దారం.

జందెంతాడు వి. మరమగ్గం కుచ్చునుంచి చెంపతాడు వరకూ కట్టినదారం.

**జందెపుకాడి** చూ. జందెము.

**జందెపువాటు** చూ. జందెము.

**జందెము** రూ.చూ. జన్నిదము. వి. **1.** యజ్ఞోపవీతం, బ్రహ్మసూత్రం. శివరా. 2.64; **2.** భుజం మీదనుండి రొమ్ముకు అడ్డంగా నరికిన నరుకు.

జందాలపండుగ వి. శ్రావణపౌర్ణమి (నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ), కొత్త జందేలు వేసుకొనే పండగ. జందెపుకాడి వి. కాడివెనక కట్టిన కాడి. జందెపువాటు వి. **1.** జందెం వేసుకోవటం. వాల్మీ. 2.8; **2.** జంజెంలాగ వేసుకోవటం, వల్లెవాటు. శుక. 2.96. జందేలపౌర్ణమి రూ.చూ. జంద్యాలపౌర్ణమి. వి. శ్రావణపౌర్ణమి (నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండగ). ఈ రోజు కొత్త జంద్యాలు వేసుకొంటారు.

**జందేలపౌర్ణమి** చూ. జందెము.

**జంద్యము** రూ.చూ. జన్నిదము. వి. యజ్ఞోపవీతం, బ్రహ్మసూత్రం. రుక్మా. 5.198.

జంద్యముపెట్టు వి. జందెం వలె ఏటవాలుగా నరికిన నరుకు. పల్నా. జంద్యాలపున్నమి రూ.చూ. జందేల పౌర్ణమి. వి.శ్రావణపౌర్ణమి. జంద్యాలపౌర్ణమి రూ. జంజెరాల పున్నమ, జంజెలపున్నమ, జందేల పౌర్ణమి, జంద్యాలపున్నమి. వి. శ్రావణపౌర్ణమి (నేతపనివారు ముఖ్యంగా చేసుకొనే పండగ). ఈరోజు కొత్త జంద్యాలు వేసుకొంటారు.

**జంద్యాలపున్నమి** చూ. జంద్యము.

**జంద్యాలపౌర్ణమి** చూ. జంద్యము.

**జన్న** వి. చిన్న తెల్లటి పూలుపూసే ఒకరకం మొక్క, నేలనేరేడు మొక్క (Premna herbacea).

**జన్నఁడు** వి. అశ్వవిశేషం.

క. *జన్న*. ఒకరకం గుఱ్ఱం.

**జన్నపుగొంగ** చూ. జన్నము.

**జన్నపుఁగాపరి** చూ. జన్నము.

**జన్నపుఁగూటిదొర** చూ. జన్నము.

**జన్నపుఁజుక్క** చూ. జన్నము.

**జన్నపుటొజ్జ** చూ. జన్నము.

**జన్నపుఁదిండి** చూ. జన్నము.

**జన్నపుఁదిండిదొరలు** చూ. జన్నము.

జన్నపు(దిండిరాయండు చూ. జన్నము.
జన్నపుబా(వ(డు చూ. జన్నము.
జన్నపు(బగవా(డు చూ. జన్నము.
జన్నపు(బట్టు చూ. జన్నము.
జన్నపు(బంది చూ. జన్నము.
జన్నపురిక్క చూ. జన్నము.
జన్నపురిక్కనెల చూ. జన్నము.
జన్నపువిందు చూ. జన్నము.
జన్నపువే(టకా(డు చూ. జన్నము.

**జన్నము** వి. దేవతాప్రీతి కోసం చేసేయాగం, యజ్ఞం. భార. సభా. 2.116.

సం. యజ్ఞ-. యాగం ; ప్రా. జణ్ణ-, జన్న ; అ.మా. జణ్ణ- ; పా. యజ్ఞ- ;

క. జన్న, జన్నవ్ర. యజ్ఞం ; తు. జన్నె ; త. ఎజ్ఞ.

<ప్రా. జన్న-.

జన్నపుగొంగ వి. క్రతుధ్వంసి, శివుడు. జన్నపు(గాపరి (-కాపరి) రూ.చూ. జన్నంపు(గాపరి. వి. శ్రీరాముడు, యాగ రక్షకుడు. అచ్చ. రా. యు. 32. జన్నపు(గూటిదొర (-కూటిదొర) వి. జన్నపుతిండి, వేల్పు, దేవత. నీలా. 3.51. జన్నపు(జుక్క(-చుక్క) వి. మాఘనక్షత్రం. జన్నపుటొజ్జ వి. ఋత్విక్కు. <జన్నము + ఒజ్జ. జన్నపు(దిండి (-తిండి) వి. యజ్ఞభోక్త, వేల్పు, దేవత. నీలా. 1.77. జన్నపు(దిండి దొరలు (-తిండిదొరలు) వి.బ.వ. దేవతలు. అచ్చ. రా. యు. 69. జన్నపు(దిండిరాయండు (-తిండిరాయండు) వి. ఇంద్రుడు. అచ్చ.రా.బాల. 146. జన్నపుబా(వ(డు వి. 1. తిక్కన సోమయాజి. ఉ. హరిశ్చ. 1.9 ; 2. సోమయాజి. జన్నపు(బగవా(డు (-పగవా(డు) వి. జన్నపువేటకాడు, శివుడు. సాంబ. 1.3. జన్నపు(బట్టు (-పట్టు) వి. యాగశాల, మండపం. జన్నపు(బంది(-పంది) వి. యజ్ఞరూపమైన పంది, ఆదివరాహం. అచ్చ.రా.యు. 161. జన్నపురిక్క వి. మఘనక్షత్రం, పితరుల చుక్క. జన్నపురిక్కనెల వి. చలినెల, మాఘమాసం. జన్నపువిందు వి. జన్నపుదిండి, వేల్పు. శశా. 3.51. జన్నపువే(టకా(డు వి. శివుడు. ఆం. నా. సం. 1.6. జన్నంపు(గాపరి (-కాపరి) వి. రూ. జన్నపు(గాపరి. యజ్ఞరక్షకుడు, శ్రీరాముడు. అచ్చ.రా. బాల. 212. జన్నసాల వి. యజ్ఞశాల. పండి. చ. దీక్షా. 46 పు. సం. యజ్ఞశాలా-.

జన్నంపు(గాపరి చూ. జన్నము.

జన్నల్ రూ.చూ. జన్నలు. వి.బ.వ. కిటికీలు, జనారులు.

**జన్నలు** రూ. జనలు, జనారులు, జనార్లు, జనాలు, జన్నల్, జన్నాల్. వి.బ.వ. కిటికీలు, జనారులు.

పో. జన్నెల. చిన్నతలుపు ; జనెల. కిటికీ.

సం. సారాయణ-. ( = సూర్యపదము) ; ప్రా. సారాయణ-, సారాణ-.

<పో. జన్నెల.

జన్నసాల చూ. జన్నము.

జన్నామగ్గం వి. ఒకరకం మగ్గం.

జన్నాల్ రూ.చూ. జన్నలు. వి.బ.వ. వెలుతురు కోసం గోడలో బిగించిన తలుపులున్న చట్రం.

**జన్ని**[1] వి. సన్నిపాతరోగం. ఆం. భా. 2.125, వేఉ. 37.

చూ. సం. సన్నిపాత-. జ్వరవిశేషం ; ప్రా. సణ్ణిఅ. శైత్యం పొందటం, ఆర్ద్రమవటం.

క. జన్ని, సన్ని ; తు. జన్ని ; త. శన్ని ; మ. సన్ని.

<ప్రా. సణ్ణిఅ.

జన్నిగొను(-కొను) అ.క్రి. 1. సన్నిపాత రోగిలాగ మైమరచి కేకలువేయు. పండి.చ. 5.371 పు ; 2. సన్నిపాత రోగ పీడితుడగు. జన్నిపట్టు అ.క్రి. జన్నిరోగం సోకు.

**జన్ని**[2] రూ.చూ. జన్నిదము. వి. జందెం, యజ్ఞోపవీతం.

జన్నిగట్టు(-కట్టు) చూ. జన్నిదము. వి. 1. యజ్ఞానికి తగిన నియమాలు నడిపేవాడు, బ్రాహ్మణుడు. నీలా. 3.88 ; 2. బ్రహ్మదేవుడు. ఆం. నా. శం. దేవ. 8. జన్నిగట్టుకొలము(-కట్టుకొలము) వి. బ్రాహ్మణ వంశం.

**జన్నిదము** రూ. జందియము, జందివారము, జందెము, జంద్యము, జన్ని2. వి. యజ్ఞసూత్రం. కు. సం. 7.3. భార. అను. 3.199.

సం. యజ్ఞోపవీత-. జందెం ; ప్రా. జణ్ణోవఈయ, జణ్ణోవవీయ, జణ్ణోవీఅ, జణ్ణోవీద- ; కా. యొనెఁ ; కుమా. జన్యో ; నే. జనై ; బీ. జనెఉ ; హిం. జనెఉ, జనోఈ ; పం. జనెఅఊ, జనేఊ ; ల. జంజూ ; సిం. జణ్వొ ; గు. జనోఈ ; మరా. జానూ, జానవీ, జానవెఁ, జాన్వేఁ ;

క. జన్నివార, జన్నివిర, జెనివార ; తు. జనివార.

<ప్రా. జణ్ణోవీద-

**జన్నియ** రూ. జన్నె. వి. 1. దేవతాకార్య నియమం. పండి. చ. 4.299 పు ; 2. నియమం. అచ్చ. రా. సుందర. 38 ; 3. దేవతాదుల్ని ఉద్దేశించి ఎత్తిఉంచిన వస్తువు ; 4. అచ్చుపోసి విడిచిన ఎద్దు ; 5. నోము.

సం. యజ్ఞియ, యజ్ఞీయ-. యజ్ఞసంబంధి ; ప్రా. జణ్ణ-, జణ్ణియ ;

క. జిన్నిగె.

<ప్రా. జణ్ణియ-

జన్నియపట్టు రూ.చూ. జన్నియపట్టు. అ.క్రి. మీదుకట్టు, నియమంగా ఉండు. జన్నియవట్టు(-పట్టు) రూ. జన్నియపట్టు, జన్నెపట్టు, జన్నెవట్టు. అ.క్రి. ముడుపు (మీదు) కట్టు. విజయ. 1.97. జన్నియవిడుచు రూ. జన్నెవిడుచు. స.క్రి. 1. ఆబోతుగా విడుచు. భార. విరా. 4.218 ; 2. యథేచ్ఛగా అనుభవించనిచ్చు. జన్నియావు (-ఆవు) వి. హోమధేనువు.

జన్నియావు చూ. జన్నియ.

**జన్నె** రూ.చూ. జన్నియ. వి. 1. దేవతాదుల్ని ఉద్దేశించి యథేచ్ఛగా విడిచిన ఆవు లేక ఎద్దు. పాండు. 4.192 ; 2. నియమం ; 3. దేవతాదుల్ని ఉద్దేశించి ఎత్తిఉంచిన వస్తువు.

జన్నెకువిడిచినది విణ. ఎత్తుకట్టిన పశువు, అచ్చువేసిన ఎద్దు ; 2. స్వేచ్ఛానువర్తియైన స్త్రీ. జన్నెగట్టు (-కట్టు) స.క్రి. మీదుకట్టు, నియమంగా ఉండు. యయా.

2.90. జన్నెచేయు స.క్రి. మీదుకట్టు, నియమించు. జన్నెపట్టు రూ.చూ. జన్నియపట్టు. అ.క్రి. నియమంగా ఉండు. జన్నెపట్టు(-పట్టు) రూ.చూ. జన్నియపట్టు. అ.క్రి. మీదుకట్టు, నియమంగా ఉండు. జన్నెవిడుచు రూ.చూ. జన్నియవిడుచు. స.క్రి. యథేచ్ఛగా అనుభవించనిచ్చు. శుక. 2.206.

జన్నెవారము చూ. జన్నె. వి. ఆదివారం,

జన్యమొదవు వి. 1. మేకపోతు. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 607. క్రీ.శ. 1163 సం.; 2. పశువృద్ధికోసం ఆడపశువులతోపాటు ఇచ్చే మగపశువు.

సం. జన్య-. పుట్టించ తగిన.

< సం. జన్య- + మొదవు (మిశ్రస.)

జన్రల్ రూ.చూ. జనరల్. విశ. సర్వసామాన్యమైంది, అందరికీ అన్నిటికి సమానంగా అన్వయించేది.

జపజప క్రి.విశ.ద్రు. త్వరగా.

జపాటామేగుఫాటా వి. ఉపార్ పదం, ఒకదానిమీద ఒకటిగా వేసే దెబ్బ.

జపానుకంప వి. ఆముకాల్వకు వాడే ఒకరకం కంప.

ఇం. *Japan*. జపానుదేశం.

< ఇం. Japan + కంప.

జపాను సజ్జ వి. ఒకరకం సజ్జ.

ఇం. *Japan*. జపానుదేశం.

< ఇం. Japan + సజ్జ.

జపానుసిల్కు వి. ఒకరకం కృత్రిమపుపట్టు.

ఇం. *Japan*. జపానుదేశం, *Silk*. పట్టు.

< ఇం. Japan+silk.

జపాల్తుమ్మ వి. తుమ్మలో ఒకరకం చెట్టు (Parkinsonia aculeata. Limn).

జప్తి రూ.చూ. జప్తు. వి. పన్ను ఇవ్వకపోవటంవల్ల ఆస్తిని బలవంతంగా లోబరచుకొనటం.

జప్తీదారు రూ.చూ. జప్తీదారుఁడు. వి. ఆస్తుల్ని లోబరచుకొనే ప్రభుత్వోద్యోగి. జప్తీదారుఁడు రూ. జప్తీదారు. వి. ఆస్తుల్ని లోబరుచుకొనే ప్రభుత్వోద్యోగి.

జప్తీదారు చూ. జప్తి.

జప్తీదారుఁడు చూ. జప్తి.

జప్తు రూ. జప్తి, జప్తీ. స.క్రి. ఆక్రమించుకొనటం.

హిం. *జబ్త్*. ప్రభుత్వాధీనం చేసుకొనటం; మరా. *జప్త్*. *జప్తా*. అణచటం, స్వీకారం, అధికారంలో ఉంచుట; ఉ. *జబ్త్*. ఒక వస్తువును ప్రభుత్వాధికారంలో వశపర్చుకోటం; పార. *జబ్త్*. అధికారంలో ఉంచటం; అర. *జబ్త్*. అధికారం, వినమ్రత, సమాధానం.

< ఉ. జబ్త్.

జప్తుచేయు స.క్రి. ఆస్తిని న్యాయస్థానం వశపరుచుకొను.

జప్పన రూ.చూ. చప్పున. క్రి.విశ.ద్రు. త్వరగా, చటుక్కున.

జఫ్ఫుజఫా వి. ఉత్సాహంలో వాడే పదం.

జప్తీ రూ.చూ. జప్తు. వి. ఆస్తిని న్యాయస్థానం వశపరచుకొనటం.

జఫ్ఫరజంగు రూ.చూ. జబురుజంగి. వి. ఒకవిధమైన ఫిరంగి అగ్నిప్రసారణం. రంగా.చ. 1.140.

జఫ్రా వి. తెల్లటి, ఎర్రని పూలుపూసే ఒకరకం చెట్టు (Bixa orellana).

జబర వి. 1. రెమ్మ, ఉపశాఖ. ఆం.భా. 2.37; 2. పోకపట, పోకమీదినార.

జబరదస్తీ రూ.చూ. జబరుదస్తీ. వి. బలాత్కారం.

జబరదస్తీచేయు స.క్రి. బలప్రయోగంచేయు.

జబరదస్తు వి. దుండగాల్ని చేసేవాడు, దూర్తుడు, దుర్మార్గుడు.

హిం. *జబర్దస్త్*. బలవంతుడు, శక్తిశాలి; మరా. *జబర్దస్త్*. అన్యాయం చేసేవాడు, దుండగాలు చేసేవాడు; ఉ. *జబర్దస్త్*. శక్తిశాలి, బలవంతుడు; పార. *జబర్దస్త్*. తీవ్రమైన, కఠినమైన, హింసాపూర్వకమైన.

< ఉ. జబర్దస్త్.

జబరు వి. నిడివి, నిడుపు, దానికొలత.

జబరుదస్తీ రూ. జబరదస్తీ, జబర్దస్తీ, జెబరదస్తీ. వి. బలాత్కారం.

హిం. *జబర్దస్త్*. బలవంతుడు; *జబర్దస్తీ*. బలవంతం; మరా. *జబర్దస్త్*. బలవంతుడు; *జబర్దస్తీ*. బలాత్కారం; ఉ. *జబర్దస్*. బలవంతుడు, శక్తిశాలి; *జబర్దస్తీ*. బలాత్కారం; పార. *జబర్దస్త్*. తీవ్రమైన, కఠినమైన, హింసాపూర్వకమైన; *జబర్దస్తీ*. తీవ్రం, హింసాపూర్వకం.

< ఉ. జబర్దస్తీ.

జబర్జబర్గా క్రి.విశ.ద్రు. ఏపుగా.

జబర్దస్తీ రూ.చూ. జబరుదస్తీ. వి. బలాత్కారం.

జబా రూ. జబెల్. వి. మేక మొదలైన జంతువుల్ని చంపేటప్పుడు మహమ్మదీయులుచ్చరించే మంత్రం, చేసే ప్రార్థన. భద్ర.శ. 18.

ఉ. *జబా*. కత్తితో కొట్టటం; పార. *జబా*. ప్రార్థనకోసం చేతులు చాచటం, కత్తితో కొట్టటం.

< ఉ. జబా.

జబాబు రూ.చూ. జవాబు. వి. సమాధానం.

జబురు[1] వి. 1. ఒకజాతి కలుపుమొక్క; కలబంద మొక్కలోని ముళ్ళవంటి భాగం.

జబురు[2] స.క్రి. కొయ్య సాధనాలతో మెల్లగా కొట్టు, బాదు.

జబురుకొట్టు స.క్రి. 1. తాగు; 2. మింగు; 3. కొరడాతో కొట్టు.

జబురుకొను స.క్రి. 1. మింగు; 2. తాగు; 3. కొరడాతో కొట్టు.

జబురుజంగి రూ. జఫ్ఫరజంగు, జబురుజంగీ, జబురుజంగు, జబరుజంగీ, జవురుజంగు. వి. ఒకవిధమైన ఫిరంగి, అగ్నిప్రసారణం. కళా. 8.75.

హిం. ఉ. పార. *జఫర్జంగ్*. ఫిరంగి.

< ఉ. జఫర్జంగ్.

జబురుజంగీ రూ.చూ. జబురుజంగి. వి. ఒకవిధమైన ఫిరంగి, అగ్నిప్రసారణం. రంగా.చ. 3.66.

జబురుజంగు రూ.చూ. జబురుజంగి. వి. ఒకవిధమైన ఫిరంగి,

అగ్నిప్రసారణం. ఉం.భా. 2.218.

**జబురులుకొట్టు** స.క్రి. **1.** తాగు; **2.** మింగు; **3.** కొరడాతో కొట్టు.

**జబురులుకొను** స.క్రి. **1.** తాగు; **2.** మింగు; **3.** కొరడాతో కొట్టు.

**జబెల్** రూ.చూ. జబా. వి. మేక మొదలైన జంతువుల్ని చంపేటప్పుడు మహమ్మదీయులుచ్చరించే మంత్రం, చేసే ప్రార్థన. భ.ప్ర.స. 18.

**జబ్బ**[1] రూ. జెబ్బ. వి. **1.** తుంటి, కటి పార్శ్వ భాగం. ఆము. 6.85; **2.** భుజం. అచ్చ. రా. యు. 64.

క. చప్పె. తుంటి ఎముక; త. చప్పెయ్. తుంటెలు, పిరుదు, రెక్క ఎముక; చెప్పా. తుంటె; అప్పా. తొడ; పర్జి. జబ్బ. భుజం.

**జబ్బ**[2] రూ.చూ. జబ్బా. వి. ఇనుంతో చేసిన వెడల్పాటి పాత్ర.

**జబ్బర** వి. మెత్తటినేల.

**జబ్బా** చూ. డబ్బా. రూ. జబ్బ[2]. వి ఇనుంతోచేసిన వెడల్పాటి పాత్ర.

**జబ్బు** వి. **1.** జడిమ, మాంద్యం. క్రీడా. 33; **2.** శైథిల్యం, సడలటం. మను. 3.123; **3.** దౌర్బల్యం, అసమర్థత. సారంగ. 2.240; **4.** వ్యాధి, రోగం, అనారోగ్యం. విశే. **1.** అలసమైన; **2.** అస్వస్థమైన, రోగగ్రస్తమైన; **3.** క్షుద్రమైన, నీచమైన; **4.** చెడ్డ.

హిం. జబూన్. చెడ్డ; మరా. జబూన్. బీదమైన, చెడ్డ; ఉ. జబూం, జబూన్. నికృష్టమైన, చెడ్డ; పార. జబ్. కృశించుట, శుష్కించుట, చిక్కిపోవుట, పట్టిపోవుట.

క. జబ్బలి, జబ్బలు. బలహీనత, ఎండుదల; జబ్బు. బలహీనత, ముసలిది; తు. జబ్బు. గుల్లగాఉన్న, లోపల బోలుగాఉన్న, దృఢముకాని; జబ్బె. ముసలివాడు; జబ్బి, జబ్బు. ముసలిది, వికారమైన ముసలిది; జబులు. సడలిన; త. చప్పయ్. బలహీనంగాఉన్న, సన్నమైన, చిక్కిన; చప్ప. అలసటనొందిన, బలహీనపడిన; చప్పతం. అలసట, బలహీనత; కురు. చప్‌చ్యా. ఓగి లేకుండుట, వడుతైన; చప్‌ప్తుఆనా. బలహీనపడు, దుర్బలపడుచు.

<ఉ. జబూన్.

జబ్బుచేయు రూ.చూ. జబ్బుసేయు. స.క్రి. అణచు. అ.క్రి. వ్యాధి సంభవించు. రోగంవచ్చు. జబ్బుపడు రూ. జబ్బువడు. అ.క్రి. **1.** నిష్ఫలమగు. వ్యర్థమగు. కకుత్స్థ. 1.181; **2.** భగ్నమగు, చెడు. ద్వి. సా.చ. 2.26 పు. 4 పం.; **3.** నిరుత్సాహమగు, ఓటుపడు. నీలా. 2.66; **4.** మందమగు; **5.** వ్యాధిపీడితుడగు. జబ్బువడు (-పడు) రూ.చూ. జబ్బుపడు. అ.క్రి. **1.** వ్యర్థమగు; **2.** భగ్నమగు, చెడు; **3.** నిరుత్సాహమగు. జబ్బువడులు అ.క్రి. విశ్లథమగు, నశించు. శ్రీరం.మా. 4.134. స.క్రి. బిగువు సడలించు. జబ్బుసేయు (-చేయు) రూ. జబ్బుచేయు. స.క్రి. అణచు. ద్వి. హరిశ్చ. పూ. 2181 పం. అ.క్రి. వ్యాధి సంభవించు, రోగంవచ్చు.

**జబ్బురినూలు** చూ. సప్పురినూలు. వి. పురి తక్కువగా ఉండే నూలు.

**జభురుజంగీ** రూ.చూ. జబురుజంగి. వి. ఒకవిధమైన ఫిరంగి, అగ్ని ప్రసారణం. రంగా.చ. 1.140.

**జమ** రూ. జమా, జము, జ్మ. వి. **1.** ఆయం, రాబడి. ద.హిం. శా. సంపు. 10 శా. సం. 767. క్రీ.శ. 1680; **2.** గుర్తింపు; **3.** అదుపు.

హిం. జమా. రాబడి, మూలధనం, భూమిపన్ను, జమ చేసికొను; మరా. జమా. రాబడి; ఉ. జమ. ఆదాయం; జమా. మూలధనం, మొత్తం, కలపటం, రాబడి రాసుకోవటం; పార. జమ్అ. వసూలుచేయు, మొత్తానికి కలుపు, పోగుచేయు; అర. జమ్అ. పోగుచేయు. కలుపు, భూమిపన్ను, లెక్కలో జమ చేయటం.

<ఉ. జమ.

జమకట్టు స.క్రి. కాతాలో వసూలు వేయు. జమచేయు స.క్రి. కాతాలో వసూలు రాయు.

**జమట** రూ.చూ. జంట. వి. కవ, రెండు.

జమటపాత్ర వి. డేగను చేతిలో ఉంచుకొన్నప్పుడు దాని గోళ్ళు గుచ్చుకోకుండా వేసుకొనే మడతగుడ్డ. జమటపొయ్యి రూ.చూ. జంటపొయ్యి. వి. రెండు పొయ్యిల్ని ఒకటిగా అతికించి చేసిన పొయ్యి. జమటరివేణి రూ.చూ. జంటరివేణి. వి. పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణి కుండలు.

**జమయ్యతు** రూ.చూ. జమీయ్యతు. వి. ధనం, సముదాయం.

**జమరు** వి. చమురు, నెయ్యి. ద.హిం.శా.సంపు. 5.శా.సం. 96.

**జమల** రూ.చూ. జమిలి. వి. జంట, జమిడి.

**జమలి** రూ.చూ. జమిలి. విశే. జంటయైన, ఇమ్మడియైన. వి. **1.** రెట్టింపుదారం; **2.** రెండు, జముడుక; **3.** రెండు పోగులు పురిపెట్టిన దారం.

జమలిగాలి వి.బ.వ. ప్రాణాపాన వాయువులు. పి.శకు. 2.114. జమలి చంపులు చంపు స.క్రి. జంట చావులుగా చంపు. రామా. 8.165. జమలించు రూ.చూ. జమిలించు. స.క్రి. రెట్టించు, ద్విగుణీకరించు. అ.క్రి. **1.** రెట్టింపగు, ద్విగుణమగు; **2.** అతిశయించు. జమలిమండెగ వి. చపాతి, పొరలపూరి. శృం.నై. 6.120. జమలిముక్కాలి రూ.చూ. జమిలిముక్కాలి. వి. షట్పదం, తుమ్మెద. రసిక. 394. జమళ్ళఊచ వి. దసలి దారం వడికేటప్పుడు, పెద్ద కండె చుట్టడానికి రాట్నం కుదురుకు పెట్టే పొప్పపుల్ల. జమళ్ళఊడితె వి. దసలి పడుగు సరిచెయ్యటానికి ఆరుబయట నిలబెట్టిన కొయ్యపనిముట్టు. జమళ్ళకండె వి. రెండేసి పోగులు కలిపి చుట్టిన పేకదారం. జమళ్ళతాడు వి. దసలి పడుగు సరిచెయ్యటానికి నిలబెట్టే ఊడ్తెదగ్గరి బొంగును, సర్వటి గుంజల అడ్డకట్టెను కలిపిన తాడు. జమళ్ళపొగడ వి. రెండేసి పోగులు కలిపి అచ్చతికే పట్టు పడుగు. జమళ్ళబొంగు వి. దసలి (పట్టు) పడుగు సరిచెయ్యటానికి పడుగు కొసలో దూర్చే కర్ర.

**జమలిక** రూ.చూ. జమళిగ. వి. చర్మవాద్య విశేషం.

**జమలు** రూ.చూ. జమిలి. విశే. జంటఐన. యయా. 5.12.

**జమళి** రూ.చూ. జమిలి. విశే. జంటయిన. వి. **1.** రెట్టింపు;

2. జంట.

**జమళి** రూ.చూ. జమిలి. విణ. జంట అయిన, ఇబ్బడి అయిన. పరమ. 3.221 పు. వి. స్త్రీ పురుషుల జంట, కవ. ఆం.భా. 2.100.

**జమళిక** రూ.చూ. జమళిగ. వి. చర్మవాద్య విశేషం.

**జమళిగ** రూ. జమలిక, జమళిక, జమిడిక, జమిలిక. వి. చర్మవాద్య విశేషం. శుక. 2.414.

సం. యమళికా. జంట ఐనది ; ప్రా. జమలియ.

<సం. యమళికా.

**జమళ్ళఊచ** చూ. జమలి.

**జమళ్ళఊడిత** చూ. జమలి.

**జమళ్ళకండె** చూ. జమలి.

**జమళ్ళతాడు** చూ. జమలి.

**జమళ్ళపాగడ** చూ. జమలి.

**జమళ్ళబొంగు** చూ. జమలి.

**జమా** రూ.చూ. జమ. వి. ఆయం, రాబడి.

**జమాఖరుచులు** రూ. జమాఖర్చులు. వి.బ.వ. ఆయవ్యయాలు. హంస. 1.142.

హిం. జమాఖర్చ్. ఆయవ్యయములు ; ఉ. జమాఖర్చ్. ఆయవ్యయములను చూచుకొను లెక్క ; పార. జమఉఖర్చ్. ఆయవ్యయములను చూచుకొను లెక్క.

<ఉ. జమాఖర్చ్.

**జమాను** రూ.చూ. జవాను. వి. 1. బంట్రోతు ; 2. పొడగరి.

**జమాబంది** రూ.చూ. జమాబందీ. వి. పన్ను ఏర్పాటు చేయటం.

**జమాబందీ** రూ. జమాబంది. వి. పన్ను ఏర్పాటు చేయటం. రంగా.చ. 2.9.

హిం. జమాబందీ. ఆసాముల భూమి పన్నులు రాసి కరణం దగ్గరుండే కాగితం ; ఉ. జమాబన్దీ. పద్దు ఏర్పాటు చేయటం, ఆసాముల భూమి పన్నులు రాసి కరణం దగ్గరుండే కాగితం ; పార. జమాబన్దీ. జిల్లాలో కల భూముల గృహముల చూసే లెక్క. పన్ను ఏర్పాటు చేయటం.

<ఉ. జమాబన్దీ.

**జమాదారి** వి. సైన్యాధిపత్యం.

హిం. జమాదార్. నాయకుడు, సేనాని ; జమాదారీ. సైన్యాధిపత్యం, నాయకత్వం ; ఉ. జమ్అదార్. సైన్యాధ్యక్షుడు ; జమ్అదారీ, జమాదారీ. సైన్యాధిపత్యం ; పార. జమ్అదార్. సైన్యాధ్యక్షుడు, నాయకుడు ; జమ్అదారీ. నాయకత్వం, సైన్యాధిపత్యం.

<ఉ. జమాదారీ.

**జమాదారు** వి. సరదారు. పద్మ.యు. 31.

ఉ. జమాదార్. సర్దారు ; పార. జమాదార్. సర్దారు, సైన్యాధిపతి.

<ఉ. జమాదార్.

**జమాదారుడు** వి. సిపాయిల్లో పెద్ద.

హిం.ఉ. జమాదార్. సర్దారు.

**జమాయించు**[1] వి. ఆడంబరంగాఉండు, సరిచేయు, అమర్చు, అలంకరించు, బెరురు లేకుండా.

**జమాయించు**[2] స.క్రి. 1. కొయ్య సాధనాలతో మెల్లగా కొట్టు ; 2. పేర్చు, ఒకదానిపై ఒకటి క్రమంలో నిలుపు ; 3. దిమ్మిసతో కొట్టు ; 4. రెంటిని కలుపు, జోడించు.

**జమాలుసాని** వి. మహమ్మదీయుల ఆరవ నెల. ద.హిం.కా. సంపు. 10. కా.సం. 754. క్రీ.శ. 1602.

**జమి** రూ.చూ. జమ్మి. వి. శమీవృక్షం. ద్వి.బార. 2.42 పు.

**జమికిచ్చు** అ.క్రి. నాని మెత్తబడు, జవికిచ్చు.

**జమిటికొమెర** వి. రెండు కొయ్యలుగల కొమర.

**జమిటిజంగ** వి. రెండు కొయ్యలలో నిలిపిన గుజ్జు.

**జమిటు** విణ. రెండేసి.

**జమిడరివేణి** చూ. జమిడి.

**జమిడి** రూ.చూ. జమిలి. విణ. జంటఅయిన, ఇబ్బడిఅయిన. వి. రెండు పోగులు పెట్టిన దారం, జమిలిదారం. సాంబ. మాన. 29.

**జమిడరివేణి** వి. పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణి కుండలు. **జమిడించు** రూ. జమిలించు. స.క్రి. 1. జమకట్టు ; 2. జోడించు. **జమిడిపిచోపు** వి. వింజామర, కుంచె.

**జమిడిక** రూ.చూ. జమళిగ. వి. చర్మవాద్య విశేషం. హంస. 3.29.

**జమియ్యతు** రూ.చూ. జమీయ్యతు. వి. 1. ధనం ; 2. సమూహం.

**జమిలి** రూ. జమల, జమలి, జములు, జమళ, జమళి, జమిడి, జములు, జవళి, జవిలి, జవిళి. విణ జంటయయిన. హరి. పూ. 5.243. వి. 1. రెట్టింపు (దూరం). శ్రీరం.మా. 1.109 ; 2. స్త్రీ పురుషుల జంట, కవ.

సం. యమల-. జంట ; ప్రా. జమళ-. జోడు, యుగళం, తుల్యం ; అమ. జమలం. యుగ్మం ; పా. యమల. జత ; అప. జవలా. సమీపం ;

క. జమళ, జవళ, జవళి. జంట ; మ. జవిళి, జెవిళి. గుడ్డ ; గోం. యేమాల్. కవలలు ; కుఇ. జోలవి. కాడి.

<ప్రా. జమళ.

**జమిలికటారి** వి. రెండు అంచులున్న కత్తి. **జమిలిచంపులుచంపు** స.క్రి. జంట చావులుగా చంపు. **జమిలించు** రూ. జమలించు, జమిడించు. స.క్రి. రెట్టించు, ద్విగుణీకరించు. అ.క్రి. 1. రెట్టింపగు, ద్విగుణమగు ; 2. అతిశయించు. స.క్రి. జమకట్టు. **జమిలితల్లులబిడ్డ** వి. గణపతి. వ్యు. ఇద్దరి తల్లుల (గంగాపార్వతుల) కుమారుడు. **జమిలిదుప్పటి** వి. నేతలో నిలువుకు, అడ్డానికి రెండేసి పోగులు చొప్పున పెట్టినేసిన దుప్పటి. **జమిలిధోతి** వి. రెండేసి పోగులు పెట్టి నేసిన పంచె. **జమిలినాల్కలతొడవులసామి** వి. నాగభూషణుడు, శివుడు. అచ్చ.రా.యు. 4.60. **జమిలినూలు** వి. రెండు పోగులుకలిపి పురిపెట్టిన నూలు. **జమిలిముక్కాలి** రూ. జమలిముక్కాలి. వి. షట్పదం, తుమ్మెద. నీలా. 2.25. **జమిలిముక్కాలినారి** వి. మన్మథుడు. **జమిలిముక్కాలివిలుకాడు** వి. మన్మథుడు. **జమిలిముత్తల** వి. కుమరస్వామి. వ్యు. ఆరు తలలు కలవాడు. **జమిలివేల్పు** వి. హరిహరమూర్తి.

**జమిలిక** రూ.చూ. జమళిగ. వి. చర్మ వాద్యవిశేషం.

**జమీ** రూ.చూ. జమీను. వి. భూమి. పద్మ. యు. 64 ; లంకా. 1.38.

**జమీదారు** రూ.చూ. జమీందారు. వి. భూస్వామి.

**జమీద్దారు** రూ.చూ. జమీందారు. వి. భూస్వామి.

**జమీను** రూ. జమీ. వి. భూమి.

హిం. జమీన్. నేల, భూమి ; మరా. జమీన్. నేల ; ఉ. జమీం. భూమి, చిన్నదేశభాగం ; పార. జమీన్. భూమి, పొలం, నేల.

< ఉ. జమీన్.

**జమీనుదారు** రూ.చూ. జమీందారు. వి. భూస్వామి.

**జమీందారి** రూ.చూ. జమీందారీ. వి. జమీందారు కిందఉండే భూమి.

**జమీందారీ** రూ. జమీందారి. వి. **1**. శాశ్వతకర నిర్ణయం చేసేవిధానం; **2**. జమీందారు కిందఉండే భూమి.

హిం. జమీన్దారీ. జమీందారు యొక్క హక్కు ; మరా. జమీన్దారీ. జమీందారుకింద నున్న ప్రాంతం ; ఉ. జమీన్దారీ. సంవత్సరానికి ఒకే పర్యాయం కప్పంకట్టే విధానం ; పార. జమీన్దారీ. జమీందారు ఆధిపత్యంకింద ఉన్న ప్రదేశం.

< ఉ. జమీన్దారీ.

**జమీందారు** రూ. జమీదారు, జమీద్దారు, జమీనుదారు, జమీందారుడు, జమీన్దారు. వి. రాజుకు పన్నుకట్టే అధికారి, భూస్వామి. రంగా.చ. 1.151.

హిం. జమీన్దార్. భూస్వామి ; మరా. జమీన్దార్ ; ఉ. జమీన్దార్ ; పార. జమిదార్, జమీన్దార్. మొగలు సామ్రాజ్యకాలంలో భారత వర్షమున పన్నులు వసూలు చేయటానికేర్పడిన ఉద్యోగి.

< ఉ. జమీన్దార్.

**జమీందారు(డు** రూ.చూ. జమీందారు. వి. భూస్వామి.

**జమీయ్యతు** రూ. జమయ్యతు, జమియ్యతు. వి. **1**. సముదాయం; **2**. ధనం.

మరా. జమియత్, జమేతు. సమీకరణం ; ఉ. జమ్ఈయత్. ధనం, యూధం, సమూహం ; పార. జమ్ఈయత్. సంకలనం, సముదాయం.

< ఉ. జమ్ఈయత్.

**జము** రూ.చూ. జమ. వి. ఆదాయంకింద వచ్చిన సొమ్ము.

**జముకాణము** రూ. జంఖానా, జముకానము, జముకాళము, జముఖాణంబు, జముఖానా, జంబుకాణము, జంబుఖాణా, జంబుఖానము, జంబుఖాను, జమ్ముఖాణము, జమ్ముఖాన, జమ్ముఖాను, జమ్మఖాళము. వి. ముతక నూలుతో నేసి కూర్చొడానికి కింద పరిచే ఆస్తరణ విశేషం, తివాసి. మను. 5.40.

పో.చూ. సం. యమళ-. జంట ; హిం. జమ్ఖానా. తివాసి ; మరా. జమ్ఖాణ ; ఉ. జమ్ఖానా ; పార. జమఖానహ్.

< ఉ. జమ్ఖానా.

**జముకానము** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగు రంగుల నూలు పట్టెలుగల ఆస్తరణం.

**జముకాళము** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగురంగుల నూలి పట్టెలుగల ఆస్తరణం. ప్రబంధ. 3.

**జముఖాణంబు** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగు రంగుల నూలి పట్టెలు గల ఆస్తరణం.

**జముఖానా** రూ.చూ. జముకాణము. వి. లావుపాటి నూలుతో నేసిన ఒక రకం దుప్పటి.

**జము(గూడు** చూ. జము(డు.

**జముజాలి** రూ.చూ. జముదాడి. వి. **1**. యముని వాడి ; **2**. బాకు.

**జముడు** వి. కంచెగా ఉపయోగపడే ఒకరకం మొక్క (Euphorbia tirucalli).

**జముడుక** వి. పంబాల వానిపంబ అనే వాద్యం, జమిలిక.

**జము(డు** రూ. జముస్డు. వి. యముడు. భార. ఆది. 6.196.

సం. యమ-. యముడు; ప్రా. జమ-; పా. యమ-; క. జమ. జవ ; త. ఇయమన్, ఎమన్ ; ఏమన్.

< ప్రా. జమ-.

**జము(గూడు (-కూడు)** అ.క్రి. చచ్చు. ఉ. హరి. 1.46. **జముతండ్రి** వి. సూర్యుడు. వ్యు. యముని తండ్రి. **జముదెస** వి. దక్షిణదిక్కు. కాళ. 1.63. వ్యు. యముడుండేదిక్కు. **జమునయ్య** వి. సూర్యుడు. ఆం. భా. 1.81. వ్యు. యముని తండ్రి. **జమునిం జేర్చు (చేర్చు)** స.క్రి. చంపు. శశా. 5.25. **జమునితెంకికి(బనుచు (-పనుచు)** స.క్రి. చంపు. అచ్చరా. యు. 485. **జమునిల్లుచొచ్చు** రూ.చూ. జమునిల్లు సొచ్చు. అ.క్రి. చచ్చు, మరణించు. **జమునిల్లు సొచ్చు (-చొచ్చు)** రూ. జమునిల్లుచొచ్చు. అ.క్రి. చచ్చు, మరణించు. భార. విరా. 2.204. **జమునిప్రోలికే(గు** అ.క్రి. చచ్చు. అచ్చ. రా. సుందర. 1.16. **జమునెక్కిరింత** వి. దున్నపోతు, మహిషం. ఆం. నా. సం. తిర్య. 10. వ్యు. యముని వాహనం. **జమువగతు(డు** వి. యమశత్రువు, శివుడు. ఆం.భా. 1.37. **జముపట్టి** వి. ధర్మరాజు. వ్యు. యముని కుమారుడు. **జమువీటికతిథుల(జేయు (-చేయు)** స.క్రి. చంపు. ఉ రా. 3.16.

**జముతండ్రి** చూ. జము(డు.

**జముదళము** రూ.చూ. జముదాడి. వి. పొడుగు పిడిగల కటారి, బాకు. కవి రా. 2.81.

**జముదాడి** రూ. జంజాడి, జంజాలి, జంజాళి, జముజాలి, జముదళము, జముదాళి, జమ్ముదాడి, జమ్ముదాళి. వి. **1**. యమునిధాటి. రామాభ్యు. 2.24 ; **2**. నిడుపైన పిడిగల కటారి, బాకు. ఆం. భా. 2.217.

సం. యమధాటీ, యమధాటి- ; ప్రా. జమహాడి, జమధాడి ; హిం. జంధర్.

త. సముధాడు.

< ప్రా. జమధాడి.

**జముదానినేత** వి. ఒకరకం డిజైనునేత.

**జముదానిపుల్ల** వి. జముదాని నేతలో డిజైన్లు వెయ్యటానికి వాడే రంగు దారాలు చుట్టిన చిన్నపుల్ల.

**జముదాళి** రూ.చూ. జముదాడి. వి. నిడుపైన పిడిగల కటారి, బాకు. రాజవా. 3.67, దశా. 7.240.

**జముదెస** చూ. జముఁడు.

**జమున**[1] వి. యమునా నది. నీలా. 1.81.

సం. యమునా; ప్రా. జఉణా, ఒఉణ, జముణా; శౌ. జముణా; అమా. జముణా; అప. జఉణా, జముణ, జవ్ఁణ.

క. జగునె, జమునె; త. ఎమునె.

< ప్రా. జముణా.

జమునగొంగ వి. బలరాముడు. సాంబ. దేవ. 15. వ్యు. యమునా శత్రువు. **జమునతోడు** వి. యముడు. సాంబ. దేవ. 12. **జమునతోఁబుట్టు** రూ. జమున తోఁబుట్టువు. వి. యముడు, యమునాభ్రాత. **జమునతోఁబుట్టువు** రూ.చూ. జమునతోఁబుట్టు. వి. యముడు. **జమునసైదోడు** వి. యముడు. ఆం. నా. సం. దేవ. 19. వ్యు. యమునభ్రాత.

**జమున**[2] వి. ఒకరకం గోధుమ రంగు.

**జమునయ్య** చూ. జముఁడు.

**జమునింజేర్చు** చూ. జముఁడు.

**జమునితెరికికిఁబనుచు** చూ. జముఁడు.

**జమునిప్రోలికేఁగు** చూ. జముఁడు.

**జమునిల్లుచొచ్చు** చూ. జముఁడు.

**జమునిల్లసొచ్చు** చూ. జముఁడు.

**జమునెక్కిరింత** చూ. జముఁడు.

**జముస్తు** రూ.చూ. జముఁడు. వి. యముడు, చంపేవాడు. ముదివేడు శిలాశాసనం. క్రీ.శ. 825.

**జముపగతుఁడు** చూ. జముఁడు.

**జముపట్టి** చూ. జముఁడు.

**జములతుకు** చూ. జములు.

**జములపొయ్యి** చూ. జములు.

**జములరివేణి** చూ. జములు.

**జములు** రూ.చూ. జమిలి. విణ. రెండేసి.

**జములతుకు** స.క్రి. సరి చేసిన పడుగులో రెండు పోగులు ఒక బద్దె పోగుకు కలిపి అచ్చుతకటం. < జములు + అతుకు. **జములపొయ్యి** వి. రెండు పొయ్యల్ని ఒకటిగా అతికించి నట్లు చేసిన పొయ్యి. **జములరివేణి** రూ. జవులవిరేణి. వి. పెళ్ళికి వాడేరంగులు పూసిన అరివేణి కుండలు. **జములుకుంచె** వి. సరిచేసే టప్పుడు పడుగు ఆరుబదునులో ఉంచగా సందు సందుకూ ఆపుతూ దువ్వేకుంచె. **జములుకుర్చీమట్టు** వి. రెండుగద్దెలను అతికి తయారు చేసినరాతి స్తంభపుమట్టు. **జములుకొను** స.క్రి. జంటగా కలియు. **జములుగుజ్జు** వి. రెండు కొయ్యలతో నిలిపిన గుజ్జు. **జములుచేయు** స.క్రి. జోడించు, రెంటిని కలుపు. **జములునేత** వి. నిలువు అడ్డం రెండేసి పోగులు చొప్పున పెట్టినేసిన నేత. **జములుపొయ్యి** వి. రెండుపొయ్యల్ని ఒకటిగా అతికించినట్లు చేసినపొయ్యి. **జములుపోగు** వి. రెండుపోగులు కలిపి ఒకటిగా పురిపెట్టిన పోగు. **జములుస్తంభం** వి. ఒకేమట్టు మీద నిలిపిన రెండురాతి కూబాలతో తయారైన రాతి స్తంభం. **జముళ్ళపడుగు** వి. రెండు పోగులు కలిపి పురి పెట్టిన పడుగుదారం. **జముళ్ళు** వి. రెండేసి పోగులు కలిపి పురిపెట్టిన నూలు. **జముళ్ళుపడుగు** రెండేసి పోగులు కలిపి పురిపెట్టిన పడుగుదారం.

**జమేదారు** రూ.చూ. జమీందారు. వి. రాజుకు పన్నుకట్టే అధికారి.

**జముళ్ళపడుగు** చూ. జములు.

**జముళ్ళు** చూ. జములు.

**జముళ్ళుపడుగు** చూ. జములు.

**జముపీటికతిథులఁజేయు** చూ. జముఁడు.

**జంప** వి. ముత్యాలు మొ. వాటి కుచ్చు, జాలరు.

**జంపఖానా** చూ. జముకాణము. వి. తివాసీలాగా పనికివచ్చే మందపాటి గుడ్డ.

**జంపతి** వి. పెళ్ళికూతురు గృహప్రవేశం చేయటం.

**జంపనార** వి. విశాఖపట్నం, కడప, సేలం మొ. ప్రదేశాల్లో ముఖ్యంగా తోటల్లో పెంచబడే అందమైన పూలుపూసే ఒకరకం మొక్క (Hibiscus collinus).

**జంపము** వి. అంకవన్నె తగిలించే దారం మొదలైనది. రసిక. 1.85.

**జంపర** రూ.చూ. జంపరు. వి. ఇనపచువ్వ.

**జంపరసుత్తి** వి. చిన్నసైజు సుత్తె.

**జంపరి** రూ.చూ. జంపరు. వి. ఇనపచువ్వ.

**జంపరు** రూ. జంపర, జంపరి, జంబరు. వి. సుమారు మూరెడు పొడవుండే ఇనపచువ్వ.

ఇం. *Jumper*. రంధ్రాన్ని చేయటానికి ఉపయోగించే ఇనప సాధనం.

< ఇం. Jumper.

జంపరుకమ్మి వి. సుమారు మూరెడు పొడవుండే ఇనప చువ్వ.

**జంపాడు** చూ. జంపు[7].

**జంపారు**[1] చూ. జంపు[7].

**జంపారు**[2] చూ. జంపు[2].

**జంపాల**[1] వి. ఉయ్యాల. సారంగ. 1.48.

సం. జమ్పాన-. సుఖాసనం; ప్రా. జంపాణ-. వాహన విశేషం, పల్లకీ, శవవాహనం.

< ప్రా. జంపాణ-.

జంపాలలూఁగు అ.క్రి. ఉయ్యాలలూగు, ఊగు. చిత్రభా. 5.104, శుక. 3.30.

**జంపాల**[2] వి. పొడుగాటికాముగల ఒకరకం పార.

**జంపాలు**[1] వి. జోలపాట.

**జంపాలు**[2] వి.బ.వ. తీగ ఉయ్యాలలు.

**జంపు**[1] వి. వ్యర్థ ప్రసంగం. విజయ. 2.189.

సం. జల్ప-. మాట్లాడటం; ప్రా. జంప-. కథనం; జంపణం. జల్పనం, జంపయ. భాషకుడు; అప. జంప.

< ప్రా. జంప-.

జంపుచెల్లు వి. మాటసాగు.

**జంపు**[2] వి. **1.** ఆలస్యం, విలంబం, జాగు. చంద్రాంగ. 5.152; **2.** తూగు, నిద్రమత్తు. విణ. ఆలస్యం చేసే స్వభావం కల, విలంబకారి అయిన. విజయ. 1.102.

జంపారు[2] అ.క్రి. జాగగు. **జంపునడపు** అ.క్రి. జాగు

చేయు, ఆలసించు.

జంపు[3] వి. 1. సముదాయం, సమూహం. హర. 2.15; 2. (ముత్యాలు మొ. వాటి) జల్లి, జాలరు. శృం.నై. 7.44.

జంపులు వి.బ.వ. చెంపసరులు, చెంపకల్లీలు.

జంపు[4] వి. శాసనం, ఆజ్ఞ. చంపూ. రా. 2.24.

జంపు[5] విశ. స్నిగ్ధం, నున్నని. కలు. శ. 27.

జంపు[6] వి. 1. నిడువు, నిడివి, దానికొలత; 2. శాల్తీలను గోడలో బిగించటానికి చిమ్ములకు బదులుగా వాడే ఇనప బద్దీ; 3. ఇంటి నడికొప్పున మోసే కర్ర; 4. నేతలో నిలువు పొడుగు.

జంపుగుంటక వి. గొర్రుతో విత్తిన చాళ్ళు పూడ్చే పెద్ద పలుగు. జంపుజాడి వి. నిలువుజాడి, ఊరగాయ పెట్టడానికి నిలువుగా చేసిన మట్టి పాత్ర. జంపురాయి వి. రాతి దిమ్మల కట్టుబడిలో పనికివచ్చేరాయి.

జంపు[7] వి. దూది ఏకేటప్పుడు కమాను నరం కిందికీ పైకీ ఊగినలాడటం.

జంపాడు అ.క్రి. జవ్వాడు, ఊగు. ద్వి. పరమ. 6.458 వ. 4 పం. జంపాడు[1] అ.క్రి. ఊగు. భాగ. 8.267.

జంపె వి. సంగీతతాళభేదం, 10 మాత్రలుకాలంగల తాళం. కాశీ. 4.296.

సం. ఝంపా. గంతు. దాటు.

క. జంపె; తు. జంపెతాళ; త. చంపై; మ. చంప; ప్రా. జమ్పింగ్.

జంపెరేకు వి. ఒకఛందం.

జంబ వి. తెల్లటిపూలు, ఎరుపునీలం కల్సినరంగు పళ్ళుగల చెట్టు (దీని పళ్ళు తింటారు) (Eugenia jambolana).

జంబర వి. పని, కార్యం, వ్యవహారం.

క. జంబర. పని, కార్యం, వ్యవహారం.

జంబరు రూ.చూ. జంపరు. వి. సుమారు మూరెడు పొడుగుండే ఇనపచువ్వ.

జంబాలము వి. బురద.

సం. జంబాల-. బురద.

<సం. జంబాల- (అర్థవిపరి.).

జంబాలు చూ. దంబాలు. వి.బ.వ. డాబులు, దప్పాలు, ఎచ్చులు.

జంబి[1] వి. నల్లరేగడి నేలల్లో పొదగా పెరిగే ఒకరకం ముళ్ళచెట్టు.

జంబి[2] రూ.చూ. జమ్మి. వి. జమ్మి.

జంబు[1] రూ. జంబువు, జమ్ము[1]. వి. 1. తృణ విశేషం హంస. 5.44; 2. తెల్లటిపూలు, ఎరుపు, నీలం కల్సినరంగు పళ్ళు గల ఒక రకం చెట్టు (ఈ పళ్ళు తింటారు) (Eugenia jambolana).

క. తంబు, జంబు. ఒకరకం రెల్లు; త. తంబు, చంప్పు. ఒకరకం రెల్లు, టైఫా ఎలిఫాంటిసీ; చంపణో-కోరై. ఒకరకం రెల్లు.

జంబుగూడ రూ.చూ. జమ్ముగూడ. వి. జమ్ముతో అల్లిన గూడ. చంద్రభాను. 5.39.

జంబు[2] రూ. జమ్ము[2]. వి. నేరేడుచెట్టు.

సం. జంబూ-. నేరేడుచెట్టు.

<సం. జంబూ-.

జంబేటి రూ.చూ. జమ్మేటి. వి. భౌ. జంబూనది, నేరెటేరు. కాశీ. 7.201.

జంబు[3] రూ.చూ. జమ్మి. వి. శమీవృక్షం. సాంబ. స్థా. 57.

జంబు[4] వి. మాగాణిలో నీళ్ళు పెట్టింతరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం.

జంబు[5] వి. అబద్ధం.

జంబుకాణము రూ.చూ. జముకాణము. వి. తివాసీ.

జంబుఖానా రూ.చూ. జముకాణము. వి. ముతక నూలితోచేయబడి కూర్చోటానికి కిందపరచే ఆస్తరణ విశేషం, తివాసీ.

జంబుఖానము రూ.చూ. జముకాణము. వి. తివాసీ, ముతక నూలితో చేయబడి కూర్చోడానికి కిందపరచే ఆస్తరణ విశేషం. ఇందు. 2.36.

జంబుఖానా రూ.చూ. జముకాణము. వి. తివాసీ.

జంబుఖాను రూ.చూ. జముకాణము. వి. తివాసీ, కంబళం, రంగు రంగుల నూలు పట్టెలుగల ఆస్తరణం.

జంబుబిళ్ళ వి. పెద్ద అచ్చు బిళ్ళ.

జంబురా వి. చిన్నఫిరంగి, తుపాకి. పద్మ. యు. 272.

హిం. జంబూరా. ఫిరంగి ఏ చక్రం మీద ఎక్కిస్తారో ఆ చక్రం, ఫిరంగి; మరా. జంబూరా. ఫిరంగి; ఉ. జంబూరా. చిన్నఫిరంగి, తుపాకి; పార. జంబూర. తుపాకి.

<ఉ. జంబూరా.

జంబువు రూ.చూ. జంబు1. వి. తెల్లటిపూలు, ఎరుపు నీలం కల్సిన రంగు పళ్ళుగల ఒకరకం చెట్టు (Eugenia jambolana).

జంబె వి. 1. జెముడులో ఒకరకం కంచెమొక్క (Euphorbia species); 2. ఒకానొక కంచెమొక్క.

జంబేటి చూ. జంబు[2].

జమ్మకతారాయను(-అను) అ.క్రి. నిర్విచారంగా ఉండు.

జమ్మను అ.క్రి. ఒడలు జలదరించు, ఝల్లుమను. ధ్వన్యను.

జమ్మి రూ. జమి, జంబి[2], జంబు[3]. వి. శమీవృక్షం, వంట చెరకుగా ఉపయోగపడే ఒక రకం చెట్టు (Tamarix gallica). భార.విరా. 4.112.

సం. శమీ. జమ్మి; ప్రా. ఛమీ, సమి, సమీ. వృక్ష విశేషం; అమా. సమి.

క. జంబి; త. శంబై.

<ప్రా. సమీ.

జమ్మికిపోవు అ.క్రి. దసరా పండుగనాడు శమీదర్శనాని కేగు. జమ్మిక్రిందివ్రాతలు వి.బ.వ. ఆధార రహితాలైన రాతలు.

జమ్మిడి చూ. జముడు. వి. జెముడులో ఒకరకం (Euphorbia species).

జమ్మిని వి. అరేబియా గుఱ్ఱం.

పో. చూ. సం. యవన-. విదేశీయులు; జవన-. వేగంగాపోయేది.

జమ్ము[1] రూ.చూ. జంబు[1]. వి. లావుతుంగ, తృణవిశేషం, వృక్ష విశేషం, బురదనేలల్లో మొలిచే ఒకరకం గడ్డిమొక్క (Typha augustata). నార. పంచ. 3.84.

జమ్ముగడ్డి వి. బురదనేలల్లో మొలచే ఒకరకం గడ్డిమొక్క.

Typha elephantina). **జమ్ముగూడ** రూ. జంబుగూడ. వి. వానకు తడవకుండా తలమీద వేసుకోడానికి జమ్ముతో అల్లిన గూడ. ఆము. 4.133.

**జమ్ము²** రూ.చూ. జంబు². వి. నేరేడు.

జమ్మేటు రూ. జంబేటు. వి. జంబూనది. వసు. 2.32.

**జమ్ముఖాణము** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగు రంగుల నూలిపట్టెలుగల ఆస్తరణం. ప్రబోధ. 4.18.

**జమ్ముఖాన** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగురంగుల నూలిపట్టెలు కల ఆస్తరణం.

**జమ్ముఖాను** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగు రంగుల నూలిపట్టెలుకల ఆస్తరణం.

**జమ్ముఖాళము** రూ.చూ. జముకాణము. వి. తివాసి, కంబళం, రంగురంగుల నూలిపట్టెలుగల ఆస్తరణం.

**జమ్ముదాడి** రూ.చూ. జముదాడి. వి. నిడుపైన పిడిగల కటారి. మల్హ పు. 2.71.

**జమ్ముదాళి** రూ.చూ. జముదాడి. వి. **1**. యమునిదాడి ; **2**. బాకు.

**జమ్మున** క్రి.విశ.ద్రు. తొందరగా.

**జమ్మురాయి** వి. పానుపరాయిమీద అడ్డంగా పరచిన రాతి పలక.

**జమ్ములమ్మ** వి. ఒక గ్రామదేవత.

**జమ్మేటు** చూ. జమ్ము².

**జమ్లు** వి. పూర్తి. ద. హిం. శా. సంపు. 6 శా. సం. 673.

**జయగోడ** వి. పూరిళ్ళకు ముందే కట్టే అరుగువంటి మట్టిగోడ.

సం. జయ-. జయం.

<సం. జయ-+గోడ.

**జయంచు** వి. అరుగు పక్కలనుండే అంచు.

సం. జయ-. జయం.

<సం. జయ-+అంచు.

**జయపూరుదొండ** వి. పొడుగురకందొండ.

**జయమాడ** వి. ఒకనాణెం, విజయచిహ్నంగా ముద్రించినది, మాడ విశేషం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 109. క్రీ.శ. 1076.

సం. జయ-.

<సం. జయ-+మాడ.

**జయరేకు** రూ.చూ. జయరేఖ. వి. జయపత్రిక.

**జయరేఖ** రూ. జయరేకు. వి. జయరేఖ, జయపత్రిక.

సం. జయలేఖా. జయపత్రం.

<సం. జయలేఖా.

**జర** వి. పరుజు, కత్తిపిడి.

సం. త్సరు-. కత్తిపిడి ; అమా. పా. ఛరు-.

**జరక** రూ. సరక. వి. పశువుల నెత్తురుపారే జబ్బు.

**జరగించు** చూ. జరగు.

**జరగు** రూ. జరుగు. అ.క్రి. **1**. పరగు, ప్రసిద్ధమగు. భార. అరణ్య. 2.98 ; **2**. కదులు, చలించు. భార. విరా. 2.15 ; **3**. పోవు. ఉ. హరి. 1.102 ; **4**. ఉండు. ఉ. హరి. 3.37 ; **5**. తిరుగు, సంచరించు. ఉ.హరి. 6.128 ; **6**. ప్రాప్తమగు, లభించు. పి.శకుం. 2.174 ; **7**. జీవనం సాగు, నడుచు. మను. 5.9 ; **8**. తొలగిపోవు. ఆము. 2.46; **9**. ప్రవహించు. వసు. 2.11 ; **10**. డేకు ; **11**. ఆగు, ఒనగూడు, సంభవించు ; **12**. వ్యాపించు, ప్రసరించు ; **13**. జారు ; **14**. పారిపోవు ; **15**. అతిక్రమించు ; **16**. ప్రవర్తిల్లు.

క. సరి. కదులు, వెళ్ళు, ఒకవైపుకి వెళ్ళుట లేక కదులుట, జారు, కుడి లేక ఎడమలకు వెళ్ళుట ; సజి. ఎక్కువ ఏటవాలుగా ఉన్నస్థలం ; జరి. జారుట లేక పడుట, కూలిపోవుట ; జరగు, జరిగు, జరుగు. జారు, జరుగు ; సరకు, సరుకు. జారు, జరుగు, పక్కకు కదులు, తొలగిపోవు ; జగ్గు. కిందకివంగు, లోపలికి వంగు ; కొడ. జర్వ్ (జర్డ్). జారిపడుట (జర్తి) ; తు. సరకు. తొలగిపోవు ; సర్కియుని, జరియుని. కిందికి పడు లేక జారు ; జరి. ఎక్కువ ఏటవాలుగా ఉన్న స్థలం ; జగ్గె. ముందుకు వంగుట ; త. చరి. జరిగిపోవు, కిందికి జారు, గుండ్రంగా తిప్పు ; దొర్లు, తొట్రుపడు, తొలగిపోవు, వదిలిపెట్టు, చేరబడు, వాలు ; చరివు. జరుగుట, గుండ్రంగా తిరుగుట ; చరుక్కు (చరుక్కి). జారు ; చరువు (చరువి). జారిపోవు ; చరువల్. ఏటవాలైన, ఏటవాలు ; మ. చరియుక. జారిపోవు ; చరిక్క. వంచు, జారు ; చరిప్పుక్క, చరిచ్చల్, చరివు, చర్యుక, అరిక్క. పారు ; కువి. జర్గినై. సంభవించు ; కొలా. జరాగ్. జారు ; మాల్తో. జర్కే. తటాలునపడు, జర్క్రతె ; పో.చూ.త. అరవు.

<మూ.ద్రా. *చార్-/*చర్.

జరగించు రూ.చూ. జరిగించు. స.క్రి. నడుపు, ప్రవర్తిల్ల జేయు. జరగు(బాటు(-పాటు) రూ.చూ. జరుగు(బాటు. వి. **1**. జరుగుబడి ; **2**. జారుడు.

**జరజర** రూ.చూ. జలజల. వి. ఈడ్పుధ్వని, వడి, జరజర.

జరజరనడచు అ.క్రి. తొందరగాపోవు.

**జరత** రూ.చూ. జరతారు, వి. వెండి మొ. వాటితో మొలాము చేసిన నూలుపోగు.

**జరతా** రూ.చూ. జరతారు. వి. వెండి. మొ. వానితో మొలాము చేసిన నూలిపోగు, సరిగ. హంస. 1.75.

**జరతార్** రూ.చూ. జరతారు. వి. వెండి మొ. వాటితో మొలాము చేసిన నూలిపోగు, సరిగ.

**జరతారు** రూ. జరత, జరతా, జరతార్, జలతారీ, జలతారు, జల్తారీ, జల్తారు, జల్లారు. వి. వెండి మొ. వాటితో మొలాము చేసిన నూలిపోగు, సరిగ. హంస. 1.120.

హిం. జర్‌తార్. వెండి లేక బంగారపుపోగు ; జర్తార్; ఉ. జర్‌తార్. బంగారు దారంతో నేయబడిన ; పార. జరతార్. బంగారు పోగుతో చేయబడిన ; జర్. బంగారం; తార్. దారం ; జరతారీ. బంగారు మొలాము చేసిన నూలిపోగుతో నేసిన వస్త్రం ;

క. జరతార.

< ఉ. జర్‌తార్.

**జరదరక** వి. అచ్చులో ఉన్న పచ్చి ఇటికకు నేలమీద సన్న సన్న రాళ్ళు, మట్టి అతికినందున ఏర్పడిన బుడిపె.

జరదా[1] వి. బంగారు రంగుగల గుర్రం. హంస. 5.38.

హిం. జర్దా. ఒకవిధమైన రంగుగల గుర్రం ; మరా. జరద. పసుపురంగుగల ; ఉ. జర్దా. పసుపు పచ్చని రంగుగల గుర్రం ; పార. జర్దా. మంచి రంగుగల గుర్రం.

< ఉ. జర్దా.

జరదా[2] వి. కిళ్ళీలో వేసే సుగంధద్రవ్య విశేషం.

హిం. ఉ. జర్దా. కిళ్ళీలో వేసే ద్రవ్య విశేషం.

< ఉ. జర్దా.

జరదాకిళ్ళీ వి. జరదా వేసిన కిళ్ళీ.

జరపు చూ. జరగు. రూ. జరుపు. స.క్రి. 1. అచరించు, చేయు. రం. రా. ఉ. 71 పు. 27 పం.; 2. (తావళం) తిప్పు. భాస్క. రా. యు. 1.631 ; 3 (కాలాదుల్ని) గడుపు, వెళ్ళబుచ్చు. హరి.పూ. 3.248 ; 4. సాగించు, నడుపు. కాశీ. 2.72 ; 5. ప్రసరింపజేయు, వ్యాపింప జేయు. వసు. 3.118 ; 6. చెప్పు.

క. సరి. కదలు, వెళ్ళు, వెళ్ళు లేదా ఒకపక్కకి కదలు, ఉన్నచోటునుండి కదలు ; సజి. కదలు ; జరి. జారు లేదా పడు ; జరగు, జరిగు, జరుగు. జారు, జరుగు, క్రిందకి దొర్లు ; తు. సరకు. ఉన్నచోటునుండి వెళ్ళు, పక్కకి జరుగు ; త. చరి. జారు, కిందికి జరుగు, దొర్లించు ; మ. చరియుక. జరుగు, జారు, కిందికిదొర్లు, వంగు ; చరిచ్చల్. కిందికి ఉన్న గుడిసె, పక్కగది ; ఆరిక్క. పాములాగ పాకు ; కో. జర్వ్. జారిపడు ; కువి. జరగినై. జరుగు ; కొలా. జరాగ్. జారు ; మాల్తో. జర్గ్వ. జార్చు. పడు ; జర్గ్రె. జారు, పడేట్టుచేయు.

జరపోసు రూ.చూ. జలపోసనము. వి. జలతారు, జరి, సరిగ.

జరబాజీ రూ.చూ. జరబాజు. వి. 1. కలధౌత వస్త్రం, జరీబట్ట. హంస. 5.355 ; 2. జరి, సరిగ.

జరబాజు రూ. జరబాజీ, జరదాబు, జరీబాబు, జిరబాబీ. విణ. వెండి జరీతో నేసిన. రసిక. 1.61. వి. జరీబట్ట, కలధౌత వస్త్రం. ఆం.భా. 2.155.

హిం. జర్‌బాఫీ. జరీతో నేసేపని; జర్‌బాఫ్. జరీబట్ట; ఉ. జర్‌బాఫ్, జర్‌బాఫీ. జరీబట్ట ; పార. జర్‌బఫ్, జర్‌బాఫ్, జర్‌బాఫీ. బంగారు దారంతో నేయబడింది.

< ఉ. జర్‌బాఫ్.

జరబాబు రూ.చూ. జరబాజు. వి. వెండిజరీబట్ట. రంగా. చ. 1.158.

జరబు వి. పేలపిండి.

జరభిచెయ్యులు వి.బ.వ. సాహసకృత్యాలు. కు.సం. 8.101.

జరమామిడి వి. జిగురునిచ్చే ఒకరకం చెట్టు (Buchanania latifolia).

జరాలు వి. ఒరనుంచి కత్తి దూయటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కువ.వ. 4.239.

జరి రూ. జరీ. వి. 1. వెండి బంగారాల మలామా. విక్ర. 7.143 ; 2. వెండి మొ. వాటితో మలామా చేసిన నూలి పోగు. సరిగ. ద్వి. సార.చ. 1.14 పు.

హిం. జర్. బంగారం, ధనం; మరా. జర్. బంగారం లేక వెండితో చేసిన దారం : ఉ. జర్. బంగారం, ధనం ; పార. జర్.

< ఉ. జర్.

జరిగొను అ.క్రి. చిక్కుపడు. పల్నా. 42 పు. జరిబిళ్ల వి. తాళ్ళు బిగించటానికి చేనేతలో వాడే కొయ్యబిళ్ళ.

జరిగించు చూ. జరుగు.

జరిగిపోవు చూ. జరుగు.

జరిణిపంది వి. లేడిని పోలిఉండే ఒక పంది.

జరిహానా రూ.చూ. జుల్మానా. వి. జుల్మానా.

జరీ రూ.చూ. జరి. వి. వెండి, రాగి మొ. వాటితో మొలాము చేసిన నూలుపోగు, జలతారు. కవివేల్పుశతకము. 16 వెండి బంగారాల మొలాం.

జరీకట్లచీర వి. ఒకరకం డిజైనులో జరీపెట్టి నేసిన చీర. జరీకమ్మి వి. జరీపోగులు పెట్టి పట్టెలుగాని, డిజైన్లుగాని, పడేట్టు నేసిన కమ్మి. జరీకొణతలి వి. ఒకరకం రాట. జరీగట్టికమ్మి వి. పోగులు చిక్కగా నేసిన కమ్మి. జరీచాపు వి. జరీపెట్టి నేసిన రెండు పంచెలు. జరీజరాబు వి. సరిగంచు దుస్తులు. జరీపూలచీర వి. జరీపోగులతో నేసిన డిజైను. జరీపేటంచు వి. జరీతో డిజైను నేసిన అంచు. జరీపేటు వి. అంచులో జరీపోగులతో నేసిన డిజైను. జరీరాజమాలపేటు వి. జరీపెట్టి, అంచులో నేసిన ఒకరకం డిజైను. జరీలాక వి. 1. రెండు కొలకుల జరీపోగులు ; 2. ఎనిమిది పోగులున్న జరీ, పొడుగు 24 గజాలుంటుంది. జరీలాడె వి. చీర కొంగులో జరీపెట్టి కమ్మినెయ్యటానికి ఉపయోగించే నాడె.

జరీన క్రి.విణ.ద్రు. శీఘ్రంగా. ప్రబంధ. 788.

జరీబాబు రూ.చూ. జరబాజు. వి. వెండిజరీబట్ట, బంగారు బట్ట, నాదరా, పట్టుబట్ట.

జరీబు వి. కొలత.

హిం. జరీబ్. లాఠీ ; మరా. జరీబ్. భూమిని కొలిచేది ; ఉ. జరీబ్. పొలం కొలవటానికుపయోగించే గొలుసు ; పార. జర్‌బ్ + ఈ. భూమిని కొలచేది : అర. జరీబ్. కొలత.

< ఉ. జరీబ్.

జరీబుతోట వి. బావి నీటితో సాగుచేసే చెరుకు పొగాకు మొ. తోట.

జరీలున క్రి.విణ.ద్రు. శీఘ్రంగా. సారంగ.1.82.

జరుకు రూ.చూ. జర్కు. విణ. జారేస్వభావం కల.

జరుగు రూ.చూ. జరగు. అ.క్రి. 1. ఉండు. కు.సం. 7.884 ; 2. జారు, పీడు, ఊడు. దశకు. 10.159 ; 3. చాగు, ప్రవర్తిల్లు, నడుచు. కాశీ. 2.71 ; 4. (కాలాదులు) అతిక్రమించు, గతించు, కడచు. భీమ. 1.31 ; 5. వ్యాపించు, ప్రసరించు. భీమ. 5.8 ; 6. అగు, ఒనగూడు, సంభవించు. పల్నా. 93 ; 7. తొలగిపోవు. కళా. 6 224 ; 8. వర్తించు, మెలగు. ఇందు. 4.40 ; 9. డేకు.

జరిగించు రూ. జరగించు. స.క్రి. 1. నడుపు, ప్రవర్తిల్ల చేయు. రాఘవ. 3.40 ; 2. నెరవేర్చు ; 3. ఉపయోగ పరుచు. జరిగిపోవు అ.క్రి. 1. జరుగు ; 2. చనిపోవు జరుగుచెక్క వి. పెడకోలను మోసే కొయ్యచెక్క

జరుగుడాట వి. రాతి పలకలమీద నుండి కిందికి జారుతూ ఆడే ఒక ఆట. **జరుగుడు** వి. **1.** బాలక్రీడా విశేషం. హంస. 3.146 ; **2.** జారుడు, గళనం. ఆం.భా. 1.143 ; **3.** గారడి. **జరుగుడుచెక్క** వి. పెడకోలను మోసే కొయ్య చెక్క. **జరుగుడుబండ** వి. జీరుకు బండ, కిందికి జారుతూ ఆడుకోటానికుపయోగించే పెద్ద రాతిపలక. పార్వ. 1.52. **జరుగుబడి** వి. జరుగుబాటు. **జరుగు(బాటు(-పాటు)** రూ. జరగుబాటు. వి. సంసార నిర్వహణానికి చాలి ఉండటం. **జరుగుళ్లు** వి.బ.వ. బాలక్రీడా విశేషం.

**జరుగురు** వి. తొందరపని, జరూరు పని.

**జరుపు** రూ.చూ. జరపు. స.క్రి. **1.** (కాలము) పుచ్చు. ద్వి. హరిశ్చ.పూ. 3, అ. 248 ; **2.** చెప్పు. రాఘవ. 3.77 ; **3.** (జపమాల) త్రిప్పు ; **4.** సాగించు, నడపు ; **5.** ఆచరించు ; **6.** వ్యాపింపఁజేయు. వి. నెత్తురు పారుకొనే రోగం.

**జరుపుడు** వి. కాలయాపనం. **జరుపుడువుచ్చు (-పుచ్చు)** అ.క్రి. కాలయాపనం చేయు. ద్వి. హరిశ్చ.ఉ. 1515.

**జరువురు** రూ.చూ. జరూరు. వి. (జరూర్) తొందర.

**జరువురుచేయు** రూ.చూ. జరూరుచేయు. స.క్రి. తొందర చేయు.

**జరూరు** రూ. జరువురు. విశ. అగత్యమైన, అవసరమైన. వి. తొందర.

అ. జరూరత్. ఆవశ్యకతన ; హిం. జరూర్. తప్పనిసరిగా చేసేది ; మరా. జరూర్. అగత్యం ; ఉ. జరూర్, జరూరత్. ఆవశ్యకత, తప్పనిసరి ; పార. జరూర్. ఆవశ్యకత, తప్పనిసరి.

<ఉ. జరూర్.

**జరూరుచేయు** రూ. జరువురు చేయు. స.క్రి. తొందర చేయు.

**జర్కు** రూ. జరుకు. విశ. జారే స్వభావంగల. ప్రబంధ. 260.

**జర్జర** వి. **1**. జూటు ; **2**. కుట్ర ; **3**. వంచన.

సం. జర్జర-. ముదిసిన, శిథిలమయిన, ఖండితమయిన, ముక్కలైన.

సం. జర్జర- (అర్థవిపరి.).

**జర్జు**[1] వి. రీపరుబద్ద.

**జర్జు**[2] వి. కట్టుబడికి పనికివచ్చే రాళ్ళు సమృద్ధిగా దొరికే మందపాటి రాతిపొరల సమూహం.

**జర్తి** వి. జలపాతం.

**జర్నలిజమ్** వి. పత్రికారచన.

ఇం. *Journalism*. పత్రికారచన.

<ఇం. Journalism.

**జర్నలిస్టు** వి. పత్రికారచయిత, విలేఖరి.

ఇం. *Journalist*. విలేఖరి.

<ఇం. Journalist.

**జర్నాల్‌బండ** వి. జర్నాల ప్రాంతం నుంచి వచ్చే చలవరాయి.

**జర్నీ** వి. ప్రయాణం.

ఇం. *Journey*. ప్రయాణం.

<ఇం. Journey.

**జర్మన్‌ముద్దరంగు** వి. ఒకరకం ఎరుపు (తొగరు) రంగు.

ఇం. *German*. జర్మనీ దేశ సంబంధమైన.

<ఇం. German + ముద్దరంగు.

**జ్రా** వి. కొంచెం.

హిం. జరా. కొంచెం ; మరా. జారా. కొంచెం ; ఉ. జరా. కించిత్తు, అల్పం ; అర. జరా. కొంచెం, తక్కువ.

<ఉ.జరా.

**జ్రెపురుగు** చూ. జెర్రి. వి. అల్లం మొక్క కొమ్మలుతినే కాళ్ళ జెర్రి (Centipede).

**జళజళ** రూ. జరజర. వి. ఊడ్చటం, జారటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. సిం.ద్వా. 4.67. క్రి.విశ.ద్రు. శీఘ్రంగా. ఆం.భా. 1.65.

త. సరసర.

**జళభి** రూ. జెళభి. విశ. **1**. సాహసకురాలైన, తెగువగల (స్త్రీ). కు.సం. 6.16 ; **2.** నిర్భాగ్యురాలైన, పనికిమాలిన (స్త్రీ). భాస్క.రా.అరణ్య. 1.140 ; **3.** పాపి అయిన, దుష్టురాలైన. భాగ. 10 పూ. 229 ; **4.** గయ్యాళి అయిన. ద్వి.హరిశ్చ.ఉ. 1103 పం. వి. అసతి, రంకుటాలు. భార.విరా. 3.16.

నం. జరా. ముసలితనం.

క. కళబి.

**జళభుఁడు** వి. పాపి, దుష్టుడు. బసవ. 5.91.

క. కళుబు.

**జళ్లు** వి. జారటం, కత్తిదూయటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**జళ్లున** క్రి.విశ.ద్రు. జివ్వున, జరీలున, జిఱ్ఱున, శీఘ్రంగా. సిం.ద్వా. 7.30. క. సరక్కనె. వేగంగా ; సరసరనె. త్వరగా, ఆతురతగా ; త. చరక్క. త్వరగా, వేగంగా ; చూ. సం. సరాక్. త్వరగా, వేగంగా, తక్షణం.

**జల**[1] రూ.చూ. జెల. వి. కొన్నికొన్ని నియత మార్గాల వెంట పారుతూ ఉండే ప్రవాహానికి జల అని పేరు.

సం. ప్రా.పా. జల-. నీరు.

క. సెలె. ఊట, చెలమ మొ. వాటి ఉత్పత్తి స్థానం.

<సం. జల- (అర్థవిపరి.).

**జల**[2] వి. సర్కారు జిల్లాల్లో, దక్కను పీఠభూమిలో బహిరంగ ప్రదేశాల్లో పెరిగే చెట్టు (Salvodora indica).

**జలకట్టియ** రూ.చూ. జలకట్టె. వి. శ్యేన భేదం, ఒకజాతి డేగ. రసిక. 1.115.

**జలకట్టె** రూ. జలకట్టియ, జెలకట్టె, జెలకంటె, సెలకట్టె. వి. శ్యేనభేదం, ఒకజాతి డేగ. యయా. 1.116.

**జలకమాడు** చూ. జలకము.

**జలకమార్చు** చూ. జలకము.

**జలకము** రూ. జల్కము. వి. స్నానం. భార.శల్య. 2.402.

సం. జలక. నీరు, సంస్కృత జలశబ్దం పైక ప్రత్యయం ; క. జలక. నీరు ; త. జలకం.

<నం. జలక- (అర్థవిపరి.).

**జలకమాడు** అ.క్రి. స్నానంచేయు. జైమిని భా. 3, పాండు. 2.4. **జలకమార్చు** స.క్రి. స్నానము చేయించు.

పొందు. 2.17. **జలకముకాఁడు** వి. స్నానం చేయించేవాడు. **జలకముగావించు(-కావించు)** స.క్రి. స్నానమాడించు. పండి. చ. 5.468 ప. **జలకమువాఁడు** విఱ. స్నానం చేయించేవాడు. ద్వి.పరమ. 3.203 ప. **జలకమోకకావడి** వి. మోకులతో కట్టబడిన నీళ్ళకావడి.

**జలకమోకకావడి** చూ. జలకము.

**జలగ** రూ. జలుక, జల్గ, జెలగ, జెల్గ. వి. ఎరలాగ ఉండి, రక్తం పీల్చే ఒకానొక నీటి పురుగు. భార. శాంతి. 3.393.
సం. జలూకా. జలగ.
<సం. జలూకా.

**జలగగరి** చూ. జలగడుగు. రూ.చూ. జలగరి. వి. లోహాదులు దొరుకుతాయనే ఆశతో మట్టిని, ఇసుకని కడిగేవాడు.

**జలగడుగు** రూ. జల్లకడుగు. స.క్రి. **1.** వెండి, బంగారు రవలు మొ. వెదకి తీసుకోడానికి ఇసుక మొ. వాటిని నీళ్ళలో పోసి గాలించు; **2.** ఉన్నలోపాల్ని వెలిపుచ్చి నిందించు; **3.** పూర్తిగా నాశనం చేయు; **4.** పూర్తిగా వెతుకు.
సం. జల-. నీరు.
<సం. జల-+కడుగు.

**జలగడుగుబాలీ (-కడుగుబాలీ)** వి. కంసాలి కుంపటిలోని బూడిదను బంగారు పొడికోసం గాలించడానికి వాడే మట్టిపాత్ర.
సం. జల-. నీరు.

**జలగడుగువాఁడు** విఱ. బంగారం మొ. తీసికోడానికి ఇసుక మొ. పదార్థాల్ని నీళ్ళతో కడిగి శోధించే ఒక జాతివాడు, మసికట్టు బంగారం కడిగేవాడు. ఆం.భా. 2.285.
సం. జల-. నీరు.
<సం. జల-+కడుగువాఁడు.

**జలగంటె** వి. వేటపులుగు, డేగ.

**జలగరి** రూ. జలగగరి. వి. మసికట్టు బంగారం కడిగేవాడు. విజ్ఞా.ఆచా. 58.
క. జలగాఱ.

**జలజల** రూ. జల్జల. వి. **1.** రెక్కలు విదల్చటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పండి.చ. 2.88 ప.; **2.** రాలటం, తొరగటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 4.170; **3.** కురవటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. సిం.ద్వా. 5.73; **4.** ప్రవహించటం, కారటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. మను. 4.12; **5.** చల్లటంలో అయ్యే అనుకరణం. ద్వి.నల. 1.1174 పం.
**జలజలపాఱు** అ.క్రి. ప్రవహించటంలో ధ్వన్యనుకరణం. **జలజలరాలు** అ.క్రి. రాలటంలోని ధ్వన్యనుకరణం. రాజగో. 4.47. **జలజలలాడు** అ.క్రి. నీరు ప్రవహించు.

**జలతారీ** రూ.చూ. జరతారు. వి. వెండి మొ. వాటితో మలామా చేసిన నూలుపోగు. రంగా.చ. 1.161.

**జలతారు** రూ.చూ. జరతారు. వి. వెండి మొ. వాటితో మలామాచేసిన నూలిపోగు. నర.శ. 13.

**జలతైలబిందువగు** అ.క్రి. నీటిలో వేసిన నూనెబొట్టు విరివిగా వ్యాపించటంపై వచ్చిన పలుకుబడి, వ్యాపించు. ఉ.హరి. 5.198.

**జలదమునమ్మిచేనీరుజల్లు** స.క్రి. ఎక్కడో ఉన్నదానిని నమ్ముకొని చేతిలో ఉన్నదానిని జారవిడుచు.

**జలదరము** రూ. జల్దరము. వి. **1.** భయం. ద్వి.భాగ. 8; **2.** కంపం.
**జలదరించు** రూ. జల్దరించు. అ.క్రి. **1.** భయంచేత వణుకు. శృం.నై. 7.95; **2.** అసియాడు, చలించు. కాశీ. 1.3; **3.** భయపడు. దశా. 1.180. **జలదరింపు** రూ. జల్దరింపు. వి. భయం. ఆం.భా. 1.133.

**జలదరించు** చూ. జలదరము.

**జలదరింపు** చూ. జలదరము.

**జలదారి** రూ.చూ. జలారి. వి. **1.** నీరుపోయే తూము. సానంద. 2.11; **2.** మురికి నీటిగుంట.

**జలదోషము** రూ. జలదోసము. వి. పడిశం.
సం. జలదోష-. నీటిదోషం.
<సం. జలదోష- (అర్థవిపరి.).

**జలదోసము** రూ.చూ. జలదోషము. వి. జలుబు, రొంప, పడిసెం.

**జలపరించు** అ.క్రి. జలదరించు, కంపించు.

**జలపూఁత** వి. బంగారం, వెండితో చేసిన మలాం.
హిం.ఉ. జర్. జరీ; పార. జర్.
<ఉ. జర్+పూఁత.
**జలపూఁతబంగారు** వి. అశాశ్వతం. తాళ్ల. సం. 11.3, భా. 70.

**జలపోఁత** చూ. జరపోసనము. వి. జలపోసనం, వెండి బంగారాల నీటితో చేసిన మలామా. ప్రభా. 5.57.

**జలపోసనము** రూ. జరపోసు. వి. **1.** జలపోత, వెండి బంగారాల నీటితో వేసిన పైపూత, మలామా. పండి.చ. ప. 310, హర. 5.55; **2.** జలతారు. కాశీ. 6.161.
హిం.ఉ. జర్ పోశ్. బంగారు పూత; పార. జర్ పోష్. బంగారు లేసు పని.
<ఉ. జర్‌పోశ్.

**జలబాధకలుగు** అ.క్రి. మూత్ర విసర్జనా కాంక్ష కలుగు.
సం. జలబాధా. నీటిబాధ.
<సం. జలబాధా+కలుగు.

**జలము** వి. శుక్రం. వైజ. 2.75.
సం. జల-. నీరు.
<సం. జల- (అర్థవిపరి.).

**జలరేకలు** వి.బ.వ. పల్చటి మబ్బు అడ్డం వచ్చిచారలు చారలుగా కిందకిదిగే సూర్యుడి వెల్తురు.
సం. జల-. నీరు; రేఖా. గీత.
<సం. జలరేఖా+-లు.

**జలసూత్రము** వి. **1.** ధారాయంత్రం; **2.** అటూఇటూ నీరు రావటానికి కాలువలోకి వదలిన తాడు.
సం. జలసూత్ర-. నీటి సంబంధమైన దారం.
<సం. జలసూత్ర- (అర్థవిపరి.).

**జలాతంత్రము** వి. చిల్లుల పాత్ర.
సం. జల-. నీరు.

**జలారి** రూ. జలదారి, జాలారి. వి. **1.** నీరు పోయే తూము. క్రీడా. పీఠి. 53 ప.; **2.** స్నానం చేసే చోటు.

సం. జల-. నీరు.

<సం. జల- + దారి.

**జలిం** వి. కాడిమానులోని రంధ్రం.

**జలుక** రూ.చూ. జలగ. వి. జెలగ.

**జలుగు** వి. పచ్చని పూలుపూసే ఒకరకం చెట్టు. వీటితో కంచె వేస్తారు. దీని కర్ర నుంచి బొగ్గు తయారు చేస్తారు (Sesbania aegyptiaca).

**జలుగురు** వి. జారుమాంసం.

**జలుబు** రూ. జలువు[1]. వి. శైత్యం. ఆం.భా. 1.80 ; **2.** పడిసెం. విశ. చల్లని, శీతమైన.

త. చళి, చన్ఱర్ హ్. పడిసెం, ముక్కులోంచి జారిన చీమిడి, కఫం (-ప్పు-; -ట్ట్-) జలుబుచేయు ; మ. చళి. చీమిడి, వీర్యం.

**జలుబుకారు** వి. చలికారు, వానకారు. **జలుబుచేయు** అ.క్రి. పడిసెంపట్టు. **జలుబునీళ్లువదలిపోవు** అ.క్రి. పొగ రణగు.

**జలువు**[1] రూ.చూ. జలుబు. వి. **1.** పడిసెం ; **2.** శైత్యం ; విశ. చల్లని.

**జలువు**[2] వి. **1.** నాగలి, బండి మొ. వాటిని పన్నేటప్పుడు కాడిని నొగ మొదలుకు దగ్గరగా కట్టేది ; **2.** లఘుత్వం ; **3.** చనవు.

**జలువుబిళ్ళ** వి. నాగలి, గుంటక, గొర్రు మొ. సాధ నాలు తోలేటప్పుడు నేలలోతుగా తెగటానికి వారిజెకు వేసే కొయ్యబిళ్ళ.

**జలేరి** వి. పానవట్టం, లింగపీఠం.

**జల్కము** రూ.చూ. జలకము. వి. **1** స్నానం. రం.రా.ఉ. 146 పు. 13 పం. ; **2.** జలం, నీరు. యయా. **4**.97.

**జల్గ** రూ.చూ. జలగ. వి. ఎర్రలాగ ఉండి నెత్తురు పీల్చే ఒకానొక జలచరం. పండి.చ. 1.56 పు.

**జల్జల** రూ.చూ. జలజల. వి. **1**. రాలటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. కవిరాజ. 5.245 ; **2.** ప్రవహించటం, కారటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం ; **3.** రెక్కలు విదల్చటంలో అయ్యే ధ్వనికి అనుకరణం ; **4.** కురవటం మొ. వాటియందయ్యే ధ్వనికి అనుకరణం ; **5.** చల్లటం మొ. వాటియందయ్యే ధ్వనికి అనుకరణం.

**జల్డి** రూ.చూ. జల్లెడ[1]. వి. మట్టిలో కలిసిపోయిన చెత్తాచెదారం మొ. వాటిని వేరుచేయటానికి వాడే పరికరం.

**జల్త** వి. గృహప్రవేశ సమయంలో ఇచ్చే బలి.

**జల్తారీ** రూ.చూ. జరతారు. వి. వెండి మొ. మలామా చేసిన నూలిపోగు.

**జల్తారు** రూ.చూ. జరతారు. వి. వెండి మొ. వాటిలో మలమా చేసిన నూలిపోగు, బట్ట అంచులకుగాని కమ్ములకుగాని డిజైన్ల కోసంగాని పెట్టే సన్నటి మెరుపు దారం. రామలిం. శ. 33.

**జల్తారుకమ్మి** వి. జరీపెట్టి నేసినకమ్మి. **జల్తారుచీర** వి. జరీ ఎక్కువపెట్టి నేసిన చీర. **జల్తారుపెట్టె** వి. జరీదారం చుట్టే పనిముట్టు. **జల్తారుపేటు** వి. జరీపెట్టి నేసిన డిజైను. **జల్తారురుమాలు** వి. అంచుల్లోను కమ్ముల్లోను జరీపోగులు పెట్టి నేసిన తలపాగ. **జల్తారులడీ** వి. జరీచుట్ట.

**జల్దరము** రూ.చూ. జలదరము. వి. **1.** భయం ; **2.** కంపం.

**జల్దరించు** రూ.చూ. జలదరించు. అ.క్రి. **1.** భయం చేత వణకు ; **2.** చలించు ; **3.** భయపడు. **జల్దరింపు** రూ.చూ. జలదరింపు. వి. భయం.

**జల్దరించు** చూ. జల్దరము.

**జల్దరింపు** చూ. జల్దరము.

**జల్దికడవ** వి. జాతరల్లో నీళ్ళు మోసుకురావడానికి వాడే మట్టి కడవ.

**జల్దికుండ** వి. జాతర పూర్తయిన తర్వాత శక్తిని సాగనంప డానికి ఉపయోగించే మట్టిపాత్ర.

**జల్దు** క్రి.విశ. త్వరితం.

హిం.మరా. జల్ద్. శీఘ్రం, త్వరితం ; ఉ. జల్ద్. సత్వరం ; పార. జల్ద్. చురుకుదనం, త్వరితం ; అర. జల్ద్. త్వరితం, శీఘ్రం.

<ఉ. జల్ద్.

**జల్దుకొనివచ్చు** అ.క్రి. తోసుకొని వచ్చు.

**జల్ల** రూ. జొల్ల[1]. వి. **1.** మోతబండి మీదగూడ, బండిబుట్ట ; **2.** పెద్ద గంప, గుండు జల్ల ; **3.** తలవెనక భాగంలో చేత్తో కొట్టటం.

**జల్లకుండ** వి. వెయ్యి కండ్ల కుండ. **జల్లకొమ్ము** వి. వెడల్పుగా చిన్నదిగా అందంగా ఉన్న కొమ్ము. **జల్లబండి** వి. **1.** పెద్దగంప కూర్చిన బండి ; **2.** పైన కప్పులేని బండి. **జల్లబుట్టి** వి. పెంట (ఎరువు) తెచ్చుకోటానికి తీగలతో అల్లిన పెద్ద గంప.

**జల్లకడుగు** రూ.చూ. జలగడుగు. స.క్రి. **1.** బంగారు పనివారి కుంపటి బూడిదను ఒక గుంటకొయ్య పళ్ళెంలో పోసి, నీరు పోస్తూ నుసిని తోసివేయు ; **2.** ఏదైనా ఒక వస్తువును తుద ముట్ట కర్చుచేయు ; **3.** చీవాట్లు పెట్టు ; **4.** నీళ్ళలోముంచి గాలించు ; **5.** లోపాలు వెలిపుచ్చి నిందించు.

**జల్లడ** రూ.చూ. జల్లెడ[1]. వి. మట్టితో కలిసిపోయిన చెత్తా చెదారం మొ. వాటిని వేరుచేయటానికి వాడే పరికరం.

**జల్లను** అ.క్రి. భయాదులచే మనస్సు ఉలికిపడు.

**జల్లరి** వి. అనంతపూర్, మైసూర్, సేలం, మధుర మొ. ప్రదేశాల్లో ఎక్కువగా పెరిగే అందమైన చెట్టు (Shorea talura).

**జల్లారు** రూ.చూ. జరతారు. వి. జరీ. సరిగ.

**జల్లి**[1] వి. **1.** జాలరు. కు.సం. 8.36 ; **2.** వ్యర్థపదం. పండి.చ. 1.6 పు. ; **3.** కొప్పుపై ఉంచుకొనే ఆభరణ విశేషం, వాలపాశ్యా విశేషం. కాశీ. **4**.186 ; **4.** కుచ్చు, తోకకుచ్చు. ప్రభా. 2.69, నరస. 5.90 ; **5.** చామరం. యయా. 4.74 ; **6.** నవరపుమెకం, చమరీమృగం. సారంగ. 1.64 ; **7.** కర్ణాభరణ విశేషం. అష్టమ.క. 3.145 ; **8.** నవరం. శుక. 1.133.

క. జల్లి, కుచ్చు, తోకకుచ్చు, పగిలినరాయి, లోహం ; తు. చల్లి. ముక్క, కండెపెంకు ; జల్లి. పగిలినరాళ్ళు ; త. సల్లి. జాలరు ; చల్లి. రాయి లేదా గాజుపెంకులు,

కుండపెంకులు, రాతిముక్కలాంటి చిన్న ముక్కలు, సున్నం కోసం వాడే చిన్న ఆలుచిప్పలు, చిన్నరాగినాణెం.

**జల్లికంకి** వి. గింజలకు ఆధారమైన కంకి, వెన్నులు వదులుగా ఉన్న కంకి. **జల్లిగొంగళ్లు** వి.బ.వ. కుచ్చుకంబళ్లు, కుచ్చుకట్టిన చిన్న గొడుగులు. **జల్లితొంగళ్లు** వి. బ.వ. గొడుగులకు కట్టే కచ్చులు. కు.సం. 8.36. **జల్లితోక** వి. కుచ్చుతోక. ద్వి.పరమ. వి. 1.76 పు. 4 పం. **జల్లితోకమెకము** వి. సవరపు మెకం. **జల్లిపెండెము** వి. పాదభూషావిశేషం, ఒక నగ. వాల్మీ. 3.13, ద్వి.భాగ. 10. **జల్లిముత్తెము** వి. సన్న ముత్యం, పొడిముత్యం. **జల్లిమెకము** వి. చమరీమృగం. ఉ.రా. 4.32, చంద్రాంగ. 2.84. **జల్లివాలుమెకము** వి. చమరీమృగం. వ్యు. కుచ్చుతోకఉన్న జంతువు. **జల్లివేరు** వి. కొన కుచ్చులాగ ఉండే వేరు.

**జల్లి**[2] చూ. జల్లెడ. రూ. జెల్ల[2], జెల్లి. విశే. 1. అసత్యమైన, బొంకైన. వరాహ. 9.101 ; 2. వ్యర్థమయిన. అప్ప. 1.151. వి. 1. అబద్ధం, బొంకు. వేమన. 172 ; 2. జల్లెడ, చాలని. ఆం.భా. 2.240 ; 3. చిల్లు, రంధ్రం; 4. పిట్టగోడలోని డిజైను కంత; 5. పలుచన, ఎడం ఎడంగా ఉండటం; 6. అబద్ధం; 7. ఇటుక సూలలకు బయటి మూతగా, రాతిని పేర్చి అలికినకప్పు ; 8. ఇటిక బట్టీలో పొయ్యిలు కట్టడానికి ఎడం వదుల్తూ పచ్చిటికలతో పేర్చిన దిమ్మ.

త. సల్లి.

**జల్లించు** స.క్రి. 1. శోధించు, పరీక్షించు. భార-ద్రోణ. 2.193 ; 2. సంహరించు. రాజవా. 5.4 ; 3. ధాన్యాదుల్ని జల్లెడలో పోసి తిప్పు. అ.క్రి. 1. కారు, స్రవించు. భాగ. 10 పూ. 178; 2. పీడు, విడివడు. ప్రబంధ. 78 కొ. క. జల్లిసు. జల్లించు; జల్లడి, జల్లడె, జరడె, జరడె. జల్లెడ; త. చలి, చల్లు. జల్లించు ; చల్లడై. జల్లెడ ; మ. చలిక్క. జల్లించు; చల్లట. పెద్దజల్లెడ. **జల్లికాడు** వి. అసత్యవంతుడు. ఆం. భా. 3.12. **జల్లిగంటె** వి. చిల్లులుగరిటె. కంబి. **జల్లిగంప** వి. సందులుగల గంప. **జల్లితడక** వి. నేత నేసేటప్పుడు నాడె మగ్గంగుంటలో పడకుండా గుంటమీద పెట్టే వెదురుచాప. **జల్లినీడ** వి. మధ్య మధ్య వెలుగు ఉండు పొడలుగల నీడ. **జల్లిపోయు** స.క్రి. జల్లెడపట్టు. **జల్లిమాటలు** వి.బ.వ. పొల్లుకబుర్లు, కల్లలు. **జల్లిమూకట** వి. కళ్లసిబ్బి, జల్లెడసిబ్బి. **జల్లిమూకుడంచు** వి. జల్లిమూకుడు పెట్టే ఉరంకు. **జల్లిమూకుడు** రూ.చూ. జల్లిమూఁకుడు. వి. జల్లెడసిబ్బి, చిల్లులుపెనం. **జల్లిమూఁకుడు** రూ. జల్లిమూకుడు, జల్లి మూకుడు. వి. సగంవరకు చిల్లులు గలిగి అన్నం వార్చటానికి ఉపయోగించే మూకుడు.

**జల్లిం** చూ. జల్లెడ. వి. జల్లెడ.

**జల్లిక** క్రి.విశే. గ్రా. వెల్లుగా, అధికంగా. వరాహ. 4.15 వ.

**జల్లిడ** రూ.చూ. జల్లెడ[1]. వి. జల్లెడ.

**జల్లిదరేకుకిటికీ** వి. జాలీకిటికీ.

**జల్లిడి** రూ.చూ. జల్లెడ[1]. వి. జల్లెడ.

**జల్లిడిమూకుడు** రూ.చూ. జల్లెడమూకుడు. వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజి వార్పుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టిమూకుడు. **జల్లిడిసెక్కు (-చెక్కు)** స.క్రి. ఆము పొయ్యిలదగ్గర వరసగా మూడు గోలేలు నిలబెట్టి వాటిపై రెండు గోలేలను బోర్లించు.

**జల్లిబిడ్డి** వి. నీళ్ళు చేదుకోడానికి వాడే మట్టికడవ.

**జల్లీవేయించు** స.క్రి. లెక్కలుగా కట్టు.

**జల్లు**[1] చూ. చల్లు. రూ. ఝల్లు, దల్లు. వి. 1. వర్షాదుల ధార. భాగ. 2.186, పల్నా. 29 ; 2. ఒకసారి వడిగా కురిసి వెలిసే వాన. ఆము. 4.91 ; 3. వాన కురిసేటప్పుడు చెదిరిపడే నీళ్ళు. శుక. 1.187 ; 4. చిలకరింపు.

క. చల్లు, చల్, చెల్లు, చెల్లుకు. వెదజల్లు, కుమ్మరించు, చిందు ; చల్లిసు, చెల్లిసు. వెదజల్లేటట్లు చేయు ; తు. చల్లుని. చిలకరించు, పోయు ; చెల్లాట. జల్లడం, చిలకరించడం ; త. చల్లు. నీళ్ళుజల్లు ; కో. చెల్. వెదజల్లు, (ద్రవం) -వెదజల్లు ; కువి. జల్లినయిన్. వెదజల్లు ; పర్జి. చల్. (వర్షం) ధారలుగా పడటం ; గ. జల్. విత్తులు చల్లడం, వెదజల్లు ;

పో.చూ. సం. జల-. నీరు.

**జల్లుకొను** అ.క్రి. మూగు, గుంపుగాకూడు. హర. 7.38. **జల్లుగొట్టు (-కొట్టు)** అ.క్రి. వానచినుకులు పక్కవాటుగా ఇంట ప్రవేశించు. **జల్లుదున్నకం** వి. చివరిసారి దున్నటం. **జల్లుపరదా** వి. జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీద కుదించిన పలక. **జల్లులాడు** అ.క్రి. నీళ్ళు చల్లుకొంటూ ఆడు.

**జల్లు**[2] రూ.చూ. ఝల్లు. వి. 1. భయాదులవల్ల మనస్సు, శరీరం మొ. కంపించటంలో అయ్యే అనుకరణం. మను. 2.66 ; 2. ద్రవించటానికి అనుకరణం. హ.న. 4.21 ; 3. వికసించటానికి, వ్యాపించటానికి అనుకరణం. కవిక. 4.140 ; 4. రాలటంలో అయ్యే అనుకరణం. ఉ.రా. 4.93 ; 5. రక్తం మొ. పైకి రావటానికి అనుకరణం. దశా. 6.85.

**జల్లుమను** అ.క్రి. ఒళ్ళు జలదరించు. < జల్లు[2] + అను.

**జల్లు**[3] వి. మొక్కజొన్నకంకి నెత్తిపై వేసే పీచు.

**జల్లు**[4] వి. బియ్యంలేని వరిగింజలు.

**జల్లుతడిక** చూ. జల్లి[2]. వి. కావలసిన పదార్థంలో కలిసిపోయిన చిన్న చిన్న రాళ్ళు మొ. వాటిని వేరుచేయడానికి వాడే పరికరం.

**జల్లెడ**[1] రూ. జల్లి, జల్లడ, జల్లిడ, జల్లిడి. వి. 1. జల్లించే సాధన విశేషం, చాలని. మను. 4.25 ; 2. ఏకేటప్పుడు దూది కింద పెట్టే జల్లెడ ; 3. పేటుపన్నెలో రెండు పాయలుగా విడదీసిన దారాలను అంచు పడుగులోకి వేలాడదియ్యటానికి పక్కగా అమర్చిన చిన్న పన్నె.

క. జరడె, జలడె, జల్లడి, జల్లడె. జల్లెడ ; త. చల్లడై, సల్లడై; మ. చల్లడ.

**జల్లెడకన్ను** వి. పలచగా నేసిన బట్టలో పోగుల మధ్య వచ్చిన జల్లెడ సందంత వెలితి. **జల్లెడకుఱుపు** వి. వెన్నెముక మీద లేచే పొక్కు, తూట్లుఉన్న కుఱుపు, రాచపుండు. **జల్లెడతడక** వి. కావలసిన పదార్థంలో కలసిపోయిన చిన్న చిన్న రాళ్ళు మొ. వాటిని వేరుచేసే పరికరం. **జల్లెడపట్టు** స.క్రి. నిగ్గుతేల్చు, జల్లించు. **జల్లెడపాటువడు (-పడు)**

అ.క్రి. దట్టంగాపట్టు, పెరుగు. పి.శకు. 1.104. **జల్లెడమూకుడు** రూ. జల్లిడిమూకుడు. వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజివార్చుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టిమూకుడు. **జల్లెడసిప్ప** వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజివార్చుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టిమూకుడు.

**జల్లెడ²** చూ. జల్లి¹. వి. 1. కుచ్చు. ఉ.హరి. 2.194; 2. చామరం. జైమిని భా. 5.29.

**జల్లెడ³** వి. ఆయుధ విశేషం. ఉ.హరి. 6.66.

**జళికి** వి. మల్లబంధ విశేషం. భార.విరా. 2.15.

**జళికించు** చూ. జళుకు.

**జళిపించు** చూ. జళుపు.

**జళుకారు** చూ. జళుకు.

**జళుకు** రూ. జళ్కు. వి. 1. మెరుగు, తళుకు. పాండు. 3.87; 2. జడుపు, భయం. ఉ.రా. 3.195, ఉ. హరిశ్చ. 3.48. విశే. భయంకల, బెదురుకల. వసు. 5.14.

**జళికించు** స.క్రి. అదిలించు. వైజ. 4.12. **జళుకారు** అ.క్రి. మిలమిలలాడు, మించు. **జళుకులువాఱదించు** స.క్రి. మెరుగుపోటు వేసిదంచు. పాండు. 3.87.

**జళుపు** రూ. జడుపు. వి. భయం, బెదురు. నవనాథ. 2.86 పు. 13 పం.

**జళిపించు** స.క్రి. 1. ఏయు. క్రీడా. 212; 2. చిమ్ము. పి.శకు. 1.73; 3. జాడించు, తిప్పు. కళా. 6.14.

**జళ్కు** రూ.చూ. జళుకు. వి. 1. భయం. ఉ.రా. 6.48; 2. మెరుగు, తళుకు. విశే. బెదురుకల.

**జళ్లు** వి.బ.వ. 1. పల్కులేని గింజ; 2. వానజడులు.

**జవ** వి. 1. యంత్రభేదం. ఆం.భా. 2.293; 2. నగలు, బల్లలు మొ. వాటి చుట్టూ ఏర్పరిచే అంచు; 3. తనంతట తాను తిరిగే యంత్రానికి లోపలఉండే ప్రధానావయవం; 4. రత్నాలు పొదగటానికి బంగారంతో చేసిన గూడు; 5. మరమగ్గం బొమ్మకు నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర; 6. పలచగాఉండే రేకు; 7. దూలానికీ కప్పుకూ మధ్య అతికిన కొయ్యపలక; 8. సన్నటి అంచు; 9. లోతుగీత.

**జవకట్టికొను** స.క్రి. భద్రపరచుకొను తాళ్ల.సం. 5.140. అ.క్రి. కూడుకొను. **జవకట్టు** స.క్రి. జతపరుచు, కూర్చు. అష్ట. క. 2.9 పు. 9 పం. విశే. కూడిన, మేళవించిన. వి. అంచుకట్టు. **జవగొట్టు(-కొట్టు)** అ.క్రి. రేకుల్ని మడచి గొట్టాలు చేసినప్పుడు, కలిసిపోవలసిన అంచులు ఒకదానిపై ఒకటి చేర్చినపుడు ఎత్తుకాకుండా ఒకఅంచు వేపు చప్టాచేయు. **జవతలుపు** వి. చెక్కకు జవలు బిగించి చేసిన తలుపు. **జవదాటు** స.క్రి. మేరమీరు, అతిక్రమించు, ఉల్లంఘించు. పారి. 1.94; కళా. 1.4. అ.క్రి. మీరు. ప్రభు. 3.496 పు. **జవబియ్యము** వి. ఒకరకం వడ్లు. **జవరంపం** వి. చెక్కలను కలపటంలో వాడే ఇనపసాధనం.

**జవజవ** వి. 1. దుర్బల వస్తువులు కంపించటంలో అయ్యే అనుకరణం. కాశీ. 5.119; 2. ఇంకటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. శ్రీ. రం. మా. 3.617; 3. మాగి మెత్తనగు.

క. జవ్వగు, జొగు, జవళు, జవ్వళు. చిత్తడినేల.

**జవజవమను** అ.క్రి. కంపించు. చమ. 3.108. <జవజవ+అను. **జవజవలాడు** అ.క్రి. కంపించు. క్రీడా. 45. <జవజవ + -లు + ఆడు.

**జవట** వి. తాటి కమ్మ మొదటిభాగం, తాటిమట్ట పంగ.

**జవనిక** వి. తెర, తిరస్కరిణి. శృం. నై. 4.2.

సం. యవనికా, జవనికా, జవనీ. తెర; ప్రా. జవనియా.

క. జవనిక.

<సం. యవనికా. సంస్కృతంలోని జవనికా, జవనీ శబ్దాల ప్రయోగం విరళం.

**జవర** రూ.చూ. జవరము. విశే. 1. చిన్నదయిన. రం. రా. బాల. 56పు. 4పం.; 2. మృదువయిన, మెత్తనయిన; 3. సాపయిన.

**జవరచేయు** స.క్రి. సరిచేసేటప్పుడు పదునుకు పెట్టిన గంజిని చేతులతో సమంగా పుద్దు. **జవరన** వి. 1. మార్దవం; 2. ఆర్జవం, సరళత; 3. సాంద్రత. **జవరనేయు** స.క్రి. చక్కగానేయు. **జవర(దనము** వి. 1. సరళత, ఆర్జవం. కళా. 2.32; 2. మార్దవం. ప్రబంధ. 23; 3. సాంద్రత.

**జవరము** రూ. జవర. విశే. తరచైన, సాంద్రమైన. నృసింహ. 2.50.

**జవరు** స.క్రి. పూయు.

క. సవరు. రాయు లేదా పూయు (నీళ్ళు, నూనె. మందు, రంగు లేదా బూడిదలాగ); సవరిసు. రాయటం మొ.

**జవరాలు** వి. యువతి, స్త్రీ. క్రీడా. 212; మను. 2.41.

సం. యౌవన-. పడుచుదనం; ప్రా. జవ్వన-.

<ప్రా. జవ్వన- + ఆలు.

**జవలి** రూ.చూ. జగ్గిలె. వి. అరుగు. తిన్నె.

**జవలు** వి.బ.వ. యవధాన్యం, బెదురు బియ్యం.

సం. యవ-. యవధాన్యం; ప్రా. జవ-.

<ప్రా. జవ- + -లు.

**జవళి** రూ.చూ. జమిలి. వి. 1. అంగడి, పాండు. 1.2; 2. జంట. సుద. 3.164; 3. అమ్మదగిన కొత్తవస్త్రం; 4. రెట్టింపు. విశే. జంటఐన.

**జవళియంగడి(-అంగడి)** వి. బట్టలదుకాణం. **జవళివాడు** విశే. బట్టలమ్మేవాడు.

**జవాజి** రూ.చూ. జవాది. వి. సంకుమదం, ఒకజాతి పిల్లివల్ల లభించే పరిమళ ద్రవ్యం. మను. 5.57.

**జవాది** రూ. జవాజి, జవ్వాజి, జవ్వాది, జవ్వాదు. వి. సంకుమదం, ఒక జాతి పిల్లి వల్ల లభించే పరిమళ ద్రవ్యం. ఆము. 1.61. ద. హిం. శా. సంపు. 7. శా. సం. 734. క్రీ. శ. 1228.

సం. జవాది-. సంకుమదం.

క. జవాదు; త. సవాదు.

<సం. జవాది-.

**జవాదిపిల్లి** రూ. జవ్వాజిపిల్లి, జవ్వాదిపిల్లి. వి. సంకువు, ఒకజాతిపిల్లి. యయా. 1.104. **జవాదివంకి** వి. మిక్కిలి అందగత్తె.

**జవాను** రూ. జమాను, జెవాను. వి. 1. సేవకుడు, రాజకీయ ఉద్యోగి, బంట్రోతు; 2. బలశాలి; 3. పొడుగరి.
హిం. ఉ. జవాన్. తరుణుడు, యువకుడు; మరా. జవాన్. యువకుడు, శూరుడు; పార. జవాన్. తరుణుడు, యువకుడు.
<ఉ. జవాన్.

**జవాబు** రూ. జాబు. వి. సమాధానం. హంస. 1.233.
హిం. జవాబ్. ప్రత్యుత్తరం; మరా. జవాబ్. సమాధానం, బాధ్యత; ఉ. జవాబ్. సమాధానం, ఉత్తరం; పార. జవాబ్. ఉత్తరం, సమాధానం; అర. జవాబ్. సమాధానం.
<ఉ. జవాబ్.
జవాబుదారి వి. పూచీ, హామీ. జవాబుదారు వి. పూచీదారు, పూటకాపు. ఉ. పార. -దార్. కలవాడు. <జవాబ్+-దార్.

**జవాబునవీసు** వి. లేఖకుడు, వ్రాయసకాడు. నయ్యద్ అబ్బా సరీఖానుని చరిత్ర. పు. 5.
హిం. ఉ. పార. జవాబ్‌నవిస్. లేఖకుడు.
<ఉ. జవాబ్‌నవీస్.

**జవారిగిత్త** వి. దేశవాళీగిత్త.
హిం. ఉ. జవాహర్, జవాహిర్. రత్నం.
<ఉ. జవాహిర్+గిత్త.

**జవాసా** వి. గంజాయి, ఒకరకం ముళ్ళ పొద.
హిం. జవాస్, జవాసా. ఒకరకం ముళ్ళపొద.
<హిం. జవాసా.

**జవాహిరి** రూ. జవాహిరీ, జావాహిరి. వి. రత్నపు సొమ్ము.
హిం.ఉ. జవాహర్, జవాహిర్. రత్నం.
<ఉ. జవాహిర్.

**జవాహిరీ** రూ.చూ. జవాహిరి. వి. విలువైన ఆభరణాలు.

**జవిరేసలప** రూ.చూ. జవురేసలప. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగా, నున్నగా సర్సడానికి వాడే సలప.

**జవిలి** రూ.చూ. జమిలి. వి. జంట.

**జవిలె** రూ.చూ. జగ్గిలె. వి. తిన్నె, అరుగు.

**జవిళి** రూ.చూ. జమిలి. వి. జమలి, జంట.
జవిళిసరుకులు వి.బ.వ. అందుబాటులో ఉన్న సరుకులు. పాండు. 1.2.

**జవుకిచ్చు** చూ. జవుకు.

**జవుకించు** చూ. జవుకు.

**జవుకు** రూ.చూ. జౌకు. అ.క్రి. 1. సారహీనమగు, చివుకు. చంపూ రా. 3.146; 2. మెత్తబడు, మెత్తగిల్లు; 3. ధైర్యహీనమగు, భయపడు; 4. కుంగు. విణ. పంకిలమైన, బురదగా ఉండే (ది), అదృఢమైన.
జవుకిచ్చు అ.క్రి. ధైర్యం సన్నగిల్లు, బలహీనమగు. జవుకించు రూ.చూ. జౌకించు. స.క్రి. 1. వేలాడదీయు; 2. మెత్తపరుచు. జవుకునేల వి. వానకురిస్తే దిగబడే నేల.

**జవుజవ్వ** రూ.చూ. జౌజవ్వ. వి. 1. వంగటంలో అయ్యే ధ్వన్యనుకరణం; 2. కుంగటంలో అయ్యే ధ్వని అనుకరణం.

**జవుటి** వి. కంపల్ని కోసి లాగడానికి కానలో కత్తిని అమర్చిన పొడుగాటి కర్ర.

**జవుడు** వి. పడి, తొందర.
సం. జవ-. వేగం.

**జవురు** రూ. జౌరు. స.క్రి. 1. కొట్టు. పీఠ. వి. 4.107; 2. అధఃకరించు, తిరస్కరించు, మీరు. విజయ. 1.84; 3. తొలగించు, పాయజేయు. రాజవా. 4.49; 4. చెదిరిన పదార్థాల్ని పోగుచేయు; 5. నున్నగింత సలపతో రెండో సారి పాత్రల్ని సాపుచేయు.
హిం.ఉ.పార.అర. జౌర్.
<ఉ. జౌర్.
జవురుకొను రూ. జౌరుకొను. స.క్రి. చేతులతో తీసుకొను. జవురునేల వి. నీళ్ళు ఒడిసే నేల. జవురేసలప రూ. జవిరేసలప. వి. నున్న గింత సలప.

**జవురేసలప** చూ. జవురు.

**జవులవిరేణి** రూ.చూ. జములరివేణి. వి. పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణి కుంతలు.

**జవుళి** రూ.చూ. జౌళి. వి. ఒకానొక రాగం.

**జవ్వ**[1] వి. పడుచుది.
సం. యౌవన-. పడుచుదనం; ప్రా. జవ్వన-.
<ప్రా. జవ్వన-.
జవ్వరాండ్రు వి.బ.వ. యువతులు.

**జవ్వ**[2] వి. 1. గువ్వల వేటలో కట్టుళివ; 2. అసమర్థుడు, మందం.

**జవ్వ**[3] వి. ఏటవాలు గీరల డిజైను.

**జవ్వడుచు** చూ. జవ్వు[2].

**జవ్వనమమ్ముకొను** చూ. జవ్వనము.

**జవ్వనము** వి. పదహారేళ్ళకు పైబడిన వయసు, యవ్వనం. నిర్వ. రా. 2.61.
సం. యౌవన-. పడుచుదనం; ప్రా. జవ్వన-.
క. జవ్వన.
<ప్రా. జవ్వన-.
జవ్వనమమ్ముకొను అ.క్రి. డబ్బుకై వ్యభిచరించు. <జవ్వనము+అమ్ముకొను. జవ్వని వి. యవ్వనంలో ఉన్న స్త్రీ. కు.సం. 8.124.

**జవ్వని** చూ. జవ్వనము.

**జవ్వలు** చూ. జవ్వు[2]. వి.బ.వ. 1. చప్పటినీళ్ళు; 2. చౌకలు.

**జవ్వాజి** రూ.చూ. జవాది. వి. సంకుమదం, ఒకానొక పరిమళ ద్రవ్యం. పల్నా. 17.
జవ్వాజిపిల్లి రూ.చూ. జవాదిపిల్లి. వి. సంకువు, ఒకజాతి పిల్లి. జవ్వాజివంకి రూ.చూ. జవ్వాదివంకి. వి. జవాది తిత్తి. ప్రబంధ. 605. జవ్వాజివంకెలు రూ. జవ్వాదివంకెలు. వి.బ.వ. జవాదిలాగ పరిమళించే ధాన్య విశేషం.

**జవ్వాజిపిట్ట** వి. పక్షివిశేషం. పల్నా. 4.

**జవ్వాడు** చూ. జవ్వు[2].

**జవ్వాది** రూ.చూ. జవాది. వి. సంకుమదం, ఒకజాతి పిల్లి వల్ల కలిగే పరిమళ ద్రవ్య విశేషం. యయా. 1.119.
జవ్వాదికొమ్ము వి. జవ్వాదితో కూడిన(మాదిగవాని) కొవ్వు

పాత్ర. శివరా. 3.64. జవ్వాదిపిల్లి రూ.చూ. జవాదిపిల్లి. వి. జవ్వాజిపిల్లి, సంకుపు. జవ్వాదివంకి రూ. జవ్వాజివంకి. వి. జవాదితిత్తి. రాజ. చ. 3.7. జవ్వాదివంకెలు రూ.చూ. జవ్వాజివంకెలు. వి.బ.వ. జవాదిలాగ పరిమళించే ధాన్య విశేషం.

జవ్వాదు రూ.చూ. జవాది. వి. పరిమళ ద్రవ్యవిశేషం, సంకు మదం.

జవ్వి వి. గుర్రంతోక కున్న వెంట్రుక.

క. జవి, జవె, జమె. గుర్రం తోక కుండే వెంట్రుక.

జవ్విడి విణ. చప్పిడి, చప్పని, ఉప్పులేని.

జవ్వు[1] వి. 1. వికాసం. దశా. 7.1 ; 2. తెలివి ; 3. అందం.

జవ్వు[2] వి. 1. కంపించటంలో అయ్యే అనుకరణం. కవిరా. 5.245 ; 2. కుంగటం మొ. వాటిలో అయ్యే అనుకరణం ; 3. దుర్మదజలం.

జవ్వడుచు అ.క్రి. జవ్వుమని చలించు. < జవ్వు[2] + అడుచు. జవ్వాడు అ.క్రి. 1. ఊగాడు. భాగ. 10 పూ. 289 ; 2. కంపించు, వణుకు, చలించు. శుక. 1.363 ; 3. తొలగు, చెదురు. కృ. శకుం. 2.57. < జవ్వు[2] + ఆడు. జవ్వుజవ్వు వి. వంగటంలో అయ్యే మోత.

జహగీరు రూ.చూ. జాగీరు. వి. ప్రభువు సమ్మానంగా ఇచ్చిన భూమి.

జహనారా వి. గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు.

జహరిపత్తి వి. దేశవాళిపత్తి.

హిం. ఉ. జవాహర్, జవాహిర్. రత్నం.

< ఉ. జవాహిర్ + పత్తి.

జా రూ.చూ. జే. వి. లోకాతీతమైన పనులు చేసేటప్పుడు జయమనే అర్థంలో పలికే మాట.

జాగంట రూ.చూ. జేగంట. వి. పెద్దగంట, గుండ్రని కంచురేకుమీద గట్టిపిడివంటి కట్టె తునకతో వాయించే వాద్యవిశేషం. జాపరమేశ్వరాయను స.క్రి. (లోకాతీతమైన పనులు చేసేటప్పుడు) జయపరమేశ్వరా అని పలుకు. భీమ. 6.58.

జాక్[1] వి. వ్యక్తిని సూచించే శబ్దం.

ఇం. *Jack*[1]. జాక్ అనే పేరుకు బదులుగా వాడుకలో ప్రసిద్ధంగా ఉన్న రూపం, సామాన్య వ్యక్తిని ఈపదం సూచిస్తుంది.

జాక్[2] స.క్రి. యంత్రంతో పైకెత్తు, చేయు మొ. అనుబంధ ధాతువులతోనే ప్రయోగం.

ఇం. *Jack*[2]. యంత్రంతో పైకెత్తు.

< ఇం. Jack[2].

జాకార్చి వి. కిటికీల మీద, గుమ్మాలమీద వేసే అర్ధ చంద్రాకారపు ఆర్చి. < ఇం. Jack[2] + ఆర్చి. జాకార్డు వి. మరమగ్గం మీద డిజైన్లు నెయ్యటానికి అమర్చిన ఒక రకం కొయ్యపనిముట్టు. < ఇం. Jack[2] + Card. జాకార్డుదండె వి. జాకార్డు అడ్డకు తగిలించిన అట్టలు. జాకార్డునేత వి. మగ్గానికి జాకార్డు అమర్చి, అంచుల్లో పువ్వులు పడేట్టునేసే నేత.

జాక్[3] వి. జాతీయతని తెలియ చేస్తూ ఓడ ముందుభాగంలో ఎగరవేసే జండా లేదా ధ్వజం.

ఇం. *Jack*[3]. ఓడ ముందుభాగంలో ఎగరేసే జండా.

< ఇం. Jack[3].

జాక్[4] వి. కాళ్ళంటు ధరించే చేతులు లేని అంగీ.

ఇం. *Jack*[4]. చేతులు లేని అంగీ.

< ఇం. Jack[4].

జాక్[5] వి. పనసపండు.

ఇం. *Jack*. పనసపండు.

< ఇం. Jack.

జాకర వి. (జయకరి) ఒకకొండ (గ్రామ) దేవత.

సం. జయకర-. జయాన్ని కలిగించే ; ప్రా. జఓక్కార-. వందనం.

< సం. జయకర-.

జాకార్చి చూ. జాక్[2].

జాకార్డు చూ. జాక్[2].

జాకార్డుదండె చూ. జాక్[2].

జాకార్డునేత చూ. జాక్[2].

జాకి రూ. జాకీ[2]. వి. పేకముక్కలలో ఒక దానిపేరు.

ఇం. *Jack*[1]. పేకముక్కల్లో ఒకదానిపేరు.

< ఇం. Jack[1].

జాకీ[1] వి. గుర్రప్పందాలలో వృత్తిగా స్వారీ చేసేవాడు.

ఇం. *Jockey*. స్వారీ చేసేవాడు, మోసగించు, యుక్తితో లోబరుచుకొను.

< ఇం. Jockey.

జాకీ[2] రూ.చూ. జాకి. వి. పేకముక్కల్లో ఒకదానిపేరు.

జాకెట్టు వి. స్త్రీలు ధరించే చేతులు ఉన్న ఉడుపు.

ఇం. *Jacket*. చేతులు ఉన్న ఉడుపు.

< ఇం. Jacket.

జాకెట్టుగుడ్డ రూ. జాకేట్టుగుడ్డ. వి. ఆడవాళ్ళరవికెకు సరిపడేగుడ్డ, ఆడవాళ్ళరవికె కోసం నేసినగుడ్డ. < ఇం. Jacket + గుడ్డ. జాకెట్టుముక్క రూ. జాకేటుముక్క. వి. ఒక రవికకు సరిపడే గుడ్డ. ఇం. Jacket + ముక్క.

జాకెట్‌పీసు వి. ఒకరవికెకు సరిపడే నేతగుడ్డ లేక గుడ్డ.

ఇం. *Jacket piece*. రవికెగుడ్డ.

< ఇం. Jacket piece.

జాకేటుముక్క రూ.చూ. జాకెట్టుముక్క. వి. ఒకరవికెకు సరిపడే నేతగుడ్డ.

జాకేట్టుగుడ్డ రూ.చూ. జాకెట్టుగుడ్డ. వి. ఆడవాళ్ళరవికెల కోసం నేసిన బట్ట.

జాగ రూ.చూ. జాగా[1]. వి. 1. చోటు, ప్రదేశం. అడిదము సూరన చాటువు ; 2. గొప్పది. అడిదము రామకవి చాటువు.

జాగరగట్టు రూ. జాగఅగట్టు. అ.క్రి. మేల్కొను, జాగరించు. గౌ. హరి. ద్వితీ. 1941 పం.

సం. జాగర-. నిద్రమేల్కొని ఉండటం.

< సం. జాగర- + కట్టు.

జాగరము[1] వి. జూదమాడటానికి ఉపయోగించే పాచికల మీది ముద్రా విశేషం. సిం. ద్వా. 10.87.

**జాగరము**[2] రూ.చూ. జాగారము. వి. మేలుకొని ఉండడం.

**జాగరు** రూ.చూ. జాగీరు. వి. ప్రభువు సమ్మానంగా ఇచ్చిన భూమి.

**జాగరగట్టు** రూ.చూ. జాగరగట్టు. అ.క్రి. మేల్కొను, జాగరించు.

**జాగా**[1] రూ. జాగ, జోగ, జోగా. వి. 1. చోటు, ప్రదేశం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759. క్రీ.శ. 1585. రంగా. చ. 2.155 ; 2. గ్రామనత్తం. గ్రామస్థులు ఇళ్ళు కట్టుకోటానికి మాత్రమే ప్రభుత్వం వారు శిస్తు రద్దుచేసి వదలిన భూమి ; 3. రాళ్ళ వరసలకు మధ్యన ఉన్న స్థలం.

పం. జాగహ్, జాగా. ప్రదేశం ; మరా. జగా. స్థలం, కార్యాలయం ; ఉ. జాయ్‌గాహ్. చోటు, ప్రదేశం ; పార. జాయ్‌గాహ్. వాసస్థానం, చోటు, జన్మ ప్రదేశం.

<ఉ. జాయ్‌గాహ్.

**జాగా**[2] రూ.చూ. జగా[1]. విశే. గొప్పదైన. చంద్రాంగ. 2.37, ప్రబంధ 125 ప.

**జాగారము** రూ. జాగరము[2]. వి. మేలుకొని ఉండటం.

సం. జాగర-. మేల్కొని ఉండటం ; ప్రా. జాగర- ; పా. జాగ్గ ; కా. ఝూగ్- ; బెం. జాగా- ; ఒ. జాగిబా- ; హిం. జాగ్‌నా ;

క. జాగర. మేల్కొని ఉండటం ; త. జాగరమ్. మేల్కొని ఉండటం.

<ప్రా. జాగర-.

**జాగి** వి. సిందూరం రంగు పూలు పూసే ఒక రకం చెట్టు (Woodfordia floribunda).

**జాగిడు** చూ. జాగు.

**జాగినకత్తెర** రూ.చూ. జాగెనకత్తెర. వి. మల్లయుద్ధ సంబంధమైన పన్నెండు పరువళ్ళలో ఒకటి.

**జాగినపోవు** వి. ఒక మల్లయుద్ధగతి భేదం.

**జాగిరు** రూ.చూ. జాగీరు. వి. ప్రభువు సమ్మానంగా ఇచ్చిన భూమి లేక దేశం. ద. హిం. శా. సంపు. 7. శా. సం. 790. క్రీ.శ. 1774.

**జాగిలపడు** చూ. జాగిలు.

**జాగిలము** వి. 1. వేటకుక్క. హరిశ్చ. 2.4 ; 2. కుక్క. ఆం. భా. 2.290.

క. జాయిల. కుక్క ; తు. జావళ-నాయి. వేటకుక్క.

జాగిలంబులమిత్తి వి. 1. పంది. వేంక. ఆం. 93 ; 2. అడవిపంది.

**జాగిలంబులమిత్తి** చూ. జాగిలము.

**జాగిలి** చూ. జాగిలు.

**జాగిలు** చూ. సాగు. అ.క్రి. 1. జాగు చేయు. ఆం. భా. 3.127 ; 2. ఎరగు, మొక్కు.

క. జాగిసు. సాష్టాంగపడు.

జాగిలపడు స.క్రి. సాగిలి మొక్కు. జాగిలి స.క్రి. మొక్కు, జోహారు, నమస్కారం. <జాగిలు+-ఇ.

**జాగీరు** రూ. జహగీరు, జాగరు, జాగిరు, జాహగీరు. వి. 1. నవాబులు యోధుల కిచ్చిన మాన్యం, చేసిన సహాయానికి ప్రభుత్వ మిచ్చిన గ్రామాలు, భూములు, పన్ను విధింపబడని గ్రామదానం. E.I. 16, 26. క్రీ.శ. 1686 నం. ; 2. ప్రభువు సన్మానంగా ఇచ్చిన భూమి లేక దేశం. రంగా. చ. 3.276.

హిం. జాగీర్. సర్కారు వారిచే ఇవ్వబడిన తాలుకా ; పం. జాగీర్ ; ఉ. జాగీర్. ప్రభుత్వం వారిచే సన్మానపూర్వకంగా ఇవ్వబడిన జమిందారీ; పా. జాగీర్. ప్రభుత్వం వారిచే ఇవ్వబడిన భూఖండం.

క. జహగీరు, జాగీర్. పన్నులుగాని భూములుగాని ప్రభుత్వం ఇవ్వటం ; త. జాగీర్.

<ఉ. జాగీర్.

**జాగీరుదారు** రూ. జాగీర్దారు, జాహీరుదారు. వి. జాగీరు కలవాడు, సర్కారు వారిచే ఇవ్వబడిన భూమికి యజమానుడు.

హిం.ఉ.పార. జాగీర్‌దార. జాగీరుకు యజమాని.

క. జహగీరుదార, జాగీరుదార. జాగీరుకు యజమాని.

<ఉ. జాగీర్‌దార్.

**జాగీర్దారు** రూ.చూ. జాగీరుదారు. వి. నవాబుల నుంచి కొంత భూమిని పొందినవాడు.

**జాగు** చూ. చాగు. వి. తడవు, జాలం, ఆలస్యం. వసు. 4.54 జంపు.

జాగిడు అ.క్రి. ఆలస్యం చేయు. ఆం.భా. 3.87. జాగుచేయు రూ. జాగుసేయు. అ.క్రి. ఆలస్యం చేయు. జాగుపడు అ.క్రి. జరుగు, గడచు, మెలగు, సాగు. విజయ. 1.43. జాగుపెట్టు అ.క్రి. ఆలస్యం చేయు. కాశీ. 2.88. జాగుసేయు రూ.చూ. జాగుచేయు. అ.క్రి. జంపు నడుపు, ఆలసించు.

**జాగెనకత్తెర** రూ. జాగినకత్తెర. వి. పన్నెండు పరువళ్ళలో ఒకటి, ఒక మల్ల బంధం. ప్రబంధ. 78.

**జాగ్రఫీ** వి. భూగోళ శాస్త్రం.

ఇం. *Geography*. భూగోళశాస్త్రం.

<ఇం. Geography.

**జాంగిన్నె** వి. సీరింకిన వాగుల్లో సాగుచేసి పండించే తీగపైరు.

**జాంగీర్** వి. 1. ఒకరకం మామిడి. తెలుగుదేశంలో విరివిగా తోటల్లో పెంచే పండ్ల చెట్టు ; 2. తినే తీపి పదార్థం.

హిం.ఉ. జహాంగీర్. ప్రపంచాన్ని జయించినవాడు.

<ఉ. జహాంగీర్ (అర్థవిపరి.).

**జాజపాట** వి. జానపదగీతం.

**జాజము** రూ. జాజాము. వి. 1. పాలికలలో పోసిన నవధాన్యాల నారు ; 2. రంగద్దిన దుప్పటి.

హిం. జాజమ్ ; మరా. జాజమ్, జాఝుమ్. బొమ్మలు లేక రంగులు వేసిన కిందపరచుకొనే గుడ్డ ; ఉ. జాజిమ్. కప్పిన గుడ్డ ; పార. జాజిమ్.

క. జాజమ, జాజీమ. కిందపరచుకొనే గుడ్డ.

<ఉ. జాజిమ్.

**జాజర**[1] రూ.చూ. జజ్జర. వి. వంచన, కపటం, మోసం. లక్ష్మీవి. 4.49. విశ. చినిగిన.

**జాజరకత్తియ** రూ. జజ్జరకత్తె. వి. వంచకురాలు, మోసగత్తె. **జాజరకత్తె** రూ.చూ. జజ్జరకత్తె. వి. వంచకురాలు, కపటి. **జాజరకాఁడు** రూ. జజ్జరకాఁడు. వి. 1. దొంగ. పి.శకు. 3.215 ; 2. మోసగాడు.

**జాజర**[2] రూ.చూ. జాదుర. వి. పాటలో ఊతపదం.

**జాజరపాట** వి. జానపదగీతం.

**జాజాము** రూ.చూ. జాజము. వి. పాలికలలో పోసిన నవధాన్యాల నారు.

**జాజాలపాలిక** వి. 1. అంకురార్పణ శరావం. అని. 3.76 ; 2. వివాహకాలంలో నవధాన్యాలు పోసే మూకుడు. **జాజాలపాలియ** రూ.చూ. జాజాలపాలె. వి. నవధాన్యాలు పోసిన మూకుడు. **జాజాలపాలె** రూ. జాజాలపాలియ. వి. 1. అంకురార్పణ శరావం. శివరా. 2.56 ; 2. నవధాన్యాలు పోసిన మూకుడు. **జాజాలు** వి.బ.వ. శుభకార్యాల్లో అంకురోత్పత్తికి పాలికలలో పోసిన నవధాన్యాలు. కవిక. 4.83. <జాజాము + లు.

**జాజాలపాలిక** చూ. జాజాము.

**జాజాలపాలియ** చూ. జాజాము.

**జాజాలపాలె** చూ. జాజాము.

**జాజాలు** చూ. జాజాము.

**జాజి**[1] రూ.చూ. జాది. వి. సువాసన కలిగిన తెల్లని పూలు పూసే ఒక తీగ. భార.అను. 4.6 (Jasminum graudiflorum).

**జాజిపువ్వంచు** రూ. జాజిపూఅంచు, జాజిపూవంచు. వి. జాజిపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. **జాజిపువ్వు** రూ. జాదిపువ్వు. వి. జాతి పుష్పం. రం.రా.బాల. 13 పు. 12 పం. **జాజిపువ్వుబొగిడి** వి. జాజిపువ్వు మొగ్గవడేట్టు నేసిన డిజైను. **జాజిపూఅంచు** రూ.చూ. జాజిపువ్వంచు. వి. జాజిపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. **జాజిపూవంచు** రూ.చూ. జాజిపువ్వంచు. వి. జాజిపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. **జాజిరాజనములు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **జాజులుప్రసాదమగు** రూ.చూ. జాదులు ప్రసాదమునగు. అ.క్రి. అత్యంతానుకూలమగు, అత్యభిలషణీయమగు.

**జాజి**[2] వి. ఇటికచ్చులు తయారు చెయ్యడానికి పనికి వచ్చే తేలిక కొయ్య కలిగి, తాంబూలంలో ఉపయోగించే కాయలుకాసే చెట్టు (Mystica fragrans).

**జాజిఆకు** వి. జాజిచెట్టు ఆకు, రంగుల అద్దకంలో వాడే ఆకు. **జాజికాయ** వి. జాజిచెట్టు నుండి సువాసన ద్రవ్యంగా వాడబడే గట్టి పెంకుగల కాయ. ద.హిం.శా.సంపు. 7. శా. సం. 734. క్రీ.శ. 1228 సం. ప్రబంధ. 640 **జాజికుసుమలు** వి.బ.వ. ఒక దినుసు వడ్లు, ఒకరకం ధాన్యం. **జాజిపత్తిరి** రూ.చూ. జాపత్రి. వి. జాతిపత్రిక, జాపత్రి, వంటకాల్లో వాడే సుగంధ ద్రవ్యం. **జాజిపత్రి** రూ.చూ. జాపత్రి. వి. జాతి పత్రిక, జాపత్రి. **జాజొక్క** వి. మెత్తగా ఉడికించి ఎండించి, నోటవేసికొంటే కరిగిపోయేటట్లు చేసిన పోక. <జాజి + వక్క.

**జాజు** రూ.చూ. జాదు[1]. విశ. ఎర్రని. ఘటికా. 2.66. వి. 1. రక్తవర్ణం, ఎరుపురంగు, కావిరంగు. యయా. 5.47 ; 2. గైరికాది ధాతువు, కూజాలు, ఎర్రకుండలు, పూలతొట్లు మొ. నవి కాల్చడానికి ముందు పూసే రంగు. ఆం.భా. 2.32.

**జాజుచేయు** రూ. జాజుసేయు. స.క్రి. 1. ఎర్రబడేటట్లు చేయు. రాధా. 5.254 ; 2. నీళ్ళుచల్లి సున్నపరచు. **జాజుతెవులు** వి పైరులకు పేనుపట్టే తెగులు. **జాజుపూతలు** వి.బ.వ. ఇంటికి సున్నం వేయటానికి ముందు పేడతో అలికి సున్నం వేసి కింద, నేల మట్టానికి జానెడు ఎత్తున జాజుతో పూసే పూతలు. **జాజుపెట్టు** స.క్రి. ఇంటిగడప మొదలైన వాటికి ఎర్రముగ్గులు పెట్టు. **జాజుమట్టి** వి. ఎరుపురంగు రాయి. **జాజువాఱు(-పాఱు)** అ.క్రి. ఎర్రబడు. మను. 2.27. **జాజుసేయు** రూ. చూ. జాజుచేయు. స.క్రి. ఎరుపురంగు వేయు. భాను. 4.47.

**జాజుర**[1] రూ.చూ. జజ్జర. వి. 1. మోసం ; 2. జూటు.

**జాజుర**[2] రూ.చూ. జాదుర. వి. పాటలో ఊతపదం.

**జాజురపాటలు** వి.బ.వ. జానపద గీతవిశేషాలు. బహులా. 2.13.

**జాజులుప్రసాదమగు** చూ. జాజి[1].

**జాజొక్క** చూ. జాజి[2].

**జాటల** వి. స్నానాల గది.

**జాటి** రూ. జాటియ, జాటె. వి. పశువుల్ని కొట్టే చేరుకోల, కొరడా. జైమిని భా. 4.77.

సం. యష్టి-, కర్ర, స్తంభం ; యష్టికా. ఊతకర్ర ; ప్రా. జట్ఠి-. కర్ర ; కుమా. జాఁఠా, జాఁఠీ, జాఁఠో. కర్ర ; బెం. జాఇట్(ఠ్). గానుగలోని నిడుపాటి దూలం; ఒ. జాఠి. ఆయుధంగా ఉపయోగపడే కడ్డీ ; బీ. జాఠ్. గానుగలోని నిడుపాటి దూలం : హిం. జాఠ్. చెరుకు గానుగలోని దూలం, చెరువులోని స్తంభం ; మరా. జాటీ(ఠీ). గానుగలోని నిడుపాటి దూలం.

క. చాటి. కొరడా ; త. చాట్టి, చాట్టై. కొరడాతాడు ; మ. చాట్టు. కొరడాదారం ; కో. జాట్. తాడు చివర నేయడానికి వాడే తీగలాంటి సాధనం.

<ప్రా. జట్ఠి-.

**జాటియ** రూ. చూ. జాటి. వి. పశువుల్ని కొట్టే చేరుకోల, కొరడా.

**జాటీ** వి. బొంగరపు తాడు, జాలీ.

**జాటు**[1] వి. పెంద్రుక.

మరా. ఝూట్, ఝూఁట్. మర్మావయవాల దగ్గరి వెంట్రుకలు (తిరస్కార సూచక శబ్దం).

<మరా. ఝూట్.

**జాటు**[2] వి. చిన్న నంచి.

**జాటె** రూ.చూ. జాటి. వి. పశువుల్ని కొట్టే చేరుకోల, కొరడా.

**జాడ** వి. 1. దారి, మార్గం, తోవ. రం.రా. కిష్కిం. ; 2. చోటు, ప్రదేశం. భాగ. 3.731 ; 3. దిక్కు, వైపు. హర.

7.51 ; 4. గతి, ఉపాయం. భాగ. 8.454 ; 5. అడుగుల గుర్తు, గుర్తు. భాగ. 10 పూ. 504. ఆము. 4.58 ; 6. వలె, రీతి, విధం, ప్రకారం, చొప్పు. భాగ. 6.236, వరాహ. 5.93 ; 7. కష్టం, పాటు. విష్ణు పు. 6.97 ; 8. ప్రవర్తన, నడవడి. పఱ. 1.228 ; 9. వార్త, వృత్తాంతం; 10. సైగ ; 11. పన్నెండంతలకు బిగించిన పుల్ల ; 12. ఆములో పెంకులు పేర్చే తీరు ; 13. ఆచూకీ. విశ. యుక్తమైన, యోగ్యమైన. కాశీ. 2.75.

క. జాడు, జాడె. అడుగుజాడ లేదా బండిచక్రం గుర్తు, జాడ, గుర్తు ; త. చాడై. ఆకారం, ముఖవైఖరి, పోలిక, ఉద్దేశం, స్వభావం ; మ. చాట. అస్పష్టమైన జాడ . కో. జార్. సైగ, చేతులతో కళ్ళతో సైగ చేయటం.

జాడకాఁడు వి. 1. తోవగు ర్తెరిగినవాడు. ఆం.భా. 2.189; 2. గుర్తులు తెలిసినవాడు. ఆం.భా. 2.286. జాడతీయు స.క్రి. కూపీలాగు, ఆచూకీతీయు. జాడపడు రూ. జాడ పడు. అ.క్రి. 1. విరళమగు, తరచు లేనిదగు. భాగ. 6.260 ; 2. పన్నెండంతెలకు బిగించిన ఈనెలమధ్య వెలితి పడు. జాడలుపడు రూ.చూ. జాడలువడు. అ.క్రి. విరళ మగు, తరచు లేనిదగు. జాడలువడు(-పడు) రూ. జాడలు పడు. అ.క్రి. విరళమగు, తరచులేనిదగు. హరి.పూ. 6.5. జాడవడు(-పడు) రూ.చూ. జాడపడు. అ.క్రి. విరళమగు, తరచులేనిదగు.

జాడా విశ. పూర్తిఅయిన, ముగిసిన, సమూలం.

సం. ఝూటన-; ప్రా. ఝూడావణ-. పూర్తిచేయటం, శుభ్రం చేయించటం ; హిం. ఝూరా ; మరా. ఝూడా. ఖాతాలను సరిచేయటం.

జాడాచేయు రూ. జాడాసేయు. స.క్రి. 1. పూర్తిచేయు, ముగించు ; 2. నాశనంచేయు, చంపు : 3. చెరచు. జాడా యైపోవు అ.క్రి. పూర్తగు, ముగియు. జాడాసేయు(-చేయు) రూ.చూ. జాడాచేయు. స.క్రి. 1. ముగించు ; 2. చెరచు ; 3. చంపు.

జాడాకు చూ. జాడు.

జాడి రూ.చూ. ఝూరీ. వి. ఊరగాయలు మొ. నిలవఉంచుకొనే ఒకరకం మట్టిపాత్ర, పింగాణీపాత్ర, కుప్పె.

జాడించితన్ను చూ. జాడించు.

జాడించిపలుకు చూ. జాడించు.

జాడించు రూ. జాళించు, ఝూడించు. స.క్రి. 1. విదుల్చు, దులుపు. భాస్క.రా. అరణ్య. 2.118 ; 2. ఆడించు. హరిశ్చ. 2.49 ; 3. కొట్టు. చంద్రాంగ. 3.65 ; 4. పోగొట్టుకొను. ప్రభు. 3.73 పు. 17 పం.; 5. చీవాట్లు పెట్టు ; 6. గుడ్డలు ఉతుకు ; 7. కోపించు ; 8. తిట్టు.

సం. ఝూటన-; ప్రా. ఝూతణ-. ఊడ్చటం, తుడవటం.

క. జాడిసు. తోయు ; త. చాడు ; మ. చాటుక, చాడు.

< ప్రా. ఝాదణ-.

జాడించితన్ను స.క్రి. కాలుతో తీసి తన్ను. జాడించిపలుకు స.క్రి. చీవాట్లు పెట్టు. ప్రభు. 3.86 పు. 8 పం. జాడింపు వి. జాడించటం.

జాడింపు చూ. జాడించు.

జాడియ రూ.చూ. ఝూరీ. వి. 1. జలపాత్ర. యయా. 1.27 ; 2. కమండలువు. అచ్చ.రా.యు. 412 ; 3. కూరగాయలు మొ. వాటిని నిలవ ఉంచుకోడానికి ఉపయోగించే ఒకవిధ మైన మట్టిపాత్ర.

జాడీ రూ.చూ. ఝూరీ. వి. 1. ఊరగాయలు మొ. నిలవ ఉంచటానికి ఉపయోగించే ఒకరకం మట్టిపాత్ర. అష్టమ. క. 1.45 పు. 20 పం. కుప్పె ; 2. ధాన్యం నిలువచేసు కొనే పెద్ద బాన, ధాన్యం నిలువకు కోడిగుడ్డు ఆకారంలో ఉండే పెద్ద మట్టిపాత్ర.

జాడీలు వి.బ.వ. ముక్కలు, పెంకణాలు.

జాడు వి. 1. క్షీణసస్యం, ఏపుగా పెరిగిన జొన్న, వరి మొ. సస్యం, కంకివెయ్యని జొన్న మొ. వాటి దంటు. పి.శకు. 1.45 ; 2. ఇల్లు.

జాడాకు వి. కంకి వెయ్యని జొన్న మొ. వాటి దంటు, ఒకరకం పశువుల మేత. < జాడు + ఆకు. జాడుచొప్ప వి. సన్నని చొప్ప. జాడుబేడ వి. క్షీణసస్యపు కుప్ప వంటి వారు, నిరర్థకులు. పి.శకు. 1.45.

జాణ[1] వి. 1. నేర్పరి. భార. శాంతి. 6.301; 2. సమర్థుడు. హర. పీఠి. 25 ; 3. విటుడు. ఆము. 2.21 ; 4. రసి కుడు, రసజ్ఞుడు. నీలా. 2.31.

సం. జ్ఞాన-. తెలియడం, అర్థం చేసుకోవటం, విజ్ఞానం ; ప్రా. జాణ-. బోధ, జ్ఞానం ; పో.చూ.సం. చణ-. నిపుణుడు ;

క. జాణ, జాణె ; తు. జాణి, జాణె, శాణె.

< ప్రా. జాణ-.

జాణఁడు వి. 1. రసికుడు. ఉ. హరి. 5.75 ; 2. చతు రుడు. శృం.నై. 8.71. జాణతనము వి. 1. నేర్పు, చాతు ర్యం. విక్ర. 3.111 ; 2. ప్రౌఢత్వం. ఉ.రా. 1.72. వి.బ.వ. చతురోక్తులు. హంస. 4.48. జాణెత వి. 1. వ్యతిరేక లక్షణచే పనికిమాలిన స్త్రీ అనికూడా అర్థం. ఉ. హరి. 5.197 ; 2. ప్రౌఢురాలు.

జాణ[2] వి. ఒకజాతి చెట్టు (Grewia asiatica).

క. జాని-గిద. జానచెట్టు, జాణ ; తు. తడ-జాణ, కతి-జాణ.

జాణఁగి చూ. జాణ[1]. వి. ఒకజాతి కుక్క.

జాణెత చూ. జాణ[1].

జాంద్ర రూ. జేంద్ర, దేంద్ర. వి. చేనేతవల్ల జీవించే ఒకజాతి, దేవాంగజాతి. తిరుచానూరు తాళ్ళపాక తిరువెంగళనాథుని శాసనం. క్రీ.శ. 1541 సం.

క. జాడ, జేడ. లింగధారులైన చేనేత పనివారు ; తు. జాడె, జాడ్యె. నేతపనివాడు ; త. చేంటిరవర్. చేనేత పనివారు.

జాత వి. వస్త్రమకుట భేదం, చవుతు.

జాతర రూ.చూ. జాత్ర. వి. 1. దేవతాతీర్థం, పర్వతం, సముద్రం మొదలైన వాటికై చేసే ప్రయాణం. భార.మౌ. 24 ; 2. దైవతయాత్ర, గ్రామదేవతలకు చేసే ఉత్సవం.

నెల్లూరి శాసనాలు. 23. క్రీ.శ. 1432 సం. ; 3. శక్తి మొదలైన వాటికి చేసే ఉత్సవ విశేషం. భీమ. 3.35 ; 4. అల్లరి.

జాతరగాఁడు(-కాఁడు) వి. జాతర చేసేవాడు, శక్త్యుత్సవాలు చేసేవాడు. వేణు. శ. 88. జాతరచేయు రూ.చూ. జాతరసేయు. అ.క్రి. 1. గోలచేయు ; 2. బాధ కలిగించు. జాతరసేయు (-చేయు) రూ. జాతరచేయు. అ.క్రి. 1. గోలచేయు ; 2. బాధ కలిగించు.

జాతార్చి వి. ముక్కోణమార్చి, త్రిభుజాకారంలో ఉండే అర్చి.

జాతి విణ. 1. ఉత్తమమైన, శ్రేష్ఠమైన. పరమ. ఐ. 4.273 పు. ; 2. సొగసైన, ఒప్పైన. పరమ. ఐ. 5.380 పు.

సం. జాతి-. పుట్టుక, వంశం, వర్ణం.

<సం. జాతి- (అర్థవిపరి.).

జాతికాస్త వి. సొంత సేద్యం, తనభూమిని తాను సాగు చేసుకోవటం, కులవృత్తి ఉత్తమమైంది అని శాస్త్రం. జాతిగా క్రి.విణ.దృ. అందంగా. హర. 5.41. < జాతి + అగు + -అ[7]. జాతిచట్రంతలుపు వి. సాదారెక్కమీద చట్రం బద్దల బిగింపుగల తలుపు. జాతిదేగ వి. ఒకజాతి డేగ. జాతితప్పుడు వాడు విణ. 1. మాటనిలకడ లేనివాడు ; 2. కుల కట్టుబాటులకే తప్పినవాడు. జాతినాగు వి. మంచి జాతిసర్పం. పండి.చ. 1.202 పు. జాతిబట్టీ వి. నేలబట్టీ ఆము, నేల బట్టీ. జాతివార్తలు వి.బ.వ. జాతీయాలు. శుక. 2.14. సం. జాతి-. వంశం, తెగ ; వార్తా. సమాచారం. < సం. జాతి వార్తా + -లు (అర్థవిపరి.).

జాతిపత్తిరి రూ.చూ. జాపత్రి. వి. జాజిపత్రి, వంటకాల్లోవాడే సువాసన ద్రవ్యం.

జాతిపత్రి రూ.చూ. జాపత్రి. వి. వంటకాల్లో వాడే సువాసన ద్రవ్యం.

జాతీ విణ. సొంతమైన.

సం. జాతి-. కులం, వంశం.

<సం. జాతి- (అర్థవిపరి.).

జాతీజిరాయి వి. సొంతసేద్యం, తనభూమిని తాను సాగుచేసుకోటం.

జాత్ర రూ. జాతర. వి. 1. గ్రామ దేవతలకు చేసే ఉత్సవం. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934. పండి. చ. 5.413 ; 2. ప్రయాణం. ద్వి. భాగ. 2.31 పు.

సం. యాత్రా. ప్రయాణం ; ప్రా. జత్తా, జాయా. ప్రయాణం ; పా. యాత్రా ; అప. జత్త, జత్థ ;

'క. జాత్రె ; తు. జాత్రె ; త. ఇయాత్తిరై ; మ. చాత్తిర ; గోం. జత్ర ; కుర. జాత్రా.

<సం. యాత్రా.

జాదర వి. 1. గంధపొడి, బుక్కా ; 2. 'జాదర, జాదర' అనే పల్లవి గల పాట.

జాదరలాడు అ.క్రి. బుక్కాలు చల్లుకొను, వసంతాలాడు. < జాదర + -లు + ఆడు. జాదరాడు అ.క్రి. గంధపొడి చల్లుతూ క్రీడించు. ద్వి. పరమ. ఐ. 4.316. < జాదర + ఆడు.

జాదరలు వి.బ.వ. పెళ్ళిళ్ళలో తొలుత కులపాలికా పూజ చేసి మూకుళ్ళలో పోసే మొలకలు. కు.సం. 8.112.

జాదరాడు చూ. జాదర.

జాదారి వి. జాజాల పాలిక, నవధాన్యాలు పోసిన మూకుడు.

జాది రూ. జాజి[1]. వి. జాజితీగ, జాజిపువ్వు. కు.సం. 4.83, పి.శకు. 1.107 (Tasminum graudiflorum).

సం. జాతి-. జాజిపువ్వు, జాజితీగ ; ప్రా. జాఇ- ; శౌ. జాది ; పా. జాతి ;

క. జాజి, జాది ; తు. జాజి.

<సం. జాతి-.

జాదిపువ్వు రూ.చూ. జాజిపువ్వు. వి. జాతిపుష్పం. జాదులు ప్రసాదమునగు రూ. జాజులు ప్రసాదమగు. అ.క్రి. తనకు సహజంగానే యిష్టమైనది దైవ ప్రసాదంకూడా అగు. పారి. 2.75, కళా. 7.95. జాదులుమంగలమునవేఁచు స.క్రి. సుకుమార పదార్థాన్ని కఠిన కార్యానికి ఉపయోగించు. జాదులువేఁచు స.క్రి. 1. అననురూప కార్యాని కగ్గం చేయు ; 2. సుకుమారమైన వాణ్ణి కఠినంగా శిక్షించు ; 3. మృదువైన వస్తువుల్ని కఠిన కార్యానికి నియోగించు.

జాదిలి వి. బుడబుక్కలవాడు.

జాదు[1] రూ. జాజు. వి. 1. కావిరంగు, జేగురు. మను. 2.27 ; 2. గైరికాదిధాతువు. ఆం.భా. 2.32.

సం. ధాతు-. బంగారం మొ. సప్త ధాతువులు, గైరికాది పదార్థాలు మొ. ; ప్రా. ధాఉ- ;

క. జాదు, ఎరుపు.

<సం. ధాతు-.

జాదు[2] వి. పుట్టటం, కలగటం.

సం. జాత. ; ప్రా. జాయ. కులం ; జాయ-. ఉత్పన్నం ; శౌ. జాద-. ఉదయించిన.

<శౌ. జాద-.

జాదుకొను అ.క్రి. 1. ఉద్భవించు, కలుగు. భార.అను. 4.380 ; 2. సాంద్రమగు, దట్టమగు. శృం.నై. 3.48 ; 3. పరవశమగు, భావాతిరేకంచే ఉద్రిక్తమగు. శృం.నై. 5.9.

జాదు[3] రూ.చూ. జాదము. వి. కల్ల.

జాదుర రూ. జాజర[2], జాజుర[2]. వి. 'జాదుర, జాదుర' అనే పల్లవితో ఒకవిధమైన గీతంలో ఉపయోగింపబడే పదం. భీమ. 5.102.

జాదురజాదురము చూ. జాదుర. వి. మిక్కిలి చాతుర్యం, నేర్పు.

జాదులుప్రసాదమునగు చూ. జాది.

జాదులుమంగలమునవేఁచు చూ. జాది.

జాదులువేఁచు చూ. జాది.

జాదువ వి. జాజర పాటలో ఊతపదం.

జాన[1] రూ. జేన[2]. వి. ఫలవృక్ష విశేషం, నల్లగా గుండ్రంగా ఉండే పళ్ళుగల చెట్టు. కాశీ. 3.69.

జాన[2] రూ.చూ. జేన[1]. వి. తొమ్మిది అంగుళాల పరిమాణం.

జానెడు రూ.చూ. జేనడు. విణ. తొమ్మిదంగుళాల పరిమాణంకల.

జానకాఁడు చూ. జాణ[1]. వి. జాణ, నేర్పరి.

**జానకి** వి. కర్ణాటకపు తుపాకుల చెవిలో నిప్పు పుట్టించే తాడు.

ఉ.పార. జనక్. బాణాగ్రం.

< ఉ. జనక్.

**జానకిత్రాడు** రూ. జానతాడు, జేనగిజాడు. వి. **1**. కర్ణాటకపు తుపాకి చెవిలో నిప్పు ముట్టించే తాడు. కువ.చ. 2.527 ; **2.** బాణసంచా కాల్చటానికి ఉపయోగించే నిప్పు తాడు.

**జానకిరాములు** వి.బ.వ. ధాన్య విశేషం, గింజలు జంటలు జంటలుగా కంకిలో ఉండే రకం.

సం. జానకిరామ-. సీతారాములు.

< సం. జానకీరామ-.

**జానగు** చూ. జాను[1].

**జానతాడు** రూ.చూ. జానకిత్రాడు. వి. మందు పేల్చడానికి అంటించే పొడుగాటి పత్తితాడు.

**జానము** రూ. జీనము, జీను[2]. వి. **1**. గుర్రపు పల్లం కింద వేసే ఆస్తరణ విశేషం, జీను. రం.రా.యు., ఉ.రా. 7.397, ఉ.హరిశ్చ. 4.20 ; **2**. మెత్త, పడక.

త. చేణమ్. మెత్త, పడక, జీను.

**జానలు** చూ. జాను[1].

**జానల్గాగు** అ.క్రి. జిగురుగాఉండు.

**జానసరాలు** వి.బ.వ. ధాన్య విశేషం, ఒకరకం వడ్లు.

**జానిమాజ్** వి. మసీదుల్లో నమాజు చేసేటప్పుడు కింద పరుచుకోటానికి నేసిన జంపఖానా.

ఉ.పార.అర. జానమాజ్. నమాజు చేసేటప్పుడు పరిచే వస్త్రం.

< ఉ. జానమాజ్.

**జాను**[1] రూ. జానువు. విణ. **1**. స్పష్టమైన. కు.సం. 1.35, భార.అను. 1.155 ; **2**. సుందరమైన, అందమైన. భాస్క. రా.యు. 468 ; **3**. అధికమైన. అప్ప. 4.314 ; **4**. మంజులమైన, మనోహరమైన. ఆం.భా. 3.14. వి. **1**. శోభ. కు.సం. 2.150 ; **2.** విధం. పండి.చ. 2.1 పు. ; **3**. సొగసు, సౌందర్యం, అందం. సీలా. 2.13.

సం. జ్ఞాన-. జ్ఞానం ; ప్రా. ణాణ-, జాణ- ; పా. ఞాణ-. ఎరుగు, తెలియు ; కా. జాన్ ; నే.బెం.హిం. జాన్ ; పం. జాణ్ ; మరా. జాణ్. గౌరవస్వీకారం.

< ప్రా. జాణ-.

జానగు అ.క్రి. అందమగు, ఒప్పగు. అచ్చ.రా.బాల. 6. **జానలు** అ.క్రి. **1**. విచక్షణాజ్ఞానం కోల్పోవు. కు.సం. 2.15 ; **2.** అందం కోల్పోవు. < జాను[1] + -అలు. జానుగ[1] రూ. జానుగా. క్రి.విణ.ప్ర. తగునట్లుగా, ఒప్పునట్లుగా. భాస్క.రా.బాల. 16. జానుగా రూ.చూ. జానుగ. క్రి.విణ. ప్రదు. తెన్నుగా, తేటగా, ఒప్పుగా. < జాను + అగు + -అ[7]. జానుతెనుఁగు రూ.చూ. జానుఁదెనుఁగు. వి. తేటతెనుగు, మంచితెనుగు. జానుఁదెనుఁగు రూ. జానుతెనుఁగు. వి. తేటతెనుగు, స్పష్టంగా తెలిసే తెనుగు. కు.నం. 1.35. **జానుపడు** రూ.చూ. జానువడు. అ.క్రి. స్పష్టమగు. జానువడు(-పడు) రూ. జానుపడు. అ.క్రి. స్పష్టపడు, తెల్లమగు. భార.అరణ్య. 2.214. జానువాలు (-పాలు) అ.క్రి. స్పష్టపడు, తెల్లమగు. వేమన. 2.408. జానొందు అ.క్రి. అందగించు, శోభిలు.

**జాను**[2] వి. గుబురుగా పెరిగే చెట్టు.

**జానుగ**[2] రూ.చూ. జానుగు. వి. చెవి, ఉలివులాగ.

**జానుగు** రూ. జానుగ.[2] వి. కర్ణం, చెవి. ఆం.నా.సం.మాన. 18.

**జానువాసము** వి. పెళ్ళికి ముందటి వరపూజ.

**జానువు** రూ.చూ. జాను[1]. వి. అందం, సొగసు.

**జానె** రూ.చూ. జేన[1]. వి. తొమ్మిది అంగుళాల పరిమాణం, మూరలో సగం.

**జానొందు** చూ. జాను[1].

**జాంతానాం** వి. సరసం.

**జాప** వి. ఒకరకం టోపి.

**జాపత్తిరి** రూ.చూ. జాపత్రి. వి. జాజిచెట్టు ఆకు.

**జాపత్రి** రూ. జాజిపత్తిరి, జాజిపత్రి, జాతిపత్తిరి, జాతిపత్రి, జాపత్తిరి. వి. జాతిపత్రం, జాజిచెట్టుఆకు, వంటకాల్లోవాడే సుగంధద్రవ్యం. ఆం.భా. 2.161.

సం. జాతిపత్రీ-, జాజిఆకు ; ప్రా. జాయపత్తీ- ; నే. జాఇపత్రీ ; అ. జాఁఇపత్రీ ; గు. జాయపత్రీ ; హిం. జావత్రీ, జావిత్రి ; మరా. జాయపత్రీ.

< సం. జాతిపత్రీ.

**జాపరా** రూ.చూ. జాఫరా. వి. కుంకుంపువ్వు.

**జాపిడి** రూ.చూ. జాపిని. వి. బొడ్డుమూకుడు, పాలకుండల మీద పెట్టే మట్టిమూత.

**జాపితా** రూ. జాబితా. వి. పేర్లపట్టి, పట్టి. H.A.S. 19.39, క్రీ.శ. 1320 సం.

హిం. జాబితా. వ్యవహారం, విధి, పద్ధతి ; ఉ. జాబితా. నియమం, ప్రణాళిక, పద్ధతి ; పార. జాబితాహ్. నియమం, పద్ధతి, చట్టం ; అర. జాబ్తా. నియమం.

< ఉ. జాబితా.

జాపితాసేయు(-చేయు) స.క్రి. తప్పు సవరించు.

**జాపిని** రూ. జాపిడి, జాపినీ, జాపెన, జాబినీ, జాంపినీ. వి. బొడ్డుమూకుడు, పాలకుండల మీదపెట్టే మట్టిమూత.

**జాపినీ** రూ.చూ. జాపిని. వి. బొడ్డుమూకుడు, పాలకుండల మీద పెట్టే మట్టిమూత.

**జాపిరము** రూ. జాపిలము. వి. జాప్యం, జాగు, ఆలస్యం. భాగ. 10 పూ. 468.

**జాపిరి** వి. రకరకాల డిజైన్లలో అల్లి అంచానికి పెట్టే తడిక.

హిం. ఉ. జాఫ్రాన్. కుంకంపువ్వు.

**జాపిలము** రూ.చూ. జాపిరము. వి. చాదివేత, జాప్యం.

**జాపీకమ్మి** వి. కత్తెర పక్కల వాలుగా ఉన్నకమ్మి.

**జాపు**[1] రూ. జాబు[2]. వి. కోళ్ళగూడు, కోళ్ళను దాచే మట్టి కట్టడం.

మరా. ఝాప (-ణోఁ). ఆచ్ఛాదించు, కప్పివేయు, మూతపెట్టు.

< మరా. ఝాప-.

**జాపు**[2] వి. ఎగుడు దిగుళ్ళు లేకుండటం.

**జాపెన** రూ.చూ. జాపిని. వి. బొడ్డు మూకుడు, పాలకుండల

మీద పెట్టే మట్టి మూత.

**జాప్తా** వి. ఎదురు, అభిముఖం.

**జాప్యము** వి. జాపిరం, జాగు, ఆలస్యం.
సం. యాప్య-. వెళ్ళదగిన.
క. జాప్య. సోమరి.
< సం. యాప్య - (అర్థవిపరి.).
**జాప్యముచేయు** అ.క్రి. జాగుచేయు, జంపునడపు.

**జాఫరా** రూ. జాఫరా, జాఫ్రాన్, జాబరా, జాబుర, జాబురా, జాబూ. వి. **1.** కుంకంపువ్వు. మృత్యు. 3.58 ; **2.** ఎరుపురంగు, కావి, **తోప.**
హిం. ఉ. జాఫరాన్. కుంకంపువ్వు ; అర. జఅఫరాన్. కుంకంపువ్వు.
< ఉ. జాఫరాన్.

**జాఫ్రాన్** రూ.చూ. జాఫరా. వి. **1.** ఎరుపుతో తెలుపు వన్నె ; **2.** కుంకంపువ్వు.

**జాబరా** రూ.చూ. జాఫరా. వి. చాయ తగ్గిన ఎరుపురంగు, కుంకంపువ్వు రంగు.
**జాబరాపువ్వు** వి. సుకోమల.

**జాబితా** రూ.చూ. జాపితా. వి. పట్టిక.

**జాబినీ** రూ.చూ. జాపిని. వి. బొడ్డుమూకుడు, పాలకుండల మీదపెట్టే మట్టిమూత.

**జాబిలి** రూ.చూ. జాబిల్లి. వి. చంద్రుడు. చంద్రికా **4.109.**
**జాబిలిగుబ్బలి** వి. చంద్రగిరి. భాస్క. రా.యు. 1597, రం. రా.యు. 494 వ. 9పం. **జాబిలితాలుపు** రూ.చూ. జాబిలి తాల్పు. వి. శివుడు. **జాబిలితాల్పు** రూ. జాబిలి తాలుపు, జాబిల్లితాలుపు, జాబిల్లితాల్పు. వి. చంద్రశేఖరుడు, శివుడు. యయా. 2.43. **జాబిలిదిండి (-తిండి)** వి. **1.** రాహువు. యయా. 4.22 ; **2.** కేతువు. **జాబిలిమేపరి** వి. **1.** రాహువు. యయా. 3.69 ; **2.** కేతువు. **జాబిలిరా** రూ. జాబిలిరాయి, జాబిలిఱా, జాబిలిఱాయి, జాబిల్లిరా, జాబిల్లిరాయి, జాబిల్లిఱా, జాబిల్లిఱాయి. వి. చంద్రకాంతమణి. నీలా. 1.1. **జాబిలిరాయి** రూ.చూ. జాబిలిరా. వి. చందురా, చంద్రకాంతమణి. **జాబిలిరిక్క** రూ. జాబిల్లిరిక్క. వి. మృగశిరా నక్షత్రం, జింకతలచుక్క. **జాబిలిఱా** రూ.చూ. జాబిలిరా. వి. చంద్రకాంతమణి. **జాబిలిఱాయి** రూ.చూ. జాబిలిరా. వి. చంద్రకాంతమణి. **జాబిలివేలుపు** రూ. జాబిలి వేల్పు. వి. శివుడు. **జాబిలివేల్పు** రూ.చూ. జాబిలివేలుపు. వి. శివుడు.

**జాబిల్లి** రూ. జాబిలి. వి. **1.** చంద్రుడు. పారి. **2.44 ;** వసు. 4.52 ; విజయ. **2.48 ; 2.** సమాసంలో ఉత్తర పదంగా ఉంటే శ్రేష్ఠతావాచకం. శుక. 2.4 ; **3.** బాల్య క్రీడావిశేషం. హంస. **3.146.** వ్యు. మనోహరమైన బింబం. < జాను[1] + బిల్లిక.
**జాబిల్లికెసాన** వి. ఒకానొక వస్తువు. **జాబిల్లితాలుపు** రూ. చూ. జాబిలితాల్పు. వి. శివుడు. **జాబిల్లితాల్పు** రూ.చూ. జాబిలితాలుపు. వి. చంద్రశేఖరుడు, శివుడు. అచ్చ.రా.యు. 497. **జాబిల్లిపట్టి** వి. బుధగ్రహం. **జాబిల్లియల్లుఁడు (-అల్లుఁడు)** వి. మన్మథుడు. **జాబిల్లిరా** రూ.చూ. జాబిలిరా. వి. చంద్ర కాంతమణి. మృత్యు. 2.84. **జాబిల్లిరాయి** రూ. చూ. జాబిలిరా. వి. చంద్రకాంతమణి. **జాబిల్లిరిక్క** రూ.చూ. జాబిలిరిక్క. వి. మృగశిరానక్షత్రం. **జాబిల్లిఱా** రూ.చూ. జాబిలిరా. వి. చంద్రకాంతమణి. **జాబిల్లిఱాయి** రూ.చూ. జాబిలిరా. వి. చంద్రకాంతమణి.

**జాబిళ్లు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 5.155.

**జాబీకమ్మి** వి. గుజ్జుల మీద బిగించే అడ్డకర్ర, దొడ్డికడ్డీ.

**జాబు[1]** వి. **1.** కమ్మ, లేఖ. కృష్ణ. శ. 2.120 ; **2.** తావి కట్టిన చందనపు చెక్క. ఆం. భా. 3.49.
హిం. జవాబ్ ; మరా. జాబ్, జబాబ్. సమాధానం ; ఉ. జవాబ్. ప్రత్యుత్తరం, సమాధానం ; పార. జవాబ్.
< మరా. జాబ్.
**జాబుజవాబు** వి. ఉత్తరాలు.

**జాబు[2]** రూ.చూ. జావు[1]. వి. కోళ్ళగూడు.
**జాబుమడుపు** వి. వ్రాసిన జాబును ఉంచే కాగితపు సంచి.

**జాబుర** రూ.చూ. జాఫరా. వి. **1.** కుంకంపువ్వురంగు ; **2.** బట్టలకు రంగు వేయటానికి ఉపయోగించే గింజలుగల ఒక చెట్టు ; **3.** పెద్ద ఆకులు, తెలుపు ఎరుపు పూలుపూసే చెట్టు (Bixaoreuana).

**జాబురా** రూ.చూ. జాఫరా. వి. **1.** కుంకంపువ్వురంగు ; **2.** బట్టలకు రంగు వేయటానికి ఉపయోగించే గింజలు గలిగిన ఒకచెట్టు.

**జాబూ** రూ.చూ. జాఫరా. వి. **1** చుక్క ; **2.** ఎరుపు రంగు వచ్చే విత్తుల చెట్టు.

**జాబ్‌వర్క్** వి. అప్పటి కప్పుడు డబ్బు వచ్చేపని.
ఇం. *Job-work.* అప్పటికప్పుడు డబ్బువచ్చేపని.
< ఇం. Job-work.

**జామ** రూ. జామి, జాంబ, జేమ, జేమి. వి. ఒక జాతి ఫల వృక్షం, జామిచెట్టు. హంస. 4.134 (Psidium guayava).
ఇం. *Guava.* జామ ; స్పా. *Guayaba.* జాంపండు; *Guayabo.* జామచెట్టు ; తుపి. *Guajava.* జామచెట్టు.
**జామపండు** రూ. జామిపండు. వి. జాంపండు.

**జామనీఅంబరు** వి. నలుపు, ఎరుపు కలిసిన రంగు.
హిం. ఉ. జామ్‌నీ. రాత్రి, అంబర్. ఒక ఊరిపేరు. అత్తరు.

**జామా** వి. వస్త్రం.
హిం. ఉ. జామా. వస్త్రం, బట్ట.
< ఉ. జామా.

**జామారు** వి. **1.** సెల్లా ; **2.** అంచులు లేని తెల్ల వస్త్రం . **3.** పంచెలచాపు.
< హిం. ఉ. జామేవార్. సర్వత్ర బుటా ఉన్న పంచెల చాపు.
< ఉ. జామేవార్.

**జామి** రూ.చూ. జామ. వి. ఒక జాతిఫల వృక్షం, జామ, జేమ, చేవ.

జామిపండు రూ.చూ. జామపండు. వి. జాంపండు.

జామీను వి. 1. హామీగా ఉండేవాడు; 2. ఆధారం; 3. హామీ.

హిం. జామిన్, హామీ; మరా. జామీన్; ఉ. జామిన్; పార. జామిన్. ఉత్తర దాయిత్వం; అర. జామిన్.

< ఉ. జామిన్.

జామీనుండు అ.క్రి. హామీ ఉండు. < జామీను + ఉండు.

జామీనుదారు రూ. జామీనుదారుడు. వి. పూటకాపు, హామీదారు, జామీనున్నవాడు. నంది దుర్గాలయ శాసనం. క్రీ.శ. 1527.

హిం. జామిన్‌దార్. జామీనున్నవాడు, ఒకనికి పూచీపడేవాడు; మరా. జామీన్‌దార్; ఉ. జామిన్ దార్; పార. జామిన్‌దార్. హామీ ఉన్నవాడు.

< ఉ. జామిన్‌దార్.

జామీనుదారుడు రూ.చూ. జామీనుదారు. వి. పూచీపడేవాడు.

జాము[1] వి. యామం, ఏడున్నర గడియల కాలం, మూడు గంటల కాలం. పండి.వ. 1.80 పు.

సం. యామ. జాము; ప్రా. జామ-; పా. యామ-; క. జావ, జావ, జావు; తు. జ్యామ. జావ; త.మ. చామమ్; కువి. జాము. గడియారం.

< ప్రా. జామ-.

జాముచుక్క వి. బృహస్పతి, బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. జామువేగు అ.క్రి. బ్రతుకుగడచు, జీవనం సాగు. నిరంకు. 3.30. జామెక్కు అ.క్రి. జాము పొద్దు, ఏడున్నర గడియల పొద్దెక్కు. ఆము. 4.135. జాలు[2] వి.బ.వ. 1. జాములు. హరి.పూ. 6.99; 2. బయట ఉండే పశువుల మందలకి కావలి కాయడానికి రాత్రి వేళల్లో వంతులు వంతులుగా తిరగటాలు.

జాము[2] రూ. జాంబు. వి. లోటా, చిన్న రాగిపాత్ర.

హిం.ఉ. జామ్. పాత్ర.

< ఉ. జామ్.

జాముదారు వి. యోధుడు. విశ్వే.శ.

హిం.ఉ. జామ్‌దార్, వీరుడు; పార. జామ్‌దార్. యోధుడు.

< ఉ. జామ్‌దార్.

జామునీ రూ.చూ. జామ్లూ. వి. నేరేడు వన్నె, ఒకరకం నీలం రంగు.

జామెక్కు చూ. జాము[1].

జామెంటరీ వి. క్షేత్ర గణితం.

ఇం. *Geometry*. క్షేత్రగణితం.

< ఇం. Geometry.

జాంపినీ రూ.చూ. జాపిని. వి. బొడ్డు మూకుడు, పాలకుండల మీద పెట్టే మట్టిమూత.

జాంబ రూ.చూ. జామ. వి. జామ, పోర్చుగీసువారి ద్వారా అమెరికా ఖండం నుంచి తేబడిన ఒక పండ్ల చెట్టు.

జాంబు రూ.చూ. జాము[2]. వి. చిన్న రాగిపాత్ర, వెడల్పు మూతి కూజా.

జామ్లూ రూ. జామునీ. వి. నేరేడు వన్నె, ఒకరకం నీలంరంగు.

హిం. జామ్‌నీ. రాత్రి.

< హిం. జామ్‌నీ.

జాయ్ వి. కోపు, ఏపు.

హిం. ఉ. జాయ్. సరియైన;

ఇం. *Joy*. సంతోషం.

జాయ రూ.చూ. జాయా. వి. చెరుపు, నష్టం, చేటు.

జాయతు రూ. జాయెత్తు. వి. అధికారం, ప్రతాపం, హోదా. ద.హిం.శా.సంపు. 10 శా.సం. 759. క్రీ.శ. 1664.

ఉ.పార. జాహత్. అధికారం, హోదా.

< ఉ. జాహత్.

జాయమానము వి. పుట్టుకతో వచ్చిన గుణం.

సం. జాయమాన-. కలుగుచున్న, పుట్టుచున్న.

< సం. జాయమాన- (అర్థవిపరి.).

జాయా రూ. జాయ. వి. నష్టం, చెరుపు.

హిం.ఉ. జాయా. నష్టం, నాశనం, వ్యర్థం; పార. జాయా. నష్టం.

< ఉ. జాయా.

జాయి వి. నేర్పు.

జాయింట్[1] వి. 1. రెండు వస్తువులు కలిసే చోటు; 2. రెండు ఎముకలు కలిసే చోటు.

ఇం. *Joint*[1]. రెండు వస్తువులు లేదా రెండు ఎముకలు కలిసిన చోటు.

< ఇం. Joint[1].

జాయింట్[2] విశే. ఉమ్మడి, సంయుక్తమైన.

ఇం. *Joint*[2]. ఉమ్మడి.

< ఇం. Joint[2].

జాయింట్‌చేయు స.క్రి. కలుపు, సంధించు.

ఇం. *Joint*[3]. కలుపు, సంధించు, సున్నంతో సందుల్ని కూర్చు.

< ఇం. Joint[1] + చేయు.

జాయింటుబద్ద వి. మరానుకట్టుబడిలో, అడ్డపట్టెలను, ఆకులను బిగించిన కట్టె.

ఇం. *Joint*[1]. కలుపు, సంధించు.

< ఇం. Joint[1] + బద్ద.

జాయిస్టు వి. లోపలి కొలత, గోడల మధ్య నున్న స్థలపు కొలత.

ఇం. Joint[1]. రెండు వస్తువులు కలిసే చోటు.

జాయీనెగలుగు వి. ఒకరకం కట్టెపుల్ల, బడిలో దండెల మధ్య దుప్పైన పళ్ళమాదిరిగా వరసగా బిగించే కట్టెపుల్ల.

జాయెత్తు రూ.చూ. జాయతు. వి. అధికారం.

జారడు వి. అశ్వ భేదం. సిం.ద్వా. 3.141.

జారవిడుచు చూ. జారు.

జారించు చూ. జారు.

జారిపోవు చూ. జారు.

జారిమామిడి రూ.చూ. జారుమామిడి. వి. జిగురు నిచ్చే ఒక రకం చెట్టు (Buchanania latifolia).

జారీ[1] రూ.చూ. ఝూరీ. వి. 1. కమండలం. అచ్చ.రా.యు. 4.12 ; 2. రాగి, వెండి మొ. వాటితో చేయబడి సన్నని మెడకొమ్ము గల జలపాత్ర ; 3. ఊరగాయలు మొ. వాటిని నిలవ ఉంచే మట్టిపాత్ర.

జారీచెంబు వి. ప్రయాణాల్లో ఉపయోగించే ఒక విధమైన చెంబు.

జారీ[2] వి. ఆజ్ఞకావటం.

హిం.ఉ. జారీ. ప్రవహిస్తున్న, ప్రవహించిన.

<ఉ. జారీ.

జారీచేయు స.క్రి. 1. అమలు చేయు ; 2. వెల్లడించు ; 3. మంజూరు.

జారు రూ.చూ. జాఱు. వి. జరగటం, జారిపోవటం. స.క్రి. ఎకసెక్కెలాడు, గేలిచేయు.

జారవిడుచు స.క్రి. అవకాశం పోగొట్టుకొను. జారించు రూ.చూ. జాఱించు. స.క్రి. జారుచు, జారజేయు. జారిపోవు రూ. చూ. జాఱిపోవు. అ.క్రి. జారు, వశం తప్పు. జారుచంక వి. ఆవు, గేదె మొ. జంతువులు చేపి నప్పుడు కిందికి జారి పొడుగాటి చన్నుతో ఉండే చంక. జారుచు రూ.చూ. జార్చు. స.క్రి. జారించు, జారేటట్లు చేయు. జారుడు రూ.చూ. జాఱుడు. వి. ఊడిపడటం, జారటం. జారుపేట వి. పెడకోలను మోసే కొయ్యచెక్క. జారు పొదుగు వి. ఆవు, గేదె మొ. వాటికి చేపినప్పుడు కిందికి జారి పొడుగాటి చన్నులతో ఉండే పొదుగు. జారుముడి రూ.చూ. జాఱుముడి. వి. వదులు ముడి. జారువాటము వి. కిందికి పోనుపోను తగ్గే ఏటవాలు స్థలం. జార్గొప్పు రూ.చూ జాఱుఁగొప్పు. వి. చక్కగా దువ్వి వదులుగా ముడిచిన కొప్పు.

<జారు + కొప్పు.

జారుజీరలు వి.బ.వ. పిల్లల క్రీడావిశేషం.

జారుమామిడి చూ. జాఱు. రూ. జారిమామిడి. వి. జిగురునిచ్చే ఒకరకం చెట్టు (Buchanania latifolia).

జారేడు వి. కలపనిచ్చే ఒకరకం చెట్టు.

జార్గి వి. సిందూరపు రంగు పూలు పూసే ఒక రకం చెట్టు (Grislea tomentosa).

జార్చు చూ. జాఱు. రూ. జాఱుచు. 1. విడజేయు, వదుల్చు. కవిక. 3.54 ; 2. పోజేయు, తొలగించు. కవిక. 3.86 ; స.క్రి. 3. తోసివేయు, పారవేయు. ఇందు. 1.77 ; 4. జార చేయు, చ్యుతంచేయు, స్వస్థానంనుండి కదుల్చు. దశా.3.80.

జార్పు చూ. జాఱు. రూ. జాఱుపు. వి. 1. జారటం, గళనం. శుక. 3.352 ; 2. కొండచరియ.

జాఱవిడుచు చూ. జాఱు.

జాఱించు చూ. జాఱు.

జాఱిపోవు చూ. జాఱు.

జాఱు రూ. జారు. అ.క్రి. 1. (కాలం) గడుచు, గతించు. నృసింహ. 3.108 ; 2. (నీరు మొ.) స్రవించు, కారు, ఓడు. హర. 2.21 ; 3. చ్యుతమగు, గళితమగు. హర. 6.45 ; 4. దిగజారు, దిగు. శృం.నై. 1.98, జైమిని భా. 4.55 ; 5. (బట్ట ముడి, జుట్టుముడి మొ.) విడిపోవు. విక్ర. 1.158 ; 6. చెదలు, వెళ్ళు, పారిపోవు. విక్ర. 4.98, శుక. 2.158 ; 7. నశించు. మను. 3.23 ; 8. తొలగు. ఆము. 5.7 ; 9. తప్పు, చెడు. ప్రభా. 2.3 ; 10. వదులు. శుక. 1.179. వి. 1. తొలగటం, వంగటం. సుద. 5.87 ; 2. జారుడు, గళనం. ఆం.భా. 1.143. విణ. 1. కిందికి వేలాడు తున్న ; 2. బిగుతుకాని, వదులైన ; 3. పలుచనైన.

క. జాఱు, జారు, జరుగు, దొంగలించటానికి పోవు, ముకుళించుకుపోవు, పరుగెత్తు, గారు, కొండపైనుండి కిందికి పడు, (ముడి) విడివడు ; జాఱిసు. జారేటట్లు చేయు, వెళ్ళి పోవు ; తు. జారుని. జారు, జరుగు, కిందికి జారు, పారి పోవు, దొర్లు, జారుగా ఉండు, బెణుకు, అనుమానించు, వెనకడీయు, చర్మం వలుచు, నరుకు (చెట్టుకొమ్మలలాగ) ; త. చాఱు. జారు, పారు, బయటకు వచ్చు ; చాఱుకు. జారు, జరుగు ; చారల్. చిన్నచిన్న చినుకులు పడు ; మ. చాఱుక. పరిగెత్తు, చినుకులుగా కురియు; మ.చాఱుక. పరిగెత్తు, చినుకులుగా కురియు ; గోం. సార్. కారు (కడి బట్టలకున్న నీరు), బొట్లుబొట్లుగా పడు (దొంగ) ; కొలా. జార్. (నీరు) కుండనుండి కారటం ; కురు. చార్. నిండు.

<మూ.ద్రా. *చాఱ్-.

జాఱవిడుచు స.క్రి. 1. జారేటట్లుగా విడుచు. ఉ.హరి. 6.188 ; 2. రహస్యాన్ని సూచించు. శివ.రా. 2.102. <జాఱు + -అ[7] + విడుచు. జాఱించు రూ. జారించు. స.క్రి. తొలగించు. ఘటికా. 2.34. < జాఱు + -ఇంచు[3]. జాఱిపోవు రూ. జారిపోవు. అ.క్రి. 1. మృతుడగు, చచ్చు ; 2. తప్పించుకొనిపోవు ; 3. చ్యుతమగు, పడిపోవు. జాఱుకొప్పు రూ.చూ. జాఱుఁగొప్పు. వి. కొనముడి. జాఱుఁగొప్పు(-కొప్పు) రూ. జార్గొప్పు, జాఱు కొప్పు. వి. చక్కగా దువ్వి వదులుగా విడిచిన కొప్పు. వాల్మీ. 3.79. జాఱుచు రూ.చూ. జార్చు. స.క్రి. 1. జార చేయు, చ్యుతంచేయు, స్వస్థానంనుంచి కదల్చు. దశా. 2.303 ; 2. పోగొట్టు, తొలగించు; 3. వదల్చు, విడగొట్టు; 4. తోసివేయు. జాఱుడు రూ. జారుడు. వి. 1. తొలగటం, వంగటం. ఆం.భా. 1.143 ; 2. కొండచరియ. జాఱుడుఁ గొప్పు వి. చక్కగా దువ్వి వదులుగా ముడిచిన కొప్పు. ద్వి.సారంగ. 3. జాఱుపాటు రూ. జాఱువాటు. వి. 1. స్ఖాలిత్యం, ప్రమాద పతిత దోషం. విజయ. 1.107 ; 2. పొరపాటు. జాఱుపు రూ.చూ. జార్పు. వి. 1. జారటం, గళనం. ఆం.భా. 1.143 ; 2. కొండచరియ. జాఱుపైట రూ.చూ. జాఱుఁబైట. వి. జారే పైట. జాఱుబొజ్జ వి. వేలాడే పొట్ట హర. 7.12. జాఱుముడి రూ. జారుముడి. వి. వదులుముడి, దువ్వుముడి. జాఱుఁబైట రూ. జాఱుపైట. వి. జారేటట్లు వేసుకొన్న పయట శుక. 3.17. జాఱువడు (-పడు) అ.క్రి. జాఱు, నడలు. జారువాటు (-పాటు) రూ.చూ. జాఱుపాటు. వి. 1. జారుడు, గళనం. సమీర. 6.200 ; 2. నెమ్మది. ప్రబంధ. 78. జాఱువాఱు అ.క్రి. 1. తొలగు. ఉ.హరి. 5.92 ; 2. జారిపోవు. కవిక. 4.183 ; 3. వెళ్ళు. కృ.శకు. 3.33. జాఱుపోవు (-పోవు) అ.క్రి. తొలగు. పండి.చ. 1.61 పు.

ఝాల[1] విశే. వలవంటి (ది). ఆం.భా. 1.159. వి. 1. చేపలను పట్టే వల ; 2. కిటికీ.

<సం. జాల-. వల, కిటికీ.

ఝాలకట్టు వి. 1. రాతికి బెజ్జాలు పెట్టి ఏర్పరచిన కిటికీ, వెలుతురు ప్రసరించడానికి రాతిలో చేసిన బెజ్జం ; 2. నిలువుగా నాటిన కర్రలుగల కిటికీ. ఝాలకాఁడు[1] వి. 1. లూత, సాలెపురుగు. ఆం.భా. 2.87; 2. చేపల్ని పట్టేవాడు. ఝాలకిటికీ రూ. జాలుకిటికీ. వి. జల్లెడరేకు కిటికీ. ఝాలంచలవిడిది వి. వడదేలు. మందారిని. ఝాలరి[1] వి. 1. చేపలు పట్టేవాడు. భార.ఆది. 3.32 ; 2. మసికట్టు కడిగేవాడు. ఆం.భా. 2.255. 'జాల+-అరి<జాలరి' అని వ్యాకర్తలు. సం. జాలకార-. వలతో పనిచేసేవాడు ; ప్రా. జాలఅర- ; త. వాలర్-. వలవేసి చేపల్ని పట్టి జీవించేవారు ; కువి. జాలెర్. పల్లెజాతి, చేపల్ని పట్టేజాతి. <ప్రా. జాలఅర. ఝాలరి[2] రూ.చూ. జాలారి[3]. వి. 1. నేతలో డిజైను పడటానికి, దాటీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం ; 2. సన్నటి ఇనప ఊచలతో అల్లిన తడిక. ఝాలరిది వి. పల్లెది, చేపలుపట్టేస్త్రీ. భార. ఆది. 3.40. ఝాలవల్లిక వి. నగిషీ చెక్కిన తాంబూలపాత్ర. పాండు. 2.21. ఝాలారి[3] రూ. జాలరి[2]. వి. కిటికీల బయట బిగించిన జల్లెడ లాంటి ఇనప చట్రం. ఝాలారిజల్లెడ వి. దాపిమగ్గం పేటు దారాలు దూర్చిన చిన్నపన్నె.

జాల[2] వి. పద్మకం, ఏనుగుముఖంలోని బొట్లసమూహం. ఆం. భా. 2.194.

జాల[3] వి. ఊట.

జాలవాఁడు వి. ఊటవాడు. బసవ. 2.494 పం.

జాల[4] రూ. జాలి[5]. వి. తెల్లని పూలు పూసే ఒకరకం చెట్టు (Acacia latronum). పి. శకు. 2.14.

త. వాలై. వృక్ష విశేషం.

జాల[5] వి. ఏదైనా ఒకరంగులో ఉన్న ఒంటిమీద మరొక రంగు చార.

జాలగొర్రె వి. తెలుపు, నలుపు పొడల బొచ్చుగల గొర్రె.

జాలకాఁడు[2] చూ. జాలము.

జాలంగి వి. బొచ్చులేకుండా నున్నగా ఉండే వేటజాతి కుక్క.

జాలతాడు రూ.చూ. జాలతాడు. వి. నేతలో డిజైను పడటానికి దాటీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం.

జాలపు వి. విరేచన కారి అయిన ఒకమందు.

పో. జలాప ; డచ్చి. జలప్. సైపూతమందు.

<పో. జలాప.

జాలపుగుండ వి. విరేచనకారి అయిన ఒకమందు.

జాలము వి. జాగు, ఆలస్యం. ఉ. రా. 6.61, శశా. 4.84.

జాలకాఁడు[2] వి. ఆలస్యం చేసేవాడు.

<జాలము+కాఁడు.

జాలరు రూ.చూ. ఝల్లరి. వి. 1. గొడుగు మొ. వాటిచుట్టూ వేలాడే జల్లి మొ. ద్వి. సార. చ. 3 భా. ; 2. వడిలో ఉంచు పోగు దూర్చిన సందు ; 3. సన్నటి ఇనప ఊచలతో అల్లిన తడిక.

జాలరుకన్ను వి. వలకన్ను, కిటికీకన్ను. జాలర్‌బేలు వి. ఒకపువ్వు, రెండు ఆకులు వరసగా నేసిన డిజైను.

జాలర్బేలు చూ. జాలరు.

జాలలపాలకి చూ. జాలరు. వి. పెళ్ళిపల్లకి.

జాలవడి రూ. జాలివడి. వి. పేటుదారానికి చివర కట్టిన పురిదారం.

జాలాడి రూ. జాలాడు, జాలారి[2]. వి. 1. స్నానాలగది ; 2. గాడి, స్నానం చేసిన నీళ్ళుపోయే దారి ; 3. స్నానం చేసేటప్పుడు కాలికి బురద అంటకుండా నిల్చోడానికి వీలుగా అమర్చిన బండ.

జాలాడు రూ.చూ. జాలాడి. వి. స్నానాలగది.

జాలాడుబండ వి. స్నానం చేయడానికి బావిదగ్గర వేసి ఉంచే పెద్దబండ.

జాలారి[1] వి. అనంతపూర్, మైసూర్, సేలం, కోయంబత్తూర్, మధుర, మలబార్ మొ. ప్రదేశాల్లో పెరిగే ఒకరకమైన అందమైన చెట్టు (Shorea talura).

క. జాలారి. వృక్షవిశేషం (Shorea talura).

జాలారి[2] రూ.చూ. జాలాడి. వి. 1. స్నానాలగది ; 2. రూము.

ఝాలారి[3] చూ. జాల[1].

ఝాలారిజల్లెడ చూ. జాల[1].

జాలారు వి. పళ్ళెం, బావికిచుట్టూ కట్టిన అరుగు.

జాలార్లు వి.బ.వ. స్నానం చేసేటప్పుడు కాలికిబురద అంటకుండా నిల్చోడానికి వీలుగా అమర్చిన బండ.

జాలార్లు చూ. జాలారు.

జాలాలు చూ. జాలు[4].

జాలి[1] వి. దుఃఖం, శోకం. భార. శాంతి. 4.111 ; 2. కష్టం, శ్రమ, బాధ. భార. అశ్వ. 4.267 ; 3. వాంఛ, కోరిక. పాండు.5.296 ; 4. భయం, భీతి. దశా. 1 178 ; 5. వేదన, తాపం. దశా. 7.59.

జాలిగుడుచు(-కుడుచు) అ.క్రి. దుఃఖపడు. వరాహ. 5.68. జాలిగుండె వి. అదురుగుండె, దయాశాలి. జాలిగొను (-కొను) అ.క్రి. 1. భయపడు. భాగ. 6.385 ; 2. దుఃఖపడు. కవిరాజ. 3.162. జాలించు అ.క్రి. జాలిపడు. స.క్రి. జళిపించు, విదుల్చు. జాలిపడు రూ.చూ. జాలిఁబడు. అ.క్రి. కనికరించు, దయచూపు, దుఃఖపడు, కష్టపడు. జాలిపెట్టు రూ.చూ. జాలిఁబెట్టు. స.క్రి. 1. బాధించు, కష్టపెట్టు ; 2. బెదిరించు. జాలిపొందు రూ.చూ. జాలిఁబొందు. అ.క్రి. 1. భయభ్రాంతమగు ; 2. కనికరించు, దయచూపు. జాలిమాలి వి. 1. వెరపు, భయం. రామాభ్యు. 7.3 ; 2. తాపం, వేదన. కవిరాజ. 3.45. జాలిఁబడు (-పడు) రూ. జాలిపడు. అ.క్రి. 1. దుఃఖపడు, విచారపడు. భార. శాంతి. 4.58 ; 2. కష్టపడు. శుక. 2.491 ; 3. భయపడు. శుక. 4.102 ; 4. ఇష్టపడు, కోరు ; 5. తాపమొందు. స.క్రి. వాంఛించు. భాస్క. రా. ఆరణ్య. 2.171. జాలిఁబెట్టు (-పెట్టు) రూ. జాలిపెట్టు. స.క్రి. 1. కష్టపెట్టు, శ్రమపెట్టు. భార. ఉద్యో. 3.45 ; 2. బెదిరించు. ఝాలిఁబొందు(-పొందు) రూ. ఝాలిపొందు, ఝాలిపొందు.

అ.క్రి. భయపడు. హర. 6.46. జాలివొందు (-పొందు) రూ.చూ. జాలిఁబొందు. అ.క్రి. కనికరించు, దయజూపు.

జాలి[2] చూ. జాల[1]. రూ. జాలు[2]. వి. 1. కావలసిన పదార్థంలో కలసిపోయిన చిన్న చిన్న రాళ్ళు మొ. వాటిని వేరుచేయ డానికి వాడే పరికరం, జల్లెడ; 2. పిడేలుబెజ్జం, పిట్టగోడ లోని డిజైను కంత; 3. డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా సన్న బద్దలు కూర్చిన సాధనం; 4. సన్నని ఇనుప ఊచలతో అల్లిన తడికె, జాలువారం, డబ్బు ఉంచు కోడానికి పొడవుగా సన్నగా కుట్టిన తిత్తి.

జాలికుంపటి వి. వరండాల్లో వేలాడగట్టి మొక్కలు పెంచడానికి కుంపటి ఆకారంలో చేసిన మట్టిపాత్ర. జాలిపింజర రూ.చూ. జాలిపింజెర. వి. ఒకరకం డాబీ. జాలిపింజెర రూ. జాలిపింజర, జాలుపింజెర. వి. ఒకరకం డాబీ. జాలిబద్ద వి. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద. జాలిబొద్దె వి. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క.

జాలి[3] చూ. జాలియ[2]. రూ.చూ. జాలీ. వి. బొంగరంతాడు.

జాలికలేకయేబంగరమాడు అ.క్రి. 1. అతిసాహసి అగు; 2. నేర్పరి అగు. జాలిపొక్క వి. జాలీలోని చిల్లి.

జాలి[4] రూ.చూ. జాలె[1]. వి. ఒక రకం డేగ, పందెంకోసం తయారుచేసిన పిగిలిపిట్ట.

జాలి[5] రూ.చూ. జాల[4]. వి. నల్లతుమ్మ, తెల్లనిపూలుపూసే ఒక రకం చెట్టు, కొమ్మలు దడికి, కలప వ్యవసాయాది పరికరాల తయారీకి ఉపయోగించే చెట్టు (Acaciaarabica).

జాలికట్టె వి. జాలికర్రతో చేసిన గుబ్బ. జాలికల్ల వి. ఆము కాల్పుకు వాడే జాలిచెట్ల కంప.

జాలికాఁడు చూ. జాల[1]. వి. సాలెపురుగు.

సం. జాల-, వల.

జాలికుచ్చు చూ. జాలు. వి. కొమ్మలకు కట్టే పెక్కు రంగుల నూలుకుచ్చు.

జాలితాడు చూ. జాలు. రూ. జాల్రతాడు. వి. అల్లికదారం, అచ్చుతికిన పడుగులో చివర, పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం.

జాలిందె వి. ఒకరకం చెవి రింగులు.

జాలిపరకపేటు చూ. జాలు. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

జాలిబుడమ వి. నీరింకిన వాగుల్లో సాగుచేసి పండించే తీగ పైరు.

జాలియ[1] రూ.చూ. జాలె[1]. వి. ఒకరకం డేగ, శ్యేనభేదం. హరిశ్చ. 2.22.

జాలియ[2] రూ. జాలియము, జాలె[2], జాలెము, జాళెము[2]. వి. 1. యజ్ఞం చేసినపుడు సోమిదమ్మ తలమీద ఉంచుకొనే వల. కు.నం. 2.221; 2. జాలెసంచి. ద్వి.పరమ.వి. 7.499; 3. బొంగరం తాడు.

సం. జాలక-, జాలికా. మేల్ముసుగు, యోధుల రక్షా కవచం; ప్రా. జాలఅ-, జాలియా.

క. జాళిగె. జాలెసంచి, డబ్బు ఉంచుకొనే సంచి; త. చాలికై. జాలెసంచి, డబ్బు ఉంచుకొనే సంచి; మ. చాళిగ. జాలెసంచి, డబ్బు ఉంచుకొనే సంచి.

<ప్రా. జాలియా.

జాలియము రూ.చూ. జాలియ[2]. వి. నాణేలుంచుకొనే వలవంటి సంచి.

జాలివడి రూ.చూ. జాలవడి. వి. పేటుదారానికి చివర కట్టిన పురిదారం.

జాలీ రూ. జాలి[3]. వి. 1. గొడుగు మొ. వాటి కొసన వేలాడే కుచ్చు. సారంగ. 3.148; 2. బొంగరం తాడు.

సం. ఝల్లరీ. గొడుగు మొ. వాటికి కట్టే జాలరు.

జాలీకూజా వి. పైభాగంలో పట్టుకోడానికి వలయం పెట్టిన నీళ్ళకూజా.

జాలీచెంబు రూ. జాలీసెమ్ము. వి. పట్టుకోడానికి పైన వలయం పెట్టి చేసిన చిన్న మట్టిపాత్ర.

జాలీసెమ్ము రూ.చూ. జాలీచెంబు. వి. పట్టుకోడానికి పైన వలయం పెట్టి చేసిన చిన్న మట్టిపాత్ర.

జాలు[1] చూ. జాల[1], జాలి[2]. వి. 1. ఫిడేలుబెజ్జం; 2. ఫిరంగి సందు.

జాలుకిటికీ రూ.చూ. జాలకిటికీ. వి. జల్లెడరేకు కిటికీ.

జాలు[2] చూ. జాల[1]. రూ.చూ. జాలి[2]. వి. 1. డిజైను. చెక్కడప్పని; 2. పిట్టగోడలోని డిజైను కంత.

జాలుగూడు వి. చెక్కడప్పనితో చేసిన చెక్క సమర్చిన గూడు. జాలుదండి వి. జాలుమీది సిమెంటుపట్టీ. జాలుపింజెర రూ. జాలిపింజెర. వి. ఒకరకం డాబీ. జాలుపెంకు వి. ఇల్లు కప్పడానికి వాడే మామూలు పెంకు. జాలువారం వి. సన్నటి ఇనుపఊచలతో అల్లిన తడక.

జాలు[3] చూ. జాము[1].

జాలు[4] రూ. జాలువు, ఝాల్, ఝాలు. వి. 1. అల్పప్రవాహం, ప్రవాహం. కు.నం. 10.27; 2. ఏరు, నది. చెన్నబసవ. 3.38; 3. అచ్చు అతికిన పడుగులో చివరి పాయ.

జాలాటు రూ.చూ. జాలువాటు. అ.క్రి. జాలువారు, ప్రవహించు. జాలుకాల్వ వి. వాన కురిసి పొలంలో పారే నీటివాగు. జాలుకొను రూ. జాలుగొను, జాల్కొను, జాల్గొను. అ.క్రి. 1. ప్రవహించు, కారు, స్రవించు. భాగ. 11.109, వరాహ. 10.130; 2. ప్రసరించు, వ్యాపించు, రాజ.చ. 3.40; 3. వర్ధిల్లు. విణ. వర్ధిల్లెడి. యయా. 4.125. జాలుకొలుపు రూ. జాలుగొలుపు. స.క్రి. 1. ప్రవహింపచేయు. వరాహ. 10.54; 2. వ్యాపింపచేయు; 3. వర్ధిల్లచేయు. జాలుగొను(-కొను) రూ.చూ. జాలుకొను. అ.క్రి. 1. కారు, ప్రవహించు; 2. ప్రసరించు, వ్యాపించు; 3. వర్ధిల్లు. జాలుగొలుపు(-కొలుపు) రూ.చూ. జాలుకొలుపు. స.క్రి. 1. అలదు, పూయు. చిత్ర భా. 5.12; 2. వ్యాపింపచేయు; 3. ప్రవహింపచేయు; 4. వర్ధిల్ల చేయు. జాలుదొడుకు వి. మబ్బు. జాలుపుట్టువు రూ. జాల్పుట్టువు. వి. ఇంద్రుని ఏనుగు. జాలుపోయు వి. పడుగులో చివరిపాయ (= పొట్టె) లకు దారంతో మెలికలు వేసి కట్టటం. జాలుమొలక రూ. జాల్మొలక. వి. కల్పవృక్షం. జాలువాటు(-పాటు) రూ. జాలాటు, జాల్వాటు. అ.క్రి. 1. ప్రవహించు, కారు, స్రవించు. భార.విరా. 1.12; 2.

ప్రసరించు, వ్యాపించు. కావ్యా.చూ. 3.39. జాలెత్తు అ.క్రి. **1**. జాలువారు, ప్రవహించు. విజయ. 3.11 ; **2**. కారు, స్రవించు. <జాలు[4]+ఎత్తు[1]. జాల్కొను రూ.చూ. జాలుకొను. అ.క్రి. కారు, పెరుగు, అలముకొను, ఓడిగిలు, పాఱు, జాలారు. జాల్గొను రూ.చూ. జాలుకొను. అ.క్రి. **1**. కారు, స్రవించు ; **2**. ప్రసరించు, వ్యాపించు ; **3**. వర్ధిల్లు. జాల్పుట్టువు రూ.చూ. జాలుపుట్టువు. వి. ఇంద్రుని ఏనుగు. జాల్మొలక రూ.చూ. జాలుమొలక. వి. కల్పవృక్షం. జాల్వాఱు (-పాఱు) రూ.చూ. జాలువాఱు. అ.క్రి. ప్రవహించు, కారు.

**జాలువా** రూ.చూ. జాళువా. వి. బంగారం, సువర్ణం. చంద్రాంగ. 1.87.

**జాలువు** రూ.చూ. జాలు[4]. వి. **1**. ప్రవాహం. అధ్యా.రా. ఆరణ్య. 74 పు.; **2**. వరద.

**జాలె[1]** రూ. జాలి[4], జాలియ[1]. వి. ఒకజాతి డేగ, శ్యేనభేదం. పి.శకు. 1.110.

**జాలె[2]** రూ.చూ. జాలియ[2]. వి. **1**. నాణేలుంచుకునే వలవంటి సంచి. జైమిని భా. 8.54; **2**. బొంగరం లాడు. విక్ర. 1.2.

జాలెత్రాడు వి. జెట్టియొక్క ఉపకరణ విశేషం. పాంచాలీ. 5.8. జాలెసంచి వి. నాణేలుంచుకొనే ఒకరకం సంచి. ద్వి.పరమ.వి. 499.

**జాలెచెట్టు** చూ. జాలి[5]. వి. బుర్రతుమ్మ.

**జాలెతాడు** రూ.చూ. జాల్రతాడు. వి. అల్లికదారం, అచ్చుతీకిన పడుగులో చివర, పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం.

**జాలెత్తు** చూ. జాలు[4].

**జాలెపోయు** స.క్రి. నేత పడుగులో పొట్టి ముడులు వెంబడి జాలెతాడు దూర్చి లాకకూ, కర్రకూ అల్లు.

**జాలెబొట్టె** వి. జాలెతాడు చుట్టిన పడుగు చివరి పాయ.

**జాలెము** రూ.చూ. జాలియ[2]. వి. జాలియ, వలవంటి నాణేల సంచి. కాశీ. 7.250.

**జాల్కొను** చూ. జాలు[4].

**జాల్గొను** చూ. జాలు[4].

**జాల్పుట్టువు** చూ. జాలు[4].

**జాల్మొలక** చూ. జాలు[4].

**జాల్రతాడు** రూ. జాలతాడు, జాలితాడు, జాలెతాడు. వి. నేతలో డిజైను పడటానికి డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచు పడుగులో వేలాడదీసిన దారం.

**జాల్లగుంట** వి. పేటుతూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసినగొయ్యి.

**జాల్వా** రూ.చూ. జాళువా. వి. బంగారం. దశా. 7.258.

**జాల్వాఱు** చూ. జాలు[4].

**జాల్వార్** వి. పిట్టగోడలోని డిజైను కంత.

**జాళి** రూ.చూ. జాళె. వి. **1**. గుండ్రంగా తిరగటం ; **2**. రేచితం అనే పేరుకల గుర్రం నడక.

**జాళించు** రూ.చూ. జాడించు. స.క్రి. **1**. విదుల్చు, దులుపు. రామాభ్యు. 8.145 ; **2**. జళిపించు, ఆడించు. ఘటికా. 2.97.

**జాళియ** రూ.చూ. జాళె. వి. అశ్వగతి విశేషం, గుర్రం గుండ్రంగా తిరగటం.

**జాళియము** రూ.చూ. జాళె. వి. అశ్వగతి విశేషం, గుర్రం గుండ్రంగా తిరగటం.

**జాళీలు** వి.బ.వ. వస్త్రభేదం. ధనా. 3.38.

**జాళువా** రూ. జాలువా, జాల్వా, జాళ్వా. వి. మేలిమి బంగారం, అపరంజి బంగారం. ఉ.రా. 1.25.

ఉ. పార. జల్వ, జల్వత్. పెళ్ళికూతురి నగలు, వైభవం, కాంతి.

< ఉ. జల్వ.

జాళువాకంటితొలివేల్పు వి. హిరణ్యాక్షుడు. అచ్చ.రా. బాల. 153. జాళువాకంటిరేద్రిమ్మరి(-త్రిమ్మరి) వి. హిరణ్యాక్షుడు. నీలా. 2.41. జాళువాగట్టు వి. మేరుపర్వతం, బంగరుకొండ. జాళువాగట్టువిలుకాఁడు రూ. జాళువాగట్టు విల్కాఁడు. వి. మేరుధన్వుడు, శివుడు. జాళువాగట్టు విల్కాఁడు రూ.చూ. జాళువాగట్టు విలుకాఁడు. వి. మేరు ధన్వుడు, శివుడు. జాళువాగుబ్బలి వి. మేరువు, బంగారు కొండ. ఘటికా. 2.228. జాళువాగుబ్బలివిలుకాఁడు రూ. జాళువాగుబ్బలి విల్కాఁడు. వి. మేరుధన్వుడు, శివుడు. జాళువాగుబ్బలివిల్కాఁడు రూ.చూ. జాళువాగుబ్బలి విలుకాఁడు. వి. మేరుధన్వుడు, శివుడు. జాళువాపఱపయ్య వి. హిరణ్యకశిపుడు. ప్రబంధ. 162. < జాళువా పఱపు + అయ్య. జాళువాబొమ్మ వి. బంగారపు బొమ్మ. ఉ.రా. 4.189. జాళువావింటివాఁడు విణ. మేరుధన్వుడు, శివుడు. అచ్చ.రా. కిష్కిం. 109.

**జాళె** రూ. జాళి, జాళియ, జాళియము, జాళెము[1]. వి. అశ్వగతి విశేషం, మండలాకార భ్రమణం. రం.రా.యు. 385 పు. 28 పం.

**జాళెము[1]** రూ.చూ. జాళె. వి. **1**. మండల భ్రమణం. మను. 4.115 ; **2**. అశ్వగతి విశేషం, రేచితం. ఆం.భా. 2.198.

జాళెముల్రిప్పు(-త్రిప్పు) స.క్రి. గిరగిరతిప్పు. జైమిని భా. 5.74.

**జాళెము[2]** రూ.చూ. జాలియ[2]. వి. వరాలసంచి.

**జాళ్వా** రూ.చూ. జాళువా. వి. అపరంజి బంగారం, శుద్ధమైన బంగారం. దశా. 2.352.

జాళ్వాకొండ వి. జాళువాగుబ్బలి. చంద్రాంగ. 3.55. జాళ్వాపీట వి. సువర్ణపీఠం, బంగారుపీట. చంపూ రా. 3.50.

**జావ** వి. **1**. గంజి. రామలిం. 3 ; **2**. నూకలు మొ. వాటిలో పలచగా కాచిన పదార్థం. ఆం.భా. 2.250.

సం. √సావ-. జారిపోయేది, గంజి ; ప్రా. సావ- ; పా. సావ-. గంజి.

< ప్రా. సావ-.

జావకుండ వి. పడుగుకు పెట్టే జావకాచేకుండ. జావకారిపోవు అ.క్రి. భయపడిపోవు, నిర్వీర్యుడగు. జావగంజి వి. బియ్యం మెత్తగా ఉడకబెట్టి తీసినగంజి. జావయిపోవు అ.క్రి. భయపడిపోవు, నిర్వీర్యుడగు. <జావ+అయిపోవు.

**జావంకము[1]** వి. గెలుపుగుర్తు, జయాంకం.

సం. జయాంక-. గెలుపు చిహ్నం.

జావంకము² వి. జాము చిన్నె.

సం. యామాంక-. జాముగుర్తు.

< జాము + సం. అంక-.

జావడము¹ రూ. జావళము¹. వి. పిరికితనం, అధైర్యం. భార. ఉద్యో. 3.61.

జావడము² రూ. జావళము². వి. గుర్రపుతట్టు, అశ్వవిశేషం. ఆము. 2.96.

జావడము³ రూ. జావళము³. వి. శ్యేనభేదం. ద్వి. హరిశ్చ. పూ. 625.

జావడి¹ వి. చాకలివాడు. ద్వి. భాగ. 9 స్కం.

జావడి² చూ. జావడము¹. విణ. పిరికి.

జావడి³ రూ.చూ. జావళి. వి. శృంగార గీతం.

జావళము¹ రూ.చూ. జావడము¹. వి. పిరికితనం, అధైర్యం.

జావళము² రూ.చూ. జావడము². వి. గుర్రపుతట్టు, అశ్వగతి విశేషం.

జావళము³ రూ.చూ. జావడము³. వి. ఒకజాతి డేగ.

జావళి రూ. జావడి³, జావళీ. వి. శృంగారగీతం.

జావళీ రూ.చూ. జావళి. వి. గీతవిశేషం.

జావాను రూ.చూ. జవాను. వి. సేవకుడు, బంట్రోతు.

జావాహిరి రూ.చూ. జవాహిరి. వి. రత్నపుసొమ్ము.

జాస్తి వి. అత్యధికం, మిక్కిలి ఎక్కువ, అదనం.

పో.చూ.సం. జ్యేష్ఠ. శ్రేష్ఠమైన, పెద్ద.

జాస్తికాల్వు వి. ముదురుకాల్వు, ఆములు కుండలు మొ. నవి ఎక్కువగా కాలి ఆకారం చెడిపోయిన తీరు.

జాహిరు వి. ఎరుకచేయటం.

హిం.ఉ. జాహిర్. ప్రకటమైన, విదితమైన.

< ఉ. జాహిర్.

జాహిరుదారు చూ. జాగీరుదారు. వి. సర్కారువారిచే ఇవ్వబడ్డ భూమికి యజమానుడు.

హిం. ఉ. జాహిర్‌దార్. ప్రత్యక్షీకరించ బడ్డవాడు.

< ఉ. జాహిర్‌దార్.

-జి రూ. -జీ¹. ప్రత్య. పూజ్యుల నామాంతంలో ఉపయోగించే గౌరవవాచకం. కృష్ణరా. 2.90.

హిం. ఉ. జీ. పూజ్యతావాచకం, గౌరవవాచకం.

< ఉ. జీ.

జింసు రూ.చూ. దినుసు. వి. సరకు, వస్తువు.

జిక్కు చూ. జిగట. వి. 1. బంక; 2. అతుక్కొనే స్వభావం.

జిక్కుతురక వి. పక్షివిశేషం, ఒకానొక పిట్ట. హంస. 3.12.

జిక్కోళ్లు వి.బ.వ. జిల్లా కోళ్ళు.

జిగజారు రూ.చూ. డిగ్గజారు. అ.క్రి. దిగజారు, జారిపోవు.

జగజిగలాడు అ.క్రి. వన్నెతేరు.

జిగట రూ. జివట. విణ. స్నిగ్ధమైన, నున్నని. ఆం.భా. 2.252. వి. బందన, బంక, అతుక్కొనే స్వభావం.

క. జిగటు, జిగటె, జిబటు. జిగట, బంక, పక్షుల్ని పట్టడాని కుపయోగించే బంక; మ. చిక్. జిగటగాఉన్న ద్రవం, చెట్టునుండి కారిన బంక.

పో.చూ. సం. చిక్క-. బంక, పక్షుల్ని పట్టటాని కుపయోగించే బంక.

జిగటమట్టి రూ. జిగుటమట్టి. వి. బంకమట్టి, జిగురుగా వుండే మట్టి. జిగటమన్ను రూ. జివటమన్ను. వి. బంకమన్ను, జిగురుగా ఉండేమట్టి. జిగటరకం వి. పట్టుకుంటే వదలని వాడు అనడం. జిగటరేవడి వి. బంకమన్ను కలిసి, నలుపు తెలుపురంగులో ఉండేరేగడి.

జిగటాలు వి. దీపం. జ్యోతి.

జిగి¹ వి. 1. కాంతి, ప్రకాశం, శోభ. భార. ఉద్యో. 2.114; 2. కాంతి అనే కావ్యగుణం. ఇంపు. 1.34; 3. సుషమ, అధికకాంతి. ఆం. భా. 1.80; 4. వన్నె, చెన్ను, జోలి, ఒప్పు; 5. గట్టి.

జిగిదేఱు (-తేఱు) అ.క్రి. కాంతికలుగు, నిగ్గుదేరు, వన్నెదేరు. హరి. ఉ. 4.250. జిగినేల వి. 1. గట్టినేల; 2. ఎర్రచెక్కునేల. జిగిబిగి వి. సంఘటన, దృఢమైన బంధం (తెనాలిరామకృష్ణుని చాటువు). విణ. ఆశ్చర్యకరమైన. జిగిరేచాకు వి. బెత్తెడు వెడల్పున పల్చగా ఉండేరేకు ముక్కని ఒక వేపున పిడిగా పనికి వచ్చేలా చుట్టచుట్టి తయారు చేసిన పనిముట్టు.

జిగి² రూ. జిగు. వి. 1. జొన్న వెసులు, దంటు మీద తెల్ల బంక పట్టే తెగులు; 2. పాకం, జిగురు.

క. జిగి. మందం, జిగురు.

< క. జిగి.

జిగిమానం రూ. చూ. జిగిమానము. వి. జిగురుదనం.

జిగిమానము రూ. జిగిమానం. వి. పిసినితనం, లోభం.

జిగిని వి. 1. స్త్రీకంఠాభరణ విశేషం; 2. స్త్రీలగొలుసులోని బిళ్ళ.

హిం. జుగ్‌నీ, జుగ్‌నూ. మిణుగురుపురుగు. కంఠాభరణ విశేషం, మెఱుపు.

< హిం. జుగ్‌నీ.

జిగినిగొలుసు రూ. జిగినీ గొలుసు. వి. పతకం ఉండి మెడకు పట్టి ఉండేటట్టుగా తయారు చేసిన ఆభరణ విశేషం.

జిగినీగొలుసు రూ.చూ. జిగినిగొలుసు. వి. పతకం ఉండి మెడకు పట్టి ఉండేలట్లుగా తయారు చేసిన ఆభరణ విశేషం.

జిగిలి¹ విణ. 1. చిక్కని; 2. చక్కని, చక్కనైన. వి. అరుగు.

జిగిలికత్తె వి. అందకత్తె, నీటుకత్తె. జిగిలికాఁడు విణ. సౌందర్యవంతుడు, అందగాడు.

జిగిలి² రూ. జిగిళి. వి. మొండిరకం కలుపుమొక్క, గోళ్ళగొండి.

జిగిళి రూ.చూ. జిగిలి². వి. మొండిరకం కలుపుమొక్క.

జిగు రూ.చూ. జిగి². వి. 1. బంక; 2. అతుక్కొనే స్వభావం.

జిగుటమట్టి చూ. జిగురు¹.

జిసురు¹ రూ. జివురు¹, జీగురు, జీవురు. వి. 1. పక్షుల్ని పట్టుకోటానికి గడ చివరన గాని దారం చివరనగాని

రాచిన బందన. కాశ. 4.29 ; **2.** స్నిగ్ధం, నునుపు. ఆం. భా. 2.252 ; **3.** బంక, నిర్యాసం ; **4.** జిగురు పూసిన దారం.

**జిగుటమట్టి** రూ.చూ. జిగటమట్టి. వి. బంకమన్ను, జిగురుగా ఉండేమట్టి. **జిగురుకొను** అ.క్రి. **1.** జిగట కలది అగు, బంధనగొను. కాశీ. 3.21 ; **2.** గట్టిపడు. స.క్రి. అంటుకొను. **జిగురుకండె** రూ.చూ. జిగురుఁగండె. వి. వేటలో పక్షుల్ని పట్టుకోటానికి ఉపయోగించే జిగురు పూసిన కండె. **జిగురుగడ** వి. పక్షుల్ని పొదపటానికి ఉపయోగించేవేట సాధనాల్లో ఒకటి, చివర జిగురు రాచినగడ. జైమిని భా. 4.76. వరాహ. 4.75. **జిగురుఁగండ** రూ.చూ. జిగురుఁగండె. వి. బంక పూసిన ఉచ్చు, ఉరివల. **జిగురుఁగండె(-కండె)** రూ. జిగురుకండె, జిగురుఁగండ, జిగుర్గండె, జీగురుఁగండె, వి. పక్షుల్ని పట్టటానికి ఉపయోగించే వేటసాధనం, జిగురుపూసిన కండె. భాగ. 7.57. **జిగురుచుట్టినకండె** వి. వేటలో పక్షుల్ని పట్టుకోటానికి ఉపయోగించే జిగురుపూసిన కండె. తాళ్ల. సం. 12.75. **జిగురుటంబలి** వి. చింతగింజలు మొదలగు వానితో జిగురుగా చిక్కగా కాచిన అంబలి. రంగా. చ. 3.97. <జిగురు + అంబలి. **జిగురునవర్ధరాచిలుక** వి. చిక్కన పడినది. **జిగురుపొడి** వి. ఎండించి నలగకొట్టిన తుమ్మబంక. **జిగురుబాయి** వి. మిడత. **జిగురుమన్ను** వి. బంకమన్ను, జిగురుగా ఉండేమట్టి. **జిగురుమీట** రూ.చూ. జిగుర్మీట. వి. వేటసాధనాల్లో ఒకటి, జిగురు రాచినమీట. **జిగురువైచు** అ.క్రి. వలవేయు. **జిగురుసాగు** అ.క్రి. జిగురుపొందు. **జిగుర్గండె (-కండె)** రూ.చూ. జిగురుఁగండె. వి. పక్షుల్ని పట్టటాని కుపయోగించే వేటసాధనం, జిగురుపూసిన కండె. బహుళా. 1.59. **జిగుర్మీట** రూ. జిగురుమీట. వి. జిగురు రాచినమీట, వేటసాధనాల్లో ఒకటి, వేటగాళ్ళు పక్షుల్ని పట్టడానికి బంకపూసిన కట్టె, జిగురుదడ. ప్రబంధ. 190.

**జిగురు[2]** చూ. జిగురు[1]. వి. విశాఖపట్నంలోని పాలకొండ తాలూకాలోను, కడప, కర్నాటక, చెంగల్పట్, కంబకమ్ కొండల్లోనూ పెరిగే ఒకరకం చెట్టు (Cleistanthus patulus).

**జిగుర్గండె** చూ. జిగురు[1].

**జిగుర్మీట** చూ. జిగురు[1].

**జిగేలుమను** అ.క్రి. కన్నులు మిరుమిట్లు గొను.

<జిగేలు + అను.

**జింక[1]** వి. **1.** మృగం, లేడి. భార. కర్ణ. 2.273 ; **2.** ఒక జాతి లేడి, న్యంకువు. ఆం. భా. 2.84.

క. తు. జింకె. జింక.

**జింకకొమ్ము** వి. కొనచుట్టు తిరిగిన కొమ్ము. **జింకకొమ్ములు** వి.బ.వ. ఒకజాతి పిండివంటలు. **జింకగుఱ్ఱము వలంతి** వి. గాలి, వాయుదేవుడు. **జింకతలచుక్క** వి. మృగశీర్షనక్షత్రం. **జింకతలచుక్కనెల** వి. మార్గశీర్షమాసం. **జింకతలరిక్కనెల** వి. మార్గశీర్షమాసం. **జింకతాలుపరి** రూ. జింకతాల్పరి. వి. **1.** చంద్రుడు. అచ్చ. రా. బాల. 3 ; **2.** శివుడు. అచ్చ. రా. బాల. 3. <జింకతాలుప + -అరి. **జింకతాలుపు** రూ.చూ. జింకతాల్పు. వి. **1.** శివుడు. అచ్చ. రా. యు. 64 ; **2.** చంద్రుడు. వ్యు. లేడిని ధరించినవాడు. **జింకతాల్పరి** రూ.చూ. జింకతాలుపరి. వి. **1.** చంద్రుడు ; **2.** శివుడు. <జింకతాల్పు + -అరి. **జింకతాల్పు** రూ. జింకతాలుపు. వి. **1.** చంద్రుడు. నీలా. 3.21 ; **2.** శివుడు. **జింకపొక్కిలి** వి. ఔ. మృగనాభి, కస్తూరి. అచ్చ. రా. బాల. 167. **జింకపోతు** వి. ఇఱ్రి, న్యంకువు. **జింకమావుదేవర** వి. వాయుదేవుడు. అచ్చ. రా. కిష్కిం. 93. వ్యు. మృగం అశ్వంగా గలవాడు. **జింకరవుతు** రూ. జింకరౌతు. వి. మృగవాహనుడు, వాయువు. వ్యు. జింకనెక్కేవాడు. **జింకరోగం** వి. ఒకరకం నరాలజబ్బు, వెఱ్రి. **జింకరోమాలు** వి.బ.వ. ధాన్యవిశేషం. **జింకరౌతు** రూ.చూ. జింకరవుతు. వి. వాయుదేవుడు. **జింకలంచు** రూ. జిన్కలంచు. వి. జింకల ఆకారంలో డిజైను పడేటట్టు నేసిన అంచు. <జింక[1] + -లు + -అ + అంచు. **జింకవార్వపుజోదు** వి. వాయువు. అచ్చ. రా. యు. 174. <జింక + వార్వము + జోదు. **జింకవార్వపువజీరు** రూ.చూ. జింకవార్వపు వజీరుఁడు. వి. వాయుదేవుడు. **జింకవార్వపువజీరుఁడు** రూ. జింకవార్వపు వజీరు. వి. పృషదశ్వుడు, వాయుదేవుడు. అచ్చ. రా. కిష్కి. 79. వ్యు. జింకవాహనం (గుఱ్ఱం) గాకల వీరుడు. **జింకెఱ్ఱ** వి. జింకరంగు మాదిరి ఎరుపు. <జింక[1] + ఎఱ్ఱ.

**జింక[2]** వి. **1.** దొడ్డెకడ్డీ, గుజ్జులమీద బిగించే అడ్డకఱ్ఱ ; **2.** దర్వాజా మీద చక్కదనానికి నిలిపిన బొమ్మ.

**జింకగుంజ** వి. మోటబావి ఉద్దిమీద కామిరెకు పోటీ పెట్టిన ఏటవాలు కొయ్య. **జింకపొట్టి** వి. పంచగుంజను, చూరు వాసాన్ని కలుపుతూ బిగించిన సన్నటి వెదురుకఱ్ఱ

**జింకం** వి. గుల్ల, మెతక.

**జింకకారి** వి. చవుటినేల, ఉప్పునేల, మరీజిగురుగా ఉండే కారినేల.

**జింకపురిజొన్న** వి. ఎఱ్ఱనేలల్లో పండే ఒకరకం జొన్న.

**జింకరవడ్లు** రూ. జింకరొడ్లు. వి.బ.వ. 'సాంబ'లో ఒకరకం వడ్లు.

**జింకరొడ్లు** రూ.చూ. జింకరవడ్లు. వి.బ.వ. 'సాంబలో' ఒకరకం వడ్లు.

**జింకిలీకము** రూ. జింగిలీకము. వి. ఒకానొకమృగం.

**జింకు** వి. తెల్లని లోహపదార్థం, తుత్తునాగం, యశదం.

ఇం. *Zinc*. తుత్తునాగం.

<ఇం. Zinc.

**జింకెఱ్ఱ** చూ. జింక[1].

**జింగిణీ** విణ. పొట్టి, గిటక, టింగణా.

**జింగిలీకము** రూ.చూ. జింకిలీకము. వి. ఒకానొకమృగం.

**జిజియా** రూ.చూ. జీజియా. వి. మహమ్మదీయ పరిపాలకులు అన్యమతనులపై విధించే పన్ను.

**జిజ్జి** వి. నిద్ర. ధ్వన్యను.

**జింజర్** వి. **1.** అల్లం ; **2.** అల్లంకలిపిన పానీయ విశేషం.

ఇం. *Ginger*. అల్లం, సత్తాఉద్రేకం, ప్రేరణం, లేతఎరుపు చాయ కలిసిన పసుపురంగు.

< ఇం. Ginger.

**జింజరీ** రూ. జింజిరి, జింజీరు. విశ. గొలుసులవలె పొడుగ్గా ఉన్న. భద్ర.శ. 50. వి. గొలుసు.

హిం. జంజీర్ ; ఉ. జింజీర్. గొలుసు; పార. జంజీర, గొలుసు ఆకారంకలది ; జంజీర్. గొలుసు. పో. చూ. సం. శృంఖల-. సంకెల.

< ఉ. జింజీర్.

**జింజిరి** రూ.చూ. జింజరీ. వి. గొలుసు, హారం.

**జింజీరు** రూ.చూ. జింజరీ. వి. గొలుసు, సరం, హారం.

**జింజరు** చూ. జింజరీ. వి. జంజాటం, తగులం.

**జిటేగి** వి. తెల్లని పూలుపూసే ఒకరకం చెట్టు. దీనికర్రతో గృహోపకరణ సామగ్రి తయారు చేస్తారు (Dalbergia latifolia).

**జిట్ట**[1] వి. 1. వెదురుయొక్క ఎన్ను. మను. 4.18 ; 2. కాయ, కోశం. శుక. 1.157.

త. చెతిల్. చేపపొలుసు, చెట్టుకుపైనున్న బెరడు ; మ. చెతుంప్పు, చెతుంపాల్, చెత్తల్. చేపపొలుసు.

**జిట్ట**[2] వి. పక్షివిశేషం, చిన్నపందెపు కోడి. ప్రబంధ. 2.34.

**జిట్ట**[3] వి. 1 చార, రేఖ. వైజ. 4.80 ; 2. బట్టలో గుర్తుకోసం పెట్టేరంగునేత ; 3. నూలుపోగుల లెక్క ; 4. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పే కర్ర ; 5. అయిదుకొలుకుల దారం పెట్టి నేసింది ; 6. చెయ్యి చాచినప్పుడు బొటనవేలి కొనకూ చూపుడు వేలికొనకూ మధ్యనున్న ఎడం.

**జిట్టకట్టు** స.క్రి. చీరలో, చివరికమ్మికి బొద్దు (లావుదారం) లు పెట్టినేయు. **జిట్టకట్టె** వి. నేతనేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గం మీద, దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. **జిట్టకమ్మి** వి. రెండువైపులా లావు దారాలు పెట్టినేసిన కమ్మి. **జిట్టలకమ్మి** రూ. జిట్టులకమ్మి. వి. రెండువైపులా లావుదారాలు పెట్టినేసిన కమ్మి.

**జిట్ట**[4] వి. జేన, పన్నెండంగుళాల పరిమాణం.

**జిట్టె(డు** రూ.చూ. జుత్తె(డు. వి. 1. జానెడు ; 2. పన్నెండంగుళాల పరిమాణం.

**జిట్ట**[5] వి. అమ్ము, బాణం.

**జిట్ట**[6] వి. తుప్ప, పొద.

**జిట్ట**[7] వి. 1. నేర్పరి ; 2. పొట్టివాడు.

**జిట్రేగి** రూ.చూ. జిట్రేగు. వి. కలపకోసం పెంచే ఒక పెద్దచెట్టు (Dalbergia latifolia). **జిట్రేగు** రూ. జిట్రేగి. వి. కలపకోసం పెంచే ఒకపెద్దచెట్టు (Dalbergia latifolia). **జిట్రేని** వి. రేగులో మరీ పొట్టిరకం ముళ్ళ మొక్క. < జిట్టరేని < చిట్టి + రేని.

**జిట్ట**[8] వి. 1. మార్గశీర్షమాసం ; 2. జ్యేష్ఠ.

సం. జ్యేష్ఠ-. ఒకనెల ; జ్యేష్ఠా. ఒకనక్షత్రం, అక్క ; ప్రా. జిట్ఠ-, జేట్ఠ-. పెద్ద, వృద్ధుడు, అన్న.

< ప్రా. జిట్ఠ-.

**జిట్టకము** వి. 1. గేలిమాట ; 2. విలాస చేష్ట ; 3. విలాసం.

సం. చేష్టా-. పని, నడవడి ; ప్రా. చేట్ఠ-.

**జిట్టంగి** వి. కాటుకపిట్ట, కూకటిగువ్వ.

**జిట్టవరగో(గు** వి. పిలుపు, మొక్క.

**జిట్టాడు** అ.క్రి. 1. డోలాయమానమగు ; 2. కొట్టుకొను, గంతులిడు.

**జిట్టి** వి. 1. చిమ్మట ; 2. తగవు, జట్టి.

**జిట్టికడవ** రూ.చూ. దిష్టికడవ. వి. దిష్టితీయడానికి వాడే మట్టి పాత్ర.

**జిట్టికుండ** రూ.చూ. దిష్టికుండ. వి. దిష్టితీయడానికి వాడే కుండ.

**జిట్టీత** రూ. జిట్టీదు. వి. ఎడారిలో పెరిగే ఒకరకం ఈతమొక్క (Phoenix acaulis).

**జిట్టీదు** రూ.చూ. జిట్టీత. వి. చిట్టీతచెట్టు.

**జిట్టు** వి. 1. గోపాదం ; 2. నాలుగు అంగుళాలు.

**జిట్టులకమ్మి** రూ.చూ. జిట్టలకమ్మి. వి. రెండువైపులా లావు దారాలు పెట్టి నేసిన కమ్మి.

**జిట్టువ** వి. పక్షి విశేషం. హంస. 3.12.

**జిట్టె** వి. కమ్మికి ముందు సన్నగా నేసిన భాగం.

**జిట్టె(డు** చూ. జిట్ట[4].

**జిట్రేగి** చూ. జిట్ట[7].

**జిట్రేగు** చూ. జిట్ట[7].

**జిట్రేని** చూ. జిట్ట[7].

**జిడికిరించు** రూ. జిడిగిరించు. అ.క్రి. మోసపుమాటలాడు. స.క్రి. మోసగించు, కికురించు.

**జిడిగిరించు** రూ.చూ. జిడికిరించు. అ.క్రి. మోసపుమాటలాడు. స.క్రి. మోసగించు, కికురించు.

**జిడికిరింత** రూ. జిడిగిరింత. వి. 1. మోసపుమాట. ద్వి.హరిశ్చ. ఉ. 620 పం. ; 2. మోసం, కికురింత.

**జిడిగిరింత** రూ.చూ. జిడికిరింత. వి. 1. మోసపుమాట ; 2. మోసం, కికురింత.

**జిడుగు** వి. కాముతేనిగొడుగు. ఆం.భా. 2.193.

**జిడ్కడలి** చూ. జిడ్డు[1].

**జిడ్డ** వి. 1. కలత ; 2. తడబాటు.

**జిడ్డి** వి. 1. మోటుగుడ్డ. శృం.నై. 7.145 ; 2. దుప్పటి. విశ. మోటైన.

**జిడ్డిగిజ్జలి** వి. కల్లు తాగే తాటాకుపాయ.

**జిడ్డు**[1] వి. 1. నెయ్యి మొ. వాటిలోని మెరుగు. హరి.పూ. 5.194 ; 2. జిగురు, బందన. విప్ర. 2.29 ; 3. అనవసరపు పనులకు పోయి డబ్బు దండగ చేసుకోవటం ; 4. పనికాకుండా చేసేవ్యక్తి. విశ. 1. జిడ్డుకలిగిన. ఆము. 1.61 ; 2. స్నిగ్ధమైన, నున్నని. ఆం.భా. 2.256.

క. జిడ్డు. చమురు, జిగురు లేదా నూనెలా ఉన్న పదార్థం ; కుయి. జిందరు. జిగురు, గుగ్గిలం.

**జిడ్కడలి** రూ. జిడ్డుకడలి, జిడ్డుగడలి. వి. క్షీరసాగరం, పాలసముద్రం. పాండు. 3.151. **జిడ్డుకడలి** రూ.చూ. జిడ్కడలి. వి. పాలసముద్రం. అచ్చ.రా. యు. 403. **జిడ్డుకడలిబిడ్డ** వి. లక్ష్మీదేవి. వ్యు. పాలసముద్రపు కూతురు. **జిడ్డుకడలిబొట్టె** వి. లక్ష్మి. వ్యు. పాలసముద్రపు బిడ్డ. **జిడ్డుకడలియల్లు(డు(-అల్లు(డు)** వి. శ్రీమహావిష్ణువు. వ్యు. పాల సముద్రుని అల్లుడు. **జిడ్డుకిరవడు** అ.క్రి. తేటకలిగా ఏర్పడు. **జిడ్డుకొను** అ.క్రి. జిడ్డగు, జిడ్డుతేలు. పాండు. 4.253. **జిడ్డుగడలి** రూ.చూ. జిడ్కడలి. వి. పాలసముద్రం.

బహుళా. 4.31. జిడ్డుదేఱు(-తేఱు) అ.క్రి. జిగురగు, జిడ్డగు. జిడ్డునీర్వామి వి. పాలసముద్రం. అచ్చ.రా.బాల. 182. <జిడ్డునీరు+వామి. జిడ్డుపడు రూ. జిడ్డువడు. అ.క్రి. 1. దండగగు ; 2. జిడ్డుపట్టు. జిడ్డుపఱుచు స.క్రి. వ్యర్థంచేయు. హర. 2.132. జిడ్డువడు(-పడు) రూ.చూ. జిడ్డుపడు. అ.క్రి. 1. దండగగు ; 2. జిడ్డుపట్టు. జిడ్డువదలు అ.క్రి. ఖర్చగు, వెచ్చపోవు. జిడ్డుసంద్రపుటల్లుఁడు వి. విష్ణువు. వ్యు. పాలసముద్రపు అల్లుడు.

జిడ్డు² వి. వృక్ష విశేషం. హంస. 4.9.

జిడ్డువెంపలి వి. వృక్ష విశేషం హంస. 4.10.

జిత రూ. జితము. విశ. 1. అభ్యస్తమైన ; 2. అనుకూలమైన.

క. జిత. స్థిరం ;

సం. స్థిత-. ఉన్న.

జితపడు అ.క్రి. 1. అలవాటుపడు ; 2. అనుకూలపడు, జతపడు. జితపాటు వి. అభ్యాసం, అలవాటు. జితించు అ.క్రి. 1. అలవాటుపడు, అలవాటగు ; 2. జతపడు, అనుకూలమగు ; 3. జీర్ణించు.

జితము రూ.చూ. జిత. వి. దృఢం, స్థిరం ; 1. అంకపొంకాలు.

జితించు చూ. జిత.

జిత్తు¹ వి. 1. మోసం, మాయ. సారంగ. 3.84 ; 2. ఉపాయం. దశా. 9.355, ఆం.భా. 1.113.

సం. యుక్తి-. ఉపాయం ; ప్రా. జుత్తి. సాధనం, హేతువు ; యుత్తి. తగినది ; అమా. జత్తి. యుక్తి, సాధనం ;

క. జకుతి, జగుతి, జత్తి ; తు. జుకుతి ; మ. జుక్తి.

<ప్రా. జుత్తి.

జిత్తులకత్తె వి. మాయలాడి. రాధా. 1.36 పు. జిత్తులమారి వి. 1. జిత్తులు చేసే స్వభావం కలవాడు, వంచకుడు ; 2. ఉపాయశాలి ; 3. మోసకత్తె. జిత్తులవాఁడు విశ. వంచకుడు. ఆం.భా. 3.3.

జిత్తు² వి. 1. గోపాదం ; 2. నాలుగు అంగుళాలు.

జిదుగు వి. చిన్నమొత్తం, చిల్లర.

జిద్దాజిద్ది వి. పెద్దపోరాటం.

జిద్దు వి. 1. కలహం ; 2. కోపం ; 3. మొండిపట్టు.

సం. యుధ్. పోరాడు ; యుద్ధ-. పోరాటం ; హిం. జిద్(ద్). పట్టుదల, దురాగ్రహం ; మరా. జిద్. హఠము, పట్టుదల, ఆగ్రహం ; ఉ. జిద్(ద్). పట్టుదల, విరుద్ధం, వైమనస్యం ; పార. జిద్. విరుద్ధం, పట్టుదల ; అర. జిద్(ద్). పట్టుదల, దురాగ్రహం.

<ఉ. జిద్.

జిద్దుగొను(-కొను) స.క్రి. మార్కొను, ఎదుర్కొను. రంగా.చ. 2.40. జిద్దుసేయు(-చేయు) అ.క్రి. 1. మొండిపట్టు పట్టు ; 2. పోరాడు.

జిన్ వి. మద్య విశేషం.

ఇం. *Gin*. ధాన్యం లేదా మొక్కలనుంచి తయారుచేసిన మద్యం.

<ఇం. Gin.

జిన వి. పిట్టగుడ్డు సొన.

జినక వి. దంటుకు బంకపట్టే తెగులు.

జినస్సు రూ.చూ. దినుస్సు. వి. వస్తువు, సరుకు.

జినికి వి. జిగురుతేలి వాడకానికి పనికివచ్చే స్థితి.

జినిసీ విశ. వస్తుసంబంధమైన. రంగా.చ. 3.9.

ఉ. జిన్సీ, జింసీ. వస్తుసంబంధమైన, పదార్థసంబంధమైనది ; పార. జిన్సీ. సామాన్యమైన, సాధారణమైన, వస్తురూపమైన ; అర. జిన్స్.

<ఉ. జిన్సీ.

జినిసేదిసు వి. ఒకవిధమైన ఫిరంగి.

జినుఁగు రూ.చూ. జిలుఁగు. విశ. 1. సన్నని, మృదువైన. ద్వి. పరమ. వి. 5.428 పు. ; 2. స్థూలంకాని, సూక్ష్మమైన. అష్టమ. క. 1.49 పు. 4 పం. ; 3. చిన్న. వి. గుడ్డపేలిక.

జిన్కలంచు రూ.చూ. జింకలంచు. వి. జింకల ఆకారంలో డిజైను పడేటట్టు నేసినఅంచు.

జిన్గు రూ.చూ. జిలుఁగు. విశ. 1. సన్నని, మృదువైన ; 2. సూక్ష్మమైన ; 3. సున్నితమైన ; 4. చిన్న. వి. గుడ్డపేలిక.

జింవగాని వి. జీవితం.

హిం. జిన్దగానీ. జీవనం, ప్రాణం ; మరా. జిన్దగానీ ; ఉ. జిన్దహ్గానీ ; పార. జిన్దహ్గానీ ; అర. జిన్దహ్గానీ.

<ఉ. జిన్దహ్గానీ.

జిందగీ వి. 1. ప్రాణం ; 2. జీవితం.

హిం. మరా. ఉ. పార. అర. జిందగీ. జీవితం.

<ఉ. జిందగీ.

జిందఱ చూ. చిందఱ. వి. చిన్నజల్లు, తుంపర, తడిపొడి చినుకులు.

జిన్దానీకమ్మి రూ.చూ. జిమ్దానీకమ్మి. వి. ఒకరకం డిజైన్‌లో నేసిన కమ్మి.

జిన్న¹ రూ. దిన్నె². వి. వృక్షవిశేషం. రసిక. 6.84.

జిన్న² వి. ప్రతినిధి.

జిన్ని వి. చిన్నినేరేడు, క్షుద్ర జంబువు.

జిన్నిపళ్లు వి.బ.వ. నేరేడుపళ్ళు.

జిన్నెపండురంగు చూ. జిన్ని. వి. ఒకరకం నల్లరంగు, చాక్‌లెట్ రంగు.

జిన్సు రూ.చూ. దినుస్సు. వి. సరుకు, వస్తువు.

జిపె వి. జిడ్డుగల నేల.

జిప్ప వి. రెండంచులను కలిపే పళ్ళవంటి పనిముట్టు.

ఇం. *Zipper*, *Zip-fastener*. రెండంచులను కలిపే 'జిప్' అనే సాధనం.

<ఇం. Zip (fastener).

జిబిరేయు స.క్రి. చివ్వు, చెక్కు.

జిబిలి రూ. జీబిలి. వి. కర్దమలం, గుబిలి, గులిమి.

జిబిలిక రూ. జీబిలిక, జీబులుక. వి. ఒకరకం చీర, నిశాంశుక ; నాగబల. ఆం.భా. 2.56.

జిబులు వి. బంక, జిగురు.

జిబురుకొను స.క్రి. తురుము, కోయు.

జిబువాయు వి. జవ్వాజి, సంకుమదం.

జిబ్బటీ వి. గబ్బిలం. చంద్రభా. 3.48. వ్యు. పట్టిన చోటనే

అంటిపెట్టుకొని ఉండేది.

**జిబ్బడాయి** రూ. జిబ్బిడాయి. వి. గబ్బిలం. హంస. 3.12. వ్య. పట్టినచోటనే అంటిపెట్టుకొని ఉండేది.

**జిబ్బయిపోవు** చూ. జిబ్బు.

**జిబ్బి** రూ.చూ. సిబ్బి. వి. 1. మూకుడు ; 2. పళ్ళెం.

జిబ్బిరేకు వి. జల్లిమూకుడు, నగభాగం వరకు రంధ్రాలుండి గంజివార్చుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టి మూకుడు.

**జిబ్బిట** వి. గబ్బిలం, జిబ్బటి, జిబ్బడాయి.

**జిబ్బిడాయి** రూ.చూ. జిబ్బడాయి. వి. గబ్బిలం.

**జిబ్బు** వి. అంటుకొనటం, అంటిపెట్టుకొని ఉండటం, జైమిని భా. 1.25.

క. జిబ్బు.

జిబ్బయిపోవు అ. క్రి. మ్రాన్పడు, కొయ్యబారు.

<జిబ్బు+అయిపోవు.

**జిమా** రూ.చూ. జిమ్మా. వి. అధీనం, వశం, స్వాధీనం.

**జిమిడిక** వి. వాద్యవిశేషం, తప్పెట. హంస. 3.29.

**జిమీన్‌దారు** రూ.చూ. జమీందారు. వి. జమిందారు.

**జిమేదారి** రూ. జిమ్మేదారి. వి. బాధ్యత.

హిం. జిమ్మాదారీ. ఉత్తరదాయిత్వం ; ఉ. జిమ్మహ్‌దారీ. ఉత్తరదాయిత్వం.

<ఉ. జిమ్మహ్‌దారీ.

**జిమ్‌దానీకమ్మి** రూ. జిన్దానీకమ్మి. వి. ఒకరకం డిజైనులో నేసిన కమ్మి.

**జిమ్‌నేత** వి. కమ్మికి ముందు గిరలు పడేట్టు నేసిననేత.

**జిమ్మ**[1] వి. 1. నాలుక ; 2. నోరు.

సం. జిహ్వా. నాలుక ; హిం. జిబ్బా, జీభ్.

**జిమ్మ**[2] వి. చేప.

**జిమ్మ**[3] రూ.చూ. జిమ్మా. విశే. 1. మిక్కిలి, అధికమైన ; 2. అధీనమైన.

**జిమ్మదిరుగు(-తిరుగు)** రూ. దిమ్మతిరుగు. అ.క్రి. దిమ్మతిరుగు. భాస్క.రా.ఆరణ్య. 2.135.

**జిమ్మా** రూ. జిమా, జిమ్మ[3]. వి. అధీనం, వశం, స్వాధీనం.

హిం. జిమ్మా. బాధ్యత ; మరా. జింమా ; ఉ. జిమ్మా. ప్రజ్ఞ, ఉత్తరదాయిత్వం ; అర. జిమ్మహ్. బాధ్యత.

< ఉ. జిమ్మా.

**జిమ్ము** రూ.చూ చిమ్ము[1]. అ.క్రి. 1. (ద్రవవస్తువులు) జిర్రున పైకి ఉరుకు. జైమిని భా. 6.196 ; 2. అలుకు, సరిచేసేటప్పుడు పడుగు బాగా బిరుసెక్కడానికి గంజి చిలుకు. వి. కమ్మినేతలో జేనెడు చెరగు నేసిన తరవాత పెట్టిన జంట గిర.

పో. చూ. సం. జిప్. వినురు.

**జిమ్మేదారి** రూ.చూ. జిమేదారి. వి. బాధ్యత.

జిమ్మేదారిమాన్యం వి. గ్రామంలో న్యాయ విచారణాధికారికిచ్చిన భూమి.

**జిమ్మేదారు** వి. 1. పూచీపడేవాడు ; 2. భూమిదున్నేవాడు.

హిం.ఉ. జిమ్మేదార్. బాధ్యత వహించేవాడు.

<ఉ. జిమ్మేదార్.

**జియ** వి. జువ్వి, తలుపులు చేయడానికి తగిన కలపనిచ్చే పెద్ద చెట్టు.

**జియ్య**[1] రూ. జీయ, జీయ్య. వి. 1. శైవసన్న్యాసి. పండి. చ. 4.283 వ. ; 2. వాత్సల్యం, గౌరవార్థం. భాస్క. రా.యు. 394 ; 3. రాజు, ప్రభువు. రామాభ్యు. 5.204 ; 4. విష్ణుదేవాలయాధికారి. వైజ. 4.114 ; 5. దేవుడు. అచ్చ.రా.బాల. 8 ; 6. తండ్రి, కన్నవాడు. అచ్చ.రా. కిష్కిం. 93.

క. జీయ ; త. జీయ, జీయర్.

సం. దివ్య-, జీవ-.

<క. జీయ.

జియ్యలు వి.బ.వ. వేల్పులు, జేజేలు, అంకులు.

**జియ్య**[2] వి. మలం.

**జియ్యరు** వి. 1. ప్రభువు, నెల్లూరు శాసనం, ఒంగోలు. శా.సం. 51. క్రీ.శ. 1155 ; 2. వైష్ణవ సన్న్యాసి. క్రీడా. పీఠి. 53 వ. ; 3. విష్ణుదేవాలయాధికారి. పరమ. వి. 3.283.

త. జీయర్. వైష్ణవ సన్న్యాసి, ఆదర్శపురుషుడు.

<త. జీయర్.

**జిరంగు** వి. కొండల్లో తిరిగేదున్న.

**జిరతాడు** వి. మోటబొక్కెన తొండానికి కిందకట్టే చిన్నతాడు, తొండాపుతాడు.

**జిరబాజీ** రూ.చూ. జరబాజు. వి. జరీ. హంస. 5.359.

**జిరా** రూ. జిరాయి, జీరా. 1. కవచం, ఏనుగులకూ, గుర్రాలకూ పైన వేసే వస్త్ర కవచం. సిం.ద్వా. 8.71, రాజవా. 5.19 ; 2. బాణం. సారంగ. 2.128.

హిం. జిరహ్. కవచం ; మరా. జిరే, జిరే ; ఉ. జిరహ్, జిరిహ్ ; పార. జిర, జిరహ్, జిరిహ్.

<ఉ. జిరహ్.

జిరాకెంపుటంబారి వి. ఎర్రనిపట్టు అంబారి. జిరాగుఱ్ఱము వి. జీనుకట్టిన గుర్రం.

**జిరాయతి** రూ.చూ. జిరాయితి. వి. పల్లపునేల, దుక్కినేల.

**జిరాయతీ** రూ.చూ. జిరాయితి. వి. పట్టాభూమి, రైతు శిస్తు చెల్లిస్తూ దున్నుకొనే సొంత భూమి.

**జిరాయతీదారు** రూ.చూ. జిరాయితీదారు. వి. భూమి పట్టాదారు, భూమిపై పట్టాహక్కు కలిగినవాడు.

**జిరాయి** రూ.చూ. జిరా. వి. 1. కవచం ; 2. బాణం.

**జిరాయితి** రూ. జిరాయతి, జిరాయతీ. వి. 1. ఇనాము కానిది, రైతుల అధీనపు భూమి ; 2. పల్లపునేల, దుక్కినేల.

హిం. జిరాఅత్, జిరాయత్. వ్యవసాయ సంబంధి ; మరా. జిరాఈత్ ; ఉ. జిరాఅత్ ; పార. జిరాఅత్ ; అర. జిరాఅత్. కృషి, పొలానికి చెందిన.

క. జిరాయతు, జిరాయితు. వ్యవసాయానికి ఉపయోగించే భూమి.

<ఉ. జిరాఅత్.

**జిరాయితీహక్కు** చూ. జిరాయితి. వి. సేద్యం చేసుకొనే హక్కు.

**జిరాయితీదారు** రూ. జిరాయతీదారు. వి. భూమిపట్టాదారు.

హిం.ఉ. జిరాఅత్‌దార్. జిరాయతీ కలవాడు.

**జీరి** వి. సిరా నిచ్చే ఒకరకం చెట్టు (Semecarpus anacardium).

**జీరిమిరి** వి. ఒకానొక పిండివంట.

**జీరుపుణాతివాటాలు** వి.బ.వ. ఒక బాలక్రీడ.

**జీర్రకొమ్ము** వి. నిటారుగా సన్నగా ఉన్న కొమ్ము.

**జీర్రతీయు** అ.క్రి. నల్లకుండలు కాలేటప్పుడు త్వరగా కాల్పు రావడానికి రేవకి, రేవకి మధ్య రంధ్రాలు తీయు.

**జీఱ** రూ.చూ. జిఱ్ఱు. వి. తిరగటంలో ధ్వనికి అనుకరణం. జైమిని భా. 5.192.

**జీఱకొట్టు** అ.క్రి. 1. గిరికీలుకొట్టు. గౌ.హరి. 605; 2. 'జిరజిర' అనే ధ్వనిని చేయు. పారి. 5.13. **జీఱజీఱ** వి. తిప్పటంలో ధ్వనికి అనుకరణం. భాస్క.రా. అరణ్య. 2.125.

**జీఱ్ఱ** రూ.చూ. జిఱ్ఱు. వి. 1. తిరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 2. పలాకీ ఎద్దు; 3. బొద్దింక.

**జీఱ్ఱకాక** వి. లోహాలు ఎక్కువగా వేడి ఎక్కడం. **జీఱ్ఱజీఱ్ఱన** క్రి.విణ.క్రమ. 'జిర్ర' అనే ధ్వని కలిగేటట్లుగా. విష్ణు పు. 7.147. **జీఱ్ఱతిరుగు** రూ.చూ. జిఱ్ఱఁదిరుగు. అ.క్రి. దిమ్మెక్కి తిరుగు, గిరగిర తిరుగు. **జీఱ్ఱత్రాడు** రూ. జిఱ్ఱు త్రాడు. వి. పురిఎక్కించిన తాడు. గౌ.హరి.పూ. 1875 పం. **జీఱ్ఱఁదిరుగు(-తిరుగు)** రూ. జిఱ్ఱతిరుగు. అ.క్రి. దిమ్మెక్కి-తిరుగు, గిరగిర తిరుగు. భార. కర్ణ. 1.88, శృం. నై. 3.151. **జీఱ్ఱవోవు(-పోవు)** అ.క్రి. జిర్ర అనే ధ్వని చేత తిరుగుడుపడు, చైతన్యం తప్పు. పి.శకు. 3.115.

**జీఱ్ఱు** రూ. జిఱ, జిఱ్ఱ. వి. 1. తిరగటంలో ధ్వనికి అనుకరణం. కు.సం. 3.248; 2. గోరు మొ. పెరకటానికి అనుకరణం. భీమ. 6.65; 3. చీదటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. భోజ. 4.280; 4. ఎగయటం మొ. వాటికి అనుకరణం. చంద్రరే. 3.64; 5. చిమ్మట కూత.

**జీఱ్ఱుత్రాడు** రూ.చూ. జిఱ్ఱత్రాడు. వి. పురిఎక్కించిన తాడు. **జీఱ్ఱున** క్రి.విణ.క్రమ. ఆకస్మికంగా, చటాలున. **జీఱ్ఱునఁజీదు** స.క్రి. జిర్రు అనే ధ్వని కలిగేటట్లు చీదు. ధ్వన్యను. కాశ. 2.148. **జీఱ్ఱునఁదిగుచు** స.క్రి. చరాలున లాగు, ధ్వన్యను. కాశ. 3.115. **జీఱ్ఱుమను** అ.క్రి. అనహ్యం గొల్పు. < జిఱ్ఱు + అను.

**జిల[1]** వి. 1. దురద, తీపి. ఆం.భా. 2.129; 2. తడి.

కుయి. సిలిసలిఅవ. దురదపుట్టు, ఒళ్ళుజల్లుమను, జలదరించు.

**జిలకంద** వి. దురదపుట్టించే కంద. **జిలపుట్టు** అ.క్రి. 1. కొద్దిగా తడి కలుగు; 2. నస కలుగు.

**జిల[2]** వి. బతికి ఉన్న గొర్రె బొచ్చుకు ఉండే నిగనిగ.

**జిల[3]** వి. గోడ, ఆకుపెంకులున్న ఇళ్ళచూరు జారకుండా వాసాల చివర వేసిన బెజ్జంలో బిగించిన కొయ్యముక్క.

**జిలకరమొలకొలుకులు** చూ. జిల్కఱ. వి.బ.వ. గింజ మరీ సన్నంగా ఉండే మంచి రకం వడ్లు.

**జిలకరసన్నం** చూ. జిల్కఱ. వి. సన్నరకం ధాన్య విశేషం.

**జిలకఱ** రూ.చూ. జిల్కఱ. వి. కూరల్లో వాడే ఒక దినుసు.

**జిలకఱరాజనములు** రూ.చూ. జిలకఱరాజనాలు. వి.బ.వ. సన్నవడ్లు. **జిలకఱరాజనాలు** రూ. జిలకఱరాజనములు. వి.బ.వ. జీలకర్రలాగ ఉండే ధాన్య విశేషం. హంస. 4.128.

**జిలకఱ్ఱ** రూ.చూ. జిల్కఱ. వి. కూరల్లో వాడే ఒక దినుసు. హంస. 2.229.

**జిలగ** వి. వెలితి, లోటు, కొరత.

**జిలగరి** వి. ఒకానొక క్షుద్రజాతి.

**జిలజిల** వి. 1. నాలుక మొ. నవి చెమ్మగిల్లటంలో అయ్యే అనుకరణం. రసిక. 1.90; 2. వ్యాపించటంలో అయ్యే అనుకరణం. రంగా. చ. 3.187.

**జిలజిలమను** అ.క్రి. 1. చెమ్మగిల్లటంలో ధ్వన్యనుకరణం. రాధికా. 3.110; 2. వ్యాపించటంలో ధ్వన్యనుకరణం. < జిలజిల + అను. **జిలజిలలాడు** అ.క్రి. దురదపెట్టు. < జిలజిల + -లు + ఆడు.

**జిలమ** రూ. జిల్మ. వి. ఒకరకం పైరు.

**జిలమబుడుతలు** రూ. జిల్మబుడుతలు. వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **జిలమలు** రూ. జిల్మలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**జిలాబి** రూ.చూ. జిలేబి. వి. జంతికచుట్లు, సారెసత్తులు.

**జిలి** విణ. తియ్యని, కమ్మని.

**జిలిజాలిక** విణ. తియ్యని, కమ్మని.

**జిలితొగలరాజనములు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**జిలిబి** రూ. జీవిలి. వి. కర్దమలం, గుబిలి. సిం. ద్వా. 1.100.

**జిలిబిలి** విణ. 1. చిన్న. దశకు. 11.58; 2. అల్పమైన, కొంచెమైన, సూక్ష్మమైన. మార్క. 1.48, రం. రా. అరణ్య. 145 పు.; 3. శృంగారసంబంధమైన. భాగ. 10పూ. 770; 4. అవ్యక్తమధురమైన. మను. 2.27; 5. మనోహరమైన, ఇంపైన. విజయ. 3.225; 6. పదునైన; 7. నునుపైన; 8. అందమయిన; 9. దట్టమయిన; క్రి.విణ. 1. సొగసుగా. కువ. చ. 2.29; 2. మెల్లగా, మందంగా. పద్మ. 7.168. వి. 1. వాలపాశ్యా విశేషం, కొప్పు మీదపెట్టుకొనే ఆభరణ విశేషం. ఆం.భా. 2.147; 2. సన్న గళ్ళ పట్టు చీర; 3. రిబ్బను.

**జిలిబిలిచీర** వి. చిన్నచిన్న గళ్ళుగల సన్నని పట్టుచీర. **జిలిబిలిజల్లి** వి. పాపటబొట్టు, జడబిళ్ళ. **జిలిబిలిపోవు** రూ.చూ. జిలిబిలివోవు. అ.క్రి. ఒప్పు, వేడుకపడు. **జిలిబిలివోవు (-పోవు)** రూ. జిలిబిలిపోవు. అ.క్రి. 1. ప్రకాశించు, ఒప్పు. పండి. చ. 4.296; 2. సందడించు, అధికమగు. బసవ. 7పు. 519పం; 3. తమకపడు, తొట్రుపడు. శృం.నై. 7.103.

**జిలిబిలిక** చూ. జిబిలిక. వి. చీర, జిబిలిక.

**జిలుకర** వి. ఒకరకం పిండివంట.

**జిలుగక్షరాలు** చూ. జిలుగు[2].

**జిలుగు[1]** వి. స్వర్ణపుష్పి, వృక్షం. హంస. 4.10.

**జిలుగు[2]** వి. 1. చిక్కు. యయా. 2.73; 2. గొలుసు కట్టురాత; స.క్రి. అక్షరాల్ని గొలుసు కట్టుగారాయు.

క. గేఱు. గీరు, గీతలుగీయు ; కీఱు. గీచు, గోకు, కొడ. గి.చ్. (గి-చి). గీవడంతో మచ్చచేయు ; తు. కీరుని, గీరుని. గోళ్ళతోదెబ్బను కొద్దిగా గీచు ; గీచుని. కలంతో గీతలుపెట్టు ; త. కీఱు. గీకు, గీతలుగీయు, గిలికివ్రాయు, వ్రాయు ; కో. క్-ర. గీత ; గోం. కిర్. దెబ్బ ; కుయి. గిర. గీత, మచ్చ, గీకు ; పర్జి. గిర్. గీత, మచ్చ.

పో.చూ. సం. కిరక-. వ్రాతకాడు.

జిలుగక్షరాలు వి.బ.వ. గొలుసు కట్టుగా రాసినరాతలు. <జిలుగు + అక్షరాలు. జిలుగుబార్డర్ వి. అక్కడక్కడ చుక్కలుపడేట్టు చేత్తోరంగు అద్దిన అంచు. జిలుగువాన వి. తుంపరగా పడేవాన. జిలుగువ్రాత వి. గొలుసురాత.

జిలుఁగు రూ. జినుఁగు, జిన్గు, జిలువు, జిల్గు. వి. 1. సన్నని వస్త్రం, సూక్ష్మ వస్త్రం, మృదువైన వస్త్రం. రం. రా. బాల. 74పు. 29పం. ; 2. చెలువు. కవిరాజ. 1.192 ; 3. గుడ్డపేలిక ; విణ. 1. సాంద్రమైన, దట్టమైన. రం.రా. సుందర. 244 పు. 12 పం. ; 2. సూక్ష్మమైన, సన్నని, మృదువైన. మను. 3.83 ; 3. అల్పమైన, కొంచెమైన. పారి. 2.47 ; 4. ముద్దయిన. సారంగ. 1.10 ; 5. వాడియైన. శుక. 1.74 ; 6. చిన్న ; 7. మెత్తని.

క. జిణుగు, జిణుగు, జినగు, జినుగు. నాజూకు దనం లేదా సన్నదనం (నేత, దారం, పొడి, రాసే అక్షరాలు మొ. వాటిలా).

సం. జాలికా. మేలుముసుగు, స్త్రీలు ముసుగు వేసు కొనే వలవంటి వస్త్రవిశేషం.

జిలుఁగువన్నెలు రూ. జిల్గువన్నెలు. వి.బ.వ. వస్త్ర విశేషం. యయా. 4.122.

జిలువారు చూ. జిలువు.

జిలువు రూ.చూ. జిలుఁగు. వి. 1. చెలువు ; 2. అందం ; 3. సన్ననిబట్ట ; విణ. 1. ఇంపయిన ; 2. సన్నని ; 3. కొంచెమయిన ; 4. చిన్న.

జిలువారు విణ. అందమైన. శృం. నై. 1.5. <జిలువు + -ఆరు.

జిలే వి. జిల్లాలు, రెండు రకాలాల పరిమితి.

హిం. జిలా. ప్రాంతం, ప్రదేశం, జిలే. జిల్లాలు ; మరా. జిల్హా. ప్రదేశభాగం, జిల్లా ; ఉ. జిలా, జిల్అ. మండలం, కలక్టరు అధీనంలో ఉన్న భాగం ; అర. జిల్. జిలే. జిల్లాలు.

<ఉ. జిలే.

జిలేబి రూ. జిలాబి, జిలోబి, జిల్లేబి. వి. భక్ష్య విశేషం, జంతిక చుట్లు, తినటానికి తయారుచేయబడ్డ ఒకరకం తీపి పదార్థం.

హిం. జిలేబీ. తీపి భక్ష్యపదార్థం.

<హిం. జిలేబీ.

జిలోబి రూ.చూ. జిలేబి. వి. భక్ష్యవిశేషం.

జిల్కఱ రూ. జిలకఱ, జిలకఱ్ఱ, జిల్కఱ్ఱ, జీలకఱ, జీలకఱ్ఱ. వి. కూరల్లోవాడే ఒకదినుసు. రం.రా. బాల. 76పు. 8పం.

సం. జీరక-. జీలకర్ర ; ప్రా. జీరయ.

క. జీరగె, జీరిగె ; తు. జీరదరి, జీరిగె ; త.మ. చీరకమ్. కువి. జిల్లకరఱ్ఱ.

<సం. జీరక- + కఱ్ఱ.

జిల్కఱ్ఱ రూ.చూ. జిల్కఱ. వి. జీలకర్ర. కూరలోవాడే ఒకరకం దినుసు.

జిల్గు రూ.చూ. జిలుఁగు. విణ. 1. సూక్ష్మమైన, సన్నని, మోటు కాని. కాశీ. 3.118 ; 2. అల్పమైన, చిన్న. ఆము. 5.74 ; 3. (శిల్పంలో) సున్నితమైన. నీలా. 1.30 ; వి. 1. సన్నని బట్ట ; 2. అందం.

జిల్గునవ్వు వి. మందహాసం. ఉ.రా. 6.50. జిల్గువన్నెలు రూ.చూ. జిలుఁగువన్నెలు. వి.బ.వ. వస్త్రవిశేషం.

జిల్మ రూ.చూ. జిలమ. వి. ఒక దినుసుపైరు.

జిల్మబుడుతలు రూ.చూ. జిలమబుడతలు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. జిల్మలు రూ.చూ. జిలమలు. వి.బ.వ. ఒకరకం పప్పు.

జిల్ల[1] రూ. చూ. చిల్ల[1]. వి. 1. పిల్లలు ఆడుకొనటానికి ఉపయోగించే గుండ్రని రాతిముక్క ; 2. బిల్లగోడాటలోని బిళ్ళ, గోటిబిళ్ళ, తొక్కుడుబిళ్ళ ; 3. కపిలకాడికి కట్టిన వారిటిలో బానతొండపు తాటిని చొప్పించి బిగించే గట్టికొయ్య పుల్ల ; 4. గోడ, ఆకుపెంకు కప్పులున్న ఇళ్ళచూరు జారకుండా వాసాల చివర వేసిన బెజ్జంలో బిగించిన కొయ్యముక్క.

తు. మ. చిల్లు ; త. చిల్లు. రాతిముక్క, పిల్లలు ఆటల్లో ఉపయోగించే గుండ్రటి బిల్ల, చక్రం.

జిల్లజీర్కులు వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. యయా. 2.35.

జిల్ల[2] వి. 1. నేతలో నిలువుకు పనికివచ్చే నూలు ; 2. పడుగు పోగుల్లో కొంతభాగం ; 3. పట్టుదారం చుట్ట.

జిల్లపోసులు వి.బ.వ. అచ్చుబద్దె చివరి పోగులు సమంగా కోసి పడుగుపోగులకు అతికే పోగులు.

జిల్లపురుగు వి. బొద్దింక.

జిల్లా[1] వి. దేశంలో ఒక పరిమిత భాగం.

హిం. జిలా. ప్రాంతం, ప్రదేశం ; మరా. జిల్హా ; ఉ. జిల్అ ; అర. జిల్అ.

<ఉ. జిల్అ.

జిల్లా[2] వి. బొద్దిగ.

జిల్లాదారుడు వి. మండలాధికారి.

హిం. ఉ. జిలాదార్. జిల్లా అధికారి.

<ఉ. జిలాదార్.

జిల్లి వి. మాంసం మీద ఉండే సన్నని చర్మం. బసవ. 7.38.

సం. ఝిల్లి. ఈలపురుగు, మాడినఅన్నం.

జిల్లిమూకుడు రూ.చూ. జల్లిమూఁకుడు. వి. చిల్లులమూకుడు.

జిల్లీ వి. చిన్నతూటా, ఒకబాణసంచు.

జిల్లు వి. 1. కారటంలో ధ్వనికి అనుకరణం. భాగ. 8.252 ; 2. చల్లటంలో ధ్వనికి అనుకరణం. పెద్దనచాటువు ; 3. చలిని తెలిపే ధ్వనికి అనుకరణం ; 4. మందు మొ. మింగటం వల్ల నాలుక లోనికి లాగటంలో అయ్యే ధ్వనికి

అనుకరణం.

క. జిల్లు. చల్లని నీళ్ళు ముట్టుకున్నప్పుడు కలిగే అనుభవం; త. చిలుచిలు. చల్లదనాన్ని అనుభవించు, చల్లగా ఉండు; కువి. జిలి. చల్లని, చల్లదనం.

జిల్లుమను అ.క్రి. 1. నెత్తురు మొ. వెలికిఉబుకు; 2. ఒళ్ళు జల్లుమను.

**జిల్లెడు** రూ.చూ. జిల్లేడు. వి. అర్కం.

**జిల్లేడు** రూ. జిల్లెడు. వి. అర్కం. తెలుపుఊదారంగు పూలుకల్గి దూదినిచ్చే ఒకరకం చెట్టు (Calotropis gigntea).

జిల్లేడుకాయ వి. 1. జిల్లేడుకాయ ఆకారం కలిగిలోపల పూర్ణంకల పిండి వంట. కాశీ. 7.185; 2. జిల్లేడు యొక్క కాయ.

**జిల్లేదారు** వి. రెవెన్యూ ఇన్స్పెక్టరు.

హిం. ఉ. జిలేదార్. జిల్లాలలో పన్ను వసూలుచేసే ఉద్యోగి.

<ఉ. జిలేదార్.

**జిల్లేబి** రూ.చూ. జిలేబి. వి. భక్ష్యవిశేషం.

**జివ** వి. 1. కోరిక; 2. చాపల్యం.

సం. జవ-. వేగం, వడి.

<సం. జవ- (అర్థవిపరి.).

**జివజివ** వి. అవయవం యొక్క తిమ్మిరి.

క. జుమ్, జుమి, జుమ, జుము, జుమ్ము. చలి అనుభవిస్తున్నప్పుడు చేసే శబ్దానుకరణం, అవయవాన్ని ఒకేచోట ఉంచినప్పుడయ్యే తిమ్మిరికి అనుకరణం; జు.ర్ఘ్వ. నడచిన తరువాత పాదాలనొప్పిని, అలుపును వ్యక్తంచేసే శబ్దం; కొడ. జివ్-జివ్-ఇన్. నాగుపాముకాటుతో తిమ్మిరెక్కడం, (అవయవాలు) ముడుచుకు కూర్చోవడం వల్లలేదా ఎక్కువగా అలసి పోవటంవలన అయిన అనుభవం.

పో. చూ. సం. జవ-. వేగం.

**జివట** రూ.చూ. జిగట. వి. బంక, అతుక్కునే స్వభావం.

జివటమన్ను రూ.చూ. జిగటమన్ను. వి. బంకమన్ను, జిగురుగా ఉండేమట్టి.

**జివుక** రూ. జీవుక. వి. జతుక, చిపుకపిట్ట, గబ్బిలాయి.

సం. జతుకా. గబ్బిలం.

**జివపుత** వి. జీవించిన పుత్రులుకలది.

సం. జీవపుత్రా. జీవించిన పుత్రులుకలది; ప్రా. జీవపుత్త-.

<ప్రా. జీవపుత్త-.

**జివురు**[1] రూ.చూ. జిగురు[1]. వి. బంక.

**జివురు**[2] స.క్రి. కొడవలితో కర్రను నునుపుచేయు.

**జివ్వ(లు)** వి. మెడ, కుత్తుక, గొంతుక.

**జివ్వంకలువంగు** అ.క్రి. జివ్వుజివ్వున ఆడుతూపంగిపోవు. కు. సం. 9.113.

**జివ్వాడు** రూ. జవ్వాడు. అ.క్రి. కదులు, చలించు. రం. రా. యు. ద్వి. పరమ. వి. 4.291 పు.

**జివ్వి** రూ.చూ. జువ్వి. వి. జువ్వి. దర్వాజాలు, తలుపులు చేయడానికి తగినకలప నిచ్చే పెద్దచెట్టు.

**జివ్వు**[1] వి. వేడినీరోకటం వల్ల ఆకులు మొ. ముణగటానికి అనుకరణం. శృం. నై. 2.119; 2. ఎండటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. జైమిని భా. 8.101; 3. నీరు ఇగరటానికి అనుకరణం. కాళ. 3.50; 4. నరంమీద పుండు పెట్టే బాధను తెలిపే పదం.

జివ్వున క్రి. విశే. ద్రు. ఒక్కసారిగా, వడిగా.

**జివ్వు**[2] స.క్రి. చివ్వు, చెక్కు.

**జివ్వురు** వి. చిమడటంలో అయ్యే అనుకరణం.

**జిష్టికుండ** రూ.చూ. దిష్టికుండ. వి. దిష్టికుండ.

**జిష్టిబొమ్మ** రూ.చూ. దిష్టిబొమ్మ. వి. దృష్టిదోషం తగల కుండా పొలంలో ఏర్పరచిన బొమ్మ.

**జిస్టి** రూ.చూ. దిస్టి. వి. చెడుచూపు.

**-జీ**[1] రూ.చూ. -జి. ప్రత్య. 1. పూజ్యుల పేర్ల చివర వచ్చే గౌరవ వాచకం. రంగా.చ. 2.53; 2. బాబయ్య; 3. అయ్య.

**జీ**[2] వి. పారావత విశేషం. సారంగ. 1 117.

**జీగు** రూ. జీంగ. వి. జీలుగుగడ్డి, మెత్తటి కలప.

**జీగురు** రూ.చూ. జిగురు[1]. వి. బంధనం, బంక.

జీగురు(గండె (-కండె) రూ.చూ. జిగురు(గండె. వి. 1. జిగురు రాసిన కండె. యయా. 1.114; 2. వల.

జీగురుమను అ.క్రి. ఈసురోమను, జీగురులాడు. <జీగురు + అను. జీగురులాడు అ.క్రి. ఈసురోమను. <జీగురు + -లు + ఆడు.

**జీంగ** రూ.చూ. జీగు. వి. జీలుగు గడ్డి, మెత్తటి కలప.

**జీచి** వి. మిద్దె పంచ.

**జీజియా** రూ. జిజియా. వి. మహమ్మదీయ శాసకులు ఇతర మతస్థులపై విధించిన పన్ను. విశ్వే.శ. 57.

హిం. జజియా, జిజియా. ముస్లిం పరిపాలనలో ఇతర మతస్థులపై విధించే పన్ను; మరా. ఝుజియా. పన్ను; ఉ. జిజ్‌యా. ధర్మకరం. పన్ను; పార. జిజ్యత్. పన్ను, ఉపహారం; అర. జిజ్‌య్. పన్ను.

<ఉ. జిజ్‌యా.

**జీజిలి** వి. చెవి గులిమి.

**జీడ** రూ.చూ. చీడ. వి. కూరగాయలు, పెసర, పొగాకు మొ. చాల రకాల పైర్లకు పట్టే పేను లేక దోమ జాతికి చెందిన పురుగు, చీడ.

జీడపట్టు రూ.చూ. చీడపట్టు. అ.క్రి. 1. సస్యాదులకు పురుగు పట్టు; 2. పీడతగులు. జీడపురుగు రూ.చూ. చీడపురుగు. వి. కూరగాయలు, పెసర, పొగాకు మొ. రకాల పైర్లకు పట్టే పేను లేక దోమ జాతికి చెందిన పురుగు.

**జీడి** రూ. జీడియ[1], జీడె[1]. వి. 1. ముంత మామిడి, మామిడి మొదలైన వాటి తొడిమ మొదట ఉండే పాలు. పి.శకు. 3.190; 2. భల్లాతకి, నల్లజీడి. వేంక. పంచ. 4.522; 3. మామిడి టెంకలో ఉన్న పప్పు; 4. ఉష్ణ ప్రాంతాల్లో గుబురుగా పెరిగే చెట్టు.

క. కేర్, గేర్. నల్ల జీడిగింజ; తు. గేరు, కాయి, గేరె-కాయి, గేరు-కాయి. నల్ల జీడిగింజ; త. చేర్.

నల్ల జీడిచెట్టు; బేన్-కొళ్లై. నల్ల జీడిగింజ; చే-పాలమ్. నల్ల జీడిగింజ; మ. చేర్. నల్ల జీడిచెట్టు.

జీడిగింజ వి. అరుష్కరం, ముంత మామిడి గింజ. **జీడినిత్తిఅచ్చొత్తు** స. క్రి. ఓడిపోయాడని తెలపటానికి జీడితో జింక బొమ్మను ముద్రించు. **జీడిపప్పు** వి. జీడి మామిడి పప్పు, ముంత మామిడి పప్పు. **జీడిపాల** వి. వృక్ష విశేషం. హంస. 4.11. **జీడిపాలు** వి. (పశువు) ఈనకముందు పిసికితే వచ్చే పాలు. **జీడిపెట్టు** అ.క్రి. నల్లజీడి కాల్చి అంటించు. **జీడిపొప్పళి** వి. జోడు నామ్దారీ చీర మాదిరిగా నేసిన ఒక రకం చీర, రెండు ఎర్రపోగుల మధ్య ఒక నల్లపోగు పెట్టి నేసిన గళ్ళ చీర. **జీడిమామిడి** వి. పసుపు-ఎరుపు రంగు పళ్ళతో సముద్ర తీరాల్లో పెరిగే ఒక రకం చెట్టు, ముంత మామిడి, దీని గింజలు కాల్చి జీడిపప్పు తయారు చేస్తారు. హంస. 4.11 (Anacardium occidentate).

**జీడియ**[1] రూ.చూ. జీడి. వి. ముంత మామిడి.

**జీడియ**[2] రూ.చూ. జీడె[2]. వి. భక్ష్య విశేషం.

**జీడె**[1] రూ.చూ. జీడి. వి. ముంత మామిడి.

**జీడె**[2] రూ. జీడియ[2]. వి. భక్ష్య విశేషం. చెన్న బసవ. 3.73.

క. చీడె. చలువరాతి ఆకారంలో ఉండి నేతిలోగాని నూనెలోగాని వేయించిన ఒక విధమైన తీపి పిండి వంట; త. చీటు. వరిపిండితో చేసిన గుండ్రని చిన్న బిళ్ళ (భక్ష్యం); మ. చీటు. గుండ్రని రొట్టె లేదా కోడి గుడ్డుతో చేసిన అట్టు.

**జీడెం** వి. కోసుగా పేర్చిన పంట గడ్డికుప్ప.

**జీంద్రము** విణ. 1. తుచ్ఛమైన, నీచమైన. అహల్యా. 1.97; 2. కిందిదైన. వి. 1. దురవస్థ; 2. పీనుగు పెంట.

త. సింద్రమ్. తుచ్ఛ సంభాషణం.

**జీంద్రు** వి. ఝిల్లి క్రిమి పక్షి మొ. వాటి ధ్వనికి అనుకరణం. వాల్మీ. 2.82.

**జీంద్రుక** వి. ఝిల్లిక, ఈలపురుగు. ద్వి.పరమ. వి. 7.499 పు.

**జీతకాఁడు** చూ. జీతము.

**జీతగాఁడు** చూ. జీతము.

**జీతతావు** చూ. జీతము.

**జీతనాతములు** చూ. జీతము.

**జీతపట్టు** చూ. జీతము.

**జీతపురాళ్లు** చూ. జీతము.

**జీతభుక్తి** చూ. జీతము.

**జీతము** వి. వేతనం, సేవకులకు జీవనార్థం ఇచ్చే సొమ్ము, కూలి, సంబళిక. భార. సభా. 1.37.

సం. జీవిత-. జీవిక; ప్రా. జీఅణ-. జీవనం; పివిఅ. జీవనం.

క. జీత. సంబళం; కువి. జీతామి. వేతనం.

<సం. జీవిత-.

**జీతకాఁడు** రూ.చూ. జీతగాఁడు. వి. కూలివాడు, సేవకుడు. ఆం. భా. 2.288. **జీతగాఁడు (-కాఁడు)** రూ. జీతకాఁడు. వి. 1. కూలివాడు, సేవకుడు, ఆం. భా. 2.184; 2. కమతగాడు, పాలేరు. **జీతతావు** వి. జీవించటానికి ఇచ్చే దానం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 422. క్రీ.శ. 1269. **జీతనాతములు** వి.బ.వ. జీతబత్తెలు. రాజవా. 2.34. **జీతపట్టు** వి. జీవనాధారమైన స్థితి, స్థలం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 690. క్రీ.శ. 1139. **జీతపురాళ్లు** వి.బ.వ. జీతంగా వచ్చే రూపాయలు. **జీతభుక్తి** వి. జీవిత భుక్తి దానం, జీవించటానికి ఇచ్చే దానం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1188. క్రీ.శ. 1250. **జీతముచేయు** అ.క్రి ఉద్యోగమిచ్చు. **జీతముపెట్టనిబంటు** వి. జీతం లేకుండా సేవకునిలా పనిచేసేవాడు. **జీతముసేయు (-చేయు)** అ.క్రి. జీతమిచ్చు. కు.సం. 4.92. **జీతవర్తన** వి. జీతవృత్తి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 740. **జీతాలపాలము** వి. జీవనార్థం అనుభవిస్తున్న భూమి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 377.

**జీతవర్తన** చూ. జీతము.

**జీతాలపాలము** చూ. జీతము.

**జీతులు** వి.బ.వ. అభిలాషలు.

హిం. ఉ. జీత్. జయం, లాభం.

**జీదర** చూ. చీదర. వి. తడి పొడి చినుకుల వాన.

**జీన్** రూ.చూ. చీని. విణ. శిల్పంలో సున్నితమైన. హంస. 1.75.

**జీనగ** వి. పశువులకు వచ్చే జీర్ణకోశవ్యాధి, పేడ వెయ్యక పోవటం, కృశించిపోవటం ఈ వ్యాధి లక్షణాలు.

**జీనపటము** వి. దట్టీ, కాసె, నడికట్టు. విష్ణు పు. 6.303.

**జీనపట్టీ** వి. దట్టీ.

**జీనము** రూ.చూ. జానము. వి. గుర్రం పల్లానికి కిందవేసే మెత్త. ఆం.భా. 2.199.

**జీని** రూ.చూ. చీని. విణ. 1. శిల్పంలో సున్నితమైన. విజయ. 2.26; 2. నాణ్యమైన, పనితనంకల.

**జీనిగపని** రూ.చూ. జీనిపని. వి. కొయ్య బొమ్మలకు, దేవుని వాహనాలకు వేసే రంగుపని, బచ్చెన. **జీనిగలవాఁడు (-కలవాఁడు)** విణ. 1. బచ్చన వేసేవాడు; 2. చర్మకారుడు, ముచ్చివాడు. **జీనిగలవాళ్ళు (-కలవాళ్ళు)** విణ.బ.వ. అద్దకానికి పనికివచ్చే కొయ్య అచ్చులు చెక్కేవాళ్ళు. **జీనిగిరి** వి. జీలుగు, బొందు బెండు చెట్టు. **జీనిగిరివాఁడు** విణ. 1. ముచ్చివాడు, చర్మకారుడు; 2. కర్రబొమ్మలు మొ. చేసి రంగులు వేసేవాడు. **జీనిపని** రూ. జీనిగపని. వి. నగిషీపని, చెక్కడపు పని. **జీనిమద్ది** వి. మట్టి కప్పుగల గుండ్రటి ఇల్లు. **జీనిసరిపెణ** వి. మెడలోని చెక్కుడుపని చేసిన ఒకరకమైన గొలుసు. దశా. 7.127. **జీనిసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **జీనిసురఁటి** వి. శిల్పం చెక్కిన విసనకర్ర. వాల్మీ. 3.30.

**జీనీ** రూ.చూ. చీని. విణ. నాణెమైన, శ్రేష్ఠమైన. శుక. 2.549.

**జీను**[1] వి. క్షీరనైవేద్యం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 874 క్రీ.శ. 1377.

**జీను**[2] రూ.చూ. జానము. వి. 1. జానం, గుర్రంమీద వేసే పల్లం. వేమశ. 13; 2. ఎద్దులకు అలంకారంగా నడుం చుట్టూ వేసే తోలుపట్టీ.

**జీను**[3] వి. లంగరు. శుక. 2.11.

**జీనువ** రూ. చీనివాయి, జీనువాయి. వి. పక్షివిశేషం, లిక్కుపిట్ట. వేంక.పంచ. 4.404. వ్య. లంగరువంటి నోరు కలది. **జీనువముక్కలు** వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. **జీనువాయి** రూ.చూ. జీనువ. వి. పక్షి విశేషం. శశా. 2.98. లంగరువంటి నోరు కలది.

**జీనుగు** రూ.చూ. జీలుగు[1]. వి. బెండు బెండు చెట్టు.

**జీను(గ్రోవి(-క్రోవి)** వి. నాగసరం, సన్నాయి, పాములవాడు ఊదే బుర్ర.

**జీను(డు** వి. ముదునలి, ముదుక, ముసలి.

సం. జీర్ణ-. శిథిలమైన, ముదుసలి, చిరిగిన; ప్రా. జిణ్ణ-. చిరిగిన, జీర్ణమైన; పా. జిణ్ణ-, జిణ్ణక-. శిథిలమైన; అ. జీన్. చిరిగిన, శిధిలమైన; బెం. జీన; ఒ. జీన. మిక్కిలి పాతవైన; హిం. జీన్. మునలి, ముసలివాడు.

**జీప్** వి. ఒకరకపు చిన్న మోటారుశకటం.

ఇం. *Jeep*. చిన్న మోటారుశకటం.

< ఇం. Jeep.

**జీపుకాటుఅంచు** రూ. జీప్‌కాటిఅంచు. వి. రెండు వరసల్లో మొగ్గలు పెట్టి, మధ్యన కడ్డీ మాదిరిగా నేసిన అంచు.

**జీపురు** వి. పరక, పురిక అని పిలవబడే ఒకరకం గడ్డి.

**జీప్‌కాటిఅంచు** రూ.చూ. జీపుకాటుఅంచు. వి. రెండు వరసల్లో మొగ్గలు పెట్టి, మధ్యన కడ్డీ మాదిరిగా నేసిన అంచు.

**జీబి** రూ.చూ. జీబు[2]. వి. అరటిగెలలో ఉన్న కాయల పెడ.

**జీబితుంగ** చూ. జీబు[2]. వి. దట్టంగా పెరిగే కలుపుమొక్క.

**జీబిలి** వి. కర్ణమలం, గులిమి.

**జీబిలిక** రూ.చూ. జిబిలిక. వి. ఒకరకం బీర.

**జీబు**[1] వి. **1.** వస్త్రభేదం. సిం.ద్వా. 3.188; **2.** స్త్రీల కట్టు బట్ట, కోక, చీర. ఆము. 5.90; **3.** పురుషుని వస్త్రం, పంచె. వసు. 5.81; **4.** కొబ్బరి మొ. వాటి మొవ్వుల చుట్టూ ఉండే పీచు; **5.** కట్టుబాటు, మర్యాద; **6.** పందిరి.

ఉ. జీబ్, జేబ్, జేబు; పార. జేబ్, జీబ్, జైబ్. చొక్కా మెడయొద్దనున్న ఖాళీ జేబు; అర. జీబ్. జేబు.

< ఉ. జేబ్.

**జీబు**[2] రూ. జీబి. వి. **1.** గుంపు, సమూహం. కుప.చ. 2.131, విజయ. 1.75; **2.** తీగెలు అల్లుకోటానికి దోహదంగా పెట్టే దడి; **3.** ఎలువు సులువులకు ఉపయోగించే తాటిమట్ట పేడు; **4.** గుబురుగా ఉన్న పొర, తుప్ప; **5.** అరటి గెలలో వరుసగా ఏర్పడిన కాయల గుత్తి; విశ. **1.** గహనమైన, చొరరాని. ఆం.భా. 3 26; **2.** సాంద్రమైన, దట్టమైన. ఆం.భా. 3.54.

**జీబుకొను** అ.క్రి. **1.** తరుచగు. గౌ.హరి.పూ. 2232 పం.; **2.** మంచుపొగ కమ్ము; **3.** దట్టమగు.

**జీబుమట్ట** వి. కొయ్యతాపి.

**జీబులుక** రూ.చూ. జిబిలిక. వి. నాగబల, వృక్ష విశేషం.

**జీబ్ర** వి. కంచరగాడిద, చారలగుర్రం.

ఇం. *Zebra*. గాడిద లేదా గుర్రం జాతికి చెందిన జంతువు.

< ఇం. Zebra.

**జీమదారుముంత** వి. గంగలో కలపడానికి అస్తికల్ని తీసుకొని పోవడానికి వాడే మట్టిపాత్ర.

**జీయ** రూ.చూ. జియ్య[1]. వి. **1.** దేవుడు. బసవ. 6.278 పం.; **2.** తండ్రి; **3.** రాజు; **4.** మహంతి; **5.** బైరాగి.

**జీయహరి** రూ. జీహరి. వి. విష్ణువు.

**జీయ్య** రూ.చూ. జియ్య[1]. వి. ప్రభువు, అధికారి. E.I. సంపు. 5. శా.సం. 4. క్రి.శ. 1309.

**జీర**[1] రూ. జీఱ. వి. **1.** రేఖ, గీర. పి.శకు. 3.104; **2.** తొంభై రెండు పోగులు.

తు. గిసురి. పండ్లు మొ. వాటిపై తొక్కుతీయు; గోం. క్‌ర్, కీర్. దెబ్బ; కిల్‌వార్జ్. గీత; గిట్. గీత; కొండ. గిర్; కువి. లోకిగిరి, గ్రినై. కిందగీతగీయు; గిరి. గీత; నా. ఖీర్. గీర; గ. గీరి.

సం. చీర-. గీత.

**జీరలంచు** వి. గీరలంచు, వరసగా గీతలు పడేట్టు నేసిన అంచు.

**జీర**[2] వి. ఒకరకం చేప.

**జీర**[3] వి. కుసురుధ్వని, బొంగురు.

**జీరగ** వి. గుడ్లగూబ.

**జీరగుండు** వి. పందిరికి కట్టే పాదరసం బుడ్డి. సిం.ద్వా. 2.4.

హిం. జీర్, జీరా. పూలకేశరం.

**జీరంగి** వి. **1.** పేడపురుగు; **2.** కుమ్మరపురుగు.

**జీరా** రూ.చూ. జిరా. వి. కవచ విశేషం. ఆం.భా. 2.204.

**జీరాడు** చూ. జీరు[1].

**జీరాలు** వి.బ.వ. ఒకరకం ధాన్య విశేషం.

సం. జీర-, జీరక-. జీలకర్ర.

**జీరిగఇనాం** వి. వడ్లబత్తుడికిచ్చిన పారితోషికం.

**జీరియాడు** చూ. జీరు[1].

**జీరు**[1] అ.క్రి. జీరాడు, వేలాడు. భాగ. 10. ఉ. 803.

**జీరాడు** రూ. జీరియాడు. అ.క్రి. **1.** వేలాడుతూ దిగలాగు. పారి. 2.52; **2.** బట్టకొంగు మొ. నేల మొ. వాటి మీద పడి పొర్లు. సారంగ. 3.44. **జీరియాడు(-ఆడు)** రూ.చూ. జీరాడు. అ.క్రి. బట్టకొంగు నేలకు రాచుకొను, వేలాడు. **జీరుకొను** అ.క్రి. **1.** వేలాడు; **2.** జారు; **3.** తడబడు. **జీరులాడు** అ.క్రి. జీరాడు, వేలాడు. ఉ.రా. 3.78. < జీరు[1] + -లు + ఆడు. **జీరులువాఱు (-పాఱు)** అ.క్రి. జారు. కృ.శకు. 3.8. **జీరువాఱు(-పాఱు)** రూ. జీర్వాఱు, జీఱువాఱు. అ.క్రి. **1.** ప్రసరించు, వ్యాపించు. హర. 5.29; **2.** జారు. శృం.నై. 1.92; **3.** వేలాడు. కాశీ. 3.109. **జీర్వాఱు** రూ.చూ. జీరువాఱు. అ.క్రి. వ్యాపించు. కకుత్థ్స. 1.120. < జీరు[1] + పాఱు.

**జీరు**[2] వి. జీర, రేఖ. చం.పూ.రా. 2.4. స.క్రి. గీరు.

క. గీఱు. గీయు, గోకు, గీతలు లేదా చారలు గీయు; కీఱు. గీయు, గోకు; గీతు. గీత; గీకు. గీయు; కొడ. గి-చి. గీత గీసి గుర్తు చేయు; తు. కియని, గియని.

గీయు, గోళ్ళతో గాయంచేయు; కీరు, గీరు, గీఱు. గీయు; త. కీఱు. గీరు, గీతలు గీయు, గిలికి[వ్రాయు, వ్రాయు; కీరల్. గీరటం, గుర్తుపెట్టడం, గీతలుగీయటం; మ. కీఱు. గీత; కీఱుక. గీరు, గీతలుగీయు; కో. కీ.ర్. గుర్తు, గీత; గోం. కీర్. దెబ్బ; కుఇ. గీర. గుర్తు, గీయు; పర్జి. గీర్. గుర్తు; కొలా. కిర. గీత.

పో.చూ. సం. కిరక-. గీత.

**జీరుకాడు** చూ. జీరుకు.

**జీరుకు** రూ. జీర్కు. వి. 1. జారటం. చమ. 1.67; 2. స్ఖలనం, తొట్రుపాటు. ఆం.భా. 1.143. విణ. జరిగే(ది), జారే(ది).

**జీరుకాడు** అ.క్రి. 1. వేలాడు. కువ.చ. 2.64; 2. బట్టకొంగు నేలకు రాసుకొని వేలాడు. < జీరుకు + ఆడు. **జీరుకుపాటు** రూ. జీర్కుపాటు. వి. 1. తొట్రుపాటు. ఆం. భా. 1.143; 2. జారటం; 3. వేలాడటం. **జీరుకుబండ** రూ.చూ. జీర్కుబండ. వి. 1. జారుడురాయి. ప్రబంధ. 788; 2. జలవిహారంలో జారుతూ వినోదానికై ఉపయోగపడే బండి. **జీరుకుబండలు** రూ. జీర్కుబండలు. వి.బ.వ. బాలక్రీడా విశేషం. చంద్రాంగ. 1.42. **జీరుకుమన్ను** వి. నీరింకిన వెనుక పేరిన మన్ను. **జీరుకురాయి** రూ. జీరుకుఱాయి, జీర్కురాయి, జీర్కుఱాయి. వి. జారుడుబండ. హంస. 3.146. **జీరుకుఱాయి** రూ.చూ. జీరుకురాయి. వి. జారుడుబండ. **జీరుకులు** రూ. జీర్కులు. వి.బ.వ. జరుగుడాట, బాలక్రీడా విశేషం. **జీరుకువాఱు(-పాఱు)** రూ. జీర్కువాఱు. అ.క్రి. 1. జారు. రామాభ్యు. 6.128; 2. తడబడు.

**జీరుగు** రూ.చూ. జీలుగు[1]. వి. బొందుబెండు.

**జీరో** వి. సున్న.

ఇం. *Zero*. సున్న, రాశిలేనిది, సంఖ్యలేనిది, శూన్యం, ధన ఋణరాసుల్ని లెక్కించే ఆరంభ బిందువు.

< ఇం. Zero.

**జీర్కు** రూ.చూ. జీరుకు. విణ. జరిగే(ది), జారే(ది). ఉ. హరిశ్చ. 3.37. వి. 1. జారటం; 2. తొట్రుపాటు.

**జీర్కుపాటు** రూ.చూ. జీరుకుపాటు. వి. 1. తొట్రుపాటు; 2. జారటం; 3. వేలాడటం. **జీర్కుబండ** రూ. జీరుకుబండ. వి. 1. జలవిహారంలో జారుతూ వినోదించటానికి ఉపయోగపడే బండ. పారి. 4.38; 2. జారుడురాయి. **జీర్కుబండలు** రూ.చూ. జీరుకుబండలు. వి.బ.వ. బాలక్రీడావిశేషం. కాళిందీ. 1.32. **జీర్కురాయి** రూ.చూ. జీరుకురాయి. వి. జారుడుబండ. **జీర్కుఱాయి** రూ.చూ. జీరుకురాయి. వి. జారుడుబండ. **జీర్కులు** రూ.చూ. జీరుకులు. వి.బ.వ. జరుగుడాట, బాలక్రీడా విశేషం. **జీర్కువాఱు(-పాఱు)** రూ. చూ. జీరుకువాఱు. అ. క్రి. 1. జారు; 2. తడబడు.

**జీర్వాఱు** చూ. జీరు[1].

**జీఱ** రూ.చూ. జీర[1]. వి. జీర, గీర, చార, గీత, గీటు.

**జీలిక[1]** రూ.చూ. జీలుగు[1]. వి. బొందుబెండు.

**జీలిక[2]** వి. కల్లుతీసే ఒకచెట్టు.

**జీలికకల్లు** వి. ఒకజాతి మద్యం. కు. సం. 6.45.

**జీఱువాఱు(-పాఱు)** రూ.చూ. జీరువాఱు. అ.క్రి. తొలగు, ఓసరిల్లు.

**జీల** వి. 1. సాలెగూడు, బూజు; 2. చెమ్మవల్ల ఏర్పడిన మకిల.

**జీలకండమొల** వి. ఒకరకం కూరఅరటి.

**జీలకఱ** రూ.చూ. జిల్కఱ. వి. కూరల్లోవాడే ఒకరకం దినుసు. ఇందు. 6.47.

**జీలకఱ్రప్రాలు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

**జీలకఱ్ఱ** రూ.చూ. జిల్కఱ. వి. కూరల్లో వాడే ఒక దినుసు.

**జీలగ** వి. వృక్షవిశేషం.

**జీలగాకు** వి. జీలగచెట్టు ఆకు.

**జీలగాకు** చూ. జీలగ.

**జీలిగి** రూ.చూ. జీలుగు[1]. వి. జీలుగు, బొందు బెండు చెట్టు.

**జీలిగె** వి. జీర్ణకోశవ్యాధి, పేడ వెయ్యకపోవటం, కృశించిపోవటం ఈ వ్యాధి లక్షణాలు.

**జీలు[1]** వి. కథాశేషం, అనుబంధం.

**జీలు[2]** వి. 1. వాన కురిసి పొలంలో పారే నీటిప్రవాహం; 2. వాగు.

**జీలుగ** వి. తీగజీలుగ (Aeschynomena indica).

**జీలుగకాడ** వి. చిన్ని ఆకులుగల ఒకరకం మొక్క (Aeschynomena indica). **జీలుగబెండ** వి. నీటిలో పెరిగే ఒకరకం మొక్క. దీనితో బొమ్మలు మొ. అనేక ఆటవస్తువులు తయారు చేస్తారు (Aeschynomena aspera).

**జీలుగు[1]** రూ. జీనుగు, జీరుగు, జీలిక[1], జీలిగి, జీలువు[1]. వి. ఒకరకం చెట్టు (దీని కఱ్ర పూరిళ్ళ నిర్మాణంలో వాడతారు. దీని బెండుతో సగ్గుబియ్యం తయారుచేస్తారు). బొందుబెండు, దీర్ఘయష్టి. ఉ. హరి. 3.50 (Caryota urens).

**జీలుగు[2]** రూ.చూ. జీలువు[2]. వి. పక్షివిశేషం.

**జీలుపాకం** వి. మెత్తటి జిగురుపాకం.

**జీలుమోకు** వి. దొంగగొడ్డును పట్టుకోటానికి పిలుగాకట్టిన పొడుగుతాడు.

**జీలువు[1]** రూ.చూ. జీలుగు[1]. వి. దీర్ఘయష్టి, బొందుబెండు. నీతి. 70.

**జీలువు[2]** రూ. జీలుగు[2]. వి. పక్షివిశేషం. సుద. 3.194.

**జీవగఱ్ఱ** వి. 1. శ్రుతిని హెచ్చుతగ్గులు చేయడానికి వీణతీగల్ని చుట్టి తుదిపట్టున గుచ్చి ఉంచిన చెవివంటి బిరడా. క్రీడా. 1.136; 2. జీవనౌషధం, జీవాతువు. రామాభ్యు. 7.140, విజయ. 1.20.

సం. జీవ-. ప్రాణం, ఉసురు, మనుగడ. ప్రాణి.

< సం. జీవ- + కఱ్ఱ (మిశ్రస.).

**జీవదారుముంత** వి. చచ్చిన స్థలంలో ఇంటిదగ్గర పైన వేలాడగట్టే మట్టిపాత్ర.

సం. జీవ-. బ్రతుకు, ప్రాణం; దారు-. కొయ్య.

**జీవధనము** వి. గోవులు మొదలైన ఆస్తి. ద.హిం.శా. సంపు. 1. శా.సం. 358. క్రీ.శ. 1258.

సం. జీవ-. బ్రతుకు, ప్రాణం; ధన-. పైకం.

< సం. జీవధన- (అర్థవిపరి.).

**జీవనజ్యోతిచీర** వి. మూడేసిరంగులు పడుగుపేకల్లో పెట్టినేసిన నకిచీర.

సం. జీవన-. జీవిక, బ్రతుకు-తెరువు; జ్యోతి-. ప్రకాశం, తేజస్సు.

< సం. జీవనజ్యోతి- + చీర.

**జీవాలు** వి.బ.వ. పశువులు, అడవి జంతువులు.

సం. జీవ-. ప్రాణి.

< సం. జీవ- + -ము + -లు (అర్థవిపరి.).

**జీవాళము** వి. సారం, నిస్సు. అష్టమ.క. 5.231 పు. 6 పం.

సం. జీవల-. జీవయుక్తం.

హి. జీవాళ్; త. జీవాళమ్. తంబురాను మోగించే తీగ.

< సం. జీవల-.

**జీవాళ** వి. వీణ మొదలైనవాటి తీగ చక్కగా మోగటానికి తీగ కింద ఉండే పీసు. గౌ.హరి. పూ. 952 పం.

హి. జీవాళ్.

సం. జీవ- ప్రాణం, బ్రతుకు.

**జీవి** వి. సముద్రమట్టంలో, రాతినేలల్లో ముఖ్యంగా రాంపా కొండల్లో (Rampa hills) పెరిగే ఒకరకం చెట్టు (Ficus tomentosa).

సం. జీవిన్. ప్రాణి.

< సం. జీవిన్ (అర్థవిపరి.).

**జీవితమాడ** చూ. జీవితము.

**జీవితము** వి. 1. పన్ను లేకుండ బహుమానరూపంగా గాని, నిత్య జీవనమార్గానికి గాని ఇచ్చిన భూమి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 75. క్రీ.శ. 892 – 922; 2. జీతం. బార. ఆహ్వా. 2.158.

సం. జీవిత-. బతుకు.

< సం. జీవిత- (అర్థవిపరి.).

**జీవితమాడ** వి. రొక్కరూపంగా ఇచ్చిన జీతం. ద.హిం. శా.సంపు. 4, శా.సం. 1015. క్రీ.శ. 1084. సం. జీవిత-, బతుకు. < సం. జీవిత- + మాడ. **జీవితములుసేయు** స.క్రి. మాన్యం ఇచ్చు, జీతానికి పెట్టుకొని వారికి జీవనం ఏర్పరచు.

**జీవితవర్గము** వి. జీవిత వర్తనం, జీవితం, పన్ను లేకుండ జీవిత ఉపాధిగాగాని, పారితోషికంగాగాని, ఇచ్చిన భూమి లేక గ్రామం. నె.శా.పత్రి. 48, 49 పం. క్రీ.శ. 1145-1166.

సం. జీవిత-. బ్రతుకు; వర్గ-. సమూహం.

< సం. జీవితవర్గ- (అర్థవిపరి.).

**జీవిలి** రూ.చూ. జిలిబి. వి. పక్షిపిల్లం, గుబిలి. శుక. 3.44.

**జీవుక** రూ.చూ. జివుక. వి. పీకురాయి, చిపురురాయి, గచ్చిలం.

**జీవుడు** రూ.చూ. జిగుడు[1]. వి. బంక.

**జీహారి** రూ.చూ. జీయహారి. వి. నమస్కృతి.

**జుం** రూ.చూ. జుమ్ము. వి. 1. తుమ్మెదలు తేనెటీగలు చేసే ధ్వనికి అనుకరణం; 2. గాలివీచటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**జుకాయించు** స.క్రి. బాధించు, దండించు.

హిం. ఉ. జుకానా. వంచటం.

< ఉ. జుకా(నా) + -ఇంచు[3].

**జుంకపోగు** చూ. జుమికీలు. వి. చెవికిపెట్టుకొనే ఆభరణ విశేషం.

**జుంకాలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. స్త్రీలు చెవికిపెట్టుకొనే నగలు.

**జుజుఱు** వి. 1. గుబురు; 2. పాచితీగ.

**జుజుఱుకొను** అ.క్రి. 1. గుబురుకొను. కాశీ. 6.41; 2. పుంజుకొను; 3. గుంపుకట్టు, చెదరు.

**జుంజము** రూ. జుంజాము. వి. 1. జుంజురుకట్ట, దీపావళి నాటిరాత్రి బాలురు కాల్చి తిప్పే రెల్లు, విడవలి మొ. వాటి నిడుపైన సన్నకట్ట. కువ.చ. 1.95; 2. కాష్ఠదీపిక. ఆం. భా. 2.165.

సం. యుంజాన-. కలపటం, చేర్చటం; ప్రా. జుంజ-. జోడించు.

< ప్రా. జుంజ-.

**జుంజాము** రూ.చూ. జుంజము. వి. 1. జుంజురుకట్ట, దీపావళి నాటిరాత్రి బాలురు కాల్చితిప్పే రెల్లు, విడవలి మొ. వాటి నిడుపైన సన్నకట్ట; 2. కాష్ఠదీపిక.

**జుంజుం[1]** వి. తుమ్మెదలు చేసేధ్వనికి అనుకరణం. పరాహ. 9.148.

**జుంజుమ్మను** రూ. జుంజుమ్మురను. అ.క్రి. తుమ్మెదలు ధ్వనిచేయు. కకుత్థ. 3.81. **జుంజుమ్మనుకొప్పులు** వి.బ.వ. పూలపై వాలిన తుమ్మెదలు రేగి జుంజుమ్మని రొదచేసే కొప్పులు. హర. 7.139. **జుంజుమ్మురను** రూ. చూ. జుంజుమ్మను. అ.క్రి. తుమ్మెదలు ధ్వనిచేయు.

**జుంజుం[2]** వి. తిమ్మిరి, గగుర్పాటు.

కం. జుం, జుమి, జుయ, జుము, జుమ్మ, జుర్ప్రు, జొమ్మ, జోము; కొడ. జిమ్‌జిమిన్.

**జుంజుమ్మను** చూ. జుంజుం[1].

**జుంజుమ్మనుకొప్పులు** చూ. జుంజుం[1].

**జుంజుమ్మురను** చూ. జుంజుం[1].

**జుంజురుపురుగు** వి. ఉలవ, కంది, పెసర మొ. పైర్ల ఆకుతినే రెక్కలపురుగు.

**జుంజుఱించు** చూ. జుంజుఱు.

**జుంజుఱు** రూ. దుందుఱు. వి. 1. జుట్టు. ఆం. భా. 2.146. 2. జుంజురుకట్ట. విశే. చిపిరిగా ఉన్న, చెదరిన.

క. జుంజురు. చుట్టలు. చుట్టలుగా ఉన్న, చిక్కుగా ఉన్న.

**జుంజుఱించు** అ.క్రి. జుంజురుగాఅగు, చెదురు. కువ. చ. 4.209. **జుంజుఱుకట్ట** వి. వెలుతురు పుల్లలు మొ. వాటితో చేసిన దివిటీ, దీపావళినాడు కాల్చి తిప్పే గోగుపుల్లలకట్ట. **జుంజుఱుగొప్పు (-కొప్పు)** వి. చింపిరికొప్పు. ద్వి.హరిశ్చ. పూ. 562 పం. **జుంజుఱుదయ్యము** వి. కొరివిదయ్యం. **జుంజుఱుతల (-తల)** వి. చింపిరితల. పరాహ. 2.16. **జుంజుఱుపిశాచము** వి. కొరివిదెయ్యం. చంద్రాంగ. 6.93. **జుంజుఱుమీసము** వి. చింపిరిగా ఉండేమీసం. శుక. 2.412, చిత్రభా. 3.128. **జుంజుఱుమేను** వి. చెదరిన ఈకలు గల శరీరం. శృం. నై. 2.5. **జుంజుఱుసిక** వి. చింపిరి జుట్టు, కాకపక్షం.

జుట్ట రూ. జుట్టె, జుత్త, జుత్తె. వి. చాపబడిన బొటనవేలుకు చూపుడు వేలుకు మధ్యకొలత, ప్రాదేశం. జేన. పండి. చ. 5.384 ప.

జుట్టనవ్రేలజూపు స.క్రి. భయపెట్టడానికి చూపుడు వేలితో చూపు, భయపెట్టు <జుట్టనవ్రేలు + -ఆ + చూపు. జుట్టనవ్రేలు రూ.చూ. జుట్టవ్రేలు. వి. తర్జని, చూపుడువేలు. భార. ద్రోణ. 2.304. జుట్టవ్రేలు రూ. జుట్టనవ్రేలు, జుట్టినవ్రేలు, జుట్టివ్రేలు, జుట్టెనవ్రేలు, జుత్తనవ్రేలు, జుత్తెనవ్రేలు. వి. తర్జని, చూపుడువేలు. బసవ. 4.84 పం. క. సుటుమ్బె; త. చుట్టువిరల్. తర్జని. జుట్టెడు రూ.చూ. జుత్తెడు. వి. జేనెడు.

జుట్టార్చి చూ. జుట్టు¹.

జుట్టి వి. ఒకరకం పావురాయి.

జుట్టినవ్రేలు రూ.చూ. జుట్టవ్రేలు. వి. చూపుడువేలు, తర్జని.

జుట్టిలి చూ. జుట్ట. రూ. జుత్తిలి. వి. చాపబడిన చూపుడు వేలుకు బొటనవేలుకు మధ్యదూరం, ప్రాదేశం.

జుట్టివ్రేలు రూ.చూ. జుట్టవ్రేలు. వి. చూపుడువేలు, తర్జని.

జుట్టు¹ రూ. జుత్తు, జొత్తు². వి. 1. నెమలి, కోడి మొ. వాటిసిగ. దశకు. 9.31; 2. కొప్పు, సిగ. క్రీడా. 270; 3. వెంట్రుకల సమూహం, కేశపాశం. వి.బ.వ. వెంట్రుకలు. కువ. చ. 4.202.

సం. జూట-. ముడివడిన జుట్టు; ప్రా. జూడ-; హిం. జూడా; మరా. జూడా, జూడీ. జుట్టుముడి; పో. చూ. సం. చూడా; చూలా, చూలియా. జుట్టుముడి, కోడి జుట్టు.

క. జుట్టు, జుట్టు, జుట్లు; కొడ. జిట్టి; తు. జుట్టు; త. చూటు, చూట్టు; మ. చూటుక. తలపైధరించు; జుట్టు. కోడిజుట్టు; పర్జి. చూలు. కొప్పు; కొలా. జుట్టి; గ. చూడె. జడ; బ్రా. ఛోటీ.

<సం. జూట-.

జుట్టార్చి వి. తమలపాకార్చి, మధ్యభాగం గుమ్మటం లాగా ఉండి పైచివర మొనదేలి ఉండే ఆర్చి. <జుట్టు¹ + ఆర్చి. జుట్టుకట్ట వి. కుచ్చెల కట్ట, గూడునేసిన తరవాత పైకొనసన పెట్టే కట్ట. జుట్టుకమాను వి. తమలపాకార్చి, మధ్యభాగం గుమ్మటంలాగా ఉండి పైచివర మొనదేలి ఉండే ఆర్చి. జుట్టునట్టువ వి. నెమలి, మయూరం. జుట్టునట్టువతేజిజోదు వి. మయూర వాహనుడు, కుమార స్వామి. యయా. 2.44. జుట్టునట్టువపిట్ట వి. నెమలి. యయా. 4.13. జుట్టుపక్కి వి. నెమలి, పురిపిట్ట. జుట్టుపట్లు వి.బ.వ. జగడాలు. జుట్టుపిట్ట వి. నెమలి, శిఖావళం. జుట్టుపిట్టతాలుపు రూ. జుట్టుపిట్ట డాల్పు. వి. కుమారస్వామి. అచ్చ. రా. యు. 209. జుట్టుపిట్టతాల్పు రూ. చూ. జుట్టుపిట్టతాలుపు. వి. కుమారస్వామి. జుట్టుపిట్టలావు నెట్టింపుదాలుపు(-తాలుపు) వి.మయూరబర్హధారి, కృష్ణుడు. ప్రబంధ. 788. జుట్టుపులుగు రూ.చూ. జుట్టుబుల్గు. వి. నెమలి. జుట్టుపుల్గు రూ.చూ. జుట్టుబుల్గు. వి. నెమలి. జుట్టుపోలిగాడు రూ. జుట్టుపోలుగాడు. వి. 1. కేతిగాడు; 2. ప్రతిదానికి అడ్డు వచ్చే అనామకుడు. జుట్టుపోలుగాడు రూ.చూ. జుట్టుపోలిగాడు. వి. 1. కేతిగాడు; 2. ప్రతిదానికి అడ్డువచ్చే అనామకుడు. జుట్టుబాతు వి. నెత్తిపై కుచ్చుజుట్టుగల బాతు. జుట్టు మొరాబా వి. బయటికి తిరిగిన వంపులమీద బాణపు ములికి వంటి కొప్పుగల ఆర్చి. జుట్టుముడి వి. శిఖ. జుట్టుబులుగు రూ.చూ. జుట్టుబుల్గు. వి. జుట్టుపిట్ట, నెమలి. జుట్టుబుల్గు రూ. జుట్టుపులుగు, జుట్టుపుల్గు, జుట్టుబులుగు. వి. నెమలి, శిఖావళం. అచ్చ.రా. ఆరణ్య. 96. జుట్టులుముడిపెట్టు రూ. జుట్టులు ముడిపెట్టు, జుట్లు ముడిపెట్టు, జుట్లు ముడివెట్టు. అ.క్రి. తగాదాలు పెట్టు. జుట్టులుముడివెట్టు రూ.చూ. జుట్టులు ముడిపెట్టు. అ.క్రి. తగాదాలు పెట్టు. జుట్టుసెనగ వి. ఒకరకం వేరుసెనగ. జుట్లుపట్టుకొను అ.క్రి. పోరాడు, కొట్లాడు. జుట్లుముడిపెట్టు రూ.చూ. జుట్టులు ముడిపెట్టు. అ.క్రి. తగాదాలు పెట్టు. జుట్లుముడివెట్టు (-పెట్టు) రూ.చూ. జుట్టులు ముడిపెట్టు. అ.క్రి. జగడాలు పెట్టు.

జుట్టు² వి. గడ్డగొర్రు. కిటికీరెక్కను తెరచిఉంచే ఇనపకొక్కెం.

జుట్టుగు రూ.చూ. జుట్టుపు. వి. వృక్షవిశేషం.

జుట్టుపాకు చూ. జుట్టుపు. వి. ఒకానొక చెట్టు.

జుట్టుపు రూ. జుట్టుగు, జుట్టువు, దుట్టుగు, దుట్టుపు, దుట్టువు. వి. అజశృంగి, వృక్షవిశేషం. హంస. 4.10.

జుట్టువు రూ.చూ. జుట్టుపు. వి. వృక్షవిశేషం.

జుట్టె రూ.చూ. జుట్ట. వి. చాపబడిన చూపుడువేలు మధ్యవేలి మధ్యదూరం, జేన.

జుట్టెనవ్రేలు రూ.చూ. జుట్టవ్రేలు వి. తర్జని, చూపుడు వ్రేలు.

జుట్టెడు చూ. జుట్ట.

జుట్టేగు రూ. జుట్టేగె. వి. ఇబ్బళి, అడవుల్లో పెరిగే మహా వృక్షాల్లో ఒకటి.

జుట్టేగె రూ.చూ. జుట్టేగు. వి. ఇబ్బళి, అడవుల్లో పెరిగే మహా వృక్షాల్లో ఒక వృక్షం.

జుట్లుపట్టుకొను చూ. జుట్టు¹.

జుట్లుముడిపెట్టు చూ. జుట్టు¹.

జుట్లుముడివెట్టు చూ. జుట్టు¹.

జుడాయించు స.క్రి. జోడించు, రెంటిని కలుపు.

హిం.ఉ. జుడా(నా). కలియజేయటం.

<ఉ. జుడా(నా) + -ఇంచు³.

జుడిగింత చూ. జుడుగు.

జుడు రూ.చూ. జూడు. వి. గడ్డికుప్ప, కుచ్చెల.

జుడుగు రూ.చూ. జుణుగు. అ.క్రి. 1. అపసరిల్లు, తప్పుకొను. చంద్రాంగ. 2.91; 2. దాగు; స.క్రి. వంచించు, వంచించి పోవు. చంద్ర రే. 1.52; వి. 1. వంచన. అం.బా. 2.292; 2. దొంగతనం.

జుడిగింత రూ. జుణిగింత. వి. 1. జంకటం, కొంకటం; 2. దాగటం; 3. దొంగిలించటం; 4. తప్పుకొనటం.

జుణిగింత చూ. జుణుగు.

జుణిగింతవెట్టు చూ. జుణుగు.

జుణిగిపోవనిచ్చు చూ. జుణుగు.

జుణుగు రూ. జుడుగు, జునుగు. అ.క్రి. 1. అపసరిల్లు, తప్పు

కొను. రం.రా.అరణ్య. 182 ; **2.** దాగు. స.క్రి. వంచించు, వంచించిపోవు. కృ.శకు. 3.33. వి. **1.** అపహరణం, దొంగతనం. ప్రబంధ. 772 ; **2.** వంచన.

క. జుణుగు. ముకుళించు, తగ్గు, వెనక్కిపోవు ; త. చుణుంకు. అధిక నష్టంచేత అలయించు, ఆలస్యం చేయు, ఆటంకంగా వుండు.

పో.చూ. చుల్లి-. చిన్నదైన.

**జుటి(గింత** రూ.చూ. జుడి(గింత. వి. **1.** జంకటం, కొంకటం ; **2.** దాగటం ; **3.** దొంగిలించటం ; **4.** తప్పుకొనటం. **జుటి(గింతపెట్టు (-పెట్టు)** స.క్రి. వెనక్కిలాగు. పార్వ. 4.118. **జుటి(గిపోవనిచ్చు** స.క్రి. తప్పించుకొని పోనిచ్చు. కళా. 2.80. **జుణు(గుడు** వి. **1.** కుకురింప ; **2.** దాగటం.

**జుంటితేనియ** చూ. జున్ను¹.

**జుంటితేనె** చూ. జున్ను¹.

**జుంటిబిళ్ల** చూ. జున్ను¹.

**జుంటిమోవి** చూ. జున్ను¹.

**జుంటీ(గ** చూ. జున్ను¹.

**జుటారిచివ్వ** రూ. జుటారిసివ. వి. మగ్గం దండెదగ్గర నేత పడుగులో దూర్చిన చువ్వ.

**జుటారిసివ** రూ.చూ. జుటారిచివ్వ. వి. మగ్గం దండెదగ్గర నేత పడుగులో దూర్చిన చువ్వ.

**జుతికె** రూ.చూ. జతికె. వి. పట్టెడ, గొడ్ల మెడలకు అందానికి గాని, వాటిని కాడికి పూన్చడానికిగాని కట్టేకాడు లేక తోలు.

**జుత్త** రూ.చూ. జుట్ట. వి. చాపబడిన బొటనవేలుకు చూపుడు వేలుకు మధ్య కొలత, ప్రాదేశం.

**జుత్తనవ్రేలు** రూ.చూ. జుట్టవ్రేలు. వి. తర్జని, చూపుడు వేలు. ఆం.భా. 2.189. **జుత్తె(డు** రూ. జిట్టె(డు, జుట్టె(డు. వి. జేనెడు. ఆం.భా. 2.140.

**జుత్తిగ** రూ.చూ. జతికె. వి. పట్టెడ. గొడ్ల మెడలకు అందానికి గాని, వాటిని కాడికి పూన్చడానికిగాని కట్టే కాడు లేక తోలు.

**జుత్తిలి** చూ. జుత్త. రూ.చూ. జుట్టిలి. వి. చాపబడిన చూపుడు వేలుకు బొటనవేలుకు మధ్య దూరం, ప్రాదేశం.

**జుత్తు** రూ.చూ. జుట్టు¹. వి. **1.** చుట్టుగుడిసె కొప్పుదగ్గర బద్రెకు పైనవేసిన పెంటికట్టు ; **2.** కేశపాశం.

**జుత్తురవాకార్చి** వి. పొటమరించిన కొప్పుతో వంపులు వంకులుగా ఉండే అర్చి.

**జుత్తె** రూ.చూ. జుట్ట. వి. చాపబడిన చూపుడువేలు, నడిమి వేలు మధ్య ప్రదేశం.

**జుత్తెవ్రేలు** రూ.చూ. జుట్టవ్రేలు. వి. తర్జని, చూపుడు వేలు.

**జుత్తె(డు** చూ. జుత్త.

**జునపాలు** రూ.చూ. జులపాలు. వి.బ.వ. చెవులమీదుగా మెడ వరకు పెంచబడిన పెద్ద జుట్టు.

**జునహా** చూ. జులపాలు. వి. కేశపాశం.

హిం. ఉ. జుల్ఫ్. కేశపాశం ; పార. జుల్ఫ్. వంకీలు తిరిగిన జుట్టు.
< ఉ. జుల్ఫ్.

**జుని(పించు** చూ. జును(పు.

**జును(గు** రూ.చూ. జుణు(గు. అ.క్రి. **1.** అడలు, భయపడు. రాజ.చ. 5.32 ; **2.** దాగు. రామాభ్యు. 8.14 ; **3.** అపసరిల్లు, తప్పుకొను. వేం.మా. 3.55; **4.** పని చేయక పొద్దు పుచ్చు.

**జును(గుటీ(త** వి. మునిగి ఈదే ఈత, దాగుడీత. చంద్రాంగ. 4.246. < జును(గు + ఈ(త.

**జును(పు** చూ. జును(గు. స.క్రి. తొలగించు, తోలు. చెన్న బసవ. 4.338.

**జుని(పించు** స.క్రి. మోనగించు.

**జుంతియానా** వి. చిన్న పాషాణభేది, గిరిభువు.

**జుందరు** వి. రాగిపైరు గాలికి ఎండిపోయే తెగులు.

**జున్ను¹** వి.ఔ. **1.** తేనెపట్టు, ఈగలతో నిండిన తేనెపట్టు. భార. స్త్రీ. 1.19 ; **2.** ఆవు, గేదె మొ. ఈనిన రెండు మూడు రోజుల్లో పితికిన పాలల్లో బెల్లం లేక పంచదార మొ. వాటిని చేర్చి ఆవిరి మీద వండగా అయ్యే గడ్డ, జున్ను గడ్డ. పి.శకు. 1.135 ; **3.** తేనె రాజవా. 1.27 ; **4.** జున్ను పాలు.

క. జేను. తేనె.

**జుంటితేనియ** రూ.చూ. జుంటితేనె. వి. మధు విశేషం. ఒకరకం తేనె. యయా. 4.39. **జుంటితేనె** రూ. జుంటితేనియ. వి. ఒకరకం తేనె. పి.శకు. 1.98. **జుంటిబిళ్ల** వి. జున్నుగడ్డ. అచ్చ.రా.యు. 245. **జుంటిమోవి** వి. తేనె వంటి పెదవి. నీలా. 3.94. **జుంటీ(గ** వి. తేనెటీగ. భాగ. 7.437. **జున్నుగడ్డ** వి. జున్నుపాలు కాచిన గడ్డ. **జున్నుదిన్న యొట్టియవలె** అవ్వ. ద్రు. అపూర్వమైనదానిని అనుభవించిన తర్వాత సామాన్యమైన దాని మీద మనసు పోదనే టప్పుడు వాడే మాట. కు.సం. 8.160. < జున్ను¹ + తిన్న + ఒట్టియవలె. **జున్నుపాలు** రూ.చూ. జున్ను(బాలు. వి. గేదెగాని ఆవుగాని ఈనిన వెంటనే కొన్ని రోజుల వరకూ వచ్చే పాలు. **జున్నుపిల్లి** వి. పునుగుపిల్లి, గంధొతువు. **జున్నుబాలవంకెలు** వి.బ.వ. ఒకరకం బియ్యం. **జున్నుబిళ్ల** వి. జున్నుపాలు కాచిన గడ్డ. **జున్ను(బాలు** రూ. జున్నుపాలు. వి. ఆవు లేదా గేదె ఈనిన తర్వాత అయిదారు దినాల పాలు. **జున్ను(బ్రాలు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**జున్ను²** వి. ఒకానొక చేదుకట్టు.

**జుబికీలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. కర్ణాభరణ విశేషం.

**జుబురు** వి. గుబురు, గుంపు. విణ. దట్టమైన.

**జుబురుకొను** అ.క్రి. గుబురుకొను, గుంపగు, గుంపుకట్టు. కాశీ. 6.41.

**జుబేదారంగు** వి. **1.** లేతనీలం రంగు ; **2.** పాలరంగు.

**జుబ్బ** రూ.చూ. జుబ్బా. వి. **1.** మోకాళ్ళ దిగువ వరకు వేలాడే పొడవైన బొక్కా ; **2.** చేతులున్న బనీనులాంటి బొక్కా ; **3.** బాహు పురి.

**జుబ్బన** క్రి.విణ.ద్రు. వెంటనే, దబ్బున.

**జుబ్బా** రూ. జుబ్బ. వి. **1.** మోకాళ్ళ దిగువ వరకు వేలాడే

పొడవైన చొక్కా; **2.** చేతులున్న బనీనులాంటి చొక్కా; **3.** భుజం.

హిం.ఉ. జుబ్బా. మోకాళ్ళ దిగువ వరకు వేలాడే పొడవైన చొక్కా.

< ఉ. జుబ్బా.

**జుబ్బు** వి. పిప్పాడి మొ.నవి రాలేధ్వనికి అనుకరణం. కకుత్స్థ. 3.94.

**జుబ్బుడుకొఱ్ఱ** వి. ఒకరకం బియ్యం.

**జుమకాలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. చెవికి పెట్టుకొనే ఆభరణ విశేషం.

**జుమల** రూ.చూ. జుమాలా. వి. **1.** కలిపిన మొత్తం; **2.** కలయిక.

**జుమలా** రూ.చూ. జుమాలా. వి. కలిపిన మొత్తం.

**జుమలాయించు(-ఇంచు³)** స.క్రి. కలిసేటట్టు చేయు, కలుపు.

**జుమాయించు** స.క్రి. ఈడ్చిపట్టు, దెబ్బకొట్టు. యయా. 1.82.

హిం. జమానా. స్థిరపరచటం, దెబ్బకొట్టటం; ఉ. జమానా. దెబ్బ కొట్టటం.

< ఉ. జమా(నా) + -ఇంచు³.

**జుమాలపేరు** చూ. జుమాలా. వి. బంగారం గుళ్ళతో చేసే ఒక విధమైన హారం.

**జుమాలా** రూ. జుమల, జుమలా, జుముల, జుములా. వి. కలిపిన మొత్తం.

హిం. జుమ్‌లా. మొత్తం, కూడిక; మరా. జుమ్‌లా. సంఘం; ఉ. జుమ్‌లహ్. సమస్తం, సమగ్రం, సర్వం; పార. జుమ్‌లత్. మొత్తం, కూడిక.

< ఉ. జుమ్‌లహ్.

**జుమాలుమను** అ.క్రి. సొమ్మసిలు, మూర్ఛిలు.

**జుమికీలు** రూ. జుంకాలు, జుబికీలు, జుమకాలు, జుమికెలు, జూకాలు, జూకీలు. వి.బ.వ. కర్ణభూషావిశేషం, లోలకులు. భానుమ. 1 ఆ.

హిం. ఝుమ్‌కా, ఝూమ్‌కా, ఝూమ్‌క్. లోలకులు, చెవికమ్మలు; ఉ. ఝుమ్‌కా. పుష్పగుచ్ఛం, కర్ణాభరణం.

క. జుమకి, జుమికి, కర్ణాభరణం; త. చిమిక్కి.

< ఉ. ఝుమ్‌కా + -లు.

**జుమికెలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. కర్ణాభరణ విశేషం.

**జుమియ్యతు** రూ. జుమీయ్యతు. వి. సముదాయం, గుంపు.

ఉ. జుమ్‌ఈయత్. గుంపు, సమూహం.

< ఉ. జమ్‌ఈయత్.

**జుమీయ్యతు** రూ.చూ. జమియ్యతు. వి. సముదాయం, గుంపు.

**జుముల** రూ.చూ. జుమాలా. వి. కలిపిన మొత్తం.

**జుములా** రూ.చూ. జుమాలా. వి. కలిపిన మొత్తం.

**జుమోజు** వి. శర్కరా భేదం, నవాతు. ఆం.భా. **2**.251.

**జుంబము** రూ. జుంబాము. వి. **1.** అతిశయం; **2.** విజృంభణ.

**జుంబాము** రూ.చూ. జుంబము. వి. **1.** అతిశయం; **2.** విజృంభణ.

**జుమ్మ¹** వి. బంగారుపిచ్చుక, గిజిగాడు.

**జుమ్మ²** వి. అకస్మాత్తుగా కలిగే దిమ్మ.

క. జుం, జుమి, జుమ, జుము, జుమ్మ (జొమ్మ, జోము). జువ్వు; కొడ. జివ్‌జివిన్.

**జుమ్మకాఁడు** రూ.చూ. జుమ్మికాఁడు. వి. విటుడు, జారుడు.

**జుమ్మట** వి. గిజిగాడు.

**జుమ్మఁడు** చూ. జుమ్మికాఁడు. వి. విటుడు.

**జుమ్మరనూలు** వి. పురి ఎక్కువగా ఉండే నూలు.

**జుమ్మికాఁడు** రూ. జుమ్మకాఁడు. వి. విటుడు, జుమ్మికాడు. విక్ర. 7.124.

సం. యుగ్మ-. జంట; ప్రా. జుగ్గ-, జుమ్మ-. ఉభయం, యుగలం, సమరాశి; అ.మా. జుమ్మ-. జంట, మిధునం; హిం. జుగ్. జంట.

< ప్రా. జుమ్మ- + -కాఁడు.

**జుమ్ము** రూ. జుం. వి. **1.** ఈగలు మొ. మూగే ధ్వనికి అనుకరణం. మార్క. 2.155; **2.** తుమ్మెదలు మొ. వాటి మోత ధ్వనికి అనుకరణం. ద్వి.హరిశ్చ.పూ. 428 పం.; **3.** వాసన వ్యాపించటానికి, మనస్సు ఉద్రేకించటానికి, శరీరం జలదరించటానికి అనుకరణం. కువ.చ. 5.12.

**జురుకు** వి. చిక్క, సాంద్రత.

**జురుమానా** రూ.చూ. జుల్మానా. వి. చేసిన తప్పుకు శిక్షగా విధించే సొమ్ము.

**జురుమ్నా** రూ.చూ. జుల్మానా. వి. చేసిన తప్పుకు శిక్షగా విధించే డబ్బు.

**జుర్మానా** రూ.చూ. జుల్మానా. వి. జరిమానా, చేసిన తప్పుకు శిక్షగా విధించే సొమ్ము.

**జుఅకు** రూ. జుఱుకు². వి. **1.** ఉరుం, మేఘగర్జన; **2.** హుంకారం.

**జుఱుకు¹** వి. నెత్తురు చిమ్మటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**జుఱుజుఱుకు** వి. నెత్తురు మొ. లోపలినుండి వేగంగా పైకివచ్చే ధ్వనికి అనుకరణం. ఆము. 3.23. < జుఱుకు + జుఱుకు.

**జుఱుకు²** రూ.చూ. జుఅకు. వి. ఉరుము, మేఘగర్జన.

**జుఱుకులు** వి.బవ. చెట్లమీద ఉండే చీమలు.

**జుఱుజుఱుకు** చూ. జుఱుకు¹.

**జుఱ్ఱ** రూ.చూ. జుఱ్ఱు. వి. ఒకసారి తాగటానికి, పీల్చటానికి తగిన పరిమాణం, గుక్క, గుక్కిలి. చమ. 2.73.

**జుఱ్ఱగొను (-కొను)** రూ. జుఱ్ఱుకొను. స.క్రి. జుర్రుగా పీల్చు. ద్వి.హరిశ్చ.ఉ. 2566 పం.

**జుఱ్ఱు** రూ. జుఱ్ఱ. వి. **1.** పలచనిది గట్టిది కాని పదార్థాన్ని ఒకసారి తీసుకొని తాగేటప్పుడు, పీల్చేటపుడు కలిగే ధ్వనికి అనుకరణం. పండి. చ. 1.42 పు.; **2.** ఎక్కువ పలచనిదీ ఎక్కువ గట్టిదీ కాని పదార్థాన్ని తీసుకొని తాగటం లేక పీల్చటం. స.క్రి. మజ్జిగ మొ. వాటిని తాగు, పీల్చు. భీమ. 1.110.

క. జురుజురు, సుఱ్, సుఱ, సుఱి, సుఱుకు. ద్రవాలు పీల్చేటప్పుడయ్యే ధ్వని; తు. సురసురనె; త. ఉఱి, ఉఱించు. పీల్చు; మ. ఉఱించుక. పీల్చు; తొ. ఇఱ్ (ఇఱ్త్). (మత్తు పదార్థాలు) తాగు; కురు. సురుప్యస్, సురుప్నా. జుర్రు; పో.చూ. పర్జి. సురు-సురు-

కారకం. తినేటప్పుడయ్యే ధ్వని.

మూ.ద.ద్రా. *చుట్-, *ఉట్-.

<మూ.ద్రా. *చుట్.

**జుఱ్ఱుకొను** రూ.చూ. జుఱ్ఱుగొను. స.క్రి. (చేతితో లేదా నోటితో) ద్రవపదార్థాన్ని పీల్చు. **జుఱ్ఱునన్** క్రి.విశ.ప్రమ. వడిగా, జిఱ్ఱున, జఱ్ఱున. **జుఱ్ఱునఁగ్రోలు(-క్రోలు)** స.క్రి. జుర్రు మని ధ్వనిచేస్తూ ఆస్వాదించు. కళా. 6.128. **జుఱ్ఱువదను** వి. జుర్రటానికి వీలైన ద్రవం. హర. 2.121, పారి. 2.48.

**జులపాలు** రూ. జునపాలు. వి.బ.వ. చెవులమీదుగా మెడ వరకు వేలాడే జుట్టు.

హిం.ఉ. జుల్ఫ్. కేశపాశం ; పార. జుల్ఫ్. వంకీలు తిరిగిన జుట్టు.

<ఉ. జుల్ఫ్+-లు.

**జులమతీ** విశ. నల్లని.

ఉ. జుల్మత్. చీకటి.

<ఉ. జుల్మత్.

**జులమాన** రూ.చూ. జుల్మానా. వి. జరిమానా.

**జులమానా** రూ.చూ. జుల్మానా. వి. చేసిన తప్పుకు శిక్షగా విధించిన సొమ్ము.

**జులాయి**[1] వి. జువ్వాయి మోకు, బండికాడనుంచి పోలుగర్ర కిందుగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**జులాయితాడు** వి. జువ్వాయి మోకు, బండికాడినుంచి పోలుగర్ర కిందుగా డొలుపువరకు అమర్చిన తాడు. **జులాయి మోకు** వి. జువ్వాయిమోకు, బండికాడినుంచి పోలుగర్ర కిందుగా డొలుపువరకు అమర్చిన తాడు.

**జులాయి**[2] వి. తుంటరి.

మరా. ఝురా, ఝురావరా. సాహసవంతమైన, నిర్లక్ష్యమయిన ; పార. ఝుహ్రా.

**జులాయించు** అ.క్రి. **1.** సంశయించు ; **2.** ఊగు ; **3.** వణుకు ; **4.** తడబడు.

హిం.ఉ. ఝులా(నా). ఊపు.

<ఉ. ఝులా(నా)+-ఇంచు[3].

**జులిమి** రూ.చూ. జులుము. వి. దుండగం, అత్యాచారం. సుద. 4.66, ప్రబంధ. 217.

**జులుకు** వి. చిట్టె, నాగటిమోకు చివరవేసే ముడి.

**జులుమానా** రూ.చూ. జుల్మానా. వి. చేసిన తప్పుకు శిక్షగా విధించిన సొమ్ము.

**జులుమాయితాడు** రూ. చూ. జుల్మాయితాడు. వి. జువ్వాయి మోకు, బండికాడినుంచి పోలుగర్ర కిందుగా డొలుపువరకు అమర్చిన తాడు.

**జులుము** రూ. జులిమి, జుల్మ. వి. దుండగం, అత్యాచారం. ద్వి.హరిశ్చ.ఉ. 601 పం.

హిం. జుల్మ్. అత్యాచారం, అన్యాయం ; మరా. జులుమ, జులూమ. క్రూరపాలన, కఠిన శాసనం. ; ఉ. జుల్మ్. జబర్దస్తీ, అత్యాచారం ; పార. జుల్మ్. అణచటం, క్రూరత్వం ; అర. జుల్మ్. చెడుగా ప్రవర్తించటం, బలాత్కారం.

<ఉ. జుల్మ్.

**జులుముచేయు** రూ. జులుము సేయు. అ.క్రి. అధికారం చేయు, పెత్తనం చేయు. **జులుముసేయు(-చేయు)** రూ.చూ. జులుముచేయు. అ.క్రి. అధికారంచేయు, పెత్తనంచేయు.

**జులుమ్నా** రూ.చూ. జుల్మానా. వి. శిక్షగా విధించే డబ్బు.

**జులువ** విశ. ఉపశమితమయిన.

**జులువతనము** వి. ఉపశమనం.

**జుల్కి** వి. **1.** ముడత ; **2.** మెలి.

**జుల్మాన** రూ.చూ. జుల్మానా. వి. జరిమానా.

**జుల్మానా** రూ. జరిమానా, జురుమానా, జురుమ్నా, జుర్మానా, జులమాన, జులుమానా, జులుమ్నా, జుల్మాన. వి. అర్థ దండం, జరిమానా. జే.ప. 77.

హిం. జుర్‌మానా. అర్థదండం, డబ్బు ఇవ్వవలసిందిగా విధించే శిక్ష ; ఉ. జుర్మానా. అర్థదండం, శిక్షగా విధించే డబ్బు ; పార. జుర్మాన. శిక్షగా విధించే డబ్బు.

క. జులమాన, జులుమాను, జుల్మాన. జరిమాన.

<ఉ. జుర్‌మానా.

**జుల్మాయితాడు** రూ. జులుమాయితాడు. వి. జువ్వాయిమోకు, బండికాడినుంచి పోలుగర్ర కిందగా డొలుపువరకు అమర్చిన తాడు.

**జుల్మ** రూ.చూ. జులుము. వి. దుండగం, అత్యాచారం.

**జుల్లర** వి. సళ్ళు, తూర్పార పొయ్యకముందు ధాన్యంతో కలిసి ఉన్న పొల్లు.

**జుల్లరము** వి. మదించిన మగపంది గున్న.

**జువాయికర్ర** రూ.చూ. జువ్వాయికర్ర. వి. తొట్టికర్ర, తొట్టి అల్లకంకోసం బండి చట్రంనుంచి తొట్టి పీటవరకు ఉన్న పొడుగాటి కర్ర.

**జువాయితాడు** రూ.చూ. జువ్వాయితాడు. వి. జువ్వాయిమోకు, బండికాడి నుంచి పోలుగర్ర కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**జువాయిమోకు** రూ.చూ. జువ్వాయిమోకు. వి. కుంటెనమోకు, గుదిమోకు, బండికాడి నుంచి పోలుకర్ర (నొగల) కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**జువురు** రూ. జూరు. స.క్రి. రుద్దు, నీళ్ళు చల్లి నున్నబరుచు, గట్టిగా అలుకు.

**జువ్వ**[1] వి. **1.** పక్షి మొ. వాటికి పెట్టే ఉరి, ఉచ్చు ; **2.** ఒకరకం చేపవల.

**జువ్వ**[2] రూ.చూ. జువ్వి. వి. దర్వాజాలు, తలుపులు చేయటానికి తగిన కలప నిచ్చే పెద్దచెట్టు.

**జువ్వరించు** రూ. చువ్వరించు. అ.క్రి. విజృంభించు, చెలరేగు. పాంచాలీ. 2.58.

**జువ్వాడు** అ.క్రి. పణం ఒడ్డు, జూదమాడు.

**జువ్వాయికర్ర** రూ. జువాయికర్ర. వి. తొట్టికర్ర, తొట్టి అల్లకంకోసం బండిచట్రం నుంచి తొట్టిపీట వరకు ఉన్న పొడుగాటి కర్ర.

**జువ్వాయితాడు** రూ. జువాయితాడు. వి. జువ్వాయిమోకు, బండికాడి నుంచి పోలుగర్ర కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**జువ్వాయిమోకు** రూ. జువాయిమోకు, జువ్వాయ్‌మోకు. వి.

కుంటెనమోకు, గుదిమోకు, బండి కాడి నుంచి పోలుకర్ర (నొగల) కిందగా డొలుపు వరకు అమర్చిన తాడు.

**జువ్వాయ్‌మోకు** రూ.చూ. జువ్వాయిమోకు. వి. కాడి నుంచి పోలుగర్ర కిందుగా డొలుపు వరకు కట్టిన తాడు.

**జువ్వి** రూ. జువ్వ[2], జూవి. వి. ప్లక్షం, వృక్ష విశేషం. పి.శకు. 2.14 (Ficus infectoria).

క. జువ్వి; త. చువి; మ. చువన్నాల్; పర్జి. జూమెరి; కొలా. జువి.

మూ.ద.ద్రా., మూ.మ.ద్రా. *చు-ఇ/*చూ-ఇ.

**జువ్వికాయగడిచీర** రూ. జువ్వికాయిగడిచీర. వి. పావు అంగుళం వెడల్పు చిన్న గడిచీర. **జువ్వికాయిగడిచీర** రూ.చూ. జువ్వికాయగడిచీర. వి. పావు అంగుళం వెడల్పు గల చిన్నగడి చీర. **జువ్విదీవి** వి. ప్లక్షద్వీపం. **జువ్వినేరిడె** వి. ఒకరకం జబ్బు.

**జువ్వు** వి. 1. ఎగయటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ప్రభులిం. 3.75 పు. 14 పం.; 2. రాళ్ళు మొ. వాటిని విసరటంలోని ధ్వనికి అనుకరణం. విష్ణుపు. 1.176; 3. నీరు మొ. నవి ఇంకటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పరమ.వి. 4.157; 4. నలగగొట్టటంలో ధ్వనికి అనుకరణం. సీతా వి. 2.145.

**జువ్వున** క్రి.విశ.ద్రు. జివ్వున, వెంటనే, వడిగా.

**జూ** వి. జంతు ప్రదర్శన శాల.

ఇం. *Zoo*. జంతు ప్రదర్శన శాల.

< ఇం. Zoo.

**జూక** వి. పేముచువ్వ.

**జూకాయపుల్ల** వి. జువ్వికాయవంటి రంగు.

**జూకాయవన్నె** వి. గోరోజనంరంగు.

**జూకాలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. స్త్రీలు చెవికి పెట్టుకొనే నగలు.

**జూకీలు** రూ.చూ. జుమికీలు. వి.బ.వ. స్త్రీల చెవి నగలు.

**జూఁక** వి. 1. తత్తరపాటు. భీమ. 4.60; 2. కలత; 3. అక్కర.

సం. శోక-. దుఃఖం.

**జూఁకించు** అ.క్రి. తత్తరపడు. భీమ. 2.101.

**జూఁకించు** చూ. జూఁక.

**జూఁకురు** వి. 1. తొట్రుపాటు; 2. వెత; 3. తహతహ.

**జూచెక్క** వి. 1. మిద్దె చూరుకింద బిగించే, నగిషీపని చేసిన చెక్క; 2. చూరుచెక్క, పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క.

**జూజకత్తియ** చూ. జూజము.

**జూజకత్తె** చూ. జూజము.

**జూజకాఁడు** చూ. జూజము.

**జూజము** రూ.చూ. జూదము. వి. 1. ద్యూతం. బహుళా. 5.206; 2. మోసం.

**జూజకత్తియ** రూ.చూ. జూదకత్తె. వి. 1. జూదమాడే స్త్రీ; 2. మోసకత్తె. **జూజకత్తె** రూ.చూ. జూదకత్తె. వి. 1. జూదమాడే స్త్రీ; 2. మోసకత్తె. **జూజకాఁడు** రూ.చూ. జూదకాఁడు. వి. ద్యూతకారుడు, జూదమాడేవాడు. **జూజరి** రూ చూ. జూదరి. వి. 1. జూదగాడు; 2. మోసగాడు.

< జూజము + -అరి.

**జూజరి** చూ. జూజము.

**జూజి** వి. 1. దూతిక; 2. తార్పుకత్తె.

సం. దూతీ; ప్రా. దుఇ, దుఈ. సందేశహారిణి; దుచ్చిమ్. దూతికర్మ; శౌ.ప్రా. దూదీ; అ.మా. దూఈ; క. దూది, దూదు; త. తూతు.

< శౌ.ప్రా. దూదీ.

**జూజుగులు** వి.బ.వ. ఘట విశేషం.

**జూట** విశ. నేర్పరిఅయిన, సమర్థుడైన. నిరంకు, 2.34. వి. నేర్పరి, జాణ.

క. జూటు. శక్తి.

**జూటకాఁడు** వి. నేర్పరి. సిం.ద్వా. 8.22.

**జూటా** రూ. ఝూట, ఝూటా. వి. అనృతం, అబద్ధం. విశ. అబద్ధమైన, అసత్యమైన.

హిం.ఉ. ఝూఠ్[1]. అబద్ధం; ఝూఠా. అసత్యమైన, అనృతం.

< ఉ. ఝూఠా.

**జూటామాట** వి. అసత్యవాక్కు.

**జూటాకోరు** వి. దగాచేసేవాడు.

హిం.ఉ. ఝూఠాఖోర్. అసత్యాలు పలికేవాడు.

< ఉ. ఝూఠాఖోర్ (అర్థవిపరి.).

**జూటాడు** చూ. జూటు[1].

**జూటు**[1] వి. జిత్తులమారి, వంచకం. ప్రబంధ. 642.

హిం. ఉ. ఝూఠ్. అబద్ధం, అసత్యం.

< ఉ. ఝూఠ్ (అర్థవిపరి.).

**జూటాడు** స.క్రి. మోసంచేయు. రాజ వా. 3.52; త. సూదాడు. < జూటు + అడు. **జూటుకత్తియ** రూ. జూటుకత్తె. వి. వంచకురాలు. ద్వి.సార. చ. 2.31 పు. 19 పం. **జూటుకత్తె** రూ.చూ. జూటుకత్తియ. వి. వంచకురాలు, అబద్ధాల్ని చెప్పే స్త్రీ. వేంక. ఆం. 9. **జూటుఁడు** వి. 1. అసత్యవాది; 2. టక్కరి. **జూటుతనము** రూ.చూ. జూటుఁదనము. వి. (ఝూటా) మోసం. **జూటుఁదనము(-తనము)** రూ. జూటుతనము. వి. మోసం. ఆము. 4.61.

**జూటు**[2] వి. తివాసీ నేతలో అడ్డానికి వాడే నారదారం.

**జూడ** రూ.చూ. జూడు. వి. గడ్డికుప్ప, కుచ్చెల.

**జూడు** రూ. జుడు, జూడ, జూడెం. వి. కుచ్చెల, కంకులుపైకి వచ్చేట్లు పేర్చిన మొక్కజొన్న గడ్డికుప్ప.

**జూడెం** రూ.చూ. జూడు. వి. కుచ్చెల, కంకులుపైకి వచ్చేట్లు పేర్చిన మొక్కజొన్న గడ్డికుప్ప.

**జూద** రూ.చూ. జూదము. వి. బొంకు, కల్ల.

**జూదకత్తియ** చూ. జూదము.

**జూదకత్తె** చూ. జూదము.

**జూదకాఁడు** చూ. జూదము.

**జూదము** రూ. జాదు[3], జూజము, జూద, జూదు. వి. 1. ద్యూతం. భార.ఆది. 7.270; 2. జూదపుగడి. వేంక.పంచ. 4.456; 3. జూదం. అప్ప. 1.94; 4. మోసం.

సం. ద్యూత-; ప్రా. జూఅ, జూఅకరా, జూఅర,

జూఆరి, జూఅరిప. జూదరి ; శౌ. ప్రా. జూద-. జూదం ; పా. జూత.

క. జూజ, జూజు, జూదు. జూదం. జూదుంగార. జూదంఆడే చోటు ; కొడ. జూజి. జూదం ; త. చూతా ట్టమ్, చూతు. జూదం, చూతుక్కారన్. జూదరి ; మ. చూత, జూజి, జూజ. జూదం ; పర్జి. జూవ.

< శౌ.ప్రా. జూద-.

జూదకత్తియ రూ.చూ. జూదకత్తె. వి. 1. జూదమాడే స్త్రీ ; 2. మోసకత్తె. జూదకత్తె రూ. జూజకత్తియ, జూజకత్తె, జూదకత్తియ. వి. 1. మోసంచేసే స్త్రీ. శుక. 2.523 ; 2. జూదమాడే స్త్రీ. జూదకాఁడు రూ. జూజకాఁడు. వి. ద్యూత కారుడు. ఆం.భా. 2.304. జూదరి రూ. జూజరి. విశ. 1. జూదమాడే స్వభావం కల. భార. ఉద్యో. 3.353 ; 2. మోసగాడైన, వంచకుడైన. ప్రబంధ. 2.24 ; 3. మోస కత్తె. చెన్నబసవ. 2.24. < జూదము + -అరి. జూదరి కత్తియ రూ. జూదరికత్తె. వి. జూదమాడే స్వభావంకలది. ధనా. 2.63. జూదరికత్తె రూ.చూ. జూదరికత్తియ. వి. జూదమాడే స్వభావంకల స్త్రీ. జూదరిధర్మము వి. నమ్మ రాని ధర్మం. రాధి. 4.79.

జూదరి చూ. జూదము.

జూదరికత్తియ చూ. జూదము.

జూదరికత్తె చూ. జూదరి.

జూదరిధర్మము చూ. జూదము.

జూదు రూ.చూ. జూదము. వి. కల్ల. సాంబ. మాన. 49.

జూన్ వి. ఆంగ్ల సంవత్సరంలో ఆరోనెల.

ఇం. *June*. ఆంగ్ల సంవత్సరంలో ఆరో నెల.

< ఇం. June.

జూనియర్ విశ. చిన్న. వి. చిన్నవాడు, చిన్నది.

ఇం. *Junior*. చిన్న.

< ఇం. Junior.

జూపిడి వి. కమ్మలిల్లు, ఆకు కప్పుగల ఇల్లు.

జూబిలీ వి. హర్షసమయం, ప్రహర్షం, వార్షికోత్సవం.

ఇం. *Jubilee*. 50 ఏళ్ళ కొకసారి తమ విముక్తికి జ్ఞాప కార్థంగా చేసుకొనే ఉత్సవం, యాభయ్యో వార్షికోత్సవం, హర్షసమయం, ప్రహర్షం.

< ఇం. Jubilee.

జూబుగా క్రి. విశ. క్రు. దట్టంగా.

జూమాలు వి. జోడుహారం.

హిం.ఉ. జుమ్లా. మొత్తం, కూడిక, రెండు వస్తు వులు కలిసేచోటు.

జూరు రూ.చూ. జువురు. స.క్రి. రుద్దు, నీళ్ళు జల్లి నున్న బరచు, గట్టిగా అలుకు.

జూలాబార్డరు వి. ఏటవాలు గీరలుపడేట్టు నేసిన ఒకరకం అంచు.

జూలు[1] వి. 1. వస్త్రం చివర నేయకుండ విడిచే తంతు సము దాయం. మృత్యు. 3.84 ; 2. సింహం మొ. వాటి మెడ మీద వెంట్రుకలు ; 3. కొంగుచివరి పోగులు.

క. జూలు ; త. సువల్.

పో.చూ.సం. చూడా. శిఖ, జుట్టు.

జూలు[2] వి. 1. ఏనుగుమీద కప్పే కంబళి. రామాభ్యు. 7.38; 2. కుక్కకు కప్పే వస్త్రకపచం. రసిక. 1.106 ; 3. ఎద్దు వీపుమీద కప్పే చిత్రవస్త్రం.

క. జూలా. గుర్రాలకు కప్పే వస్త్ర కవచం.

జూలై వి. ఆంగ్ల సంవత్సరంలో ఏడోనెల.

ఇం. *July*. ఆంగ్ల సంవత్సరంలో జూలియస్ సీజర్ పేరిట వ్యవహారంలోకి వచ్చిన ఏడోనెల.

< ఇం. July.

జూవరము వి. 1. సంతాపం ; 2. వేడిమి ; 3. ఏకాగ్రత.

సం. త్రివ-. వాడిఐన, వేడి కల.

జూవి రూ.చూ. జువ్వి. వి. సముద్ర మట్టంలో, రాతినేలల్లో ముఖ్యంగా రాంపాకొండల్లో, గంజాంలో పెరిగే ఒకరకం చెట్టు, జువ్విచెట్టు (Ficus retusa or Ficus tomentosa).

జెగ రూ.చూ. జగా[1]. విశ. 1. పెద్ద ; 2. గొప్ప ; 3. ప్రశస్తమైన.

జెగబందు రూ.చూ. జేబందు. వి. అస్త్రకారి తాపి, కండెబద్ద, తాపీపనివాళ్ళు వాడేపరికరం.

జెగన్మోహిని వి. ఒకరకం చీరఅంచు.

సం. జగన్మోహినీ. ప్రపంచాన్ని మోహింప చేసే స్త్రీ, విష్ణువుయొక్క ఒకఅవతారం.

< సం. జగన్మోహినీ (అర్థవిపరి.).

జెగన్మోహినిపాప్పిళిచీర వి. ఒకరకం గడి చీర. జెగ న్మోహినీచీర వి. అంచులో అష్టదళపద్మంమాదిరి డిజైను నేసినచీర.

జెగన్మోహినీచీర చూ. జెగన్మోహిని.

జెగ్గిలెకాఁడు వి. 1. రథికుడు, సాది ; 2. సారథి.

జెగ్గు[1] రూ.చూ. జగ్గు[1]. వి. తొండం ఉన్న కూజాలాంటిపాత్ర, జగ్గు.

జెగ్గు[2] వి. వాద్య విశేషం.

జెంకునెరిడె వి. పశువులకు వచ్చే ఒక జబ్బు.

జెంకులు వి.బ.వ. బొంతజెముడు చెట్లు.

జెజాయి రూ. జజాయి, జజాయీ, జఘాయీ, జైజాయీ. వి ఒక విధమయిన ఫిరంగి. రంగా. చ. 1.157.

హిం. ఉ. పార. జజాఇల్. ఒకరకమైన పెద్దఫిరంగి.

< ఉ. జజాఇల్.

జెట వి. తొంభయిరెండుపోగులనూలు.

సం. జటా. జడ.

< సం. జటా.

జెటబట క్రి. విశ. క్రు. త్వరత్వరగా.

జెట్ట వి. 1. గోరుచుట్టు ; 2. జెష్ట, దరిద్రదేవత ; 3. చెడుగు ; 4. జాలితేమి.

సం. జ్యేష్ఠా. దరిద్రదేవత ; ప్రా. జేట్ఠ-, జిట్ఠా-. పెద్ద ; పా. జేట్ఠ-. ముఖ్యమైన, పెద్ద.

< ప్రా. జేట్ఠ-.

జెట్టానజెట్టు చూ. జెట్టి.

జెట్టి రూ. జెట్టీ. వి. 1. మల్లుడు, సాము చేసినవాడు. భార. విరా. 1.81 ; 2. శూరుడు, యోధుడు. భార. భీష్మ.

3.177; **3.** శ్రేష్ఠుడు. భాగ. 10 ఉ. 6.92; **4.** పందెం కోడిపుంజు; **5.** ఒకరకం వేటకుక్క.

సం. జ్యేష్ఠ-. మిక్కిలి శ్రేష్ఠమైన, పెద్ద; ప్రా. జేట్ఠ-, జెట్ఠ-. శ్రేష్ఠత, ప్రధానత, అతిశయం, ఆధిక్యం.

క. జట్టి, జెట్టి. మల్లుడు; జట్టిగ, జెట్టిగ; తు. జెట్టి. మల్లుడు; త. చెట్టి. సామాను చేసినవాడు; మ. చేష్టన్. అన్న.

< ప్రా. జేట్ఠా.

**జెట్టానజెట్లు** వి.బ.వ. జగజెట్లు. భార. ఉద్యో. 4.425. **జెట్టికాఁడు** వి. **1.** మల్లుడు; **2.** పందెం కోడిపుంజు; **3.** ఒకరకం వేటకుక్క. **జెట్టిపట్టు** వి. మల్లయుద్ధం. **జెట్టిపెనకువ** వి. మల్లయుద్ధపుపట్టు, కుస్తీ. **జెట్టిపోరు** వి. మల్లయుద్ధం. **జెట్టిమబ్బు** వి. ఎర్రటి మేఘం. **జెట్టిమల్లుఁడు** వి. ఉత్తముడైన మల్లుడు. భార. విరా. 1.223. **జెట్టిమిడత** వి. పెద్దమిడత. **జెట్టివాఁడు** విశ. మల్లుడు. శుక. 2.357.

**జెట్టిగ** విశ. శ్రేష్ఠుడైన. వి. మల్లుల్లో మేటి.

క. జెట్టిగ. మల్లుడు.

< క. జెట్టిగ.

**జెట్టిగవీరులు** వి.బ.వ. జెట్టీలు, గట్టివీరులు. కు. సం. 11.151.

**జెట్టీ** రూ.చూ. జెట్టి. వి. మల్లుడు, వస్తాదు.

**జెట్టున** క్రి. విశ. ద్రు. త్వరగా, చట్టున.

**జెడ** రూ.చూ. జడ. వి. **1.** అంటుకుపోయిన రుష్యాదుల జుట్టు. తాళ్ల. శృం. సం. 28; **2.** రెండులడీల నూలు; **3.** నేతకు అవసరమైనంత నూలు; **4.** జడమాదిరిగా అల్లిన నారపాయ; **5.** మూడుకాని అంతకంటె ఎక్కువ కాని పాయలతో అల్లిన జుట్టు.

**జెడకమలం** వి. ఒకరకం అంచు డిజైను. **జెడపత్తి** రూ.చూ. జడప్రత్తి. వి. విత్తులు జెడలు జెడలుగా ఉండే పత్తి. **జెడబొంబాయిజొన్న** వి. షోలాపూరు నుంచి తెచ్చిన ఒకరకం జొన్న.

**జెడల** వి. పొలి, బట్టీ మొదలు పెట్టేటప్పుడు ఇచ్చే బలి.

సం. జడతా. కదలిక లేమి.

< సం. జడతా (అర్థవిపరి.).

**జెడ్జి** రూ.చూ. జడ్జి. వి. న్యాయాధిపతి.

**జెడ్డ** రూ.చూ. జడ్డ[2]. వి. వర్ణద్విత్వం, ఒక అక్షరం కింద అదే అక్షరం ఉండటం.

**జెండా** రూ. ఝుండా. వి. టెక్కెం, ధ్వజం. కవిరా. 2.8.

సం. ధ్వజదండ-. పతాకం; ప్రా. ఝుఅండ; హిం. ఉ. ఝుండా; మరా. ఝెండా.

< ఉ. ఝుండా.

**జెండాకుచ్చు** వి. పతాకకుచ్చు. **జెండాగడి** వి. ఒకరకం నేతగడి. **జెండాపీకుకొనిపోవు** అ.క్రి. కాపురమెత్తివేయు.

**జెతకట్టు** చూ. జత. వి. సరెంటి, చుట్టచుట్టిన పడుగునూలు.

**జెన** వి. **1.** గుడ్డులో ఉండేనీరు వంటి పదార్థం. ఆము. 4.177; **2.** గుడ్లసమూహం. ఆం. భా. 2.99.

క. జనె. గుడ్డులోఉండే నీరువంటి పదార్థం, సౌన, జంతుగర్భం; తు. తనె, సనె. గర్భందాల్చు, జంతువులు మొదలగు వాటినిపెంచు; త. చనై. గర్భం, పూర్తిగా పరిణతి చెందిన గర్భస్థపిండం, గుడ్లుపెట్టు; చనైప్పు. గర్భందాల్చు; మ. చన. గర్భం; చనెక్క. పశుగర్భం.

**జెనయు** స.క్రి. తాకు, ఢీకొను.

**జెనవరి** రూ.చూ. జనవరి. వి. ఆంగ్ల పంచాంగం ప్రకారం సంవత్సరంలో మొదటినెల.

**జెనిగె** వి. తూము, మోట బొక్కెనపైన మోకు తగిలించే చిల్ల దూర్చిన ఇనపరింగు.

**జెంత** రూ.చూ. జంత[1]. వి. ధూర్తురాలు.

**జెంతర్** చూ. జంత్రము. వి. పన్నెత్తయాకీలో వాడే కొయ్య పనిముట్టు.

**జెంతు** వి. **1.** తెలుగువాడు; **2.** తెలుగుభాష.

పో. జెంతియు. క్రైస్తవేతరుడు, అవిశ్వాసి, హిందువు; స్పా. జెంతిల్. క్రైస్తవేతరుడు.

< పో. జెంతియు.

**జెందెము** రూ.చూ. జందెము. వి. యజ్ఞోపవీతం. తాళ్ల. 4.146.

**జెపజెప** రూ.చూ. జెప్పజెప్ప. క్రి. విశ. ద్రు. త్వరత్వరగా.

**జెప్పజెప్ప** రూ. జెపజెప. క్రి. విశ. ద్రు. త్వరత్వరగా.

**జెప్పన** క్రి. విశ. ద్రు. త్వరగా.

**జెబర** వి. పిల్లకొమ్మ, చెట్టుశాఖ.

**జెబరదస్తీ** రూ.చూ. జబరదస్తీ. వి. మోటుతనం.

**జెబ్బ** రూ.చూ. జబ్బ[1]. వి. పశువుల తొడ.

**జెబ్బకుంట** వి. జెబ్బవాపు, ముందరిగూడలు వాయటం. **జెబ్బవాపు** రూ. జెబ్బాపు, జెబ్బోపు. వి. జెబ్బకుంట, ముందరిగూడలు వాయటం. **జెబ్బాపు** రూ.చూ. జెబ్బవాపు. వి. జెబ్బకుంట, ముందరిగూడలు వాయటం. **జెబ్బోపు** రూ.చూ. జబ్బవాపు. వి. జెబ్బకుంట, ముందరిగూడలు వాయటం.

**జెబ్బాపు** చూ. జెబ్బ.

**జెబ్బోపు** చూ. జెబ్బ.

**జెముడు** రూ.చూ. జెముడు. వి. **1.** జెముడు చెట్టు. ఆం.భా. 2.56; **2.** కంచె కంపగాను, ఇంధనంగాను, వైద్యానికి పనికి వచ్చే ఎడారి మొక్క (Euphorbia tirucalci).

**జెముడుకాకి** వి. ఒకరకం కాకి, పొంతకాకి.

**జెయిలు** రూ.చూ. జైలు. వి. చెరసాల.

**జెయ్యతుగా** క్రి. విశ. ద్రు. జయప్రదంగా.

**జెరం** వి. కాక, ఆముకాల్పు యొక్క వేడి.

సం. జ్వర-. శరీరంలో కలిగే అధికమైన వేడి; ప్రా.పా. జర-.

< ప్రా. జర-.

**జెరికాలుకవ్వ** చూ. జెట్టి. వి. మూలలకు క్రమంగా తగ్గుతూ వచ్చిన ఆకు కప్ప.

**జెరీలాపత్తి** వి. ఒకరకం పత్తి.

**జెరుగుడు** రూ.చూ. నరుగుడు. వి. ఒకరకం కలపనిచ్చే చెట్టు.

**జెరుపోతుగడ్డి** చూ. జెట్టిపోతు. వి. పొలంగట్లమీద మొలిచే గడ్డి మొక్క.

**జె్రిసుడి** చూ. జెట్టి. వి. వీపుమీద, ముడ్డిమీద జె్రి

ఆకారంలో ఉండే సుడి.

జెఱభి రూ.చూ. జఱభి. వి. ముసలిస్త్రీ.

జెలి రూ.చూ. జెట్టి. వి. పెక్కుకాళ్ళుగల ఒక పురుగు.

జెలిపోతు రూ.చూ. జెట్టిపోతు. వి. సర్పవిశేషం.

జెట్ట విఙ. కొంచెం.

హిం. ఉ. జరా. కొంచెం.

< ఉ. జరా.

జెట్టి రూ. జెలి. వి. పెక్కుకాళ్ళగల ఒకపురుగు. ఆము. 3.80.

క. జజి, జెట్టి, శతపది; జిఱలె. జెట్టి; జిఱివి. గుడ్లల్ని పాడు చేసే పురుగు; జిర్లె. బొద్దింక; గోం. తిరిల్. జెట్టి, గొంగళిపురుగు; కొండ. త్సె్రి. జెరి; పర్జి. జెరి, చెరి. శత పది, జెరి.

జెట్టిపోటు వి. కాలిగుత్తి (పిల్లగిట్టల దగ్గర) వాయటం.

జెట్టిపోతు రూ. జెలిపోతు. వి. సర్పవిశేషం. సిం.ద్వా. 8.97.

జెల రూ. జల. వి. భూమిలోపల నుండి పైకురికి పడే నిరంతర జలధార, నీటిబుగ్గ.

జెలకట్టె రూ.చూ. జలకట్టె. వి. డేగ.

జెలగ రూ.చూ. జలగ. వి. నెత్తురు పీల్చే ఒకానొక నీటిపురుగు. సిం.ద్వా. 9.74.

జెలగరోగం వి. క్రమంగా కృశించిపోయే ఒక జబ్బు.

జెలాకంటె రూ.చూ. జలకట్టె. వి. డేగ.

జెల్గ రూ.చూ. జలగ. వి. నెత్తురు పీల్చే ఒక నీటిపురుగు.

జెల్ల[1] వి. 1. మత్స్య విశేషం, తేలులా కుట్టే ఒకచిన్న చేప. సిం.ద్వా. 1.221; 2. పిల్ల; 3. తలమీద కొట్టేదెబ్బ.

త. చెల్లల్. మంచినీటి చేప.

జెల్లకాయ వి. తలమీద కొట్టేదెబ్బ. జెల్లకొట్టు స.క్రి. 1. తలపైకొట్టు; 2. మోసగించు.

జెల్ల[2] రూ.చూ. జల్లి[2]. వి. కంకరరాయి, పునాదులు దిట్టపరచటానికి గ్లాబులు పోత పొయ్యటానికి పనికివచ్చే రాతి ముక్క.

జెల్లి[1] రూ.చూ. జల్లి[2]. వి. కంకరరాయి, పునాదులు దిట్ట పరచటానికి గ్లాబులు పోత పొయ్యటానికి పనికి వచ్చేరాతి ముక్క.

జెల్లి[2] రూ.చూ. జెల్లీ. వి. ఒకరకం హల్వాలాంటి పదార్థం.

జెల్లీ రూ. జెల్లి[2]. వి. ఒకరకం హల్వాలాంటి పదార్థం.

ఇం. Jelly. ఒకరకం హల్వాలాంటి పదార్థం.

< ఇం. Jelly.

జెల్లెము వి. ఒక విధమయిన ఆట. హంస. 3.146.

ప్రా. జిల్ల-. తాటిమీద గారడీ పనులు చేసేవాడు, నటజాతి.

< ప్రా. జిల్ల-.

జెల్లేడు చూ. జిల్లేడు. వి. పాలుగల్గి తెలుపు ఊదారంగు పూలుకల్గి, దూదినిచ్చే ఒకరకం చెట్టు (Calotropis procera).

జెళుకు అ.క్రి. పొర్లు. హంస. 1.71.

జెవ వి. శక్తి, బలం.

సం. జవ-. వేగం.

< సం జవ- (అర్థవిపరి.).

జెవారిపత్తి వి. ఒకరకం ఎర్రపత్తి.

జెష్ట వి. పెద్దమ్మ, దరిద్రదేవత. దశా. 10.92; 2. చేటు, చెరుపు.

సం. జ్యేష్ఠా. దరిద్రదేవత, పెద్దభార్య.

< సం. జ్యేష్ఠా.

జెష్టవెదవ వి. 1. ఒకతిట్టు; 2. దరిద్రుడు.

జెహద వి. యుద్ధం, మత యుద్ధం. ద. హిం. శా. సంపు. 10, శా.సం. 772.

హిం. జిహాద్. యుద్ధం; మరా. జిహావ్. మత యుద్ధం; ఉ. జిహాద్. ముసల్మానులు చేసే మతయుద్ధం; పార. జిహాద్. ప్రయత్నం, యుద్ధం; అర. జిహాద్.

< ఉ. జిహాద్.

జెహదా వి. హోదా, ఉద్యోగం. ద. హిం. శా. సంపు. 10, శా.సం. 772. క్రీ.శ. 1696.

జే రూ. జై. వి. 1. జయం. శృం. నై. 4.128; 2. నమస్కారం. శేష. 2; 3. దీవన.

సం. జయ-. జయం.

< సం. జయ-.

జేగంట రూ. జేఘంట. వి. జయాదులు ప్రకటించటానికి మోగించే గంట. భాస్క. రా.యు. 274. సం. జయ ఘంటా. జయసూచకమైన గంట; మరా. ఝేంగట. చేతాళం; క. జాగటె, జేగటె. దేవాలయాల్లో వాయించే పెద్దతాళం; తు. జాకటె, జాగంటె, జాంగంటె; త. చేకంటి. < సం. జయఘంటా. జేగంటలవాఁడు విఙ. జేగంటను వాయించేవాడు. ద. హిం. శా. సంపు. 10 శా. సం. 422. క్రీ.శ. 1268. జేఘంట రూ.చూ. జేగంట. వి. జయాదుల్ని ప్రకటించడానికి వాయించే గంట ద. హిం. శా. సంపు. 4. శా. సం. 451. క్రీ.శ. 1280. జేపెట్టు స.క్రి. 1. స్తుతించు. ఉ.రా. 8.144; 2. జయ జయ అనిపలుకు. జేభేరి వి. జయభేరి.

సం. జయభేరీ. జయసూచకమైన వాద్య విశేషం.

< సం. జయభేరీ.

జేగ వి. ఒక జాతి కొంగ.

జేగర వి. ఒకరకం కలుపు మొక్క.

జేగుడించు రూ.చూ. జేవురించు. అ.క్రి. ఎర్రబడు.

జేగురించు చూ. జేగురు.

జేగురు రూ. జేగుఱు, జేవురు, జేవుఱు. విఙ. ఎర్రని, కావి రంగుగల. శృం.నై. 8.152. వి. 1. సహజంగా దొరికే లోహోష్మం నుంచి పుట్టిన పదార్థం. భాగ. 10 ఉ. 551; 2. ఎరుపు, జాజు.

త. సెవ్వుఱు.

జేగురించు రూ.చూ. జేవురించు. అ.క్రి. ఎర్రపడు, ఎర్రనగు. వరాహ. 10.65. జేగురుఁగల్లు (-కల్లు) వి. ఎర్రని రాయి. జేగురుపురుగు రూ.చూ. జేవురుఁ బురువు. వి. ఆరుద్రపురుగు. జేగురుఁబురుగు(-పురుగు) రూ.చూ. జేవురుఁబురువు. వి. ఆరుద్రపురుగు. జేగురుఁ బురువు(-పురువు) రూ.చూ. జేవురుఁబురువు. వి. ఇంద్ర

గోపం, ఆరుద్రపురుగు. జేగురురాయి రూ.చూ. జేగురు రాయి. వి. ఎఱ్ఱమొరం, కావిరాయి. జేగురువేయు అ.క్రి. పచ్చికూజాలకు ఆరువదును మీద ఎఱ్ఱరంగువేయు. జేగురుసుద్ద వి. తెల్లటి బంక మట్టి, తెల్లసుద్ద.

జేగురించు చూ. జేగురు.

జేగురు రూ.చూ. జేగురు. వి. 1. ఎరుపురంగు, రక్తిమ. వరాహ. 10.106; 2. ఎఱ్ఱరాయి, కావిరాయి. ఆం.భా. 2.32. విశే. ఎఱ్ఱని. కావిరంగుగల. సిం.ద్వా. 4.97.

జేగురించు రూ.చూ. జేవురించు. అ.క్రి. ఎఱ్ఱనగు. జేగురు(బురుగు(-పురుగు) రూ.చూ. జేవురు(బురువు. వి. ఇంద్రగోపం, ఆర్ద్రపురుగు. జేగురు(బురువు (-పురువు) రూ.చూ. జేవురు(బురువు. వి. ఆరుద్రపురుగు. జేగురురాయి రూ. జేగురురాయి. వి. కావిరాయి, గైరికం.

జేగొందు చూ. జేబందు. వి. అస్త్రకారిలాపి, కంజెబద్ద, లాపీ పనివాళ్ళువాడే పరికరం.

జేగ్గడ్డి చూ. జేరు.

జేజమ్మ రూ. జేజెమ్మ. వి. 1. ఎందుకూ పనికిరానివాడు; 2. తెలివిమాలినవాడు; 3. అమ్మమ్మ.

జేజె రూ.చూ. జేజే. వి. 1. దేవుడు, వేల్పు. ఉ. హరిశ్చ. 1.9; 2. నమస్కారం. సాంబ. మాన. 25.

జేజెలమానికము వి. చింతామణి, దేవతారత్నం. ఆం. భా. 1.58. జేజెలరతనము వి. చింతామణి, దేవతారత్నం. చంద్రికా. 6.85.

జేజెమ్మ రూ.చూ. జేజమ్మ. వి. 1. తెలివితక్కువవాడు; 2. ఎందుకూ పనికిమాలినవాడు; 3. అమ్మమ్మ.

జేజే రూ. జేజె. వి. 1. జేజు ఆమ్రేడిత రూపం, 'జయం జయం.' శృం.నై. 1.4; 2. నమస్కారం. భీమ. 3.132; 3. దేవత, వేల్పు, దేవుడు. ఉ.రా. 1.281; 4. జయ జయధ్వని. శశా. 5.25.

సం. జయ-. గెలుపు.

జేజేగట్టు వి. దేవతలుండే కొండ, మేరుపర్వతం. చంపూ. రా. 4.3. జేజేగిడ్డి వి. కామధేనువు. సాంబ. దేవ. 19. జేజేదొంగ వి. దేవతావిరోధి, రాక్షసుడు. అచ్చ.రా.బాల. 155. జేజేదొర వి. దేవతలరాజు, ఇంద్రుడు. చంపూ రా. కిష్కిం. 83. జేజేనగరి వి. సురనగరం, స్వర్గం. చంపూ రా. 4.83. జేజేనిరాబారి వి. దేవముని, నారదుడు. అచ్చ. రా.యు. 161. జేజేనెలవు వి. సురాలయం, స్వర్గం. యయా. 2.65. జేజేపట్టు వి. స్వర్గం, సురాలయం. జేజేపెట్టు స.క్రి. దీవించు. జేజేపెద్ద వి. బ్రహ్మదేవుడు. ఉ.రా. 3.85. జేజేబువ్వ వి. దేవతల ఆహారం, చంద్రుడు. రాజ. వి. 1.24. జేజేమానికము వి. చింతామణి, దేవమణి. జేజేరతనము వి. చింతామణి, దేవమణి. జేజేరాయ(డు వి. సురపతి, దేవేంద్రుడు. అచ్చ.రా.యు. 600. జేజేలకొమ్మ వి. దేవతా స్త్రీ. జేజేలగట్టు వి. మేరుపర్వతం, దేవతలుండే కొండ. ఆం.నా. సం.స్థా. 1. జేజేలగిడ్డి వి. కామధేనువు, వేల్పుటావు. జేజేలగొంగ వి. రాక్షసుడు. వ్యు. దేవతల శత్రువు. జేజేలదొర వి. ఇంద్రుడు. వ్యు. దేవతల ప్రభువు. జేజేలదొరకొడుకు వి. జయంతుడు. వ్యు. ఇంద్రుని కొడుకు. జేజేలదొరప్రోలు వి. 1. స్వర్గం; 2. వేల్పుల పట్టణం, అమరావతి. జేజేలపట్టు వి. స్వర్గం. వ్యు. దేవతల నెలవు. జేజేలపాలెము వి. స్వర్గం, వేంక. ఆం. 2.2. జేజేలమానికము వి. చింతామణి, దేవమణి. జేజేలయొజ్జ(-ఒజ్జ) వి. బృహస్పతి. వ్యు. దేవతల గురువు. జేజేలరతనము వి. చింతామణి, దేవమణి. జేజేలరాచఱాలు వి.బ.వ. ఇంద్రనీలమణులు. జేజేలరాయ(డు వి. ఇంద్రుడు, వేల్పురేడు. జేజేలరాయనితేజి వి. ఉచ్చైశ్శ్రవం. వ్యు. ఇంద్రుని గుఱ్ఱం. జేజేలతే(డు వి. ఇంద్రుడు, వేల్పులరాజు. జేజేలవీడు వి.బ.వ. దేవతల పట్టణం, స్వర్గం. ఉ.రా. 2.28. జేజేలు వి. దేవుళ్ళు. జేజేవెట్టు(-పెట్టు) అ.క్రి. జయజయధ్వనిచేయు. మను. 4.5.

జేడ వి. బోదె, కాలవ. ద్వి. పరమ. 4.265. పో.చూ. జేడె[1].

జేడగడ్డ వి. గట్టినేల, సారవంతమైనది.

జేడి[1] రూ.చూ. జేడె[1]. వి. పోతమట్టి, ఎఱ్ఱమట్టి అడుసు, వరదల్లో కొట్టుకొని వచ్చిన మెత్తని మట్టి.

జేడి[2] వి. సిరా నిచ్చే ఒకరకం చెట్టు (Semecarpus anacardium).

జేడిగిట్ట చూ. జేడ. రూ. జేడెగెట్ట. వి. వెడల్పయిన చీలిక నందు ఉన్న గిట్ట.

జేడియ రూ.చూ. జేడె[1]. వి. బురదనేల.

జేడు రూ.చూ. జేడె[1]. వి. 1. గట్టినేల; 2. బాగా బిగుసు కొన్న బంకనేల; 3. పోతమట్టి. వరదల్లో కొట్టుకొని వచ్చిన మెత్తని మట్టి; 4. ఎఱ్ఱమట్టి అడుసు.

జేడుపాకం వి. మన్నుపాకం, ముద్దపాకం, పాత్రల తయారీకి అనువుగా మంచి జిగురు పాకంలో ఉన్న బురద మట్టి.

జేడె[1] రూ. జేడి[1], జేడియ, జేడు. వి. బురదనేల. ఆం.భా. 2.5.

ఉ. వేడే. విత్తులు నాటటానికై నీరు పెట్టి సిద్ధపరచిన పొలం.

త. చేఱె.

<ఉ. జేడే.

జేడె[2] వి. 1. బండిజల్ల తెరచి ఉన్నవైపు; 2. ఎరువు, కంకులుతోలే బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం పెట్టిన తడికలేక చాపకటులు; 3. ఎక్కువ కంకులు పొయ్యటానికి బండిజల్ల అంచుల్ల నిలవేసిన చొప్పకట్టలు.

జేడెకట్ట వి. 1. ఏడె, ఎరువు, కంకులు తోలే బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం పెట్టిన చొప్పకట్ట; 2. ఎక్కువ కంకులు పొయ్యటానికి బండిజల్ల అంచుల్ల నిలవేసిన చొప్పకట్ట. జేడెతడక వి. ఎరువు, కంకులు తోలే బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం పెట్టిన తడిక. జేడెతాడు వి. బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం కట్టే తాడు.

జేడెగెట్ట రూ.చూ. జేడిగిట్ట. వి. వెడల్పయిన చీలిక నందు ఉన్న గిట్ట.

జేడ్డం వి. తెగుళ్ళు, పురుగులు, మిడతలు, శిలీంధ్రాలు మొ. వాటివల్ల వచ్చే వ్యాధి.

సం. జాడ్య-. శైత్యాదిగుణం; ప్రా. జడ్డ-, జడ్డా-. శైత్యం; కా. జడ్. బుద్ధిమాంద్యం; నే. జడో. శైత్యం.

శీతాకాలం; బెం. జాడ్, జాడా; ఒ. జాడా; హిం. జాడా.

< ప్రా. జడ్డ-.

**జేడ్యం** వి. తెగుళ్ళు, పురుగులు, మిడతలు, శిలీంధ్రాలు మొ. వాటివల్ల వచ్చే వ్యాధి.

సం. జాడ్య-. శైత్యాదిగుణం; ప్రా. జడ్డ-, జడ్డా-, శైత్యం; కా. జడ్. బుద్ధిమాంద్యం; నే. జడో. శైత్యం. శీతాకాలం; బెం. జాడ్, జాడా; ఒ. జాడా; హిం. జాడా.

< సం. జాడ్య-.

**జేంద్ర** రూ. దేంద్ర. వి. బట్టలు నేసి జీవించే ఒక జాతి, ఆం.భా. 2.283. తిరుదానూరు తాళ్లపాక తిరువెంగళ నాథుని శాసనం. 1541 సం.

క. జాడ, జేడ. నేతనేసి జీవించే లింగధారుడు. సాలెపురుగు, తు. జాడె, జాడ్యే. నేతగాడు, సాలెపురుగు; త. చేంటియవర్. నేతగాళ్ళు.

**జేంద్రవాడు** విశే. దేవాంగి.

**జేతికఱ్ఱ** చూ. చేయి. వి. పొట్టికోల, నేతపడుగు చివర పాయలు తాళ్ళు కట్టిన కఱ్ఱ.

**జేన**[1] రూ. జాన[2], జేనె. వి. చెయ్యి విస్తరించినప్పుడు, బొటన వేలి కొనకూ చిటికెనవేలి కొనకూ మధ్య ఎడం, ఒక కొలత, తొమ్మిది అంగుళాలు పరిమాణం, మూరలో సగం, వితస్తి. భార.ద్రోణ. 4.109.

క. గేణ్, గేణ, గేణు. పరిమాణ విశేషం; కొడ. చేణి; తు. గేణ, గేణు; త. చాణ్; మ. చాణ్; కో. గ.ణ్; తొ. కి.ణ్; కొలా. జేన.

**జేనకొయ్య** వి. కాలుకొయ్య. ఆనుమీద పడుగు జేనెడు ఎక్కువ రావటానికి పక్కపేటకు బిగించిన కొయ్య. **జేనడు** రూ. జానెడు, జేనెడు. విశే. జేన పరిమాణంకల. < జేన[1] + -ఎడు. **జేనెడు** రూ.చూ. జేనడు. వి. హస్తం. **జేనెంట** క్రి.విశే.ద్రు. ప్రతి జేనెడు నేలకూ. పండి.చ. 5.480 ప. < జేన[1] + వెంట.

**జేన**[2] రూ.చూ. జాన[1]. వి. ఫలవృక్ష విశేషం (Adenanthera aculeata).

**జేనచెట్టు** వి. అడవి జేన అనే ఒకరకం చెట్టు, దీని పళ్ళు తింటారు (Adenanthera aculeata).

**జేనగితాడు** రూ.చూ. జానకిత్రాడు. వి. తుపాకీ మందుకు నిప్పంటించే వత్తి.

**జేనెడు** చూ. జేన[1].

**జేనెంట** చూ. జేన[1].

**జేపూర్‌ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**జేబ** వి. మల్లబంధ విశేషం. ఆం.భా. 2.209.

**జేబంది** రూ.చూ. జేబందు. వి. అస్త్రకారి తాపి, కండెబద్ద, తాపీపనివాళ్ళు వాడే పరికరం.

**జేబందు** రూ. జెగబందు, జేబంది, జేమందు, జేర్బందు[2]. జోబందు. వి. అస్త్రకారి తాపి, కండెబద్దె, తాపీపనివాళ్ళు వాడే పరికరం.

**జేబందుదబ్బ** వి. జేబందుచెక్క. తాపీపనివాళ్ళు వాడే పరికరం.

**జేబు** చూ. జీబు[1]. జోబీ. వి. 1. ఆడదాని కట్టుకోక; 2. చొక్కాయిసంచి.

ఉ. జేబ్. చొక్కాలో కుట్టిఉండే చిన్న సంచి; హిం. జేబ్. చొక్కాయి మొ. వాటిలో ఉండే చిన్న సంచి; పార. జేబ్, జీబ్, జేబు; అర. జేబ్. జేబు.

< ఉ. జేబ్.

**జేబుతువాలు** వి. జేబులో ఉంచుకొనే తువాలు. **జేబుదొంగ** వి. జేబులో ఉన్నవాటిని తెలియకుండా కొట్టివేసేవాడు. **జేబురుమాలు** వి. చేతిగుడ్డ. **జేబులుకత్తిరించు** స.క్రి. జేబులో ఉన్నవాటిని దొంగిలించు. **జేబులుఖాళీఅగు** అ.క్రి. ఉన్న డబ్బంతా అయిపోవు. **జేబులునింపుకొను** స.క్రి. డబ్బు సంపాదించుకొను. **జేబులోవేసుకొను** అ.క్రి. వశంచేసుకొను.

**జేమ** రూ.చూ. జామ. వి. ఫలవృక్ష విశేషం (Psidium guayava).

**జేమందు** రూ.చూ. జేబందు. వి. తాపీపనివాళ్ళు వాడే పరికరం, అస్త్రకారితాపి.

**జేమారంచు** చూ. జామారు. వి. బాగా తెల్లటి నూలుతో నేసిన ఒకరకం అంచు.

**జేమి** రూ.చూ. జామ. వి. ఒక ఫలవృక్షం.

**జేయింటుపొయ్యి** వి జంటపొయ్యి. మధ్యభాగంలో కట్టెలు పెట్టి మంటలేస్తే ఆ మంటలోనే ఇరువైపులా రెండు పాత్రలు ఉడకటానికి వీలుగా చేసిన జంటపొయ్యి.

ఇం. *Joint*. కలిసేచోటు.

< ఇం. Joint + పొయ్యి.

**జేరబావలీ** రూ. జేరుబావలీ, జేరుబావిలీ. వి. బావుల కింద సాగుచేసే మాగాణిభూమి.

**జేరి**[1] వి. వృక్ష విశేషం.

**జేరి**[2] రూ.చూ. జేరు. విశే. గట్టి.

**జేరిగుద్దు** వి. గవాచి, గోడలో పెట్టిన రంధ్రం.

**జేరు** రూ. జేరి[2]. విశే. 1. గట్టి; 2. గడుసైన.

**జేగ్గడ్డి** వి. ఒకరకం కలుపుమొక్క. < జేరు + గడ్డి.

**జేరుగండి** వి. స్నానం చేసిన నీళ్ళు బయటకి పోయే గోడ కన్నం, జలదారి కంత.

**జేరుగల్లు** రూ. జేవులుగండ్లు. వి.బ.వ. కోటలోనుండి తుపాకులు కాల్చడానికి ఉపయోగించే గోడల రంధ్రాలు. రంగా.చ. 3.64.

**జేరుదస్తు** వి. 1. అధీనమైన. రంగా.చ. 2.33; 2. ఒక్క చిక్కిన; 3. దుర్బలమైన.

మరా. జేర్‌దస్త. దీనుడు; ఉ. జేర్‌దస్త్. అధీనం, వశీభూతం; పార. జీర్‌దస్త్. తక్కువవాడు; జేర్‌దస్త్. అధీనం.

< ఉ. జేర్‌దస్త్.

**జేరుబందు** రూ.చూ. జేర్బందు[1]. వి. టంగువారు, చబుకు, కొరడా.

**జేరుబావలీ** రూ.చూ. జేరబావలీ. వి. బావుల కింద సాగు చేసే మాగాణి భూమి.

**జేరుబావిలీ** రూ.చూ. జేరబావలీ. వి. బావుల కింద సాగు చేసే

మాగాణి భూమి.
జేర్బందు[1] రూ. జేరుబందు. వి. చబుకు.
ఉ. జేర్ బంద్. కొరడా; పార. జేర్ బంద్. కొరడా.
క. జేరుబందు, జేర్బందు.
<ఉ. జేర్బంద్.
జేర్బందు[2] రూ.చూ. జేబందు. వి. వ్రణంగులూ, ఖాపీ పని వాళ్ళూ వాడే కొయ్య సాధన.
జేలిహంసబార్డరు వి. అర్ధవలయాకారంలో హంస పడేట్టు నేసిన అంచు.
సం. హంస-. అంచ.
ఇం. *Border*. అంచు.
జేవురించు చూ. జేవురు.
జేవురు రూ.చూ. జేగురు. విణ. ఎర్రని, కావిరంగుగల.
జేవురించు రూ. జేగుడించు, జేగురించు, జేగుటించు. అ.క్రి. ఎర్రపడు, ఎర్రనగు. భార. ఉద్యో. 3.387.
జేవురు(బురువు(-పురువు) రూ. జేగురుపురుగు, జేగురుఁబురుగు, జేగురుఁబురువు, జేగుఱుఁబురుగు, జేగుఱుఁబురువు, జేవుఱుఁ బురువు. వి. ఇంద్రగోపం, ఆర్ద్రపురుగు. అచ్చ.రా.కిష్కిం. 65.
జేవుఱు రూ.చూ. జేగురు. విణ. ఎర్రని, కావిరంగుగల. భార. ఉద్యో. 2.114. వి. ఎరుపురంగు. మను. 5.50.
జేవుఱుగండ్లు రూ.చూ. జేరుగళ్లు. వి.బ.వ. కోటలో నుండి తుపాకులు కాల్చడానికి ఉపయోగించే గోడల రంధ్రాలు. జేవుఱు(బురువు రూ.చూ. జేవురుఁబుఱువు. వి. ఇంద్రగోపం, ఆర్ద్రపురుగు.
జేష వి. జ్యేష్ఠమాసం, ఏడువాతలపాలెం, త్రామగానసం. పం. 9. క్రీ.శ. 1018.
సం. జ్యేష్ఠ. జ్యేష్ఠమాసం.
జేష్టరయితు వి. పెద్ద రైతు.
సం. జ్యేష్ఠ-. పెద్ద.
<సం. జ్యేష్ఠ-+రయితు.
జేష్ఠ వి. దరిద్ర దేవత. దశా. 10.92, ధర్మ. 2.196.
సం. జ్యేష్ఠా. దరిద్ర దేవత; ప్రా. జిఠ్ఠా, జేఠ్ఠా.
<సం. జ్యేష్ఠా.
జై రూ.చూ. జే. వి. జయమని అర్థమిచ్చే పదం.
జైపరమేశ్వరాయను (-అను) రూ.చూ. జాపరమేశ్వరాయను. స.క్రి. (లోకాతీతమైన పనులు చేసేటప్పుడు) జయపరమేశ్వరా అని పలుకు.
జైజాయీ రూ.చూ. జెజాయీ. వి. ఒక విధమైన ఫిరంగి.
జైతూన్ వి. ఒక రకం చిన్న చెట్టు (Olea europaea).
జైల వి. పళ్ళెం, బావికి చుట్టూ కట్టిన అరుగు.
జైలు రూ. జెయిలు. వి. చెరసాల, నేరం చేసిన వాళ్ళని చట్ట ప్రకారం నిల్పి ఉంచే చోటు.
ఇం. *Jail*. చెరసాల.
<ఇం. Jail.
జోకాయించు స.క్రి. 1. ఒత్తిడిచేయు; 2. పీడించు.
జొగ్గ రూ.చూ. జోగు[1]. వి. బిక్షం.
జొగ్గెత్తు అ.క్రి. బిచ్చమెత్తు. <జొగ్గ+ఎత్తు.
జొగ్గెత్తు చూ. జొగ్గ.
జొటజొట రూ.చూ. చొరచొర. వి. 1. చెమట మొ. కారటంలో అనుకరణం. మను. 4.19; 2. కురవటం మొ. వాటి ధ్వన్యనుకరణం. పాండు. 4; క్రి.విశ. క్రదు. వడి వడిగా.
జొడ్డా వి. 1. అముదం; 2. నష్టం; 3. అనవసర శ్రమ (అర్థవివరి.).
జొతిక రూ.చూ. జతికె. వి. పట్టెడ, గొడ్ల మెడలకు అందానికి గాని, వాటిని కాడికి పూన్చటానికిగాని కట్టే తాడు లేదా తోలు.
జొతికె రూ.చూ. జతికె. వి. పట్టెడ, ఎద్దులను కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలు లేదా నార పట్టా.
జొతికెచిట్టె వి. బొట్టె, కాడికి తగిలించే పట్టెండ్ల కొన తాడు. జొతికెతమ్మె వి. బొట్టె, కాడికి తగిలించే పట్టెళ్ళ కొనతాడు. జొతికెపలుపు వి. పలుపు, జొతికెలకు బదులు ఎద్దుల మెడ కిందుగా తీసి కాడికి కట్టే తాడు.
జొతుక వి. అదును, బురద.
జొత్తికె రూ.చూ. జతికె. వి. పట్టెడ, ఎద్దులను కాడికి కట్టే నాలు గైదు అంగుళాల వెడల్పుగల తోలు లేదా నార పట్టా.
జొత్తిలు చూ. జొత్తు[1].
జొత్తిల్లు చూ. జొత్తు[1].
జొత్తు[1] వి. 1. కర్ణభూషా విశేషం. భార. విరా. 1.228; 2. ఎరుపు, రక్తిమ. మను. 3.98; 3. రక్తం. దశా. 10.88; 4. కృత్రిమ రక్తం. ఆం.భా. 2.132.
జొత్తిలు రూ.చూ. జొత్తిల్లు. అ.క్రి. 1. (రక్తం, కోపం మొ. వాటివల్ల) ఎర్రబడు, ఎర్రగా అగు. ప్రబోధ. 3.39; 2. రంజిల్లు, రాగిల్లు, ఎరుపు రంగువల్ల ఆ రంగు కలదగు. పాండు. 1.156; 3. పైకి ఉబుకు; 4. ఆర్ద్రమగు. జొత్తిల్లు రూ. జొత్తిలు. అ.క్రి. 1. (రక్తం, కోపం మొ. వాటివల్ల) ఎర్రబడు, ఎర్రగా అగు. కు.సం. 4.115; 2. ఉద్గమించు, పైకుబుకు. భార. ఉద్యో. 3.405; 3. ఆర్ద్రమగు. భార. స్త్రీ. 1.117; 4. రంజిల్లు, రాగిల్లు, ఎరుపు మొ. రంగులచేత ఆ రంగు కలదగు. దశకు. 3.124. జొత్తుకొను అ.క్రి. దట్టమగు, గట్టిపడు. పద్మ. 9.187. జొత్తుపావ వి. నెత్తురు కందు. జైమిని భా. 2.75.
జొత్తు[2] రూ.చూ. జుట్టు[1]. వి. జుత్తు.
జొత్తులెగయు అ.క్రి జుట్లు రేగు. భాస్క.రా. ఆరణ్య. 2.135.
<జొత్తు[2]+-లు+ఎగయు.
జొత్తురు చూ. జొత్తు[1]. విణ. ఎర్రని.
జొత్తువెట్టు (-పెట్టు) స.క్రి. నరుకు, ఖండించు. మైరా. 1.86.
జొన రూ.చూ. జొన్న. వి. ధాన్య విశేషం (Sorghum vulgare, Holcus sorghum).
జొనుపు రూ.చూ. చొనుపు. స.క్రి. దూర్చు, చొప్పించు.
జొన్న రూ. జొన. వి. ధాన్య విశేషం. ఆం.భా. 2.234

(Sorghum vulgare, Holcus sorghum).

సం. యవనాల-, యావనాల-, జూర్ణ; ప్రా. జొణ్ణలిఅ, జొణ్ణాలిఅ. ధాన్య విశేషం. జై. మహా. శౌ. అమా. జుణ్ణ-.

క. జోళా, జోళ, జొల. జొన్నల్లో ఒకరకం; కొడ. జొల. జొన్న; తు. జోళ. జొన్నల్లో ఒకరకం; త. చొణ్ణల్, చోళమ్. మొక్కజొన్న; గోం. జవోలి; కుఇ. జోఎలి; కువి. జోనంగ, జోన; పర్జి. జెన్న. జొన్న; కొలా. సొన్న. జొన్న; గ. జోనెల్; ఒల్లా. జోనెల్.

<ప్రా. జొణ్ణలిఅ.

జొన్నకలి వి. జొన్న (అన్నం) ముద్ద. (శ్రీనాథుని చాటువు). జొన్నకూడు వి. జొన్నలతో వండిన అన్నం. చా. మం. 1.127. జొన్నక్షేత్రము వి. జొన్న (పంట) పండేనేల. జొన్నగంజి వి. జొన్నపిండి ఉడకబెట్టి తీసినగంజి. జొన్ననాగు వి. ఒకరకం పాము. జొన్ననేల వి. జొన్నపండే నేల. ద. హిం. శా. సంపు. 4, శా.సం. 1384. జొన్నన్నము వి. జొన్నలతో వండిన అన్నం. శ్రీనాథునిచాటువు. సం. అన్న-. ఆహారపదార్థం. <జొన్న + సం. అన్న-. జొన్న బెండు వి. ఊచ, కండెనూలు చుట్టే జొన్నదంటుముక్క. జొన్నంబలి రూ.చూ. జొన్నయంబలి. వి. జొన్నపిండితో కాచిన అంబలి. <జొన్న + అంబలి. జొన్నయంబలి (-అంబలి) రూ. జొన్నంబలి. వి. జొన్నపిండితో కాచిన అంబలి. జొన్నరాశి వి. చిన్నకాయ రకం మామిడి. జొన్నల రాశి వి. చిన్నకాయరకం మామిడి. జొన్నలరాసిచీర రూ. జొన్నల్రాసి చీర. వి. ఒకరకం చుక్కల చీర. జొన్నలు వి.బ.వ. ధాన్య విశేషం. కు. సం. 11.42. జొన్నల్రాసి చీర రూ.చూ. జొన్నలరాసిచీర. వి. ఒకరకం చుక్కల చీర. జొన్నసంకటి వి. గంజెవార్చకుండా, ముద్దగా వండిన జొన్న అన్నం.

**జొన్పు** రూ.చూ. జొనుపు. స.క్రి. దూర్చు, జొప్పించు.

**జొపానున్నట్లు** అవ్య. ఇంట్లోపిల్లల సందడి చేయక ఉండుస్థితి.

**జొబ్బటిలు** రూ.చూ. జొబ్బిలు. అ.క్రి. అధికంగా ప్రవహించు. రంగా. చ. 3.105.

**జొబ్బటిల్లు** రూ.చూ. జొబ్బిలు. అ.క్రి. అధికంగా ప్రవహించు.

**జొబ్బిలు** రూ. జొబ్బటిలు, జొబ్బటిల్లు, జొబ్బిల్లు. అ.క్రి. 1. నిండారు, అధికమగు. శృం. నై. 2.114; 2. రాలు. శృం. నై. 6.120; 3 తడియు. హర. 2.109; 4. స్రవించు, కారు. భాగ. 10 పూ. 662; 5. అనుకగు, పలుచనగు. సారంగ. 3.138; 6. ఉబుకు, ఉద్గమించు. ఓల్గా. 3.51.

క. సోర్. కారు, కార్చు, చుక్కలుచుక్కలుగాపడు, కారు, కొబ్బరినీరులా ప్రవహించు, నీటిచుక్కలు, పళ్ళరసం; సోరు వికె, సోరుహ. కారటం; జొరు. చుక్కలు చుక్కలుగా, పడు, కార్చు, కారు; సురి. ప్రవహించు, కారు, కన్నీళ్ళు, రక్తం, వర్షం మొ. వాటిలా కురియు; సురియువికె. ప్రవాహం; సురిస్తు. పోయు; జురి. కారిపోవు, ఎక్కువగా కారిపోవు, ప్రవహించు; సొరె. ఆవు, గేదెలపాలు; తొరె. పాలుతయారగు, స్తనాల్లోకి పాలువచ్చి నిండటం; కొడ. తొ.ర్. కారు; చొ.రె. రక్తం; తొరి. పోయు; తు. సోరుని, తోరుని. కారు, పరుగెత్తు, తోరు. కారటం, సొర్తె. కారటం; చొరియుని. కారు, పరుగెత్తు; త. చోర్. రక్తం, పాలు కన్నీళ్ళలా బొట్లు బొట్లుగాపడు, కార్చు, కారు; చోర్వు. పడు, పోయు; చొరి. కిందకి ప్రవహించు, ఒలుకు, చిందు, ధారాళంగా, పుష్కలంగా, పోయు, బాణాల్లావదులు; చుర. చిందు, ప్రవహించు, ప్రవాహం, వేగంగా ప్రవహించు, జంతువు నుండి గాని, చెట్టునుండి గాని, తయారైన పదార్థం వల్ల కలిగిన అనారోగ్యకరమైన వాపు. చురప్పు; నీరు, తోడు, ప్రవహించు; వాచు, చిమ్ము; చుర్తె. పాలల్లా స్రవించు, పొదుగు, జంతువుల చను మొనలు, పాడి ఆవు; మ. చోరుక. ప్రవహించు, కారు, చినుకులుగా పడు; చోర్క్క. జారు, తొలగిపోవు, మైనాన్ని కరిగించు; చోర్చ్చు. కారు; చోరి, చోర. రక్తం; చొరి యుక. ప్రవహించు, పోయు, జల్లు; చొరియుక్క. కుప్పగా పెట్టు; చొరిచ్చల్. స్త్రీలబహిష్టు, రక్తవిరేచనం; చురక్క. పాలు తయారగు, స్తనాల్లోచేరు, నీరువేగంగా ప్రవహించు; చురత్తుక. పాలెక్కువగా యిచ్చు; చుర. పాలిచ్చు; చురన్నల్, చొరున్నల్. పొదుగు; తోరానా. నీటినిపోయు; కో. జ్.ర్. (జొరి.) ప్రవాహంతో పరిగెత్తు; తొయ్ర్ (తోర్చ్). ద్రవపదార్థంగాని, ధాన్యంగాని పోయటం, నెమ్మదిగా నటించటం; చొర్వ్. దానంతటదిగా పొదుగు నుండి వచ్చు ప్రవాహం; తొ. త్యర్. చేపకు సిద్ధంగా ఉన్నది; త్వోర్. పొదుగులో పాలున్న దశ, కొండ. సో. కారు; కుఇ. తోర. పలచగానుండు, చినుకులు చినుకులుగా పడు; (జామ్బ). పొదుగు; స్థాంగు. స్తనం; కువి. రాంగూ, రాంగు. కారు; పర్జి. చోర్ప్. ఉడికిన అన్నంనుండి నీటిని వేరుచేయు; చార్. చినుకులుగా పడు; చోప్. పొర్లిపోవు; గ. ఒల్లా. సోర్ప్. పోయు; చిర్. పోయు; కురు. ఛర్ఖ్నా. పోయు, చుక్కలుగాపడు, పగులు నుండి నీరుకారు, కారు, పోవు; ఛర్ఖ్రానా, జొరో. కారిపోవు; మాల్తో. చర్గ్రె. కారు, చుక్కలుగాపడు; చర్గె. కారు, ప్రవహించు; కురుగ్రె. చెట్టును మెల్లగా తట్టు; తురె. బుడగలు బుడగలుగా లేచు, పొర్లిపోవు; బ్రా. చ్రింగ్. కారు, వేగంగా ప్రవహించు; త్రుంప్, త్రంప్. నీటిబొట్టు.

**జొబ్బిల్లు** రూ.చూ. జొబ్బిలు. అ.క్రి. 1. నిండారు, అధికమగు. భాగ. 10 ఉ. 983; 2. స్రవించు. మను. 2.61; 3. తడియు. యయా. 5.98; 4. రాలు; 5. అనుకగు; 6. ఉబుకు.

**జొబ్బురుగ** క్రి. విశే. ద్రు. పలచగా.

**జొంపము** వి. 1. ఆకులు తీగెలు మొదలైన వాటిగుంపు, గుబురు, పొద. భార. విరా. 1.162; 2. సాంద్రత. భార. విరా. 1.165; 3. నిరంతర ధార. భాగ. 8.510; 4. సమూహం. పి. శకు. 1.97; 5. గుత్తి, గుచ్ఛం. రసిక. 1.85; విశే. సాంద్రమైన, దట్టమైన. పారి. 4.26.

క. జొంప, జొంపె. గుంపు.

**జొంపిలు** రూ. జొంపిల్లు. స.క్రి. 1. ముద్దచేయు; 2. పొది

చేయు.

జొంపిల్లు రూ.చూ. జొంపిలు. స.క్రి. 1. ముద్దచేయు ; 2. పొడిచేయు.

జొంపు వి. కొండలోని ఊట నీరు.

జొమ్మ రూ.చూ. దొమ్మ. వి. ఊపిరితిత్తుల జబ్బు.

జొమ్ము రూ.చూ. దొమ్మ. వి. ఊపిరితిత్తుల జబ్బు.

జొరగొట్టు (-కొట్టు) రూ.చూ. చొరఁగొట్టు. స.క్రి. చొప్పించు.

జొరబొంత వి. జోరతట్టు, పాకం మన్ను తడి ఆరిపోకుండా పైనకప్పే ముతకబట్ట.

జొరము వి. జ్వరం.

సం. జ్వర-. ఉష్ణం, వేడి ; ప్రా. జర-, జలి ; క. జర ; తు. జరియ, జ్వరం ; మ. జొరమ్.

< సం. జ్వర-.

జొర్రగొట్టు(-కొట్టు) రూ.చూ. చొరఁగొట్టు. స.క్రి. చొప్పించు, చొచ్చుకొనిపోయేటట్లు చేయు.

జొఱజొఱ రూ.చూ. చొఱచొఱ. వి. మిణుగురులు రాలటంలోని ధ్వనికి అనుకరణం. వరాహ. 11.123.

జొఱ్ఱీఁగ చూ. జొఱ్ఱు.

జొఱ్ఱు రూ.చూ. జోఱు. వి. ఈగలు, తుమ్మెదలు మొ. ఎగిరేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం.

జొఱ్ఱీఁగ రూ.చూ. జోఱీఁగ. వి. ఒకరకం ఈగ, పశువును కుట్టే పెద్దరకం ఈగ.

జొలదీయు (-తీయు) చూ. జొల్ల². రూ. జొల్దీయు. స.క్రి. సర్పటానికి ముందు తడిబట్టతో ఆరినవాటల్ని తడిచేయు.

జొలపాత రూ.చూ. జొల్లపాత. వి. సర్పుడుపాత, కుండల్ని సర్పేటప్పుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట.

జొల్దాక చూ. జొల్ల². వి. నీళ్ళదాక, కుండల్ని సర్పేటప్పుడు కుమ్మరి కుడివైపు పెట్టుకొనే నీళ్ళదాక.

జొల్దీయు (-తీయు) రూ.చూ. జొలదీయు. స.క్రి. సర్పటానికి ముందు తడి బట్టతో ఆరిన వాటల్ని తడిచేయు.

జొల్రాయి చూ. జొల్ల². వి. రాయి, సర్పేటప్పుడు నలపను తడిచేసుకోటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

జొల్ల¹ రూ.చూ. జల్ల. వి. 1. కుక్క, పనస, మక్కిరి, ధాన్యం, ఎరువు మొ. తోలటానికి బండిమీద వేసే పేళ్ళతో అల్లిన గూడు వంటి సాధనం ; 2. బుట్ట, మూత ఉన్న చిన్న గంప.

జొల్ల² వి. చిన్న ఏదు.

జొల్లకుండ వి. నీళ్ళసట్టి, కుండల్ని సర్పేటప్పుడు కుమ్మరి కుడివైపు పెట్టుకొనే రాయి. జొల్లపాత రూ. జొలపాత. వి. సర్పుడు పాత, కుండల్ని సర్పేటప్పుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట.

జొల్లు రూ.చూ. చొల్లు. వి. పసిపిల్లలకు నోటి నుండి కారే ఉమ్మినీరు, చొంగ, లాల. చంద్రాంగ. 2.40.

జొల్లుకూతలు వి.బ.వ. 1. పొల్లుమాటలు ; 2. నిందావాక్యాలు, జొల్లు కార్చుకొంటూ అనే మాటలు ; 3. నెరవేర్చలేని మాటలు.

జొల్లెము రూ. జొల్లైము. వి. జడతో చుట్టిన చుట్ట.

క. చొల్లెయ, చొల్లెహ, జొళ్ళెహ. స్త్రీల జుట్టు ముడి కొనలు.

జొల్లైము రూ.చూ. జొల్లెము. వి. జడతో చుట్టిన చుట్ట.

జొహారు రూ.చూ. జోహారు. వి. నతి విశేషం, నమస్కారం. ఆము. 6.99.

జొహారువు రూ.చూ. జోహారు. వి. నతివిశేషం, నమస్కారం.

జో అవ్య. పిల్లల్ని నిద్రపుచ్చేటప్పుడు అనే పదం, జోలపాటలోని పల్లవి.

సం. స్వప్. నిద్రించు, సపిహి ; ప్రా. ఘొఇ-ఘొఇ ; హిం. సో. నిద్రించు ; మరా. జోజో. బిడ్డల్ని నిద్రపుచ్చటానికి వాడే పదం.

క. జో. నిశ్శబ్దమైన ; తు. జొజో ; కో. జొ.జొ. పిల్లల్ని నిద్రపుచ్చేటప్పుడు ఉపయోగించే మాటలు.

జోకుమారుడు వి. 1. కుమారస్వామి ; 2. వాన కోసం ఆరాధించబడే దేవత. జోకొట్టు స.క్రి. 1. జయించు. కాశీ. 7.95 ; 2. (బిడ్డలు నిద్రపోవటానికి) జోజో అని వీపు మీదచేతితో మెల్లగా తట్టు. భాగ. 10 పూ. 193 ; 3. మాయచేయు. భాగ. 10 పూ.193 ; 4. మంచి మాటలచేత వంచించు. విణ. నిద్రపుచ్చే(వాడు), నిద్రింపజేసే(వాడు). చమ. 3.40. జోచఱచు రూ.చూ. జోసఱచు. స.క్రి. జోకొట్టు, నిద్రపుచ్చు. జోజో అవ్య. 1. జో అనే దాని ఆమ్రేడితరూపం. భాగ. 10 పూ. 190 ; 2. జోలపాటలోని పల్లవి, వర్ధిల్లుమనే దీవన. జోపాప వి. జోకొట్టడానికి అర్హమైన శిశువు. జోపాపలగు అ.క్రి. చంటిపిల్లల వంటివగు. ఉ.హరి. 1.151. < జోపాప + -లు + అగు. జోసఱచు (-చఱచు) రూ. జోచఱచు. స.క్రి. జోకొట్టు. బసవ. 3.59.

జోక వి. 1. నాట్య విశేషం. బసవ. 1.22 పు. 529 పం. ; 2. మొత్తం, సమూహం, గుంపు. రం.రా. ఉ. 116 పు. 27 పం. ; 3. జత, కవ. హర. 4.28 ; 4. ఉత్సాహం. శివరా. 1.70 ; 5. విజృంభణం. పారి. 4.87 ; 6. విధం, రీతి. కుటికా. 2.145 ; 7. కాంతి. చమ. 3.39 ; 8. సహాయం, తోడు. అని. 5.69 ; 9. స్వరూపం, ఆకృతి. కవిరా. 1.89 ; 10. సౌందర్యం, అందం, ఒప్పు ; 11. వెరవు ; 12. పూనిక ; 13. ఆట ; 14. లోకువ ; 15. వేడుక. విణ. 1. జత అయిన. హర. 4.28 ; 2. జాగరూకమైన, మెలకువగల. ప్రభా. 1.114 ; 3. సదృశమైన, ఈడైన. వైజ. 1.28 ; 4. వ్యాపించిన, నిండిన. వేమన. 3.146 ; 5. యుక్తమైన. భల్లా. 2 ; 6 అధీనమైన ; 7. సహాయమైన ; 8. కూడి ఉండే.

సం. యోగ-. జతకూర్చటం, ఉద్యోగం, దాడి, పని ; ప్రా. జోఅ, జోగ-. సంబంధం, సమ్మేళనం ; పా. యోగ-. కలపటం, అనువర్తించటం.

క. జోకె. జాగ్రత్త, హెచ్చరిక, అందం, లావణ్యం, శోభ ; కొడ. జొకె. జాగ్రత్త ; తు. జోకె. జాగ్రత్త. హెచ్చరిక, భద్రత ; కో. జొయ్క్. జాగ్రత్త ; కొలా. జొకాడ్. నెమ్మదిగా.

< ప్రా. జోగ-.

జోకచేయు రూ.చూ. జోకసేయు. స.క్రి. 1. సిద్ధపరచు. ఉ.రా. 2.175 ; 2. గడించు, సంపాదించు. హరిశ్చ.

3.30 ; 3. పోల్చు ; 4. సాగుచేయు, బాగుచేయు. **జోకపడు** రూ. జోకవడు. అ.క్రి. 1. జతపడు, అత్తు ; 2. తగు. స.క్రి. కూడు. **జోకపర్చు** రూ.చూ. జోకపఱుచు. స.క్రి. 1. కలిగించు ; 2. జతపరుచు, సమానం చేయు ; 3. కావించు. **జోకపఱచు** రూ. జోకపర్చు, జోకపఱుచు. స.క్రి. 1. కలిగించు. భాగ. 6.197 ; 2. జోకపడజేయు, జతపరుచు, సమానం చేయు. కళా. 6.224 ; 3. కావించు. కకుత్స్థ. 1.215. **జోకపఱుచు** రూ.చూ. జోకపఱచు. స.క్రి. 1. కలిగించు ; 2. జతపరుచు, సమానం చేయు ; 3. కావించు. **జోకలుగట్టు(-కట్టు)** అ.క్రి. మొత్తాలగు, గుంపులగు. శివరా. 4.5. **జోకవడు(-పడు)** రూ.చూ. జోకపడు. అ.క్రి. జతపడు. **జోకసేయు(-చేయు)** రూ.జోకచేయు. స.క్రి. పోల్చు. యయా. 1.30. అ.క్రి. పోల్చదగు.

**జోకము** వి. 1. ప్రమాదం ; 2. తారుమారు.

**జోకరు** వి. 1. హాస్యగాడు ; 2. పెద్ద ఉరవుగా ఎన్నబడే పేక ముక్క.

ఇం. *Joker*. హాస్యగాడు.

<ఇం. Joker.

**జోకిచ్చు** చూ. జోకు[3].

**జోకు**[1] వి. 1. తిట్టు. శృం. నై. 7 59 ; 2. బొంకు. స.క్రి. 1. తిట్టు ; 2. కొట్టు.

పో.చూ. క. జంకు. తిట్టు, చీవాట్లు పెట్టు.

**జోకుపెట్టు**[1] స.క్రి. 1. తిట్టు, కొట్టు ; 2. బొంకు.

**జోకేయాలు** వి.బ.వ. తిట్లతో ఉన్న గేయాలు. <జోకు[1] + సం. గేయ- + -లు.

**జోకు**[2] రూ.చూ. జోఁగు. వి. ఓడ.

**జోకు**[3] స.క్రి. తూచు.

**జోకిచ్చు** స.క్రి. తూనికవేయు. <జోకు[3] + ఇచ్చు.

**జోకుపెట్టు**[2] స.క్రి. తూచు.

**జోకు**[4] అ.క్రి. గాలి మెల్లగా వీచు.

**జోకు**[5] వి. నీటిఊట, నీరుఊరే కాలువ.

క. జవ్వగు, జోగు, జవళు, జవ్వళు. చిత్తడినేల.

**జోకు**[6] వి. హాస్యోక్తి.

ఇం. *Joke*. పరిహాసం, ఎగతాళి.

<ఇం. Joke.

**జోకెము** రూ.చూ. జోక్యము. వి. జోక్యం, జోలి.

**జోకేయాలు** చూ. జోకు[1].

**జోక్యము** రూ. జోకెము. వి. సంబంధం, జోలి.

సం. యౌగిక-. వ్యుత్పత్త్యర్థంకల ; ప్రా. జోగియ-. పదాల సంబంధం వల్ల ఏర్పడ్డ శబ్దం.

<ప్రా. జోగియ-.

**జోగ** రూ.చూ. జాగా[1]. వి. చోటు, తావు, జాగా.

**జోగడ** రూ.చూ. జోవడ. వి. జోలపాట. పద్మ. 9.113.

**జోగపట్టియ** చూ. జోగము.

**జోగపట్టె** చూ. జోగము.

**జోగము** వి. 1. యోగం, చిత్తైకాగ్ర్యం. అచ్చ.రా. బాల. 160 ; 2. స్త్రీ పురుష సంయోగం.

సం. యోగ-. చిత్తనిరోధం, మనః ప్రణిధానం ; ప్రా. జోగ- ; పా. యోగ-.

క. జోగ ; తు. జోగ ; మ. చోకమ్.

<ప్రా. జోగ-.

**జోగపట్టియ** రూ. జోగపట్టె. వి. యోగపట్టం, యోగులు జందెంలాగ తాల్చే పట్టుపట్టియ. హర. 5.40. **జోగపట్టె** రూ.చూ. జోగపట్టియ. వి. యోగపట్టం.

**జోగరగండ** రూ. జోగరగండఁడు. వి. 1. యోగాలకు శూరుడు, స్త్రీ పురుషుల్ని కలపటంలో దిట్ట. గంధ. 6 ; 2 యోగభేదకుడు, చిత్తైకాగ్ర్యాన్ని చెరిచే వాడు.

**జోగరగండఁడు** రూ.చూ. జోగరగండ. వి. 1. యోగాలకు దిట్ట ; 2. యోగభేదకుడు.

**జోగా** రూ.చూ. జాగా[1]. వి. స్థలం, ప్రదేశం.

**జోగి** వి. 1. యోగి. పండి. చ. 5.344 ; 2. బిచ్చగాడు ; 3. గ్రామదేవతల జాతరలో దైవారాధనకు ఇంటింట దండే బియ్యం ; 4. నాట్య విశేషం.

సం. యోగిన్, యోగీ ; ప్రా. జోగి- ; పా. యోగి- ; అప. జోఇ.

క. జోగి ; తు. జోగి ; మ. చోకి ; కువి. ఓగి. సాధువు ; బ్రా. జోగి. పాములవాడు.

<ప్రా. జోగి-.

**జోగిఇనాం** వి. ఊరి జాతరలో కథ చెప్పేవాడి కిచ్చే బహుమానం. **జోగిపట్టియ** రూ. జోగిపట్టె. వి. యోగిపట్టం. అచ్చ.రా. ఆరణ్య. 5.3. **జోగిపట్టె** రూ.చూ. జోగిపట్టియ. వి. యోగిపట్టం, యోగులు జందెంవలె తాల్చే పట్టుపట్టె.

**జోగిణి** వి. 1. సన్న్యాసిని. పండి. చ. 5.344 ; 2. ఒకానొక స్త్రీ దేవత. ఉ.హరి. 3.120 ; 3. సోదెకత్తె. హోర. 8 ఆ. ; 4. బిచ్చుకత్తె ; 5. నాట్యవిశేషం.

సం. యోగినీ ; ప్రా. జోగిణీ.

క. జోగతి.

<ప్రా. జోగిణీ.

**జోగిణీపంతు** వి. నాట్యవిశేషం. కవిరాజ. 3.88.

**జోగిణీపంతు** చూ. జోగిణి.

**జోగినపాపు** వి. ఒక విధమైన సాము. పన్నెండు పరవళ్ళలో ఒకటి. ప్రబంధ. 78.

**జోగు**[1] చూ. జోగి. రూ. జొగ్గు. వి. 1. భిక్షం. కువ.చ. 4.183 ; 2. దేవుని పేరిట ఎత్తే బిచ్చం. ఆం.బా. 3.50.

**జోగురాలు** వి. 1. సోదిచెప్పే భిక్షుకురాలు ; 2. యోగిని. <జోగు[1] + ఆలు. **జోగులమ్మ** వి. 1. జోగిణి, యోగిణి ; 2. సోదిచెప్పే బిచ్చుకత్తె. <జోగు[1] + -లు + అమ్మ. **జోగులయిలవేల్పు (-ఇలవేల్పు)** వి. జోగులైన భైరవ మతస్థులకు కులదేవత, భైరవుడు. కాశ. 4.154. **జోగులయ్య** వి. 1. సన్న్యాసి ; 2. బిచ్చగాడు ; 3. సోమరి. <జోగు[1] + -లు + అయ్య.

**జోగు**[2] అ.క్రి. తూగు. వి. తూగటం.

**జోఁగు** రూ. జోకు[2]. వి. వెదురుబద్దల్ని పేపబెత్తాల్ని పేర్చి అల్లిన తెరచాపలు మూడు నుంచి పన్నెండుదాకా అమర్చే పెద్ద ఓడ. శృం.నై. 3.101, కాశీ. 1.138.

మల. జోంగ్. నౌకావిశేషం.

<మల. జోంగ్.

**జోటము** వి. దుప్పటి.

సం. జోటీ-. జమిలిదుప్పటి, దుప్పటి.

**జోటి** రూ. జోటిక. వి. **1.** స్త్రీ, ఆడది. నిర్వ.రా. 9.91; **2.** భార్య.భాస్క.రా.బాల. 235.

సం. యోషా, యోషిత్; ప్రా. జోసిఆ, జోషిత్.

**జోటికత్తియ** రూ. జోటికత్తె. వి. చెలికత్తె. **జోటికత్తె** రూ.చూ. జోటికత్తియ. వి. చెలికత్తె.

**జోటిక** రూ.చూ. జోటి. వి. **1.** భార్య.సుద. 1.129; **2.** స్త్రీ. ఆం.భా. 2.104.

**జోటిపని** చూ. జోడు.

**జోటీబుఙ్జ** వి. దోటికఱ్ఱ.

**జోడ** రూ.చూ. జోడా. వి. **1.** రెండు వస్తువులు, జత; **2.** పడుగుమడతలో, చువ్వతో బాటు ఎక్కించిన కఱ్ఱ; **3.** నేత పడుగుకు చివరపెట్టిన రెండు కఱ్ఱలు; **4.** మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేత.

**జోడకట్టు** స.క్రి. రెండు పోగులు తెగినప్పుడు వాటిని కలిపి అతుకు. వి. రెండేసి ఆకుల్ని కలిపి కట్టే తీరు. **జోడపెట్టు** స.క్రి. ఒరల తయారీలో వలయాలను ఒకదానిపై ఒకటి జోడించు.

**జోడక్కిడి** చూ. జోడు.

**జోడగించు** చూ. జోడఁగి, జోడన. రూ. జోడఁగించు. స.క్రి. జోడన కలిగించు, గుఱ్ఱాన్ని దౌడుతీయించు. సారంగ. 1.83.

**జోడంగి** రూ. జోడఁగి, జోణఁగి, జోనంగి, జోనఁగి. వి. మిక్కిలి వేగంగా పరిగెత్తే వేటకుక్క. కవిరాజ. 2.91.

సం. యవనక-. యవనదేశ సంబంధి; ప్రా. జవణ-, జోణ-.

<ప్రా. జోణ-.

**జోడఁగి** రూ.చూ. జోడంగి. వి. మిక్కిలి వేగంగా పరిగెత్తే వేటకుక్క.

**జోడఁగివేపి** వి. ఒకజాతి వేటకుక్క.

**జోడఁగించు** రూ.చూ. జోడగించు. స.క్రి. గుఱ్ఱాన్ని దౌడు తీయించు.

**జోడంచు** చూ. జోడు.

**జోడన** రూ. జోనడ. వి. **1.** ద్వయం, జత. ఆము. 5.117; **2** ధౌరితకం, అశ్వగతి భేదం. ఉ.రా. 1.68.

సం. జవన-. వేగంకల, వేగంగా పరుగెత్తే గుఱ్ఱం; ప్రా. జఉడ-. త్వరితంచేయు; జవణ-. వేగంగా పరిగెత్తించు, శీఘ్రగతి.

<ప్రా. జఉడ-.

**జోడమ్మ** చూ. జోడు.

**జోడా** రూ. జోడ. వి. **1.** నతిభేదం; **2.** రెండు వస్తువులు; **3.** జత, ఇరువురు; **4.** కంసాలులు వగైరా రాయించిన అర్జీ కాగితాలు; **5.** పెంకుల్ని ఒకదాంట్లో ఒకటి దూర్చి పేర్చే తీరు; **6.** ఒకదాంట్లో ఒకటి దిగేసిన అయిదు గూనలు; **7.** వరిచేలల్లో ఎక్కువగా పెరిగే ఒక జాతి కలుపుమొక్క; **8.** దొంగగొడ్లకు ఒకవైపు రెండు కాళ్ళకూ కలిపికట్టే కట్టు; **9.** పడుగు మడతలో, చువ్వతో బాటు ఎక్కించిన కఱ్ఱ; **10.** నేత పడుగుకు చివర పెట్టిన రెండు కఱ్ఱలు; **11.** మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట.

ఒ. జోడయిబ. కలపడం; జోడ. జత; హిం. జోడా. జత; గు. జోడావుఁ. కలపటం; జోడా. జత; మరా. జోడణెఁ. కలపటం, జతచేర్చటం; జోడ. కలయిక, జోత; ఉ. జోడా. రెండు వస్తువుల్ని జత చేయటం.

<ఉ. జోడా.

**జోడాకట్టు** స.క్రి. అచ్చుబద్దెలో ఎక్కించిన కఱ్ఱ దగ్గర మరొక కఱ్ఱ దూర్చి కట్టు. **జోడాకఱ్ఱ** వి. **1.** పడుగులో రెండు చివర్లా ఎక్కించిన కఱ్ఱ; **2.** అచ్చుతికిన తరువాత, పడుగులో దూర్చిన కఱ్ఱ. **జోడాగుది** వి. **1.** పడుగు మడతలో ఎక్కించిన కఱ్ఱకు కట్టిన దారం; **2.** పెడకోలకు తగిలించే మలగఱ్ఱ దారం. **జోడాచివ్వ** వి. పడుగు మడతలో విరువు చివ్వలతోబాటు ఎక్కించిన కఱ్ఱ. **జోడాబద్దలు** వి.బ.వ. నేత పడుగుకు చివర పెట్టిన రెండు కఱ్ఱలు. **జోడాయించు** స.క్రి. జోడించు, రెంటిని కలుపు. <జోడా+ -ఇంచు[3]. **జోడాలు** రూ. జోదాలు. వి.బ.వ. **1.** మొక్కలు. ఆం.భా. 2.175; **2.** వరిపైరులో కలిసి ఎదిగే గడ్డి మొక్కలు.

**జోడించు** చూ. జోడు.

**జోడింపు** చూ. జోడు.

**జోడిళ్లు** రూ. జోడీలు, జోటిళ్లు. వి.బ.వ. నమస్కారాలు. ప్రబంధ. 880.

**జోడీ** వి. జత, రెండు వస్తువులు.

**జోడీలు** రూ.చూ. జోడిళ్లు. వి.బ.వ. **1.** జంటలు; **2.** నమస్కారాలు.

**జోడు** వి.దే. **1.** జత, యుగం, రెండు వస్తువులు. పండి.చ. 5.308; **2.** కవచం. భార.భీష్మ. 3.221; **3.** సహచరం, మిత్రం. క్రీడా. 221; **4.** విధం. ప్రబంధ. 788; **5.** అశ్వకవచం. చంపూరా. 5.62; **6.** మిథునం, ద్వంద్వం. ఆం.నా.సం. 42; **7.** తోలు, పట్టెడ; **8.** సాటి, సరి; **9.** ఊఁట; **10.** మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట; **11.** ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టాల జత; **12.** నమస్కారం; **13.** బండి కుండలో బిగించిన ఆకుల్ని పట్టిఉండే గుండ్రటి కొయ్యచట్రం; **14.** కాలితొడుగు; **15.** కళ్ళజోడు. విజ. సమానం. రామాభ్యు. 6.228.

క. జోడు. జత, సమత, కలయిక; కొడ. జోడి; తు. జోడు; త. చోడు, చోటి, చోటు; మ. జోటి. జత, జంట; జోట. చెప్పులజత; గోం. జోరా; కుఇ. జోడి; కురు. జోడా; బ్రా. జోడా-.

సం. యుజ్. బంధించు, కలుపు, చేర్చు; ప్రా. జోడ-. యుగళం, జోడించు, జోడింపబడింది; అమా. జోతియ; అప. జోడ; హిం. పం. సిం. గు. జోడ,

జోడక; మరా. జోఁనే. చేర్చు, కలుపు.

**జోటిపని** వి. మిథునకృత్యం, సురతం, సంయోగం. అచ్చ. రా. అరణ్య. 9. **జోడక్కిడి** వి. రెండు లొట్టలు (గింజలు పొయ్యే వెడుళ్ళు) వేసిన అక్కిడికట్టె. **జోడంచు** వి. రెండుగా చీలినట్టు పెట్టిన అంచు. < జోడు + అంచు.[3] **జోడమ్ము** వి. చేయమ్ము, చేతితో ప్రయోగించే బాణం, విల్లు అక్కర లేకుండా ప్రయోగించే బాణం. ఆము. 6.6. < జోడు + అమ్ము[1]. **జోడించు** స.క్రి. **1.** జతచేయు. హరి. పూ. 7.86; **2.** కూర్చు, చేయు, రచించు. కువ.చ. 5.9; **3.** కల్పనచేయు, కల్పించు. వ్యి.సార.చ. 1.20 పు. 7 పం.; **4.** వెంటనంటు. కకుత్స్థ. 4.98. **జోడింపు** వి. **1.** ముప్పై రెండు విన్నాణాల్లో ఒకటి, మల్లబంధ విశేషం. ప్రబంధ. 78 : **2.** కూర్పు, చేర్పు. **జోడుకట్టు** రూ.చూ. జోడుగట్టు. అ.క్రి. మైత్రిచేయు, కవకూడు. స.క్రి. రెండు పోగులు తెగినప్పుడు వాటిని కలిపి అతుకు. వి. రెండేసి వరసల ఆకుల్ని కలిపి కుట్టే తీరు. **జోడుకోడియ** రూ.చూ. జోడుకోడె. వి. **1.** సహచరం, మిత్రం. రామాభ్యు. 1.122; **2.** వంటవాడు; **3.** సాటివాడు. **జోడుకోడె** రూ. జోడుకోడియ. వి. **1.** సహచరం, మిత్రం. వరాహ. 10.48; **2.** సరికోడె, జతగాడు. పారి. 2.41; **3.** సమానుడు; **4.** వంటవాడు. **జోడుగట్టు(-కట్టు)** రూ. జోడుకట్టు. స.క్రి. జతకట్టు. నిరంకు. 3.20. **జోడుగరిపేటు** వి. అంచులో నేసిన ఒకరకం డిజైను. **జోడుగూడు(-కూడు)** అ.క్రి. కవగూడు, కలియు, మిళితమగు, జతకలియు. కేయూర. 3.7. **జోడుగూర్చు (-కూర్చు)** స.క్రి. **1.** సరిచేయు, పోల్చు. చంద్రాంగ. 4.127; **2.** జతకలుపు, కూర్చు. **జోడుతపేల** రూ. జోడుతపేలా. వి. **1.** లోహపు పాత్ర; **2.** కాఫీతాగే పాత్ర; **3.** నీళ్ళు కాచుకునే అండా. **జోడుతపేలా** రూ.చూ. జోడుతపేల. వి. నీళ్ళు కాచుకొనే అండా. **జోడుతాలి** వి. సుమారు జానెడెత్తుతో గుండ్రంగా చేసిన మట్టి పాత్ర. **జోడుదరియు** రూ.చూ. జోడుదఱియు. స.క్రి. కవకూడు, పొందు, కలియు. **జోడుదఱియు** రూ. జోడుదరియు. స.క్రి. జోడుగూడు, కలియు. హం.న. 2.61. **జోడునాధ్గారీచీర** వి. రెండు ఎర్రపోగుల మధ్య ఒక నల్లపోగు పెట్టి నేసిన గళ్ళ చీర. **జోడుపురి** వి. రెండు పోగులు కలిపి పురి పెట్టిన దారం. **జోడుపులుగు** వి. జంటపిట్ట, చక్రవాకం **జోడుబట్టు (-పట్టు)** అ.క్రి. జోడెక్కు, నేల నీళ్ళచే చితచితలాడు. **జోడురాలు** వి.బ.వ. క్రీడావిశేషం, ఒక విధమైన ఆట. హంస. 3.146. **జోడులాహిరీ** వి. అంచులో రెండు లాహిరీలు వరసగా పడేట్లు నేసిన డిజైను. **జోడులాహిరీపేటు** వి. అంచులో రెండు లాహిరీలు వరసగా పడేట్లు నేసిన డిజైను. **జోడువుచ్చినవాఁడు (-పుచ్చినవాఁడు)** విణ. కవచహీనుడు. భార. భీష్మ. 3.303. **జోడువేల్పురిక్క** వి. విశాఖా నక్షత్రం. **జోడువేల్పులరిక్క** వి. విశాఖ నక్షత్రం. **జోడుసరం** వి. జంట దూలం. **జోళ్లు** వి.బ.వ. **1.** వాద్య విశేషం; **2.** చెప్పుల జత; **3.** ముక్కద్దాలు.

**జోడెక్కు** అ.క్రి. నేల నీళ్ళచే చితచితలాడు.

**జోణఁగి** రూ.చూ. జోడంగి. వి. సన్నంగా ఉండి మిక్కిలి వేగంగా పరిగెత్తే వేటకుక్క. ఆం.భా. 2.280.

**జోత[1]** రూ.చూ. జతికె. వి. గొడ్ల పట్టెడ.

**జోత[2]** రూ. జోతము, జోతాము. వి. నతి, నమస్కారం. సారంగ. 1.44.

**జోతలుపెట్టు** రూ. జోతలువెట్టు. స.క్రి. మొక్కు. **జోతలువెట్టు (-పెట్టు)** రూ.చూ. జోతలుపెట్టు. స.క్రి. మొక్కు.

**జోతము** రూ.చూ. జోత[2]. వి. నతి, నమస్కారం.

**జోతా** వి. పన్నెకట్టే జంత్రం బొమ్మ దండెలు బిగించి కట్టిన గట్టి దారం.

**జోతాము** రూ.చూ. జోత[2]. వి. నతి, నమస్కారం.

**జోతి** వి. **1.** దీపం. వసు. 3.125; **2.** ప్రకాశం, వెలుగు. శశా. 1.38; **3.** వన్నె, రంగు. ఆం. నా. సం. స్థా. 17; **4.** పిండితోగాని, మట్టితోగాని చేసిన దీప పాత్ర, దీపం ప్రమిద.

సం. జ్యోతిస్. కాంతి, చంద్ర కాంతి; ప్రా. సోతి, జోఇ; పా. జోతి. కాంతి, అగ్ని, నక్షత్రం; ఒ. జ్యొ, జోఇ.

క. జోతి; త.మ. చోతి.

< సం. జ్యోతిస్.

**జోతిబాణందేవర** వి. చౌడీశ్వరి, చేనేతపని చేసే దేవాంగులు, తొగట బలిజెలు మొ. వారు కొలిచే దేవత. **జోతిబాణందేవరజాతర** వి. చౌడీశ్వరిని కొలవటానికి చేసే ఉత్సవం.

**జోతిక** వి. కాడికి ఎడ్లను కట్టే పట్టెడ.

సం. జ్యోతిస్. కాంతి.

**జోదాలు** రూ.చూ. జోడాలు. వి.బ.వ. **1.** మొక్కులు; **2.** వరిపైరుతో కలిసి ఎదిగే ఒక విధమైన గడ్డి విత్తనం.

**జోదిళ్లు** రూ.చూ. జోడిళ్లు. వి.బ.వ. నమస్కారాలు. హంస. 4.213, ఆం.భా. 2.175.

**జోదు[1]** వి. **1.** యోధుడు, యుద్ధం చేసే బంటు. భార. ఆది. 6.86; **2.** తెంక; **3.** దిట్ట.

సం. యోధ-. యుద్ధం చేసేవాడు, శూరుడు; ప్రా. జోహా. పీకుడు; జుద్ధ-. యుద్ధం; జై. మహా. జుజ్ఝ. యుద్ధం; పా. యోధ.

క. జోద. మావటీడు; జోదక. యోధుడు; కువి. జుధోమి. యుద్ధం.

< సం. యోధ-.

**జోదుపిండు** వి. యోధ బృందం. భార. భీష్మ. 1.275. **జోదులపిండు** వి. యోధ బృందం.

**జోదు[2]** వి. నీళ్ళు మట్టీ, కలిసీ కలియకుండా ఉన్న స్థితి.

**జోదుపులుగు** వి. జక్కవ, జంటపిట్ట.

సం. యుక్త-. కూడిన; ప్రా. జుత్త-, జోత్త.

**జోన** చూ. సోన. వి. కొండల నడుమ పారే వాగు

**జోనంగి** రూ.చూ. జోడంగి. వి. సన్నంగా ఉండి, మిక్కిలి వేగంగా పరిగెత్తే వేట కుక్క.

**జోనఁగి** రూ.చూ. జోడంగి. వి. సన్నంగా ఉండి మిక్కిలి వేగంగా పరిగెత్తే వేట కుక్క.

**నడ** రూ.చూ. జోడన. వి. అశ్వగతి భేదం. ధౌరితకం. (వర్ణ వ్యత్యయం).

**నలము** రూ.చూ. జోనాలము. వి. **1.** ఎక్కువ ఎరుపున్న నలుపు ; **2.** జొన్న.

**నళము** రూ.చూ. జోనాలము. వి. **1.** ఎక్కువ ఎరుపున్న నలుపు ; **2.** జొన్న.

**నాలము** రూ. జోనలము, జోనళము, జోనాళము. వి. **1.** ఎక్కువ ఎరుపుగల నలుపు ; **2.** జొన్న.

సం. యవనాల-. జొన్న ; జొన్నాళ ; ప్రా. జొణ్ణాలిఅ ; కుమా. జునాలొ. సజ్జ ; నే. జునెలొ, జున్యాలొ. పెద్ద జొన్న ; బెం. ఒ. జనార్. ఒక రకం సజ్జ ; బీ. జనెర్(అ), జినొరా, జొన్హ్రి. జొంధ్రీ. సజ్జ, జొన్న ; హిం. జున్హార్, జూంన్హ్రి.

< ప్రా. జొణ్ణాలిఅ.

**నాళము** రూ.చూ. జోనాలము. వి. **1.** ఎక్కువ ఎరుపుగల నలుపు ; **2.** జొన్న.

**ని** వి. బంకగా ఉన్న ద్రవం, జిగురు.

**ను** వి. మండల విభాగం.

ఇం. *Zone*. నడికట్టు, వడ్డాణం, రంగులోగాని, నేతలోగాని, స్వభావంలోగాని ఆవృతమైన వస్తువ కంటె విలక్షణంగా కన్పించే చుట్టుపట్టీ లేదా చార, నిరక్ష రేఖకు సమాంతరంగా ఉన్న 5 మండలాల్లో ఒకటి, వడ్డాణంలా చుట్టును చుట్టు, మండలంగా విభజించు, ఏర్పరచు.

< ఇం. Zone.

**జోపానమగు** అ.క్రి. అలసిపోవు.

**జోపానము** వి. **1.** క్షేమం ; **2.** జాగ్రత్త ; **3.** జాగ్రత్తగా పోషించటం.

**జోపు** రూ.చూ. చోపు. స.క్రి. తరుము, తోలు, తొలగించు.

**జోబ** రూ.చూ. సోబు. వి. శోఫ, ఒకానొక వాపురోగం.

**జోబడి** వి. **1.** మంచె, చప్పరం, పెళ్ళి పందిరి ; **2.** పైరు రక్షణకు చేలో గుంజలు పాతి పైన తడికె వేసి కట్టిన అరుగు.

ప్రా. ఝొప్డ్. గుడిసె ; హిం. ఝొంప్కా. గుడిసె ; మరా. ఝొపా, ఝొపడీ. గుడిసె.

క. జోపడి.

< మరా. ఝొపడీ.

**జోబందు** రూ.చూ. జేబందు. వి. అద్దుకారితాపి, కండెబద్ద, తాపి పనివాళ్ళు వాడే పరికరం.

**జోబన్‌బద్ద** వి. పొడుగ్గా సన్నంగా ఉండే కొయ్యతాపి.

**జోబిళ్ళు** వి.బ.వ. **1.** నమస్కారాలు ; **2.** నమ్రత.

**జోబీ** రూ.చూ. జేబు. వి. జేబు.

**జోమాలదండ** వి. ఆభరణ విశేషం.

**జోము** వి. **1.** సుఖం. వేమన. 3.270 ; **2.** సొమ్మ ; **3.** తిమ్మిరి ; **4.** చదువుతూ తల ఆడించటం.

క. జోము, జొంపిసు, జోంపిసు. మత్తుకలుగు, దిగ్భ్రమ చెందిన, సొమ్మసిల్ల చేయటం ; జొంపు, జోంపు. మత్తు, మైకం ; జొమ్ము. మత్తు, మైకం ; జోబ, జోబ్రద. సోమరిపోతు ; సోమారి. సోమరి ; సోమారితన. సోమరితనం ; సొప్పిసు. క్షీణించు ; సొప్పు. సడలు, అణచు, ఆపు ; తు. సోమారి. సోమరిపోతు, సోమరియైన ; త. చోంపు (చోంపి). సోమరియైన ; చోంపల్. సోమరితనం, మైకం ; చోంపేఱి, చోమాఱి. సోమరి ; చోమాఱు (-చోమాఱి). సోమరిగాఉండు, తప్పించుకొను ; చోప్పు (చోప్పి). క్షీణించు ; చోపం. మూర్ఛ, సోమరితనం ; చోపలం. సోమరితనం ; కో. చో.మ్.రి., చొంబెరి. సోమరిపోతు ; కువి. జోమలి, జోమినై. విశ్రాంతి తీసుకొనటం.

**జోమెక్కు** అ.క్రి. కాళ్ళూ చేతులూ వాచు. < జోము + ఎక్కు.

**జోమెక్కు** చూ. జోము.

**జోర** వి. ఉన్నితో నేసినది, కంబళి.

**జోరతట్టు** వి. **1.** ఒకరకం పట్టుగుడ్డతో కుట్టిన కుంచె చెంప ; **2.** పాకం మన్నులో తడిఆరకుండా పైనకప్పే ముతకబట్ట. **జోరవంత** వి. నర్సేటప్పుడు పాత్రల కింద పెట్టుకొనే మెత్తనిదిండు.

**జోరావరి** వి. **1.** బలాత్కారం ; **2.** బలిమి, జోరు.

హిం.ఉ. జోరావర్. శక్తి ; మరా. జోర. శక్తి, బలం.

క. జోరావరి ; త. సోరావరి.

< ఉ. జోరావర్.

**జోరాహెరి** వి. ఆదాయం వ్యయం తెలియని ఖర్చు, మితిమీరిన వెచ్చం.

**జోరిగాఁడు (-కాఁడు)** వి. ఒకరకం భరతపక్షి.

**జోరీగలకట్టె** చూ. జోలు. వి. ఆముపైన కప్పడానికి వాడే ఒకరకం చెట్టుపల్లలు.

**జోరీగాకు** చూ. జోలు. వి. ఒకరకం కలుపుమొక్క.

**జోరు** వి. **1.** వాన మొ. కురవటంలో అయ్యే ధ్వని అనుకరణం. వసు. 2.12 ; **2.** బలం, దురుకుతనం ; **3.** మెరకనేల ; **4.** చిక్కగా లేకుండ నీళ్ళు నీళ్ళుగా పలచగా ఉండటం ; **5.** ద్రవం ; **6.** కొండవాగుల నీళ్ళకు గట్టుకట్టి సాగు చేసేభూమి ; **7.** బలాత్కారం.

హిం. జోర్. బలం, నేరం ; మరా. జోర్. శక్తి బలం ; ఉ. జోర్. బలం, శక్తి ; పార. జోర్. అన్యాయం, బలప్రయోగం

< ఉ. జోర్.

**జోరుకట్టుభూమి** వి. కొండవాగుల నీళ్ళకు గట్టుకట్టి సాగుచేసేభూమి. **జోరుచేయు** అ.క్రి. చెలరేగు, ముమ్మరించు ; స.క్రి. **1.** పలచన చేయు ; **2.** వేగం హెచ్చించు. **జోరుపాలం** వి. కొండ వాగుల నీళ్ళకు గట్టుకట్టి సాగుచేసే భూమి. **జోరుమట్టి** వి. ఆము కప్పడానికి వాడే బురదమట్టి. **జోరుమణఁగు** అ.క్రి. అతిశయం తగ్గు.

**జోరుకబోదు** చూ. జోలు. వి. ఆకాశపల్లేరు, ఒకరకం చెట్టు.

**జోర్చు** చూ. తూర్చు. స.క్రి. దొప్పించు, దొచ్చుకొని పోయేటట్లుచేయు.

**జోర్లాడు** వి. జుట్టు రేగిపోకుండా పెట్టుకొనే వెండిరేకు.

**జోటీఁగ** రూ. జోఁటు.

**జోటు** రూ. జొట్టు. వి. ఈగలు మొ. ఎగిరేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం.

**జోటీఁగ** రూ. జొట్టీఁగ, జోటుబీఁగ. వి. పశుమక్షిక, ఒకానొక ఈగ. వేమ. శ. 51. **జోటుటీఁగ** రూ.చూ. జోటీఁగ. వి. పశుమక్షిక, ఒకానొకఈగ. హంస. 5.30.

**జోల** వి. బిడ్డల్ని నిద్రపుచ్చటానికి పాడేపాట. రామాభ్యు. 3.138, ఐందు. 2.15.

**జోలపాట** వి. పిల్లల్ని నిద్రపుచ్చేటప్పుడు పాడేపాట.
**జోలపాడు** స.క్రి. జోలపాటపాడు.

**జోలడి** రూ.చూ. జోలారు. వి. వంటచేసే చోట కల్గుపడకుండా పాలవెల్లిలాగా వేలాడదీసిన తడిక.

**జోలవారం** వి. వాలుపంచ.

**జోలారు** రూ. జోలడి. వి. వంటచేసే చోట కల్గుపడకుండా పాలవెల్లిలాగా వేలాడదీసిన తడక.

**జోలి**[1] వి. 1. కార్యం, పని. భార. భీష్మ. 2.7; 2. విషయం, సంగతి. ఉ.రా. 2.276; 3. గాథ. మల్ల. 2.39; 4. సంబంధం. శుక. 2.150; 5. వృత్తాంతం. అచ్చ. రా. యు. 4.58; 6. రీతి; 7. వెరవు; 8. ముచ్చట; 9. భార్యా భర్తల రహస్యం; 10. ఊసు.

సం. యమల-. జంట, యుగ్మం; ప్రా. జమల-, జవల- తుల్యం, సమానం. సహవర్తి; అ.మా. జమల-. యుగ్మం; పా. యమల-; అప. జవలా. సమీపం.

క. జోలి, జోళి. కార్యం, పని; త. చోలి, సోలి. కార్యం. కష్టం; మ. చోలి. పని; జోలి. ఇబ్బంది.

<ప్రా. జవల-.

**జోలిచెప్పు** స.క్రి. ఇతరుల విషయం చెప్పు. **జోలిత్రవ్వు** స.క్రి. అనవసరమైన విషయాల్లో జోక్యం కలిగించుకొను. శుక. స. 2.172. **జోలియెత్తించు** (-ఎత్తించు) స.క్రి. సంగతి చెప్పు అచ్చ. రా. యు. 458. **జోలిపెట్టు**(-పెట్టు) స.క్రి. ముచ్చటపెట్టు, భాషించు.

**జోలి**[2] రూ.చూ. జోలియ. వి. బిచ్చపుసంచి.

**జోలికూడు** వి. బిచ్చపుకూడు, తిరిపెం.

**జోలియ** రూ. జోలి[2], జోలె. వి. 1. ఉయ్యాల. కు. సం. 10.13; 2. బిచ్చపుసంచి.

సం. ఝోలికా. చిన్నసంచి; ప్రా. ఝొల్లిఅ, ఝోలిఅ, ఝోలికా. సంచి; నే. ఝులి. బిచ్చపుసంచి; బెం. ఝోలి, ఝోలి. సంచి; బీ. ఝోలా, ఝోలీ. పశువుల దాణాసంచి; హిం. ఝోలీ. సంచి; పం. ఝోలా, ఝోలీ; మరా. ఝోళీ. బిచ్చపుసంచి; గు. ఝోలీ, ఝోణీ.

క. జోళిగె, జోళె, జోళి; తు. జోలి, జోలిగె, జోళి, జోళిగె; త. సొళి, చోళి.

<ప్రా. ఝొల్లిఅ.

**జోలు** వి. గొడ్ల మెడలకు అందానికి గాని, వాటిని కాడికిపూన్చ డానికిగాని, కట్టేటారు లేక తోలు.

క. జోల్. వేలాడటం.

**జోలుమెడ** వి. మెడకింద తోలు పల్చబడి వేలాడటం.

**జోలె** రూ.చూ. జోలియ. వి. 1. భిక్షార్థం చౌకపు గుడ్డనాలుగంచులు చేర్చి ముడివేసిన సంచి. హర. 5.40; 2. ఉయ్యాల. సాంబ. స్థా. 64.

**జోలెకాఁడు** వి. భిక్షుకుడు, బిచ్చగాడు. సీతావి. 4.137.

**జోల్లబరగ** వి. ఉన్నిగొంగడి నేసేటప్పుడు, పడుగులో దూర్చిన బద్ద.

**జోళ్లు** చూ. జోడు.

**జోవ** వి. పిల్లల్ని నిద్రపుచ్చడానికి పాడేపాట, లాలిపాట.

**జోవడ** రూ. జోగడ. వి. జోలపాట. వేంక. పంచ. 1.590.

క. జోగళ, జోగుళ.

**జోసి** వి. జోస్యుడు, జ్యోతిషికుడు, జోస్యమెరిగినవాడు.

సం. జ్యోతిషిక-, జ్యౌతిషిక-. జోస్యుడు; ప్రా. జోఇసిఅ-; కుమా. జోసీ; నే. జైసి; బెం. జోసి; హిం. జోసీ; గు. జోసీ; మరా. జోసీ.

<ప్రా. జోఇసిఅ.

**జోస్యము** చూ. దోస్యము. వి. జోతిశ్శాస్త్రం, గ్రహగతి వలన ఫలితాలు చెప్పే శాస్త్రం.

సం. జ్యోతిష-, జ్యౌతిషిక-. జ్యోతిశ్శాస్త్రం; ప్రా. జోఇస-, జోఇసిఅ. జ్యోతిషికుడు, దైవజ్ఞుడు; మా. జోయిశ; పా. జోతిసా. జ్యోతిశాస్త్రం.

క. జోఇస, జోస్య. జోస్యం; జోయిసిగ, జ్యోసుడు; తు. జోయిస. దైవజ్ఞుడు; జోతిస. జ్యోతిషం; మ. జోతిస్సమ్.

<ప్రా. జోఇస-.

**జోస్యముచెప్పు** స.క్రి. భవిష్యత్తును జ్యోతిశ్శాస్త్రరీత్యా చెప్పు.

**జోస్యుఁడు** వి. జ్యోతిషికుడు. భార. అను. 4.121.

సం. జ్యోతిషిక-, జ్యౌతిషిక-. జోతిష్కుడు; ప్రా. జ్యోఇసిఅ-; కుమా. జోసీ; నే. జైసి; బెం. జోసి; హిం. జోసీ; గు. జోసీ; మరా. జోసీ.

< ప్రా. జ్యోఇసిఅ-.

**జోహరు** రూ.చూ. జోహారు. వి. నమస్కారం.

**జోహరువు** రూ.చూ. జోహరు. వి. నమస్కారం.

**జోహారు** రూ. జొహారు, జొహారువు, జోహరు, జోహరువు, జోహారువు. వి. నమస్కారం. భార. ఆరణ్య. 4.359.

ప్రా. జోహార-. ప్రణామం; బెం. మరా. జోహార్.
క. జోహార, జోహార; కువి. జోహెార. ప్రార్థన.

<ప్రా. జోహార-.

**జోహారుసేయు**(-చేయు) అ.క్రి. నమస్కరించు, మొక్కు.

**జోహారువు** రూ. జోహారు. వి. నమస్కారం. పల్నా. 7.55.

**జోహుకుముచేయు** అ.క్రి. ప్రభువును ఆనతిమ్మని వేడు, దానిన వలె నడుచుకొను.

హిం.ఉ. హుకుమ్. ఆజ్ఞ.

**జౌకపడు** చూ. జౌక. అ.క్రి. జతపడు, కవగూడు.

**జౌకించు** చూ. జౌకు.

**జౌకు** రూ. జవుకు. వి. 1. బురద, పంకం. చంద్రాంగ. 3.110; 2. ఈగటంలోని విశేషం. అ.క్రి. 1. జవుకు, మెత్తబడు, కుంగు; 2. బెదరు; 3. సారహీనమగు; 4.

వర్షం ఎక్కువవటంవల్ల నేల చితచితలాడు.

క. జవళు, జవుగు, జవ్వళు, జోగు. చిత్తడినేల; త. చవు. నీరసపడు; చవున్‌కు. బలహీనమగు, జారు, అధైర్యపడు; మ. చవలుక. వంగు, వికారంగా కనపడు.

మూ. ద. ద్రా. *చవ్-.

జౌకించు రూ. జవుకించు. స.క్రి. 1. వేలాడేటట్లుచేయు; 2. మెత్తపరచు.

**జౌజవ్వ** రూ. జవుజవ్వ. వి. 1. జవ్వకు ఆమ్రేడితరూపం, పరిగెత్తటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. మను. 4.111; 2. కుంగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి. పరమ. వి. 4.157.

**జౌరు** రూ.చూ. జవురు. స.క్రి. 1. కొట్టు. విజయ. 3.13; 2. చేతులతో పోగుచేసి ఎత్తు. అ.క్రి. అత్యాచారం చేయు.

జౌరుకుంచె వి. పడుగుమీద ఒకవైపునుంచి, మరొక వైపుకు ఆపకుండా పుచ్చే కుంచె. జౌరుకొను రూ.చూ. జవురుకొను. స.క్రి. చేతులతో తీసుకొను.

**జౌళి** రూ. జవళి. వి. ఒకానొకరాగం. ప్రబంధ. 96.

**జౌళికాయ** వి. గోరుచిక్కుడుకాయ.

క. చవళికాయి. గోరుచిక్కుడుకాయ.

<క. చవళికాయి.

**జ్మ** రూ.చూ. జమ. వి. రాబడి.

**జ్యోతిచుక్క** వి. అరుంధతి, సప్తర్షిమండలంలో వశిష్ఠుని దగ్గర కనపడీ కనపడకుండా ఉండే చిన్నచుక్క.

సం. జ్యోతిస్. కాంతి.

<సం. జ్యోతిస్ + చుక్క (అర్థవిపరి.).

# ఝ

**ఝండా** రూ.చూ. జెండా. వి. 1. పతాకం; 2. రాజుల వృత్తాంతం.

**ఝంపు** చూ. జంపు². వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78.

**ఝమ్మఝమ్మను** అ.క్రి. ఝంఝం అని శబ్దంచేయు. కు. సం. 11.155.

**ఝల్లను** చూ. ఝల్లు.

**ఝల్లు** రూ. జల్లు². వి. 1. భయాదులవల్ల గుండె మొ. వాటిలో కలిగే అలజడిని సూచించే ధ్వన్యనుకరణ శబ్దం. కు.సం. 5.3; 2. వాన, మిణుగురులు పడేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. శుక. 1.187; 3. రక్తం మొ. నవి పైకి ఉబికేటప్పుడియ్యే ధ్వనికి అనుకరణం.

ఝల్లను అ.క్రి. (గుండెలో) దిగులు దుఃఖం మొ. భావాల వల్ల 'ఝల్లు' మని అను. ఝల్లుమను అ.క్రి. ఉలిక్కిపడు. <ఝల్లు + అను. ఝల్లురను అ.క్రి. ఉలిక్కిపడు. యయా. 5.81.

**ఝళజళ** రూ.చూ. ఝళంఝళ. వి. వర్షధారాపాత ధ్వనికి అనుకరణం.

**ఝళఝళ** రూ.చూ. ఝళంఝళ. వి. వర్షధారాపాతధ్వనికి అనుకరణం. శుక. 3.251.

**ఝళంఝళ** రూ. ఝళజళ, ఝళఝళ. వి. 1. సెలయేరు ప్రవహించటానికి అయ్యేధ్వనికి అనుకరణం. కళా. 4.87; 2. కటక ధ్వనికి అనుకరణం, అందెలు మొ. వాటి చప్పుడుకు అనుకరణం. ప్రబంధ. 19.

**ఝళిపించు** స.క్రి. జళిపించు, జాడించు, చిమ్ము.

**ఝళుక్కు** వి. 1. చింత మొ. వాటిలో అయ్యే అనుకరణం. పార్వ. 4.147; 2. గుండె అదురుయొక్క అనుకరణం.

**ఝష్** వి. పన్నెండండల మధ్య బిగించిన వుల్లలు సాపచేసే గరుకురాయి.

**ఝషభిష** రూ. శషభిష. విణ. 1. కఠినమైన. ఘటికా. 1.8. సంస్కృతంలో 'శస్ భిస్' అనేవి క్రమంగా ద్వితీయా తృతీయా విభక్తి ప్రత్యయాలు. 'కర్మార్థమా? కరణార్థమా?' అనే చర్చ ఇటువంటిది. ఇటువంటివి అర్థం లేనట్టివిగానూ కఠినమైనవిగానూ సామాన్యులు భావిస్తారు. 2. అర్థంలేని.

<సం. శస్‌భిస్ (అర్థవిపరి.).

**ఝాటు** వి. మల్లవిద్యా సంబంధమైన పట్టాల్లు విసురుల్లో ఒకటి. హంస. 1.206. మల్లుపు. 3.69.

**ఝాటుఛాణు** వి. మల్లవిద్యా సంబంధమైన పట్టాల్లు విసురుల్లో ఒకటి. హంస. 1.206.

**ఝాడా** వి. పూర్తి, మొత్తం.

ప్రా. ఝాడఅ, ఝాడావణ. నిశ్శేషం. శుభ్రం; హిం. ఉ. ఝాడా. మొత్తం; మరా. ఝాడా. పూర్తి. మొత్తం.

<మరా. ఝాడా.

**ఝాడించినిలుచు** చూ. ఝాడించు.

**ఝాడించు** రూ. చూ. జాడించు. స. క్రి. తప్పులెన్నుతూ తిట్టు.

ఝాడించినిలుచు అ.క్రి. నిక్కబొడుచుకొను. రాజగో. 5.36.

**ఝాడి**¹ వి. పొద.

హిం. మరా. ఉ. ఝాడీ. పొద, చిన్నచెట్ల సమూహం. రంగా.చ. 2.141.

<ఉ. ఝాడీ.

**ఝాడి**² రూ.చూ. ఝారీ. వి. ఊరగాయలు మొ. నవి నిలవ ఉంచే పాత్ర.

**ఝూడ్మాలి** వి. దాసి.
హిం. ఝాడూ. చీపురు.
**ఝూరి** రూ.చూ. ఝారీ. వి. జాడీ.
**ఝారీ** రూ. జాడి, జాడియ, జాడీ, జారీ[1], ఝాడీ[2], ఝూరి. వి. 1. జలపాత్ర. యయా. 1.27; 2. కమండలం; 3. ఊరగాయలు మొదలైనవి నిలవఉంచే ఒకవిధమైన మట్టితో చేసిన పాత్ర.
సం. ఝర్-; ప్రా. ఝుర్; బెం. హిం. సిం. గు. మరా. ఝారీ. మెడ పొడుగ్గా ఉండే పాత్ర.
క. తు. త. జాడీ. కూజా, ఒక కొలతప్రమాణం; మ. చాడి. కూజా.
< ఉ. ఝారీ.
**ఝూల్** రూ.చూ. జాలు[4]. వి. చేతిమగ్గంమీద డిజైన్లు నెయ్యటానికి నేతపడుగుకు పైన వంతెన మాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు
**ఝూలు** రూ.చూ. జాలు[4]. వి. చేతిమగ్గంమీద డిజైన్లు నెయ్యటానికి, నేతపడుగుకుపైన వంతెనమాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు.
**ఝూటు** రూ.చూ. జూటా. వి. అబద్ధం, మోసం.
**ఝూటా** రూ.చూ. జూటా. వి. కల్ల, బొంకు.
**ఝుమ్మ** వి. ఈగలు మొ. మూగటానికి అనుకరణం. ఉ.హరి. 2.126.
**ఝూళిసేయు(-చేయు)** స.క్రి. జాడించిచేయు. బసవ. 4.93 పుట.
**ఝొరీ** వి. తివాసీమగ్గం కింది దోనె బిగింపుకోసం, పక్కన దెజ్జంలో దూర్చిన కర్ర.
**ఝోరు** చూ. జోరు. వి. వేగం. హంస. 5.61.
హిం. జోర్. బలం, శక్తి; మరా. జోర్. బలం, శక్తి. ఉ. జోర్. బలం, శక్తి, వేగం; పార. జోర్, జౌర్. హింస, అత్యాచారం, అన్యాయం; అర. జౌర్. జబర్దస్తీ.
< ఉ. జోర్.

# ట

**ట[1]** వి. మూర్ధన్య శ్వాస స్పర్శం, అల్పప్రాణం.
**-ట[2]** ప్రత్య. ధాతువులకు భావార్థకార్థాల్లో వచ్చే ప్రత్యయం. 1. కర్మార్థానికి ఉదాహరణం. భార.అరణ్య. 2.196; 2. భావార్థానికి ఉదాహరణం. భార.విరా. 1.226.
**ట[3]** వి. టంకానికి సంకేతం. ద.హిం.శా.సంపు. 5 శా.సం. 7. క్రీ.శ. 1388.
**టకటక** వి. 1. చలనం. భాస్క.శ. 96; 2. నడవటం. మొ. వాటి ధ్వనికి అనుకరణం.
**టకటకలాడించు** స.క్రి. పని చురుకుగా చేయు. < టకటక + -లు + ఆడించు.
**టకటంకు** రూ.చూ. టకటొంకు. విణ. 1. మాయావిఅయిన. ఆం.భా. 2.286; 2. ధూర్తుడైన. వేంక.ఆం.మాన. 30. వి. 1. మాయ. మోసం; 2. మాయావి, టక్కరి, టాటోటు.
**టకటొంకు** రూ. టకటంకు. విణ. మాయావియైన. పాంచాలీ. 1.21. వి. మాయ. మోసం. సారంగ. 3.205.
**టకాటకి** క్రి.విణ.ద్రు. వడవడగా. ధ్వన్యను.
**టకాయించు** రూ. టొకాయించు, తకాయించు. స.క్రి. 1. ఎగరగొట్టు; 2. ఎదిరించు; 3. బాధపెట్టు.
హిం. టుకానా. అటకించు, విసురు.
< హిం. టకా(నా) + -ఇంచు[3].
**టకార** రూ.చూ. టకారి. వి. రంగులు కలిపి నూలుకి అద్దడానికి ఉపయోగించే మట్టిపాత్ర.
**టకారము** రూ.చూ. టకారి. వి. తట్టవంటి ఇనపపళ్లెం.
**టకారి** రూ. టకార, టకారము, టకారు. వి. ఇనపగంప, వెడల్పాటి ఇనపపాత్ర.
హిం. తగార్, తగారీ. ఒక రకమైన పాత్ర, గమేలా; మరా. తగారీ.
< హిం. తగార్.
**టకారు** రూ.చూ. టకారి. వి. ఇనపగంప, ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.
**టకాలుతెగు** అ.క్రి. లావగు.
మరా. ఠకార. సౌందర్యరూపం.
**టకీమని** అవ్య. వెంటనే, గమ్మున, టక్కున, యోచించకుండా, తటాలున. ధ్వన్యను.
**టకీలున** క్రి.విణ.ద్రు. వెంటనే, గమ్మున, టక్కున. ధ్వన్యను.
**టకుట** వి. నవ్వడంలో అయ్యే ధ్వనికి అనుకరణం, హంస. 1.242.
**టకూరకుండ** రూ. టకోరాకుండ. వి. తాళాచిప్ప ఆకారంలో చేసిన వాద్యం.
**టకోరా[1]** వి. నగారా. పద్మ. యు. 171.
హిం. ఠకోర్. నౌబత్తు; ఉ. ఠకోరా. నౌబత్తు లేదా డోలియొక్క ధ్వని. ఠకోర్. నగారాధ్వని.
< ఉ. టకోరా.
**టకోరా[2]** వి. తులసికోటపై అంచున అందంకోసం కట్టిన ఆకువంటి నిర్మాణం.
**టకోరాకుండ** రూ.చూ. టకూరకుండ. వి. తాళాచిప్ప ఆకారంలో చేసిన వాద్యం.
**టక్క** వి. బిల్లకర్ర, కొబ్బరిముట్టలు చితక్కొట్టే సాధనం.
**టక్కుజభాషలు** వి.బ.వ. భాషావిశేషాలు.

**టక్కజవిభాషలు** వి.బ.వ. భాషావిశేషాలు (దేవాడ వర్ధని, ఆంధ్రి, ఘూర్జరి, భావని).

**టక్కరి** చూ. టక్కు.

**టక్కరికాఁడు** చూ. టక్కు.

**టక్కరిపూటతాటలుచేయు** చూ. టక్కు.

**టక్కరిబాజీ** చూ. టక్కు.

**టక్కాయమ్మ** చూ. టక్కు. వి. దద్దమ్మ.

**టక్కియము** రూ.చూ. టెక్కియము. వి. ధ్వజం, టెక్కెం. జెండా.

**టక్కి**[1] రూ. టిక్కి. వి. 1. ఉడత. మరమగ్గం నాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి, నెట్టటానికి, సొరుగు లోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; 2. వడంబంగుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకుబిళ్ళ.

**టక్కితాడు** వి. ఉడతకు పైన కట్టిన దారం. **టక్కితోలు** వి. ఉడత తోలు, మరమగ్గంలో ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు. **టక్కివారు** వి. ఉడత తోలు, మరమగ్గంలో ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు.

**టక్కి**[2] వి. వీధి వాకిలిదగ్గర గది.

**టక్కిగది** వి. ఇంటికి పక్కగా ఉన్న చిన్న గది.

**టక్కు** రూ. టిక్కు[1]. వి. 1. మోసం, వంచన, మాయ. శుక. 2.437, అచ్చ. రా. సుందర. 47; 2. అసత్యం. ఆం.భా. 1.119; 3. బొంకు, టెక్కు, తెక్కు, టీకు.

సం. ఠక్క-, స్థగ. మోసం; ప్రా. ఠగ్; పా. ఠగ-. ధూర్తుడు; కా.నే.హిం.గు. ఠగ్; పం. ఠగ్, ఠగ్గ; మర. ఠక్.

క. టుక్కు. మోసం; తు. టుక్కు; త. తక్కు.

<ప్రా. ఠగ-. ధూర్తుడు.

**టక్కరి** రూ.చూ. తక్కరి. విశే. 1. వంచకుడైన, మాయావియైన, మోసగాడైన. సమీర. 4.22, ఆం.భా. 2.286; 2. కుజనుడైన, దుర్మార్గుడైన. ఆం.నా.సం.మాన. 11; 3. వంచకురాలు; 4. టక్కుబాజి, కూళ, టక్కులాడు **టక్కరికాఁడు** వి. 1. మోసగాడు. అచ్చ.రా. సుందర. 137; 2. టక్కుబాజి, కూళ, టక్కులాడు, తక్కరి. **టక్కరి పూటతాటలుచేయు** స.క్రి. అబద్ధపు పూటలుపెట్టు. **టక్కరి బాజీ** వి. 1. దగా; 2. దగామనిషి. **టక్కుచేయు** స.క్రి. నటించు. **టక్కుటమార** వి. 1. గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల, మహేంద్రజాలవిద్యల్ని ఉపదేశించేవాడు; 2. అష్టగురువుల్లో ఒకరు. **టక్కుటమారముచేయు** స.క్రి. మోసంచేయు. **టక్కు పెట్టు** స.క్రి. కికురించు, పిక్కుచేయు, మాయచేయు. **టక్కు బాజి** విశే. టక్కరి, దగులుబాజి, మోసగాడు. **టక్కుబాజీ తనము** వి. టక్కరితనం. **టక్కుఁబెట్టు** (-పెట్టు) అ.క్రి. మాయకలది అగు. వేంక.పంచ. 1.246. **టక్కులాఁడి** రూ. తక్కులాఁడి. వి. 1. మోసకత్తె; 2. టెక్కులాడి. <టక్కు + -లు + -ఆఁడి. **టక్కులాఁడు** రూ. తక్కులాఁడు. వి. టక్కులు చేసేవాడు, దుర్మార్గుడు, టక్కరి. ఆం.నా. సం.మాన. 11. <టక్కు + -లు + -ఆఁడు.

**టక్కున** అవ్య.ద్రు. టకీమని, వెంటనే, టకీలు. ధ్వన్యను.

**టక్కెము** రూ.చూ. టెక్కియము. వి. ధ్వజం, టెక్కెం, జెండా.

**టక్కోరపువంకాయ** వి. టొమాటొ.

**టక్క్యము** రూ.చూ. టెక్కియము. వి. జెండా, టెక్కెం.

**టగరి** రూ.చూ. ఒగిరి. వి. సారె, కుండలు చేయడానికి కుమ్మరి ఉపయోగించే చక్రం.

**టగిరి** రూ. టగరి, టిగర్. వి. కుండలు, పెంకులు మొదలైనవి తయారుచెయ్యడానికి కుమ్మర్లువాడే చక్రం వంటి సాధనం.

**టంకవాటు** వి. ఒక బంగారు నాణెం, దీనారం.

**టంకసాల** వి. 1. నాణాలు ముద్రించే చోటు. హంస 2.231; 2. శిల్పశాల. ఆం.భా. 2.15; 3. నాటక నిర్మాణశాల.

సం. టంకశాలా. నాణాలు ముద్రించే చోట.

<సం. టంకశాలా.

**టంకసాలవాటు** వి. ఒక బంగారు నాణెం. ఆము. 2.85.

**టంకారము** వి. 1. వింత; 2. ప్రసిద్ధి.

సం. టంకార-. ఆశ్చర్యం, ధ్వని, చెడు ప్రసిద్ధి.

<సం. టంకార- (అర్థవిపరి.).

**టంకారు** వి. కరుగోల, మద్దికర్ర, బండకర్ర, చేలోని చెట్లను వేళ్ళతో పెళ్ళగించే పనిముట్టు.

**టంకిచిప్పలు** వి.బ.వ. పిల్లలు ఆడుకోడానికి మట్టితో చేసిన అందెలున్న మట్టి చిప్పల వాద్యం.

**టంకు**[1] చూ. టక్కు. విశే. 1. ధూర్తుడు. వేంక. ఆం. మాన. 30; 2. మాయలాడు. ఆం.భా. 2.286; 3. మాయలాడి. ధర్మ. 9.154; 4. నాగరీకుడు; 5. మొండికట్టె; 6. లావుపాటి వాడు.

**టంకుతనము** వి. ధౌర్త్యం, మొండితనం, కావరం.

**టంకు**[2] రూ.చూ. తముకు. వి. దండోరా.

**టంగ్** వి. నాలుక.

ఇం. *Tongue* నాలుక, జిహ్వ, వాక్సామర్థ్యం, మాట, (ఒక జాతి మొ. వారి) భాష.

<ఇం. Tongue.

**టంగణా** రూ.చూ. తింగణా. వి. టాంక్విన్ దేశపు గుర్రం, మట్టసపు గుర్రం.

**టంగనా** రూ.చూ. తింగణా. వి. పొట్టిగుర్రం, టాంక్విన్ దేశపు గుర్రం.

హిం. టాంగన్. పొట్టి గుర్రం.

**టంగవారు** రూ.చూ. టంగువారు. వి. ఎద్దులకు అలంకారంగా నడుం చుట్టూ వేసే తోలుపట్టీ, దొడ్డువారు.

**టంగారు** రూ.చూ. టంగువారు. వి. ఎద్దులకు అలంకారంగా నడుం చుట్టూ వేసే తోలుపట్టీ, దొడ్డువారు.

**టంగు**[1] వి. గుర్రం మీది జీను జారకుండ బిగియడానికి కట్టే పట్టెడ.

హిం.ఉ.మరా.పార. తంగ్. గుర్రాల జీనును బిగించటానికి ఉపయోగించే తోలు పట్టెడ.

<ఉ. తంగ్.

**టంగుతెగు** అ.క్రి. 1. శక్తి ఉడుగు; 2. శ్రమపడు. **టంగులుతెగు** అ.క్రి. పనిఅయిపోవు. **టంగువార** రూ.చూ. టంగువారు. వి ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ, దొడ్డువారు. **టంగువారు** రూ. టంగవారు,

టంగారు, టంగువార, టంగువాఉ, టంగోరు. వి. 1. గుర్రం మీది జీను జారకుండా బిగియటానికి కట్టే పట్టెడ. రసిక. 1.85; 2. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ, బొడ్డువారు. **టంగువాఉ** రూ.చూ. టంగువారు. వి. గుర్రం మీది జీను జారకుండా బిగియడానికి కట్టే పట్టెడ.

**టంగు**[2] వి. తీవాసీ మగ్గంపై దోనె బిగింపు కోసం పక్క బెజ్జంలో దూర్చిన కర్ర.

**టంగురస్సి** వి. తివాసీ మగ్గంపై దోనె బిగింపు కోసం నేసిన బిగుతాడు. హిం ఉ. రస్సీ. తాడు. <టంగు[2]+ ఉ. రస్సీ.

**టంగు**[3] రూ.చూ. ఠంగు. వి. గంట మొదలైనవి మోగేటప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం.

**టంగుటంగను** రూ.చూ. ఠంగుఠంగను. అ.క్రి. గంట మొదలైనవి మోగు. <టంగుటంగు+అను. **టంగుటంగు** రూ.చూ. ఠంగుఠంగు. వి. గంటల చప్పుడుకు అనుకరణం. **టంగుటింగు** రూ.చూ. ఠంగుఠింగు. వి. ఆయుధం మొ. కఠినపదార్థాలు ఒకదానికొకటి తగిలినప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం.

**టంగోరు** రూ.చూ. టంగువాఉ. వి. 1. గుర్రంమీద జీను జారకుండా బిగియటానికి కట్టే పట్టెడ; 2. ఎద్దులకు నడుం చుట్టూ అలంకారంగా చుట్టూ వేసే తోలుపట్టీ.

**టంచనగా** రూ. ఠంచనగా. క్రి.విశే.ద్రు. 1. వరసగా; 2. సిద్ధంగా; 3. నిష్కర్షగా, సూటిగా, సరిగా.

ఇం. *Attention*. ఏకాగ్రత.

< ఇం. Attention + అగు + -అ[7].

**టట్టాకు** వి. చెప్పు తట్టాకు. <(చెప్పు) తట్ట+ఆకు.

**టట్టువ** రూ.చూ. తట్టువ[1]. వి. తక్కువజాతి గుర్రం, తట్టువ.

**టంటం** వి. వింటి నారి ధ్వనికి అనుకరణం.

**టంటంచిప్పలు** వి.బ.వ. అందెలున్న మట్టిచిప్పల వాద్యం.

**టంటసుడి** వి. పశువుల రొమ్ము మీది సుడి.

**టండా** రూ.చూ. తండా. వి. లంబాడీల సమూహం.

**టన్ను** వి. తూకంలో ఒక ప్రమాణం, 1000 కేజీల బరువు.

ఇం. *Ton*. తూకంలో ఒక ప్రమాణం, ఒక ఘనపు కొలత, పెద్ద సంఖ్య, పెద్ద మొత్తం.

< ఇం. Ton.

**టపటప** వి. వాన మొ. వాటి పతనంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**టపటపలాడు** అ.క్రి. టపటపమని పేలు. <టప టప+-లు+ఆడు.

**టపా** చూ. టపాలు. రూ. టప్పా[1]. వి. 1. అంచె; 2. జాబు; 3. సంచి.

**టపాకాయ** రూ. టపాకీకాయ. వి. ఒకరకం బాణసంచు, పెటేపి కాయ, పటాసు.

హిం. టప్పా. దూకు.

< హిం. టప్పా+కాయ.

**టపాకీకాయ** రూ.చూ. టపాకాయ. వి. పెటేపికాయ, పటాసు.

**టపాఖానా** రూ. టప్పాఖానా. వి. తపాలాకార్యాలయం.

< మరా. టపాల+ఉ. ఖానా.

**టపాయించు** స.క్రి. పేర్చు, ఒకదానిపై ఒకటి క్రమంలో నిలుపు.

హిం. టపానా. తాడు మొ. వాటితో కట్టు లేదా బిగించు.

< హిం. టపా(నా)+-ఇంచు[3].

**టపాలు** రూ. టప్పాలు, తపాలా. వి. 1. అంచె; 2. జాబు. టపా.

మరా. టపాల. పోస్టు;

ఫ్రెం. *Etapi*.

< మరా. టపాల.

**టపాస** రూ.చూ. పటాసు. వి. టపాకాయ.

**టపాసకాయ** వి. పటేపికాయ.

**టపాసా** రూ.చూ. పటాసు. వి. టపాకాయ, టపాకీ, పటాసు

**టపాసాలపండుగ** వి. దీపావళి.

**టపాసు** రూ.చూ. పటాసు. వి. టపాకాయ, టపాకీ, పటాసు.

**టపేటా** వి. ఒకరకం పట్టు.

**టపేటానేత** వి. ఒకరకం డిజైను నేత.

**టప్పటప్ప** వి. పేలుడు ధ్వనికి అనుకరణం.

**టప్పా**[1] రూ.చూ. టపా. వి. జాబు, సంచి, టపాలు.

**టప్పా**[2] వి. 1. అబద్ధం; 2. నవీన సంగీత పద్ధతులలో ఒక చిన్నపాట.

**టప్పాఖానా** రూ.చూ. టపాఖానా. వి. తపాలాకచ్చేరి.

**టప్పాలు** రూ.చూ. టపాలు. వి. 1. గొప్పలు; 2. అంచె, జాబు, టపా.

**టమటమ** వి. టముకు, టాంటాం, టవాయి, అగాదు, డప్పు కొడుతూ చేసే ప్రకటన.

క. *డమ*. డోలు శబ్దం; *డమాడమ్*. టాంటాం, ఒకరకమైన డోలు శబ్దం; తు. *డమ్‌డమ్*. డోలుశబ్దం; త. *టమటమాత్ఎనల్*. డోలుశబ్దానికి అనుకరణం; కో. *డమ్ డమ్ ఇన్*, *డమ్‌డమ్*. డోలు వాయించి శబ్దం చేయు.

పో.చూ. సం. *డమ్*. డోలులాగ శబ్దం చేయు.

**టమటమాల్‌బండిచిప్పలు** వి.బ.వ. అందెలున్న మట్టిచిప్పల వాద్యం.

హిం.ఉ. *టమ్‌టమ్*. రెండు చక్రాల బండి.

**టమాట** రూ.చూ. టొమాటో. వి. రామములగపండు, తక్కాళి పండు.

**టమాటా** రూ.చూ. టొమాటో. వి. రామములగపండు, తక్కాళి పండు.

**టముకు** రూ.చూ. తముకు. వి. 1. డప్పు; 2. డప్పు కొడ్తూ చేసే ప్రకటన.

**టముకువేయు** స.క్రి. డప్పు కొడుతూ ప్రకటించు, చాటించు.

**టమోట** రూ.చూ. టొమాటో. వి. రామములగ, చల్లటి చోట్ల తోటల్లో పెంచే తీగపైరు (Lycopersium esculantum).

**టంపటసుడి** చూ. తంపట. వి. రొమ్ము మీద ఉండే అనర్థదాయకమైన సుడి.

**టంపుతెగు** చూ. తెంపు. అ.క్రి. 1. అల్లిత్రాడు తెగు; 2. జోరుతగ్గు; 3. గర్వంతగ్గు.

**టయర్‌కూజా** వి. టైరులాగా గుండ్రంగా ఉండి లోపలిభాగం తొర్ర ఉండే కూజా.

ఇం. *Tyre*. టైరు.

< ఇం. Tyre + కూజా.

**టయిపు** రూ.చూ. టైపు. వి. అచ్చు, ముద్ర.

**టయిము** రూ.చూ. టైము. వి. వేళ, సమయం.

**టయిరు** రూ.చూ. టైరు. వి. కారు మొ. వాటికి చుట్టూ వేసే రబ్బరు వలయం.

**టయిలరు** రూ.చూ. టైలరు. వి. కుట్టుపనివాడు, దర్జీ.

**టరన్** రూ.చూ. టర్న్. వి. వంతు.

**టరికీతువ్వాలు** రూ.చూ. తురికి తువ్వాలు. వి. తువ్వాలు, దారపు కొలుకులు ఒత్తుగా పైకి తేలేట్టు, గొంగెబొచ్చు మాదిరిగా నేసిన తువ్వాలు.

**టర్న్** రూ. టరన్. వి. వంతు.

ఇం. *Turn*. చక్రగతి గమనం, మార్గం తప్పటం.

< ఇం. Turn.

**టర్నింగు** వి. మలుపు.

ఇం. *Turning*. ఒక మార్గం ఇంకొక మార్గాన్ని కలిసే చోటు.

< ఇం. Turning.

**టర్నిప్స్** వి.బ.వ. ఆవాలు చెట్టు జాతికి చెందిన ద్వివార్షిక వృక్షాలు.

ఇం. *Turnips*. ఆవాలుచెట్టు జాతికి చెందిన ద్వివార్షిక వృక్షాలు.

< ఇం. Turnips.

**టఱ్ఱు** వి. అపాన వాయు ధ్వనికి అనుకరణం.

**టలాయించు** రూ. టొలాయించు, తలాయించు. స.క్రి. 1. పని ఎగగొట్టు; 2. మోసగించి ముందుకేగు; 3. ఆపు; 4. ఏదో ఒకటి చెప్పి తప్పించుకొను. అ.క్రి. అటూఇటూతిరుగు, ఏదో ఒకటి చెప్పి తప్పించుకొను.

హిం.ఉ. టలానా. తొలగించు.

< ఉ. టలా(నా) + -ఇంచు³.

**టవటవ** రూ.చూ. తవతవ. వి. 1. అసత్యం. ఆం.వా. 1.119; 2. కల్ల, బొంకు, దబ్బర, టక్కు.

**టవర** రూ.చూ. తవర. వి. 1. ధూర్తురాలు, ధూర్తుడు; 2. టక్కులాడి, మొండికట్టె.

**టవల్** వి. తువాలు.

ఇం. *Towel*. తువాలు.

< ఇం. Towel.

**టవలి** రూ.చూ. తవలి. వి. బొంకు. వేంక.ఆం.మాన. 66.

**టవలిక** రూ.చూ. తవళి. వి. 1. బొంకు; 2. టక్కు, దగా.

**టవళి** రూ.చూ. తవళి. వి. ధూర్తుడు. విణ. ధూర్తత్వం.

**టవళికాఁడు** వి. కల్లరి, టక్కులాడు.

**టవళిక** రూ.చూ. తవళి. వి. కపటం, టక్కు, దగా.

**టపాయి** వి. టముకు, టముటము, టాంటాం.

హిం. టపాయీ. వ్యర్థంగా తిరగటం. మరా. [illegible]. జనపవశ్యం.

**టవును** రూ. టౌను. వి. పట్నం.

ఇం. *Town*. ఇళ్ళ సమూహం, పట్నం.

< ఇం. Town.

**టషనాకుండ** రూ. టసనాకుండ. వి. అన్నం వండటానికి వాడే పెద్దకుండ.

హిం. తస్లా. పెద్ద.

**టసనాకుండ** రూ.చూ. టషనాకుండ. వి. అన్నం వండటానికి వాడే పెద్దకుండ.

**టస్సా** వి. 1. రీతి, అమరిక; 2. సొగసు, సౌందర్యం, 3. డాబు.

హిం. తర్జా. [illegible], ఆడంబరం, అభిమానపూర్వక హావభావాలు.

**టస్సాదించివేయు** స.క్రి. తిప్పివేయు. **టస్సావేయు** అ.క్రి. చాలకాలం మకాంవేయు.

**టాక** రూ.చూ. టాకా. వి. బండి చక్రాలను ఇనుపకట్టుతో బిగించటం, ఒడిపాటు.

**టాకనా** రూ.చూ. టింగనా. వి. పొట్టివస్త్రం.

**టాకా** రూ. టాక. వి. చిల్లుల, టాకీ, టాపు, వరుస కుట్టటంలో సరుసు కుట్టిన ముడి, కుట్టు.

హిం. ఉ. టాంకా. రెండింటిని కలిపే కీలు, కుట్టు; మరా. టాంకా, టాకా.

< మరా. టాకా.

**టాకాలుతెగు** అ.క్రి. 1. లావగు; 2. పగియు.

**టాకి** రూ.చూ. టాకీ². వి. రంగు నీళ్ళు కాచే పెద్ద ఇనప డబ్బా.

**టాకించు** రూ.చూ. టాంకించు. స.క్రి. (కత్తి మొ.) ఒక దానితో ఒకటి రాకించు. స.క్రి. అనుకు.

**టాకీ¹** వి. 1. చెరిగిన గుడ్డకు వేసే మాసిక; 2. ఫోంజి, పద్ధతి; 3. పరుపు మొ. వాటికి బిగువు కొరకై మధ్య మధ్య వేసే గుడ్డ ముక్కల చిన్న మడత.

హిం. టాంకీ. చిన్న టాకా.

< హిం. టాంకీ.

**టాకీయించు** స.క్రి. చెక్కు. < టాకీ¹ + -ఇంచు³.

**టాకీ²** రూ. టాకి. వి. రంగు నీళ్ళు కాచే పెద్ద ఇనప డబ్బా.

మరా. టాకీ. నీటి తొట్టె.

< మరా. టాకీ.

**టాకీ³** వి. రాతిని చెక్కటానికి, గుంటలు కొట్టటానికి పనికి వచ్చే శంఖ్వాకారపు ఉక్కు పరికరం.

మరా. టాకీ. ఉలి.

**టాకీ⁴** వి. సినిమా, చలనచిత్రం, సుమారు 45 సంవత్సరాలకు పూర్వం మూక చలన చిత్రాలు ఉండేవి. తర్వాత మాటలు కల సినిమాలు వచ్చాయి.

ఇం. *Talkie*. మాటలాడే సినిమా.

< ఇం. Talkie.

**టాకీస్** వి. చలన చిత్ర ప్రదర్శనశాల, సినిమాహాలు.

ఇం. *Talkie.* మాటలాడే చలన చిత్రం, Talkies.

< ఇం. Talkies.

**టాకు**[1] వి. **1.** విటంకం, వసార. వాల్మీ. 3.10, పాంచాలీ. 2.9 ; **2.** ఓర. శగా. 4.70 ; **3.** ఉంగరం మొ. జారకుండా బంగారం మొ. వాటితో చేసే సన్నని సాదా ఉంగరం ; **4.** అంచు ; **5.** పండు పండినదీ లేనిదీ చూడటానికి వేసే బెజ్జం.

**టాకు**[2] వి. క్షణం.

**టాకుటీకు** రూ.చూ. టీకుటాకు. వి. హడావుడి.

**టాంగన్** రూ.చూ. తింగణా. వి. పొట్టి గుర్రం. రంగా.చ. 3.49.

**టాటాలుకోయించు** చూ. టాటాలు.

**టాంగన్ఘుఋము** వి. పొట్టి గుర్రం.

**టాంగనా** రూ.చూ. తింగణా. వి. పొట్టి గుర్రం, టంగనా, టాకనా, టాంక్వన్ దేశపు గుర్రం.

**టాటాలు** వి.బ.వ. డాబులు, దర్పం, కోతలు.

హిం. ఠాట్, ఠాఠ్. ఆడంబరం, శృంగారం, అలంకరణ.

**టాటాలుగుణించు** రూ.చూ. టాటాలు గుణియించు. అ.క్రి. కోతలుకోయు. **టాటాలుగుణియించు** రూ. టాటాలు గుణించు, టాటాల్గుణియించు. అ.క్రి. డాబులు పలుకు. విప్ర. 4.28. **టాటాల్గుణియించు** రూ.చూ. టాటాలు గుణియించు. అ.క్రి. డంబాలాడు, డాబులు పలుకు. ప్రబంధ. 748.

**టాటాల్గుణియించు** చూ. టాటాలు.

**టాటు** వి. తీవి, హొయలు.

హిం. ఠాట్, ఠాఠ్. ఆడంబరం, అలంకరణ.

< హిం. ఠాట్.

**టాటోటు** రూ.చూ. తాటోటు. వి. **1.** కపటం, మోసం. సారంగ. 3.205 ; **2.** తబ్బిబ్బు. కల్ల, డాబు, డాంబికుడు. విశ. **1.** మాయావి, డాంబికుడు. అచ్చ.రా.యు. 24 ; **2.** కుత్సితుడు, దుర్మార్గుడు. ఆం. నా. సం. మాన. 11.

**టాటోటుకత్తె** వి. మోసకత్తె, మాయలాడి. **టాటోటుకాఁడు** రూ. తాటోటుకాఁడు. వి. మాయావి, మోసగాడు, టక్కరి, టక్కులాజి. **టాటోటువడు (-పడు)** అ.క్రి. మోసపోవు.

**టాణదారు** రూ.చూ. ఠాణేదారు. వి. ఠాణాకు అధికారి, సుంకరి.

**టాణా** రూ. టానా. వి. **1.** చీరకొంగుకు, కొంగు మధ్య నేసిన ఒక అంగుళం భాగం ; **2.** కమ్మి నేతలో అందానికి, పడుగులో దూర్చిన రంగు దారం.

హిం. తానా. పక్కా చేయటం.

**టాణాకమ్మి** వి. రెండేసి పోగులు ఒక్కొక్క రంగువి పెట్టి వరసగా నేసిన కమ్మి.

**టాణెదారు** రూ.చూ. ఠాణేదారు. వి. స్థానికాధికారి.

**టాణేదారు** రూ.చూ. ఠాణేదారు. వి. **1.** అధికారి. వేంక. ఆం. దేవ. 14 ; **2.** సుంకరి.

**టాంటాం** వి. టముకు, డప్పుకొడుతూ చేసే ప్రకటన, టవాలు, టంకు.

హిం. ఠామ్. సంచలన రీతి.

**టాంటాంచేయు** స.క్రి. డప్పుకొడుతూ ప్రకటించు.

**టానా** రూ.చూ. టాణా. వి. **1.** చీరకొసకు, కొంగు మధ్య నేసిన ఒక అంగుళం భాగం ; **2.** కమ్మి నేతలో, అందానికి, పడుగులో దూర్చిన రంగు దారం.

**టానికోడు** రూ.చూ. తానెకోడు. వి. పూనుకర్ర, పావుచెక్కను తొక్కినప్పుడు అచ్చు కర్రను కిందికి లాగే కర్ర.

**టానిక్కు** వి. బలవర్ధకమైన ఔషధం.

ఇం. *Tonic.* ఉత్తేజకమయిన, ఉద్దీపనం కలిగించే బలవర్ధకమైన, శక్తిదాయకమైన ఔషధం.

< ఇం. Tonic.

**టాను** రూ.చూ. తాను[3]. వి. నేసిన నారపట్టా.

**టాప** రూ.చూ. తాప[2]. వి. గొర్రు, గుంటక మొ. వాటి అడ్డ మీద బిగువుకు పరిచిన ఇనపరేకు.

**టాపింగునీలి** వి. నిండు నలుపుతో రాగి గిన్నె మాదిరి రంగు.

ఇం. *Topping.* ఉన్నతమైన, అధికమైన.

**టాపించు** రూ.చూ. తాపించు. స.క్రి. పొదుగు.

**టాపీ**[1] వి. మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య చెక్క.

**టాపీ**[2] రూ.చూ. తాపీ[2]. వి. గరుకుగా ఉన్న చోట్లను చదును చేయడానికి వాడే సాధనం.

**టాపీరేకు** రూ.చూ. తాపీరేకు. వి. తాపీలోని పలచటి లోహ భాగం.

**టాపీటు** రూ.చూ. టాపేటు. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**టాపీటుచెయ్యి** రూ.చూ. టాపేటు చెయ్యి. వి. పేటు దారాలకు ఆధారంగా, డాబీ చట్రంలో అమర్చిన సన్న బద్ద. **టాపీటుదారం** రూ.చూ. టాపేటుదారం. వి. పేటు దారం. నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడ దీసిన దారం.

**టాపు** వి. పైభాగం, పైకప్పు.

ఇం. *Top.* శిఖరం, అగ్రభాగం, ఉన్నతస్థితి.

< ఇం. Top.

**టాపూ** రూ.చూ. టావు[2]. వి. కాగితం రీములోని ఒక్కొక్క కాగితం.

**టాపెట్టు** రూ.చూ. టాపేటు. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**టాపేటు** రూ. టాపీటు, టాపెట్టు. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం.

హిం. టాఁ. మాన విశేషం.

**టాపేటుచెయ్యి** రూ. టాపీటుచెయ్యి. వి. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద. **టాపేటుతడక** వి. డాబీకి పైన బిగించిన ఇనప ఊచల చట్రం. **టాపేటుదారం** రూ. టాపీటుదారం. వి. పేటుదారం, నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడదీసిన దారం. **టాపేటునేత** వి. డాబీనేత, మగ్గానికి డాబీ అమర్చి, బట్ట అంచున డిజైను పడేట్టు నేసిన నేత. **టాపేటులాళ** వి. పేటు

దారాలకు ఆధారంగా డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద.

**టాబ్లెట్స్** వి.బ.వ. మందుబిళ్ళలు.

ఇం. *Tablets*. మందుబిళ్ళలు.

< ఇం. Tablets.

**టారు** వి. భయం, వెరపు.

హిం. ఠార్. మంచు, విపరీతమైన చలి; టార్‌నా. తొలగించటం; మరా. టార. నాశాన్ని తెలపటానికి క్రియలకు చేర్చే పదం.

**టారుకొను** అ.క్రి. వెరచు, గుండెచెదరు.

**టారుబేలు** రూ.చూ. స్టారుబేలు. వి. అంచులో నక్షత్రం మాదిరిగా నేసిన డిజైను.

**టార్చి** వి. కరదీపిక, చేతితో పట్టుకొనే వెల్తురునిచ్చే సాధన విశేషం.

ఇం. *Torch*. దివిటీ, కాగడా, ఈ ప్రయోజనంకొరకుపయోగించే ఇతర సాధనం.

< ఇం. Torch.

**టాలాటోలి** విణ. 1. టక్కరి, సోమరి, మోసగాడు; 2. చాయలాపాయలా, బులబులగ్గా, చులాగ్గా.

హిం. టాల్‌టూల్. వంక.

< హిం. టాల్‌టూల్.

**టాలాటోలితనము** వి. టక్కరితనము. **టాలాటోలిమాటలు** వి.బ.వ. మోసపుమాటలు, అబద్ధపు మాటలు.

**టావు**[1] రూ.చూ. తావు. వి. 1. చోటు, తావు, తావు. బసవ. 5.395; 2. ఉపాధి. ద.హిం.శా. సంపు. 6, శా.సం. 781.

**టావు**[2] రూ. టావూ. వి. కాగితం రీములో ఒక కాగితం, రీము కాగితంలో 24 వ భాగం.

**టాశాకుండ** రూ. టాసాకుండ. వి. గుండ్రంగా పన్నెండు అంగుళాల వ్యాసంతో అర్ధ అడుగు లోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర, చర్మకట్టు వాద్యానికి వాడే పాత్ర.

**టాసాకుండ** రూ.చూ. టాశాకుండ. వి. గుండ్రంగా పన్నెండు అంగుళాల వ్యాసంతో అర్ధ అడుగు లోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగా ఉండే మట్టి పాత్ర, చర్మకట్టు వాద్యానికి వాడే పాత్ర.

**టాసాలుబండగు** చూ. టస్సా. అ.క్రి. మిక్కిలి భయపడు.

**-టి** ప్రత్య. ఔపవిభక్తికాలైన కొన్ని తెలుగు శబ్దాలకు అంతాగమంగానూ, కొన్నిటికి అంతాదేశంగానూ, కొన్నిటికి అంతాగమాదేశాలుగానూ వచ్చే ప్రత్యయం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1323, క్రీ.శ. 1115.

**టికట్** రూ.చూ. టికెట్టు. వి. రైలు, బస్సు మొ. వాటిలో ప్రయాణం చేయటానికి, సినిమా మొ. వాటిలో ప్రవేశించటానికి ఇచ్చే పత్రం.

**టికటంచు** రూ.చూ. టికెట్టంచు. వి. రైలు టికెట్టంత వెడల్పున నేసిన అంచు.

**టికట్టు** రూ.చూ. టికెట్టు. వి. రైలు. బస్సు మొ. వాటిలో ప్రయాణం చేయటానికి, సినిమా మొ. వాటిలో ప్రవేశించటానికి ఇచ్చే పత్రం.

**టికము** రూ.చూ. తికము. వి. వెన్నెముక కిందిచోటు, ముడ్డిపూస.

**టికాణ** రూ.చూ. టికాణా. వి. గతి, చోటు, తావు.

**టికాణా** రూ. టికాణ, ఠికాణా, ఠికానా. వి. 1. స్థానం, ఉండే చోటు; 2. గతి.

హిం. *ఠికానా*. చోటు, స్థానం; మరా. *ఠికాణా*, *ఠికాణా*. చోటు, స్థానం, వాసస్థానం.

< మరా. ఠికాణా.

**టికిటి** రూ. టిక్టి, టిగిటి, టిట్టి[2], టీటి, తికడీ, తికిటి, తిక్కడ, తిక్కడి[1], తిక్కిడి, తెక్కెడి, తిమిటి, తీకటి. వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం, నేలమట్టం సరిచూడటానికి బేలుదార్లు వాడే పరికరం.

**టికెట్టంచు** చూ. టికెట్టు.

**టికెట్టు** రూ. టికట్, టికట్టు, టిక్కట్టు, టిక్కెట్టు. వి. ప్రవేశపత్రం.

ఇం. *Ticket*. రైలు, బస్సు మొ. వానిమీద ప్రయాణానికి సినిమా మొ. ప్రవేశానికి లేదా ఇతర విధమైన అధికారానికి చెల్లుబడికల ముద్రితమైన లేదా లిఖితమైన చీటి, ప్రవేశ పత్రం.

< ఇం. Ticket.

**టికెట్టంచు** రూ. టికటంచు. వి. రైలు టికెట్టంత వెడల్పున నేసిన అంచు.

**టిక్కటి** వి. పోటీ, కట్టుబడి సమయంలో దర్వాజాలు మొదలైనవి కదలకుండ నిలపడానికి రెండు కర్రలను పైపైపున బిగించి కట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు.

హిం. *టికటీ*. త్రికాష్ఠం, పాడె, ఉరితీయటాని కుపయోగించే సాధనం.

**టిక్కట్టు** రూ.చూ. టికెట్టు. వి. రైలు, బస్సు మొ. వాటిలో ప్రయాణం చేయటానికి సినిమా మొ. వాటిలో ప్రవేశించటానికి ఇచ్చే పత్రం.

**టిక్కబల్ల** వి. కొక్కెలబల్ల, వజానేతకోసం అమర్చిన దొడ్డిలో కన్నాలబల్లనుంచి కిందకి గుంజిన కుచ్చుతాళ్ళు తగిలించటానికి గాళ్ళు చేసిన చెక్క.

**టిక్కి** రూ.చూ. టక్కి[1]. వి. ఉడత, మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ.

**టిక్కిపేటి** రూ.చూ. టిక్కపేటు. అంచులో నేసే ఒక రకం డిజైను. **టిక్కిపేటు** రూ. టిక్కిపేటి. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

**టిక్కిడి** వి. లంకెపీట, దొంగగొడ్లు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్టు మెడకు వేలాడగట్టిన రెండుకొయ్యల పలక.

హిం. *టికటీ*. ఉరితీయడానికి మెడలో వేలాడకట్టే కొయ్య.

**టిక్కు**[1] రూ.చూ. టక్కు. వి. 1. మోసం, వంచన; 2. అసత్యం; 3. యౌవనాదులవల్ల కలిగే గర్వచేష్ట.

**టిక్కు**[2] వి. గుర్తుకుగాను పెట్టేగీత.

ఇం. *Tick*. గుర్తుకోసం పెట్టేగీత.

< ఇం. Tick.

**టిక్కన** అవ్య. క్రియ. టక్కుమని, వెంటనే. ధ్వన్యను.

**టిక్కెట్టు** రూ.చూ. టికెట్టు. వి. ప్రవేశపత్రం.

**టిక్టి** రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం, నేల మట్టం సరిచూడటానికి వేలుదార్లు వాడేది.

**టిగర్** రూ.చూ. టగిరి. వి. సారెకుండలు చేయడానికి కుమ్మరి ఉపయోగించే చక్రం.

**టిగిటి** రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరంలో ఉండే కొయ్యపరికరం.

**టింకరు** వి. లోహపాత్రల్ని బాగుచేసేవాడు.

ఇం. *Tinker*. (ముఖ్యంగా వీధుల వెంట తిరుగుతూ) లోహపాత్రల్ని బాగుచేసేవాడు.

< ఇం. Tinker.

**టింగ** రూ.చూ. టింగణా. విశ. పొట్టి, పొట్టివాడు.

**టింగణ** రూ.చూ. టింగణా. వి. **1.** పొట్టిగా లావుగా ఉండేది ; **2.** బరువులు మోసే ఆవు.

**టింగణా** రూ.చూ. టింగణా. వి. **1**. గుర్రం. సాంబో. 1.50 ; **2.** పొట్టిది, పొట్టివాడు, పొట్టిగుర్రం.

**టింగణాసామి** రూ. టింగణాసామి. వి. గణపతి, వినాయకుడు, గుజ్జువేల్పు. వేంక. ఆం. 6.

**టింగు** వి. వీణాదుల ధ్వనికి అనుకరణం.

**టింగుటింగు** వి. వీణాదుల ధ్వనికి అనుకరణం. దశా. 4.119. **టింగునమీటు** స.క్రి. **1**. వెండినాణేన్ని గోటితో మీటు ; **2**. మోగేటట్లుమీటు. **టింగురంగాయనితిరుగు** అ.క్రి. స్వేచ్ఛగా ఉండు, తనకేమి అన్న ధీమాతో తిరుగు. **టింగురంగాయను** అ.క్రి. నాకేమి లోటని దిలాసాపడు.

**టింగురు** వి. వీణాదుల ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 78.

**టింగెన్** రూ.చూ. టింగెన. వి. ఒకరకం చెట్టు (Phyllanthus chorizandra).

**టింగెన** రూ. టింగెన్. వి. ఒకరకం చెట్టు (Phyllanthus chorizandra).

**టించరు** వి. ఔషధంగా ఉపయోగించే ద్రావణం.

ఇం. *Tincture*. ఒక వస్తువుయొక్క (సాధారణంగా సస్య పదార్థపు) సారాన్ని మద్యసారంతో కలిపి ఔషధంగా ఉపయోగించే ద్రావణం.

< ఇం. Tincture.

**టిటీ** వి. పోటీ, కట్టుబడి సమయంలో దర్వాజాలు మొదలైనవి కదలకుండా నిలపడానికి రెండుకర్రలను పైపైపున కట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు.

**టిట్టి**[1] రూ.చూ. టిట్టీ. వి. **1**. మోసేజంతువు ; **2.** ఎడమ పక్కకు తిరగటానికి వెలపలి ఎద్దును తోలేటప్పుడు ఉపయోగించే మాట ; **3**. వెలపలి ఎద్దు.

**టిట్టిపప్ప** రూ.చూ. టిట్టీపప్ప. వి. వెలపల దాపల ఎద్లు.

**టిట్టి**[2] రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్యపరికరం, నేలమట్టం సరిచూడటానికి వేలుదార్లు వాడే పనిముట్టు.

**టిన్ను** వి. డబ్బా.

ఇం. *Tin*. తగరం, తగరపు లోహం, పాత్ర.

< ఇం. Tin.

**టిన్నురేకు** రూ. టిన్రేకు, టినురేకు, తిన్ని తిన్రేకు, తీనురేకు, రేకు, తీన్రేకు. వి. తగరపురేకు.

**టిన్రేకు** రూ.చూ. టిన్నురేకు. వి. తగరంరేకు.

**టిఫను** రూ.చూ. టిఫిను. వి. అల్పాహారం.

**టిఫిను** రూ. టిఫను. వి అల్పాహారం.

ఇం. *Tiffin*. అల్పాహారం.

< ఇం. Tiffin.

**-టిమి** ప్రత్య. భావార్థక ప్రత్యయం.

**టియాం** వి. తలుపులు గాలికి పడకుండా దర్వాజాపై కమ్మికి బిగించిన కొయ్యముక్క.

**టిట్టీ** రూ. టిట్టి[1]. వి. **1**. మోసేజంతువు ; **2**. ఎడమపక్కకు తిరగటానికి వెలపలి ఎద్దును తోలేటప్పుడు ఉపయోగించే మాట ; **3**. దున్నే ఎడ్లలో వెలపలిది. ధ్వన్యను.

**టిట్టీపప్ప** రూ. టిట్టిపప్ప. వి. వెలపల దాపలఎడ్లు.

**టిల్ల**[1] రూ.చూ. డిల్లము. వి. మలంతొక్కిన వాళ్ళని ఆటలో ఓడిన వాళ్ళని ముట్టకూడదని చూపుడు వేలుపై మధ్యవేలుంచి నిషేధించడం.

**టిల్ల**[2] రూ. టిళ్ళ[2]. వి. ఒకరకం చెట్టు.

**టిల్లడొంక** వి. ఒకరకం చెట్టు.

**టిళ్ళ**[1] రూ.చూ. డిల్లము. వి. మలంతొక్కిన వాళ్ళని ఆటలో ఓడిన వాళ్ళని ముట్టకూడదని చూపుడు వేలిమీద మధ్యవేలుపెట్టి నిషేధించడం.

**టిళ్ళ**[2] రూ.చూ. టిల్ల[2]. వి. ఒకరకం చెట్టు.

**టీ** వి. తేనీరు.

ఇం. *Tea*. తేయాకుమొక్క, తేనీరు, సాయంకాలం తేనీరుతో పాటు తీసుకొనే అల్పాహారం.

< ఇం. Tea.

**టీపాయి** వి. టీ తాగేటప్పుడు కప్పులు పెట్టుకొనే చిన్నబల్ల.

ఇం. *Teapoy*. టీ తాగేటప్పుడు కప్పులు పెట్టుకొనే చిన్నబల్ల.

< ఇం. Teapoy.

**టీక**[1] వి. మల్లయుద్ధంలోని పధ్నాలుగు శస్త్రాల విసురుల్లో ఒకటి. ప్రబంధ. 78.

హిం. ఉ. *ఠీక్*. పక్కా, స్థిరమైన, సరయిన.

**టీక**[2] రూ. టీకా. వి. **1.** బొట్టు, తిలకం ; **2**. వేక్సినేషను ; **3.** ఒకజాతి పందెపు కోడి ; **4**. పతకం.

బెం. ఒ. *టికా* ; సిం. *టికో* ; గు. *టీకో*, *టిక్కో* ; హిం. *టీకా*. బొట్టు, గుర్తు, వేక్సినేషన్, ఆడవాళ్ళు నుదుటను ధరించే ఆభరణం ; మరా. *టికా*, *టిక్కా*, బొట్టు.

< హిం. టీకా.

**టీకరాయి** వి. మెరుగురాయి, కుండఆరిన తర్వాత నున్నగా మెరుపురావడానికి రుద్దేరాయి.

**టీకరేయు** స.క్రి. టీకరాయితో కుండకు నునుపు, మెరుపు

వచ్చేటట్లు రుద్దు.

**టీకము** వి. ఒరగల్లు, గీటురాయి. పంచాంగ. 4.17.

**టీకా** రూ.చూ. టీక[2]. వి. **1**. ఒకరకం పతకం; **2**. స్ఫోటకం పొడిపించటం, వేక్సినేషన్.

**టీకిటికీ** వి. కింది సగంలో మాత్రమే అడ్డంగా ఇనప చువ్వ లుండి, పైసగం అడ్డబెండుతో విభజింపబడి చువ్వలు లేకుండా ఉన్న కిటికీ. వ్య. ఆంగ్లంలో 'T' ఆకారంలో ఉండె కిటికీ.

< ఇం. T + హిం. కిట్‌కీ.

**టీకు**[1] వి. నడవడంలో నిక్కు, విలాసం, టెక్కు, టావి. ఆం.భా. 1.139.

హిం.మరా. *ఠీక్*. సరియైన.

**టీకుటాకు** రూ. టాకుటీకు. వి. హడావుడి.

**టీకు**[2] రూ.చూ. టేకు. వి. **1**. కలపనిచ్చే ఒకరకం చెట్టు, తేకుచెట్టు; **2**. టేకుకలప.

**టీచరమ్మ** చూ. టీచరు.

**టీచరు** వి. అధ్యాపకుడు, ఉపాధ్యాయుడు.

ఇం. *Teacher*. అధ్యాపకుడు.

< ఇం. Teacher.

**టీచరమ్మ** వి. అధ్యాపకురాలు, ఉపాధ్యాయిని. ఇం. *Teacher*. అధ్యాపకురాలు. < ఇం. టీచరు + అమ్మ.

**టీచింగు** వి. బోధన, పాఠం చెప్పటం.

ఇం. *Teaching*. అధ్యాపనం, ఉపదేశం.

< ఇం. Teaching.

**టీటి** రూ.చూ. టికిటి. వి. మూలగొయ్య, మూలమట్టం, ఆంగ్లం లోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్యపరికరం, నేలమట్టం సరిచూడటానికి బేలుదార్లు వాడే సాధనం.

**టీటిలెవలు** వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరంఆకారంలో ఉండే కొయ్యపరికరం, నేలమట్టం సరిచూడటానికి బేలు దార్లువాడే సాధనం.

**టీను** వి. రెండు పొడుగాటి బొంగుల్ని కల్పుతూ మధ్యలో రేకును బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం.

హిం. టీన్. టిన్ను, డబ్బా.

ఇం. *Tin*. తగరం, పాత్ర.

< హిం. టీన్.

**టీనురేకు** రూ.చూ. టిన్ను రేకు. వి. తగరపురేకు.

**టీపనుబుక్కు** వి. అప్పటికప్పుడు రాసుకొనే పుస్తకం.

హిం. టిపన్. టిప్పణి.

ఇం. *Book*. పుస్తకం.

< హిం. టీపన్ + ఇం. Book.

**టీపు** వి. **1**. మంచి నడవడికి పూటగా కట్టిన ధనం, హామీ, ధరావత్తుగా ఇచ్చిన సొమ్ము. రంగా.చ. 2.75; **2**. శిరో భూషణం.

హిం. టీప్. దస్తావేజు, జ్ఞాపకార్థం రాసి ఉంచు కోవటం; ఉ. టీప్. శిరోభూషణం, శ్రేష్ఠమైన.

< ఉ. టీప్.

**టీవి** రూ.చూ. ఠీవి. వి. **1**. విలాసం. అచ్చ.రా.సుందర. 13; **2**. టెక్కు, తెక్కు, నీటు, నిక్కు.

**-టు** ప్రత్య. కొన్ని ధాతువులకి వచ్చే కృత్ప్రత్యయం.

**టుకిణి** రూ.చూ. టుకినీ. వి. కొలతబిళ్ళ.

**టుకినీ** రూ. టుకిణి, టుక్నీ. వి. కొలతబిళ్ళ.

హిం. టుక్‌డా, టుక్‌నీ. ముక్క; మరా. టుక.

**టుక్కా** వి. వేలువచ్చేమాట.

హిం. టూకా. ముక్క, రొట్టెలో నాలుగోభాగం.

**టుక్నీ** రూ.చూ. టుకినీ. వి. కొలతబిళ్ళ.

**టుంగిరి** **1**. విశే. కొంటెవాడు; **2**. అసమర్థుడు, పనికిమాలిన వాడు.

**టుబాకో** రూ.చూ. టొబాకో. వి. పొగాకు.

**టుమికి** రూ.చూ. టూకి[1]. వి. టూకీ, క్లుప్తం, సంగ్రహం.

**టుమిరి** రూ.చూ. టుమ్రీ. వి. ఒక హిందూస్థానీ సంగీత రచన.

**టుమ్రీ** రూ. టుమిరి. వి. ఒక హిందూస్థానీ సంగీత రచన.

హిం. టుమ్రీ. ఒక రకమైన సంగీత రచన.

< హిం. టుమ్రీ.

**టువాలు** రూ.చూ. తువ్వాలు. వి. పాగ, తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట.

**టువిల్‌పేటు** వి. నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**టూకి**[1] రూ. టుమికి, టూకీ. వి. సంగ్రహం, సారం, టూకీ.

హిం. టూకా. ముక్క.

**టూకించు** స.క్రి. సంగ్రహించు, తగ్గించు, తక్కువలో తేల్చు. < టూకి[1] + -ఇంచు[3].

**టూకి**[2] వి. చెమ్మగా ఉండే కొండలోయల్లో రమారమి 30–40 అడుగుల ఎత్తు పెరిగే ఒక చెట్టు.

**టూకీ** రూ.చూ. టూకి[1]. వి. సంగ్రహం, ఉపాంకం.

**టూకీచేయు** స.క్రి. సంగ్రహించు, టూకించు.

**టూసుగుండు** రూ.చూ. తూసుగుండు. వి. తాపీపనివాళ్ళు గోడలమట్టం సరిచూడటానికి వాడే పరికరం.

**టూస్గుండు** రూ.చూ. తూసుగుండు. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం,

**టూఫ** వి. పట్టుదారం చుట్టే డబ్బా.

**టూరిస్ట్** రూ. టూరిస్టు. వి. యాత్రికుడు, లేదా యాత్రిక, విశే. యాత్రా సంబంధమైన.

ఇం. *Tourist*. యాత్రికుడు లేదా యాత్రిక.

< ఇం. Tourist.

**టూరిస్టు** రూ.చూ. టూరిస్ట్. వి. యాత్రికుడు లేదా యాత్రిక.

**టెకీ** వి. తూర్పారపోసే మనిషి నిలబడటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

హిం. టేక్‌నా. సాయం తీసుకోటం; మరా. టేక(ణే).

ఆధారంపై ఉంచటం; టేకూ. ఆధారం.

< మరా. టేకూ.

**టెక్కె**[1] రూ.చూ. టెక్కియము. వి. జెండా, టెక్కెం.

**టెక్కె**[2] రూ.చూ. టెక్కె[2]. వి. దిండు.

**టెక్కెము** రూ.చూ. టెక్కియము. వి. జెండా.

**టెక్కె**[1] చూ. టెక్కియము. వి. **1**. ఒకరకం కుళ్ళాయి. ఆము. 6.6; **2**. చిన్న టోపి; **3**. జెండా.

**టెక్కె**[2] రూ.చూ. టెక్కె[2]. వి. అనుమకట్టు, ఒరుగుడుగద్దె, అరు

గుకి ఒకవైపు ఆనుకోడానికి వసతిగా కట్టిన వంపుగాఉండే భాగం.

**టెక్కియము** రూ. టక్కియము, టక్కెము, టక్యము, టెక్క[1], టెక్కము, టెక్కు[2], టెక్కె[1], టెక్కెము, టెక్యము, డెక్కి. వి. జెండా. ధ్వజం.కాశీ. 6.145.

క. తక్కె, టెక్కె, టెక్కియ, తేక్కె. జెండా, ధ్వజం; త. టుక్కియమ్, టక్కియమ్, ఇటుక్కియమ్. జెండా, రథంమీద ఎగరవేసే ధ్వజం.

**టెక్కలి** వి. టొమాటొ.

క. తక్కాళి. టొమాటొ; త. తక్కాళి. టొమాటొ; మ. తక్కాళి. బ్రాజిల్ కొండల్లోని ఒకరకం చిన్న కాయ.

**టెక్కు**[1] చూ. తేకువ. రూ. టెక్కువ. వి. **1.** విలాసం, అందం, చక్కదనం. బసవ. 5.589; **2.** యౌవన సౌందర్యాదుల వల్ల కలిగిన గర్వం. కావ్యా. చూ. 6.16; **3.** విధం. కళా. 6.224; **4.** చక్కదనం. విజయ. 1.70: **5.** మల్ల విద్యా విశేషం; **6.** బెట్టుసరి.

హిం. టేక్. హఠం, పట్టుదల.

**టెక్కులకత్తె** వి. **1.** టెక్కులుకల స్త్రీ. విలాసవతి. ఉ. హరిశ్చ. 4.117; **2.** సీటుకత్తె. **టెక్కులాఁడి** వి. **1.** టెక్కులకత్తె. కువ.చ. 2.79; **2.** సీటుకత్తె; **3.** విలాసవతి. < టెక్కు[1]+-లు+-ఆఁడి. **టెక్కులాఁడు** విణ. టెక్కులుగలవాడైన. వి. నీటుకాడు, అందగాడు. <టెక్కు+-లు+-ఆఁడు. **టెక్కులుపోవు** స.క్రి. డాబు చేయు, డంబాలకు పోవు.

**టెక్కు**[2] రూ.చూ. టెక్కియము. వి. టెక్కెం, ధ్వజం. చంద్రాంగ. 5.125.

**టెక్కువ** రూ.చూ. టెక్కు[1]. వి. **1.** విలాసం. కళా. 8.234, బహుళా. 3.60; **2.** టెక్కు, నీటు, నిక్కు.

**టెక్కె**[1] రూ.చూ. టెక్కియము. వి. జండా.

**టెక్కె**[2] రూ. టెక్క[2], టెక్కి[2]. వి. తలగడ, దిండు, ఉపధానం.

**టెక్కెపుగాము** చూ. టెక్కెము.

**టెక్కెము** రూ.చూ. టెక్కియము. వి. జెండా, ధ్వజం. ఆం.భా. 2.221.

**టెక్కెపుగాము** వి. కేతుగ్రహం. **టెక్కెమెగురఁగొట్టు** స.క్రి. చంపు, గెలుచు. < టెక్కెము+ఎగురు+-అ[7]+కొట్టు[1].

**టెక్కెమెగురఁగొట్టు** చూ. టెక్కెము.

**టెక్నాలజీ** వి. సాంకేతిక కళలకు సంబంధించిన శాస్త్రం.

ఇం. *Technology*. సాంకేతిక శాస్త్రం.

<ఇం. Technology.

**టెక్నికల్ఎడ్యుకేషన్** వి. సాంకేతిక విద్య.

ఇం. *Technical education*. సాంకేతిక విద్య.

<ఇం. Technical education.

**టెక్నిషియన్** వి. సాంకేతిక నిపుణుడు.

ఇం. *Technician*. సాంకేతిక నిపుణుడు.

<ఇం. Technician.

**టెక్యము** రూ.చూ. టెక్కియము. వి. ధ్వజం, జెండా. సాంబ. స్థా. 62.

**టెక్స** వి. ఆరుబయట చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఊడ్తలకు ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

ఇం. *Taxi*. టాక్సీమీటర్‌కు సంక్షిప్తరూపం.

**టెక్స్టు** వి. మూలగ్రంథం.

ఇం. *Text*. గ్రంథకర్త రచించిన మూలపాఠం, మూలం.

<ఇం. Text.

**టెక్స్టైలు** వి. నేసినవస్త్రం.

ఇం. *Textile*. నేతకు సంబంధించిన.

<ఇం. Textile.

**టెంక** చూ. టెంకి. వి. మామిడికాయ, తాటికాయ, మొ. వాటి విత్తనం.

**టెంకపొదుగు** వి. వెడల్పుగా గిన్నె మాదిరిగా ఉండే పొదుగు.

**టెంకణము**[1] రూ. టెంకనము, డెంకణము. వి. నమస్కారం. కార్తీక. 2.20.

**టెంకణము**[2] రూ.చూ తెంకణము. వి. దక్షిణదేశం.

**టెంకనము** రూ.చూ. టెంకణము[1]. వి. **1.** నమస్కారం, మొక్కు. ప్రబంధ. 880; **2.** టెంకణదేశం.

**టెంకము** రూ. టొంక. వి. **1.** బంగారం, ఇత్తడి మొ. లోహాల్ని అతకటానికి ఉపయోగించే లోహం, వెలిగారం; **2.** నాణెం, నిష్కం, పదహారు డబ్బుల బంగారు నాణెం. పి.శకు. 1.25; **3.** ఒక తూకపు కొలత.

సం. టంక-. నాణెం, కత్తి, గడ్డపార.

<సం. టంక-.

**టెంకాయ** చూ. తెంకాయ. వి. కొబ్బరికాయ. దశకు. 6.86, దశా. 5.81.

క. తెంగు. కొబ్బరిచెట్టు; తెంగాయ్. కొబ్బరి; తు. తెంగు. కొబ్బరిచెట్టు; త. తెంకు, తెంకమ్, తెణ. తెణ్ణై. కొబ్బరిచెట్టు; తెంకాయ్. కొబ్బరికాయ; మ. తెన్ను. కొబ్బరిచెట్టు; తెన్నన్ కాయి. కొబ్బరికాయ; తెన్న, తేన్నా. కొబ్బరికాయ; కో. తెన్ కాయ్. కొబ్బరికాయ, గరిటలా ఉపయోగించే కొబ్బరిచిప్ప; తొ. తొగొయ్. కొబ్బరి కాయ; తొగ్నోన్. కొబ్బరితాడు; తెగొయ్. గరిటలా ఉపయోగించే కొబ్బరిచిప్ప.

**టెంకాయచెట్టు** వి. నారికేళం, కొబ్బరిచెట్టు. ఆం.భా. 2.78. **టెంకాయపగులగొట్టినట్లు** అవ్య. సూటిగా, నిర్మొగమాటంగా, కుండపగులగొట్టినట్లు, కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లు. **టెంకాయపాలు** వి. **1.** నారికేళంనీరు (కొబ్బరి నీరు). సానందో. 1.18; **2.** కొబ్బరికాయలో గుంజు నలగకొట్టి తీసినరసం, కొబ్బరిపాలు. **టెంకాయపిచ్చికొండ** యను అ.క్రి. భయభ్రాంతుడగు. **టెంకాయపీచు** వి. కొబ్బరి పీచు. **టెంకాయపురి** వి. కొబ్బరిపీచుతో తయారైన నార. **టెంకాయబురుసు** వి. కొబ్బరిమట్టను ఒకవైపు నలగగొట్టి తయారుచేసిన కుంచె. **టెంకాయబొచ్చె** వి. దాటిపై బద్దల్ని బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప. **టెంకాయల పండుగ** వి. వినాయకచవితి. వ్య. కొబ్బరికాయలు పగల గొట్టే పండుగ. **టెంకాయలొట్టి** వి. చెంబులాగుండే మట్టి పాత్ర. **టెంకాయోర్చి** వి. మధ్యభాగం గుమ్మటంలాగుండి,

పైచివర మొనదేలి ఉండే ఆర్చి. < టెంకాయ + ఆర్చి. **టెంకాయికోపార్చి** వి. మధ్యభాగం గుమ్మటంలాగుండి, పై చివర మొనదేలి ఉండే ఆర్చి.

**టెంకాయార్చి** చూ. టెంకాయ.

**టెంకాయికోపార్చి** చూ. టెంకాయ.

**టెంకి** రూ. టెంకియ, టెంకె, తెంకి. వి. **1**. స్థానం. ఉనికిపట్టు, భార. మౌ. 82, ఆం.భా. 2.13 ; **2**. గృహం. హర. 2.64, వేమన. 3.247 ; **3**. జలాశయం. గౌ. హరి. పూ. 1657, మను. 4.37 ; **4**. తాటాకులకు బెజ్జం వేసే సాధనం, కంటాణి ; **5**. తలకుట్టుబద్ద ; **6**. చిప్ప, కొబ్బరి టెంకు.

క. తెంక, తెంకు. దక్షిణం.

**టెంకిపట్టు** రూ.చూ. తెంకిపట్టు. వి. **1**. ఉనికిపట్టు, స్థానం. ముకుంద. 2.20, అష్టమ. క. 1.11 పు. 252 ; **2**. ఇల్లు. **టెంకిపుల్ల** వి. నేత నేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. **టెంకిపెట్టుకొను** రూ.చూ. టెంకివెట్టుకొను. స.క్రి. ఉనికి పట్టుకావించుకొను. **టెంకివెట్టుకొను(-పెట్టుకొను)** రూ. టెంకిపెట్టుకొను. అ.క్రి. నివసించు, ఉండు. కాశ. 3.46.

**టెంకియ** రూ.చూ. టెంకి. వి. మాదిగవాడు బెజ్జంవేసే సూది, ఆరె.

**టెంకిస** వి. పొద్దుపొడుపు పువ్వు జాతికి చెందిన మొక్క.

**టెంకె** రూ.చూ. టెంకి. వి. **1**. మాదిగవాడు బెజ్జంవేసే సూది, ఆరె ; **2**. సాలీలు గంజిపోసి పెట్టుకోవడానికి మూకుడులాగ చేసిన మట్టిపాత్ర; **3**. పణతకూ ఆరుకూ మధ్యనున్న వంపు లోపలివైపు ; **4**. బండరాతి నుంచి పలకలని పొరల్ని చీల్చడానికి గుర్తుగా గీసిన గీతకు బయటవైపున నియమితాకారం లేని ఖండ భాగం, ఇనపగంప, ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.

**టెండర్** వి. ఒక వస్తువును సరఫరా చేయడానికి లేదా పని చేయడానికి ఇచ్చే దరఖాస్తు.

ఇం. *Tender*. (సేవ, రాజీనామా మొ. వాటిని) సమర్పించు, ఇచ్చు, (డబ్బు మొ. వాటిని) పణంగా ఇచ్చు, ఒక వస్తువును సరఫరా చేయడానికి ఒప్పుకొని దరఖాస్తు ఇచ్చు.

< ఇం. Tender.

**టెండరునోటిసు** వి. వస్తువు సరఫరా చేయడానికి ఒప్పుకొనే దరఖాస్తుల కొరకు చేసే ప్రకటన. ఇం. *Tender Notice*. వస్తువు సరఫరా చేయడానికి ఒప్పుకొనే దరఖాస్తులకు హెచ్చరిక. < ఇం. Tender Notice. **టెండరుఫారము** వి. టెండరు దరఖాస్తు ఫారం. ఇం. *Tender form*. ఒక వస్తువును సరఫరా చేయడానికి ఒప్పుకోవడానికి దరఖాస్తు చేసే ఫారం. < ఇం. Tender form.

**టెన్నిసు** వి. చుట్టూ ఆవరణ చేసి గట్టిపరచిన నేల ఉన్న క్రీడారంగంలో మధ్య అడ్డంగా కట్టిన వల మీదుగా రాకెట్టులతో బంతిని కొడుతూ ఇద్దరు, ముగ్గురు లేదా నలుగురు ఆడే ఒకరకం బంతి ఆట, టెన్నిసు ఆట.

ఇం. *Tennis*. ఒకరకపు బంతి ఆట.

< ఇం. Tennis.

**టేబిల్‌రుమాలు** వి. ఒకరకం తలపాగ.

ఇం. *Table*. బల్ల.

హిం.ఉ రూమాల్. చిన్న వస్త్రం.

< ఇం. Table + ఉ. రూమాల్.

**టెలిగ్రాఫు** వి. తంతి ద్వారా వార్తల్ని, సంకేతాన్ని దూరస్థలాలకు ప్రసారం చేసే సాధనం.

ఇం. *Telegraph*. తంతిద్వారా వార్తల్ని, సంకేతాల్ని దూరస్థలాలకు ప్రసారం చేసే సాధనం.

< ఇం. Telegraph.

**టెలిగ్రామ్** వి. తంతివార్త.

ఇం. *Telegram*. తంతి ద్వారా పంపే వర్తమానం, తంతివార్త.

< ఇం. Telegram.

**టెలిఫోనంచు** చూ. టెలిఫోను.

**టెలిఫోను** వి. దూరశ్రవణ యంత్రం.

ఇం. *Telephone*. దూరశ్రవణ యంత్రం.

< ఇం. Telephone.

**టెలిఫోనంచు** వి. టెలిఫోను మాదిరి డిజైనుచేసిన అంచు. < ఇం. Telephone + -అంచు[2]. **టెలిఫోనుఎక్స్చేంజి** వి. దూరశ్రవణ యంత్రవ్యవస్థ. ఇం. *Telephone exchange*. దూరశ్రవణ యంత్రాలద్వారా దూర భాషణ శ్రవణ సౌకర్యాన్ని కలిగించే వ్యవస్థ. < ఇం. Telephone exchange.

**టెలివిజన్** వి. దూరదర్శిని.

ఇం. *Television*. దూరదర్శిని.

< ఇం. Television.

**టెలిస్కోపు** వి. దూరదర్శిని.

ఇం. *Telescope*. దూరంగా ఉన్న వస్తువుల్ని దగ్గరగాను, పెద్దదిగాను కనబడేటట్లు చేసే పరికరం, దూరదర్శిని, దుర్భిణి.

< ఇం. Telescope.

**టెస్టర్** వి. విద్యుత్ ప్రసారాన్ని పరీక్షించే సాధనం.

ఇం. *Tester*. విద్యుత్ ప్రసారాన్ని పరీక్షించే సాధనం,

< ఇం. Tester.

**టెస్టిమోనియల్** వి. యోగ్యతా పత్రం.

ఇం. *Testimonial*. (ఒకని శీలం, నడవడి, యోగ్యత, ఉద్యోగార్హతలు మొ. వాటిని గూర్చిన) ప్రమాణ పత్రం, యోగ్యతా పత్రం.

< ఇం. Testimonial.

**టెస్టు** వి. పరీక్ష.

ఇం. *Test*. సూక్ష్మ పరీక్ష, శోధన,

< ఇం. Test.

**టేకా** వి. దిండుపై ఆనుకోటం.

హిం. టేకా. ఆధారం, కుర్చుండే చోటు ; మరా. టేకూ. ఆధారం.

<హిం. టీకా.

**టేకి** రూ.చూ. టేకు. వి. గోదావరి అడవుల్లో పెరిగే పెద్ద ఆకులుకల కలపగా ఉపయోగపడే ఒకరకం చెట్టు.

**టేకు** రూ.చూ. టేంకు. వి. గోదావరి అడవుల్లో పెరిగే పెద్ద ఆకులుకల కలపగా ఉపయోగపడే ఒకరకం చెట్టు.

**టేకుటాకు** వి. టేకిచెట్టు ఆకు. <టేకు+ఆకు. **టేకుముక్క** వి. రంగు అద్దిన నూలు లడీలు పెండటానికి తగిలించే కొయ్య చెక్క. **టేకుసన్నం** వి. ఒకరకం వడ్లు.

**ట్యాంకరు** వి. ద్రవపదార్థాల్ని తీసుకువెళ్ళే తొట్టి కలిగిన మోటారు వాహనం.

ఇం. *Tanker*. ద్రవపదార్థాల్ని తీసుకువెళ్ళే తొట్టి కలిగిన మోటారు వాహనం.

<ఇం. Tanker.

**టేంకి** రూ.చూ. టేంకు. వి. నీళ్ళు పోసుకొనే తొట్టి.

**టేంకు** రూ. టేంకి. వి. 1. చెరువు; 2. తుపాకులు అమర్చిన యుద్ధవాహనం.

ఇం. *Tank*. ద్రవం, వాయువు మొ. వాటిని నిలవ చేసే పెద్ద తొట్టి, రైలు ఇంజనుకు సంబంధించిన నీళ్ళకాగు, చెరువు, తటాకం, కొలను, తుపాకులు అమర్చిన యుద్ధ వాహనం.

<ఇం. Tank.

**టేంకి** రూ. టేంకి. వి. మత్స్య విశేషం, పొడుగుతోకగల ఒక జాతి చేప.

**టేంకిచేపతోలు** వి. కుంచె చెంపలు కుట్టే తోలు.

**టేంకు** రూ. టేకు², టేకి, టేకు, టేంకు. వి. తేకు, క్రకచపత్రం, గోదావరి అడవుల్లో పెరిగే ఒక చెట్టు (దీని కలప అనేక విధాలుగా ఉపయోగపడుతుంది). హంస. 4.11, శుక. 2.546 (Tectona grandis).

క. *తేగు, తేగ, తేంగు*; త. *తేక్కు*. టేకుచెట్టు; మ. *తేక్కు*; గోం. *తేకనజా, టేకా*; పర్జి. *తేకనేరి*. టేకుచెట్టు; కొలా. *టేక్*. టేకుకలప.

**టేంకుదీవి** వి. శాక ద్వీపం.

**టేపన్** వి. గోడ కట్టేటప్పుడు మునుముందు పెంచుకోడానికి అనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

**టేపిటిక** చూ. టేపు.

**టేపు** వి. 1. నాడా; 2. బాడు; 3. కొలతల్ని గుర్తించిన రేకు లేక సుద్దముట్ట; 4. రంగుజమిలి పోగులు పెట్టి నేసిన చిగురంచు.

**టేపిటిక** వి. సర్కారు ప్రమాణాల ప్రకారం సరైన కొలతల్లో ఉన్న పెద్ద ఇటుక. <ఇం. Tape+ఇటిక. **టేపుకూజా** వి. పంపుకూజ, పక్క భాగంలో కుళాయి అమర్చిన కూజా. <ఇం. టేప్+కూజా. **టేపుబల్ల** వి. ఇటుక కొట్టడానికి వాడే వెడల్పయిన బల్ల. **టేపురాయి** వి. సున్నం, సిమెంటు పూతను నున్నబరచటానికి వాడేరాయి.

**టేపురికార్డరు** వి. టేపులలో శబ్దాన్ని గ్రహించి మరల దానిని వినిపించగల యంత్రం.

ఇం. *Tape recorder*. టేపులలో శబ్దాన్ని గ్రహించి మరల దానిని వినిపించగల యంత్రం.

<ఇం. Tape recorder.

**టేబిల్‌టెన్నిస్** వి. బల్లమీద ఆడే టెన్నిస్ ఆట.

ఇం. *Table tennis*. బల్లమీద ఆడే టెన్నిస్ ఆట.

<ఇం. Table tennis.

**టేబులు** వి. మేజా, బల్ల.

ఇం. *Table*. మేజా, బల్ల.

<ఇం. Table.

**టేబుల్‌ఫేను** వి. మేజాపై ఉంచే గాలి వీచే పరికరం.

ఇం. *Table fan*. మేజాపై ఉంచే గాలివీచు పరికరం.

<ఇం. Table fan.

**టేబుల్‌స్టోన్** వి. నగిషీరాయి.

ఇం. *Table*. రత్నోపరిభాగం; *Stone*. రాయి.

<ఇం. Table+ఇం. Stone.

**టేమ్రాను** రూ.చూ. తేమ్రాను¹. వి. కొబ్బరి చెట్టు.

**టేవు** వి. మండటంలో ధ్వనికి అనుకరణం. ఉ.హరి. 5.26.

**టేక్సీ** వి. అద్దెకారు.

ఇం. *Taxi*. మీటరు అమర్చిన అద్దెకారు.

<ఇం. Taxi.

**టేక్సు** వి. పన్ను.

ఇం. *Tax*. పన్ను, సుంకం, కప్పం, ప్రభుత్వ పరిపాలనా నిర్వహణకై వ్యక్తుల మీద, ఆస్తిమీద, వ్యాపారం మీద విధించే పన్ను.

<ఇం. Tax.

**టై** వి. చొక్కా మీద మెడకు అలంకారార్థం కట్టిన కట్టు.

ఇం. *Tie*. చొక్కా మీద మెడకు అలంకారార్థం కట్టిన కట్టు, తగిలించు, కట్టు, బంధించు, ముడివేయు.

<ఇం. Tie.

**టైటు** విణ. బిగుతైన.

ఇం. *Tight*. బిగుతయిన, దగ్గరగాచేరిన.

<ఇం. Tight.

**టైంటేబులు** వి. విద్యాసంస్థల పనివేళల్ని, రైళ్ళు మొ వాటి రాక పోకల్ని తెలిపే పట్టిక, కాలసూచిపట్టిక.

ఇం. *Time-table*. విద్యాసంస్థల పనివేళలు మొ. వాటిని తెలిపే పట్టిక, రైళ్ళ రాకపోకల్ని తెలిపే పట్టిక.

<ఇం. Time-table.

**టైనుదారం** వి. పేనినదారం.

ఇం. *Twine*. పేనినదారం.

<ఇం. Twine+దారము.

**టైపిస్టు** వి. టైపుచేసే వ్యక్తి.

ఇం. *Typist*. టైపుచేసే వ్యక్తి.

<ఇం. Typist.

**టైపు** రూ. టయిపు. వి. అచ్చు, ముద్ర.

ఇం. *Type*. ఇంకొక వస్తువుకి లేదా వర్గానికి దృష్టాంతంగా చిహ్నంగా ప్రవక్తృసామ్యంగా లేదా విలక్షణ ప్రతికూలంగా ఉండే వ్యక్తి, వస్తువు, సంఘటన, అచ్చు, ముద్ర.

<ఇం. Type.

టైపురైటరు వి. అక్షరయోజన యంత్రం, టైపు చేయటానికి ఉపయోగించే యంత్రం.
ఇం. *Typewriter.* టైపుచేసే యంత్రం.
< ఇం. Typewriter.

టైఫాయిడు వి. సన్నిపాతజ్వరం.
ఇం. *Typhoid.* సన్నిపాత విషజ్వరం వంటిది.
< ఇం. Typhoid.

టైము రూ. టయిము. వి. వేళ, సమయం.
ఇం. *Time.* కాలం, వేళ, సమయం, అవకాశం, వ్యవధి, చరిత్రలో యుగం, నిర్ణీతకాలం, లభ్యమైనకాలం, సందర్భం, పర్యాయం.
< ఇం. Time.

టైమ్‌పీస్ వి. చిన్నగడియారం.
ఇం. *Time piece.* చిన్నగడియారం.
< ఇం. Time piece.

టైంబాంబు వి. ఒకస్థితిలో ఉంచిన తరువాత నిర్ణీతకాలానికి పేలే బాంబు.
ఇం. *Time-bomb.* సమయం నిర్ణయించబడిన బాంబు.
< ఇం. Time-bomb.

టైరు వి. కారు మొ. వాటి చక్రాలకు చుట్టూ వేసే రబ్బరు వలయం.
ఇం. *Tyre.* రబ్బరుచక్రం.
< ఇం. Tyre.

టైలరు రూ. టయిలరు. వి. కుట్టుపనివాడు, దర్జీ.
ఇం. *Tailor.* దర్జీ.
< ఇం. Tailor.

టొకరము వి. టొంపు, నింద.
హిం.ఉ. ఠోకర్. దెబ్బ.
< హిం. ఠోకర్.

టొకాయించిమాట్లాడు చూ. టొకాయించు.

టొకాయించు రూ.చూ. టకాయించు. స.క్రి. ఎగరగొట్టు, ఎదుర్కొను.
టొకాయించిమాట్లాడు స.క్రి. 1. ఎదిరించు ; 2. తిరగబడిమాట్లాడు.

టొక్కు రూ.చూ. డొక్కు[1]. విశ. ముసలిఅయిన.

టొక్కోజిగాఁడు చూ. టొక్కు. వి. ఒకరకం పక్షి.

టొంక రూ.చూ. టెంకము. వి. టంకం.

టొంకు వి. 1. పారుష్యం. వీర.వి. 3.63 ; 2. వంకర. వీర.వి. 3.67 ; 3. వంపు. శశా. 3.30 ; 4. కరుకుదనం. విశ. నిమ్నోన్నతమైన.
త. టొంకు ;
హిం. ఠోంకా. ఒడ్డు, కోణం ; మరా. టొంక. కొన.

టొంగా వి. మొట్టికాయ.
హిం. ఠోంక్. దెబ్బ ; ఠోంక్‌నా. గట్టిగా దెబ్బకొట్టడం ; మరా. ఠోక(ణేఁ). కొట్టు ;
క. టొంకాయిసు. కొట్టు.
< హిం. ఠోంక్.

టొపారము వి. ఇంటిపైకప్పు.
ప్రా. టొప్పర-. టోపీ ; మరా. టోపరే ;
క. టొప్పర. టోపి.
< ప్రా. టొప్పర-.

టొప్పి రూ. టోపన్, టోపా[2], టోపి, టోపీ, తొప్పి, తోపి. వి. టోపి, కుళ్ళాయి, పట్టు మొ. వాటితో చేసిన కిరీటం. ఉ.హరి. 4.166.
ప్రా. టోపిఆ, టొప్పర-. టోపీ ; హిం.ఉ.మరా. టోపి ;
క. టొప్పి, టొప్పిగె. టోపి ; టొప్పు, తొప్పిగె. తోపి ; తు. తొప్పి, టొప్పి ; మ. తొప్పి ; కువి. తోపి ; బ్రా. టోప్, టోపీ.
< ప్రా. టోపిఆ.

టొబాకొ రూ. టుబాకొ. వి. పొగాకు, తంబాకు.
ఇం. *Tobacco.* పొగాకు.
< ఇం. Tobacco.

టొమాటొ రూ. టమాట, టమాటా, టమోట, టోమాట, తమాట, తమోట. వి. రామములగపండు, తక్కాళిపండు (Lycopersicum esculantum).
ఇం. *Tomato.* రామములగపండు.
< ఇం. Tomato.

టొంప రూ. టొంపు. వి. 1. గుదికర్ర ; 2. చిన్నఇల్లు ; 3. వంకర.
క. టొణపె. లావైన కర్రముక్క, దుడ్డుకర్ర, అనాగరకుడైన బానిస, మూర్ఖుడు, లావుతనం ;
మరా. టొణపా.
టొంపకర్ర వి. దొంగగొడ్డు పరుగెత్తి పోకుండా మోకాళ్ళకు కొట్టుకొనేట్లు మెడకు వేలాడగట్టిన రెండు కొయ్యల పలక.

టొంపు రూ.చూ. టొంప. వి. 1. వంకర ; 2. మిష ; 3. నింద, ఎత్తిపొడుపుమాట ; 4. లోపం.

టొర్రి చూ. తొట్టు. వి. నేతలో ఒక పోగు తెగినప్పుడు వచ్చిన వెలితి.

టొలాయించు రూ.చూ. టలాయించు. స.క్రి. ఎగగొట్టు.

టొళ్ల వి. బోలు.
క. టొళ్ళు. బోలు, బోలుతనం.
< క. టొళ్ళు.

టోకరా రూ.చూ. ఠోకరా. వి. బోల్తా, తలకిందు.
టోకరాకొట్టు స.క్రి. మోసగించు, టోపీవేయు. టోకరావేయు స.క్రి. కికురించు, పిక్కుచేయు, మోసగించు.
టోకరించు స.క్రి. మోసగించు, దగాచేయు.

టోకరించు చూ. టోకరా.

టోకిచ్చు చూ. టోకు[3].

టోకించు చూ. టోకు[3].

టోకు[1] రూ. ఠోకు. విశ. 1. సమీపమైన. ఆం.భా. 3.45 ; 2. చిల్లరకాని, మొత్తమైన ; 3. పెట్టెలో ఉండే నూలుకట్ట, పట్టుదారం లెక్క.
క. టోకు. మొత్తమైన, చిల్లరకాని.
టోకుబేరము వి. మొత్తం బేరం, జట్టీ బేరం. టోకు

వ్యాపారం వి. పెద్దఎత్తున జరిపే వ్యాపారం.
టోకు² వి. లోపం, తక్కువ.
టోకు³ వి. ఘర్షణ, ఆస్ఫాలనం. చంద్రాంగ. 4.211, ప్రబంధ. 570.
టోకిచ్చు స.క్రి. మల్లురు భుజాలు తాకించు. టోకించు స.క్రి. మోగించు.
టోకుర్లుపెట్టు అ.క్రి. గుర్రుపెట్టు, గురక పెట్టు.
టోపన్ రూ.చూ. టాప్పి. వి. 1. ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీలమీద దించిన పలక ; 2. కప్పు ఎగరకుండా దానిమీద వేసేకట్ట.
టోపా¹ వి. కోపాగిన్నె, మజ్జిగ పోసుకోడానికి వాడే చిన్న మట్టి పాత్ర.
మరా. టోప. రాగి లేదా ఇత్తడితో తయారైన పాత్ర విశేషం.
< మరా. టోప.
టోపా² రూ.చూ. టొప్పి. వి. ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదకి దించిన పలక.
టోపి రూ.చూ. టొప్పి. వి. 1. కుళ్ళాయి, పట్టు మొ. వాటితో చేసిన కిరీటం. రాజవా. 4.11 ; 2. మోసం, వంచన ; 3. కప్పు ఎగరగుండా దాని మీద వేసే కట్ట, ఇంటి పైన గుమ్మటం లాగ నిర్మించిన కట్టడం.
టోపిగోడ వి. చూరుగోడ, మదురు వేసిన ప్రహారీగోడ. టోపితుంటి వి. చిలకకట్టు, మదురు వెయ్యడానికి గోడలో పాతిన కొయ్యముక్క. టోపిదాక వి. టోపిలాగ ఉండే చిన్న మట్టిపాత్ర.
టోపీ రూ.చూ. టొప్పి. వి. 1. టొప్పి, కిరీటం, కుళ్ళాయి ; 2. ప్రహారీగోడమీద ఆకు, మట్టి, రాయి మొదలైనవాటితో రక్షణకోసం గోడకంటే వెడల్పుగా పెట్టిన కప్పు.
టోపీఅటిక వి. పెద్దమొగం ఉండే మట్టిపాత్ర. టోపీదాసు వి. టక్కరి, టక్కులాడి, మోసకారి. టోపీపడు అ.క్రి. మోసపోవు, ఓటుపడు. టోపీపెట్టు స.క్రి. కికురించు, మోసగించు, నష్టపెట్టు. టోపీపేడు వి. అలమర పైకమ్మీ. టోపీవేయు స.క్రి. కికురించు, మోసగించు, నష్టపెట్టు. టోపీవ్యవహారం వి. దగుల్బాజీ వ్యవహారం. టోపీసట్టి (-చట్టి) వి. టోపీ ఆకారంలో ఉండే చిన్న మట్టిపాత్ర.
టోపుకమ్మి రూ.చూ. తోపుకమ్మి. వి. 1. చీర మధ్యలో పెట్టిన రంగు ; 2. అడ్డకొనలో నేసిన కమ్మి.
టోపుకొంగు రూ.చూ. తోపుకొంగు. వి. నేతపడుగు పేకదారం ఏ రంగులో ఉంటే ఆ రంగులో నేసిన చీరకొంగు.
టోమాట రూ.చూ. టొమాటో. వి. రామములగ, చల్లటిచోట్ల తోటల్లో పెరిగే తీగపైరు (Lycopersium esculontum).
టోర్నమెంట్ వి. ఆటలపోటీ.
ఇం. *Tournament*. ఆటలపోటీ.
< ఇం. Tournament.
టోలా¹ వి. 1. గుంపు ; 2. పైసలో ఎనిమిదవవంతు నాణెం, రోళి. విణ. సారంలేని.
క. టోళి. గుంపు, రాశి ;
ప్రా. టోలా-. గుంపు ; మరా. టోళీ. గుంపు, రాశి.
టోలాటోలి రూ.చూ. టోలాఠోలి. వి. 1. గుంపులు ; 2. బాధ్యతలేనివారు. టోలాఠోలి రూ. టోలాటోలి. వి. 1. గుంపులు ; 2. బాధ్యతలేనిమూక. మరా. టోళీ. గుంపు, రాశి.
టోలా² వి. తల వెనుకగా వేసిన దెబ్బ.
మరా. టోల(-ణే). తోయు.
టోలా³ వి. పెంకులను ఒకదానిలో ఒకటి దూర్చి పేర్చే తీరు.
టోలి రూ. టోలీ, టోళి, టోళీ, రోలి, రోలీ, రోళి, రోళీ. వి. 1. పైసలో ఎనిమిదోవంతు, గవ్వ, పాతకాలంలో మారకానికి ఉపయోగించిన గవ్వ లేదా దమ్మిడి ; 2. గుంపు. విణ. సారంలేని.
ప్రా. టోల-. గుంపు ; మరా. టోళీ.
క. టోళి. గుంపు, సమూహం.
టోలీ రూ.చూ. టోలి. వి. 1. పైసలో ఎనిమిదోవంతు, అరదమ్మిడి ; 2. గుంపు. విణ. సారంలేని.
టోళి రూ.చూ. టోలి. వి. 1. పైసలో ఎనిమిదోవంతు, రోలి ; 2. గుంపు. విణ. సారంలేని.
టోళీ రూ.చూ. టోలి. వి. కానిలో ఆరవవంతు.
టౌసు రూ.చూ. టవును. వి. పట్నం.
ట్యూటరు వి. ప్రత్యేకోపాధ్యాయుడు.
ఇం. *Tutor*. ప్రత్యేకోపాధ్యాయుడు.
< ఇం. Tutor.
ట్యూనింగ్ వి. శ్రుతి.
ఇం. *Tuning*. శ్రుతిచేయటం.
< ఇం. Tuning.
ట్యూబు వి. గొట్టం.
ఇం. *Tube*. నాళం, గొట్టం.
< ఇం. Tube.
ట్యూషను వి. (విద్యాశాలలోకాక) ప్రత్యేకంగా చెప్పబడే విద్య.
ఇం. *Tuition*. ప్రత్యేకంగా చెప్పబడే విద్య.
< ఇం. Tuition.
ట్రక్కు వి. సామాన్లు తీసుకువెళ్ళే బరువైన వాహనం.
ఇం. *Truck*. సామాన్లు తీసుకువెళ్ళే బరువైన వాహనం.
< ఇం. Truck.
ట్రంకాల్ వి. పై ఊరినుంచి వచ్చే టెలిఫోన్ (పిలుపు).
ఇం. *Trunk-call*. టెలిఫోన్ (కాల్) పిలుపు.
< ఇం. Trunk-call.
ట్రంకు వి. పెద్ద రేకుపెట్టె.
ఇం. *Trunk*. పెద్దపెట్టె, చెట్టుబోదె లేదా మొదలు తొండం (ఏనుగు), ప్రధాన మార్గం.
< ఇం. Trunk.
ట్రంకురోడ్డు వి. ప్రధాన రాజమార్గం.
ఇం. *Trunk road*. ప్రధాన రాజమార్గం.
< ఇం. Trunk road.
ట్రంపు వి. పేకలోని తురఫుముక్క.
ఇం. *Trump*. బాకా, పేకలో తురఫుముక్క.

<ఇం. Trump.

ట్రయినింగు రూ. ట్రైనింగు. వి. శిక్షణ.
ఇం. *Training*. శిక్షణ.
<ఇం. Training.

ట్రయిను రూ. ట్రైను. వి. పొగబండి, రైలు.
ఇం. *Train*. రైలు, పొగబండి.
<ఇం. Train.

ట్రస్ట్ వి. **1**. ప్రగాఢ విశ్వాసం; **2**. నిధి.
ఇం. *Trust*. విశ్వాసం; నిధి.
<ఇం. Trust.

ట్రాక్టర్ వి. పొలం దున్నే యంత్రం.
ఇం. *Tractor*. పొలం దున్నే యంత్రం, ముందు ఇంజనుగల విమానం.
<ఇం. Tractor.

ట్రాన్సిస్టర్ వి. తీసుకుపోవడానికి వీలుగా ఉండే రేడియో, చిన్న రేడియో.
ఇం. *Transistor*. తీసుకుపోవడానికి వీలుగా ఉండేది.
<ఇం. Transistor.

ట్రాన్స్‌పోర్టు వి. సామాను ఒక చోటినుండి ఇంకో చోటికి పంపటం.
ఇం. *Transport*. సామాను ఒక చోటినుండి ఇంకో చోటికి పంపటం.
<ఇం. Transport.

ట్రాఫిక్ వి. రోడ్డు, రైలు, జలమార్గం మొ. వాని ద్వారా వ్యక్తులు లేదా సరుకుల రాకపోకలు.
ఇం. *Traffic*. వర్తకంచేయు, వినిమయ మొనర్చు, సరుకుల రవాణా, రోడ్డు, రైలు, జలమార్గం మొ. వాని ద్వారా వ్యక్తులు లేదా సరుకుల రాకపోకలు.
<ఇం. Traffic.

ట్రిల్లు వి. ఖాకీట్రిల్లు మాదిరిగా, ఏటవాలు వరుసలో పోగులు కనబడేట్టు నేసిన నేత.

ట్రైనింగు రూ.చూ. ట్రయినింగు. వి. శిక్షణ.

ట్రైను రూ.చూ. ట్రయిను. వి. రైలు, పొగబండి.



ఠ వి. మూర్ధన్య శ్వాస స్పర్శం, మహాప్రాణం. 'ట'కారానికి మారుగా వర్గ ద్వితీయాక్షర మహాప్రాణం అయిన 'ఠ' కారం కొన్ని శాసనాల్లో ప్రయోగించబడింది. ద. హిం. శా. సంపు. 5. క్రీ.శ. 1354, ద. హిం. శా. సంపు. 6. శా.సం. 950, క్రీ.శ. 1424. మూలద్రావిడంలో ఈ వర్ణంలేదు, తెలుగులోకి అన్యదేశీయ పదాలవల్ల ధ్వన్యనుకరణం వల్ల ఈ వర్ణంవచ్చింది.

ఠకాయించు రూ.చూ. టకాయించు. స.క్రి. ఎగరగొట్టు, ఠలాయించు.

ఠకిలున రూ.చూ. ఠకేలున. అవ్య.ద్రు. అమాంతంగా.

ఠకీలున రూ. ఠకిలున, ఠకేలున. అవ్య.ద్రు. అమాంతంగా, అకస్మాత్తుగా.
హిం. *ఠకిల్*. ఆక్రమణ, వేగంగా చేసిన దాడి.

ఠకేలున రూ.చూ. ఠకిలున. అవ్య. ద్రు. అమాంతంగా, అకస్మాత్తుగా.

ఠక్కుఁడు చూ. టక్కు. వి. టక్కరి, కల్లరి.

ఠక్కురులు వి.బ.వ. **1**. వేల్పులు, అంకులు; **2**. ఠాకురులు.
ప్రా. *ఠకుర-*, *ఠక్కుర*. క్షత్రియుడు, గ్రామాధికారి; హిం. *ఠాకూర్*. దేవత, దేవుడు, పూజవ్యక్తి, నాయకుడు, సర్దారు; మరా. *ఠాకూర్*. ఒక జాతి.
<ప్రా. ఠక్కుర- + -లు.

ఠంగన రూ.చూ. ఠింగణా. వి. పొట్టివాడు, పొట్టిది; విశ. గట్టిదైన.

ఠంగు రూ. టంగు[3]. వి. గంట మొదలైనవి మోగేటప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం.
ఠంగుఠంగను రూ. టంగుటంగను. అ.క్రి. గంట మొదలైనవి మోగు. <ఠంగుఠంగు + అను. ఠంగుఠంగు రూ. టంగుటంగు. వి. గంట మొదలైనవి అవిచ్ఛిన్నంగా మోగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ఠంగుఠింగు రూ. టంగుటింగు. వి. ఆయుధం మొ. కఠినపదార్థాలు ఒకదాని కొకటి తగిలినపుడు అయ్యే ధ్వనికి అనుకరణం. కళా. 8.109.

ఠంగోరా వి. పై అంగవస్త్రంలో చిన్న కమ్మికి రెండు వైపులా పెట్టిన పోగులు.
<హిం. *టంగారీ*. పాగా.
ఠంగోరాలుతీయు అ.క్రి. పై అంగవస్త్రంలో చిన్న కమ్మికి రెండు వైపులా పోగులు పెట్టు.

ఠంచనగా రూ.చూ. టంచనగా. క్రి. విశ. ద్రు. సరిగా, బిగుతుగా.

ఠంఠం వి. నారియొక్క ధ్వనికి అనుకరణం. భాగ. 9.615.

ఠమ్ము వి. పటహధ్వనికి అనుకరణం. శివరా. 4.42.

ఠరాయించు స.క్రి. నిర్ధారణ చేయు.
మరా. *ఠర(ణేఁ)*. స్థిరమగు, నిర్ణయమగు.
<మరా. ఠర(ణేఁ) + -ఇంచు[3].

ఠలాయించు రూ.చూ. టలాయించు. అ.క్రి. అటూఇటూ తిరుగు. స.క్రి. టకాయించు, తప్పించుకొని తిరుగు.

**ఠవఠవ** వి. 1. బాధ. భాగ. 9.615 ; 2. శ్రమం. అలయిక. మను. 1.76 ; 3. దుఃఖం. కాశీ. 3.103 ; 4. చింత, విచారం. వాల్మీ. 2.109 ; 5. అసత్యం. ఆం. భా. 1.119.

సం. స్థాప-. నిలపటం ; ప్రా. *ఠవ-*. నిలుపు, ఆపు.

< ప్రా. ఠవ-.

**ఠవఠవదెచ్చు** (-తెచ్చు) స.క్రి. వేగంగా తెచ్చు. **ఠవఠవపడు** అ.క్రి. బెదరు, జంకు, చింతిలు. **ఠవఠవయగు** (-అగు) అ.క్రి. శ్రమపడు, అలయు.

**ఠవణి** వి. 1. ఒకస్వరస్థాయి. బసవ. 3.938 ; 2. నాట్యవిశేషం. పండి.చ. 5.378.

సం. స్థాపన-. స్థాపించటం; ప్రా. *ఠవణ-*, *ఠవణా*. స్థాపించటం ; *ఠవణీ*. న్యాసముంచిన వస్తువు.

< ప్రా. ఠవణ-.

**ఠవణించు** స.క్రి. 1. ప్రవర్తిల్ల చేయు. భాగ. 3.189 ; 2. కలిగించు, కావించు, చేయు. భాగ. 6.369 ; 3. ఎదుర్కొను, మార్కొను. శ్రీరం. మా. 1.167, సుద. 5.147 ; 4. రచించు, కూర్చు. పాండు. 1.18. సం. స్థాపన-. స్థాపించటం ; ప్రా. *ఠవణ-*. ఠావణ, స్థాపన, ధారణం. < ప్రా. ఠవణ- + -ఇంచు[3].

**ఠవణిలు** రూ.చూ. ఠవణిల్లు. అ.క్రి. ఒప్పు, ఉండు, జరుగు.

**ఠవణిల్లు** రూ. ఠవణిలు. అ.క్రి. 1. ఉండు, ప్రవర్తిల్లు. కాశీ. 5.96, వాల్మీ. 2.57 ; 2. ఉచితమగు, తగు. భాగ. 3.855 ; 3. ఒప్పు. కృ. శకు. పీఠి. 13, ఆం. భా. 3.83.

**ఠవణె** రూ.చూ. ఠవిణ. వి. ఢంకా, ఢక్క, ఢక్క.

**ఠవర** విణ. నేర్పరి, జాణ, సమర్థుడు. భాగ. 7.228, విజయ. 3.56, ఆం. భా. 3.3.

సం. స్థవిర-. వృద్ధుడు, బలశాలి ; ప్రా. *ఠవిర-*, *థవిర-*. శక్తిమంతమైన.

< ప్రా. ఠవిర-.

**ఠవరతనము** వి. నైపుణ్యం, నేర్పు. పి. శకు. 1.40.

**ఠవళి** రూ. టవలి, టవలిక, ఠవళీ, తవళి. వి. 1. మోసం, కపటం. సారంగ. 3.205, అచ్చ. రా. అరణ్య. 52 ; 2. అబద్ధం. కల్ల. ఆం. భా. 1.119. విణ. అసత్యమైన, అబద్ధమైన. హంస. 5.111.

క. *టవళి*. మోసం, అసత్యం ; త. *టవళి*.

< క. టవళి.

**ఠవళికత్తె** వి. కుత్సితురాలు. మోసకత్తె. **ఠవళికాఁడు** వి. మోసగాడు, ధూర్తుడు. అచ్చ. రా. యు. 220, ఆం. భా. 2.286.

**ఠవళీ** రూ.చూ. ఠవళి. విణ. మోసం చేసే. ప్రబంధ. 748. వి. కపటం, కృత్రిమం.

**ఠవిణ** రూ. ఠవణె, ఠవిణె, ఢవిణ. వి. ఢంకా. భాను. 3.83.

**ఠవిణె** రూ.చూ. ఠవిణ. వి. ఢంకా, ఢక్క.

**ఠస్సా** వి. అచ్చుముద్ర, అద్దినగుర్తు.

మరా. *ఠస్సె*. ముద్ర.

< మరా. ఠస్సే.

**ఠస్సాచెప్పు** చూ. ఠస్సా. అ.క్రి. తిష్ఠవేయు, దేవిణీచెప్పు.

**ఠాకు** చూ. ఠాకు. వి. తోపు, దెబ్బ, తాపు.

**ఠాకురు**[1] రూ. ఠాగూరు. వి. 1. దేవత ; 2. అధిపతి ; 3. తండ్రి ; 4. గురువు,

బెం. *టాగోర్* ; హిం. ఉ. *ఠాకుర్*. స్వామి, ప్రభువు, దేవుడు ; మరా. *ఠాకూర్*. ఒకజాతి.

< ఉ. ఠాకుర్.

**ఠాకురుబ్రాహ్మణులు** వి.బ.వ. మైథిలులలో ఒకతెగవారు.

**ఠాకురు**[2] వి. జొన్నపైరు కోసి వేసిన కుప్ప.

**ఠాగూరు** రూ.చూ. ఠాకురు[1]. వి. 1. దేవత ; 2. అధిపతి ; 3. తండ్రి ; 4. గురువు ; 5. వ్యక్తులపేర్ల చివర చేర్చబడే గౌరవ వాచకం.

**ఠాటు** వు. వైభవం, వేడుక.

హిం. *ఠాట్*. వేషం, అలంకరణ, ఆడంబరం.

< హిం. ఠాట్.

**ఠాణ** రూ. ఠాణము. ఠాణా, ఠాణి, ఠాణియ, ఠాణె, ఠాణెము. వి. 1. పోరేటప్పుడు మల్లులు నిలబడటానికి ఏర్పరిచే చోటు. భాగ. 10 పూ. 1345; 2. సైనిక నివేశం. JAHPS. సంపు. 199.

సం. స్థాన-. చోటు ; ప్రా. *ఠాణ-* ; జై. మహా. శౌ. అ.మా. అప. *ఠాణ* ; హిం. ఉ. *ఠాన్*. అనుష్ఠానం.

క. *ఠాణా*. జిల్లాకేంద్రం, శిబిరం ; తు. *ఠాణ*.

< ప్రా. ఠాణ-.

**ఠాణదారు** రూ.చూ. ఠాణేదారు. వి. సముద్దారుకు వశంకాని శిస్తులు వసూలు చేసేవాడు, కోశాధికారి.

**ఠాణవిడు** స.క్రి. పట్టుపట్టు, పూనికగొను.

**ఠాణము** రూ.చూ. ఠాణ. వి. 1. స్థానం, నివాసస్థానం. పాండు. 1.108, పార్వ. 2.82 ; 2. కావలిస్థానం. ఉ. హరిశ్చ. 1.66.

**ఠాణా** రూ.చూ. ఠాణ. వి. 1. కావలిస్థానం, అధికారులు ఉండే చోటు. రంగా. చ. 3.278 ; 2. జమీందార్లకు కప్పం చెల్లించే కచ్చేరి.

**ఠాణాదారు** రూ.చూ. ఠాణేదారు. వి. అధికారి. వేంక. ఆం. దేవ. 18.

**ఠాణి** రూ.చూ. ఠాణ. వి. 1. ఇల్లు ; 2. చోటు.

**ఠాణియ** రూ.చూ. ఠాణ. వి. 1. ఇల్లు ; 2. చోటు ; 3. ఉనికిపట్టు.

**ఠాణె** రూ.చూ. ఠాణ. వి. 1. ఇల్లు ; 2. చోటు ; 3. ఉనికిపట్టు.

**ఠాణెదారు** రూ.చూ. ఠాణేదారు. వి. సముద్దారికి వశంకాని శిస్తులు వసూలు చేసేవాడు, కోశాధికారి.

**ఠాణెము** రూ.చూ. ఠాణ. వి. ఠాణా, శిబిరం, సైన్యస్థావరం. ద. హిం. శా. 5.108.

**ఠాణేదార్** రూ.చూ. ఠాణేదారు. వి. జమిందారీ భూముల్లో సముద్దారుకు వశం కాని శిస్తులను వసూలు చేసేవాడు.

**ఠాణేదారి** చూ. ఠాణేదారు. వి. ఠాణేదారు పదవి. ద. హిం. శా. 10.745. క్రీ.శ. 1530.

**ఠాణేదారు** రూ. టాణదారు, టాణెదారు, టాణేదారు, ఠాణదారు, ఠాణాదారు, ఠాణేదార్. వి. 1. సముద్దారుకి వశం

కాని శిస్తులు వసూలు చేసేవాడు, కోశాధికారి. ద. హిం. కా. 10.745. క్రీ.శ. 1530 ; **2.** ఠాణాపై అధికారి.

హిం. థానేదార్. రక్షకభట కార్యాలయాధికారి. స్థానికాధికారి. ఉ. థానేదార్. రక్షక భటకార్యాలయాధికారి.

<ఉ. థానేదార్.

**ఠాను** రూ.చూ. ఠాను[3]. వి. నాలుగురుమాళ్ళు కలిసిఉన్న పదిగజాల బట్ట.

**ఠాయము** వి. స్వరస్థాయి. భాగ. 10 పూ. 1091.

సం. స్థాయ- ఆశ్రయం; ప్రా. ఠాయ- ఆశ్రయం, అప. ఠాయ.

<ప్రా. ఠాయ-.

**ఠాయముసేయు(-చేయు)** స.క్రి. స్థాయిని కలిగించు.

**ఠాయి** వి. స్వరస్థాయి. విప్ర. 1.2, ఉ.రా. 6.135.

సం. స్థాయిన్. స్థితి, స్థానం, ఆశ్రయం; ప్రా. ఠాఇ. ఠాయ ; జై.మహా. ఠాయి.

క. ఠాయి.

<ప్రా. ఠాఇ-.

**ఠాయించు** స.క్రి. స్థిరపరచు, నెలకొల్పు. రంగా.చ. 3.278. < ఠాయి + -ఇంచు[3].

**ఠారు** వి. **1.** పెద్ద అరుపు, గావుకేక ; **2.** గొప్ప ; **3.** గాబరా ; **4.** ఒకదెబ్బకు చచ్చుట.

మరా. ఠార. నాశాదుల్ని సూచించే క్రియలకు చేర్చే శబ్దం.

**ఠారుమను** అ.క్రి. ఒకదెబ్బకు చచ్చు. < ఠారు + అను.

**ఠారెత్తు** అ.క్రి. మిక్కిలిభయపడు. < ఠారు + ఎత్తు.

**ఠారెత్తు** చూ. ఠారు.

**ఠాలాఠోలీసేయు(-చేయు)** చూ. టాలాటోలి. స.క్రి. **1.** మాయ చేయు ; **2.** నిర్లక్ష్యంచేయు.

**ఠావు** చూ. ఠావు. రూ. టావు[1]. వి. **1.** స్థానం, చోటు. భార. విరా. 4.50. ద.హిం.కా. సంపు. 10. కా.సం. 111. క్రీ.శ. 1144 ; **2.** నివాసస్థానం, ఉండేచోటు. భాగ. 8.90, భోజ. 1.148 ; విణ. మేలైన, శ్రేష్ఠమైన. శృం.నై. 6.108, భోజ. 1.148.

సం. స్థాప- స్థాపించటం ; ప్రా. ఠావ. స్థాపించు, ఠావ-. చోటు ; జై. మహా. ఠావ- ; అమా. ఠావ- ; అప. ఠావ, ఠవ్వ- ; మరా. ఠాఉ. స్థలం, ఠావు, ఠావ్. ఆధారం, చోటు ;

క. ఠావు. చోటు ; తు. ఠావు. టావు, ఠావు ; త. తావు.

<ప్రా. ఠావ-

**ఠావుకొను** రూ. ఠావుగొను. అ. క్రి. **1.** నెలకొను, సమీర. 4.34 ; **2.** ఉండు ; **3.** నిలుచు. ఉ.రా. 6.24.

**ఠావుగొను(-కొను)** రూ.చూ. ఠావుకొను. అ.క్రి. **1.** నెలకొను ; **2.** నిలుచు ; **3.** ఉండు. **ఠావునపెట్టు** స.క్రి. నెలకొల్పు, స్థిరపరచు. ద.హిం.కా. సంపు. 6 కా.సం. 716. క్రీ.శ. 1347.

**ఠికానా** రూ.చూ. టికాణా. వి. **1.** జాగా ; **2.** బస ; **3.** గతి.

**ఠికానా** రూ.చూ. టికాణా. వి. **1.** ఆశ్రయం, బస ; **2.** గతి ; **3.** జాగా.

**ఠింగణ** రూ.చూ. ఠింగణా. వి. **1.** పొట్టివాడు, పాంచా. మాన. 5 ; **2.** అడుది ; **3.** గట్టివి ; **4.** సేవకుడు.

**ఠింగణా** రూ. ఙంగణా, ఙంగనా, టాకనా, టాంగన్, టాంగనా టింగ, టింగణ, టింగణా, ఠంగన, ఠింగణ. వి. **1.** చిన్న వాడు, చిన్నవాడు. ఆము. 4.60 ; **2.** పొట్టివాడు. ప్రబంధ. 137, ఆం.భా. 2.123 ; **3.** అడుది ; **4.** గట్టివి ; **5.** సేవకుడు.

హిం.ఉ. టాంగన్. పొట్టిగుర్రం, పొట్టి. టాంఘన్. దేశంలో గుర్రం, నేపాళ్ భూటాన్ మొ. పర్వత ప్రాంతాల్లోని పొట్టిగుర్రం.

<ఉ. టాంగన్.

**ఠింగణాసామి** రూ.చూ. టింగణాసామి. వి. గణపతి. గుజ్జువేల్పు.

**ఠీకు** వి. నిష్కర్ష, నిజం.

హిం. ఠీక్. సరియైన, తిన్ననైన, నిర్దిష్టమైన, పక్కా.

<హిం. ఠీక్.

**ఠీవి** రూ. టీవి. వి. **1.** మహత్త్వం, గొప్పతనం. భీమ. 4.175 ; **2.** పద్ధతి, రీతి, విధం. కళా. 3.264 ; **3.** వైభవం. దశా. 1.51, అచ్చ. రా. యు. 571 ; **4.** సొగసు. ఒయ్యారం. దశా. 8.33.

ప్రా. ఠివిఅ-. ఉన్నతం, ఉచ్చం.

<ప్రా. ఠివిఅ-.

**ఠే** వి. మోగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. సిం. ద్వా. 2.5.

**ఠేవ** వి. **1.** రీతి, విధం. కాశీ. 1.13, మను. 5.30 ; **2.** ఒప్పిదం, సొబగు, శోభ. కాశీ. 7.185 ; **3.** అర్హోచిత వేషం. పి.శకు. 1.112 ; **4.** చోటు, స్థానం. పి.త్రి. బా. 6.142, ఇందు. 1.172.

సం. స్థితి- స్థితి, వ్యవస్థ, క్రమం ; ప్రా. ఠిఇ.

<ప్రా. ఠిఇ.

**ఠేవయగు(-అగు)** అ.క్రి. స్థానమగు, కారణమగు.

**ఠేవణము** వి. దిటవు, తెగువ.

క. ఠేవణి. (ధన) రాశి.

మరా. ఠేవ(వే). ఉంచు.

**ఠేవణి** వి. **1.** అభినయ విశేషం. పండి.ప. 5.378 ; **2.** తూకం.

ప్రా. ఠవణా, ఠావణా-, ఠావణయా, ఠావణా. సాపనం, ధరించటం ; మరా. ఠేవణీ. వాసస్థానం.

**ఠేవము** వి. తడి, ఆర్ద్రత్వం. భార. స్త్రీ. 2.5.

సం. స్తిమ్, స్తీమ్. తడిఅగు ; ప్రా. ఠిమ్, ఠీమ్. తడి.

<ప్రా. ఠీమ్.

**ఠేవిణీవేయు** అ.క్రి. తిష్ఠవేసుకొను, తన్నావేయు.

క. ఠేవ, ఠేవా, ఠేవణి, ఠేవణీ, ఠేవు. రాశి, నిధి ; మరా. ఠేవ(వే). ఉంచు.

**ఠొణ్ణె** వి. జంత.

క. ఠొణెయ. మందబుద్ధి ; ఠొణ్ణె. మందబుద్ధికలది.

<క. పొక్కె.

తోకరా రూ. టోకరా, తోకడా. వి. నడకలో లేక పరుగులో రాతిగట్టుకు కాలికి తగిలే దెబ్బ.

హిం. ఠోకర్. దెబ్బ.

<హిం. ఠోకర్.

తోకరుగొట్టు(-కొట్టు) స.క్రి. కాలదన్ను.

హిం. ఠోకర్. దెబ్బ.

<హిం. ఠోకర్+కొట్టు.

తోకు రూ.చూ. టోకు¹. వి. టోకు, మొత్తం.

తోలా రూ. తోళా. వి. తెగ, సమూహం, గుంపు.

క. టోళి. గుంపు, సముదాయం.

మరా. టోళీ. సమూహం.

తోలి రూ.చూ. టోలి. వి. చిన్ననాణెం.

తోలీ రూ.చూ. టోలి. వి. పైసలో ఎనిమిదోవంతు.

తోళా రూ.చూ. తోలా. వి. తెగ, గుంపు, వంశం.

తోళి రూ.చూ. టోలి. వి. పైసలో ఎనిమిదోవంతు.

తోళీ రూ.చూ. టోలి. వి. పైసలో ఎనిమిదోవంతు.

# డ

డ వి. మూర్ధన్య నాదస్పర్శం, అల్పప్రాణం.

డకా చూ. డక్క¹, డక్కా¹, డక్కి, డక్కియ, డక్కీ, డక్కె, డంకా², డంకా. వి. చర్మవాద్యవిశేషం. ద.హిం.గా.సంపు. 4. గా.సం. 1346.

సం. ఢక్కా-. వాద్యవిశేషం; ప్రా. ఢక్కా-. వాద్య విశేషం; పక్క. ఒకానొక సంగీత సాధనం; హిం. ఢంకా, డక్కా; మరా. డక్కా. నగారా; డంకా. వెల్లడి.

క. డక్కె, డంక, డెంకె, ఢక్కె; తు. డక్క, డక్కె; త. తుడుక్కై, దుక్కై; మ. ఇడక్క.

<ప్రా. ఢక్కా.

డక్క¹ రూ.చూ. డకా. వి. చర్మవాద్యవిశేషం. ఉ.రా. 5.245.

డక్క² రూ.చూ. డొక్క. వి. 1. పీచుగల కొబ్బరిపెదుసు; 2. నారవిచ్చే (కొబ్బరి) చెట్టు.

డక్కడిళ్ళ రూ.చూ. డక్కాడిళ్ళ. వి. బండిగాలు దిండుకు, కుండకు మధ్య ఉండే వాషర్.

డక్కరగొను చూ. డక్కు.

డక్కను వి. దక్షిణం.

ఇం. Deccan. దక్షిణదేశ సంబంధమైన.

సం. దక్షిణాపథ-. వింధ్యకు దక్షిణప్రాంత దేశం; ప్రా. దక్ఖిణా.

<ఇం. Deccan.

డక్కా¹ రూ.చూ. డకా. వి. ఢక్కా, చర్మవాద్యవిశేషం, డక్కియ.

డక్కా² చూ. డయ్యు. వి. నష్టం, హాని, చెరుపు.

క. అడ్. నష్టం, హాని, చెరుపు; త. అటి. నాశం, సంహారం; కొలా. అళ్ యు. సంహారం.

డక్కాడిళ్ళ రూ. డక్కడిళ్ళ. వి. బండికుండకు, సాయిమేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకువేసిన ఇనపబిళ్ళ.

డక్కి రూ.చూ. డకా. వి. 1. చర్మవాద్యవిశేషం, డక్క. ఉము. 4.35; 2. డమరువు, డమరుగం.

డక్కించు చూ. డక్కు.

డక్కించుకొను చూ. డక్కు.

డక్కియ రూ.చూ. డకా. వి. డక్కి, డంక.

డక్కీ రూ.చూ. డకా. వి. 1. డుబుడక్క, డక్కి, డమరువు; 2. దొనముక్క ఆకారంలో గోలుగా ఉండే మట్టిపాత్రకు చర్మం బిగించిన వాద్యం.

డక్కీకుండ వి. కూజామాదిరి ఉండే ఒకరకం మట్టితో చేసిన వాద్యవిశేషం.

డక్కీగొను (-కొను) అ.క్రి. దెబ్బ తగులు.

డక్కీపార వి. సన్నబట్టల అద్దకానికి రంగుతొట్లలో, పింజేర (=తడికె) మీద వేసిన మెత్త, ఉన్ని (కాలువా) గుడ్డ.

డక్కు చూ. అడగు. రూ. దక్కు². అ.క్రి. 1. వశమగు, అధీనమగు, చేతికి దొరుకు. భార.ఉద్యో. 2.52, కాశీ. 1.116; 2. పోక నిలుచు, స్థిరంగా ఉండు. భార.ద్రోణ. 2.240; 3. లభించు, ప్రాప్తించు. అచ్చ.రా.బాల. 185. వి. భీతి, భయం. పండి.చ. 1.42.

క. దక్కు. అభివృద్ధిచెందు, సంపాదించు, ఉండు, నిలుచు, సంపాదన; తు. దక్కుని. నిలవవుండు. దక్కాయని. అధీనంలో ఉండు. దక్కతి. ఆధీనం, జీర్ణించుకొను; త. తంకు. ఉండు, అధీనంలో ఉండు; మ. తఙ్ఙక. కలిగియుండు, తక్కుక. పొందు, సంపాదించు; కొ. తొక్. ఎక్కువ కాలం ఉండు; గోం. తగ్గ్. ఒకరి అధీనంలో ఉండు; కొలా. తక్. నివసించు, ఉండు; నా. తక్. ఉండు; పో.చూ. గోం. తగ్గ్. పో.చూ. తక్కు.

<మూ.దా. *తఙ్-క్. వేరు విధంగా.

డక్కరగొను స.క్రి. లోబరచుకొను, వశం చేసుకొను. మను. 2.35. <డక్కు+-అ⁷+కొను. డక్కించు స.క్రి. కాపాడు, నిల్పు, దక్కించు. <డక్కు+-ఇంచు³. డక్కించుకొను స.క్రి. నిలుపుకొను, నశింపకుండ రక్షించుకొను. అచ్చ.రా.సుందర. 146. డక్కొను రూ.చూ. దక్కొను. అ.క్రి. 1. స్వతంత్రుడగు; 2. కలుగు, దక్కొను.

**డక్కె** రూ.చూ. డకా. వి. డక్కా, ఢంక.

**డక్కాను** చూ. డక్కు.

**డగర** రూ.చూ. దగర. వి. **1.** పిశాచం, దయ్యం. కళా. 3.186; **2.** గాలిదయ్యం, మగజంతువు, కీడు చేసేది; విణ. గండు, మగది. ఉ.రా. 7.444, గంధ. 6.

**డగరము** రూ. దగరము. వి. **1.** కీడు. ఉ.హరి. 5.184; **2.** చేటు, చెట్ట, హాని.

**డగరు** రూ.చూ. దగర. వి. గండుకోయిల, మత్తకోకిల.

**డగు**[1] రూ.చూ. డంగ్గు. స.క్రి. దంచు, పొట్టి తీయు. ద.హిం. శా.సంపు. 4. శా.సం. 104. క్రీ.శ. 1038.

**డగు**[2] రూ.చూ. తగ్గు[1]. అ.క్రి. తరుగు.

**డగు**[3] వి. ఒకరకం పన్ను. అహదనకర శిలాశాసనం. 19 పం. క్రీ.శ. 847.

క. అడగు, అడుఙ్గు; పో.చూ. త. అడఁగు, అనఁగు, డాఙ్గు; మ. అటఙ్గుక.

**డగులబాజీ** రూ.చూ. దగలుబాజి. వి. **1.** తుంటరి; **2.** దొంగ. మోసగాడు.

**డగ్గర** రూ.చూ. దగర. వి. పిశాచం, దయ్యం.

**డగ్గఱ** చూ. డగ్గఱు.

**డగ్గఱించు** చూ. డగ్గఱు.

**డగ్గఱిలు** చూ. డగ్గఱు.

**డగ్గఱిల్లు** చూ. డగ్గఱు.

**డగ్గఱు** చూ. డాయు. రూ. దగ్గఱు. స.క్రి. సమీపించు. భార. ఆది. 6.204. అ.క్రి. తారసిల్లు.

క. అడర్. కలియు, సిద్ధపరచు; అడర్క. ఒకచోట కలుపు; కొడ. అడి (-ప్, -త్). సమీపించు; తు. అడ వుని, అడావు. తనకా పెట్టు; త. అటు (-ప్ప్-, త్త్-). తర్వాత, ఉండు, దగ్గర, సమీపంగా వచ్చు, దగ్గరగా వచ్చు; అటుప్పిక. సమీపానికి వచ్చు; మ. అటుక (అట్టు). సంబంధం కలిగిఉండు, దగ్గరగా వచ్చు; అటు ప్పిక్క. దగ్గరకు తెచ్చు; కోట. అట్ (అల్-), అర్గ్. అఙ్గె. దగ్గర; ఆటిపవఙె. పొరుగు.

**డగ్గఱ** రూ. దగ్గర, దగ్గఱ. అవ్య.ద్రు. సమీపంలో. శృం.నై. 8.108. త. ఇడక్కర్. సమీప స్థలం. **డగ్గఱించు** రూ. దగ్గఱించు. స.క్రి. సమీపింపచేయు, తారసిల్లచేయు. మైరా. 3.41. అ.క్రి. తారసిల్లు. ఉరా. 3.319. **డగ్గఱిలు** రూ. డగ్గఱిల్లు. స.క్రి. సమీపించు, ప్రబోధ. 3.74; అ.క్రి. తారసిల్లు. **డగ్గఱిల్లు** రూ.చూ. డగ్గఱిలు. స.క్రి. సమీపించు.

**డగ్గా** రూ. దగ్గా. వి. ఎడమచేతివైపు పెట్టుకొనే తబలాకుండ.

సం. ఢక్కా. వాద్యవిశేషం; ప్రా. ఢక్కా; మరా. డగ్గా. ఒకరకం వాద్యం.

<మరా. డగ్గా.

**డగ్గు**[1] రూ.చూ. దగ్గు. అ.క్రి. కాసంచేయు, దగ్గుకొను. వి. కాసం, దగ్గురోగం.

**డగ్గుత్తిక** రూ. దగ్గుత్తిక. వి. గద్గదకంఠం, గద్గదస్వరం దగ్గుతోకూడిన కుత్తుక, దిగులు గొంతు. భాగ. 10 పూ. 1768. <డగ్గు[1] + కుత్తిక. **డగ్గుత్తికపడు** రూ.చూ. డగ్గుత్తిక పడు. అ.క్రి. **1.** గొంతుకి ఎగదట్టు. మను. 4.37; **2.** గద్గద స్వరం కలది అగు. **డగ్గుత్తికయిడు (-ఇడు)** అ.క్రి. గద్గద స్వరం కలది అగు. ప్రబోధ. 3.75. **డగ్గుత్తికవడు (-పడు)** రూ. డగ్గుత్తికపడు. అ.క్రి. **1.** గద్గద స్వరం కలది అగు. భార.ద్రోణ. 5.327; **2.** గొంతుకి ఎగదట్టు. **డగ్గుత్తికవెట్టు (-పెట్టు)** అ.క్రి. గద్గద స్వరం కలది అగు. నిర్వ.రా. 9.12. భార.విరా. 1.182. **డగ్గుపడు** అ.క్రి. గాద్గద్యం పొందు, కంఠం రాలుపడు, దగ్గుపడు. శ్రీరం. మా. 2.251.

**డగ్గు**[2] వి. పొచ్చు, సారెపలక మధ్య భాగంలోని కుండ కట్టు.

**డగ్గు**[3] రూ. డంగు[3]. వి. డంగుమాను, వృక్షవిశేషం. E.I.V. సంపు. 10, శా.సం. 104. పం. 2.

**డగ్గుమ్రాను** వి. వృక్షవిశేషం.

**డంక**[1] విణ. **1.** దుష్టుడైన. నీలా 3.21; **2.** దిట్ట.

త. టంకర్.

**డంక**[2] రూ.చూ. డకా. వి. ఢక్కా, వాద్యవిశేషం.

**డంకా** రూ.చూ. డకా. వి. వాద్యవిశేషం, ఢక్కా, డక్కె అనే వాద్యం.

**డంకాజోడు** వి. వెన్నుకు పైపైపు రెండు పక్కలా ఉండే సుళ్ళు. **డంకాసుడి** వి. పశువుల వెన్నుపూస దగ్గర ఉండే సుడి.

**డంగ** రూ.చూ. డంగు[2]. వి. గుండ్రటి గాడిలో తిరిగే రాతి చక్రం గల నిర్మాణం.

**డంగమొద్దు** రూ.చూ. డంగుమొద్దు. వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. **డంగసున్నం** రూ. డంగుసున్నం వి. గానుగతిప్పి జిగురు, మెత్తదనం కలిగించిన సున్నం.

**డంగగు** చూ. డంగు[1].

**డంగడోలు** వి. పశువుల మెడకింద వేలాడే చర్మం, గంగడోలు.

**డంగయిపోవు** చూ. డంగు[1].

**డంగి** వి. ఎర్రపగడ, దేవతాళం. వృక్షవిశేషం.

**డంగీర** చూ. డంగు[2].

**డంగు**[1] రూ.చూ. డంగ్గు. విణ. పుష్టంగా నలిగిన, దంచిన. ద.హిం.శా. సంపు. 4, శా.సం. 114. అ.క్రి. (బియ్యం మొ.) పొట్టు పోయేటట్లు పుష్టంగా నలుగు.

**డంగగు** అ.క్రి కదలు, బిత్తరపోవు, ఆశ్చర్యపడు. <డంగు[1] + అగు. **డంగయిపోవు** అ.క్రి. **1.** కదలు; **2.** బిత్తరపోవు; **3.** ఆశ్చర్యపడు. <డంగు[1] + అయి పోవు. **డంగుబోవు(-పోవు)** అ.క్రి. **1.** బిత్తరపోవు; **2.** భయపడు. **డంగుబ్రాలు(-ప్రాలు)** రూ.చూ. డంగ్గుంబ్రాలు. వి.బ.వ. తెల్లగా నలిగిన బియ్యం, దంచినబియ్యం. ద.హిం. శా. సంపు. 4, శా. సం. 1014. క్రీ.శ. 1038. **డంగులు** వి.బ.వ. డంగుబ్రాలు, డంగుళ్ళు, దంచిన బియ్యం. **డంగుళ్ళు** వి.బ.వ. డంగుబ్రాలు, డంగుళ్ళు, దంచిన బియ్యం.

**డంగు**[2] రూ. డంగ. వి. గుండ్రటి గాడిలో తిరిగే రాతి చక్రం గల నిర్మాణం.

**డంగీర** రూ.చూ. డంగుగీర. వి. గానుగకుండే రాతి చక్రం. **డంగుకట్టె** వి. గానుగరాతిని తగిలించే కొయ్య దూలం. **డంగుకాని** వి. గానుగరాతిని తగిలించే కొయ్య దూలం. **డంగుకొయ్య** వి. గానుగరాతిని తగిలించే కొయ్య

దూలం. డంగుగీర రూ. డంగీర, డంగుగేర. వి. గానుగ కుండే రాతిచక్రం. డంగుగుంజ వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. డంగుగేర రూ.చూ. డంగుగీర. వి. గానుగ కుండే రాతిచక్రం. డంగుదూలం రూ. డంగుదూలాం. వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. డంగుధూలాం రూ.చూ. డంగుదూలం. వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. డంగుపార వి. గానుగ సున్నం తోడటానికి వాడే పొడుగాటి పార. డంగుబిల్ల రూ.చూ. డంగుబిళ్ళ. వి. గానుగకుండే రాతిచక్రం. డంగుబిళ్ళ రూ. డంగుబిల్ల. వి. గానుగకుండే రాతిచక్రం. డంగుమొద్దు రూ. డంగమొద్దు. వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. డంగురాయి వి. గానుగకుండే రాతిచక్రం. డంగురోతు వి. గానుగ కుండే రాతిచక్రం. డంగుసున్నం రూ.చూ. డంగ సున్నం. వి. గానుగ తిప్పి జిగురు, మెత్తదనం కలిగించిన సున్నం.

**డంగు³** రూ.చూ. డగ్గు³. వి. డంగుమాను, వృక్షవిశేషం.

**డంగురము** వి. చర్మవాద్య విశేషం, పంజ, పీరణమనే వాద్యం. ఆం.భా. 1.128.
క. *డంగర, డంగుర.* చాటింపుడప్పు, చాటింపు.
మరా. *డాంగోరా.* చాటింపు.

**డంగోరావేయు** స.క్రి. దండోరావేయు.
మరా. *డాంగోరా.* చాటింపు, అరుస్తూ చేసే ప్రకటన.
క. *డంగర, డంగుర.*
<మరా. డాంగోరా + వేయు.

**డంగ్గు** రూ. డగు[1], డంగు[1], దంగు. స.క్రి. దంచు, పొట్టుతీయు. ద.హిం.శా. సంపు. 4, శా.సం. 1015. క్రీ.శ. 1015.
క. *తళిసు.* దంచు ; తు. *తల్పుని* ; గోం. *దల్స్* ; మాల్తో. *దల్యే* ; ప్రా.తె. *తఙ్-చ్* ?
**డంగ్గుంబ్రాలు (-బ్రాలు)** రూ. డంగుంబ్రాలు. వి.బ.వ. దంచి, శుభ్రంచేసిన బియ్యం. ద.హిం.శా. సంపు 4, శా.సం. 1248. క్రీ.శ. 1112.

**డచ్చి** విశే. తృప్తికరమయిన.
డ. *డచ్చ్.* హాలండ్ దేశసంబంధమైన.
<డ. డచ్.

**డచ్చీలు** వి.బ.వ. గొప్పలు, డాబులు, కోతలు.
డ. *డచ్.* హాలండు దేశ సంబంధమైన.
<డ. డచ్+-లు.
**డచ్చీలుకొట్టు** అ.క్రి. డంబాచారాలు పలుకు.

**డజను** వి. పన్నెండు వస్తువులు.
ఇం. *Dozen.* పన్నెండు వస్తువులు.
<ఇం. Dozen.

**డంచనము** రూ.చూ. దంచనము. వి. 1. కోటలు మొ. బద్దలు కొట్టటానికి ఉపయోగించే ఒక ఆయుధం ; 2. శత్రువులు కోటను ఎక్కకుండా కిందికి తోయటానికి రాళ్ళను విసిరే యంత్రం.

**డంచు** రూ.చూ. డంచ్చు. స.క్రి. (ధాన్యాదులు రోకటితో) నలగగొట్టు, చితకకొట్టు. కాశీ. 7.79, ద.హిం.శా.సంపు. 4, శా.సం. 1015.

**డంచ్చు** రూ. డంచు, దంచు. స.క్రి. దంచు. ద్రాక్షారామ శిలా శాసనం. క్రీ.శ. 1084.
పో.చూ. తె. దంగు/దంగు, దంపకము, దంపుడు మొ. క. *తళిసు* ; తు. *తల్పుని* ; గోం. *దల్స్* ; కుఇ. *డాంబ* ; మాల్తో. *దలి.*

**డప్పా** రూ.చూ. డబ్బా. వి. డొక్కు, మధ్య రకం రేకుపాత్ర.
**డప్పాలు** వి.బ.వ. డాబులు, గొప్ప, కోతలు.
**డప్పాలుకొట్టు** అ.క్రి. డాబులు కొట్టు.

**డప్పి** రూ. దప్పి. వి. 1. దగ, నీరువట్టు, పానేచ్ఛ, తాగాలనే కోరిక. భార.విరా. 1.148 ; 2. కృశత్వం, క్షీణత్వం. భార.శాంతి. 1.52 ; 3. శ్రమం, ఆయాసం, అలయిక. భార.ఆరణ్య. 7.239, 240, భాస్క.రా.యు. 251.
పర్జి. *అండ్.* ఆకలిగా. దాహంగా ఉండటం ; కొలా. *అడ్త్.* దప్పిగొను ; నా. *అడ్.* దాహం ; గ. *అండ్.* దాహం, ఆకలివేయు.
**డప్పిక** వి. 1. నీరుతాగే కోరిక ; 2. ఆయాసం.
**డప్పికొను** రూ.చూ. దప్పిగొను. అ.క్రి. దాహం చెందు.
**డప్పిగొను(-కొను)** రూ.చూ. దప్పిగొను. అ.క్రి. 1. పిపాసితుడగు. శృం.నై. 8.177 ; 2. బడలు. **డప్పిచెందు** అ.క్రి. తగ్గిపోవు, దప్పిగొను.

**డప్పు** వి. చర్మ వాద్య విశేషం, తుమ్మటం, కనకతప్పెట.
మహా. *డఫ* ; హిం. *డఫ్.* ఒక రకం చిన్న బాజా ; అర. *దఫ్.*
క. *డబ్బు.* వాద్య విశేషం ; త. *తప్పు.*
<హిం. డఫ్.
**డప్పులుకొట్టు** అ.క్రి. 1. వార్త వెల్లడించు ; 2. కోతలు కోయు.

**డప్పెస** చూ. డప్పు. వి. తప్పెట.

**డఫేదారు** వి. ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే బిళ్ళ బంట్రోతు.
మరా. *డఫేదార్.* సైనికోద్యోగి.
<మరా. డఫేదార్.

**డబడబ** వి. 1. ఉద్ధతి, గర్వం. చమ. 2.73 ; 2. మాటల గడబిడ. ధ్వన్యను.

**డబర** రూ.చూ. డబ్బర. వి. వెడల్పు గిన్నె.

**డబల్** రూ. డబుల్. వి. జోడు, జంట, రెండింతలు, రెట్టింపు ; విశే. జతగా ఏర్పడిన.
ఇం. *Double.* రెండు, రెండింతలు, రెట్టింపు, జతగా ఏర్పడిన.
<ఇం. Double.
**డబల్‌కమ్మి** వి. రెండు పట్టెలుగా నేసిన కమ్మి. **డబల్‌కలశం చౌకాఅంచు** వి. ఒక రకం అంచు. **డబల్‌కిస్తీ** వి. ఒకే రెక్కకు రెండు భాగాలు చేస్తూ చెక్కిన కిస్తీ. ఇం. *Double.* జతగా ఏర్పడిన. <ఇం. Double + కిస్తీ. **డబల్‌కూజా** వి. కూజాలో కూజాపెట్టి చేసిన కూజా. <ఇం. Double + కూజా. **డబల్‌రాయి** వి. రాతి గనిలోని ఇరవై రెండో పొర. <ఇం. Double + రాయి. **డబల్‌సాటు** వి. రెండు పోగులు కలిపి పురిపెట్టిన నూలు. ఇం. Double + సాటు.

డబలక్కు రూ.చూ. డుబుడక్క. వి. మద్దెల మాదిరి ఉండే వాద్యం.

డబాయించు రూ.చూ. దబాయించు. అ.క్రి. తనది తప్పు కాదని వాదించు.

డబుడక్కు రూ.చూ. డుబుడక్క. వి. బుడబుడకలవాడు వేళ్ళతో పట్టుకొని వాయించే చిన్న వాద్యం.

డబుల్ రూ.చూ. డబల్. వి. జోడు, జంట, రెట్టింపు. విశ. జతగా ఏర్పడిన.

డబుల్‌లాయిరీ రూ.చూ. డబుల్‌లాహిరీ. వి. అంచులో రెండు లాహిరీలో వరుసగా పడేటట్టు నేసిన డిజైను. డబుల్‌లాహిరీ రూ. డబుల్‌లాయిరీ. వి. అంచులో రెండు లాహిరీలు వరుసగా పడేట్టు నేసిన డిజైను.

డబుల్సు వి.బ.వ. ఇద్దరిద్దరు.

ఇం. *Doubles.* ఇద్దరిద్దరు.

<ఇం. Doubles.

డబ్బ[1] రూ.చూ. డబ్బా. వి. 1. నూలు చుట్టుకొనే రేకు డబ్బా; 2. డబ్బాకారంలో ఉండే కొయ్యబద్దల పంజె; 3. మరమగ్గం చట్రంలో, పానుపు పట్టెకు ఒక వైపు బిగించిన చెక్కల గూడు; 4. రంగు నీళ్ళు కాచే గనప గోలెం; 5. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర; 6. వ్యభిచారిణి; 7. నిందావాచక శబ్దం.

డబ్బ[2] వి. ఇంటి కప్పుకు పనికి వచ్చే ఒక తృణ విశేషం.

డబ్బనిచ్చెన రూ.చూ. డబ్బనిచ్చెన. వి. గడలకు బదులు చెక్కలు వాడి తయారు చేసిన నిచ్చెన.

డబ్బర రూ. డబర, డబ్బుర, డబరి, డబరా, దబారా, డబ్బురి. వి. 1. చషకం, పానపాత్ర. ఆం.భా. 2.244; 2. పెద్ద నోరుగల లోహపాత్ర.

హిం. డబ్‌రా. జలపాత్ర విశేషం.

<హిం. డబ్‌రా.

డబ్బలు రూ.చూ. డబ్బులు. వి. బొంకు, అసత్య వచనం. కాశీ. 4.96.

డబ్బసిడి రూ.చూ. డబ్బసిడి. వి. కర్రలతో కట్టిన మెట్టు.

డబ్బా రూ. డప్పా, డబ్బ[1]. వి. 1. తపాకి మందు మొ. ఉంచుకొనే తోలుపెట్టె; 2. నూనె మొ. పోయటానికి లోహపు రేకుతో చేసిన పాత్ర; 3. నూలు చుట్టుకొనే రేకు డబ్బా; 4. డబ్బా ఆకారంలో ఉండే కొయ్య బద్దల పంజె; 5. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒక వైపు బిగించిన చెక్కల గుండు; 6. రంగు నీళ్ళు కాచే గనప గోలెం; 7. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర; 8. వ్యభిచారిణి; 9. నిందావాచక శబ్దం.

హిం. డబ్బా. మూతగల లోతైన పాత్ర, చిన్న పెట్టె.

<హిం. డబ్బా.

డబ్బాకదురు వి. డబ్బారాట్నం, బొమ్మలరుగాని, బొడ్డి నిలువులకుగాని బిగించే మందపు కడ్డీ. డబ్బాకొట్టు అ.క్రి. కోతలుకోయు; స.క్రి. పొగడు. డబ్బాజల్లెడ వి. డబ్బా రేకుతో చేసిన జల్లెడ. డబ్బాడవాల్‌బిగించు అ.క్రి. సన్నద్ధు డగు. డబ్బాపంజె వి. పంజెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా. డబ్బాబుడ్డి వి. పంజెకు బదులు నూలు చుట్టు కొనే రేకుడబ్బా. డబ్బారాట్నం వి. 1. పెట్టెలా అమర్చిన రాట్నం; 2. పడుగు నూలు డబ్బాలమీద చుట్టే రాట్నం. డబ్బాలదారం వి. డబ్బారాట్నం. చక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టిదారం. డబ్బాలరాట్నం వి. సైకిలు రాట్నం, డబ్బాలకు నూలు తోడే రాట్నం. డబ్బావాయించు స.క్రి. 1. అభిమానంతో ప్రచారాలుచేయు; 2. ఎక్కువగా స్తుతించు. డబ్బాసున్నం వి. సున్నపురాతిని బట్టీలో కాల్చి డబ్బాలకెత్తిన సున్నం.

డబ్బాటు రూ. దబాటు, దబ్బాటు. క్రి.విశ.ద్రు. ఆకస్మికం, హఠాత్తుగా. భార. శాంతి. 3.392. వి. ఆకస్మికత, హఠాత్సంభవం. ఆము. 6.18. విశ. హఠాత్తుగా సంభవించిన, ఆకస్మికమైన, యాదృచ్ఛికమయిన. ఆం.భా. 3.32.

డబ్బాటువాన వి. హఠాత్తుగా వచ్చిన వాన. డబ్బాటు సాకిరి వి. ఆకస్మికంగా వచ్చి అన్ని కార్యాలను తెలిసి కొన్న సాక్షి. డబ్బాటుసాక్షి వి. ఆకస్మికంగా వచ్చి అన్ని కార్యాల్ని తెలిసికొన్న సాక్షి. విజ్ఞా. వ్యవ. 100. సం. సాక్షిన్. ఏదైనా పనిని చూచికాని వినికాని తెలిసినవాడు.

<డబ్బాటు+సం. సాక్షిన్.

డబ్బి[1] రూ. డబ్బీ. వి. 1. బరిణ. ఆం.భా. 2.166; 2. డబ్బా; 3. బొక్కు, మధ్యరకం రేకుపాత్ర.

హిం. డబ్బీ.

క. డబ్బి; తు. డబ్బి.

<హిం. డబ్బీ.

డబ్బి[2] రూ. డబ్బు[4]. వి. ఒకానొక శకునపక్షి. సిం.ద్వా. 1.231.

డబ్బికి వి. గుమ్మెట, కూజామాదిరి ఉండే మట్టిపాత్ర.

హిం. డబ్బా. పచ్చళ్ళు ఉంచుకొనే పాత్ర విశేషం.

డబ్బింగు వి. చలన చిత్రానికి భాషాంతరాన్ని సమకూర్చటం.

ఇం. *Dubbing.* చలన చిత్రానికి భాషాంతరాన్ని సమకూర్చటం.

<ఇం. Dubbing.

డబ్బీ రూ.చూ. డబ్బి[1]. వి. 1. బరిణ; 2. డబ్బా; 3. బొక్కు, మధ్యరకం రేకుపాత్ర.

డబ్బు[1] రూ.చూ. డంబు[1]. వి. 1. దంబపుమాట. ద్వి. పరమ. వి. 5.17; 2. బొంకు, అసత్యవచనం. ఆం.భా. 1.119; 3. కపటం, మోసం. ఆం.భా. 1.138; స.క్రి. అబద్ధ మాడు, బొంకు. బహులా. 5.106.

డబ్బు[2] రూ.చూ. డంబు[2]. విశ. కాంతిమంతమైన, ప్రకాశవంతమైన. ద్వి.సార.చ. 2.91. పు. 13 పం.

డబ్బు[3] వి. 1. ధనం. ఆము. 4.67; 2. కాని, మూడుపైసల విలువకల నాణెం. ఆం.భా. 2.274; 3. నాలుగు దమ్మిడీలు.

హిం. మరా. డబ్బూ. రాగినాణెం.

క. డబ్బు. రాగినాణెం; త. దుట్టు.

<మరా. డబ్బూ.

డబ్బుకలిసె వి. హుండీ, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిపాత్ర. డబ్బుకసాల

వి. డబ్బు ఇబ్బంది. **డబ్బులడిబ్బీ** రూ.చూ. డబ్బులుడిబ్బీ. వి హుండీ, పిల్లలు డబ్బు దాచిపెట్టుకోటానికి ఉపయోగించే చిన్న పాత్ర. **డబ్బులపిడత** వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టి బుడ్డి. **డబ్బులబుడ్డి** రూ. డబ్బులుబిడ్డి, డబ్బులుబుడ్డి. వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టుకోడానికి ఉపయోగపడే గుండ్రని చిన్నమట్టిబుడ్డి. **డబ్బులవుండి** వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టుకోడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిబుడ్డి. హిం. హుండీ. విధిపత్రం, డబ్బుకైరాసే లేఖ. <డబ్బు³+-లు+-అ+హిం. హుండి. **డబ్బులుకలికి** వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిపాత్ర. **డబ్బులుగురిగి** వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిబుడ్డి. **డబ్బులుడిబ్బీ** రూ. డబ్బులడిబ్బీ, డబ్బుల్డిబ్బీ. వి. హుండీ, పిల్లలు డబ్బు దాచిపెట్టటానికి ఉపయోగపడే పాత్ర. **డబ్బులుబిడ్డి** రూ.చూ. డబ్బులబుడ్డి. వి. ఉండి, పిల్లలు డబ్బులు దాచిపెట్టుకోడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిపాత్ర. **డబ్బులుబుడ్డి** రూ.చూ. డబ్బులబుడ్డి. వి. ఉండి, పిల్లలు డబ్బులు దాచిపెట్టుకోడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిబుడ్డి. **డబ్బుల్డిబ్బీ** రూ.చూ. డబ్బులుడిబ్బీ. వి. హుండీ, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్నపాత్ర. **డబ్బూదసకం** రూ. డబ్బూదస్కం. వి. ఆస్తిపాస్తులు, ధనం మొదలైనవి సం. దశక-. పది. **డబ్బూదస్కం** రూ.చూ. డబ్బూదసకం. వి. ధనం మొదలైనవి, ఆస్తిపాస్తులు.

**డబ్బు⁴** రూ.చూ. డబ్బి². వి. ఒకానొక శకునపక్షి. అము. 6.66, హంస. 3.12.

**డబ్బు⁵** వి. 1. తుపాకుల ధ్వనికి అనుకరణం; 2. వాయింపు ధ్వని.

క. డబ్బు, తుపాకి పేల్చటంలో అయ్యే ధ్వని; త. టువాల్-ఎనల్. ధ్వన్యనుకరణం, పేలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం, టుపీర్-ఎనల్. ధ్వన్యనుకరణం. తుపాకి పేల్చటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; కో. టబరన్. తుపాకి పేల్చటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

డబ్బుడుబ్బు వి. తుపాకుల ధ్వనికి అనుకరణం. కళా. 8.109, ప్రబంధ. 788.

**డబ్బర** రూ.చూ. డబ్బర. వి. వెడల్పుగా ఉండే గిన్నె.

**డబ్బూదసకం** చూ. డబ్బు³.

**డబ్బూదస్కం** చూ. డబ్బు³.

**డబ్లి** వి. ఇరవైనూలు పిఖ్ఖుఉన్న కట్ట,

ఇం. *Double*. జంట.

<ఇం. Double.

**డబ్లిమోహిని** చూ. డబుల్. వి. ఒకరకం అంచు.

**డబ్లీచట్రం** వి. మండల కడ్డీలు, గుజ్జులు, మూలవాసాలుగల ఇంటికప్పు చట్రం.

**డబ్లీదూలం** వి. మధ్యగోడనుంచి చుట్టుగోడమీదికి వేయబడిన దూలం.

**డబ్లియుబంగళా** వి. మండువాలేని రెండు గర్భాల బంగళా

<డబ్లియు (<ఇం. P.W.D.)+హిం. బంగ్లా.

**డమ్** వి. డమ్ అనే వ్యక్త ధ్వనికి అనుకరణం.

**డమ్మను** అ.క్రి. 1. అపోచ్చారణంచేయు. పళ. 2.437; 2. చచ్చు; 3. పేలిపోవు.

**డమరము** రూ. డమారము, డమాలము, డప్మారము. వి. పెద్ద చర్మవాద్య విశేషం, డమామి, డమాయి, డుబుడక్క, డక్క.

సం. డమరు-. చర్మవాద్యవిశేషం; ప్రా. డమరు-.

<ప్రా. డమరు-

**డమరుగము** వి. డమరువు. చర్మవాద్య విశేషం. ఆం.భా. 1.127.

సం. డమరుక-. వాద్యవిశేషం; ప్రా. డమరు.

క. డమరుగ. వాద్యవిశేషం; త. డమరుకం.

<సం. డమరుక-.

**డమాడు** వి. తెరచాప.

**డమాను** వి. ఓడప్రయాణం.

ఒ. డమన్. తెరచాప ఎత్తేటప్పుడు దింపేటప్పుడు నావికులు వ్యవహరించే పదం.

<ఒ. డమన్.

**డమామి** రూ.చూ. ధమామి¹. వి. మహారాజ చిహ్నమైన పెద్ద చర్మ వాద్యవిశేషం. చంద్రాంగ. 1.50, సుదంతా. 4.31.

**డమామీ** రూ.చూ. ధమామి¹. వి. మహారాజ చిహ్నమైన పెద్ద చర్మవాద్య విశేషం.

**డమాయి** రూ.చూ. ధమామి¹. వి. మహారాజ చిహ్నమైన పెద్ద చర్మవాద్య విశేషం.

**డమాయీ** రూ.చూ. ధమామి¹. వి. మహారాజ చిహ్నమైన పెద్ద చర్మవాద్య విశేషం.

**డమారము** రూ.చూ. డమరము. వి. చర్మవాద్య విశేషం.

**డమాలము** రూ.చూ. డమరము. వి. మహారాజ చిహ్నమైన పెద్ద చర్మవాద్యం.

**డంపకము** చూ. డంచ్చు. రూ. దంపకము. వి. దంచటం, నలగగొట్టటం. భార. శాంతి. 5.393.

**డంబకము** చూ. డంబు¹. వి. మోసం. పండి.చ. 122, అష్టమ.క. 1.51 పు. 5 పం.

**డంబము** రూ.చూ. డంబు¹. వి, 1. స్థితికి మించిన వేషం, స్థితికి మించిన భాషణం; 2. ప్రతిష్ఠ; 3. కపటం; 4. ఉంకింపు.

డంబాచారి వి. డాబులు చెప్పేవాడు.

**డంబాచారి** చూ. డంబము.

**డంబారు** చూ. డంబు³.

**డంబు¹** రూ. డబ్బు¹, డంబము, డాబు¹, వి. 1. గర్వం. ఉ. హరి. 4.39; 2. ప్రతిష్ఠ, గౌరవం. ద్వి.భాగ. 6 స్కం.; 3. కపటం, మోసం. విక్ర. 4.76, హరి. ఉ. 611; 4. స్థితికి మించిన వేషం; 5. పీణ.

సం. దమ్భః, డంభః, డంబరః; ప్రా. డంభ-; అమ. డంభ-; పా. దబ్బ, దూభ.

క. డంభ, డంబవ్వ, డంబు, డంభ; తు. డంబ;

త. ఇటంపమ్ ; మ. డంభ, తప్ప. అబద్ధం ; తప్పల్. పొరపాటు.

<ప్రా. డంబ-.

డంబుసూపు (-చూపు) అ.క్రి. డాబుచేయు. శ్రీనాథుని చాటువు. స.క్రి. మోసగించు.

డంబు² రూ. డబ్బు². వి. 1. శోభ, కాంతి. కళా. 2.77, సీలా. 3.106, ఆం.భా. 3.44 ; 2. విధం, రీతి. ఉ.రా. 1.134. విణ. 1. అధికమైన, పెల్లు. భాస్క.రా.అరణ్య. 2.431. 2. అందమైన, శోభావంతమైన. పక. 2.358.

డంబారు అ.క్రి. కాంతి వహించు, సొగసెక్కు.

డమ్మను చూ. డమ్.

డమ్మారము రూ.చూ. డమరము. వి. చర్మవాద్య విశేషం.

డమ్ము రూ.చూ. డ్రమ్ము. వి. రంగునీళ్ళుకాచే పెద్ద ఇనప డబ్బా.

డయలీ రూ.చూ. డైలీ. వి. 1. రోజువారీ, దినదినం, ప్రతి రోజు ; 2. దినపత్రిక.

డయలు రూ. డైలు. వి. గడియారంలోను, టెలిఫోనులోను అంకెలుండే గుండ్రని భాగం.

ఇం. *Dial*. గడియారంలో అంకెలుండే గుండ్రటి భాగం, టెలిఫోనులో అంకెల బిళ్ళను కావలసిన సంఖ్యలను తిప్పుతూ కావలసిన వ్యక్తిని పిలచు.

<ఇం. Dial.

డయాబెటీస్ వి. మధుమేహవ్యాధి, మూత్రంలో చక్కెర పోయేవ్యాధి.

ఇం. *Diabetes*. మధుమేహవ్యాధి.

<ఇం. Diabetes.

డయిలీ రూ.చూ. డైలీ. వి. 1. రోజువారీ, దిన దినం, ప్రతిరోజు ; 2. దినపత్రిక.

డయేరియా వి. అతిసారం, నీళ్ళ విరేచనాల వ్యాధి.

ఇం. *Diarrhoea*. అతిసారం.

<ఇం. Diarrhoea.

డయ్యకక్రుయ్యక చూ. డయ్యు.

డయ్యఁబాఱు చూ. డయ్యు.

డయ్యించు చూ. డయ్యు.

డయ్యు రూ. దయ్యు. అ.క్రి. 1. కృశించు, చిక్కు. భార. సభా. 2.102 ; 2. బలహీనమగు, డీలుపడు. కు. సం. 10.91. కాశీ. 6.44 ; 3. బడలు, అలయు. భార. భీష్మ. 3.269. హర. 2.11 ; 4. తగ్గు. భాగ. 9.577 ; 5. చెడు. పాడగు. విక్ర. 5.139, ఉ. రా. 5.66 ; 6. క్షీణించు. ఆం. భా. 3.88 ; 7. నశించు.

క. అటి. చెడు, నశించు, క్షీణించు, కృశించు ; తు. అల్ పుని. చెరుపు, తుడుచు ; అళిపుని, అళియుని, అలిపుని. నశించు, కృశించు, అంతమొందు ; త. అఴి(-ఙ్-/-న్ఱ్-). చెడు, నశించు, క్షీణించు, బాధించు, ఓడు ; అఴిక్క. విడుచు, వ్యర్థంచేయు, ఖర్చుచేయు ; మ. అఴియుక. నాశనంచేయబడు, ఖర్చగు, అమ్ము, నడలించు. విడదీయబడు; కువి. దహ్. బలహీనమగు ; డైయూ-జా, (యలి). వెనుక బడు ; పర్జి. అన్డ్ కిప్. నశించు, చంపు ; కొలా. డయ్-(డయ్-ల్-). కృశించు, చిక్కు.

డయ్యకక్రుయ్యక అవ్య. అలుపూ సొలుపూ లేక.

డయ్యఁబాఱు అ.క్రి. అలయు, బడలు, డయ్యు. < డయ్యు + -అ⁷ + పాఱు. డయ్యించు స.క్రి. 1. డయ్యజేయు. హర. 4.23 ; 2. ఆయాసపెట్టు, చిక్కేటట్టుచేయు. < డయ్యు + -ఇంచు³. డస్సిదట్టమగు అ.క్రి. చచ్చినంత పనిఅగు.

డర్రు వి. అపానవాయు ధ్వని, ఓర్రు.

డలఖు వి. మాల, సరం, దండ.

డలాయతు రూ.చూ. డలాయత్తు. వి. బిళ్ళబంట్రోతు.

డలాయత్తు రూ. డలాయతు, ఢలాయతు. వి. వెండిబిళ్ళ బంట్రోతు. రంగా. చ. 3.92.

హిం. *ఢలాయత్, ఢలైత్*. నౌకరు, డాలుగలవాడు, సాయుధుడైన నౌకరు లేక వార్తాహరుడు ; ఉ. *ఢలాయత్*. సాయుధుడైన సేవకుడు.

<ఉ. ఢలాయత్.

డల్లి వి. 1. ముద్ద ; 2. పాలగరువు, సుద్దనేల.

డల్లీ వి. మాంసం ముక్క.

హిం. *డలీ*. ముక్క.

డల్లు రూ.చూ. జల్లు¹. వి. వానతుంపర.

డవాలా రూ.డవాలీ. వి. బంట్రోతు బిళ్ళ తగిలించే పట్ట.

డవాలీ రూ.చూ. డవాలా. వి. బంట్రోతు బిళ్ళ తగిలించే పట్ట.

డవిణ రూ.చూ. తవిణ. వి. ఢంకా.

డవిలి రూ.చూ. దవిలి. వి. కల్లుగీసే వాళ్ళు కల్లుమాను ఎక్కేటపుడు వెనక కట్టుకొనే మట్టిపాత్ర.

డవులు రూ. దౌలు. వి. 1. మదింపు, అంచనా ; 2. రాజుకి రాజ్యం నుండి వచ్చే ఆదాయం ; 3. దంభం ; 4. ఒక గ్రామం రాజుకు చెల్లించ వలసిన శిస్తు మొత్తం.

హిం. *డౌల్*. ఏదైనా వస్తువును చేయటానికి పూర్వం అమర్చుకొనే ముక్కలు.

డవులుకాఁడు వి. డాబుకాడు, గబ్బి, అందగాడు.

డవులుదప్పు (-తప్పు) అ.క్రి. మతిచెడు.

డసుకు రూ.చూ. డస్కు. వి. సొరుగులు కలిగి, కూర్చోడానికి పీఠంతో జతచేసిన బల్ల.

డస్కు రూ. డసుకు, డెస్కు. వి. సొరుగులుండి కూర్చోటానికి పీఠంతో జత చేసినబల్ల.

ఇం. *Desk*. వాలుగా ఉండే రాతబల్ల, సొరుగులతో కూర్చోటానికి పీఠంతో కూడిఉన్న బల్ల.

<ఇం. Desk.

డస్సింగుకట్టు వి. 1. రాతినిచెక్కి కట్టే పద్ధతి ; 2. గాయానికి కట్టు కట్టే పద్ధతి.

ఇం. *Dressing*. దుస్తులు ధరించటం, గాయానికి వేసేపట్టీ.

<ఇం. Dressing + కట్టు.

డస్సిదట్టమగు చూ. డయ్యు.

డా- విణ. ఎడమ, సవ్యం, డాపలయొక్క లుప్తశేషరూపం. ఇది సమాన పూర్వావయవంగానే కనబడుతోంది, డాపలది.

క. ఎడ. ఎడమ, ఎడమవైపు ; కొడ. ఎడతె. ఎడమ ;

తు. ఎడ, యెడ. ఎడమ ; ఎడంకు, ఎడమవైపునఉండు ; త. ఇటుమ్, ఇటై. ఎడమపక్క ; ఇటు౯. ఎడమవైపున ఉన్నది ; మ. ఇటుమ్, ఎటుమ్. ఎడంవైపు ; కొండ. ఎడ్ ; కుఇ. డెబ, డెబె, డెబొ. ఎడమ, ఎడమవైపు, ఎడమచేయి ; కువి. త్రెబి, త్రోబి. ఎడమ ; పర్జి. డ్రెబి. ఎడమ ; కొలా. ఎదమకై. ఎడమ, నా. డావ. ఎడమ ; గ. డ్రెబి. ఎడమ.

డాకడ వి. **1.** ఉత్తరపు దిక్కు. ఆం.భా. 1.71 ; **2.** ఎడమ పక్క. డాకన్ను వి. ఎడమకన్ను. శృం. నై. 8.201. డాకాలము వి. వేసవికాలం. ద.హిం.కా.సంపు. 5. శా.నం. 1342. వ్యు. ఉత్తరాయణ సంబంధికాలం. డాకాలు వి. ఎడమకాలు. కాశీ. 1.45. డాకుంచెలాగు స.క్రి. సరిచేసేటప్పుడు, కుంచెను తల కిందుగా పెట్టుకొని పడుగుకి కింది భాగంలో దువ్వు. డాకెలను వి.బొ. ఎడమవైపు. మను. 4.28. డాకేలు వి. ఎడమచేయి. రాజ.చ. 3.167. డాకోటెద్దు రూ. డాగోడెద్దు. వి. పంక్తిలో మేటి (మొదటి) ఎద్దు. < డా + కోడె + ఎద్దు. డాగోడెద్దు రూ.చూ. డాకోటెద్దు. వి. 'బంతి'లో మొదటి ఎద్దు. డాచేయి వి. ఎడమచేయి. పారి. 5.86. డాతటి వి. **1.** వేసవికాలం ; **2.** ఆమని. డాతొడ వి. ఎడమతొడ. (పెద్దన చాటువు). డావల రూ.చూ. దాపల. వి.బొ. ఎడమ భాగం, వామపార్శ్వం. భార.ద్రోణ. 4.322. డాపలించు రూ. దాపలించు. స.క్రి. ఎడమపక్కగా ఉంచు. భార.విరా. 4.246 ; అ.క్రి. ప్రదక్షిణమగు. భార.విరా. 4. డామూపు వి. ఎడమమూపు. ఆము. 5.67. డావలపల వి.బొ. డాపలవల్పల. ఎడమకుడి.

డాక[1] రూ. ఢాక. వి. **1.** ఒప్పు. రం.రా.అయోధ్యా. 139 పు. 30 పం. ; **2.** విజృంభణం, ఆధిక్యం. కళా. పీఠి. 91, హంస. 2.27 ; **3.** పీక, విధం. ఉ.రా. 3.141 ; **4.** శౌర్యం, పరాక్రమం. సారంగ. 1.78, ఆం.భా. 3.45.

క. డాకు. ఢాక, దాడి ; త. టాక్కు ;

హిం.మరా. డాంకా.

డాక[2] వి. పక్షిఈక. ఆం.భా. 2.99.

డాకల చూ. దాక. వి. చట్టి, వంటకు వాడే చిన్న మట్టిపాత్ర.

డాకలాసట్టి చూ. డాకల. వి. తాలింపుసట్టి.

డాకలి చూ. డాయి.

డాకలు చూ. డాపు.

డాకల్లు[1] చూ. డాపు.

డాకల్లు[2] చూ. డాయి.

డాకసట్టి రూ.చూ. దాకచట్టి. వి. మూతి, అడుగు ఒకే వెడల్పు ఉండే చిన్న మట్టిపాత్ర, తాలింపుసట్టి.

డాకా వి. **1.** విజృంభణం. భద్ర.శ. 20 ; **2.** కన్నం, చిల్లు, టాకా.

హిం. డాకా. దారిదోపిడి ; ఉ. డాకా. జబర్దస్తీగా లాగుకొనటం.

< హిం. డాకా.

డాకావేయు స.క్రి. కన్నంవేయు.

డాకి వి. నారపడికేటప్పుడు, కదురు కిందికొన మోపటానికి పెట్టిన కుండపెంకు.

డాకిరి వి. మల్లక్రియా విశేషం. సిం.ద్వా. 7.60.

డాకు రూ.చూ. డాగు[2]. వి. మూసకట్టులోని తీగెలను వంచటానికి వాడే పరికరం.

డాకురు చూ. డా-. స.క్రి. (కాళ్ళు) తేలవేయు.

డాకూళ్ళమారి వి. పనికిమాలినవాడు, అంబేద.

డాకొను[1] చూ. డాగు[1].

డాకొను[2] చూ. డాయు.

డాకొలుపు చూ. డాయు.

డాకొల్పు చూ. డాయు.

డాక్టరమ్మ చూ. డాక్టరు.

డాక్టరు వి. **1** విశ్వవిద్యాలయంలో అత్యున్నతమైన పిఎచ్.డి., డి.ఎస్‌సి. మొదలైన పట్టాల్ని పొందినవాడు ; **2.** వైద్యుడు.

ఇం. *Doctor*. ఉపాధ్యాయుడు, పండితుడు, విశ్వవిద్యాలయపు అత్యున్నత పట్టం పొందినవాడు, వైద్యుడు, ఓడమీద వంటవాడు, యంత్రంలో చిక్కులు విడదీసే పరికరం.

< ఇం. Doctor.

డాక్టరమ్మ వి. వైద్యం చేసే స్త్రీ. ఇం. *Doctor*. వైద్యం చేసే స్త్రీ. < ఇం. Doctor + అమ్మ.

డాక్టరేటు వి. **1.** విశ్వవిద్యాలయపు అత్యున్నత పట్టం, గౌరవ బిరుదం ; **2.** వైద్యులు పొందే పట్టం.

ఇం. *Doctorate*. డాక్టరు పట్టం.

< ఇం. Doctorate.

డాక్యుమెంటు వి.బ.వ. దస్తావేజు.

ఇం. *Document*. దస్తావేజు, సాక్ష్యానికి ఆధారమైన పత్రం.

< ఇం. Document.

డాగర రూ.చూ. దాగర. వి. రొట్టెపిండి పిసికే దానికి బోర్లించి రొట్టె తట్టేందుకు వాడే మట్టిపాత్ర.

డాగలి రూ.చూ. దాకలి. వి. కంసాలివాని లోహం దిమ్మ.

డాగిని రూ.చూ. డాగినీ. వి. ఒక మల్ల యుద్ధపు పట్టు.

డాగినీ రూ. డాగిని. వి. మల్ల క్రియావిశేషం. సిం.ద్వా. 7.60.

సం. డాకినీ, డాగినీ. ఒకరకమైన పిశాచి ; ప్రా. డాఇణీ.

< సం. డాగినీ (అర్థవిపరి.).

డాగు[1] వి. **1.** కర, మరక, కళంకం. భాగ. 10 ఉ. 10 ; **2.** వాత, చూడు. చంద్రాంగ. 4.205 ; **3.** చిహ్నం, లాంఛనం, గుర్తు. చంద్రాంగ. 6.27, శుక. 2.284.

క. డాకు, డాగు. మచ్చ, మరక ; త. టాకు.

హిం.ఉ. దాగ్. మచ్చ.

డాకొను[1] అ.క్రి. చిహ్నితమగు, లాంఛితమగు. రసిక. 6.25. డాగుపడు అ.క్రి. మచ్చపడు. డాగులువేయు అ.క్రి. వాతలువేయు.

డాగు[2] రూ. డాకు. వి. మూసకట్టులోని తీగెలను వంచటానికి వాడే పరికరం.

మరా. డాంగ. (వెదురు) కర్ర.

డాగు[3] రూ.చూ. డాంగీ. వి. పన్నెదండల బిగింపుకు దారాలు

కట్టిన జంత్రం నిలువు కొయ్య.

డాగుగుజ్జు వి. పన్నెదండెల బిగింపుకు, దారాలు కట్టిన జంత్రం నిలువు కొయ్య.

డాగురు వి. కుమ్మరి వారి పెళ్ళిళ్ళలో వక్కలు పంచేవాడు.

డాగురేకు వి. సన్నని తళుకు రేకు.

డాంగీ రూ. డాగు[3]. వి. పన్నెదండెల బిగింపుకు దారాలు కట్టిన జంత్రం నిలువు కొయ్య.

మరా. డాంగ. (వెదురు) కర్ర.

<మరా. డాంగ.

డాఁకొను చూ. డాఁగు.

డాఁకొలుపు చూ. డాఁగు.

డాఁకొల్పు చూ. డాఁగు.

డాఁగనమ్రుచ్చిళ్లు చూ. డాఁగు.

డాఁగనమ్రుచ్చులు చూ. డాఁగు.

డాఁగికొను చూ. డాఁగు.

డాఁగిలిమూతలు చూ. డాఁగు.

డాఁగిలిమ్రుచ్చులు చూ. డాఁగు.

డాఁగిసేయు చూ. డాఁగు.

డాఁగు చూ. అడఁగు. రూ. దాఁగు. అ. క్రి. మరుగుపడు, తిరోహితమగు. భార. ద్రోణ. 1.374.

క. అడంగు, అడగు. దాచు, దాగు, మరుగుపడు, అదృశ్యమగు, అణచబడు ; తు. అడేవుని, అడేయుని, దాచు, దాచబడు ; త. అటుక్కు. కట్టుబాటులో ఉంచు, అణచు, దాగు, దాచు. పూడ్చు ; అటంకు. అణచు ; మ. అటున్నుక, అణచబడు ; గోం. తాస్. ఉంచు ; కుఇ. డాప(డా-త్-). పడిఉండు ; కొలా. డాంగ్, డాప్. దాచు ; నా. ఢాప్. దాగుమూయు.

<*అట్-అ-.

డాఁకొను రూ.చూ. దాఁకొను. అ.క్రి. దాక్కొను, మరుగు పడి ఉండు. అచ్చ. రా. బాల. 129. డాఁకొలుపు రూ.చూ. డాఁకొల్పు. స.క్రి. డాకొనచేయు. డాఁకొల్పు రూ. డాకొలువు. స.క్రి. డాకొనచేయు. డాఁగనమ్రుచ్చిళ్లు రూ.చూ. డాఁగిలి మ్రుచ్చులు. వి.బ.వ. 1. బాల్య క్రీడా విశేషం. పాంచాలీ. 1 57 ; 2. దాగుడుమూతలు. డాఁగనమ్రుచ్చులు రూ.చూ. డాఁగిలిమ్రుచ్చులు. వి. బ. వ. బాల్య క్రీడా విశేషం. రాజ. వి. 2.23. డాఁగికొను రూ.చూ. దాఁకొను. అ.క్రి. దాగు, మరుగుపడు, తిరోహితమగు. శుక. 3.69. డాఁగిలిమూఁతలు రూ.చూ. డాఁగుడుమూతలు. వి. బ. వ. బాల్యక్రీడా విశేషం. దశా. 8.81. డాఁగిలి మ్రుచ్చులు రూ. డాఁగనమ్రుచ్చిళ్లు, డాఁగనమ్రుచ్చులు. దాఁగిలిమ్రుచ్చులు. వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. కాళ. 2.62. డాఁగిసేయు(-చేయు) స.క్రి. కాలయాపనంచేయు, ఆలస్యం చేయు. శ్రీరాధా. 3.109. డాఁగుడుమూఁతలు రూ. డాఁగిలి మూఁతలు. డాఁగురుమూఁతలు, దాఁగిలిమూఁతలు, దాఁగుడుమూఁతలు. వి.బ.వ. పిల్లలు ఆడుకొనే ఒకఆట, కనుమూసి గంత. యయా. 3.55. డాఁగురించు రూ. దాఁగురించు. స.క్రి. 1. దాచు, మరుగుపరచు. భార. సౌప్తి. 1.230 ; 2. వంచించు, మోసపుచ్చు. ఉ. హరి. 9.48. అ.క్రి. దాగు, తిరోహితమగు. ఆం.భా. 3.98. డాఁగురింత 1. వంచన, మోసం, దాగుడుమూతలు అనే క్రీడావిశేషం. హరి. పూ. 8.35 ; 2. దాగటం, మరుగుపడటం. కకుత్స్థ. 3.78 ; 3. మరుగు పరచటం, దాచటం. డాఁగురుమూఁతలు రూ.చూ. డాఁగుడుమూఁతలు. వి.బ.వ. బాల్యక్రీడావిశేషం. వేంక. మా. 6.96, నీలా 1.65.

డాచేయు చూ. డాపు.

డాఁచినట్టరుగు చూ. డాఁచు.

డాఁచు చూ. డాఁగు. రూ.చూ. దాఁచు. స.క్రి. 1. మరుగు పరచు, కప్పిపుచ్చు. భార. భీష్మ. 2.7 ; 2. పదిలపరచు, జాగ్రత్త పెట్టు. ఉ. హరి. 1.168, విక్ర. 8.12.

డాఁచినట్టరుగు అ.క్రి. ఏదైన తప్పక తనకు అక్కడే దొరుకుతుందనే ధైర్యంతో వెళ్ళు. మను. 4.48.

డాడి వి. తండ్రి.

ఇం. *Daddy*. తండ్రి.

<ఇం. Daddy.

డాడ్జిచేయు అ.క్రి. ముందు వెనకలకు ఊగు.

ఇం. *Dodge*. మోసం చేయు, బుకాయించు, మస్కా కొట్టు, ముందు వెనుకకు ఊగు.

<ఇం. Dodge + చేయు.

డాండాం వి. 1. నగారా ; 2. ఫిరంగుల మోత. ధ్వన్యను.

డాన్సు వి. నాట్యం.

ఇం. *Dance*. నాట్యం.

<ఇం. Dance.

డాపు చూ. డాయు. రూ. దాపు[2], డాబు. వి. 1. ప్రాపు, ఆశ్రయం, అలంబం. దశకు. 5.40 ; 2. సామీప్యం, దగ్గర. వేంక.పంచ. 1.55, వసు. 3.49. విణ. సమీపంలోఉన్న, దగ్గరఉన్న.

డాకలు రూ.చూ. దాకల్లు. వి. బండి చక్రంయొక్క చుట్టు కమ్మి, నేమి. డాకల్లు[1] రూ.చూ. దాకల్లు. వి. బండిచక్రం యొక్క చుట్టుకమ్మి. నేమి. డాచేయు స.క్రి. ఆధారంగా చేసు కొను, ఆనికగా చేసుకొను. పాండు. 3.160.

డాపురము చూ. డాయు.

డాబ్ రూ.చూ. డాబీ. వి. నేతలో డిజైన్లు రావటానికి, మగ్గంపైన అమర్చే యంత్రం.

డాబ[1] వి. పక్షివిశేషం. పార్వ. 6.77, చంద్రాంగ. 2.81.

డాబ[2] రూ.చూ. డాబా[1]. వి. యోధులు జంబెంలాగా వేసు కొనే తోలుపట్టి. ఆం. భా. 2.204.

డాబా[1] రూ. డాబ[2]. వి. 1. శత్రువుల ఫిరంగి గుండు దెబ్బ తగలకుండా చాటుగా పట్టుకొనే కేడెంవంటి పెద్దసాధనం. కువ. చ. 3.10 ; 2. యోధులు జంబెంలాగ వేసుకొనే తోలుపట్టె, పదుదల. శుక. 2.426, ఓబ్లా. 2.108.

హిం. ఉ. డాబ్. కత్తి వేలాడటానికి ఉపయోగించే నడుముకు కట్టుకొనే చర్మపు పటకా.

<ఉ. డాబ్.

డాబాకత్తి వి. పటకాలో పట్టేకత్తి.

డాబా[2] వి. ఉన్నతమైన కట్టడం, కప్పులేని మేడ, బోడిమిద్దె.

హిం. ఢాబా. ఇంటిపై కప్పునగలది, మిద్దె; మరా.

ఢాబేఁ. చప్పరం; ఉ. ఢాబా. మిద్దె.

<ఉం. ఢాబా.

**డాబాగొట్టం** వి. డాబాపై భాగంలో అలంకారంగా పెట్టడానికి ఏనుగు, ఎద్దు మొ. వాటితలలాగ చేసి అమర్చిన మట్టిగొట్టం. **డాబాసున్నం** వి. ఇంటి కప్పుకు వాడే బాగా జిగురున్న మెత్తటిసున్నం.

**డాబా**[3] వి. పందెపు కోడిపుంజు.

మరా. డాంభా. గర్వం, ఆడంబరం.

**డాబి** రూ.చూ. డాబీ. వి. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చేయంత్రం.

**డాబినేత** రూ.చూ. డాబీనేత. వి. మగ్గానికి డాబీ అమర్చి, బట్టఅంచున డిజైన్లు పడేట్టు నేసిననేత.

**డాబీ** రూ. డాబ్, డాబి, డాబు[4], డాభీ, డోబి. వి. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం.

మరా. (డాంబఁణేఁ), (డాంభఁణేఁ). (కి.) కట్టు.

**డాబీఅద్ద** వి. పేటుదారాలకు ఆధారంగా డాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద. **డాబీగొలుసు** వి. డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా, నన్న బద్దలు కూర్చిన సాధనం. **డాబీచక్రం** వి. డాబీ కోలలు లేపటానికి గొలుసు మాదిరిగా, సన్న బద్దలు కూర్చిన సాధనం. **డాబీదండ** వి. డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా సన్న బద్దలు కూర్చిన సాధనం. **డాబీదారం** వి. నేతలోడిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం. **డాబీనిలుపు** వి. డాబీచట్రం పొడుగు బద్ద. **డాబీవేత** రూ. డాబినేత. వి. మగ్గానికి డాబీ అమర్చి, బట్టఅంచున డిజైన్లు పడేట్టు నేసిన నేత. **డాబీపని** వి. మగ్గానికి డాబీ అమర్చి బట్ట అంచున డిజైన్లు పడేట్టు నేసిన నేత. **డాబీబద్ద** వి. పేటుదారాలకు ఆధారంగా, డాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద. **డాబీబొమ్మ** వి. డాబీకుక్కను గుంజే కొయ్యపుల్ల.

**డాబు**[1] రూ.చూ. డంబు[1]. వి. అతిశయం మాట.

**డాబుచేయు** అ.క్రి. డంబాలు పలుకు. **డాబుసర్లు** వి.బ.వ. గొప్పలు, కోతలు, జంభాలు.

**డాబు**[2] వి. **1.** దినుసుల పట్టిక ; **2.** మందులచీటి.

**డాబు**[3] వి. గజ్జెలు లేని వడ్డాణం.

**డాబు**[4] రూ.చూ. డాబీ. వి. నేతలో డిజైన్లు రావటానికి, మర మగ్గం పైన అమర్చే యంత్రం.

**డాభీ** రూ.చూ. డాబీ. వి. నేతలో డిజైన్లు రావటానికి, మర మగ్గం పైన అమర్చే యంత్రం.

**డాము** వి. **1.** ఆనకట్ట ; **2.** కాలవమీద అడ్డకట్ట.

ఇం. *Dam*. ఆనకట్ట.

<ఇం. Dam.

**డామ్‌గడి** చూ. డాము. వి. ఒకరకం నేతగడి.

**డాంబరీ** వి. ఇనపతీగ.

**డాంబరు** వి. **1.** తారు ; **2.** బొగ్గుమడ్డి ; **3.** నూనెమడ్డి.

హిం. డామర్. పొగ ; మరా. డాంబర్. చెట్లనుంచి లభించే జిగురు పదార్థం.

**డాంబరురోగం** వి. గోధుమ తెగులు. **డాంబరురోడ్డు** వి. తారురోడ్డు.

**డాంబికుడు** వి. మోసకాడు ; **2.** గర్వి.

సం. డాంభిక-. గర్వి.

<సం. డాంభిక-.

**డాఁపరము** చూ. డాఁపు.

**డాఁపరి** రూ. డాఁపు.

**డాఁపరించు** చూ. డాఁపు.

**డాఁపరీఁడు** చూ. డాఁపు.

**డాఁపు** చూ. డాఁచు. స.క్రి. డాగజేయు, దాచు, దాపు.

**డాఁపరము** వి. దాపరం, దొంగతనం. **డాఁపరి** వి. దాపరి, మోసగాడు. **డాఁపరించు** స.క్రి. దాపరించు, మోసగించు. **డాఁపరీఁడు** రూ.చూ. దాఁపరీఁడు. వి. వంచకుడు, మోసగాడు. పి.శకు. 3.154.

**డాయఁబుట్టు** చూ. డాయు.

**డాయవచ్చు** చూ. డాయు.

**డాయి** రూ.చూ. దాయి. వి. బంగారం, ఇనుం మొ. వాటిని సాగగొట్టడానికి ఆధారంగా ఉంచుకొనే ఇనప దిమ్మ.

**డాకలి** రూ.చూ. దాకలి. వి. లోహాల్ని సాగగొట్టడానికి ఆధారంగా ఉంచుకొనే ఇనపదిమ్మ. ఆం. భా. 2.299.

**డాకల్లు**[2] రూ.చూ. దాకలి. వి. ఉక్కు దిమ్మ, కమ్మరిపట్టెడ.

**డాయించు** చూ. డాయు.

**డాయు** రూ. దాయు. స.క్రి. **1.** సమీపించు, దగ్గరు. భార. అది. 7.176 ; **2.** సోకు, తగులు. భాస్క.రా.అయోధ్యా. 169 ; **3.** (యుద్ధాదులందు) కలియు, తాకు. భాస్క. రా. యు. 795, భాగ. 10పూ. 1340 ; **4.** పొందు. పాండు. 5.248 ; అ.క్రి. చొచ్చు, ప్రవేశించు. ఇందు.2.187.

క. అడసు. సమీపించు ; త. అణు. నమీపించు, దగ్గరకు చేరు. అణై. సమీపించు ; మ. అణుక. దగ్గరకు చేరు, అణుక్క. సమీపించు ; గోం. (మతీయమాం). దాయ్-(దఇత్-). వెళ్ళు ; కుఇ. అటు. దగ్గర, అజ్సె/అడ్సె. కలసి, జతగా ; మాల్తో. అజ్గె/అజ్గి. సమీపం, దగ్గర ; అటిపాటి. ఇరుగు పొరుగు.

చూ. అడుకు.

<ము. ద్రా. *అట్-.

**డాకొను**[2] రూ. దాకొను. స.క్రి. **1.** సమీపించు, డాయు. వరాహ. 3.103 ; **2.** పట్టుకొను, గ్రహించు. అచ్చ.రా. బాల. 170 ; అ.క్రి. **1.** ఉండు. వరాహ. 7.55 ; **2.** సిద్ధపడు ; **3.** స్థిరపడు. **డాకొలుపు** రూ.చూ. డాకొల్పు. స.క్రి. **1.** డాకొనజేయు, సమీపింపజేయు, దగ్గరకురప్పించు ; **2.** ఉంచు, పెట్టు. **డాకొల్పు** రూ. డాకొలుపు, దాకొలుపు. స.క్రి. **1.** ఉంచు, పెట్టు. భాను. 3.84 ; **2.** సమీపింపచేయు, దగ్గరకు రప్పించు. **డాపురము** రూ.చూ. దాపురము. వి. ప్రాప్తి. విణ. ప్రాప్తం, ప్రాప్తించినది. **డాయఁబుట్టు** (-పుట్టు) వి. తోడపుట్టు, కూడజనించు. జాహ్నవీ. 4.25. **డాయవచ్చు** స.క్రి. డాయు, సమీపించు. విప్ర. 1.80. **డాయించు** రూ. దాయించు. స.క్రి. **1.** డాయచేయు, సోకించు, కదియచేయు. ద్వి.పరమ. వి. 3.161 ; **2.** పొందించు.

శుక. 1.432.

**డార్క్** విశే. **1**. ముదురురంగుగల ; **2**. నల్లని.

ఇం. *Dark*. చీకటిగల. నల్లని, విచారకరమైన.

< ఇం. Dark.

డార్క్‌చిలకపచ్చ వి. ముదురు చిలక(ఆకు) పచ్చరంగు. డార్క్‌బాదామి వి. ఒకరకం బిస్కట్టురంగు, ముదురు గోధుమ రంగు. డార్క్‌మోతీలాల్ వి. ఒకరకం ముదురు నీలం రంగు.

**డాల** వి. పెద్దగంప, జల్ల, బండిగూడ.

హిం. డలియా, డల్లా, డాల్. గంప ; మరా. డాలీ.

< హిం. డాల్.

**డాలం** రూ. డాలియా. వి. మిద్దెపరుపు కట్టెమీద వేసేమట్టి.

మరా. డాల (శోద). పేర్చు, పోగుచేయు.

**డాలము** వి. నాట్యవిశేషం.

**డాలరు** వి. అమెరికాదేశం బంగారు వెండి నాణేలలో ఒక ముఖ్యమైన ప్రమాణంగల నాణెం, అమెరికా దేశపునాణెం.

ఇం. *Dollar*. అమెరికాదేశం నాణెం, బంగారు వెండి నాణాలలో ఒకముఖ్యమైన ప్రమాణం గలది.

< ఇం. Dollar.

**డాలించు**[1] చూ. డాలు[1].

**డాలించు**[2] చూ. డాలు[2].

**డాలియా** రూ.చూ. డాలం. వి. మిద్దెపరుపు కట్టెమీద వేసే మట్టి.

**డాలు**[1] రూ. ఢాలు. వి. కేడెం, ఒడ్డనం. శుక. 2.426.

సం. ఢాల-. ఒడ్డనం, కేడెం, డాలు ; నే. అ. బెం. హిం. మరా. ఢాల్ ; ఒ. ఢాళ్.

క. డాలు.

< సం. ఢాల-.

డాలించు[1] స.క్రి. **1**. కూర్చు, గుంఫించు. ద్వి.పరమ. వి. 3.170 ; **2**. పట్టించు. ద్వి.పరమ. 3.204. అ.క్రి. డాలు ధరించు, కేడెంపట్టుకొను. డాలుకాఁడు వి. డాలు ధరించిన వాడు, కేడెంపట్టుకొన్నవాడు. డాలువాలు వి. కేడెం, ఒడ్డనం.

**డాలు**[2] వి. **1**. కాంతి, శోభ. ఆము. 1.12, ఆం.భా. 1.82 ; **2**. ఛాయ.

డాలించు[2] అ.క్రి. శోభించు, ప్రకాశించు. ద్వి.పరమ. వి. 2.56. డాలుకొను అ.క్రి. రంగువేయు, గుర్తించు.

**డాలు**[3] వి. వీణాధ్వని విశేషం. వరాహ. 11.35.

**డాలు**[4] వి. **1**. కేతనం, టెక్కెం, జండా. రాజవా. 1.79 ; **2**. చిహ్నం, గురుతు. ఆం. పదా నానా. 9.

క. ఢాళొ, ఢాళ్. పొడుగైన జండా.

< క. ఢాళ.

**డావరడంగి** రూ. దావరడంగి. వి. ఏరవకడ, దేవతాళం, ఒకానొక చెట్టు.

**డావు**[1] వి. వడ్డాణం.

**డావు**[2] వి. **1**. ఉత్కటఉడియమైన లాభం, ఎక్కువగా వచ్చిన లాభం ; **2**. దాయి.

మరా. డావ. క్రమం, సమయం.

**డాష్ఇచ్చు** స.క్రి. ఢీకొను.

ఇం. *Dash*. చిన్నాభిన్నంచేయు, విసరికొట్టు, ఢీకొట్టు. నీటితాకుడు ధ్వని, సాహసం, రాయకుండా వదలిపెట్టిన అక్షరాలు, బలంగా పనిచేసే శక్తి.

< ఇం. Dash + ఇచ్చు.

**డి.ఇ.ఒ.** వి. జిల్లా విద్యాశాఖాధికారి.

ఇం. *D.E.O.* (*District Educational Officer*). జిల్లా విద్యాశాఖాధికారి.

< ఇం. D.E.O.

**డి.ఎమ్.ఎస్.** వి. వైద్యశాఖాధికారి.

ఇం. *D.M.S.* (*Director of Medical Services*). వైద్యశాఖాధికారి.

< ఇం. D.M.S.

**డి.ఎమ్.ఒ.** వి. జిల్లా వైద్యశాఖాధికారి.

ఇం. *D.M.O.* (*District Medical Officer*).

< ఇం. D.M.O.

**డి.ఎమ్.కె.** వి. తమిళనాడులో ప్రసిద్ధమైన ఒక ప్రాంతీయ రాజకీయ పక్షం.

ఇం. *D.M.K.* (*Dravida Munnetra Kazagam*). తమిళనాడులో ప్రసిద్ధమైన ఒక ప్రాంతీయ రాజకీయ పక్షం.

< ఇం. D.M.K.

**డి.ఎమ్.కోర్టు** వి. జిల్లా మునసబు న్యాయస్థానం.

ఇం. *D.M. Court* (*District Munsif Court*). జిల్లా మునసబు న్యాయస్థానం.

< ఇం. D.M. Court.

**డి.ఏ.** వి. కరువు భత్యం.

ఇం. *D.A.* (*Dearness Allowance*). కరువు భత్యం.

< ఇం. D.A.

**డి.ఐ.జి.** వి. ఒకానొక ఉపపర్యవేక్షక సర్వాధికారి.

ఇం. *D.I.G.* (*Deputy Inspector General*). ఒకానొక ఉపపర్యవేక్షక సర్వాధికారి.

< ఇం. D.I.G.

**డికాక్షన్** రూ. డికాషన్. వి. కాఫీపొడి తేయాకు మొ. వాటి మరగకాచిన సారం.

ఇం. *Decoction*. కషాయం, మరగ కాచి సారం తీయటం.

< ఇం. Decoction.

**డికాషన్** రూ.చూ. డికాక్షన్. వి. కాఫీపొడి తేయాకు మొ. వాటి మరగకాచిన సారం.

**డికిరీపంటి** వి. సారాయి బట్టీలో గూనలోని ఊట సారాయిగా దిగడానికి వీలుగా కింద భూమిమీద పెట్టే మట్టిపాత్ర.

**డిక్క** రూ.చూ. డెక్క. వి. గొడ్ల కాలిగిట్ట.

**డిక్కి** వి. తలతో ఢీకొట్టటం, డీడిక్కి.

క. డిక్కా, డిక్క, డీ, డీఁకు. తలతో ఢీకొట్టటం.

**డిక్కీ** వి. కారు వెనుక సామాన్లు పెట్టుకొనే అరలాంటిది.

ఇం. *Dickey*. గుర్రంబండి వెనక నౌకరు కూర్చునే పలక, చొక్కా ముందు కుట్టుకొనే గుడ్డ, గాడిద, ఒక రకం పిట్ట.

<ఇం. Dickey.

**డిక్కు** వి. ఒట్టువేసుకొని లేదా ప్రమాణంచేసి చెప్పటం.

ఇం. *Dick*. అపరాధ పరిశోధకుడు, ఒట్టువేసికొని లేదా ప్రమాణంచేసి చెప్పటం.

<ఇం. Dick .

**డిక్టేషన్** రూ. డిక్టేషను. వి. ఆదేశం, అధికారంతో చెప్పేది.

ఇం. *Dictation*. ఆదేశం, అధికారంతో చెప్పేది, రాసేవాళ్ళకి చెప్పేది.

<ఇం. Dictation.

**డిక్టేషను** రూ.చూ. డిక్టేషన్. వి. ఆదేశం, రాసేవాళ్ళకు అధికారికంగా చెప్పేది.

**డిక్రి** రూ. డిక్రీ. వి. 1. తీర్పు ; 2. నిర్ణయం ; 3. ఆజ్ఞ.

ఇం. *Decree*. ఆజ్ఞ, శాసనం, అధికారికంగా ప్రకటితమైనది. (న్యాయ న్యాయస్థానపు) తీర్పు.

<ఇం. Decree.

**డిక్రీ** రూ.చూ. డిక్రి. వి. 1. ఆజ్ఞ, శాసనం, అధికారికంగా ప్రకటితమైంది ; 2. న్యాయస్థానపు తీర్పు.

**డిక్లరేషన్** రూ. డిక్లరేషను. వి. ప్రకటన, తెలియచేయటం.

ఇం. *Declaration*. ప్రకటన, తెలియచేయటం, బయలుపరచటం.

<ఇం. Declaration.

**డిక్లరేషను** రూ.చూ. డిక్లరేషన్.

**డిక్లేబుంగ** చూ. డికిరీపంటి. వి. సారాయి బట్టీలో గూనలో ఊట సారాయిగా దిగడానికి వీలుగా కింద భూమిమీద పెట్టే మట్టిపాత్ర.

**డిక్లేరగు** అ.క్రి. ప్రకటితమగు.

ఇం. *Declare*. నిర్ణయించి చెప్పు, బహిరంగంగా ప్రకటించు, ప్రటంపు చెప్పు.

<ఇం. Declare + అగు.

**డిక్లేర్‌చేయు** స.క్రి. బహిరంగంగా ప్రకటించు.

ఇం. *Declare*. నిర్ణయించి చెప్పు, ఒకని స్వాధీనమందున్న వస్తువుల్లో పన్ను విధింపదగిన వానిని ప్రకటించు, ప్రటంపు చెప్పు, బహిరంగంగా ప్రకటించు.

<ఇం. Declare + చేయు.

**డిక్షనరీ** రూ. డిక్షనరి. వి. నిఘంటువు, కోశం, పదాలకు అర్థాల్ని తెలిపే గ్రంథం.

ఇం. *Dictionary*. నిఘంటువు, కోశం, పదాలకు అర్థాల్ని తెలిపే గ్రంథం.

<ఇం. Dictionary.

**డిగజాఱు** చూ. డిగు.

**డిగదాఁటు** చూ. డిగు.

**డిగనాడు** చూ. డిగు.

**డిగనుఱుకు** చూ. డిగు.

**డిగఁద్రావు** చూ. డిగు.

**డిగఁబడు** చూ. డిగు.

**డిగవిడుచు** చూ. డిగు.

**డిగించు** చూ. డిగు.

**డిగియ** రూ.చూ. డిగ్గియ. వి. నడచి పోవటానికి మెట్లు ఏర్పరచిన బావి, నడబావి. హంస. 4.210.

**డిగు** రూ.చూ. డిగ్గు. స.క్రి. అవరోహణం చేయు, అవతరించు. భార.ద్రోణ. 3.381. అ.క్రి **1.** జారు. ఉ.హరి. 3.157; **2.** అవరోహణం చేయు, అవతరించు. శృం. నై. 2.54 ; **3.** కుంగు, కిందికి అణగు, దిగబడు. ఆము. 4.143 ; **4.** తగ్గిపోవు, పోవు. వసు. 6.99 ; **5.** విడియు, బసచేయు. కువ.చ. 2.108 ; **6.** సిద్ధమగు, సన్నద్ధమగు; **7.** దిగుమతి అగు, ఇతర స్థలంనుంచి వచ్చు.

**డిగజాఱు** రూ.చూ. డిగ్గజాఱు. అ.క్రి. కిందికి జారు. <డిగు + -అ$^7$ + జాఱు. **డిగదాఁటు** రూ.చూ. డిగ్గదాటు. అ.క్రి. దిగువకు దుముకు. <డిగు + -అ$^7$ + దాఁటు. **డిగనాడు** రూ.చూ. డిగ్గనాడు. స.క్రి. దిగనాడు, విడుచు, ఈసడించు. <డిగు + -అ$^7$ + ఆడు. **డిగనుఱుకు** రూ.చూ. డిగ్గనుఱుకు. అ.క్రి. దుముకు, కిందికి దూకు. <డిగు + -అ$^7$ + ఉఱుకు. **డిగఁద్రావు** రూ.చూ. దిగఁద్రావు. స.క్రి. **1.** విడచు, త్యజించు. ఉ.హరి. 6.183 ; **2.** అణచు. దశకు. 5.91. అ.క్రి. దిగు. <డిగు + -అ$^7$ + త్రావు. **డిగఁబడు** రూ.చూ. డిగ్గఁబడు. అ.క్రి. **1.** వేలాడు. భాగ. 10 పూ. 274 ; **2.** తూలు. ఉ.హరి. 4.269. <డిగు + -అ$^7$ + పడు. **డిగవిడుచు** రూ.చూ. డిగ్గవిడుచు. స.క్రి. వదలిపెట్టు. విడుచు. <డిగు + -అ$^7$ + విడుచు. **డిగించు** రూ. డిగ్గించు, దిగించు. స.క్రి. దింపు, కిందికి చేర్చు. నిర్వ.రా. 9.8. <డిగు + -ఇంచు$^3$. **డిపుచు** స.క్రి. డిగించు, డించు. **డిగుడు** రూ.చూ. డిగ్గుడు. వి. కిందిభాగం. **డిగువడు (-పడు)** రూ. డిగ్గుపడు, డిగ్గువడు. అ.క్రి. ఉపశమిల్లు, పోవు. భాస్క.రా. అరణ్య. 1.257.

**డిగుడిగుడిక్కు** వి. డిక్కు, డిగుడిగుడిక్కు అంటూ గొర్రెపోతుల్లాగా తలల్ని తాకిస్తూ బాలురు ఆడుకొనే ఆట. ధ్వన్యను. పండి.చ. 2.156.

**డిగువ** రూ.చూ. దిగువ. వి. కిందిభాగం. రం.రా.యు. 522 పు. 29 పం. విశే. కిందది.

**డిగ్గజాఱు** చూ. డిగ్గు.

**డిగ్గదాఁటు** చూ. డిగ్గు.

**డిగ్గన** చూ. డిగ్గు. రూ. డిగ్గున, దిగ్గన. క్రి.విశే. ద్రు. తటాలున. రం.రా.యు. 2973 పం. బహుళా. 5.26.

**డిగ్గనాడు** చూ. డిగ్గు.

**డిగ్గనుఱుకు** చూ. డిగ్గు.

**డిగ్గఁద్రావు** చూ. డిగ్గు.

**డిగ్గఁబడు** చూ. డిగ్గు.

**డిగ్గవిడుచు** చూ. డిగ్గు.

**డిగ్గి** వి. **1.** అగ్ని ; **2.** ఆవు.

**డిగ్గించు** చూ. డిగ్గు.

**డిగ్గియ** చూ. డిగ్గు. రూ. డిగియ, దిగియ, దిగ్గియ. వి. లోనికి దిగి నీళ్ళు తెచ్చుకొనటానికి మెట్లు ఏర్పరచిన బావి, నడబావి. భార.శాంతి. 3.332.

సం. దీర్ఘికా. దిగుడుబావి ; ప్రా. దిగ్ఘిఆ, దీహియా. మెట్లనుయ్యి ; అమా. దీహియా. లోతయిన బావి ; అ. దీఘీ. పెద్ద చెరువు, చిన్న సరస్సు ; బెం. దిగి, దిఘి ;

ఒ. దిఘు- ; హిం. దేఁఘు, దిగ్గీ, దిఘ్గీ.

< ప్రా. దిగ్ఘిఅ-.

**డిగ్గిలి** చూ. డిగ్గు.

**డిగ్గు** రూ. డిగు, దిగు, దిగ్గు[1], డివు. వి. **1.** తక్కువతనం, క్షీణత్వం. నిర్వ.రా. 1.44 ; **2.** ఉరకటం, దిగటం, లేవటం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. హర. 1.5. స.క్రి. **1.** పైనుండి కిందికి ప్రసరించు. కేయూర. 3.48, కాశీ. 2.211; **2.** అవతరణం చేయు, అవరోహించు. భాగ. 10 ఉ. 90, వరాహ. 1.3. అ.క్రి. **1.** సిద్ధమగు, సన్నద్ధమగు. భాస్క. రా.యు.. 473 ; **2.** అవతరణం చేయు, అవరోహించు. శృం.నై. 2.35 ; **3.** తగ్గు, మందమగు. క్రీడా. 87 ; **4.** ఉపశమించు, పోవు. వరాహ. 12.61, సిం.ద్వా. 5.73 ; **5.** (సరకులు) అన్యస్థలంనుండి వచ్చు, దిగుమతి అగు. ఆము. 2.3; **6.** రాలు, పడు. ఆము. 4.90 ; **7.** దిగబడు, కుంగు. ఆము. 5.69 ; **8.** కిందికి వచ్చు. కకుత్స. 3.62.

క. *ఇఱి* (*ఇఱిద్*). కిందికి దిగు, తగ్గు ; *ఇఱి*కు. తగ్గించు, కిందకు దింపు ; త. *ఇఱి* (-వ్, -త్-). దిగు, పడు, తగ్గు; *ఇఱి*చ్చు, *ఇఱి*త్తు. తగ్గించు, కిందకు దింపు ; మ. *ఇఱి*క. పైనుంచి కిందకి దిగు; *ఇఱి*క్కు. తగ్గించు, కిందకు దింపు ; తొ. *ఈక్సు*. పైనుంచి కిందకి దిగు ; గోం. మఱియామాం. *డిగ్*. పైనుంచి కిందకి దిగు (నంద్గాన్) ; *డీక్*. పడిపోవు ; కుఇ. *దీవ*. నిలిచిపోవు, దిగబడిపోవు ; కువి. *లీ*. పడు; పర్జి. *ఇడ్*. పైనుంచి కిందకి దిగు; *ఇడ్కిప్*; కొలా. *దిగ్గ్*, *దిగ్*. పైనుంచి కిందకి దిగు ; కొ.గ. *ఇడ్గ్*. పైనుంచి కిందకి దిగు.

మూ.ద.ద్రా. & మూ.మ.ద్రా. *ఇఱ్-ఇ, *ఇఱ్-క-.

< మూ.ద్రా. *ఈఱ్-.

**డిగ్గజాఱు** రూ. జిగజారు, డిగజాఱు, దిగజారు, దిగజాఱు. అ.క్రి. కిందికిజారు, దిగజారు. ఉ.హరి. 9.220. < డిగ్గు + -అ[7] + జాఱు. **డిగ్గదాఁటు** రూ. డిగఁదాటు, దిగ్గదాఁటు. అ.క్రి. దిగువకు దుముకు, కిందికి దాటు. భార.భీష్మ. 2.107. < డిగ్గు + -అ[7] + దాఁటు. **డిగ్గనాడు** రూ.చూ. దిగ్గనాడు. స.క్రి. దిగనాడు, విడుచు. < డిగ్గు + -అ[7] + ఆడు. **డిగ్గనుఱుకు** రూ. డిగనుఱుకు, దిగనుఱుకు. అ.క్రి. దిగువకు దుముకు, కిందికి దూకు. ఉ.హరి. 1.224. < డిగ్గు + -అ[7] + ఉఱుకు. **డిగ్గఁద్రావు** రూ.చూ. దిగఁద్రావు. స.క్రి. **1.** విడుచు, త్యజించు. భార.కర్ణ. 1.133 ; **2.** అణచు. ఉ.రా. 4.253. < డిగ్గు + -అ[7] + త్రావు. **డిగ్గఁబడు** రూ. డిగఁబడు. అ.క్రి. **1.** తక్కువ పడు. కు.సం. 3.267 ; **2.** జారు. < డిగ్గు + -అ[7] + పడు. **డిగ్గవిడుచు** రూ. డిగవిడుచు, దిగవిడుచు. భార.విరా. 4.72. < డిగ్గు + -అ[1] + విడుచు. **డిగ్గించు** రూ. చూ. డిగించు. స.క్రి. దింపు, కిందికి చేర్చు. భార.స్త్రీ. 2.26. < డిగ్గు + -ఇంచు[3]. **డిగ్గిలి** వి. **1.** కింద, దిగువభాగం ; **2.** దిగుడు మెట్టు. **డిగ్గుడు** రూ. డిగుడు, దిగుడు[1], దిగ్గుడు. వి. దిగటం. పండి.చ. 5. 343. విశే. **1.** ఆనతమైన, పల్లమైన ; **2.** తక్కువ. **డిగ్గన** రూ.చూ. డిగ్గన. క్రి.విశే.ద్రుతటాలున, శీఘ్రంగా. దశా. 2.129. **డిగ్గుపడు** రూ.చూ. డిగుపడు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు. యయా. 4.163. **డిగ్గువడు** (-పడు) రూ.చూ. డిగువడు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు.

**డిగ్రి** రూ.చూ. డిగ్రీ. వి. **1.** విద్యాపట్టం ; **2.** ఉష్ణమాపికలోని ప్రమాణం.

**డిగ్రీ** రూ. డిగ్రి. వి. **1.** విద్యాపట్టం ; **2.** ఉష్ణమాపికలోని ప్రమాణం.

ఇం. *Degree*. మెట్టు, అంతస్తు, క్రమపరిణామంలోని దశ, సంఘంలో తరగతి, అధికారస్థాయి, విద్యాపట్టం లేదా గౌరవపట్టం, విశేషణాల సామాన్య తరతమ భావం, కోణాంశం, ఉష్ణాన్ని కొలిచే ప్రమాణం (యూనిట్).

< ఇం. Degree.

**డింక** వి. మరణం.

క. ఇఱుకు, ఇఱికు, ఇఱుకు. కిందికి దిగు, కిందికి వాలు : బ్రా. *దఢిన్ గిన్గ్*, *దఢన్ గిన్గ్*. దిగు. (వాహనాల నుంచి) కిందికి దిగు.

**డింకకొట్టు** అ.క్రి. పతవమునుగు. **డింకవేయు** అ.క్రి. **1.** చచ్చు. సారంగ. 1.107, ఆం.భా. 3.87 ; **2.** అణగు ; **3.** పరీక్షతప్పు ; **4.** డింకీకొట్టు.

**డింకమల్లి** వి. ఒకరకం మల్లి.

**డింకాకొట్టు** చూ. డింక. అ.క్రి. చచ్చు.

**డింకి** రూ. డింకీ[1]. వి. **1.** పిల్లమొరం, సాములోని బేదం. ఆం.భా. 2.207 ; **2.** పందెపుకోడి.

క. *డింకి*. సాములో పడిపోవటం ; *డేంకి* ; త. *టింకి*.

**డింకీ**[1] రూ.చూ. డింకి. వి. మల్ల విద్యావిశేషం, మొగ్గ, పిల్లమొరం.

**డింకీకొట్టు** అ.క్రి. **1.** చచ్చు ; **2.** పల్టీకొట్టు ; **3.** చేసే పనిలో తప్పుదారిని పడి మోసపోవు ; **4.** పరీక్ష మొ. వాటిలో తప్పు.. **డింకీకోడి** వి. పందెపుకోడి, బెరసకోడి.

**డింకీ**[2] రూ.చూ. డిమ్కి. వి. గుమ్మెట, కూజా మాదిరిగా ఉండే మట్టిపాత్ర.

**డింకు** అ.క్రి. **1.** చచ్చు ; **2.** అణగు.

క. ఇఱుకు, ఇఱికు, ఇఱుకు. కిందికిదిగు, కిందికి వాలు ; బ్రా. *దఢిన్ గిన్గ్*, *దఢన్ గిన్గ్*. కిందికి దిగు, వాహనాదుల నుంచి కిందికి దిగు.

**డింగిళ్లు** చూ. గిడిగిళ్లు. వి.బ.వ. నమస్కారాలు, మొక్కులు.

**డింగుడింగుచేయు** స.క్రి. మితితప్పి వెచ్చించు. ధ్వన్యను.

**డిజన్** రూ.చూ. డిజైను. వి. **1.** చెక్కడపుపని ; **2.** వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డిజన్నేత** రూ.చూ. డిజైను నేత. వి. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిన నేత.

**డిజిన్** రూ.చూ. డిజైను. వి. **1.** చెక్కడపుపని ; **2.** వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డిజెన** రూ.చూ. డిజైను. వి. **1.** చెక్కడపుపని ; **2.** వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డిజెను** రూ.చూ. డిజైను. వి. **1.** చెక్కడపుపని ; **2.** వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డిజెన్తలుపు** వి. మధ్యభాగం ఉబ్బెత్తుగా చేసి చట్రంలో

బిగించిన చెక్కల తలుపు.

**డిజైన్తలుపు** చూ. డిజైను.

**డిజేన్** రూ.చూ. డిజైను. వి. 1. చెక్కడపు పని ; 2. బట్టలో లతలాగ నేసిన నేత.

**డిజేన్నేత** రూ.చూ. డిజైను నేత. వి. బట్టమీద రక రకాల నమూనాలు పడేట్టు నేసిననేత.

**డిజైన్** రూ.చూ. డిజైను. వి. 1. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా ; 2. చెక్కడపు పని.

**డిజైన్తాపి** వి. సన్నగా, పొడుగ్గా, కోలగా ఉండే రేకుగల చిన్న తాపి. **డిజైన్తోట్టి** వి. డిజైన్పెట్టి చేసిన పూలతొట్టి. **డిజైన్నాడె** రూ.చూ. డిజైనునాడె. వి. కమ్మిలో డిజైన్లు పడేట్టు నెయ్యటానికి వాడే నాడె. **డిజైన్నేత** రూ.చూ. డిజైను నేత. వి.బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిననేత.

**డిజైనంచు** చూ. డిజైను.

**డిజైనర్ధకం** చూ. డిజైను.

**డిజైను** రూ. డిజన్, డిజిన్, డిజన, డిజెను, డిజేన్, డిజైన్, డిసైన్, డీజన్, డీజను, డీజెన్, డీజెను. వి. 1. చెక్క డపు పని ; 2. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

ఇం. *Design.* నమూనా, చిత్తుపటం, కళాసాహిత్యాల్లో రచనకు ఆధారంగా ఏర్పరచుకొన్న స్థూలరూపం.

<ఇం. Design.

**డిజైనంచు** వి. చారలు చారలుగా నేసిన ఒకరకం అంచు. <డిజైను+అంచు. **డిజైనర్ధకం** వి. ఒకరకం అర్ధకం. <డిజైను+అర్ధకం. **డిజైనుకమ్మి** వి. ఒక నమూనా పడేట్టు చేసిన కమ్మి. **డిజైనునాడె** రూ. డిజైన్నాడె. వి. కమ్మిలో డిజైన్లు పడేట్టు నెయ్యటానికివాడే నాడె. **డిజైనునేత** రూ. డిజన్నేత, డిజేన్నేత, డిజైన్నేత. వి. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిననేత. **డిజైనుసురై** వి. కమండలం ఆకారంలో ఉండే నీళ్ళ కూజా.

**డించిపోవు** చూ. డించు.

**డించు** చూ. డిగ్గు. రూ. డించు. స.క్రి. 1. విడుచు, త్యజించు. భార.విరా. 5.186, కాశీ. 2.75, భాగ. 10 పూ. 986 ; 2. దించు, కిందికిచేర్చు. భాస్క.రా.యు. 858, వసు. 6.12 ; 3. తగ్గించు. ఆము. 5.157 ; 4. పోగొట్టు. సారంగ. 2.237.

క. ఇఱకు, ఇఱికు, ఇఱుకు, కిందికి దింపు ; ఇఱకిసు. కిందికివాల్చు ; త. ఇఱిచ్చు, దించు.

**డించిపోవు** స.క్రి. దిగవిడిచిపోవు.

**డిటిన్యూ** రూ.చూ. డిటెన్యూ. వి. నిర్బంధితుడు, విచారణ లేకుండ జైలులో ఉంచబడిన వ్యక్తి.

**డిటెక్టివ్** వి. అపరాధ పరిశోధకుడు.

ఇం. *Detective.* అపరాధపరిశోధకుడు, ప్రత్యేక నేరాన్ని పరిశోధించడానికి నియమించబడిన పోలీసు అధికారి.

<ఇం. Detective.

**డిటెక్షను** వి. 1. దొంగల్ని కనిపెట్టటం, అపరాధ పరిశోధన ; 2. పరిశోధన.

ఇం. *Detection.* కనిపెట్టటం, తెలుసుకోవటం.

<ఇం. Detection.

**డిటెన్యూ** రూ. డిటిన్యూ. వి. నిర్బంధితుడు, విచారణ లేకుండ జైలులో ఉంచబడిన వ్యక్తి.

ఇం. *Detenu.* నిర్బంధితుడు.

<ఇం. Detenu.

**డిటెన్షను** వి. నిర్బంధం.

ఇం. *Detention.* నిర్బంధం, నిలుపుదల చేయటం, లేదా చేయబడటం.

<ఇం. Detention.

**డిటో** వి. పైనచెప్పినదే.

ఇం. *Ditto.* పైనచెప్పినదే.

<ఇం. Ditto.

**డిండి** వి. నీరుకట్టె, ఇరుదలపాము, ఒకతెగ పెనుపాము.

సం. *డుండుభ-*. రెండుతలలపాము.

<సం. డుండుభ-.

**డిందఁజేయు** చూ. డిందు.

**డిందఁబడు** చూ. డిందు.

**డిందించు** చూ. డిందు.

**డిందిపోవు** చూ. డిందు.

**డిందు** చూ. డిగ్గు. అ.క్రి. 1. మొగ్గు. భార. ఆరణ్య. 3.235 ; 2. అడగు, లీనమగు. భార. అశ్వ. 2.10 ; 3. క్షీణించు. తగ్గిపోవు. మార్క. 1.168, భార. ఆరణ్య. 7.298 ; 4. అణగారు, కుంగు. మార్క. 6.83 ; 5. మునుగు. దశకు. 2.89 ; 6. నశించు. వాసి.రా. 4.96 ; 7. ఆరిపోవు. ఆము. 4.24 ; 8. సంభ్రమించు, తొట్రుపడు. పాండు. 2.190 ; 9. చచ్చు. ఉ.రా. 1.149. వి. అడకువ.

త. *ఇఱి (-వ్-,-న్ఱ్-).* తగ్గు, పడు ; (ఇఱి-త్త్). తగ్గించు, కృశించు.

**డిందఁజేయు** స.క్రి. నశింపచేయు. సీతారా. 2.150. <డిందు+-అ౯+చేయు. **డిందఁబడు** అ.క్రి. మునుగు. కు.సం. 11.58.<డిందు+-అ౯+పడు. **డిందించు** స.క్రి. 1. ముంచు. హరి. పూ. 1.104 ; 2. నశింపచేయు. భాగ. 10 పూ. 1374.<డిందు+-ఇంచు[3]. **డిందిపోవు** అ.క్రి. రాకుండపోవు. హరి.పూ. 1.75. **డిందుపడు** రూ. డిందు వడు. అ.క్రి. 1. ఉపశమిల్లు. భార. ఉద్యో. 2.54 ; 2. పోవు. శృం.నై. 8.80 ; 3. కుదురుపడు, స్వస్థమగు. ప్రబోధ. 2.68 ; 4. దిమ్మపడు, మత్తుకొను. ఆం.భా. 3.116. **డిందుపఱుచు** రూ. డిందువఱుచు. స.క్రి. 1. డిందుపడచేయు, ఉపశమింపచేయు. భార. విరా. 4.178 ; 2. పోగొట్టు. మను. 3.97. **డిందుపఱుచుకొను** స.క్రి. తగ్గించుకొను. **డిందుపాటు** వి. ఉపశాంతి, ఉపశమనం, కుదురుపాటు, స్వస్థత. విక్ర. 3 106. **డిందువడు(-పడు)** రూ.చూ. డిందుపడు. అ.క్రి. 1. ఉపశమిల్లు ; 2. కుదురు పడు ; 3. మత్తుకొను ; 4. పోవు. **డిందువఱుచు(-పఱుచు)** రూ.చూ. డిందుపఱుచు. స.క్రి. 1. ఉపశమింపచేయు ; 2. పోగొట్టు.

**డిన్నరు** వి. విందు భోజనం.

ఇం. *Dinner.* భోజనం, విందు.

< ఇం. Dinner.

**డిపాజిట్** రూ.చూ. డిపోజిట్. వి. **1.** ధరావత్తు ; **2.** బాంక్ మొ. వాటిలో దాచుకొనే సొమ్ము.

**డిపార్టుమెంట్** రూ. డిపార్టుమెంటు. వి. ఒకవిభాగం, ఒకశాఖ.

ఇం. *Department.* ఒక విభాగం, శాఖ.

< ఇం. Department.

**డిపార్టుమెంటు** రూ. చూ. డిపార్టుమెంట్. వి. ఒక విభాగం, ఒకశాఖ.

**డి.పి.ఐ.** వి. ఉన్నత విద్యాశాఖాధికారి.

ఇం. *D.P.I. (Director of Public Instructions).* ఉన్నత విద్యాశాఖాధికారి.

< ఇం. D.P.I.

**డిపో** వి. సరుకులుంచే తావు.

ఇం. *Depot.* పలు సరుకులుంచే తావు, సైనికుల్ని చేర్చుకొని శిక్షణ ఇచ్చే కేంద్రం, పరదేశాలకి పంపని సైనిక విభాగం, ఉగ్రాణం.

< ఇం. Depot.

**డిపోజిట్** రూ. డిపాజిట్, డిపోజిట్టు, డిపోశెట్టు. వి. **1.** ధరావత్తు ; **2.** బాంక్ మొ. వాటిలో దాచుకొనే సొమ్ము.

ఇం. *Deposit.* న్యాసం, బ్యాంకు మొ. వానిలో దాచడానికి ఇచ్చిన సొమ్ము, పేరుకొని గట్టిపడిన పొర, ధరావతు, నగదు జామీను, నిర్ణీతస్థలంలో ఉంచు, నిక్షేపించు.

< ఇం. Deposit.

**డిపోజిట్టు** రూ.చూ. డిపోజిట్. వి. **1.** ధరావత్తు, నగదు ; **2.** బాంక్ మొ. వాటిలో దాచుకొనే సొమ్ము.

**డిపోశెట్టు** రూ.చూ. డిపోజిట్. వి. **1.** ధరావతు, నగదు ; **2.** బాంక్ మొ. వాటిలో దాచుకొనే సొమ్ము.

**డిప్ప** రూ. దిప్ప, డిబ్బ. వి. **1.** అరటిచెట్టుపై పొర ; **2.** పంపరపనస మొ. కాయల పైతొక్క ; **3.** తలపై చిప్ప.

త. శిప్పి. చిప్ప.

**డిప్పకాయ** రూ.చూ. తిప్పకాయ. వి. **1.** తలపైకొట్టే దెబ్బ ; **2.** సొరకాయబుర్ర ; **3.** ఊరగాయ. విణ. అల్లరివాడు. **డిప్పకాయకొట్టు** స.క్రి. తలపైకొట్టు. **డిప్పతీయు** రూ. ఓప్పతీయు. స.క్రి. కుండల తయారీలో పైన మందం తక్కువగా కింద లావుగా ఉండేటట్లు తీర్చు.

**డిప్యూటి** రూ. డిప్యూటీ, డెప్యూటి, డెప్యూటీ. వి. తాత్కాలిక ప్రతినిధి.

ఇం. *Deputy.* ప్రతినిధిస్థానాపన్నుడు.

< ఇం. Deputy.

**డిప్యూటీ** రూ.చూ. డిప్యూటి. వి. తాత్కాలిక ప్రతినిధి.

**డిప్లమా** రూ.చూ. డిప్లొమా. వి. పట్టా, యోగ్యతాపత్రం.

**డిప్లమాట్** రూ.చూ. డిప్లొమాట్. వి. **1.** రాజ్యం తరపున పంపబడే రాయబారి ; **2.** రాజనీతిజ్ఞుడు.

**డిప్లొమా** రూ. డిప్లమా. వి. పట్టా, యోగ్యతాపత్రం.

ఇం. *Diploma.* పట్టా, యోగ్యతాపత్రం.

< ఇం. Diploma.

**డిప్లొమాట్** రూ. డిప్లమాట్. వి. **1.** రాజ్యంతరపున పంపబడే రాయబారి ; **2.** రాజనీతిజ్ఞుడు.

ఇం. *Diplomat.* రాజ్యం తరపున పంపబడే రాయబారి.

< ఇం. Diplomat.

**డిఫరెన్సు** వి. భేదం.

ఇం. *Difference.* భేదం, తేడా.

< ఇం. Difference.

**డిఫెక్టు** వి. లోపం, కొరత, దోషం, అవలక్షణం.

ఇం. *Defect.* లోపం, కొరత, న్యూనత, దోషం, అవలక్షణం, కళంకం.

< ఇం. Defect.

**డిఫెన్డాంటు** రూ. డిఫెండెంటు. వి. ప్రతివాది.

ఇం. *Defendant.* ప్రతివాది.

< ఇం. Defendant.

**డిఫెండెంటు** రూ.చూ. డిఫెన్డాంటు. వి. ప్రతివాది.

**డిఫెన్సు** వి. **1.** (ఆత్మ) రక్షణ ; **2.** కాపుదల.

ఇం. *Defence.* ఆత్మరక్షణ, రక్షణ.

< ఇం. Defence.

**డిబారు** రూ.చూ. డీబారు. వి. బహిష్కరణ.

**డిబారుచేయు** రూ. డీబారుచేయు. స.క్రి. బహిష్కరించు.

ఇం. *Debar.* బహిష్కరించు, హక్కును తొలగించు, ప్రవేశాన్ని నిరోధించు.

< ఇం. Debar + చేయు.

**డిబ్బ** రూ.చూ. డిబ్బి. వి. **1.** బరిణ ; **2.** దబ్బి. ముడుపు పాత్ర ; **3.** పాక ; **4.** దుకాణం ; **5.** పిల్లలు డబ్బు దాచి పెట్టుకోడానికి ఉపయోగపడే చిన్న మట్టి బుడ్డి.

**డిబ్బవేయు** అ.క్రి. పండులో బెల్లం పడేటట్లు ముక్కతీయు.

**డిబ్బి** రూ. డిబ్బ. వి. **1.** మూతకల చిన్న డబ్బా. కవిరా. సీ. 13 ; **2.** బరిణ ; **3.** దబ్బి, ముడుపు పాత్ర ; **4.** పాక.

ఒ. డిబ్బా, డిబ్బి. డబ్బా ; హిం. డిబ్బా. మూతకల చిన్న డబ్బా ; డిబియా. డబ్బి ; ఉ. డిబ్బి. బరిణ.

< ఉ. డిబ్బి.

**డిబ్బు** వి. కళావిహీనమైన చప్పుడు. ధ్వన్యను.

**డిబ్బుటిబ్బు** రూ.చూ. డిబ్బుడిబ్బు. వి. మొండేలు నేలపై పడేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం.

**డిబ్బుడిబ్బను** చూ. డిబ్బుడిబ్బు.

**డిబ్బుడిబ్బు** రూ. డిబ్బుటిబ్బు. వి. మొండేలు నేలపై పడేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం. కు.సం. 11.155.

**డిబ్బుడిబ్బను** అ.క్రి. మొండేలు నేలపై పడేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణంచేయు.

**డిబ్బెనము** చూ. డిబ్బి. రూ. డిబ్బెము. వి. డిబ్బి, దబ్బి, బరిణె.

**డిబ్బెము** రూ.చూ. డిబ్బెనము. వి. డిబ్బి, దబ్బి, బరిణె.

**డిమాండు** రూ. డిమేండు. వి. **1.** అధికారంతో అడగటం ; **2.** కోర్కె.

ఇం. *Demand.* అధికారంతో అడగటం, అవసరం, అడిగే వస్తువు.

< ఇం. Demand.

**డిమాన్‌స్ట్రేటరు** రూ. డెమాన్‌స్ట్రేటరు. వి. ప్రయోగ నిర్వహణలో సహాయకుడు.

ఇం. *Demonstrator.* ప్రయోగ నిర్వహణలో సహాయకుడు, బహిరంగ ప్రదర్శనలో పాల్గొనేవాడు.

< ఇం. Demonstrator.

**డిమికి** రూ.చూ. డిమ్కీ. వి. గుమ్మెట, కూజా మాదిరి ఉండే మట్టి పాత్ర.

**డిమికీకుండ** చూ. డిమ్కీ. రూ. ధిమికీకుండ. వి. గుమ్మెట, కూజా మాదిరి ఉండే ఒక రకం వాద్యం.

**డిమిడి** రూ. దీవిడి. వి. మట్టిపైన మూసేదానికివాడే మట్టిమూత.

**డిమేండు** రూ.చూ. డిమాండు. వి. **1.** కోర్కె ; **2.** అధికారంతో అడగటం.

**డిమ్కి** రూ.చూ. డిమ్కీ. వి. గుమ్మెట, కూజా మాదిరి ఉండే మట్టి పాత్ర.

**డిమ్కీ** రూ. డింకి[2], డిమికి, డిమ్కి, డ్రింకి, దిమ్మిక, దుమ్కి. వి. గుమ్మెట, కూజా మాదిరి ఉండే మట్టి పాత్ర.

మరా. టిమకీ. వాద్య విశేషం.

క. ఢమకి. ఒక రకమైన వాద్యం.

< మరా. టిమకీ.

**డింపల** చూ. డాపల. వి. ఎడమవైపు.

**డింపు** చూ. డిగ్గు. రూ. దింపు. స.క్రి. **1.** అడచు, పోగొట్టు. ద్వి.భాగ. 11 స్కం ; **2.** వేలాడటం, లంబనం.

**డిమ్మరి** రూ.చూ. త్రిమ్మరి. వి. దుష్టుడు, చెడుగు, చెనటి, భ్రాంతికలవాడు.

**డిమ్మరితనము** వి. దుష్టత్వం, చెడ్డతనం. భార. శాంతి. 6.208.

**డిమ్మి** రూ.చూ. డెమ్మి. వి. ఒక కాగితం సైజు.

**డిమ్ము** వి. కాంతి మందగించటం.

ఇం. *Dim.* కాంతి మందగించటం.

< ఇం. Dim.

**డిల్ల**[1] రూ.చూ. డిల్లము. వి. అధైర్యం, పిరికితనం. అష్టమ. క. 2.67 పు. 12 పం.

**డిల్లగుడుచు (-కుడుచు)** అ.క్రి. **1.** అధైర్యపడు. కాళిందీ. 2.120 ; **2.** వెరచు, బెదరు. **డిల్లచెడు** అ.క్రి. ధృతిచెడు, ధైర్యంపోవు. వేంక. పంచ. 3.346. **డిల్లదనము (-తనము)** వి. తెల్లబోవటం, వైవర్ణ్యం. కావ్యా. చూ. 2.59. **డిల్లపడు** అ.క్రి. **1.** అధైర్యంపడు, భయపడు. హరి. పూ. 6.9; **2.** వ్యాకులమగు, కలతనొందు. ఆం. భా. 3.100, నీలా. 3.30. **డిల్లపాటు** వి. **1.** అధైర్యం. భాస్క. రా. యు. 1048 ; **2.** వైవర్ణ్యం, తెల్లబోవటం. వేంక. పంచ. 4.351. **డిల్లపోవు** అ.క్రి. అధైర్యంపడు. ద్వి.శ.సా. 1.47 పు. 3 పం.

**డిల్ల**[2] వి. ఆటల్లో ముట్టుకోకూడదనటానికి పిల్లలు వాడే మాట.

**డిల్లపెట్టు** అ.క్రి. ఆటల్లో ముట్టుకోకూడదని చూపుడు వేలుమీద మధ్యవేలు పెట్టి చెప్పు.

**డిల్లము** రూ. ఢిల్ల[1], టిళ్ళ[1], డిల్ల[1], దిల్ల. విణ. **1.** నిస్సత్వం, బలంలేని. భార. ద్రోణ. 5.254 ; **2.** భయదుఃఖాదుల చేత వ్యాకులమైన, విహ్వలమైన. భాస్క. రా. యు. 84, ఉ.హరి. 5.124. వి. **1.** వ్యాకులత, విహ్వలత. భోజరా. 2.194 ; **2.** బలం లేమి, సత్త్వహీనత. పద్మ. 3.143.

ప్రా. ఢిల్ల. శిథిలం ; మరా. ఢిలా.

< ప్రా. ఢిల్ల.

**డిల్లాయి** వి. **1.** నాట్య విశేషం. పండి.చ. 5.378 ; **2.** అశ్వ శిక్షాభేదం. పి.శకు. 1.112.

ప్రా. ఢిల్ల. శిథిలం ; హిం. ఢీలా ; మరా. ఢిలా.

**ఢిల్లీకూజా** వి. తత్తెరకాయలాగా ఉండి, చేత్తో పట్టుకోడానికి వంకీ ఉన్న నీళ్ళ కూజా.

ప్రా. ఢిల్లీ. భారతదేశపు రాజధానీ నగరం.

< ప్రా. ఢిల్లీ + కూజా.

**ఢిల్లీదర్బారు** వి. ఒక రకం పెద్ద గడి చీర.

ప్రా. ఢిల్లీ. భారతదేశపు రాజధానీ నగరం.

< ప్రా. ఢిల్లీ + దర్బారు.

**ఢిల్లీభోగాలు** వి.బ.వ. ఒకజాతి సన్నవడ్లు.

ప్రా. ఢిల్లీ. భారతదేశపు రాజధానీ నగరం ; సం. ప్రా. భోగ-. (విషయాల్ని) అనుభవించటం, విషయసేవ.

< ప్రా. ఢిల్లీ + ప్రా. భోగ- + -ము + -లు.

**డిల్లు** రూ.చూ. డీలు[1]. అ.క్రి. అధైర్యపడు, డీలుపడు.

**డివల్‌డెస్కు** వి. రెండు అరలున్న మేజాబల్ల.

ఇం. *Duel desk.* రెండుఅరలున్న మేజాబల్ల.

< ఇం. Duel desk.

**డివిజన్** రూ.చూ. డివిజను. వి. **1.** విభజించడం ; **2.** భాగహారం ; **3.** ప్రాంతం.

**డివిజను** రూ. డివిజన్, డివిషను. వి. **1.** విభజించడం ; **2.** భాగహారం ; **3.** ప్రాంతం.

ఇం. *Division.* విభజించటం, విభజింపబడటం, పంపిణీ, పంపకం, అభిప్రాయ భేదం, భాగహారం వర్గీకరణం, సరిహద్దు.

< ఇం. Division.

**డివిడెండు** వి. వడ్డీ లేదా లాభం, లాభాల్లో వంతు.

ఇం. *Dividend.* విభాజ్యం, లాభాల్లో వంతు, దివాలాతీసిన వాని ఆస్తినుంచి బాకీదారుల్లో ఒక్కొక్కరికి వచ్చిన వంతు.

< ఇం. Dividend.

**డివిషను** రూ.చూ. డివిజను. వి. **1.** కొన్ని గ్రామాలు కలిసిన భాగం ; **2.** విభజించటం ; **3.** భాగహారం.

**డివైడగు** అ.క్రి. **1.** ముక్కగా ఏర్పడు ; **2.** భాగించబడు.

ఇం. *Divide.* భాగించు, విభజించు.

< ఇం. Divide + అగు.

**డివైడరు** వి. విభాగిని.

ఇం. *Dividers.* విభజించేది.

< ఇం. Dividers. (అనుచిత విభాగం).

**డివైడ్‌చేయు** స.క్రి. **1.** భాగించు ; **2.** సరిహద్దును ఏర్పరచు ; **3.** ముక్కచేయు.

ఇం. *Divide.* భాగించు, విభజించు.

<ఇం. Divide + చేయు.

**డివ్వడివ్వులులిభించు** స.క్రి. అనుకరించు. ధ్వన్యను.

**డిశంబరు** రూ.చూ. డిసెంబరు. వి. ఇంగ్లీషు నెలల్లో పన్నెండోది.

**డిష్టయిని** రూ.చూ. డెస్టిని. వి. విధి, అదృష్టం.

**డిష్ణరీ** రూ.చూ. డిక్షనరీ. వి. నిఘంటువు, కోశం, పదాలకు అర్థాల్ని తెలిపే గ్రంథం.

**డిసంబరు** రూ.చూ. డిసెంబరు. వి. ఇంగ్లీషు నెలల్లో పన్నెండోది.

**డిసీజు** వి. రోగం, జబ్బు, తెగులు.

ఇం. *Disease*. జబ్బు, రోగం, మానసిక లేదా నైతిక దుర్గుణత, తెగులు.

<ఇం. Disease.

**డిసెంటు** వి. అభిప్రాయ భేదం ప్రకటించటం.

ఇం. *Dissent*. అభిప్రాయ భేదం ప్రకటించటం.

<ఇం. Dissent.

**డిసెంబరు** రూ. డిశంబరు, డిసంబరు. వి. ఇంగ్లీషు నెలల్లో పన్నెండోది.

ఇం. *December*. ఇంగ్లీషు నెలల్లో పన్నెండోది.

<ఇం. December.

**డిసైన్** రూ.చూ. డిజైను. వి. 1. కల్పన, యోచన; 2. నమూనా.

**డిస్కషను** వి. సంభాషణ.

ఇం. *Discussion*. సంభాషణ, చర్చ.

<ఇం. Discussion.

**డిస్కస్** వి. బరువైన ఇనప చక్రం.

ఇం. *Discus*. బరువైన ఇనప చక్రం.

<ఇం. Discus.

**డిస్కస్‌చేయు** స.క్రి. తర్కించు, వాదించు, చర్చించు.

ఇం. *Discuss*. హేతువాదంచే పరిశీలించు, తర్కించు, వాదించు, చర్చించు.

<ఇం. Discuss + చేయు.

**డిస్కు** వి. బైరు బిగించే ఇనప చక్రం.

ఇం. *Disc*.

<ఇం. Disc.

**డిస్కౌంటు** వి. ఇవ్వ వలసిన దాంట్లో కొంత తగ్గించటం.

ఇం. *Discount*. ఇవ్వవలసిన దాంట్లో కొంత తగ్గించటం.

<ఇం. Discount.

**డిస్టంపరు** వి. రకరకాల రంగులను నూనెల్లో కలిపి ఇళ్ళకు వాడే విధానం.

ఇం. *Distemper*. జాడ్యం, జబ్బు, రకరకాల రంగుల్ని నూనెల్లో కలిపి ఇళ్ళకు వాడే విధానం.

<ఇం. Distemper.

**డిస్ట్రిక్టు** వి. జిల్లా.

ఇం. *District*. జిల్లా.

<ఇం. District.

**డిస్ట్రిబ్యూటరు** వి. పంపకం చేసేవాడు, పంపిణీదారు.

ఇం. *Distributor*. పంపకం చేసేవాడు, పంపిణీదారు.

<ఇం. Distributor.

**డిస్పెన్సరి** రూ. డిస్పెన్సరీ. వి. వైద్యశాల.

ఇం. *Dispensary*. మందుల్ని పంపిణీచేసేస్థలం.

<ఇం. Dispensary (అర్థవిపరి.).

**డిస్పెన్సరీ** రూ.చూ. డిస్పెన్సరి. వి. వైద్యశాల.

**డీ** రూ.చూ. డీ. అవ్య. 1. పందెగాళ్ళు పొట్టేళ్ళను పోట్లాడటానికి ప్రేరేపించే మాట; 2. బాల క్రీడా విశేషం; 3. యుద్ధప్రేరణం; 4. తలతో పొడవటం.

**డీకొను** రూ. చూ. దీకొను. స.క్రి. 1. పొట్టేళ్ళు పోరిలో ఒకదానితో ఒకటితాకు. భార. ఉద్యో. 2.13; 2. గొర్రెపోతుల ఆటలో డీడీ అంటూ బాలురు ఒకరికొకరు ఎదుర్కొను. పండి. చ. 2.153; 3. ఎదిరించు, మార్కొను. భాగ. 10 పూ. 1143; అ.క్రి. సంసిద్ధుడగు, పూనుకొను. విజయ. 1.1. క. ఐడకు. కొట్టు, మొట్టు, గుద్దు; కు. ఎడంకుని. కొట్టు. తన్ను; త. ఐటు. డీకొను, ఒకదాన్నొకటి తాకు; ఇటూపు. మార్కొను, ఎదుర్కొను; మ. ఇటియుక. డీకొను, నొక్కిపెట్టు, తగవు; ఇటిక్క. కొట్టు, డీకొను. **డీకొలుపు** రూ.చూ. డీకొలుపు. స.క్రి. 1. ఎదుర్కొనేటట్లుచేయు, కలియచేయు. సారంగ. 2.86; 2. పురికొల్పు. ప్రేరేపించు. బిల్హ. 3.78. **డీకొల్పు** రూ.చూ. డీకొలుపు. అ.క్రి. 1. పురికొల్పు. ప్రేరేపించు. హంస. 2.170; 2. ఎదుర్కొనేటట్లుచేయు, కలియచేయు. దశా. 4.184. **డీకోలు** చూ. డీకొను. రూ. చూ. దీకోలు. వి. డీకొనటం, కలియటం. **డీడిక్కిసలాడు** అ.క్రి. డీకొట్టు. **డీడిక్కులాడు** అ.క్రి. 1. ఒకటితో నొకటి కొట్టుకొను. రంగా. చ. 3.67; 2. పొట్టేళ్ళ పందెంలో వలె బాలురు 'డీడీడిక్కు' అంటూ ఒకరికొకరు తలలు కొట్టుకొను. <డీడిక్కు + -లు + ఆడు. **డీడిక్కులు** వి.బ.వ. పొట్టేళ్ళ ఆటలో బాలురు ఒకరికొకరు తలలు తాకించేటప్పుడు అనే మాట, పిల్లలు ఆటకై తలలు తాకించేటప్పటి మాట. **డీడీడిక్కు** వి. పిల్లలు ఆటకై తలలు తాకించేటప్పుడు అనే మాట.

**డీకు** చూ. డీ. రూ చూ. దీకు. వి. ప్రేరణ, పురికొల్పటం.

**డీజన్** రూ.చూ. డిజైను. వి. 1. చెక్కడపుపని; 2. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డీజను** రూ.చూ. డిజైను. వి. 1. చెక్కడపుపని; 2. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డీజిలు** రూ. డీజెలు, డీసిలు, డీసెలు. వి. 1. బొగ్గుతోకాక తైలవిశేషంతో నడిచే రైలు; 2. రైలు, కారు మొ. వాహనాల్ని నడిపే తైలం.

ఇం. *Diesel*. ఆకస్మికమైన గాలి ఒత్తిడికి పుట్టిన వేడి చేత ఇంధనాన్ని మండించే నూనెయంత్రం (Dr. R. Diesal అనే ఆయన కనిపెట్టినది).

<ఇం, Diesel.

**డీజెన్** రూ.చూ. డిజైను. వి. 1. చెక్కడపుపని; 2. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డీజెను** రూ.చూ. డిజైను. వి. 1. చెక్కడపుపని; 2. వస్త్రాదుల్లో వేసే చిత్రాదుల నమూనా.

**డీజెలు** రూ.చూ. డీజిలు. వి. **1.** బొగ్గుతో కాక తైలవిశేషంతో నడిచే రైలు ; **2.** రైలు, కారు మొ. వాహనాల్ని నడిపే తైలం.

**డీబారగు** చూ. డీబారు.

**డీబారు** రూ. డిబారు. వి. బహిష్కరణ, ప్రవేశ నిరోధం.

ఇం. *Debar*. బహిష్కరించు, హక్కును తొలగించు, ప్రవేశాన్ని నిరోధించు.

<ఇం. Debar.

డీబారగు అ.క్రి. బహిష్కరించబడు. <డీబారు + అగు. **డీబారుచేయు** రూ.చూ. డిబారుచేయు. స.క్రి. బహిష్కరించు, ప్రవేశాన్ని నిరోధించు.

**డీబ్బి** రూ. డెబ్బి. వి. చొప్పవామి (కుప్ప).

**డీలక్సు** విశే. మేలిరకమయిన. వి. మేలిరకమయిన బస్సు.

ఇం. *Deluxe*. మేలిరకం, బాగయుక్తమైన.

<ఇం. Deluxe.

**డీలగు** చూ. డీలు[1]

**డీలపోవు** చూ. డీలు[1].

**డీలరు** వి. వ్యాపారస్థుడు.

ఇం. *Dealer*. పేకముక్కలు పంచేవాళ్ళు, వ్యాపారస్థుడు.

<ఇం. Dealer.

**డీలాపడు** అ.క్రి. **1.** బలహీనమగు ; **2.** వ్యర్థమగు ; **3.** బాధపడు ; 4. మరణించు.

హిం. ఢీలా. శిథిలం.

<హిం. ఢీలా + పడు.

**డీలించు** చూ. డీలు[1].

**డీలు**[1] రూ. డిల్లు, తీలు, దీలు. విశే. దుర్బలమైన, సత్త్వహీనమైన, డిల్లం. ఆము. 4.105. అ.క్రి. డిల్లపడు, నిస్సారమగు.

సం. శిథిల-. జీర్ణమైన ; ప్రా. ఢిలా, ఢిల్ల. శిథిలం ; సఢిల, సిఢిల ; దే.ప్రా. ఢేల్ల ; పా. సఠిల, సిఢిల ; ఒ. ఢిలా ; హిం. ఢీలా ; గు. ఢీలు ; మరా. ఢిలా.

క. డేలి. ఆలస్యం, దుర్బలం ; డేళ్ళ, దిళ్ళ. ధైర్యహీనమైన, పతిశ్శేష్టిత ; డేళ్ళిసు. వ్యాకులత చెందు, వణుకు ; తు. డీలు. వదులైన ; ఢీల, డీలు. వదులైన.

హో.చూ.సే. ఢిలో. వదులైన, మందమైన.

<ప్రా. ఢిల్ల-.

డీలగు అ.క్రి. **1.** తగ్గు. ఆం.భా. 3.88 ; **2.** అడగు, వదులగు. <డీలు[1] + అగు. **డీలపోవు** అ.క్రి. **1.** బలహీనమగు ; **2.** వ్యర్థమగు ; **3.** బాధపడు ; **4.** మరణించు. **డీలించు** స.క్రి. నిస్సారంగా చేయు, తేలికపరచు, చులకన చేయు. నిర్వ.రా. 4.95. <డీలు + -ఇంచు[3]. **డీలుకొను** అ.క్రి. చెదరు, విక్షిప్తమగు. హర. 2.20. **డీలుపడు** రూ. డీలువడు, డీల్పడు, డీల్వడు, డీలుపడు. అ.క్రి. **1.** డిల్లపడు, బలహీనమగు, నిస్సత్త్వమగు. శృం.నై. 2.50 ; **2.** మొక్కపోవు, కుంఠితమగు, విరుగు. శుక. 2.62, కృ.శకు.పీఠి. 29; **3.** బాధపడు, పీడితమగు. ద్వి పరమ. ఐ. 1.22 ; **4.** మరణించు. **డీలుపఱచు** రూ. డీలుపఱుచు, డీలువఱచు, డీలువఱుచు, డీల్పఱచు, డీల్వఱచు, డీల్వఱుచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. ఘటికా. 2.185. **డీలుపఱుచు** రూ.చూ. డీలుపఱచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. **డీలుపాటు** రూ. డీల్పాటు. వి. డీలుపడటం. శృం.నై. 7. అ. **డీలువడు(-పడు)** రూ.చూ. డీలుపడు. అ.క్రి. **1.** డిల్లపడు, బలహీనమగు, నిస్సత్త్వమగు ; **2.** మొక్కపోవు, కుంఠితమగు, విరుగు ; **3.** బాధపడు, పీడితమగు ; **4.** మరణించు. **డీలువఱచు (-పఱచు)** రూ.చూ. డీలుపఱచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. **డీలువఱుచు** రూ.చూ. డీలుపఱుచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. **డీలుసేయు (-చేయు)** స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. ఆము. 1.12. **డీల్పడు** రూ.చూ. డీలుపడు. అ.క్రి. **1.** చచ్చు, మృతినొందు. ఆం.భా. 2.225 ; **2.** కృశించు, కలగు, భీతిలు. <డీలు[1] + పడు. **డీల్పఱచు** రూ.చూ. డీలుపఱచు. స.క్రి. డిల్లపడచేయు. <డీలు[1] + పఱచు. **డీల్పాటు** రూ.చూ. డీలుపాటు. వి. డిల్లపడటం. <డీలు[1] + పాటు. **డీల్వడు** రూ.చూ. డీలుపడు. అ.క్రి. **1.** చచ్చు, మృతినొందు ; **2.** కృశించు, కలగు, భీతిలు. <డీలు[1] + పడు. **డీల్వఱచు** రూ.చూ. డీలుపఱచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. రాఘవ. 4.32. <డీలు[1] + పఱచు. **డీల్వఱుచు** రూ.చూ. డీలుపఱచు. స.క్రి. తక్కువపరచు, కొరతపడచేయు. <డీలు[1] + పఱుచు.

**డీలు**[2] వి. ఒప్పందం.

ఇం. *Deal*. వాణిజ్యపు ఒప్పందం, బేరం.

<ఇం. Deal.

**డీల్పడు** చూ. డీలు[1].

**డీల్పఱచు** చూ. డీలు[1].

**డీల్పాటు** చూ. డీలు[1].

**డీల్వడు** చూ. డీలు[1].

**డీల్వఱచు** చూ. డీలు[1].

**డీల్వఱుచు** చూ. డీలు[1].

**డీసిలు** రూ.చూ. డీజిలు. **1.** బొగ్గుతో కాక తైలవిశేషంతో నడిచే రైలు ; **2.** రైలు, కారు మొ. వాహనాల్ని నడిపే తైలం.

**డీసిల్‌కారు** రూ.చూ. డీసెల్‌కారు. వి. డీసిల్‌తో నడిచే రైలు లేదా కారు.

**డీసెలు** రూ.చూ. డీజిలు. వి. **1.** బొగ్గుతో కాక తైల విశేషంతో నడిచే రైలు ; **2.** రైలు, కారు మొ. వాహనాల్ని నడిపే తైలం.

**డీసెల్‌కారు** రూ. డీసిల్‌కారు. వి. డీసెల్‌తో నడిచే రైలు లేదా కారు.

ఇం. *Diesel Car*. డీసెల్‌తో నడిచే రైలు లేదా కారు.

<ఇం. Diesel Car.

**-డు**[1] ప్రత్య. ప్రార్థనాద్యర్థక మధ్యమ పురుష ప్రత్యయం బాగ. 10 పూ. 493.

**-డు**[2] ప్రత్య. కృత్ప్రత్యయాల్లో ఒకటి. **1.** భావార్థంలో వచ్చేది. భార.ఆది. 6.112 ; **2.** కర్త్రర్థంలో వచ్చేది. భార. విరా. 1.291 ; **3.** అధికరణార్థంలో వచ్చేది. ఉ.హరి. 6.37 ; **4.** కర్మార్థంలో వచ్చేది. పాండు. 3.91 ; **5.** కరణార్థంలో వచ్చేది.

**-డు**³ ప్రత్య. ప్ర. అనంతర్యంలో ధాతువుకు వచ్చే ప్రత్యయం.

**డుక్క** వి. హుడుక్క, డుబుడక్క, ఉడుక.
సం. హుడుక్కా. వాద్యవిశేషం ; ప్రా. హుడుక్కా.
< ప్రా. డుక్కా.

**డుక్కు** అ.క్రి. 1. దాగు, అణగియుండు. కాశీ. 2.62 ; 2. పడలు, వాడు. ప్రబంధ. 5.39.
నే. ఘుక్కు. నక్కియుండు, దాగియుండు ; హిం. ఘూక్. నక్కు, అణగి.

**డుగ్గికుండ** చూ. టుక్క. వి. చపలాకుండ, తాబాచిప్ప ఆకారంలో చేసిన వాద్యం.

**డుంకి** వి. ఏటి ఏతే కొయ్యపనిముట్టు. ధ్వన్యను.

**డుంపు** అ.క్రి. 1. దోచు, లొంగు, వశమగు. అట్టమ. క. 1.59 పు. 26 పం.; 2. తగ్గు. ఆం.దా. 3.22.

**డుంగు** అ.క్రి. 1. వడకు. చలించు. భార.ఆది. 2.155 ; 2. భయపడు. భార.అది. 5.21.
కుణ. డుంగు. ముడుచుకొను, పడలిపోవు, డూప్పు.

**డుపుడక్క** రూ.చూ. డుబుడక్క. వి. హుడుక్క, ఉడుక అనే చర్మవాద్యం.

**డుబాయించు** స.క్రి. చెరచు, పాడుచేయు.
హిం. డుబానా. ముంచటం ; మరా. డుబణే. మునుగు, నాశమగు.
క. డుబాయిసు. మునుగు.
< హిం. డుబా (నా) + -ఇంచు³.

**డుబుడక్క** రూ. డబలక్కు, డమడక్కు, డుపుడక్క. వి. 1. వాద్యవిశేషం. ఆము. 4.35 ; 2. హుడుక్కా, బుడుబుడక్క. ధ్వన్యను.
సం. హుడుక్కా. వాద్యవిశేషం ; ప్రా. డుక్కా.
**డుబుడక్కవా(డు** వి. సాయిల, సాయిలవాడు (రాబోయే మేలుకీళ్ళను చెబుతూ బిచ్చమెత్తుకొనేవాడు). చంద్రాంగ. 4.6, హంస. 2.27.

**డుబ్రాజువడ్లు** రూ.చూ. డూబ్రాజ్‌వడ్లు. వి.బ.వ. ఒక తెగ ముతక వడ్లు.

**డుమ్మాకొట్టు** అ.క్రి. 1. తప్పుకొను ; 2. గైర్‌హాజరగు.
సం. భ్రమ. తిరుగు ; ప్రా. భమ.
< ప్రా. డుమ + కొట్టు.

**డుయ్యు** రూ. డూయు, డుయు, డుయ్యు, డూయు. స.క్రి. 1. సడలించు. జార్చు. బసవ. 5.692 పం.; 2. గుచ్చు, నాటు. రం.రా. ఉ. 52 పు. 8 పం.; 3. లాగు, పైకి తీయు. ఉ.హరి. 3.27. అ.క్రి. 1. (బాణాదులు) నాటిపెడలు. భాస్క.రా. యు. 669, ఉ. హరి. 3.27 ; 2. తెగు, ఛిన్నమగు. వీర. వి. 4.146.
క. తుయి. తోయు, ఈడ్చు, దాచు ; కుణ. డుంజ.
**డుస్సిపైచు** అ.క్రి. 1. నాటు, గుచ్చు. వేంక. పంచ. 1.600 ; 2. డూసిపైచు ; 3. విడచు ; 4. కొర్లిపోవు.

**డుఱ్ఱుచ్చి** వి. 1. యుద్ధానికి పిలవడానికి ఉపయోగించే మాట ; 2. ఆబోతుల్ని రెచ్చగొట్టటానికి ఉపయోగించే మాట ; 3. పిల్లలు గేలి చేసే మాట.

**డులడుల** వి. డుల్లటం, రాలటం, పడటం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. రం.రా.యు. 413 పు. 26 పం.

**డులిపించు** చూ. డులుచు.

**డులుచు** రూ. డుల్చు, దులుచు. స.క్రి. 1. రాల్చు, పడవేయు. కు.సం. 4.115, భార.విరా. 5.221 ; 2. ఊడదీయు, ఊడ్చు. ఆము. 2.3 ; 3. ఎడచేయు, పాపు. ఆము. 3.89 ; 4. పోజేయు, పోగొట్టు.
కుణ. డోప. కిందపడి ఉండు, పడుండు, అనుకొను ; కొలా. డోల్. కిందపడి ఉండు.
**డులిపించు** రూ.చూ. డుల్పించు. స.క్రి. డులుచునట్లు చేయు, పడగొట్టచేయు, రాల్పచేయు.

**డులుపు** రూ. డుల్పు. స.క్రి. 1. రాల్చు ; 2. దుమ్ము, తుడిపించు, దులుచు.

**డుల్చు** రూ.చూ. డులుచు. స.క్రి. 1. ఎడచేయు, పాపు. శృం.నై. 7.81 ; 2. పోవచేయు, పోగొట్టు. జైమిని భా. 1.45 ; 3. ఊడదీయు, ఊడ్చు. రామలిం. శ. 30 ; 4. రాల్చు, పడచేయు.

**డుల్పించు** చూ. డుల్పు.

**డుల్పు** రూ.చూ. డులుపు. స.క్రి. 1. రాల్చు ; 2. దుమ్ము తుడిపించు ; 3. డుల్చు, దులుచు, డులుచు, దులుపుట.
**డుల్పించు** రూ. డులిపించు. స.క్రి. డుల్లేటట్లుచేయు, పడగొట్టచేయు, రాల్పచేయు. చంపూరా. 2.76. < డుల్పు + -ఇంచు³.

**డుల్లు** రూ. డులు, దుల్లు. అ.క్రి. 1. ఎడఅగు, పాయు. భార. భీష్మ. 1.204 ; 2. రాలు, రాలిపోవు, పడు. భార.ద్రోణ. 1.132; 3. పోవు, నశించు. మను. 2.11, హంస. 5.215 ; 4. ఊడదీయు, ఊడ్చు.
పో.చూ. క. ఉళల్ ; త. ఉళల్ ; కుఇ. డుళి. దొర్లు, ఎగిరిపడు; డుళిఆవ. దొర్లు, ఎగిరిపడు.
**డుల్లుగడ్డి** వి. నూరిపిళ్ళప్పుడు కళ్ళం అంచుకు పడ్డగడ్డి.

**డుస్సిపైచు** చూ. డుయ్యు.

**డూం** రూ.చూ. డోము. వి. చెక్కకప్పుగల చిన్న కట్టడం.

**డూకీ** రూ. డూకి. వి. కొయ్యముక్క.

**డూడూ** వి. గంగిరెద్దువాళ్ళ గంగిరెద్దును ఆడిస్తూ అనే మాట.
**డూడూఅప్పన్న** వి. గంగిరెద్దువలె అన్నిటికి తల ఊపే వాడు. **డూడూబసవన్న** వి. గంగిరెద్దువలె అన్నిటికి తల ఊపేవాడు.

**డూప్లికేటు** వి. నకలు, సరూప వస్తువుల్లో ఒకటి.
ఇం. *Duplicate*. రెండు సమ భాగాలుగా ఉన్న రెట్టింపు, నకలు.
< ఇం. Duplicate.

**డూబ్రాజ్‌వడ్లు** రూ. డుబ్రాజువడ్లు. వి.బ.వ. ఒకరకం ముతక వడ్లు.

**డూము** రూ.చూ. డోము. వి. ఇంటిపైన గుమ్మటంలాగా నిర్మించిన కట్టడం.

**డూయు** రూ.చూ. డుయ్యు. స.క్రి. 1. సడలించు, జార్చు ; 2. గుచ్చు, నాటు ; 3. డుయ్యు. అ.క్రి. (బాణాదులు)

నాటిపెదలు.

ఢూలుసు(టాపీ) వి. ఒకరకం తాపీ.

డెకరేషను వి. అలంకరణ.

ఇం. *Decoration.* అలంకరణ.

< ఇం. Decoration.

డెకాగ్రాము వి. మెట్రిక్‌లో ఒక తూకం, పది గ్రాముల తూకం.

ఇం. *Decagram.* మెట్రిక్‌లో ఒకతూకం.

< ఇం. Decagram.

డెకామీటరు వి. మెట్రిక్ కొలతలో ఒకభాగం, 10 మీటర్లు.

ఇం. *Decametre.* మెట్రిక్ కొలతలో ఒకభాగం.

< ఇం. Decametre.

డెకాలీటరు వి. మెట్రిక్ తూకంలో ఒకకొలత, 10 లీటర్లు.

ఇం. *Decalitre.* మెట్రిక్ తూకంలో ఒకకొలత.

< ఇం. Decalitre.

డెక్క రూ. డిక్క, డెక్కె. వి. ఖురం, గిట్ట, కాలికొనన జంటగా మొలిచే గట్టిగోరు. పాండు. 5.243.

కువి. డెక్క. గిట్ట.

డెక్కజడుపు వి. గొడ్ల కాలిగిట్టలలో పుట్టే పుండు, గాలికుంటు. డెక్కపుచ్చు వి. గొడ్ల కాలిగిట్టలలో పుట్టేపుండు, గాలికుంటు. డెక్కొను[1] అ.క్రి. నెలకొను, ఉండు. కు.సం. 5.168.

డెక్కలి వి. ఒకతెగ మాదిగ.

డెక్కి రూ.చూ. టెక్కియము. వి. వస్త్రముకుటభేదం, చపుతు.

డెక్కు వి. అడ్డగింత, నిరోధం. స.క్రి. 1. అడ్డగించు, నివారించు ; 2. చెక్కు, గొరుగు ; 3. కంకులు కొయ్యడం.

డెక్కుకత్తి వి. మొద్దుకత్తి, మట్టుకత్తి. డెక్కుపడు అ.క్రి. గొంతుకు అడ్డుపడు. డెక్కొను[2] అ.క్రి. అడ్డంగాపడు, డెక్కుపడు. కు.సం. 5.162.

డెక్కె రూ.చూ. డెక్క. వి. గిట్ట.

డెక్కొను[1] చూ. డెక్క.

డెక్కొను[2] చూ. డెక్కు.

డెస్కు రూ.చూ. దస్కు. వి. 1. సొరుగులు కలిగి, కూర్చో డానికి పీఠంతో జతపరచిన బల్ల లేక పెట్టె ; 2. వాలుగా ఉండే రాతబల్ల.

డెంకణము రూ.చూ. టెంకణము[1]. వి. నమస్కారం.

డెంకి చూ. దంగు. వి. కాలితో వడ్లుదంచే మరరోకలి.

ఒ. ఢెంకి. వడ్లను దంచే సాధనవిశేషం.

< ఒ. ఢెంకి.

డెంగా విణ. పొడవయిన, నిడుపైన.

ఒ. డెంగా. పొడుగైన.

< ఒ. డెంగా.

డెజిగ్నేషన్ వి. పదవి లేదా హోదా పేరు.

ఇం. *Designation.* పదవికి నియోగించటం, పదవి లేదా హోదా పేరు.

< ఇం. Designation.

డెంటల్ విణ. దంతసంబంధమైన.

ఇం. *Dental.* దంతసంబంధమైన.

< ఇం. Dental.

డెంటిస్టు వి. దంతవైద్యుడు.

ఇం. *Dentist.* దంతాలను శుభ్రపరిచేవాడు, దంతచికిత్సకుడు.

< ఇం. Dentist.

డెంతిపుట్ట చూ. దొంతి. వి. ఒకవిధమైన పొదరుపుట్ట.

డెందపుఁదమ్మి చూ. డెందము.

డెందము రూ. డెందము. వి. రొమ్ము, వక్షఃస్థలం. భార. ఆది. 4.45 ; 2. హృదయం, మనస్సు. భార. ఆది. 4.103 ; 3. అభిప్రాయం. విక్ర. 1.122.

పో.చూ.సం. హృదయ-. గుండె, ఆత్మ, మనస్సు ; మహా. ప్రా. హిఅయ ; అప. హిఅఢ. హృదయం. మనస్సు, రొమ్ము.

డెందపుఁదమ్మి వి. హృదయపద్మం. నీలా. 1.9. డెందముకందఁజేయు స.క్రి. మనస్సు నొప్పించు. డెందముకరగు అ.క్రి. హృదయం ద్రవించు. డెందముచూలి రూ.చూ. డెందమ్ముచూలి. వి. మన్మథుడు. డెందముడిందుపఱుచుకొను స.క్రి. మనసు దిటవుచేసికొను. డెందముముల్లు వి. గుండెగాలం. డెందములోనికొల్లు వి. హృదయశల్యం. డెందమ్ముచూలి రూ. డెందముచూలి. వి. మన్మథుడు, చిత్తజుడు. ఆం.భా. 1.45. డెందానఁజేయిడినిద్రవోవు అ.క్రి. నిశ్చింతగా నిద్రపోవు. ఆము. 4.261.

డెందమ్ముచూలి చూ. డెందము.

డెందానఁజేయిడినిద్రవోవు చూ. డెందము.

డెప్తు వి. 1. లోతు ; 2. పాండిత్యం.

ఇం. *Depth.* లోతు, గాంభీర్యం.

< ఇం. Depth.

డెప్ప రూ.చూ. తెప్ప[3]. వి. కొండమీది సమమైనచోటు ; నెత్తం, దిబ్బ.

డెప్పరము రూ.చూ. దెప్పరము. వి. 1. ఆపద. కు.సం. 8.160 ; 2. వదలటం. ఉ.హరి. 5.133. విణ. 1. ఆపత్కరమైన, విపత్తు కలిగించేది. భార. విరా. 1.92 ; 2. ఆశ్చర్యకరమైన. భార. విరా. 5.336 ; 3. దుస్సహమైన. భాస్క.రా.యు. 1267 ; 4. అశక్యమైన, దుష్కరమైన, చేయటానికి సాధ్యంకానిది. భోజరా. 4.323 ; 5. అధికమైన. ఆము. 5.104. క్రి.విణ. అధికంగా. ఆము. 6.122.

డెప్పరించు అ.క్రి. అశక్యమగు, అలవికాకుండు. డెప్పరిలు రూ.చూ. డెప్పరిల్లు. అ.క్రి. బాధపడు. డెప్పరిల్లు రూ. డెప్పరిలు. అ.క్రి. బాధపడు. డెప్పటికము రూ. దెప్పటికము. వి. ఆపత్కరత్వం, ఆపత్తు. కు. సం. 4.65.

డెప్పరించు చూ. డెప్పరము.

డెప్పరిలు చూ. డెప్పరము.

డెప్పరిల్లు చూ. డెప్పరము.

డెప్పటికము చూ. డెప్పరము.

డెప్పి రూ.చూ. తెప్ప[3]. వి. ఎత్తుచోటు, దిబ్బ, డెప్ప.

డెప్పు రూ.చూ. దెప్పు. స.క్రి. 1. దూరు, నిందించు ; 2. చేసిన ఉపకారాన్ని పలుమార్లు చెప్పు, ఎత్తిపొడుచు.

డెప్పొడు రూ.చూ. దెప్పుడు. వి. ఎత్తిపొడుపు, అధిక్షేపం.
డెప్యూటి రూ.చూ. డిప్యూటీ. వి. తాత్కాలిక ప్రతినిధి.
డెప్యూటీ రూ.చూ. డిప్యూటి. వి. ప్రతినిధి.
డెబిట్టు వి. అక్కౌంటు పుస్తకంలో బాకీగా చూపిన పద్దు.
ఇం. *Debit.* అక్కౌంటు పుస్తకంలో బాకీగా చూపిన పద్దు, ఒకని పేరున ఖర్చురాయు.
<ఇం. Debit.
డెబ్బం(డ్రు చూ. డెబ్బది. సర్వ.బ.వ. డెబ్బదియొక్క మహన్మహత్యర్థక రూపం, డెబ్బైమంది మనుషులు.
డెబ్బది రూ. డబ్బై, డెబ్బై. సర్వ.బా. ఏడుపదులు. భార. ఆది. 1.53.
క. ఎళ్ పత్తు. డెబ్బై; కొడ. ఎళుపది. డెబ్బై; తు. ఎళుపది. డెబ్బై; ఎళ్ప). డెబ్బై; త. ఎఴు-పతు. డెబ్బై; ఏఴు. ఏడు; ఎఴుమై. ఏడు; ఎఴు-పతు. డెబ్బై; ఎఴు-నూఱు. ఏడువందలు; ఎఴుమై. ఏడుజన్మలు; మ. ఏఴు. ఏడు; ఎఴు-పతు. డెబ్బై; ఏఴు-న్నూఱు. ఏడువందలు; ఎఴువర్. ఏడుగురు; గోం. ఏడుంగ్. ఏడు; ఎడ్క్. ఒక్కొక్కరికి ఏడు; కుఇ. ఒదణి. ఏడు; ఒదిపత్తు. (గోసుకు ఏడు రెట్లు (= 1008); ఒడ్. ఏడు; ఒడ్గి. ఏడు వస్తువులు; కొలా. ఎడ్. ఏడు; ఎడ్ గుర్, ఎడ్ గుర్. ఏడుగురు.
డెబ్బదిపదకొండు రూ. డెబ్బైపదకొండు. విశే. అనేకం.
డెబ్బై రూ.చూ. డెబ్బది. వి. ఏడు పదులు, సప్తతి.
డెబ్బైపదకొండు రూ.చూ. డెబ్బది పదకొండు. విశే. అనేకం.
డెమాన్స్ట్రేటరు రూ.చూ. డిమాన్స్ట్రేటరు. వి. 1. ప్రయోగ నిర్వహణలో సహాయకుడు; 2. బహిరంగ ప్రదర్శనంలో పాల్గొనేవాడు.
డెమీ రూ.చూ. డెమ్మి. వి. ఒక కాగితం సైజు.
డెమ్మి రూ. డిమ్మి, డెమీ, డెమ్మీ. వి. ఒక కాగితం సైజు.
ఇం. *Demy.* ఒక కాగితం సైజు.
<ఇం. Demy.
డెమ్మీ రూ.చూ. డెమ్మి. వి. ఒక కాగితం సైజు.
డెయిలీ రూ.చూ. డైలి. వి. 1. రోజువారీ, దినదినం; 2. దినపత్రిక.
డెరిజా రూ.చూ. డేరా. వి. గుడారం.
డెరక్టరేట్ వి. 1. డైరెక్టరు పదవి; 2. పాలక వర్గం.
ఇం. *Directorate.* పాలక వర్గం, డైరక్టరు పదవి.
<ఇం. Directorate.
డెలిగేటు రూ. డేలిగేటు. వి. 1. నియుక్తుడు, సభకు పంపబడే ప్రతినిధి.
ఇం. *Delegate.* సభకు పంపబడే ప్రతినిధి.
<ఇం. Delegate.
డెలివరి రూ. డెలివరీ. వి. 1. ప్రసవం; 2. మాట్లాడే లేదా ఉపన్యసించే విధానం; 3. వస్తువుల అప్పగింత.
ఇం. *Delivery.* ప్రసవం, ఉపన్యసించే విధానం, అప్పగింత.
<ఇం. Delivery.
డెలివరీ రూ.చూ. డెలివరి. వి. 1. ప్రసవం; 2. ఉపన్యసించే విధానం; 3. వస్తువుల అప్పగింత.
డెల్టా వి. 1. నదుల పాయలమధ్య ఒండ్రువేసిన నేల; 2. ఏటి ఆనకట్ట కింద సాగుబడి అయ్యే మాగాణి భూమి.
ఇం. *Delta.* నదీ ముఖద్వారంలోని త్రికోణాకృతిగా ఉన్న భూభాగం.
<ఇం. Delta.
డెవలప్మెంటు వి. అభివృద్ధి.
ఇం. *Development.* పెరుగుదల, (చెట్లు మొ. వాటి) వృద్ధి, అభివృద్ధి.
<ఇం. Development.
డెసిగ్రాము వి. మెట్రిక్ తూకంలో ఒక కొలత, గ్రాములో పదోవంతు.
ఇం. *Decigram.* మెట్రిక్ తూకంలో ఒక కొలత.
<ఇం. Decigram.
డెసిమీటరు వి. మెట్రిక్ కొలతలో ఒక భాగం, మీటరులో పదో వంతు.
ఇం. *Decimetre.* మెట్రిక్ కొలతలో ఒక భాగం.
<ఇం. Decimetre.
డెసిలీటరు వి. మెట్రిక్ తూకంలో ఒక కొలత, లీటరులో పదో వంతు.
ఇం. *Decilitre.* మెట్రిక్ తూకంలో ఒక కొలత.
<ఇం. Decilitre.
డెసిషను వి. నిర్ణయం.
ఇం. *Decision.* (ప్రశ్న మొ. వాటి) పరిష్కారం, తుదినిర్ణయం, మనోనిశ్చయం, దృఢనిశ్చయం.
<ఇం. Decision.
డెస్కు రూ.చూ. డస్కు. వి. 1. సొరుగులు కలిగి, కూర్చొ డానికి పీఠంతో ఏతపరచిన బల్ల లేక పెట్టె; 2. వాలుగా ఉండే రాతబల్ల.
డెస్టిని రూ. డిష్టయిని, డెస్టినీ. వి. విధి, అదృష్టం.
ఇం. *Destiny.* పూర్వ నిర్దిష్టం, పర్యవసానం, విధి, గతి, అదృష్టం.
<ఇం. Destiny.
డెస్టినీ రూ.చూ. డెస్టిని. వి. విధి, అదృష్టం.
డెస్సరు వి. వైద్యుడు.
ఇం. *Dresser.* శస్త్రవైద్యుడికి సహాయకుడుగా ఉండి గాయానికి పట్టీ వేసేవాడు.
<ఇం. Dresser.
డే వి. రోజు.
ఇం. *Day.* పగలు, ఒక రోజు.
<ఇం. Day.
డేకసా రూ.చూ. డేకిసా. వి. 1. డేకిసకుండ, మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర; 2. ఇత్తడి, రాగి మొ. లోహాలతో చేసిన పెద్ద పాత్ర; 3. బకెట్టు.
డేకిచ రూ.చూ. డేకిసా. వి. 1. ఇత్తడి, రాగి మొ. వాటితో

చేసిన పెద్ద పాత్ర; **2.** బక్కెట్టు; **3.** దేకిసకుండ.

**డేకిచా** రూ.చూ. డేకిసా. వి. **1.** ఇత్తడి, రాగి మొ. వాటితో చేసిన పెద్ద పాత్ర; **2.** బకెట్టు; **3.** దేకిసకుండ.

**డేకిస** రూ.చూ. డేకిసా. వి. **1.** ఇత్తడి, రాగి మొ. వాటితో చేసిన పెద్ద పాత్ర; **2.** దేకిసకుండ, మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర; **3.** బకెట్టు.

**డేకిసపార** రూ. డేకీసపార, డేక్సాపార, దేకిసపార, దేకీసపార. వి. గడ్డి మొ. వాటిని చెక్కడానికి వాడే ఒక రకం పార, బొరిగె.

**డేకిసా** రూ. డేకసా, డేకిచ, దేకిచా, డేకిస, డేకీస, డేక్సా, డేక్సీ, డేగిశా, డేగిస, డేగిసా, దేవిస, డేశా, దేకిచా, దేకిస, దేగీచ. వి. **1.** ఇత్తడి, రాగి మొ. వాటితో చేసిన పెద్ద పాత్ర; **2.** బకెట్టు, కాగు, డేగిశా; **3.** బకెట్టు

హిం. *డేగ్, డేగ్‌చి, దేగ్, దేగ్‌చా, దేగ్‌చి.* వంట పాత్ర; మరా. *డేగ.* ఒక పెద్ద వంట పాత్ర; ఉ. *దేగ్‌చా.* చిన్న వంట పాత్ర, దేగ్ కంటె చిన్నది; పార. *దేగ్‌చా.* వంట పాత్ర.

<ఉ. దేగ్‌చా.

**డేకీచకుండ** రూ.చూ. డేగిసకుండ. వి. మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర.

**డేకీస** రూ.చూ. డేకిసా. వి. **1.** ఇత్తడి. రాగి మొ. వాటితో చేసిన పెద్ద పాత్ర; **2.** దేకిసకుండ, మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర; **3.** బకెట్టు.

**డేకీసపార** రూ.చూ. డేకిసపార. వి. గడ్డి మొ. చెక్కడానికి వాడే ఒక రకం పార, బొరిగె.

**డేక్సా** రూ.చూ. డేకిసా. వి. **1.** ఇత్తడి, రాగి మొ. వాటితో చేసిన పెద్ద పాత్ర; **2.** దేకిసకుండ, మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర; **3.** బకెట్టు.

**డేక్సాఅంచు** వి. డేక్సాలకు పెట్టే అంచు. **డేక్సాపార** రూ.చూ. డేకిసపార. వి. గడ్డి మొ. వాటిని చెక్కడానికి వాడే ఒకరకం పార, బొరిగె.

**డేక్సీ** రూ.చూ. డేకిసా. వి. **1.** ఇత్తడి, రాగి మొ. వాటితో చేసిన పెద్దపాత్ర; **2.** దేకిసకుండ, మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర; **3.** బకెట్టు.

**డేగ** వి. **1.** శ్యేనం, సాధారణ పక్షుల్ని, కుందేలు మొ. అల్ప మృగాల్ని వేటాడే పక్షి. ఆము. 2.46; **2.** శ్యేనభేదం. ఆం. భా. 2.90; **3.** ఎరుపు, తెలుపు ఈకలు కలిగిన పందెపు కోడిపుంజు.

క. *గిడగ, గిడిగి, గిడుగ, డేగ, డేగె,* డేగ; కొడ. *కిడుపె.* గద్ద, డేగ; తు. *గిడి*; గోం. *డెగొ.* గద్ద; కువి. *డేగ.* గద్ద; పర్జి. *డెయ.* డేగ.

**డేగకళ్ళు** వి.బ.వ. నిశితదృష్టి కలిగిన కళ్ళు. **డేగపదను** విణ. మితమయిన (డేగమితాహారం తింటుంది). సారంగ. 1.78. **డేగాట** వి. **1.** పెళ్ళిలో అయిదోనాడు వధూవరుల్ని ఎత్తుకొని డేగలవలె ఆడేఆట, దండాడింపు, పెండ్లిలో ఐదవనాడు చేసే ఉత్సవం; **2.** పెంపుడు డేగ సాయంతో అడవి పక్షుల్ని వేటాడటం. <డేగ+ఆట.

**డేగాట** చూ. డేగ.

**డేగిశా** రూ.చూ. డేకిసా. వి. **1.** డేకిచా, డేకిసా, నీళ్ళకాగు, రాగిబిందె; **2.** ధాన్యం నిలవ చేసుకొనే బాన; **3.** బకెట్టు.

**డేగిస** రూ.చూ. డేకిసా. వి. **1.** పెద్దకాగు, ఇత్తడి, రాగి మొ. లోహాలతో చేసినపాత్ర; **2.** ధాన్యం నిలువ చేసుకొనే బాన.

**డేగిసకుండ** రూ. డేకీచకుండ, ద్దశాకుండ, దేకిచకుండ, దేశాకుండ. వి. మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర.

**డేగిసా** రూ.చూ. డేకిసా. వి. 1. నీళ్ళు కాచే కాగు, ఇత్తడి మొ. లోహాలతో చేసిన పెద్దపాత్ర; **2.** ధాన్యం నిలవచేసుకొనే బాన.

**డేంగి** వి. దేవుని పూజలలో వాయించబడే నవసంధి తాళాల్లో ఒకటి.

**డేఁకి** రూ.చూ. టేఁకి. వి. ఒకజాతి చేప.

**డేఁకు** రూ. డేఁగు, దేఁకు. అ.క్రి. పిర్రలతో జరుగు, పాకు.

మ. *ఇఴయుక.* పాకు. (చిన్నపిల్లలవలె) దోగాడు.

**డేఁకురు** వి. పాకటం, డేకటం.

**డేఁగు** రూ.చూ. డేఁకు. అ.క్రి. దేకు, పిర్రలతో జరుగు.

**డేఁగురు** వి. జేగంట, జయఘంటిక.

**డేచెక్క** వి. చీర అంచులకు రంగు అద్దేటప్పుడు, అంచు మడతల్ని అదిమి పట్టటానికి వాడే కొయ్యపనిముట్టు.

**డేంజరు** వి. ఆపద, ప్రమాదం.

ఇం. *Danger.* ఆపద.

<ఇం. Danger.

**డేటు** వి. **1.** తేది, తిథి; **2.** నిర్ణీత దినం.

ఇం. *Date.* తేది. తారీఖు.

<ఇం. Date.

**డేనింగు** రూ.చూ. డైనింగు. వి. భోజనం.

**డేన్సుకుండ** వి. నాట్యం నేర్చుకొనే పిల్లలు ఎగిరి తొక్కడానికి వీలుగా మట్టిపాకంలో కోడిగుడ్డు సొనమర్దించి చేసిన గట్టి కుండ.

ఇం. *Dance.* నాట్యం.

<ఇం. Dance+కుండ.

**డేర** రూ.చూ. డేరా. వి. గుడారం. వేంక. అం. మాన. 72.

**డేరా** రూ. డెరిజా, డేర, డేరిజా, ఢేరా, డేరిజ, డేరిజము, డేరిజా, డేరీజ, డేరీజు. వి. గుడారం. డేరా. రసిక. 3.141.

ఉ. *డేరా, ఢేరా.* గుడారం; గు. *డేరో*; మరా. *డేరా.*

గుడారం.

క. డేరా, పట.

<మరా. డేరా.

డేరాఎత్తివేయు అ.క్రి. ఆ ఊరినుంచి వలసపోవు. డేరావేయు స.క్రి. దండుపెడలు, గుడారం వేయు, ఆక్రమించు.

డేరిజా రూ.చూ. డేరా. వి. గుడారం. రంగా. చ. 3.52.

డేలిగేటు రూ.చూ. డెలిగేటు. వి. సభకు పంపబడే ప్రతినిధి.

డేవిస రూ.చూ. డేకిసా. వి. డేకిసకుండ, మూతివెడల్పుగా, అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి లంజా ఆకారంలో నిలువుగా ఉండే మట్టి పాత్ర. రాగి ఇత్తడి మొ. లోహాలతో చేసిన పెద్దపాత్ర.

డేశా రూ.చూ. డేకిసా. వి. రాగి ఇత్తడి మొదలైన లోహాలతో చేసిన పెద్దపాత్ర. డేకిసకుండ.

డేశాకుండ రూ.చూ. డేగిసకుండ. వి. డేకిసకుండ. మూతి వెడల్పుగా అంచువాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి లంజా ఆకారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర. డేశాపిడత వి. రెండంచులుండే మట్టిపాత్ర.

డ్రేన్స్ రూ.చూ. డ్రేన్సు. వి. నాట్యం.

డ్రేన్సు రూ. డ్రేన్స్. వి. నాట్యం.

ఇం. *Dance*. నృత్యం. నృత్యం చేయు.

<ఇం. Dance.

డైజెస్టు వి. జీర్ణం.

ఇం. *Digest*. జీర్ణించుకొను, సంక్షిప్తీకరించు.

<ఇం. Digest.

డైటు వి. ఆహార విధానం, నియమితాహారం.

ఇం. *Diet*. ఆరోగ్యానికి గాని, శిక్షగాకాని ప్రత్యేకాహారం ఇవిపించు, ఆహారవిధానం.

<ఇం. Diet.

డైనమెటు రూ.చూ. డైనమైటు. వి. రాళ్ళను పగలగొట్టటానికి వాడే ప్రేలుడు పదార్థం.

డైనమైటు రూ.చూ. డైనమెటు. వి. రాళ్ళను పగలగొట్టటానికి వాడే ప్రేలుడు పదార్థం.

ఇం. *Dynamite*. తీవ్రమైన పేలుడు పదార్థం.

<ఇం. Dynamite.

డైనమో వి. యంత్రశక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చేయంత్రం.

ఇం. *Dynamo*. యంత్రశక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చే యంత్రం.

<ఇం. Dynamo.

డైనింగు రూ. డేనింగు. వి. భోజనం.

ఇం. *Dining*. భోజనం.

<ఇం. Dining.

డైనింగుహాలు వి. భోజనాలశాల.

ఇం. *Dining hall*. భోజనాలు చేసేహాలు.

<ఇం. Dining hall.

డైమండ్ రూ.చూ. డైమండు. వి. 1. వజ్రం, ప్రకాశించే దూళిరేణువు ; 2. పేకలో డైమన్ చుక్కలుగల ముక్క ; 3. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను.

డైమండు రూ. డైమండ్, డైమన్, డైమను, డైమాండు, డైమాన్, డైమాను. వి. 1. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను ; 2. వజ్రం ; 3. పేకలో ఒక ముక్క.

ఇం. *Diamond*. వజ్రం, రవ్వ.

<ఇం. Diamond.

డైమన్ రూ.చూ. డైమండు. వి. 1. వజ్రం ; 2. పేకల్లో ఒక ముక్క ; 3. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను.

డైమన్‌ముక్క(-చుక్క) రూ.చూ. డైమను చుక్క. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

డైమను రూ.చూ డైమండు. వి. 1. వజ్రం ; 2. పేకల్లో ఒక ముక్క ; 3. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను.

డైమనుచుక్క రూ. డైమన్‌ముక్క. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. డైమనుబోర్డరు వి. డైమనుచుక్క మాదిరి డిజైను నేసిన అంచు.

డైమాండు రూ.చూ. డైమండు. వి. 1. వజ్రం; 2. పేకలో ఒక ముక్క ; 3. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను.

డైమాండుపట్టు వి. కృత్రిమపుపట్టు. ఇం. *Diamond*. వజ్రం. <ఇం. Diamond+పట్టు.

డైమాన్ రూ.చూ. డైమండు. వి. 1. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను ; 2. వజ్రం ; 3. పేకలో ఒక ముక్క.

డైమాన్‌ప్లేటు రూ.చూ. డైమానుపేటు. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. డైమాన్‌సిల్కు వి. కృత్రిమపుపట్టు, మాయపట్టు.

డైమాను రూ.చూ. డైమండు. వి. 1. చీట్ల పేకలోని ఒకానొక ఎర్రని రంగు ; 2. వజ్రం ; 3. దుప్పట్లకు అంచుల్లో అద్దేరంగు డిజైను.

డైమానుకాడు వి. కుచ్చుకుపైన, డైమనుచుక్క ఆకారంలో కట్టినదారం. డైమానుపేటు రూ. డైమాన్‌ప్లేటు. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

డైరీ[1] వి. దినచర్య రాసే పుస్తకం.

ఇం. *Diary*. దినచర్య రాసే పుస్తకం.

<ఇం. Diary.

డైరీ[2] వి. పాలకేంద్రం.

ఇం. *Dairy*. పాలకేంద్రం, వెన్న తయారు చేసే ప్రదేశం, పాలను నిలవచేసే సంస్థ.

<ఇం. Dairy.

డైరీఫారం వి. పాలకేంద్రం.

ఇం. *Dairy farm*. పాలకేంద్రం.

<ఇం. Dai y farm.

డైరెక్టర్ వి. 1. చలనచిత్ర దర్శకుడు ; 2. పరిపాలన మండలిలో దర్శకుడు ; 3. సంపాదకుడు.

ఇం. *Director*. చలనచిత్ర దర్శకుడు, పరిపాలన మండలి పర్యవేక్షకుడు.

<ఇం. Director.

డైరెక్టు విశ. తిన్నని.

ఇం. *Direct*[1]. తిన్నని.

<ఇం. Direct[1].

డైరెక్టుచేయు స.క్రి. నిర్దేశించు.

ఇం. *Direct*.[2] చూపు, నిర్దేశించు.

<ఇం. Direct² + చేయు.

డైరెక్షను వి. నిర్దేశనం.

ఇం. *Direction.* ఉపదేశించటం, గురిచూడటం, నిర్వహించటం.

<ఇం. Direction.

డైల్ వి. ఐర్లండు శాసన సభ.

ఇం. *Dail.* ఐర్లండు శాసనసభ.

<ఇం. Dail.

డైలాగు వి. సంభాషణ.

ఇం. *Dialogue.* సంభాషణ.

<ఇం. Dialogue.

డైలి రూ. డయిలీ, డెయిలీ, డైలీ. వి. దినపత్రిక. క్రి.విణ. రోజువారీ, ప్రతిదినం.

ఇం. *Daily.* దినపత్రిక, రోజువారీ, ప్రతిదినం.

<ఇం. Daily.

డైలీ రూ.చూ. డైలి. వి. దినపత్రిక ; క్రి.విణ. రోజువారీ, ప్రతిదినం.

డైలు రూ.చూ. డయలు. వి. గడియారంలోను, టెలిఫోను లోను, అంకెలుండే గుండ్రని భాగం.

డొకాయించు స.క్రి. బుకాయించు.

హిం. ధోక్‌నా, ధోఖ్‌నా. దోషాన్ని ఆరోపించు.

డొకారము వి. 1. కడుపు ; 2. లోను, అంతరాళం.

క. డొక్కర, ఢొక్కర. బోలు.

డొకారము(జొచ్చు(-చొచ్చు) రూ. డొకారము సొచ్చు. అ.క్రి. 1. శరణుచొచ్చు. చంద్రాంగ. 1.13 ; 2. లోన చొచ్చు, లోపల ప్రవేశించు. పార్వ. 5.207. డొకారము సొచ్చు(-చొచ్చు) రూ.చూ. డొకారము(జొచ్చు. అ.క్రి. 1. శరణుచొచ్చు. చంద్రాంగ. 4.270 ; 2. లోనచొచ్చు, లోపల ప్రవేశించు.

డొక్క రూ. డక్క². వి. 1. ఒడలి ఎముకలగూడు, కంకాళం. భార.గాంధి. 3.284 ; 2. శరీరం, బొంది. భాగ. 6.136, వేమన. 1.167, నృసిం. 4.70 ; 3. ఉదరం, ఉదర పార్శ్వం. ఆము. 4.170, సీలా. 2.99 ; 4. కళేబరం, శవం. ఆం.భా. 2.134 ; 5. కొబ్బరికాయపై పేడు ; 6. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు ; విణ. వృద్ధుడు, ముసలివాడు. ఆం.భా. 2.118.

క. డొక్కె. శరీరం ; కుఇ. డకి. రొమ్ము, రొమ్ము ఎముక ; డాకి. గుల్ల ; కువి. డొక్కు. అస్థిపంజరం, ఎముకలగూడు ; పర్జి. డొకి. తాబేలు బొరుసు.

డొక్కకమాను రూ. డొక్కుకమాను. వి. పక్కార్చి, పక్కభాగాలు వంపులొంపులుగా ఉండే ఆర్చి. డొక్కచీల్చి డోలుకట్టు స.క్రి. 1. దురుసుమాటలు మొ. వాటితో బెదిరించు ; 2. శిక్షించు. డొక్కతాడు వి. కొబ్బరినార తాడు. డొక్కబుట్ట వి. తేగపారి పీడిన తాటివిత్తు. డొక్కలు తేలు అ.క్రి. చిక్కిపోవు. డొక్కలోపెట్టుకొను స.క్రి. 1. కడుపులో పెట్టుకొను ; 2. రక్షించు. డొక్కలోమెదలు అ.క్రి. దురుసు మాటల్ని జ్ఞప్తిలో పెట్టుకొను. డొక్కశుద్ధి వి. చదువుకొని వుండటం, మంచి పాండిత్యం కలిగి వుండటం. సం. శుద్ధి-. పరిశుద్ధత. <డొక్క + సం. శుద్ధి-.

డొక్కర రూ.చూ. డొక్కరము. వి. కుస్తీపట్టు.

డొక్కరము రూ. డొక్కర, డొక్కెర, డొక్కెరము. వి. మల్ల బంధ విశేషం, ముప్పయిరెండు విన్నాణాల్లో ఒకటి. ఉ. హరి. 3.68.

సం. దుష్కర-. కఠినసాధ్యమైన ; ప్రా. దుక్కర-, డొక్కర- ; హిం. ఠోకర్. కొట్టడం ; మరా. ఠోక(ణేం). కొట్టు ;

క. డొక్కర, డొక్కళ, ఢొక్కర. ప్రహారం.

<ప్రా. దొక్కర-.

డొక్కస వి. 1. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి ; 2. కుస్తీ పట్టు.

డొక్కసం రూ.చూ. దొగసం. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

డొక్కి రూ.చూ. డొక్కు². వి. కొయ్య (చిప్ప) గరిటె. అబక.

డొక్కు¹ రూ. టొక్కు. విణ. ముదిసిన. ఆం.భా. 2.119. అ.క్రి. ముదియు.

నే. ఢొక్ను. ముందుకువంగు ; హిం. ఢోక్నా, ఢోక్నా. కిందకువంగు.

డొక్కు² రూ. డొక్క, డొంక¹. వి. 1. శరీరం ; 2. బాల్కనీ, ఇంటిముందు స్తంభాలమీద వేసిన కప్పు ; 3. డబ్బా, రేకు మొ. వాటితో తయారుచేసిన పాత్ర.

క. డొక్కె, శరీరం.

డొక్కుకమాను రూ.చూ. డొక్కకమాను. వి. పక్కార్చి, పక్కభాగాలు వంపులొంపులుగా ఉండే ఆర్చి. డొక్కురాయి వి. గుండ్రంగా ఉండేరాయి.

డొక్కుపడు చూ. డొక్కు¹. అ.క్రి. వెనుదీయు, గొంకు.

డొక్కెర రూ.చూ. డొక్కరము. వి. డొక్కరం, కుస్తీపట్టు.

డొక్కెరము రూ.చూ. డొక్కరము. వి. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

డొగరు వి. 1. అపరాధం ; 2. నింద, తిట్టు.

డొగసం రూ.చూ. దొగసం. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

డొగ్గసం రూ.చూ. దొగసం. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుకు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

డొగ్గు చూ. దోఁగు². స.క్రి. దొర్లించు.

డొంక వి. 1. పొద. మను. 4.42, రామలిం.శ. 77 ; 2. నడవడంచేత పల్లంగా ఏర్పడిన మార్గం. ఆము. 6.111 ; 3. కోన ; 4. పొలాలమధ్య ఏర్పడిన వెడల్పు దారి ; 5. వంకరదారి.

క. డొంక, డొంకు. వంకర ; త. ఇడుంకర్. ఇరుకు తోవ.

డొంకజెముడు వి. సింహుండ, వృక్షవిశేషం. డొంకతిరు

